# జీవన సమరం

రచన:

బోరిస్ పోలెవాయ్

అనువాదం:

వి. ఆర్. శాస్త్రి, బి. ఎస్‌సి.

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# A STORY ABOUT A REAL MAN

BORIS POLEVOI

*Translated by:*

V. R. SHASTRY, B. Sc.

VISALAANDHRA PUBLISHING HOUSE

VIJAYAWADA

# మొదటి భాగం

## 1

నక్షత్రాలింకా శీతల కాంతితో మెరుస్తున్నాయి. ఇంతలోనే తూర్పు తెల్లవారజొచ్చింది. చీకటి మరుగునుండి ఒక్కటొకటిగా చెట్లు బయటపడ్డాయి. ఉన్నట్లుండి లేచిన చలిగాలి చెట్ల కొమ్మలలో దూసుకు పోయింది. ఒక్కసారిగా, అడవంతా మేలుకొన్నట్టు, రకరకాల శబ్దాలు వినిపించాయి. నూరేండ్లు పైబడ్డ పైన్ చెట్లు ఒకదానితో నింకొకటి గాలి గుస గుసలు మాట్లాడు కొన్నాయి. వాటి కొమ్మలనుండి పిండి రాలినట్లు, తెల్లటి మంచు కురిసి నేలనంతా కప్పివేసింద.

పచ్చినగాలి వచ్చినట్టే అకస్మాత్తుగా నిలిచిపోయింది. ఒక్క ఆకయినా ఆడక చెట్లు నిలబడిపోయాయి. అరుణోదయాన్నాహ్వానిస్తున్నట్టు. ఆకలిగొన్న తోడేళ్ల అరుపులూ దాక్కోడానికి గుంతలకు దారిపట్టే నక్కల కూతలూ వినిపించాయి. అప్పుడే నిద్రమేల్కొన్న వడ్రంగి పిట్ట మృదుమధురమైన మృదంగ దరువుల వంటి శబ్దంతో చెట్ల బోదెలను తన పొడూగు ముక్కుతో కొట్టుతోంది.

తిరిగీ ఎవరో పిలిచినట్టు పచ్చినగాలి పైన్ వృక్షశిఖరాల నుట్టూత లూగించి హోరున వీచింది. ప్రొద్దు పొడిచింది, నక్షత్రాలు వెలవెలబోయి ఎక్కడికో వెళ్లిపోయాయి. ఆ లేబ్రాయపు ఎండలో ఆ అరణ్యం, ఆకుపచ్చని మహాసముద్రం మాదిరి కనుపించింది. బాల సూర్యుని పసిడికిరణాలు తాకిన పైన్ వృక్షాగ్రాలూ, ఫర్ చెట్టు శిఖరాలూ అన్నీ అన్ని అలలులేచి పడుతున్నట్లు చలించాయి.

బాగా తెల్లవారింది. రాత్రి మెక్కిన ఆహారాన్ని పడుకొని జీర్ణించుకోడానికి తోడేళ్ళు, గుబురుగానుండే అడవి లోబాగాలకు జారిపట్టాయి. జిత్తులమారి నక్కలు తికమకలుగా నడిచి, మంచుమీద ననేక తప్పుడు దార్లను సృష్టించి, రహస్యంగా తమ ఇళ్ళను చేరుకొన్నాయి. పక్షులకలకలారావమూ, వడ్రంగిపిట్ట సమ్మెటదెబ్బలూ, చిందరవందరగా ఎగిరే పసుపు టాంటిప్‌ల కిచకిచలూ, జే పక్షుల బొంగురుకంఠ గానాలూ, అంతరిక్షాన విహరించే ఎవరో విగత జీవుల ఆందోళనపుటాక్రందం మాదిరి తెరలు తెరలుగా వినిపించే అరణ్యశబ్దాన్ని ఛేదించుకొని వినవచ్చాయి.

ఆల్డర్ చెట్టుకొమ్మపై తన ముక్కుకు పదును పెట్టే రాబిక్షిపక్షి ఉన్నట్టుండి తలనెత్తి ఆలకించి, కొమ్మ కంటబెట్టుకుపోయింది. జొంపంగా పెరిగిన ఘూమట్టపు పొదలు కదలి, విరిగే శబ్దం వినబడింది. బలిష్ఠుడు, స్థూలకాయు డెవరో పొదలలో పడి వస్తున్నాడు. చిన్న పైన్ చెట్లు ఊగిసలాడాయి. నేలపైనున్న మంచు అతని పాదాల క్రింద విరిగి నలిగేశబ్దం వినిపించింది. గుండె పగిలినట్లొక్క హూంకరించి రాబిక్షి బాణం మాదిరి గాలిలోనికెగిరిపోయింది.

మంచుపడిన పైన్ మ్రానుల మధ్య పెద్దముట్టె, పలవలు చీలిన కొమ్ములూ కనిపించాయి. దాని భయకంపిత నేత్రాలు నల్దిక్కులా పరికించాయి. గులాబిరంగు ముఖమల్‌వంటి దాని ముక్కు రంధ్రాలు చలించాయి. వాటినుండి వెలువడే వెచ్చని గాలి తెల్లని ఆవిరి పొగలూదినట్టులగుపించింది.

కొమ్ములు తిరిగిన ఆ జింక, కదలకమెదలక, శిలావిగ్రహంమాదిరి పైన్ వృక్షాలమధ్య నిలబడింది. దాని వీపుచర్మము మాత్రమప్పుడప్పుడు రవంత కదిలింది, పూర్తిగా కొయ్యబారిపోయి, చెవులు నిక్కబొడిచి వింటోంది. ఎక్కడనో నున్న పైన్ మ్రానును తొలిచే పేడపురుగు శబ్దం సహిత మా జింక వినగలిగింది. పక్షుల కూతలూ, వడ్రంగిపిట్ట ముక్కుపోట్లూ వృక్షాగ్రాల యూగులుపోయే గాలీ దానికి వినబడ్డాయి. ఇవన్నీ మామూలు శబ్దాలే. వాటిలో నెట్టి వైపరీత్యమూ దానికి కనిపించిందికాదు. కాబట్టే మనసు దిట్టపరచుకొని నిలిచింది, కాని ఏదో విపరీతపు వాసనొకటి సోకుతున్నట్టు లనుమానం కలిగింది. కరిగే మంచు వాసనతో మిశ్రితమై అసహ్యపు వాసనేదోఒకటి దానికి తగిలింది. భయపడి వాసన వచ్చేప్రక్క పరీక్షగాచూచింది. అంతదూరాన, తెల్లనిమంచుమీద నల్లనరూపాలేవో కనిపించాయి. దాని కండరాలన్నీ వంచినవింటిబద్దమాదిరి బిగుతెక్కాయి, పారిపోడానికి సిద్ధపడినట్లు. కాని ఒక్కకాలయినా కదిపిందికాదు. ఒకదానిపైనొకటి, కుప్పతిప్పలుగాపడివున్న నల్లటి ఆ రూపాలవంక రెప్పవాల్చకుండా చూసింది. ఒకటికాదు, రెండుకాదు; అట్టికుప్పలెన్నో దానికగుపించాయి. వాటినుండివచ్చే వెగటువాసనకు దానికి మతిపోయినట్లయింది.

తెల్లనిమంచుమీద నల్లగాకనిపించే ఆమనుష్యులెవరు? కదలక మెదలక కుప్పతిప్పలుగా నెందుకు పడిపోయారు? కండ్లు పత్తగించి ఎంతచూచినా ఆ జింకకు బోధపడిందికాదు.

పైనుండి ఏదోఒక వింతశబ్దం దాని చెవులబడింది. వీపుచర్మం అదిరిపడి వణికింది. వెనుకకాళ్ళకండరాలు మరింత బిగుతెక్కాయి. ఎగిరిముందుకు దుమికేందుకు సిద్ధపడ్డాయాకండరాలు.

చెట్లపైనేవో పక్షులెగురుతున్నాయికాబోలు. అది వాటిరెక్కలశబ్దమై యుంటుంది. ఈ ఆలోచనకలగడంతో, జింకకు భయంతీరింది. తలపైకెత్తి

చూసింది. చెట్లశిఖరాల కమితఎత్తులో ఎగిరేపక్షులగుంపొకటి కనిపించింది. వాటి రెక్కలశబ్దంతో మిళితమై టప్ టప్ టప్ మనేవొక విచిత్రధ్వని అప్పుడప్పుడు వినబడుతోంది. ఆ పక్షుల్లోనొకటి బారురెక్కలతో తేలుతూ అంతదూరాన క్రిందికి దిగింది. తక్కినవన్నీ వాటిమానాన అవి ఎగిరెళ్ళిపోయాయి. ఇంతలేసికళ్ళుచేసుకొనిచూస్తూ జింక నిలబడిపోయింది. ఉన్నట్లుండి ఎగిరివెళ్ళే పక్షుల్లో నొకటి దభాలున క్రిందికిదిగటం మొదలుపెట్టింది. ఊడిపోయిన తనతోక నాకాశంలో దిగవిడిచి, క్రిందికి రాను రాను బ్రహ్మాండంగా పెరిగి, విశ్వరూపం దాల్చిందాపక్షి. గుండెలో పిడుగుపడినట్లయి, చెంగున లంఘించి అరణ్యపు టందని లోతుల్లోకి జింక పరుగు తీసింది. బ్రహ్మాండ భయంకర తుపానుకు మొదలంటా కదిలినట్లు అచ్చటి చెట్లు చిందరవందరై పోయాయి. నూరు పిడుగు లొక్కపెట్టున పడినంత ధ్వని అరణ్యమంతటా మారుమ్రోగింది. పారిపొయ్యే జింకను వెన్నంటి తరిమింది ఆ శబ్దం.

విమానపు తాకుడుకు ధగధగ మెరిసే వజ్రాల వర్షం మాదిరి, చెట్ల కొమ్మలనుండి మంచుపొడి కురిసింది. మరుక్షణం అడవంతా సదణిగ్గి నిశ్శబ్దంతో నిండిపోయింది. ఎక్కడినుండో మూలుగుడు శబ్దం, మనుష్య కంఠం నుండి వెలువడే మూలుగు వినబడింది. ఈ శబ్దం తన చెవులపడి పెద్ద ఎలుగుబంటొకటి నడిచివచ్చింది. దాని బరువైన పాదాలక్రింద కరకరావిరిగి, మంచు నుసియై పోయింది.

జడ లల్లుకొన్న గోధుమరంగు బొచ్చూ, అకలికి అంటకరుచుకుపోయిన డొక్కలూ, నోటినుండి స్రవించే ఎంగిలిధారా: భయంకరరూపం దానిది. పూర్వం ఎప్పుడో ఒకప్పుడు, ఒకడో ఇద్దరో వేటగాండ్రు మాత్రమీ అరణ్యంలోకి వచ్చేవారు. కాని ఇప్పుడో ? దేశదేశాలూ వ్యాపించిన మహాసంగ్రామం ఈ అడవినీ చొరబడింది. వన్యమృగాలకు అరణ్యపు లోతుల్లో తలదాచుకోవలసిన దుర్గతి పట్టింది. చుట్టచుట్టుకొని, వెచ్చగా, చలికాలం తీరేదాకా నిద్రపోవాలనే ఎలుగుగొడ్డు ఆశ నిరాశ అయిపోయింది. ఈ యుద్ధం రాబట్టి కోపంతో, ఆకలిమంటతో నీ ఎలుగు అడవంతా చెడతిరుగుతోంది.

ఇంతకు ముందు జింకనిలబడిన జాగానుచేరి, ఎలుగు నిలబడిపోయింది. కమ్మటి జింకమాంసపువాసన దానికి తగిలింది. మంచులో కనిపించే జింక అడుగుజాడలను పదేపదే వాసనచూసింది. చెవియొగ్గివిన్నది. వినవడీ వినపడనట్లేదో, ఒక శబ్దం దాని చెవులబడింది. ముక్కు చెమర్చింది. నాసికాపుటాలు, గాలిలోనిరావాకు మాదిరి, రెపరెపా కొట్టుకొన్నాయి. తిరిగీ అదే శబ్దం. జాలిగొలిపే శబ్దం, హీనాతిహీన స్వరంతో వినిపించింది.

అడుగుల్లో అడుగులిడుతూ, బహు నెమ్మదిగా, ఎక్కడ ఏ శబ్దం కలుగుతుందో అన్నట్లు, సుతిమెత్తగా, ఆ శబ్దం వినవచ్చిన దిక్కుగా ఎలుగు నడిచింది. మంచులో సగంవరకూ పూడుకొనిపోయి, కదలక మెదలక పడివున్న మనిషి ఒకడు దాని కంటబడ్డాడు.

# 2

వైమానికుడు అలెక్సేవ్ మర్సియవ్, కత్తెరబోనులో చిక్కుకొన్న జంతువు మాదిరి, చిక్కుకుపోయాడు. అతని మందుగుండు సామాగ్రి యావత్తూ ఖర్చయిపోయింది. నాలుగు శత్రు విమానాలు, జర్మన్ ప్లేనులు, అకస్మాత్తుగావచ్చి అతన్ని తాకాయి, అలెక్సీకి తప్పించుకోడాని కిసుమంతయినా సందు చిక్కిందికాదు. తమ ఏరోడ్రోంకు తీసుకుపోవడానికి జర్మను ప్లేనులాతని వెన్నంటి తరిమాయి.

ఆరోజు ప్రొద్దున్నే "రెండో నంబరు" రష్యను వైమానిక దళమొకటి జర్మను ఏరోడ్రోం మీదికి దాడి వెడలింది. వాటిని కాపాడడానికి, మరి నాలుగు విమానాలు, లెఫ్టినెంట్ అలెక్సీ అధిపత్యం క్రింద ఎగిరి వెళ్ళాయి. ఏరోడ్రోంలో జర్మను జంకరు విమానాలనేకం బారులు తీరి కనిపించాయి. రష్యను "స్టార్మొవిక్" విమానాలు అంతరిక్షంనుండి, చెట్లశిఖరాలను రాసుకొనేటంతక్రిందికి దిగాయి. చెట్ల మరుగుగా జర్మను ఏరోడ్రోంను సమీపించి, ఒక్కసారిగా పైకిలేచాయి. క్రింద ఏరోండ్రోంలోనున్న జంకర్లపైనా, సామాగ్రుల గొంపోయే పెద్దరకం ప్లేనుల మీదా బాంబులవర్షం కురిపించాయి. దిగ్భ్రమచెంది జర్మనులు తలదాచుకోడానికి పరుగులిడారు, మరికొందరు, బాంబులధాటినుండి తప్పించడానికి తమ ప్లేనులను నేలపై పరుగులెత్తించారు. రష్యను స్టార్మొవిక్‌లు ధైర్యంగా క్రిందికి దిగి మరీ అట్టహాసంచేసాయి. ఏరోడ్రోమంతా గల్లంతుపడిపోయింది. ఈ గల్లంతులోనే కొన్ని జర్మను జంకర్లు ఎగిరి పైకివచ్చాయి.

వాటిని చూడగానే అలెక్సీ కెక్కడలేని కోపమూ వచ్చింది. అరికాలి మంట తలకిలేచింది. పైకిలేవబోతున్న ఒక పెద్దవిమానంపైకి దభాలునదిగాడు. అతని మరఫిరంగినుండి కురిసిన తూటాల వర్షాని కాజెర్మను విమానం రెక్కకు మించిన తూట్లుపడి, ప్రక్కకుఒరిగి నేలపైపడింది. కారుమేఘంవంటి పొగలు లేచి, భగ్గున నిప్పంటుకొని మండనారంభించింది. ఇదంతాచూస్తూ ఆకాశంలో నిలబడి ఆనందిస్తున్న అలెక్సీకి పైకిలేస్తున్న వేరొక విమానం కనిపించింది. దానిని తాకి, వెనకాముందు లాలోచించకుండా తన దగ్గరనున్న తూటాలన్నిటినీ

దానిపై విసిరాడు. చావుదెబ్బలుతగిలి, పొగలవెళ్గ్రక్కుతూ, నిప్పంటుకొని అడవిలో పడిపోయిందాజర్మనుప్లేను. అలెక్సీ సంతోషాన్ని పట్టపగ్గాలులేక పోయాయి. తీవిగాపైకిలేచి ఏరోడ్రోం ముఖంపట్టాడు.

తన దళానికిచెందిన మూడు విమానాలను, "మెస్సర్సు" జర్మను విమానాలు, తొమ్మిది, వేధించుకుతినట మాతనికంటబడింది. ఈ మూడు విమానాలూ, శత్రువుల కందినట్లేకనిపించి తప్పించుకు వెడుతున్నాయి. వానివెంటబడి జర్మనులు తరుముతున్నారు. శత్రువుకంటబడగానే, అడవికోడి దెబ్బతిన్నట్లు నటిస్తుంది. కుంటుకొంటూ దూరం దూరంగా పారిపోతుంది. గూటిలోనున్న పసికందులు శత్రుబారి పండకుండా ఈ విధంగా మోసగించి అకస్మాత్తుగా కోడి ఎగిరిపోతుంది. మన రష్యను ప్లేనులూ ఇదేమాదిరి జర్మను విమానాలను దూరానికీడ్చుకు వెడుతున్నాయి. ఈలోగా ఇతర రష్యనుప్లేనులు తప్పించుకోగలిగాయి.

ఇట్టి విపత్సమయంలో తానెక్కడికో వెళ్ళిపోవటం అలెక్సీకి సిగ్గుచేటనిపించింది. ముఖం కందగడ్డమాదిరి ఎరుపుతిరిగి, వేడికన్నీరు జలజలరాలింది. ఇతర విమానాలకు కొంత దూరంలో నొక జర్మనుప్లేను కనిపించింది, పండ్లు పటపటకొరికి, అమాంతంగా దానిపై వ్రాలాడు. దానికి పదిగజాల దూరంలోనుండగా మరఫిరంగి మీటను నొక్కాడు. చేతికందేటంత దగ్గరికివచ్చిన జర్మనుప్లేను చెక్కుచెదరకుండా ఎగిరిపోయింది. ఆశ్చర్యచకితుడై, అలెక్సీ తిరిగి మరఫిరంగి మీటను నొక్కాడు. ఎటువంటి శబ్దమూ వినబడిందికాదు. అతని గుండె గుభేలు మన్నది. చేతనొక్క తూటాకూడాలేదు. ఉన్నవన్నీ విలాసంగా ఇతర విమానాలపైనుపయోగించేశాడు.

జర్మను వైమానికు డీ రహస్యం తెలుసుకోలేక పోవడం అదృష్టమనే చెప్పాలి. ముగ్గురికి నలుగురుగానుండటం మంచిదనుకొని, తానూ యుద్ధంలో చొరబడ్డాడు. తప్పించుకు వెళ్ళిన జర్మను వైమానికుడు, అలెక్సీ అనుకొన్నంత పెద్ద ఖుంతకాడు. అలెక్సీ చేత బాంబులు లేవని ఇట్టే తెలుసుకున్నాడు, నాలుగు విమానాలు లేచి అలెక్సీ వెంటబడేటట్టు రేడియో సందేశం పంపాడు. పైనా, క్రిందా, కుడి, ఎడమలా జర్మను విమానా లాతని ముట్టడించాయి. ఫలానా దిక్కుగా ఎగరమని సూచించడానికా విమానాలు పొగతూటాలనా ప్రక్కగా ఆకాశంలోకి పంపించాయి. అటూ ఇటూ రవంతయినా కదలడానికి వీలులేకుండా నలుదిక్కులా, నాలుగు శత్రువిమానాలూ: పాపం, అలెక్సీయెల్‌ను తరుముతున్నాయి.

ప్రఖ్యాత జర్మను "రిక్తొఫెన్" వైమానికదళ మొకటి ఈ ప్రాంతాలకు వచ్చిందని కొద్దిరోజుల క్రితం జనులు చెప్పుకొన్నారు. గొయరింగ్, తానే స్వయంగా ఈ విమానాన్ని నడిపిస్తున్నాడట! తానీ నరహంతకులచేతిలో పడి పోయాననీ, తమ ఏరోడ్రోంకు వెళ్ళి తన్నచట ఖైదుచేయ బూనుకొన్నారనీ,

అలెక్సీ గ్రహించాడు. ఇంతకుముం దిదేవిధంగా కొందరు రష్యనులు పట్టుబడ్డా రన్న సంగతి అతనికీ తెలుసు. తన స్నేహితులలో నొకడు, ఆంద్రి దెగ్త్యారెంకొ, పూర్వమొక జర్మను వైమానికు నిదేవిధంగా ఖైదు చేసాడు. ఆసంగతి ఇప్పుడా తనకి జ్ఞాపకానికివచ్చింది;

పాలిపోయిన ముఖమూ. తడవడు తప్పటడుగులూ, భయకంపిత నేత్రాలూ; ఆనాటి జర్మను ఖైదీరూపం కండ్లకు కట్టినట్లగుపించింది. "పట్టుబడటమా ? శుద్ధ అబద్ధం ! అసంభవం !!" అనిన అలెక్సీ తనకుతానే ధైర్యం చెప్పుకొన్నాడు.

తప్పించుకోడాని కాతడెన్నో పన్నాగాలుపన్నాడు, ఒక్కటీ ఫలించింది కాదు. ఏమాత్రం దారితప్పినా, వెంటనే జర్మను ఫిరంగు లాతని అడ్డగించడానికి తూటాలు విసిరాయి మరొకపర్యాయ మా జర్మన్ ఖైదీ జ్ఞప్తికి వచ్చాడు. ఒడలు జలదరించింది.

పండ్లు బిగపట్టి, ఇంజనుకు పూర్తిగా పెట్రోలు నెక్కించాడు. ఉన్నట్టుండి తన విమానాన్ని తలక్రిందులుగా త్రిప్పి వాయువేగంతో క్రిందికి దిగాడు. వెంటనే పైన ఎగిరే జర్మను విమాన మాతనిమీద బాంబులవర్షం కురిపించింది. తూటాలను చిందవందరగా విసిరింది. అలెక్సీ ఇంజను దెబ్బతిని దగ్గటం మొదలుపెట్టింది. దాని పిస్టనులు ఆగబోయే గుండెమాదిరి, క్రమం తప్పి కొట్టుకొన్నాయి. విమానం మలేరియా జ్వరంవచ్చినవాడిమాదిరి, గజగజ వణికింది.

"అయ్యో ! దెబ్బతిన్నా" నని పెద్ద కేకపెట్టి, అలెక్సీ క్రిందనున్న పెద్ద మేఘం చాటును చేరాడు. తలనుండి తోకవరకూ విమానం కంపించింది. ఇంజను శబ్దం రానురాను హీనమై పోయింది. ఏదిచేయడానికీ అలెక్సీకి స్ఫురించింది కాదు. ఈ విధంగా మేఘంచాటున ఎక్కువకాలం దాక్కోడానికి వీలులేదు, ఏ నిమిషానికెట్టి ప్రమాదం జరుగుతుందో ఎవరు చెప్పగలరు ? పెట్రోలు టాంకు లకు నిప్పు అంటుకుంటే ?....చావు తప్పదు....తన శవం జర్మనుల చేతికక్కరాదు. చిక్కితే అది తనవారికే చిక్కాలని అలెక్సీ నిశ్చయించుకొన్నాడు. తన విమా నాన్ని రష్యను ఏరోడ్రోం వైపు మళ్ళించాడు.

ఉన్నట్టుండి, మరునిమిషం, ఇంజను నిలిచిపోయింది. ఏదో పెద్దకొండ పార్శ్వంనుండి పడిపోయినట్టు లా విమానం పడిపోయింది. క్రింద మహాసముద్రం వంటి మహారణ్యం కనిపించింది. విమానపు రెక్కలుచెట్ల శిఖరాలను తాకాయి. అప్పడాలమాదిరి ఫకుక్కున విరిగి ముక్కలయి పోయాయి. అతనికి తెలియకుం డానే కుడిచేయి మరను త్రిప్పి ఇంజనును నిలిపివేసింది. పచ్చని అరణ్యమొక గంతువేసి పైకెగిసి, పైన పడింది. బ్రహ్మాండమైన పెళపెళారావంతో కొమ్మలూ, విమానమూ ఒకేసారి విరిగాయి. స్పృహతప్పి మంచుకప్పిన చెట్ల కొమ్మలలో

అలెక్సీ పడ్డాడు. శవాకారపు టాతని దేహం కొమ్మలనుంచి దిగజారి, మెత్తగా పేరుకొన్న మంచుదిబ్బపై, చెట్టుమొదట్లో పడిపోయింది.

మంచుమీద. ఈవిధంగా స్పృహతప్పి ఎంతకాలమున్నాడో అతనికినాటికీ, నేటికీ తెలియదు. ఏవేవో మనుష్యాకారాలూ, భవనాలూ. కర్మాగారాలు అతని మనో నేత్రంలో కనిపించాయి. ఒడలంతా ఒకటే నొప్పులు. శరీరమంతటా బాధ, పెనుభూతంవంటి దేదో ఒక టాతని సమీపించింది. దాని ఉచ్ఛ్వాస నిస్వాసాలు వినిపించకపోయినా దాని వెచ్చని ఊపి రాతని ముఖానికి తగిలింది. అబ్బా! చెప్పనలవికాని వెగటు వాసన! ప్రక్కకు ఒత్తిగిలాలను కొన్నాడు. కాని, మంచులో పాతుకుపోయిన శరీరాన్ని కదిలించలేకపోయాడు. తిరిగీ కడుపంతా దేవేసే అ వాసన కొట్టింది. బలవంతంగా, గొప్ప యత్నంమీద ఓవంత ఒత్తిగిలాడు. చల్లని మంచాతని చెక్కిలిత తగిలి రవంత స్మారకం కలిగింది. ఒకటేబాధ, కాళ్ళనరాల నెవరో గట్టిగా పటకారుతోపట్టి లాగి, మెలిబెడు తున్నట్లనిపించింది,

"చచ్చిపోలా! బ్రతికేఉన్నానన్నమాట!" అని అతననుకొన్నాడు. లేచి నిలబడాలనే ఆశకలిగింది. ఎవరివో బలిష్ఠమైన పెద్ద పాదాలక్రింద నలిగి విరిగే మంచుధ్వనీ, ఊపిరిబుసలూ వినిపించాయి. "జర్మను"లేమో అనే అనుమానం తట్టింది, కండ్లు తెరచిచూసి, పోరాడుదామనుకొన్నాడు. కాని" ఒంటరిగాణ్ణి; అందు లోనూ ఖైదీని. నాచేత నేమవుతుంద"నుకొని అట్లాగే ఊరకపడుకొన్నాడు.

తనషరాయి జేబులో పిస్తోలున్న సంగతాతనికి జ్ఞప్తికివచ్చింది. బోర్లపడి పడుకొన్నాడు. ఒకప్రక్కకు తాను ఒత్తిగిలితేనేకాని పిస్తోలును జేబులోనుండి తీయడానికి వీలుకాదు. తానేమాత్రం కదిలినా విరోధి తానేమిచేసేదీ కనిపెట్టేయ గలడు, పిస్తోలుమొన తొడకుగ్రుచ్చుకొని," నేనున్నానుగా, భయమెందుకు" అంటోంది.........పోనీలే, కదలకుండా పడుకుంటాను, చచ్చిపోయాడని వదిలి వెళ్ళిపోయినా పోవచ్చు" అనుకొన్నాడు.

ఆ జర్మనువ్యక్తి ఎవడో తన్ను వదిలివెళ్ళేటట్టులేడు. అక్కడక్కడే తారాడు తున్నాడు. బహుబలిష్ఠుడైయుండాలి, కరకరనలిగిపోతోంది, మంచు అతని పాదాల క్రింద! రానురానాతని నిట్టూర్పులు దగ్గరగా వినిపించాయి. తిరిగీ వెగటువాసన కొడుతూన్నగాలి అలెక్సీ ముఖానికి సోకింది. ఎంత బలిష్ఠుడైనా ఉన్న శత్రు వొక్కడే కదా అని అలెక్సీ ప్రాణం తెప్పరిల్లింది. అకస్మాత్తుగా లేచినిలబడి, చేయీచేయి కలిపి పోరాడాలనీ, అదే తరుణంలో పిస్తోలును రహస్యంగా బయటికి లాగి కాల్చివేయాలనీ కలలుకన్నాడు.....కాని, ధైర్యం చిక్కిందికాదు.

పరాయివాడికి తెలియకుండా కనురెప్పలు రవంత ఎత్తిచూసాడు. గోధుమ రంగు జడలబొచ్చు కనిపించింది. ఆశ్చర్యచకితుడై కండ్లు బాగావిప్పిచూసాడు.

బక్క-చిక్కిన డొక్కలూ, జడలు పేరినబొచ్చూ, పెద్ద ఎలుగుగొడ్డొకటి తన ఎదురుగా బైఠాయించి ఉండటం చూసాడు.

# 3

సగానికి పైగా మంచుకప్పబడిన ఆ మనిషికి సమీపంగా, కదలక మెదలక, ఓపికగా కూర్చున్నదా ఎలుగుబంటి. చీమిడి కారే దాని ముక్కుపుటాలు చలిస్తున్నాయి. సగం తెరిచిన నోటిలో పచ్చగా పాచిపట్టిన వాడి పండ్లు కనిపిస్తున్నాయి. నోటినుండి కారిన జిగురువంటి చొంగ ల్వాయిను దారంమాదిరి బిగదీసుకుపోయి గాలిలో కొట్టుకొంటోంది.

చలికాలపు నిద్రకు భంగపాటు కలిగించే ఈ యుద్ధ మెక్కడినుండి దాపరించిందో ఆ ఎలుగుకు తెలిసిందికాదు. ఆకలీ కోపమూ ఆ ఎలుగును కాల్చివేస్తున్నాయి. ఎలుగుగొడ్లు శవాలను తినవు. కదలకుండా పడిపోయిఉన్న ఆ మనిషిని ఎలుగు వాసనచూసింది. పెట్రోలు వాసన గుప్పునకొట్టింది. లేచి ఎలుగు వెళ్లిపోసాగింది. చూపుమేరలో మరికొన్ని మనుష్య రూపాలు దానికంటబడ్డాయి.

"బ్రతికానురా, బాబూ !" అనుకొని అలెక్సీ నిట్టూర్చాడు. ఈ శబ్దం దాని చెవులపడింది కాబోలు, ఎలుగు తిరిగివచ్చి పీఠం వహించింది.

ఆకలి రుచి నెరుగ దంటారు, కడుపు దహించుకుపోతోంటే శవాల తినరాదని మడికట్టుకొని కూర్చోడం దానికి శక్యమయిందికాదు. పెద్ద నిట్టూర్పు విడిచి లేచి నిలబడింది. కాలితో కదిపి, అలెక్సీ నొక ప్రక్కకు దొర్లించింది. అతడు ధరించిన రబ్బరుకోటు గాలికి రెపరెపాకొట్టుకొని ఎలుగును చికాకు పరిచింది. కోపంవచ్చి తన వాడిగోళ్లతో కోటును పట్టి చీల్చడానికి యత్నించింది. సాధ్యపడిందికాదు. చెడ్డకోపంవచ్చి ఉరిమింది. అమాంతంగా ఆతనిపై బడింది. జేబులోనున్న పిస్తోలును దీసి గురిపెట్టి కాల్చివేయాలనే ఆశపుట్టింది. కాని వీలు చిక్కతేగా !

అతని రబ్బరు చొక్కాను పండ్లతో పట్టి బలంకొద్దీ పీకుతోంది. ఎంతకూ చినిగిందికాదేమో, కోపం మిన్నుముట్టి, అమాంతం నోరుతెరిచి కవ్వున కవ్వుకొన్నది. దానిపండ్లాతని శరీరానికి తగిలి మంటలెగిసాయి. గట్టిగా నోరుతెరచి అరుద్దామనుకొన్నాడు. కాని ఎంతో ఓపికపట్టి నోరు నొక్కుకొన్నాడు. ఎలుగా తనిపట్టి మంచులోనుండి వెలుపలికి లాగుతోంది, చటాలున పిస్తోలును జేబునుండి లాగి, గురిపెట్టి ప్రేల్చాడు

ఆశబ్దం అడవంతా మారు[మోగింది.

చెట్టుకొమ్మపైనున్న రాబిన్‌పిట్ట అదిరిపడి, అరిచి, రివ్వున ఎగిరిపోయింది. కదలినకొమ్మ నుండి జలజలా మంచు రాలింది. ఎలుగు నోటిపట్టుసడలి. అలెక్సీ దభాలున క్రిందపడ్డాడు. ఏదీపాలుబోక, ఇంతలేసి కండ్లు చేసుకొని చూస్తూ ఎలుగు చతికిలబడింది. చిక్కటి ఎరుపురంగు రక్తం దాని డొక్కలనుండి కారి తెల్లటి మంచుపై పారాణిపెట్టినట్లగు పించింది. పెద్దపెట్టున ఒకకేకపెట్టి వెనుక కాళ్ళమీదలేచి నిలబడింది. అంతే....అమాంతంగా దభీలుమని నేలపైపడి పోయింది. దాని నెత్తురు వేడికి కరిగిన మంచునుండి ధూపంవేసినట్టు లావిరిపొగ లేచింది.

ఆలెక్సీకి తల తిరుగుతూన్నట్లనిపించింది. కాళ్ళు చెప్పనలవికానంతగా బాధపెడుతున్నాయి ఉన్నట్టుండి స్మృతితప్పిపోయింది.

తిరిగీ తెలివివచ్చేటప్పటికి చాలా ప్రొద్దెక్కింది. పైన్ కొమ్మల సందు నుండి పొడలు పొడలుగా మంచు మీదపడిన ఎండ కనిపించింది.

మెళకువరాగానే "ఏదో పాడు ఎలుగుబంటి కలలోకివచ్చిందను" కొన్నాడు పీడకలను కన్నాడుకాబోలు, అది కలాకాదు, కల్లాకాదనడానికి నిదర్శనంగా ఎలుగుబంటి శవం కనిపిస్తోంది. పక్షుల కూతలూ, వడ్రంగిపిట్ట ముక్కుపోట్లూ వినిపించాయి.

"చావలేదు! బ్రతికేవున్నాను!! బ్రతికున్నా"నని పట్టరాని సంతోషంతో అరిచాడు, ఒడలంతా పులకరించింది. మృత్యుద్వారాన్నిచేరీ, తప్పించుకు బయట బడ్డ అలెక్సీకి బ్రతుకుయొక్క తీయందనమంటే ఏమిటో అప్పుడర్థమయింది. ఎక్కడలేని సత్తువా వచ్చినట్లనిపించిందేమో. చివాలునలేచి నిలబడజూసాడు. రివ్వున ఒకకేకపెట్టి ఎలుగుశవంపై పడిపోయాడు. తల దిమ్మెక్కిపోయింది. తలలో తిరగళ్ళు తిరుగుతూన్నట్లొక శే ధ్వని. తన కంటి గ్రుడ్లనెవరో వత్తి లోనికి అదిమేస్తున్నట్లనిపించింది. ఎర్రని ఎండలో స్పష్టంగా కనబడే చెట్టు చేమలు మసగబారి అంతర్ధానమయ్యాయి.

"క్రింద పడేటప్పుడేదో గొప్పదెబ్బ, నెత్తికి తగిలింది కాబోలు, ఈకాళ్ళ పీక్కొనిపోవడం చూస్తే నాకేదో దిగులుగా వుంది." అని అనుకొన్నాడు.

మోచేతిపై లేచి పరీక్షించాడు. తానున్న ప్రదేశానికి కనుచూపుమేర దూరంలో పెద్ద అరణ్యం నేలపైన ఎక్కడచూసినా కుప్పతిప్పలుగా పడిన మంచు.

నిన్నమొన్నటిపరకూరష్యను సైనికులీ ప్రదేశంలోనుండి, చలికాలం రాబో తోందనగా వెళ్ళిపోయారు. కనిపించే ఆ అరణ్యంలో దాక్కొని, శత్రు సైన్యాల పైబడి పలుమారు వారి ప్రాణాలు కొరుక్కొని తిన్నారు. బాంబులుపడి స్రేలగా నేర్పడిన పెద్దగోతులన్నీ మంచుపడి పూడిపొయ్యాయి. వాటిలో యిరుపక్షాల సైని

కులూ; ఎందరో పెద్దనిద్రలు పోతున్నారు. మంచులో బిగుసుకుపోయిన శిథిల టాంకు లచ్చటచ్చటనున్నాయి. వెల్లికిలాపడి కొన్నీ, ప్రక్కకొరిగి మరికొన్నీ. టాంకులూ, వాటి ఫిరంగుల గొట్టాలూ కనిపిస్తున్నాయి. మంచు తిప్పలమీదా, సైనికులు త్రవ్విన కాలువలలోనూ. టాంకుల చెంతా లెక్కకు మించిన శవాలు, ఇరుపక్షాలవారివీ. కొన్ని ప్రదేశాల్లో కుప్పలు పేర్చినట్లు శవాల ప్రోగులగుపించాయి. ఎక్కడి శవాలక్కడే చలికి బిగుసుకుపోయి, యుగాంతరంవరకూ చెక్కు చెదరవన్నట్లున్నాయి!

ఎందరు రష్యను మిత్రులిచట హోరాహోరి పోరాడారో; దేశంకొరకెంతటి ఉత్సాహంతో తమ ప్రాణాల ధారబోశారో! బ్రహ్మాండపు పైనువృక్ష మొకటాతని దృష్టి నాకర్షించింది. బాంబు తాకుడుకు విరిగిన దాని తల అంతదూరాన పడిపోయింది. బంగారు తీగలవంటి రోజిన్ ఆ గాయంనుండి కారి ఘనీభవించి చూడ ముచ్చటగా నున్నది. ఆ మహావృక్షంక్రింద దానిపాదాన్నానుకొని, జర్మను సైనిక శవాలు, కపాలములు పగిలీ, ఒకచెంప చెంప ఎక్కడికో ఎగిరిపోయీ క్రిందిదవుడలు పోయీ, ఆ ముఖాలు బహు బీభత్సంగా నున్నాయి. వాటిపైన బలిష్ఠుడు, పొడగరి, గుండ్రటి ముఖంగల దొక యువకుడు, సాధారణ షరాయీ, షర్టూ, చేత తుపాకితో ఆ మనిషి జర్మను శవాలపై ఒరిగిపోయాడు. గడ్డకట్టినరక్తం తుపాకిబల్లెపు మొనమీదా, దాని పిడిపైనా అంతదూరానికీ స్పష్టంగా కనిపించింది.

మరికొంతదూరాన అడవిలోకి వెళ్ళే కాలిబాట. దానిపైనొకచోట బాంబు ప్రేలిన పెద్దగుంతా, దానిఒడ్డున, నల్లని చలువరాతి విగ్రహం మాదిరిదొక ఉజ్ బెక్ సైనికుని శవమూ కనిపించాయి. ఆ సైనికునికి వెనుకనున్న పైన్‌చెట్టుక్రింద పది పండ్రెండు కొత్తబాంబులూ, ఆతనిచేతిలో నింకొకబాంబూ. ఆ బాంబును విసిరే లోగా మృత్యువాతబడి ఎత్తినచేయి ఎత్తినట్టే, బిగదీసుకుపోయాడు.

ఇంకా మరికొంత దూరంలో రోడ్డుప్రక్క. విరిగి పడిపోయినటాంకుల చెంతా, బాంబు గోతుల అంచులమీదా, చెట్లకానుకొనీ లెక్కలేనన్ని శవాలు. దూది దిండ్లషరాయి, కోటులతో, మంచుదెబ్బ తగలకుండా చెవులుమూసే మంచు టోపీలతో వారగుపించారు. మంచు గుట్టలనుండి మోకాళ్లూ, రాబందులూ, నక్కలూ, కాకులూ పీక్కుతినేముఖాలు తొంగి చూస్తున్నాయి.

ఇదంతా చూడగా తన చిన్నతనంలో చదివిన చరిత్ర పుస్తకంలోని వొక పటం జ్ఞప్తికి వచ్చింది, అలెక్సీకి. "ఇగోరు యుద్ధ"మనే ఆ పటాన్ని, ప్రఖ్యాత రష్యను చిత్రకారుడొకాయన చిత్రించాడట.

"నాకూ ఇదేగతి పట్టివుండవచ్చుగదా" అనుకొన్నాడు. కానింకా బ్రతికి ఉండటం గొప్ప అదృష్టమనిపించిందాతనికి. నెమ్మదిగాలేచి ఎలుగుగొడ్డు శవం

రెండుపాదాలూ ఎందుకు పనిరావనే భయం వేసింది. విమానంలోనుండి పడ్డ టపుడేదో బలంగా తాకి, పాదాలలోని ఎముకలన్నీ తుత్తునియలయి ఉంటాయి. సాధారణ సమయంలో అట్టిపాదాలమీద లేచి నిలబడాలనే ఉద్దేశమే అతనికి కలి గేదికాదు. కాని, ఇప్పటి పరిస్థితులు వేరు. జర్మను సైన్యాలాతని దగ్గరదూరంలో నున్నాయి. వారిలో ఏ ఒక్కని కంటబడ్డా చావు తప్పదు. ఇంకొక్క ఘడియైనా ఆలసించరాదు. వెళ్లాలి. సాగిపోవాలి. తూర్పు దిక్కుగా వెడుతూనే వుండాలి, బాధా గీదా అని కూర్చుంటే తనప్రాణం తనకు దక్కదు.

ఇంకొకమారు ఎలుగుబంటి శవంనుండి పైకిలేచాడు. ఒక్క అడుగు పెట్టాడు. నిలబడ్డాడు. మంచులో పాతుకొనిపోయిన రెండోపాదాన్నెత్తి మరో అడుగుపెట్టాడు, తల దిమ్మెక్కింది, కండ్లు గిర్రున తిరిగాయి, తూలిపడిపోతా ననుకొన్నాడు.

అడుగుల్లో అడుగులిడుతూ తూర్పుదిక్కుగా సాగివెళ్లాడు. చేతబాంబుతో బిగదీసుకు నిలబడిన ఉజ్బెక్ సిపాయిని దాటి కాలిబాటను చేరాడు. ఇంతవరకూ చల్లగానుండే మెత్తని మంచుమీద నడిచాడేమో. గట్టిగా కాలిబాట పాదాలకు తగల గానే పైప్రాణం పైకెగిరిపోయింది. ఇంకొక అడుగైనా కదల్చలేక, బారచాచిన పాదాలమీద తూగిపోతూ నిలబడ్డాడు.

కండ్లు మసకలు క్రమ్మాయి. రోడ్డూ, చెట్లూ, వాటి మధ్య కనిపించే నీలా కాశమూ చూస్తూ వుండగా మసకబారి మాయమైపోయాయి. అది తన విమానం తమ దళ్యను ఏరోడ్రోంలో దానిచెంత తాను నిలుచున్నాడు. మెకానిక్ "యురా" నవ్వుముఖంతో రమ్మని పిలుస్తున్నాడు. మాసినగడ్డమూ, రెండు మూడు పండ్లు దిన బోసినవ్వూ; ఎప్పుడూ అదేరూపం, యురాది. "అంతా సిద్ధంగా నున్నది... ఎక్కు .. ఇంకా ఆలస్యమెందుకు ?" అంటున్నాడు యురా. విమానాన్నెక్కడానికొక అడుగు ముందుకు పెట్టాడు, అలెక్సీ భూమి గిర్రున తిరిగింది. ఎర్రగ కాలేపెనంమీద కాలుమోపినట్లు పాదం మండిపోయింది. రాళ్లెక్కడ మాడిపోతాయో అని ఛటాలున రెండడుగులు ముందుకువేసి విమానపురెక్కందుకు అనుకొన్నాడు విచిత్రం....సాఫీగా నుండవలసినదాని రెక్కచేతికి గరుకు గరుకుగా తగిలింది ధగధగా మెరిసేదాని అల్యూమినియంరంగు కంటి కగుపించిందికాదు. తీరాచూస్తే అది విమానంకాదు....రోడ్డు ప్రక్కనున్న ఒక పైన్‌చెట్టు బోదె !.

"కొంపతీసి మతిభ్రమణరోగంకాదుగదా ! చివరికి పిచ్చిఎక్కి మరీ చచ్చి పోతాను కాబోలు" అని దిగులుపడ్డాడు. రోడ్డునువదలి తిరిగిమంచు మీదనేనడిచి వెడితే ? అది చాలా దూరం....నేలమీద కూలబడి బూట్లు నూడబెరికాడు. మెడకు చుట్టుకొన్న ఉన్నిరుమాలును నిలువునా పేలికలుగా చింపి పాదాలకు

చుట్టాడు. తిరిగీ పాదాలకు బూట్లు ఎక్కించాడు. ఎంత బాధపడ్డాడో, ఇదంతా ముగిసేలోగా. ఎవరు చెప్పగలరు?

నడవటం ఇప్పుడు కొంతతేలిక అనిపించింది. నిజం చెప్పాలంటే దానిని నడక అనడానికే వీలులేదు. పాదాన్ని పైకెత్తి పెట్టి మడిమమీద నిలబడేవాడు. తరువాత రెండో పాదాన్ని బాగా పైకెత్తి ముందుకు సాచి, తిరిగి మడిమ నానించేవాడు. ఈ విధంగా గాజుపెంకులు చల్లిన దారిమీద నడిచినట్టు సాగిపోనారంభించాడు. నాలుగైదు అడుగులు పెట్టేలోగా తల గిర్రున తిరిగేది. కళ్ళు గట్టిగా మూసుకొని ఏ చెట్టుకో ఆనుకొనో, లేక ఏ మంచుమీదనో కూలబడో సేద తీర్చుకొనటమూ, తిరిగీ నాలుగడుగులు పెట్టడమూ, ఈ విధంగా వెడుతున్నాడు. ఇక బాధసంగతా? అది నీ ఊహకూ, నా ఊహకూ అందని విషయం.

కొన్నిగంటలు గడిచాయి. వెనుతిరిగి చూసాడు, ఉజ్‌బెక్ సిపాయి శవం చూపుమేరలో కనిపించింది. ఇంత శ్రమపడీ రాగలిగిన దింతమాత్రం దూరమేనా అనిపించిం దాతనికి. ఆశలన్నీ అడుగంటినా, మనోనిబ్బరాన్ని తన పిడికిట బిగపట్టు కొన్నాడేమో, అధైర్యం కలిగిందికాదు. ద్విగుణీకృత ఆవేశంతో నడక ప్రారంభించాడు. తిరిగి కాళ్ళసంగతి మరిచిపోడాని కొక వుపాయం కనిపెట్టాడు. చేరువలో నుండే ఏ చెట్టునో, ఏ గుట్టనో గురిగా పెట్టుకొని, మనస్సంతా దానిపై నిలిపి నడిచేవాడు. దానిని చేరగానే "హమ్మయ్యా" అనుకొని, దానికి జేరగిలబడి సొమ్మసిలేవాడు. తిరిగీ ఇంకొకచెట్టు, వేరొక పొద, మరో గుట్టను గుర్తించుకొని కాలు సాగించేవాడు. దెబ్బతిన్న మృగపు టడుగుజాడల మాదిరి తన కాలిజాడల వంకర టింకరగా మంచుపై అచ్చుగ్రుద్దుతూ సాగిపోతున్నాడు, అలెక్సి మర్సియవ్.

# 4

సాయంకాలందాకా నడిచాడు. తన వెనుకప్రక్క అస్తమిస్తూన్న సూర్య కిరణాలు చెట్లశిఖరాలకు ఎర్రటి లక్కపూత పూసాయి. అరణ్యమంతటా బ్రహ్మ రాక్షసులవంటి నల్లని చెట్లనీడలు పడ్డాయి. దట్టంగా జూనిపర్ చెట్లు పెరిగినభాగంలో నొక లోతైనగోయి కనిపించిం దాతనికి. ఆతని కచ్చట కంటబడ్డ దృశ్యాని కాతని ఒడలంతా జలదరించింది. వీపుమీద ఏదో పెద్ద మంచుగడ్డముక్కతో రుద్దినట్టు ఎక్కడలేని చలీ పుట్టి గజగజ వణికిపోయాడు, అలెక్సి.

యుద్ధం జరిగేరోజుల్లో దొక ఆస్పత్రిదళం, ఇచ్చట మకాం వేసింది. దెబ్బలుతిన్న సైనికులందరినీ పైన్ చెట్లఆకుల పాన్పులపై పడుకోబెట్టారు.

కురిసిన మంచులో పూర్తిగా పూడుకుపోయి కొందరూ, సగంవరకూ పూడుకుపోయి మరికొందరూ, ఎక్కడ పడుకోబెట్టిన వారక్కడే కనిపించారు. వారంతా తగిలిన దెబ్బలవాతపడి చనిపోయారని అనుకోవద్దు. ఎవరో వారి గొంతుకల చీల్చి మరీ చంపారు. పాపం! వెనుకకు విరుచుకొని పడిపోయిన ఆ కంఠాలమీద కత్తివ్రేటు స్పష్టంగా కనిపిస్తోంది. ఈ శవాల కంతదూరాన నొక నర్సు శవం. కనిపించింది. నడుమునవరకూ మంచు పడింది, కూర్చొనివున్న ఆ శవంమీద తెల్లటి గౌనూ, నెత్తిపైనున్న తెల్లటిటోపీ పడిపోకుండా గడ్డంక్రింద ముడివేసిన తెల్లటి నాడా, తలదించి తన ఒడిలో పడుకోబెట్టుకొన్న సైనికుని ముఖంవంక ఆనుర్దాగా చూస్తూ కూర్చున్న ఆ నర్సు, కూర్చున్నట్టే చనిపోయింది. పిడివరకూ దించుకొనిపోయిన బాకూ. ఎవ్వడా ఇంతటి ఘోరకృత్యానికి ఒడిగట్టినవాడని చూడటానికి పెల్లుబికివచ్చి, నిర్ఘాంతపోయి, కొయ్యబారిపోయిన ఎర్రటి రక్తచాలూ, ఆ నర్సు వీపుమీద కనిపించాయి. ఈ నర్సు శవాని కనతిదూరంలో మరి రెండు శవాలు, ఒకటి జర్మను సైనికుడిదీ, మరొకటి రక్తసిక్తమైన తలకట్టుగల రష్యను సైనికుడిదీ ఉన్నాయి; ఒకరి కంఠా న్నింకొకరు బలంకొద్దీ నొక్కుతూ. కొయ్యబారిపోయిన ఆ శరీరాలను చూస్తే, వారింకా పోరాడుతున్నారా అన్నట్టు అనిపించింది, అతనికి....ఇచ్చట జరిగిన యావద్విషయమూ, అలెక్సీకి, ఇట్టే విదితమయింది. దెబ్బలు తగిలివున్న రష్యను సైనికులను, ఏవిధంగానూ కూడా తమ్ము తాము రక్షించుకోజాలని స్థితిలోనున్న వారందరినీ, రాతిగుండెల జర్మను సిపాయి కంఠాలు చీల్చి చంపాడు. పునీతమైన యుద్ధభూమిపై అపరావర మృత్యుదేవతమాదిరి చెలరేగి వెనుకవాటుగా వచ్చి, పాపం, ఆ నర్సు వీపులో బాకు దించాడు. ఇంతలో తలగాయంతో పడివున్న రష్యను సిపాయి, లేనిబలం తెచ్చుకొని లేచివచ్చి ఆతనిపై బడ్డాడు. ఒకరి కంఠాల నొకరు బిగియపట్టి, ఇద్దరూ, ఆ పట్టు విడువకుండానే ,మృతినొందారు,

చంపవచ్చిన జర్మను సైనికుడి కంటబడరాదని తన వొడిలోనున్న సిపాయిపై ఒరిగి ఆతని రక్షించుతూవున్న నర్సు మృత్యువాతపడింది. సిపాయి ప్రాణాలను కాపాడడానికి తన ప్రాణము నర్పించి కృతకృత్యురాలయింది, ఆ నారీరత్నం. ఆమెతోపాటే ఆ సిపాయి ప్రాణాలూ వెళ్ళిపోయాయి... అలెక్సీ నెమ్మదిగా నర్సు శవాన్ని సమీపించి బాకు నూడబెరికాడు. దానిమీద SS అనే జర్మనుగుర్తు స్పష్టంగా కనిపించింది. జర్మను సైనికుని నడుముకు బిగింపబడిన ఒరసుతీసి బాకు నందులోపెట్టి, భద్రపరిచాడు, అలెక్సి. దాని కెప్పుడో వొరకప్పుడు పనిపట్టక మానదని అతని వుద్దేశం. బాగా ఇంతమంచును త్రవ్వి. నర్సు శవాన్ని పూడ్చి, పైన పైన్ ఆకులు కప్పాడు.

ఇంతలో చీకటి పడింది. మంచుపడ నారంభించింది. చలి. విపరీతపు చలి వేసింవాతనికి. ఈలలూదుకొంటూ గాలి చెట్టుకొమ్మలతో ఊసుకుపోతొచ్చింది. సూదుల్లాంటి మంచు. చీమలు కొరికినట్టు ముఖానికి తగిలి వేధిస్తోంది.

ఓల్గానది పచ్చిక మైదానపు గ్రామాల్లో నొకమైన కామిషఞాలో పుట్టి పెరిగిన అలెక్సీకి ఆరుబయట పసించటమంటే ఏమిటో తెలియదు. ఇదే మొదటి అనుభవం. చలిమంట వేసుకోవాలని కూడా ఆతనికి తోచిందికాదంటే, ఆశ్చర్య పడవలసినవిషయంకాదు. అంతా చీకటిమయం. కాళ్ళు తెగతీపులు పెట్టుతున్నాయి. దగ్గరలో కనిపించే చితుకులను ఏరి తెచ్చుకోడానికి కూడా శక్తి లేకపోయింది. ఒక పైన్‌చెట్టు మ్రానును ఆనుకొని కూలిపోయాడు. ఎత్తిపెట్టిన మోకాళ్ళమీద తలనుమోపి, రెండుచేతులతో కాళ్ళను చుట్టవేసుకొన్నాడు. ఆలోచించడానికి కూడా శక్తిలేనట్టు ఆతని మనస్సు, సొమ్మసిలి ఆలోచనా శూన్యమయింది.

ఎటుపోయి ఎటువస్తుందో ఎవరికి తెలుసు? పిస్తోలును తీసి చేత్తోపట్టుకొన్నాడు. దాని నుపయోగించేటంత శక్తి తనలో లేదని అలెక్సీకి తెలుసు. బండనిద్ర పట్టింది కాబోలు. హోరున వీసుగాలీ, నిశిరేయి గుడ్లగూబల కూతలూ, తోడేళ్ల అరుపులూ, ఇవేవీ అతనికి వినిపించాయికావు.

ప్రొద్దుపొడిచీ పొడవటంతోటే ఎవరో లేపినట్టు నిద్ర మేల్కొన్నాడు. ఈ మసగవెలుతురులో చెట్లేవో, నీడ లేవో తెలియటంలేదు, నిర్మానుష్యమైన అంత పెద్ద అడవిలో రాత్రంతా నొంటరిగా గడపటం తలుచుకొంటే అతనికే ఆశ్చర్యం వేసింది, తన మొండిధైర్యానికి. చలిజ్వరం వచ్చినట్టు గజగజా వణుకుతున్నాడు. తొడుగుకొన్న మెత్తటి పరుపుకోటు చలిని ఆపలేకపోయింది. ఇక పాదాల సంగతా? ఒకటేబాధ. విపరీతమైన బాధ పెట్టుతున్నాయి. లేచి నిలబడడంసంగతి తలుచుకొంటేనే గుండె గుభేలుమన్నది. కాని కాలయాపనానికిది సమయం కాదుగా? నానాతిప్పలూపడి, ఎట్టాగో లేచి నిలబడ్డాడు.

ఉన్న బాధలన్నీ చాలవని కాబోలు. "నామాట పూర్తిగా మరిచిపోయావా?" అన్నట్లు క్షుద్బాధ ప్రశ్నించింది. గతదినం సర్పు శవాన్ని మంచులో పూడ్చిపెట్టేటప్పుడు ఎర్ర సిలువసంచీ – రెడ్‌క్రాస్ తిత్తి – ఒక టాతనికి చిక్కింది. ఏ అడవి జంతువో దాని నొకప్రక్క కొద్దిగా కొరికింది. మంచుమీద అక్కడా అక్కడా చిన్నరొట్టె ముక్క లాతని కంటబడ్డాయి. ఈ సంచీ తెరిచి చూసాడు. అందులో గాయాలకు కట్టుకట్టే కొన్ని బట్టలూ, కొన్ని ఉత్తరాలూ, మాంసపు ఊరగాయ డబ్బా వొకటీ, చిన్ని అద్దమూ కనిపించాయి. ఆ అద్దానికి వెనుకప్రక్క దీనాతిదీనంగా చూసే వొక అమ్మాయి పటంవున్నది. ఏ పక్షులో, లేక ఏ చిట్టెలుకలో తినివేయగా మిగిలిన ఒకటి రెండు రొట్టెతునకలా సంచిలో కనిపించాయి. "నీ ఋణం తీర్చుకోలేను, తల్లీ" అంటూ ఆ కట్టుబట్టలనూ, ఊరగాయ డబ్బానూ

తన జేబులలో భద్రపరిచాడు. చెట్టుకొమ్మల సందునుండి దబ్బపండు మాదిరి కనబడే సూర్యుని కభిముఖుడై తనప్రయాణం మొదలుపెట్టాడు. ఒక కిలోగ్రాము మాంసపు టూరగాయి తన చేతిక్కటంవల్ల ఎక్కడలేని సంతోషమూ, ధైర్యమూ అలెక్సీకు కలిగాయి. ప్రతిరోజూ సరిగ్గా మధ్యాహ్న సమయమవ్వగానే వూర మాంసపుముక్క వంతున తినడానికి నిశ్చయించుకొన్నాడు, నాలుక పీక్కుపోయినా సరే, అంతకంటె రవంతకూడా ఎక్కువ తిననని శపథం చేసుకొన్నాడు, తిరిగి నలుగురిలోనూ పడటానికి కెన్నిరోజులు తానీవిధంగా బ్రతకాలో, ఎవరు చెప్పగలరు ?

# 5

మనస్సుకేదన్నా వొక పనిని కలిపిస్తేనేకాని కాళ్ళ నొప్పులను మరిచిపోవటానికి వీలుండదు. రోజుకు తానెన్ని మైళ్ల చొప్పున నడవవచ్చు ? ఎన్ని రోజుల్లో రష్యను విమానాశ్రయాన్ని చేరవచ్చు ? అనే లెక్కలు వేస్తూ నడకసాగించాడు. రోజుకు పదీ, పన్డ్రెండు కిలో మీటర్ల వంతు నడిస్తే మూడూ, తప్పితే రూఢిగా నాలుగురోజుల్లో చేరుకోవచ్చు. "రోజుకు పది కిలో మీటర్లు నడవటమేమంత బ్రహ్మాండమైన కార్యంగనుక ? కిలోమీటరుకు రెండు వేల అంగలు: పది కిలోమీటర్లూ, ఇరవై వేల అంగలు ఇంతేగా ?" అని అనుకొన్నాడు, ఐదారు వందల అంగలు నడిచాక, బహుశః కొంచెంగా విశ్రమించవలసి వుంటుందేమొ ?

ఇంతకు క్రితంరోజు దగ్గిరిగా కనిపించే ఏ చెట్టునో, లేక ఏ పొదనో గురిగా పెట్టుకొని, దానిని చేరేటంతవరకూ నడిచాడు. చేరాక రవంత విశ్రాంతి తిరిగీ వెంటనే నడకా. నేడు ఇన్నిన్ని అంగలంటూ లెక్కపెట్టుకొని కాలు సాగించాడు, వేయి అంగలు అంటే అరకిలో మీటరు నడవటమూ, ఐదంటే అయిదే నిమిషాలు ఆగటమూ, వెంటనే బయలుదేరటమూ; ఈ విధంగా చేయాలని తీర్మానించాడు. ఇదేమాదిరి నడిస్తే, చీకటి పడేలోగా పది కిలోమీటర్ల దూరం తప్పకుండా వెళ్ళవచ్చు.

కూర్చుని కబుర్లు చెప్పేవారికి పనిపాటుల కష్టం తెలియదంటారు! లెక్కించుకొంటూ ఐదువందల అంగలు లెక్కపెట్టి నడిచాడు....ఆ మీదట లెక్క పెట్టలేకపోయాడు. కాళ్ళు అంత విపరీతమైన బాధపెట్టాయి. ఏదో ఒక విధంగా వేయి అంగలూ పూర్తిచేసాడు. నిలుచోలేక మంచుమీద బోర్లపడ్డాడు. నుసరూ

చెక్కుళ్ళూ కణతలూ; వీటిని మంచుమీద పెట్టి ప్రదే పదే అదిమాడు. తనివితీరా కుక్కమాదిరి నాలుకతో మంచును నాకాడు ఆ చల్లదనానికి పోయిన ప్రాణం వచ్చి నట్టనిపించింది.

గడియారాన్ని చూస్తే, ఐదు నిమిషాలూ అయిపోవస్తున్నాయి ? నిర్దాక్షిణ్యంగా పరుగెత్తివెళ్ళే సెకండ్ల ముల్లును రెప్పవాల్చకుండా చూసాడు అది సరీగ్గా పండ్రెండు దగ్గిరికిరాగానే చివాలునలేచి నిలుచున్నాడు. భరించలేనంతబాధ పెట్టుతున్నాయి కాళ్లు. కాని నడక మొదలు పెట్టాడు తిరిగీ.

మధ్యాహ్నమయింది. చెట్ల కొమ్మల సందునుండిపడే ఎండపొడకు మంచు కరిగి ఆవిరిపొగలు లేచాయి. పైన్ వృక్షాల రోజిజావాసన అడవంతా క్రమ్ముకొన్నది. అప్పటికప్పుడే నాలుగు మజిలీల ప్రయాణం పూర్తిఅయింది. నిలుచోలేక నేలమీద పడిపోయాడు. దగ్గిరలో చేతికందేటంత దూరంలో పడిపోయిన ఒక పైజాచెట్టు కనిపించింది. ఎట్లాగయినా ఆ చెట్టును చేరుకోవాలని ఎంతో ఆశించాడు. కాని వీలులేకపోయింది. అలసటా, ఆకలీ, ఆలోచనా, సాలోచనా, ఒక్కటీ అతనికి తెలిసాయికావు. కండ్లు తెరచుకొనే వున్నాయికాని, అతనికేదీ కనిపించిందికాదు. చెవులు వినలేకపోయాయి శూన్యం. యావత్ప్రపంచమూ, మైమరచి నిద్రపోతున్నదనిపించింది, అలెక్సీకి.

బాగా ఇంతగాలి పీల్చాడు. గుప్పెడుమంచును తీసుకొని కరకరా నమిలాడు. అప్పటికిగాని తెలివివచ్చిందికాదు. జేబులోనున్న మాసంపుటూరగాయముక్కనొకటి నోటిలోవేసుకొన్నాడు. గబుక్కున మ్రింగాలని ఆశ; కాని అది మ్రింగుడు పడితేగా ? నోటి వేడికి దానిపైనున్న క్రొవ్వుకరిగి నూనె కారింది. అది జిహ్వకు తగలీ తగలటంతో వేయిశిఖల జఠరాగ్ని మిన్నుముట్టుతూ లేచింది. ఊరగాయ డబ్బాను ఖాళీచేయాలన్నంత వెర్రి ఆకలి పుట్టింది. కాని, ఎట్లాగో తన్నుతానే జయించుకొని, ఏదీతోచక మంచుగడ్డముక్కలను కొరికి తినటం మొదలుపెట్టాడు. ఏదోవొకటి నమిలితింటేనేగాని తిండిభ్రమతీరేటట్టు లాతనికి తోచిందికాదు, పాపం !

ఒక జూనిపర్ కొమ్మను నరికి దానినుండి రెండు చేతికర్రలు చెక్కాడు. వాటిపై బరువునంతామోపి, తిరిగీ నడక ప్రారంభించాడు.

## ౬

రెండు రోజులుగడిచి, ఇది మూడోరోజు. ఇంతవరకూ మచ్చుకైనా మనిషి అన్నవాడగుపించలేదు.

నిద్ర మేల్కొనేటప్పటికి ప్రొద్దుపొడిచింది. దేహమంతా పెనం మాదిరి కాలిపోతోంది. తీవ్రమైన జ్వరం. తన జేబులో సిగరెట్‌లను వెలిగించే చిన్న డబ్బావున్నదనిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఇంతకుముందే ఇది జ్ఞాపకానికి రానందుకు చింతించాడు. చక్కని చలిమంట వేసుకోడానికి అవకాశముండీ కూడా చలిలో యిన్ని రాత్రులు గడిపాడు. జడలమాదిరి నాచు పెరిగిన కొన్ని ఎండు కట్టెలను విరిచి, వాటిమీద రెండు దోసెళ్ళ ఎండుటాకులు కప్పాడు. మంట వేశాడు. పైన్ కొమ్మల ఘాటు వాసనల పొగ నల్దిక్కులా అలుముకొన్నది. చిటపటలాడే మంట దగ్గిరగా కూర్చుని ఒడలు కాచుకొంటూంటే ఎంతో హాయిగా వున్నదాతనికి.

కోటు జేబునుండి కొన్ని వుత్తరాలు తీశాడు. అన్నీ ఎవరో ఒక మనిషే వ్రాసినట్టున్నాయి. ఒకే దస్తూరి. ఒక జాబులో సన్నని ఉల్లిపొర కాగితంలో చుట్టబడిన దొక ఫొటో వున్నది. మెత్తని గడ్డి పెరిగిన కాలువగట్టున కూర్చుని వున్న ఒక బాలిక ఫోటో అది. రెప్ప వాల్చకుండా దాని వంక చూస్తూ మరో ప్రపంచంలో నున్నట్టు అగుపించాడు, అలెక్సీ. బహు జాగ్రత్తగా దానిని తిరిగి అదే కాగితంలో చుట్టి జాబులో మడతపెట్టి జేబులో భద్రపరచుకున్నాడు.

"ఫరవాలేదు, వచ్చిన భయమేదీ లేదు. అంతా సలక్షణంగా ముగిసి పోతుంద"ని అన్న మాటలు, ఆ అమ్మాయి నుద్దేశించి అన్నాడా ? లేక తనకు తానే ధైర్యం చెప్పుకోడానికా ? ఎవరికి తెలుసు ? "ఫరవాలేదు....ఏమీ ఫరవాలేదని" యింకోసారి మరింత దృఢంగా అన్నాడు, అలెక్సీ.

బూట్లూడదీసి పాదాలకు చుట్టిన బట్టలు లాగిపారేసి, పాదాలవంక చూశాడు. అబ్బా ! యెంత వుబ్బిపోయాయి ! ఒకదానికొకటి సంబంధం లేనట్టు వ్రేళ్లు దూర దూరంగా నిలబడ్డాయి. పాదాలను తాకితే, బాగా గాలి పూరించిన రబ్బరు బంతిని తాకినట్లని కనిపించాయి. నిన్నటికంటే నేడు మరీ కమిలిపోయాయి, రెండుపాదాలూ.

మంట ఆరిపోజొచ్చింది. వదలలేక, వదలలేక అక్కడినుంచి లేచి తిరిగి ప్రయాణం మొదలుపెట్టాడు. అతని చేతి కర్రలూనినతావుల్లోని మంచు, అద్దం పగిలినట్టు బీట్లువారింది. స్పృహతప్పి పడిపోకుండా వుండాలని కొంత దూరం నడిచి, ఆగి, మరీ వెడుతున్నాడు. అడవిలో వినబడే రకరకాల శబ్దాలూ ఏయే జంతువులు చేస్తున్నయో పోల్చుకొనటం అతనికిప్పుడు తెలిసింది.

కాని ఏదో వొక విచిత్ర శబ్దమాతని చెవుల బడింది. మొదట్లో దానిని పోల్చు కొనటం కష్టమయింది. కాని అదిమోటారు కారుల ఇంజను శబ్దమని తెలియగానే లెక్కలేని భయమూ పుట్టుకువచ్చింది. ఎవరో జర్మనీవారు కాబోలు ! ఆదారినే వస్తూన్నట్టున్నారు !!

తలా, కాళ్ళూ తెగబాధగానున్నాయి. కాని వాటి మంచి చెడ్డలాలో చించ కాని కిదా సమయం ? చకచకానడిచి, బాటకంత దూరంలోనున్న వొక పొదవెనుక నాక్కొన్నాడు. కూర్చుంటే వారికంట పడిపోవచ్చు. జివ్వున లాక్కుపోయే ఆ మంచు నేలమీద బోర్లాపడుకొని, బాటకు రెండు కండ్లూ వప్పగించి చూస్తూ న్నాడు. అప్పటి కప్పుడే సూర్యుడు నడినెత్తికి వచ్చాడు.

శబ్దం దగ్గిరికివచ్చేస్తోంది. అతని కాలిజాడలా మంచుమీద స్పష్టంగా కని పిస్తున్నాయి. కాని ఏదిచేయడానికీ వీలుకాని సమయమది. గోడమీద బల్లిమాదిరి, నేలకంట కరుచుకుపోయాడు. ఆకుల సందునుండి, తెల్లటి కారొకటి, మంచు తరంగములున్నది, కనిపించింది. పెద్ద శబ్దంచేస్తూ, నేలనంతా కంపింపజేస్తూ అలెక్సీలు నక్కొనిన పొదచెంతగా ఆ కారు వెళ్ళింది. దాని తరువాత పెద్ద సైనిక లారీ వొకటివచ్చింది. దాని డ్రైవరు ప్రక్కన చలిటోపీ తొడుగుకున్న మనిషి, కూర్చి పొడగరి ఒకడు పక్కంమీద తలివాల్చి కూర్చున్నాడు. వెనకాల ఉక్కుటోపీలు ధరించిన పది, పదిహేనుగురు సిపాయిలు బల్లలమీద కూర్చున్నారు. అది వెళ్ళిన అయిదారు నిమిషాల కింకొక పెద్ద ట్రక్కు, వచ్చింది, దానినిండా జర్మను సైనికులున్నారు.

భూమినంతా గజగజలాడించి, వేడిపొగను అలెక్సీలు ముఖంమీదికి ఊదు కొంటూ అవి వెళ్ళిపోయాయి. క్రమంగా వాటి శబ్దం తగ్గిపోయింది. ఉక్కుమాదిరి బిగదీసుకుపోయిన కండలు, అలెక్సీలును త్వరగా లేవనిచ్చాయికావు.

ఆ ట్రక్కుల చక్రాల చాలుమీదే నడుస్తూ తూర్పు దిక్కుగా పో నారంభిం చాడు, అలెక్సీలు. కొంత దూరం నడవటమూ, విశ్రాంతీ, తిరిగీ నడకా, విశ్రాంతీ, ఈవిధంగా సాగివెడుతున్నాడు. ఎంత ఆకలివేసినా, రోజు కొక్క మాంసపు ముక్కకంటె యెక్కువ తిని యెరుగడు. అడుగడుగుకూ యిటూ అటూ పరిశీలించటమూ, రెండు చెవులూ వప్పగించి వినటమూ, అతన్ని చూస్తే ఏదో అడవిజంతువు మాదిరి కనిపించాడు.

తన జీవితమంతా విమానాలలో, జర్మనులతో పోరుసల్పుతూ గడిపిన అలెక్సీలుకి, నేలమీద వెళ్ళే జర్మనులను చూడట మిదే మొదటిసారి. వారి అడుగు జాడల నంటిపెట్టి నేడు తాను వెళ్ళటం తలుచుకొంటే ఆతనికి నవ్వువచ్చింది. జర్మనులు దేశాన్ని జయించగలిగారేకాని, మానవ హృదయాలను తమ వైపుకు త్రిప్పుకోలేకపోయారు. వారి కెవ్వరూ యెటువంటి చేయూతా నిచ్చారుకారు. నిర్మా

నుష్యమైన యీ అడవిలో వెళ్ళేటప్పుడు కూడా వారికి ఏక్షిక భటులూ, ఫిరంగులూ అవుసరమయ్యాయి. దీనినిబట్టి వా రెంత దిగులుపడిపోయారో. వారంటే ప్రజల కెంత చెడ్డ అసహ్యామో విదితమవుతుంది.

"ఫర్వాలేదు అంతా సలక్షణంగా ముగిసిపోతుంది." అని అలెక్సి తిరిగీ తనకు తానే ధైర్యం చెప్పుకొన్నాడు. వాటి దుంపతెగా, కాళ్లు తెగ వేధించుకు తింటున్నాయి. రాను రాను తన బలం క్షీణించిపోతోందన్నే భయం అతని మన స్సులో మొదటిసారిగా పొడసూపింది. వెర్రి ఆకలి ఏదో వొకటి నమిలి తినాలనే కాంక్ష. బర్చిచెట్ల బెరడునూ. పర్‌వృక్షపు టాకు మొగ్గలనూ నమిలి నమిలి ఉమి శాడు. దహించుకుపోయే కడుపు నీ విధంగా మరిపించి. మోసగించాలని అను కొన్నాడేకాని. అదేమీ అంత వెర్రిబాగులది కాదుగా?

సూర్యాస్తమయ సమయానికి అయిదు మజిలీలు ముగించాడు. సగం హరించిపోయిన బర్చిమ్రా నొకటి, నేలమీద పడిపోయింది, అతని కంటబడింది. ఇన్ని చితుకులూ, ఎండుటాకులూ తెచ్చి దాని కొక చివర కుప్పగా పేర్చాడు; మంట చేసాడు. దాని వెలుతురుకూ, వెచ్చదనానికీ ఆయన కెక్కడలేని మనశ్శాంతి కలిగింది. నేలమీద పడుకొని ప్రక్కలకు పత్తిగిలుతూ ఒడలంతా తప్పెటను కాచినట్టు కాచుకొన్నాడు. మంట ఆరిపోకుండా అప్పుడపు డా మంటలో యిన్ని ఆకులూ, చితుకులూ వేశాడు.

నడిరేయిని మంచు తుఫాను వచ్చి మీదపడింది. కిర్రు. కిర్రు మంటూ పైనువృక్షాలు ఉద్రూత లూగాయి. తమ చేతి కందిన దానినల్లా సూదిపోట్లుపొడిచే మంచు స్ఫటికాలు మంటలో వచ్చిపడి. చుర్రు చుర్రు మంటూ ఆవిరై పోయాయి. ఆ మంట పుణ్యమా అని యిదంతా ఏమాత్రం కూడా తెలియనంత బండనిద్ర పోయా డా రాత్రి, అలెక్సి.

ఆ మంటనుచూసి భయపడి వన్యమృగా లా ప్రక్కకే వచ్చాయికావు. జర్మను లెవరన్నా వస్తారేమో అనే భయ మాతనికి కలగలేదు. వారికంత ధైర్యం లేదని అలెక్సీకు తెలుసు. తెల్లవారుతోం దనగా మెళుకువ వచ్చింది. మంచు తుపాను నిలిచింది. నల్దిక్కులా పొగమంచు కమ్ముకొన్నది. వృక్షశాఖల్లోని గాలి తరంగాలపై తేలుతూ తుపాకుల ప్రేలుడూ, ఫిరంగుల గర్జనలూ వినబడ్డాయి. ఎక్కడో యుద్ధం జరుగుతోంది.

"యుద్ధభూమి యింత దగ్గిరిలో వున్నదా? మూడు రోజుల్లో నే నింత దూరం నడిచానా? లేక కలగంటున్నానా?" అని ఆశ్చర్యపడ్డాడు.

# 7

బాగా తెల్లవారింది. రాత్రి పడిన మంచుకూ, వీచిన గాలికీ శుభ్రంగా తోమి కడిగినట్టు చెట్లన్నీ నిగనిగా మెరిసిపోతున్నాయి. వసంతకాలం రానున్నదని పక్షులన్నీ గుంపులుగా కూడి చెప్పుకొంటున్నాయి ఎంతో శ్రద్ధగా విన్నాడు, కాని అంతకుముందు వినబడిన తుపాకులూ, ఫిరంగులూ ఒక్కటికూడా వినిపించలేదు. మతిభ్రాంతి కాబోలు !

కొమ్మలనుండి కరిగినమంచు, టపటపా వానచినుకుల్లాగా పడనారంభించింది. "చలినిన్ను పులిమ్రింగిపోనూ, ఎండబావతోచెప్పి కొట్టించుతానూ" అంటూ చిందులు త్రొక్కుతూ వచ్చేవసంత కన్యాగాన మాతని చెవుల బడినట్లనిపించింది, అలెక్సికి.

మిగిలిన మాంసపుతునకల నన్నిటినీ తినేద్దామని అలెక్సికి.వెఱ్ఱి ఆవేశం పుట్టింది. ఏదన్నా ఇంత తింటేనేకాని ఒక్క అడుగయినా వేయటం తన వల్లకాదని అతనికి తోచింది. అనుకోటమే తరువాయిగా కడుపారాతిని, డబ్బాను వ్రేలితో తుడిచేశాడు, దాని కరుకుటంచులు గ్రుచ్చుకొని రక్తం కారింది. ఇంకా ఇంత ఊరగాయ ఊటా, క్రొవ్వూ అడుగున బిగుసుకుపోయి, ఎంతయత్నించినా బైట పడ్డాయికావు. ఇంతమంచును డబ్బాలోవేసి, వెచ్చని బూడిదమీదపెట్టాడు. బాగా కరిగాక, వేడివేడి ఆ నీటిని, ఒక్క చుక్కయినా మిగల్చకుండా త్రాగాడు. రోజులు బాగుంటే, ఆ డబ్బాలో టీ కాచుకోవచ్చు, అట్టి శుభదినం రాకపోతుందా ? ఎందు కయినా మంచిదనుకొని దానిని చొక్కాజేబులో భద్రంగా దాచుకొన్నాడు.

టీ మాట జ్ఞప్తికివచ్చేసరికి ఎక్కడలేని ఆశాపుట్టుకువచ్చింది. "తిరిగి, ఈ జన్మలో టీని త్రాగేభాగ్యం వున్నదో, లేదో!" అనుకొంటూ ఎంతో వాపోయాడు, పాపం.

తిరిగి వెళ్ళడానికని లేచినిలబడ్డాడు. రాత్రిపడినమంచును దాటి, తెన్నూ కనిపించటంలేదు, వెలుతురుపడి మెరిసేమంచు నాతనికండ్లు చూడలేకపోయాయి. దించుకుపోయే పాదాలను మంచునుండి పెకలించటానికీ శక్తి చాలిందికాదు. చేతి కర్రలు మంచులో బాగా కూరుకుపోవటంవల్ల, అవికూడా ఎందుకూ పనికిరాలేక పోయాయి.

మిట్టమధ్యాహ్నానికి పదిహేనువందల అంగలు మాత్రమే వెళ్ళగలిగాడు. ఇంకొక అడుగయినా వేయట మాతనికి చేతనయిందికాదు. తల గిర్రునతిరిగి, కాళ్ళు పట్టుతప్పి క్రింద పడటమూ, చెక్కిళ్ళనూ, నొసటినీ చల్లని మంచుకు పదే పదే అదిమి యింత సేదతీర్చుకొనటమూ ! ఈ విధంగా ఎన్ని పర్యాయములు చేసాడో అతనికే తెలియదు. ఉన్నవాడల్లా వున్నట్టే అక్కడే పడుకొని నిద్ర

పోవాలని ఆతనికి బుద్ధిపుట్టింది. ప్రపంచాన్ని, తన్ను తానే మరిచిపోయి చీకూ, చింతా లేని నిద్రపోవాలని తోచింది! ఒక్క అడుగయినా ముందుకు పెట్టలేక పోయాడు. మనస్సు మొద్దుబారిపోయింది. కాళ్లు తేలిపోతున్నాయి. గట్టిగా పండ్లతో పెదవుల నదిమి, కటుచుకొంటేనే కాని స్మారకం కలిగింది బాధు. కా శ్శీడ్చుకొంటూ పది, పంద్రెండుగజాల దూరం వెళ్లాడు.

అంతే! అటుపైన ఎంత ప్రాణంమీదికి వచ్చినాసరే, ఇం కొక అడుగయినా పెట్టడానికి శక్తిలేదని అనిపించింది, నేలమీద చతికిల బడా లనిపించింది. కాని కూర్చుంటే తిరిగీ లేవగలశక్తి తనలో లేదని తెలుసు. అటూ ఇటూ దేనినో వెతుకుతూన్నట్టు చూసాడు. దగ్గిరలో ఒక పైన్‌చెట్టు కనిపించింది. నానా అగచాట్లూపడి, ఏదో వొక విధంగా దానిని చేరాడు. దాని కానుకొని, పలవచీలిన ఒక కొమ్మకు గడ్డము నానించి దానిపైకి ఒరిగాడు. ఆ విధంగా యెంతసేపు నిలబడ్డాడో అతనికే తెలియదు. బరువంతా గడ్డంమీద మోపబట్టి కాళ్లు కొంత తేలిక పడ్డాయి. మంచునుండి వాటిని పెకలించడానికి వీలయింది.

అతని కొక ఆలోచన చటుక్కున పుట్టింది. పలవచీలిన ఆ పైన్ కొమ్మను కోసి దాని పలవలో గడ్డము నానించి, జరుపుకుంటూ వెడితే కాళ్ళమీద బరువు పడదు. కాళ్ళబాధ దుర్భరంగా నున్నదిగా? ఇది మంచి వుపాయం అనుకొన్నాడు. సాధారణంగా నడిచివెళ్లేటంత త్వరగా వెళ్ళడానికి వీలులేకపోవచ్చు. కాని నడవటమే దుస్సాధ్యమయినపుడు, ఆలస్యమైతేనేమి? ఏదో ఒక విధంగా యీ అడవినుండి బయటపడితే చాలు.

బాకుతో ఆ పైన్ కొమ్మను సరికి పలవ చీలినచోట మూరెడేసి పదిలి ఆ రెండు కొమ్మలనూ కోసి పారేశాడు. తన చేతిరుమాలునూ మెడపట్టేలో మిగిలిన పీలికనూ పలవకు మెత్తగా చుట్టి. ఆ కట్టెను అంత దూరాన నేలపై నానించాడు. ముందుకు వంగి పలవలో తన గడ్డం చేర్చి సునాయాసంగా రెండు కాళ్ళనూ ఒక్కమారు లేవనెత్తి ముందుకు తెచ్చి భూమిపై నిలబడ్డాడు. తిరిగీ కట్టెను ముందుకు జరిపిపెట్టి వెనుకటిమాదిరే కాళ్ళను జరిపి యీవిధంగా వెళ్ళజొచ్చాడు.

తెల్లటి మంచుమీద యీవిధంగా వెళ్ళే అతన్ని చూస్తే ఏదోవొక విచిత్రపు జంతువుమాదిరి కనిపించాడేకాని, మనిషివలెకాదు. ఈవిధంగా ఎంత నడిచినా రోజుకు ఐదు కిలోమీటర్లకంటె ఎక్కువ వెళ్ళలేకపోయాడు. మొదట్లో రాబిన్ పిట్టలీ ఆకారాన్ని చూచి తుర్రున ఎగిరిపోయాయి. పిదప నిర్భయంగా అతని చెంత నేలమీద వ్రాలి! తోక లెత్తిపెట్టి తలలొక ప్రక్కకు వంకించి నల్లటి గాజుపూసల్లాంటి తమ కండ్లు వప్పగించి యీ కొత్తజంతు వేదో పోల్చుకోడానికి యత్నించాయి!

# 8

ఈవిధంగా రెండు రోజులు గడిచాయి. కాళ్లు పూర్తిగా మొద్దుబారాయి, కాని వడలంతా పచ్చి పుండయిపోయినట్టు ఒక్కటేబాధ. ఆకలి వేయడానికి బదులు కడుపులో యేదో పెద్ద రాయి పడ్డట్టు బరువుగా తోచింది. జీర్ణకోశపు ప్రక్క ఒకదాని కొకటి అంటుకుపోయి దాని కండలన్నీ బిగదీసుకొని కొయ్య బారాయా యని అతనికి తోచింది, మధ్య మధ్య కత్తిపోట్లు పొడిచినట్టు చెప్పనలవికాని బాధ.

బర్చిచెట్ల బెరడూ, పైన్, నిమ్మచెట్లు, ఆకు మొగ్గలూ తప్ప అతని కచ్చట తినడాని కేదీ కనిపించిందికాదు. మంచు అడుగున పెరిగే నాచుమొక్కలను తోట కూర మాదిరి నీటిలో ఉడకబెట్టి తిన్నాడు. ఆకు, మొగ్గల మరగకాచి, ఆ నీటిని త్రాగినప్పుడల్లా "టీ" త్రాగుతున్నా ననుకొని తృప్తిచెందేవాడు. నిజమైన టీ కూడా అంత రుచికరంగా నుండదని అతనికితోచింది. సేదతీర్చుకొని, ఇంత 'టీ' త్రాగి, ఎక్కడలేని బలం పచ్చినట్టు వెంటనే లేచి నడక ప్రారంభించేవాడు.

ఆనాటిరాత్రి వొకపెద్దఫర్ వృక్షంక్రింద మకాం వేశాడు. దగ్గరలో ఎప్పుడో విరిగి ఎండిపోయిన ఫర్ద్రుమానొకటి కంటబడింది, దానికి నిప్పు అంటించి, ఆ చలి మంటచెంత వెచ్చగా ఆరాత్రంతా ఒడలు తెలయని నిద్రపోయాడు. తెల్లవారింది. ఇంకా నిద్రమత్తుతో పడుకొనివున్నా ఆలెక్సీలుమీద పైనుండి రెండు ఫర్ చెట్టు కాయలు పడ్డాయి. వాటినొక ఉడతపడేసింది. ఈ కాయిల్లో దాని కేదోతినడానికి ఉన్నది. తానూ ఉడతతినే పప్పులను తినరాదా ? ఇన్ని పైన్ కాయలను కాలే నిప్పుల్లోవేసాడు. చిటపటలాడి అవి పగుళ్ళుచూపాయి. చిన్న పప్పుబద్దలు వాటి నుండి రాలాయి. ఘాటువాసనలేస్తూ ఎంతోరుచిగా నున్నాయి, ఆపప్పులు.

రెండుదోసెళ్ళ కాయలనుతెచ్చి, మొక్కజొన్న కండెలుకాల్చినట్టు కాల్చి వాటిలోనుండే పప్పుబద్దలనురాలగొట్టాడు. వాటిపైనుండే పొట్టునూది ఆ పప్పుల తింటూ, పంచభక్ష్య పరమాన్నపు విందారగించినట్టు మురిసిపోయాడు.

కాలే పైన్ ద్రుమాను నుండిలేచిన ఘాటువాసనలపొగ నలుదిక్కులా వ్యాపించింది, చక్కని ధూపంవేసినట్టు. తన చిన్నతనంలో జరిగిన సంఘటనవొకటి అతనికి జ్ఞప్తికి వచ్చింది. ఇంటి కప్పునుండి వ్రేలాడే దీపమూ, దానిక్రిందనొక పెద్దబల్లా. అప్పుడే చర్చీనుండి ఇంటికివచ్చిన తమ తల్లిచేతిలో నొక కాగితపుపొట్లమున్నది. దానినిండా సీడర్ గింజలున్నాయి, తల్లి వాటినన్నిటినీ బల్లమీద గుమ్మరించింది. వాళ్ళఅమ్మా, అమ్మమ్మా, తన ఇద్దరుఅన్నలూ, తానూ చేతినిండా ఇన్ని గింజలు తీసుకొని ఒలుస్తూకూర్చుంటారు. చిన్నవాళ్ళంతా కాయలను పంటిక్రిందనొక్కి పగులగొట్టితే,

అమ్మా, అమ్మమ్మా తలకు గ్రుచ్చుకొనేపిన్నులతో బహుచమత్కారంగా ఒలుస్తారు. ఒలిచిన పప్పులన్నీ బల్లమీద కుప్పగావుంటాయి. తల్లి, బాగా, ఇన్ని పప్పులు తీసుకొని, పిల్లలు వొక్కొకరి నోటినిండుగా కుక్కుతుంది. ఇదంతా అలెక్సీలు కిపుడు జ్ఞాపకానికివచ్చింది.

కామిషన్ - తాను పుట్టిపెరిగిన పూరు!....ఆ చిన్నతనపు రోజు లెంత ఆనందంగానుండేవో!....ఊరు వెలుపల చక్కని తోటలో నొక చిన్న యిల్లు. అదే వాళ్ళ గృహం!....ఆ రోజులు తిరిగీ వస్తాయా?....చలిమంటకు ముఖం కాలిపోతోందే కాని, వీపు చలికి గజగజ వణికిపోతోంది! ఎక్కడో గుడ్లగూబలు కూస్తున్నాయి. నక్కల కూతలు దగ్గరగా వినిపిస్తున్నాయి. ఆరిపోయే మంట చెంత, ఇంత బ్రహ్మాండపు టరణ్యంలోనూ, ఒక్కడే వొక మనిషి....ఆకలి.... అలసట....తిరిగీ చిన్నతనపు రోజులవంటివి వస్తాయా?

"ఫరవాలేదు!....అంతా సలక్షణంగా ముగిసిపోతుంది!! తనకు తానే ధైర్యం చెప్పుకొన్నాడు, లేచి నిలబడ్డాడు .. ఎందుకో చిరున వ్వాతని పెదవులపై రవంత తొణికిసలాడింది....ఏది జ్ఞాపకానికి వచ్చిందో?....చలికి బిగదీసుకొని, చీలిన పెదవులు చుర్రున మండినంత నొప్పి పెట్టాయి. నవ్వడానికి కూడా తాను నోచుకోలేదు కాబోలు నని ఆతనికి అనిపించింది.

# 9

అంతకుముందు వినబడిన యుద్ధశబ్దాలన్నీ ఎక్కడినుంచి వచ్చాయో, నేడు ఏడో రోజు, ఆతనికి విశదమయింది. ఎండపడి కరిగిన మంచుతిప్పలనుండి పాము మెలికలు తిరుగుతూ నీరు పారజొచ్చింది. వీసే గాలిబలానికి మంచు చెదిరి, మిట్టలు పల్లాలుగానూ, పల్లాలు మిట్టలుగానూ మారిపోతున్నాయి. చెట్ల కొమ్మల సందునుండి వెచ్చవెచ్చగా ఎండ పడుతోంది. సాయింత్రసమయ మపుడు కాకులన్నీ గుమిగూడి ఆనాటి సంగతులు తెగచెప్పుకొంటున్నాయి. కరిగే మంచు నుండి లేచే నీటి ఆవిరి తీయటి మట్టివాసన కొట్టుతోంది. చలికాలం వెనకబడి పోయింది, వసంతాగమనసమయ మిది అని వేనోళ్ళా సృష్టి పలుకుతోంది.

ఈ వసంతాగమ మాతని కెక్కడలేని ఆనందాన్ని కలిగించింది. ఆకలితో అటమటిల్లుతూ, సొమ్మసిల్లిపోతూ, కరిగిన మంచులో బరువుగా పాదా లీడ్చు కొంటూ వెళ్ళే అలెక్సిలుకు మట్టివాసన తగిలి అదొక విధమయిన నిషా కలిగింది.

పలవక్రి మాతగోని, ఈలుతూ తప్పటడుగులు వేస్తూ వర్ణనాతీతమైన ఆనందపరవశుడైనట్టు తూర్పుదిశాభిముఖుడై నడిచిపోతున్నాడు.

ఉన్నట్లుండీ ఆ బాట యెడమప్రక్కకు తిరిగింది. అంత దూరాన బాట కిరుప్రక్కలా అంటిపెట్టుకొని దట్టంగా పైన్ చెట్లు మొలిశాయి. బాట చాలా యిరుకుగా నున్నచోట కొద్ది దినాల క్రితం తన్ను దాటివెళ్ళిన మోటారు ట్రక్కులు కనపడ్డాయి. దారి కడ్డంగా పడివున్న పెద్ద పైన్ మ్రానుల నవి తాకి బోల్తాకొట్టాయి, చక్రాల రబ్బరు పూర్తిగా కాలిపోయింది. చక్రాలు తుప్పుపట్టాయి. ఒకదాని చెంత మూడు శవాలు. ఇదే ముందుగా వెళ్ళిన పెద్ద తెల్లటి కారు.

మిగతా రెండు లారీలూ దాని కంత దూరంగా నిలబడి వున్నాయి. లోపలి భాగాలన్నీ కాలిపోయి పూర్తిగా తుప్పుపట్టాయి. వాటినుండి వెలువడిన డీజల్ నూనె పొగను కరిగిన మంచు పరక్కాయ సిరామాదిరి కాలువలుకట్టింది. వాటి క్రిందా, వాటి కిరుప్రక్కలా నేలమీదా, దాపున గల పొదలలోనూ జర్మను శవాలు. ఎవరో అకస్మాత్తుగా వచ్చి యీ జర్మనులపై బడ్డారు. వారినుండి తప్పించుకోడాని కిటూ అటూ పరుగులిడి, ఎక్కడివారక్కడే మడిసిపోయారు. వచ్చిన శత్రువెవ్వరో యెక్కడినుండి దిగివచ్చాడో అనేది తెలుసుకొనేలోగానే వారి ప్రాణాల నా శత్రువు తీశాడు. అ దళాధికారి శవాన్నొక చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టారు. అతని చొక్కా మెడపట్టీకొక కాగితం గ్రుచ్చారు. దానిమీద "తగిన శిక్ష" అని వ్రాయబడివున్నది. పై అక్షరాల క్రింద ఎవరో "మాదిగ కుక్క" అని వ్రాశారు.

ఏదన్నా తినడానికి దొరుకుతుందేమోనని, అలెక్సి ఆ ప్రదేశాన్నంతా గాలించాడు. నలుగురి పాదాల క్రిందా నలిగి పక్షులు పీక్కొని తినగా మిగిలిన దింత రొట్టె తునక ఒకటి కనిపించింది. అందులో ఏవంత తుంచి నోట్లో వేసుకొన్నాడు. దాని పులుపువాసనకు పోయిన ప్రాణం లేచివచ్చింది. ఒకేమారు దానినంతా నోట్లో వేసుకొని నమిలి తినాలని అనుకొన్నాడు. కాని మనస్సును దిట్ట పర్చుకొని దానిని మూడు ముక్కలు చేశాడు. వాటిలో రెంటింటిని పాంటు జేబులో దాచేశాడు, మిగిలిన ముక్కను చిన్న చిన్న తునకలుగా తుంచి నోటిలో వేసుకొని పెప్పరమింట్ బిళ్ళలమాదిరి ఎక్కడ అయిపోతాయో అని దిగులు పడుతూ, చప్పరించాడేకాని, నమిలి మ్రింగడానికి మనస్సు వెనుకంజవేసింది.

ఆ ప్రదేశాన్నంతా కలయజూసాడు. ఎన్నో అడుగుజాడ లగుపించాయి. ఇవన్నీ మనవాళ్ల పాదగుర్తులే, మనవాళ్లే ఈ కారులకడ్డంగా మ్రానుపడేసి. జర్మనుల చంపారు. ఇంకా ఈ పొదల్లో ఎక్కడన్నా దాక్కొని ఉంటే వుండవచ్చు "అని అతడనుకొన్నాడు, ఒకవేళ ఆ శవాలమధ్య సంచరించే ఈ మనిషి ఎవ్వరాఅని వారు ఏ చెట్టుకొమ్మల్లోనో కూర్చొని చూస్తున్నారేమో ? "ఒహోయ్ ! ఎవరక్కడా" అని గట్టిగా అరిచాడు అలెక్సి. అతనికాశ్చర్యంవేసింది. ఎంతో బిగ్గరగా అరచా

నని అనుకొన్నాడు. కాని అతని కంఠమే అతనికి సరిగ్గా వినిపించింది కాదు! తానంతగా బలహీనపడిపోయాడని ఇప్పుడుకాని అతనికి తెలిసిందికాదు.

నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో, శవాలమధ్య ఒంటరిగాకూర్చుని, "ఎవరక్కడ? ఒహోయ్! ఎవరక్కడ?" అని తెగఅరిచాడు. గొంతు బొంగురుపోయిందేకాని, బదులుమాట వినపడలేదు. తామువచ్చిన పనిని ముగించుకొని తమదారిని వారు వెళ్ళిపోయారు కాబోలు. అవును, ఇంకా ఇక్కడవుండి చేయవలసినదేమున్నది గనుక? అలెక్సీకి ఆ స్థలాన్నివదిలి వెళ్ళడానికి కాళ్ళు ఆడాయి కావు. తిరిగి, ఎన్నోపర్యాయములు ఎలుగెత్తిఅరిచాడు. వారిలో ఏ ఒక్కడయినా వస్తే, ఎంతబాగుంటుంది? అతనితోపాటేవెళ్ళి, నాలుగైదురోజులు శ్రమతీర్చుకోవచ్చు. చలో, గంజో, వారేదిపోస్తే అదేతాగి బలంపట్టాక, తిరిగీ తన మానాన తాను ప్రయాణం సాగించడానికి వీలుంటుంది. కాని, ఎన్ని పర్యాయములరిచినా లాభం లేకపోయింది.

ఉన్నట్టుండి ఏదోవాక శబ్దమాతనికి వినిపించిందని అనుకొన్నాడు. ఎవరో పిలుస్తున్నారని అనుకొని. చెవియొగ్గివింటూ అక్కడే ఎంతోసేపు నిలబడిపోయాడు.

అంతా తన వెర్రిభ్రమేకాని, పిలిచిన వారెవ్వరూలేరు. తూర్పుగాలి తెరలమీద తేలుతూ ఫిరంగుల ప్రేలుడు వినిపించింది. తాము త్రవ్వుకొన్న కాలువలలో దాక్కొని, సాపకాశంగా శత్రువులమీద గురిపెట్టి కాల్చే, తుపాకులశబ్దం కాదిది. ఎవరో పెద్ద డబ్బామీద పిడికిళ్ళతో ఫటఫటా గుద్దుతున్నట్టూ, కొండ పార్శ్వంమీద పెద్ద సల్లరాతిగుండ్లు దొర్లుతున్నట్టు ఉరుముగు శబ్దమూ అతని చెవుల బడింది.

నిశ్చయంగా, ఏ పది కిలోమీటర్ల దూరంలోనో పెద్ద యుద్ధం జరుగుతున్నది. ఎవరో గొప్ప మందుగుండు సామానుతో మీదపడ్డారు కాబోలు. ఆత్మరక్షణకు రెండోపక్షంవారు వారితో హోరాహోరీగా పోట్లాడుతున్నారు. ఇది తలుచుకొంటే అతని చెక్కడలేని ఆవేశమూ కలిగి, కన్నీరు సంతతధారగా చెక్కిళ్ళ దిగజారింది.

తూర్పుదిక్కున చూస్తూ నిలబడ్డాడు, ఇంతవరకూ నేరుగా వచ్చిన బాట సుమారు పది కిలోమీటర్లు దూరం వెళ్ళి కుడిప్రక్కకు తిరిగింది. అక్కడంతా మంచు దట్టంగా కప్పివున్నది. ఆ ప్రదేశానికి తూర్పుప్రక్క నుండే యీ యుద్ధపు టార్భాటమంతా వినిపిస్తోంది. ఈ మూడు ట్రక్కులనూ ఆపి, జర్మను సైనికులను చంపిన తరువాత, తూర్పు ప్రక్కగా ఆ మనుజు లెవ్వరో వెళ్ళారనడానికి వారి పాదగుర్తులు మంచులో స్పష్టంగా కనిపిస్తున్నాయి. వారా తూర్పున కనిపించే అడవిలో దాక్కొనివుంటారు కాబోలు. సమయం కనిపెట్టి మీదపడి, ఆ బాటమీద

వచ్చే జర్మనుల హతమారుస్తారు కాబోలు! ఇది తలుచుకొంటే అతని సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి. "ఫరవాలేదు. అంతా సలక్షణంగా ముగిసిపోతుందిలే. దిగులు పడకండి. ఫరవాలే"దని ఆ మనుష్యుల నుద్దేశించి అన్నాడు అలెక్సీ. చేతికర్రను బాగా అంతదూరంగా గ్రుచ్చి, దానిపై గడ్డమానించి చటుక్కున రెండు కాళ్ళనూ యెత్తి ముందుకుతెచ్చి నేలపై మోపాడు. వెర్రి ఆవేశంతో యీ విధంగా చకచకా నడిచిపోజొచ్చాడు. ఎక్కడికో యేదో గొప్ప కార్యంమీద వెళ్ళేవాడిలాగా గంతులు వేసుకొంటూ వెడుతున్నాడు.

# 10

ఎంత వేగంగా నడిచినా ఆ సాయంత్రానికి నూటఏబది అంగల దూరం కంటె ఎక్కువ వెళ్ళలేకపోయాడు. చీకటిపడబోతోంది. గత రాత్రిమాదిరే ఒక పైన్ ద్రూమును కనిపెట్టి ఎండుటాకులూ చితుకులూ పేర్చాడు. సిగిరెట్ లైటరును అదిమాడు మంట చేయాలని. నిప్పురాలేదు! మరొకసారి బలంకొద్దీ దాని చక్రాన్ని త్రిప్పాడు. ఉహూ అంతా చచ్చుపడిపోయింది. గుండెల్లో రాయిపడింది. ఎన్ని పర్యాయములు చక్రాన్ని త్రిప్పినా రవంతైనా నిప్పు పుట్టిందికాదు. దానిని తెరిచి తన బలంకొద్దీ లోపలికి ఊదాడు. ఆ గాలి వత్తిడికి లోపల ఏమాత్రం పెట్రోలు వున్నా అది పైకి ఆవిరిగామారి లేస్తుందని ఆశపడ్డాడు. చెకుముకిరాయి నుండి నిప్పుపుట్టినట్టే పుట్టి ఆరిపోయిందేకాని వత్తి అంటుకున్నదికాదు. ఇంకా త్రిప్పగా త్రిప్పగా వున్న ఆ కొద్ది చెకుముకిరాయీ అరిగిపోయింది.

ఏదీ తోచక చూపుమేరలో కనబడే పైన్‌వృక్షాన్నొకదానిని సమీపించి దానికి వీపు నానించి కూలబడ్డాడు. మోకాళ్ళమీద ముఖ మానించి కళ్ళు మూసుకొంటే ఎక్కడలేని దిగులూ, దుఃఖమూ కలిగాయి. ఆ రాత్రంతా శబ్దాలు యుద్ధభూమి నుండి వినిపించాయి.

ఉలిక్కిపడి నిద్రలేచేటప్పటికి తెల్లవారింది. "ఏదో పీడకల వచ్చింది. అబ్బా! ఎంత భయంవేసింది?" అనుకొంటూ అటూ యిటూ దేనికొరకో వెతుకుతూన్నట్టు తేరిపార జూచాడు. ఎక్కడ జూచినా ఎండ పడుతోంది. దాని వేడికి మంచుపైనుండి ఆవిరి పొగలులేస్తున్నాయి. చెట్ల ఆకులా లేత ఎండలో నిగ నిగలాడుతున్నాయి. తెల్లవారి చాలాసేపయిందని బోధపడ్డ దాతనికి. లేవబోయాడు. కాని సాధ్యమయింది కాదు. తన బరువంతా కట్టెమీద మోపి లేవాలని చూశాడు. అది ఫళుక్కున విరిగి, ఏదో ఒక మూటమాదిరి నేలమీద బోర్లపడ్డాడు! లేచే

శక్తి యిసుమంతయినా లేకపోయింది. ఒత్తిగిలి వెల్లకిలా వీపుమీద పడుకొంటే చెట్ల శాఖల సందుల్లో నుండి నీలాకాశమూ, పరుగులిడే దూదిపింజలవంటి మేఘాలూ కనిపించాయి. ఉదయకిరణాలు తాకిన మేఘపుటంచులు మెరుగుపెట్టిన వెండిరేకులమాదిరి మెరుస్తున్నాయి. కొంతసేపటికి అతని శరీరంలో చైతన్యం పుట్టుకువచ్చింది. కాని, కాళ్లుమాత్రం పూర్తిగా కొయ్యబారిపోయాయని అనుకొన్నాడు. పైన్‌ మ్రాను నూతగొని లేచి నిలబడ్డాడు; కాని కాలును కదల్పబోయేటప్పటికి తూలి క్రింద పడ్డాడు. పాదాలలో చెప్పనలవిగాని మంటలు లేచాయి.

ఇక్కడినుండి కదిలి వెళ్ళడానికే వీలులేదా? నిర్మానుష్యమయిన యీ అడవిలో దిక్కూ, మొక్కూ లేకుండా ఒంటరిగానున్న తాను, ఉన్నచోటే పడిపోయి ప్రాణాలు వదలవలసివస్తుంది కాబోలు! కాకులూ, గ్రద్దలూ, నక్కలూ తన శవాన్ని పీక్కుతింటాయి. పూడ్చిపెట్టేవా రెవ్వరూలేక తన శరీరపు ఎముకలు మంచుకు తడ్సీ, ఎండకు ఎండీ వెల్లని కుప్పగా తయారవుతాయి. యుద్ధభూమినుండి శబ్దాలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. ఏదెనిమిది కిలోమీటర్లకంటే తక్కువ దూరంలో తనవారు, రష్యను సైనికులున్నారు. ఇంత సమీపానికివచ్చి వారిని కలుసుకోగల అదృష్టం తనకు లేదు. ఆర్చేవారూ, తీర్చేవారూ యెవ్వరూ లేక తా నీ అడవిలో చనిపోవటం తప్ప వే రేదీ అతనికి కనిపించింది కాదు.

ఆ యుద్ధఘోష అతని నక్కడ నిలపనిచ్చింది కాదు. మోకాళ్ళూ, పాదాలూ, అరచేతులమీదా చిన్నపిల్లవాడిలాగా దేకొంటూ వెళ్ళడం మొదలు పెట్టాడు. పాదాలమీద బరువు పడనందువల్ల ప్రాణం తెప్పరిల్లింది. మునుపటి కంటే కొంచెం త్వరగా వెళ్ళగలిగాడు. ఇది తలచుకొంటే ఎంతో సంతోషం కలిగింది. "ఫరవాలేదు తమ్ముడూ, దిగులుపడకు. అంతా సలక్షణంగా ముగిసి పోతుందిలే!" అని తనకు తానే ధైర్యం చెప్పుకొన్నాడు.

ఈ విధంగా కొద్దిదూరం వెళ్లేటప్పటికి అరచేతులు రెండూ చలికి మొద్దుబారాయి. అక్కడనున్న వొక పైన్‌చెట్టు బెరడు నూడదీశాడు. దానికి అడుగున గల మెత్తని కార్కును గోళ్ళతో సన్నని పేలికలుగా చీల్చి వాటిని అరచేతులకు చుట్టాడు. పాదాలకు కట్టిన ఉన్నిరుమాలు బట్టల నూడదీసి అరచేతులకు బిగించాడు. ఎడమచేత్తో కుడిచేతికి గట్టిగా కట్టుకట్టడానికి చేతనయిందికాదు. పంటితో బిగించి పట్టుకొని లాగి, లాగి కుడిచేతికట్టునూ గట్టిగా కట్టుకోగలిగాడు. మునుపటికంటే యిప్పుడెంతో సులభంగా పోగలిగాడు, మరికొంతదూరం వెళ్ళాక మోకాళ్ళకుకూడా, అరచేతులకు కట్టినట్టే కార్కూ, బట్టపేలికలు చేర్చి మెత్తటికట్లు కట్టుకొన్నాడు.

నడినెత్తికి సూర్యుడు వచ్చేసరికి ఏదో కొంతదూరం వెళ్ళగలిగాడు. యుద్ధభూమినుండి శబ్దాలు మరింత స్పష్టంగా వినిపించుతున్నాయి. ఇదంతా నిజంకాదనీ

అత డా విధంగా అపోహపడుతున్నా డనే విషయం అలెక్సీకి తెలిసే అవకాశమే లేకపోయింది.

దట్టంగా నాచుమొక్కలు పెరిగిన చిత్తడి నేలమీద పాకుతూ, వెడుతూంటే చిన్న చెరు వొకటి కనిపించింది. దాని గట్టున రెండూ, రెండున్నర అడుగులు పెరిగిన క్రాన్‌బెర్రీ మొక్కలు చాలా వున్నాయి. నిగనిగా మెరిసే వాటి ఆకుల తొటిమలకంట కరుచుకొని గుత్తులు గుత్తులుగా పెరిగే ఎర్రటి పండ్లగుపించాయి. మంచుకు తడిసిన ఆ పండ్లెంతో చల్లగా నోటికి తాకాయి. వాటిమీదనున్న నూగు పెదవులకు గ్రుచ్చుకొన్నది. తింటే ఎంతో తీయగానున్నాయి. అవులూ. మేకలూ మేసినట్టు అలెక్సీ ఆ పండ్లను మేసాడు. తనివితీరా తిన్నాడు.

తియ్యతియ్యగా, పుల్లపుల్లగా నుండే ఆ పండ్లరసం ఇన్ని రోజులుగా ఏదీ తినని కడుపులోకివెళ్ళి వెళ్ళడంతోటే కడుపు తిమ్మిరెక్కింది. కాని జిహ్వా చాపల్యత నడ్డగించలేక మొక్క మొక్కకూ వెళ్ళి నోటి కందినన్ని పండ్లను తిన్నాడు. అతని బూట్సులలో పూర్తిగా నీరునిండి, పాదాలు మంట లెగిసాయి. ఎంతో అలిసిపోయాడు. కాని ఆ పండ్లను తింటూ వెర్రి ఆనందపరవశుడై పోబట్టి వాటి నన్నిటినీ భరించుకోగలిగాడు.

ఉన్నట్టుండి పెద్ద వాంతి అయింది. నోరు తుడుచుకొని తిరిగి పండ్లను మెక్కటం మొదలుపెట్టాడు. కడుపు నిండింది. డబ్బానిండా పండ్లు నింపుకొన్నాడు. నెత్తిపైనున్న ఉక్కటోపీలో కూడా పండ్లు నింపుకొని పడిపోకుండా దానిని నడుమునున్న బెల్టుతీసి బిగించాడు. నడవడానికి శక్తిలేకపోయింది. ఆ రాత్రికి ఒక పైన్‌చెట్టు క్రింద విశ్రమించి, తెచ్చుకొన్న పండ్లనూ, ఫర్‌గింజలనూ తిని, పైన్‌చెట్ల బెరడును నెమరువేస్తూ నిద్రపోయాడు. ఆ రాత్రంతా ఎవరో మెత్తగా అడుగులిడుతూ తన దగ్గిరికి వచ్చినట్టు అతనికి భ్రమ కలిగింది. పిస్తోలు నెక్కుపెట్టి ఆ రాత్రి చాలాసేపు మెళకువగా పడుకొన్నాడు. ఎవరన్నా వస్తే కాల్చేద్దామని. పైనుండి రాలే పైన్‌కాయల శబ్దమూ, దగ్గిరిలో ప్రవహించే నీటి ఊట కలకలారవమూ తప్ప అతని కితరశబ్దా లెవ్వీగాని వినపడ్డాయికావు.

తెలతెల్లవారుతోం దనగా బండనిద్ర పట్టింది. బాగా ప్రొద్దెక్కాకగానీ నిద్ర లేవలేదు. చుట్టూనున్న మంచుమీద నడిచివెళ్ళిన నక్క పాదాలూ, దాని తోక గుర్తూ స్పష్టంగా కనిపించాయి. నిద్రించేటప్పు డీ నక్కవచ్చి అలెక్సీచుట్టూ తిరిగింది కాబోలు. ఎవ్వరో అనేకమారు లా తనిచెంతకు వచ్చారని అనుకొన్నది, భ్రమకాదు. యథార్థమే. నక్కలు శవాలనే తింటాయి, ఏ జబ్బుగా నున్నవాడినో, లేక నిద్రపోయేవాడినో, నక్క సమీపించటం దుశ్శకునమంటారు. ఆ మనిషి ఆయుర్దాయం మూడేరోజు లాసన్నమయ్యాయని దీని కర్థం చెప్పుతారు. ఈ విషయం జ్ఞప్తికిరాగానే అలెక్సీకె పెద్ద దిగులుపుట్టింది. అనుమాన మొక

పెనుభూతం. "ఫరవాలేదు, అధైర్యపడకు. అంతా సలక్షణంగా ముగిసి పోతుందిలే" అని మంత్రోచ్ఛారణ చేసాడు. ఇకమీద నొక్క నిమిషమైనా ఆచోటు నుండడాని కిష్టపడక బయలుదేరి వెళ్లాడు.

ఆరోజు కొన్ని జూనిపర్ పండ్లు తింటూంటే ఒక తమాషా జరిగింది. చాలా ఎండుటాకు లొక కుప్పగా పేర్చినవి అతనికంట బడ్డాయి. ఎవరో వాటి నా విధంగా పేర్చివుంటారని అనుకొని వాటిని ఏదీ తోచక కదిపి చూసాడు. లోపల ఏమున్నదో తెలుసుకోవాలని. చలికి ఉండచుట్టుకు నిద్రిస్తూన్న ముండ్లహాగ్ (పందిజాతి మృగం) కంటపడింది. నాలుగైదు నెల లొక్క దమ్మున చలినిద్ర పోయే ఈ హాగ్ బండనిద్ర పోతోంది. ఏ జంతువునో, లేక పక్షినో ఒక దానిని చంపి దాని మాంసం తినాలని ఎన్ని రోజులుగానో ఉవ్విళ్ళూరుతున్న అతనికి పట్టరానంత సంతోషం కలిగింది. ఇంతకు ముం దెన్నో పర్యాయములు కుందేళ్లూ, పక్షులూ అతనికంట బడ్డాయి. వాటిని రివాల్వరుతో కాల్చడాని కిష్టపడలేదు. కారణం? అతని దగ్గర మూడే మూడు తూటాలున్నాయి. వాటిలో రెండింటిని శత్రువులకొరకనీ, మూడోది విధిలేకపోతే తన్ను తానే కాల్చి చంపుకోడానికనీ నిశ్చయించుకొన్నాడు.

తన ఆశ ఫలించే తరుణం వచ్చింది. కష్టపడకుండా మాంసాహారం చేజిక్కింది. ఊరపందిమాదిరే ముండ్ల హాగ్ వెధవ తిండ్లన్నీ తింటుంది. కాని ఇప్పు డటువంటి ఆలోచనలు పెట్టుకొని మడి కట్టుకొని కూర్చోడానికి వీలులేదు. బాకులో దాని నొక్కపోటుపొడిచి, నిద్రలోనే దానిని చంపేసాడు. దానికడుపు పొడుగునా బాకుతో చీల్చి, తోలును ఒలిచివేసాడు. ముండ్లు పెరిగిన దాని చర్మం, పనసచెక్కల్ల మాదిరి ఊడి వచ్చింది. బాగా క్రొవ్వు పేరుకొన్నదాని మాంసమును, ఇంతింత ముక్కలుగాకోసి. నమిలి తినటం మొదలు పెట్టాడు. పెచ్చువెచ్చగా, రక్తం ఊరుతూ దాని మాంసమెంత రుచిగానున్నదో! ఎముకలకంట కరుచుకొన్న మాంస మును పండ్లతోపీకి, తెల్లటి ఎముక కనిపించేటంతవరకూతిని, మరీ పారవేసాడు. చిన్నచిన్న ఎముకలన్నిటిని. ఆప్యాయంగా, పండ్లక్రిందనదిమి, కొరికి, నమిలి తిన్నాడు. దాని మాంసమొక విధమైన వెగటు వాసనకొట్టుతోందని అప్పుడు కాని అతనికి తెలిసిందికాదు. భుక్తాయాసం, చక్కటి నిద్రవచ్చేస్తోంది.

వెల్లకిలాపడుకొని, ఇంతకుముందు అక్కరలేదని విసిరివేసిన ఎముకల చీకుతూ, తన్నుతానే మరిచిపోయాడు. సరిగ్గా కునుకుపట్టే సమయాని కేదో పాడు నక్క వొకటి కూసి నిద్రాభంగంచేసింది. ఎడతెరిపిలేకుండా వినబడే యుద్ధభూమి శబ్దాలలో నొకమార్పు కలిగిందనుకొన్నాడు, జాగ్రత్తగావింటే, అది మరఫిరంగుల శబ్దమని తెలిసింది.

చివాలునలేచి అడవిలోకి వెళ్ళిపోయాడు.

# 11

తాను ఇంతక్రితంరోజు దాటివచ్చిన చిత్తడినేలకంత దూరాన పెద్ద మైదాన మొకటి కనిపించింది. దానికడ్డంగా నొక ప్రక్క చెట్ల బెరడుతో బిగించికట్టినదొక కర్రలదడి కనిపించింది. ఆ దడి సందులనుండి బాట వొకటి కనిపించింది. అది పాడు పడిపోయింది. దానిపై నెంతకాలంగానో ఎవరుగానీ వెళ్ళినట్టు తోచదు. దీనినంతా చూస్తే ఆ ప్రాంతంలో నెవరో మనుష్యులున్నారనే నమ్మకం, అలెక్సీకి ఏర్పడ్డది. ఒకవేళ వారు జర్మనులేమో ! జర్మనీవారే అయితే, తప్పకుండా రష్యనులు కూడా సమీపంలోనే ఎక్కడో ఒకచోట వుండితీరాలి. ఏదో ఒకవిధంగా వెళ్ళి తన వారిని చేరుకొంటే ఎంత బావుంటుందోగదా ! తన కష్టాలన్నీ తీరుతాయి.

లేనిశక్తిని తెచ్చిపెట్టుకొని, చకచకా దేకుతూ వెళ్ళజొచ్చాడు. అలిసిపోయి పదే పదే మంచులోపడ్డాడు. అంతదూరంలో చిన్న గుట్టవొకటి కనుపించింది. ఏదో వొక విధంగా దానిని చేరుకోవాలని అతనికి ఆశకలిగింది. దానిపై కెగబ్రాకితే తప్పకుండా యేదన్నా వొకగ్రామం కనిపిస్తుందనీ, అక్కడ నాలుగు దినాలు తల దాచుకొని, తిరిగి నలుగురిలోపడే అవకాశం వుంటుందనీ, అలెక్సీ అపోహపడ్డాడు. సాధారణంగా ఏదోవొక కర్రలదడి కనిపించినంతమాత్రాన అక్కడ జనులుంటారని అనుకొనటం విచిత్రమైన విషయం. అలెక్సీవలె నీవుకూడా హృదయ విదారకప్ర టనుభవాలకు లోనయితేనేకాని, అప్పుడతనికట్టి వుద్దేశంకలగడం సహజమనే విషయం నీకు బోధపడదు; కడుపులోని చల్లకదలకుండా నలిపే ఆలోచనలకూ, విషమ పరిస్థితుల చేతులోపడి, అడకత్తెరలో నలిగినట్టు నలిగేటప్పుడు పుట్టే వుద్దేశాలకూ ఎట్టి పోలికా ఉండదు.

ఎన్నో కష్టాలుపడి. ఆ గుట్టనెక్కాడు. అప్పుడాతని కంటబడిన దృశ్యాన్ని చూడలేకపోయాడు, ఒడలంతా గగుర్పాటు చెందింది. కాళ్ళూచేతులూ బలంసడలి బోర్లపడ్డాడు. ఆ దృశ్యాన్నిచూడ నిష్టపడక గాబోలు, గట్టిగా కళ్ళుమూసుకొన్నాడు, రెండు చేతులతో.

అగ్నికాహుతియైన ఆ గ్రామంలో యిండ్లు రెండు బారులుతీరి కనిపించాయి. వాటి మధ్యగానొక బాట కలదు. యిండ్లన్నీ పొగచూరి నల్లగా ఎవో భయ్యాలమాదిరి నిలబడ్డాయి. సగానికి పైగా మంచులో పూడిపోయిన దడులూ, మోడులై నిలబడ్డ చెట్లూ; పూర్వ మచ్చట చక్కని తోట వుందేదని, చెప్పక చెబు తున్నాయి. వీరి మధ్య పాడుపడిన దొక బావీ, దానికొక యినుప గిలకా వున్నాయి. గొలుసుకు కట్టబడి వ్రేలాడే బొక్కెన గాలిలో వూగులాడుతూ, గల గల శబ్దం

చేస్తోంది. ఊరుకు చివర చిన్న తోట వొకటి, దాని చుట్టూ కర్రల దడీ వున్నాయి. దాని తలుపు తెరుచుకొని కిర్రు కిర్రుమంటూ శబ్దం చేస్తోంది. గాలికి వూగినప్పుడల్లా.

మచ్చునకైనా మనిషి అన్నవాడగుపించాడుకాడు. ఎప్పుడో చల్లారిపోయిన యిండ్ల పొగగొట్టాలు శిథిలమైన తెరచాప కొయ్యలమాదిరి నిలబడ్డాయి. నిన్నటి గ్రామం, నేటి స్మశానంగా మారిపోయింది. కుందేలొకటి తన వెనుక కాళ్ళపై కూర్చుని. ముందుకా శ్లిత్తిపెట్టి, చలించే నాసికాపుటములతో అలెక్సీని అంత దూరంనుంచి పరీక్షగా చూసింది. ఛెంగు ఛెంగున వెనుకకాళ్ళమీద ఎగురుతూ, మరు నిమిషమా పాడుపడిన గ్రామంలోకి పారిపోయింది. నేలపై దేక్కొంటూ వచ్చే యీ విచిత్రపు జంతు వేదో దానికి తెలిసిందికాదు,

నిద్రమత్తులో నడిచివెళ్ళేవాడిమాదిరి అలెక్సీ ఆ గ్రామానికి దేక్కొని వెడుతున్నాడు. బొట్లు బొట్లుగా మంచుపై బడే అతని కన్నీరు నాత డాపుకోలేక పోయాడు. పాడుపడిన ఆ వూరి తోట తలుపు దగ్గిరికి వెళ్లి నిలిచాడు. దాని గుమ్మంమీద. "శిశు...." అనే రెండక్షరా లగుపించాయి. పూర్వమీ తోటలో చంటిబిడ్డలు చదువుకొనే "శిశు విహారం" వుండేదని అలెక్సీ యిట్టే గ్రహించాడు. సున్నగా చిత్రికపట్టి నిగనిగా వార్నీషుతో మెరిసేవి, రెండు. మూడు బల్లలగుపించాయి ఆ తోటలో. నెమ్మదిగా తలుపును తోసుకొని తోటలోనికి వెళ్లాడు। ఒక బల్లమీద కూర్చోబోయాడు, కాని యిన్ని రోజులుగా కాళ్ళూ చేతులమీద దేకటం వల్ల నడుము లేవనిచ్చిందికాదు, ఎట్లాగో, నానా అవస్థలూ పడి దానిపై కూర్చోగానే వెన్నెముక పొడుగునా.గునపంతో పోట్లు పొడిచినట్టు వొక్కటే నొప్పి। దానిని సహించలేక దభాలున నేలకు దిగి కుక్కపిల్లమాదిరి ఉండజుట్టుకుపోయాడు.

ఎక్కడలేని ఏడ్పూ వచ్చింది అలెక్సీకి.

ఎండవేడికి మంచునుండి ఆవిరి లేస్తోంది. అచ్చటి నల్లమట్టీ, మంచుకరిగిన నీరూ కలిసి బురదగా మారుతోంది, నేల యావత్తూ. చేత్తో ఇంత బురదను తీసుకొన్నాడు. పేడవాసన। పూర్వ మీ యింటివా రిచ్చటనే తమ పశువులను కట్టేవేశారు కాబోలు।

ఒకానొకప్పు డిదంతా అడవిగా నుండేది. జనులు చెట్లనుపడగొట్టి, నేలను చదునుచేసి, కొయ్యనాగళ్ళతో దున్ని. ఎరువుపెట్టి పంటలు పండించారు. పొలాల చెంతనే తమ యిండ్లు కట్టుకొని, వన్యమృగాల బెదిరించి, తరిమి కాలం గడిపారీ గ్రామ జనులు. రష్యను సోవియట్ పరిపాలనాఫలితంగా సామూహిక వ్యవసాయమారంభమయింది, త్వరలో నేలను దున్నడానికి యంత్రాలూ, మంచి ఎరువూ సమృద్ధిగా వచ్చాయి. నలుగురికీ కడుపునిండా తిండీ, ఒంటినిండా బట్టా దొరికాయి. మంచిరోజులు వచ్చాయని యెంతో సంతోషపడ్డారు. ఆ వూరి వడ్రంగి "శిశువిహార" మొకటి కట్టి బిడ్డలు కూర్చోడానికి చక్కని బల్లలూ,

చిన్న కుర్చీలూ చేసాడు. సాయంకాలం బడివదిలిన పిదప ఆటపాటల్లో ఆనందిస్తూ కేరింతలుకొట్టే తమ బడతలనుచూసి పెద్దవాళ్ళెంతో మురిసిపోయేవారు. ఆ పిల్లలూ, ఆ గల్లంతూ, ఆ నవ్వులూ, ఆటలూ,.........ఇప్పుడేవి ? వీలయినంత త్వరలో నొక పఠనాలయం కట్టడానికికూడా ఏర్పాటుచేసారీ గ్రామ ప్రజలు. వెచ్చని చలిమంటకు ఒడలు కాచుకొంటూ పత్రికలూ, పుస్తకాలూ చదువుతూ లోకవిషయాలు తెలుసుకోడానికి వారెంతో కుతూహలపడ్డారు, కొద్దిరోజుల్లో తమ గ్రామానికి విద్యుచ్ఛక్తి వస్తుందనీ....రేడియో నొకటి ఏర్పర్చవచ్చుననీ.... ఇంకా ఏమి టేమిటో కలకన్నారు....వారి ఆశలన్నీ వారితోపాటే బూడిదలో కలిసిపోయాయి....ఊరూ పేరూ లేకుండా శుభ్రంగా తుడిచిపెట్టుకు పోయిం దీ గ్రామం. ఇంకొక ఏడాదిలో యిదంతా తిరిగీ అడవిగా మారిపోతుంది కాబోలు !

తనవూరు, కామిషిన్, అలెక్స్‌కి జ్ఞప్తికివచ్చింది. వోల్గానదీమైదాన భూముల నుండి వీచేగాలి సన్నని మట్టినీ, ఇసుకనూతెచ్చి వూరుపైనంతా జల్లుతుంది, ఇల్లూ, ఒళ్లూ ఒకటే మట్టిమయం. తలుపులూ, కిటికీలూ ఎంత బందోబస్తుగా మూసిపెట్టు కొన్నా లోనికి వచ్చినమన్ను ఇల్లంతా నిండిపోతుంది, కండ్లలో, పండ్లసందుల్లోనూ మెరమెర లాడుతుంది. ఆ వూరిజనులు దీనికి "కామిషన్ వర్షమంటూ" పేరు పెట్టారు. ఏ విధంగానయినాసరే ఈ మట్టివర్షాన్ని అరికట్టి, నలుగురిలాగా తామూ స్వచ్ఛమైన గాలిని పీల్చేరోజులెప్పుడు వస్తాయా అని జనులు కనిపెట్టుకొని వుండే వారు. సోవియట్ సోషలిస్టు రాజ్యస్థాపనానంతరం వారి కలలు ఫలించాయి. ఊరి ప్రజలందరూచేరి ఏ విధంగానయినాసరే ఈ మట్టి గాలి నడ్డగించడానికి పూను కొన్నారు. ప్రతి శనివారమూ, జనులందరూ, ఆడా, మొగా, చిన్నా, పెద్దాఅనే భేధం లేకుండా, పారలూ, గునపాలూ, మట్టి గొడ్డళ్ళూ పట్టుకొని, ఊరిమధ్యగల ఖాళీస్థలాన్ని చదునుచేసి, అందచందాలపార్కు నొకటి సృష్టించారు. వీధులకిరు ప్రక్కలా పోప్లర్‌చెట్లు నాటారు. వాటికి సమృద్ధిగా నీరుపెట్టి, వెర్రితలలు మొలవకుండా అప్పుడపుడు వాటిని కత్తిరించి. తమతమ తోటల్లోని పూలమొక్కల పెంచి పోషించినంత శ్రద్ధగానూ, ప్రేమతోనూ వాటినిపెంచారు. వసంతకాలం రావడంతోటే ఘనందయిన లేచిగుళ్ల తొడిగి చెట్లన్నీ ఎంతో శోభాయమానంగా కనిపించాయి....జనుల సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి. కామిషన్‌న్ను కూడా జర్మనులిదేవిధంగా ధ్వంసంచేసారు కాబోలు ! అంత కష్టపడీపెంచిన పోప్లర్ చెట్లన్నిటినీ పడగొట్టి, కట్టెలుగా నరికారేమో, జర్మనులు ? ఇండ్లన్నీ కాలి, పొగబారి విరిగి పడిపోయివుంటాయి" ఎంతకాలంగానో తన తల్లి తలదాచు కొన్న తమ గృహం, మట్టిలో కలిసిపోయిందా ?

ఇట్టివే ఆలోచన లతన్నిపట్టి పీక్కొని తిన్నాయి. జర్మనులమీద చెప్పనలవి కాని కోపంవచ్చింది, అటు ఇటయినాసరే వారి నింకొక అడుగయినా ముందుకు

పెట్టనీయలాదు; ఎదిరించాలి. పోరు సల్పాలి. అవసరమయితే ఏ నలుగురు జర్మనీ వాళ్ళనో చంపి మరీ తాను చనిపోవాలి.

పశ్చిమాద్రిని క్రుంకే సూర్యకిరణాలుపడి చెట్ల శిఖరాలన్నీ బంగారు పూత పూసినట్టు మెరిసిపోతున్నాయి.

అలెక్సీ పాడుపడిన ఆ గ్రామంలో చొరబడ్డాడు. ఎక్కడ చూచినా శవాల వాసన. పాడుపడిన ఈ గ్రామంలో, అరణ్యంలోకంటె ఎక్కువ ఒంటరితనమనిపించింది. అరణ్యంలోకంటె ఇక్కడే ఎక్కువ దిగులుపుట్టింది. అలెక్సీకి వున్నట్టుండి ఏదో దురూహ్యమైన శబ్దం వినబడింది. తలఎత్తి చూస్తే ఆ వూరి చివర నొక పెంటప్రోగుచెంత నొక కుక్క కనిపించింది. అది సర్వసాధారణమైన బాబిక్ జాతి ఇంటికుక్క. వ్రాలిన దాని చెవులూ, ఒంటినిండా పెరిగిన ఆ బొచ్చూ; బాబిక్ జాతి కుక్క అని స్పష్టంగా చెప్తున్నాయి. అదొక పెద్ద మాంసపు ముక్కను పట్టి పీకుతోంది. అలెక్సీని చూసి వాడికోరలన్నీ కనిపించేటట్టు నోరుతెరిచి, గుర్రుపట్టింది. సాధారణ ఇంటికుక్క, చీవాట్లూ చీపురు దెబ్బలూతిని, గడపనుకనిపెట్టుకొని పడివుండే పరమసాధువు, తాను కంటబడగానే కోరలు చూపింది! దాని కళ్ళనుండి అగ్నికణాలురాలాయి! అలెక్సీకి ఆశ్చర్యమూ, భయమూ ఒకేసారి కలిగాయి. చేతికట్టు సూడబెరికి, పిస్తోలు నెక్కుపెట్టాడు. రెప్పవాల్చకుండా ఒకరినొకరు చూస్తూ నిలబడిపోయారు. దానికేదో, పూర్వపుటనుభవం జ్ఞప్తికి వచ్చింది కాబోలు. మొరగటం మానింది, మాంసపుముక్కను నోటకరచుకొని చల్లగా జారిపోయింది.

"వెళ్ళిపోవాలి. ఇక్కడింకొక్క నిమిషమయినా తామసించరాదు. ఎంత చక్కటి గ్రామాన్ని ఎంత పాడుచేసారు!" అనుకొన్నాడు. తిన్నగా అడివిదారిని పట్టాడు. వినబడే యుద్ధఘోష అలెక్సీ నక్కడ నిలవనిచ్చిందికాదు. సూదంటురాయి మాదిరి లాగుతోంది. వడివడిగా అడుగులిడుతూ వెళ్ళాడు.

# 12

ఒకటి. రెండు. మూడురోజు లీ విధంగా దేకొంటూ వెళ్ళాడు. అంతవరకే రోజులు లెక్కపెట్టగలిగాడు. అటుపై నింకా ఎన్ని దినాలు వెళ్లాడో అతనికే తెలియదు. ఆమీదట రోజులు లెక్కించటంలో, అర్థమూ పర్థమూ లేదనిపించింది. ఎక్కడికి వెడుతున్నాడో కూడా తెలియదు. ఏదో వొక యంత్రం మాదిరి సాగిపోతున్నాడు; అంతే. ఎన్నో పర్యాయములు చెప్పజాలనంత మత్తూ, నిద్రా వచ్చాయి. ఆ నిద్రమత్తుతోనే దేకుతూ వెళ్లాడు. ఏ చెట్టు మొదలుకో, లేక

ఏ పొదకో తల తగిలి మెళకువ వచ్చేది. కొన్ని పర్యాయములు నిద్రమత్తుతో తూలి క్రిందపడిపోయాడు. మందే మంటచే నాకర్షింపబడే మిడతలమాదిరి, యుద్ధ ఘోషచే నాకర్షింపబడి అలెక్సీ వెడుతున్నాడు. ఆకలీ, నిద్రల గురించిన ఆలోచనే లేకపోయింది.

తన మెళకువ ఘడియల్లో కనిపించిన ప్రతి వొక్క పొదనీ శ్రద్ధగా పరీక్షించాడు. తిరిగీ, తన అదృష్టంకొద్దీ ఏ నుండ్ల హోగన్నా కనిపిస్తుందేమో అనే ఆశ. ప్రయోజనం లేకపోయింది. మంచుమీద పెరిగే నాచుమొక్కలనూ, ఎప్పుడో ఒకప్పుడు దొరికే బెర్రీ పండ్లనూ తిన్నాడు. ఒకరోజున బాగా ఎత్తుగా పెరిగిన చీమలపుట్ట ఒకటి కనిపించింది. వాననీరు దానిపైనుండే వదులుమట్టినంతా కడిగి పారేసింది. దాని నల్లటి గట్టిమట్టి ఎండలో కుండపెంకుమాదిరి మెరిసింది. చీమల్లింకా నిద్రలేచినట్టు లేవు. ఒక్కటయినా కనబడ్డది కాదు. తన చేతి నా పుట్ట లోనికి దించాడు. ఒక్క అరుపు అరిచి వెంటనే చేతిని బయటికి లాగేసాడు. చేతినిండా చీమలు. శంఖిణీపట్టు పట్టుకొన్నాయి. ఆ చీమలను తినటం ప్రారంభించాడు. పండ్లక్రింద కరకరా చీమలు నలిగాయి. ఘాటువాసనగల పుల్లని ఫార్మిక్ ద్రావకం, పచ్చిద్రాక్ష పండ్లను కొరికితే నోరంతా నిండే వాటిసారం మాదిరి. అలెక్సీ నోటిని నింపింది. అవెంతో రుచిగానున్నాయనిపించింది. పలుమారు పుట్టలోకి చేతిని చొప్పించి, చేతికంట కరుచుకొన్న చీమలను ఎంతోఆప్యాయంగా భక్షించాడు: ఒడలు మండుకొచ్చింది చీమలకు. ఎక్కడపడితే అక్కడ చేయీ, పెదవులూ; నాలుకా పుండయిపోయేటట్టు కరిచాయి. చొక్కాలోకి దూరి శరీర మంతా కరిచిపెట్టాయి. బలహీనతకూ, చలికీ సగం చచ్చుపడిపోయిన అతని నరాలు యీ చీమలు కొరికే సరికి మేల్కొన్నాయి. వాటిలో కొంత చైతన్యం కనిపించింది. ఎక్కడలేని దాహమూ వేసింది. చేరువనున్న వొక సెలయేటిని సమీపించాడు నీరు త్రాగడానికి. నీటిపైకి వొరిగినవాడల్లా ఛివాలున లేచి. దిగ్భ్రమచెందినట్టు వెర్రిచూపులు చూశాడు. ఆ నీటిలో భయంకొల్పే ముఖం, బహు వికృతాకారంగల మనిషి ముఖం కనిపించింది. ఎముకలకు అంటకరచుకొని నల్లగా పొగచూరినట్లగు పించే చర్మమూ, దానిపై జడలల్లుకొని పెరిగిన గడ్డమూ, మీసాలూ, పగలుచూస్తే రాత్రిళ్ళు కలలోకి వచ్చేటట్లున్నదా రూపం: లోపలికి దించుకుపోయిన కంటి గ్రుడ్లూ మాసిన తలజుత్తూ, చీకిపారేసిన తాటిటెంకమాదిరి కనిపించిందా తల. కడుపంతా కలయబెట్టినట్టు, బహు వెగటుగా తోచిందారూపం.

"నాదా. ఈ ముఖం? రోతపుట్టే ఈ ముఖం నాదేనా?" అని ఉలిక్కిపడిలేచి కూర్చొన్నాడు. అంత పరమ ఛండాలపుటాకారమును ప్రతిబింబింపచేసిన ఆ నీటి మీద కోపంవచ్చింది. దానిని తాకవద్దనిపించింది. వెనుకటి కెవడికో చెరువుమీద కోపంవచ్చి కడుక్కోకుండా వెళ్ళాడంటారూ, అమాదిరి. దాని నీరు త్రాగడానికిష్ట

వడక, ఇంత మంచుగడ్డను నోటిలో వేసుకొని దాహం తీర్చుకొన్నాడు. తిరిగీ తూర్పుదిక్కు ప్రయాణం సాగించాడు.

ఆ రాత్రి బాంబుపడి ఏర్పడిన ఒక పెద్ద గోతిలో నిద్రించాడు. దాని అంచుల్లోనూ, అడుగునా మెత్తటిమన్ను చాలావుండటంబట్టి సుఖంగా. మైమరచి నిద్రించాడు. ఆకాశంలోని నక్షత్రాలు; ఏదో వొక పెంట్లి పందిరినుండి వ్రేలాడే రసగుండ్లమాదిరి, చేతికందేటంత ఎత్తులో నున్నట్టులగుపించాయి. ఆ గోతి అంచున పెరిగేకొన్ని పైన్‌చెట్లునల్లగా గాలిలో ఊగిసలాడుతూ, ఆకాశాన్ని, నక్షత్రాలనూ, తుఫ్రంగా తుడిచే పెద్ద కుంచెలమాది రాతనికి కనిపించాయి. తెలతెల్లవారుతోందనగా చలిపెట్టి మంచుపడ నారంభించింది. ఉత్తరదిక్కునుండి వీచే చలిగాలికి రాలిన పొడిమంచు గడ్డకట్టుకుంటోంది. ఎండపడ్డాక గానీ నిద్రమెళకువ వచ్చిందికాదు. మంచు కరిగి నీరుకాఽజొచ్చింది. గతరాత్రి నల్లని కుంచెలమాదిరగుపించిన పైన్‌వృక్షాలు ఎండలో నిగనిగా మెరుస్తూ, ఆణిముత్యాలవంటి జలబిందువులతో ధగధగ మెరిసిపోతున్నాయి.

ఎంతో అలిసిపోయాడు, అలెక్సి. లేవబోయాడు, కాని, శరీరం నేలకంట కరుచుకుపోయినట్టు బరువెక్కి లేవనిచ్చిందికాదు. ముఖంమీదా, బట్టలమీదా పడిన మంచును దులుపుకోడానికి శక్తిలేకపోయింది. పడుకొన్నావాడు పడుకొన్నట్టే పొట్ట మీదదేకుతూ, గుంటపైకెక్కడానికి యత్నించాడు. రాత్రిపడినమంచుకు బిగదీసుకుపోయినట్లగుపించిన మన్ను, తాకీతాకటంతోటే, జలజలారాలింది. పైకెక్కడానికి రవంతకూడా పట్టుచిక్కక క్రిందపడిపోయాడు. ఎంత యత్నించినా రవంతపైకెక్కటమూ, దభాలున క్రిందపడటమూ, ఇదే పని అయిపోయింది. ఎవరైనావచ్చి ఆ గుంటలోనుండి లేవనెత్తితేతప్ప దానినుండి బయటపడటం దుర్లభమని తోచిందాతనికి. "నేను చేయతగినదింకేదీలేదు ఏది జరుగనున్నదో, అదే జరిగనీ" అనుకొని గుంటకడుగున ఉండజుట్టుకు పడుకొన్నాడు. కదలక మెదలక అదే విధంగా పడుకొనిపోవాలని అనిపించింది. ఉత్తరాలకట్టను జేబులోనుండి తీసాడు, కాని, వాటిని చదవటానికి శక్తిచాలిందికాదు. అందులో, సన్నని కాగితపు మడతలో నుండే అమ్మాయిపటంవంక, జాలిగా, ఎంతసేపోచూస్తూ పడుకొన్నాడు...." ఇదే ఆఖరుచూపేమో?" అని నిట్టూర్చాడు, పాపం అకస్మాత్తుగా, గుంటవెలుపలనుండి నిర్మల నీలాకాశంనుండి వింతశబ్దమేదో వొకటి వినబడింది. రకరకాల శబ్దాలనూ పోల్చుకోగల అలెక్సి. ఈ శబ్దాన్ని పోల్చుకోగలిగాడు. "ఇషాబోక్" శబ్దం; ఇషాబోక్ విమానాల్లో ఆతడెన్నిపర్యాయములో ఎగిరివెళ్లాడు. విమానం; విమాన శబ్దం."

ఒకొక్కకసారి దగ్గిరగనూ, మరొకసారి దూరంగానూ దాని యింజనుల శబ్దం వినిపించింది. ఆకాశంలో మేఘాలమధ్య దాగుడుమూతలాడే చిన్న ప్లసగుర్తుమాదిరి,

వెండి సీతాకోకచిలుక మాదిరగుపించిందా విమానం. దానివంక చూస్తూ, ఏవేవో గాలిమేడలు కట్టుతూ అలెక్సీ పడుకొన్నాడు. క్రమంగా దాని శబ్దం క్షీణించింది. చివరికినిలిచిపోయింది. కాని అలెక్సీ చెవులకది ఎంతోసేపు వినబడినట్టులనిపించింది.

ఆ విమానం ఎవరిది? .. ఆంద్రీ డెగ్ట్యారంకోదా? తీరుబడి వున్నప్పుడల్లా విమానంలో కూర్చుని ఎత్తెత్తుగా ఎగిరి వెళ్ళటమంటే ఆంద్రీకి బలేసరదా.... అట్లా వెళ్ళినప్పుడా, మేఘ మండలంలో శత్రువిమానమేదన్నా కనిపించినా కనిపించటం కద్దు....డెగ్ట్యారంకో!.... విమానం.... అదే గనుక రష్యను విమానమైతే....వారికి గుంటలోనున్నతాను కనిపిస్తే ఇట్టే ఒక్క సిగిరెట్ దమ్ము పీల్చేటంత వ్యవధిలో తన్నక్కడినుండి ఎగురవేసుకు వెళ్ళిపోతారు.... కాని. తనబ్రతుకు కంతమాత్రం అదృష్టంకూడానా?.... విమానం వెళ్ళిపోయింది.

మరొకసారి ఆ గోతి అంచులవంక చూసాడు. "ఎంత యత్నించినా, ఈ అంచులకెగబ్రాకటం కలలోని వార్త. నిశ్చయం.... అయితే, ఇక్కడే వుండి పోవాలా?.... చావుకు ఘడియలు లెక్కపెట్టుకొంటూ, వేచివుండాలి కాబోలు!.... నడుముకు కట్టుకొన్న బాకుతో చిన్న గుంట త్రవ్వి. వ్రేళ్ళతోనూ, గోర్లతోనూ వీలయినంత మట్టిని తీసిపారేసాడు. చిన్నగూడువంటి గుంట ఏర్పడ్డాక, దానికి మరింత పైగా నింకొకటి, ఆ గోతి అంచులో చెక్కాడు. దానికింకాపైగా మరొకటీ. ఈ విధంగా చెక్కుకొంటూ. వ్రేళ్ళన్నీ పుండ్లు చేసుకొన్నాడు. గోర్లు చిట్లి రక్తం కారింది. చేతులనూ. మోకాళ్ళనూ ఈ చిన్న గుంటల్లో చొప్పించి పైకెగ బ్రాకాడు. ఇంకా రెండే రెండు మెట్లెక్కితే గట్టున బడేవాడు. దురదృష్టంకొద్దీ. కాలు జారి క్రిందపడ్డాడు, నుదుటికి గట్టిదెబ్బ తగిలి, స్మృతి తప్పిపోయింది. విమాన శబ్దం. దూరంనుండి ఇంకా వినిపిస్తోంది. పై విధంగా పైకెగబ్రాకటమూ, క్రింద పడిపోవటమూ, ఒకసారికాదు. రెండు పర్యాయములుకాదు, ఎన్నో పర్యాయములు జరిగింది. ఏది చేయాలో తోచక గుంట అడుగున వెల్లికిలా పడుకొని త్రవ్విన గూళ్ళవంకచూడగా, చూడగా, వాటిని మరింత లోతుగా త్రవ్వి చూద్దామనితోచింది. ఈ పని పూర్తి అయ్యేటప్పటికి పూర్తిగా సొమ్మసిలిపోయాడు.

కొంత సేదతీర్చుకొని తిరిగి పైకెగబ్రాకాడు ఈ పర్యాయమాతని యత్నం ఫలించింది. తిరిగీ ఎక్కడ గోతిలో పడిపోతానో అనే భయంవేసి, చకచకా దొర్లుకొని గోతికంత దూరంగా పోయి, మరీ ఆగాడు. తిరిగీ తూర్పుదిక్కునుండి యుద్ధఘోష చెవుల బడింది.

# 13

పాదాలూ, మోకాళ్ళమీద మునుపటివలె దేక్కుంటూ వెళ్ళటం వీలుకాక పోయింది. చేతులాతని బరువును మోయలేకపోయాయి. పదేపదే ముఖం మన్ను కరుచుకొనేటట్టు క్రిందపడ్డాడు. భూమియొక్క సహజ ఆకర్షణశక్తి వేయిమడుంగు లెక్కుడు బలంతో తన శరీరాన్ని తనమీదికి లాగివేస్తోందని అనుకొన్నాడు. ఆవిధంగా యెన్ని పర్యాయములు పడ్డాడో, అతనికే తెలియదు. అలిసిపోయాడు. ఒక గంటా గంటన్నరకాలం అక్కడ పడుకోవాలన్నంత బలహీనత కనిపించింది. కాని ఆ యుద్ధశబ్దా లాతని మనస్సునుపట్టి "రా, రమ్మని" లాగుతున్నాయి.

అరచేతులకు శక్తిలేదుగా. మోచేతులూ, మోకాళ్ళమీద దేకుతూ వెళదామని తోచింది. కాని అదీ వీలుపడిందికాదు. మోచేతుల నేలకాన్చి ప్రక్కవాటుగా దొర్లుకొంటూ వెళ్ళటానికి యత్నించాడు. ఇది సులభసాధ్య మనిపించింది. ఏ తిరుపతికో, లేక ఏ సింహాచలానికో బాటమీద దొర్లుకొంటూ వెళ్ళే యాత్రికుల మాదిరి ప్రక్కవాటుగా మోచేతులాన్చి దొర్లుకొంటూ అలెక్సీ వెళ్ళసాగాడు. కాని త్వరలో అతనితల తిరగటం మొదలుపెట్టింది. నెమ్మదిగా కండ్లుమూసుకొని పడుకొంటేగాని భూమీ, చెట్లూ, పొదలూ గిర్రున తిరగటం మానేవికావు. ఆకాశం కూడా భూమితోపాటు ఏదో సుడిగుండంలోని నీరుమాదిరి గిర్రు గిర్రున తిరిగింది.

పోను పోను మునుపటంత దట్టంగా పెరుగక, దూరదూరంగా నిలబడ్డాయి, చెట్లు. అచ్చటచ్చట కొన్నిచెట్ల నెవ్వరో నరికి పడగొట్టినట్టు అగుపించిం దాతనికి. తనవాళ్ళను చేరుకోగలనా, లేదా అనే ఆలోచన లిప్పుడాతనికి లేవు. శరీరంలో శక్తి వున్నంతవరకూ దొర్లుకుంటూ వెళ్ళాలనేకాంక్షకు లోనైపోయాడు. కాళ్లూచేతులూ, శరీరమూ పూర్తిగా అలిసిపోయి స్మృతి తప్పిపోయినప్పుడుకూడా, ఏదోవొక యంత్రంమాదిరి, మరత్రిప్పి వదిలిపెడితే వెళ్ళే బొమ్మరైలుమాదిరి, అతని శరీరం. తనంతటతానే దొర్లుకొంటూవెళ్ళింది. తూర్పుదిక్కునుండి వినబడే యుద్ధశబ్దాలాకర్షిస్తునేవున్నాయి.

ఆరాత్రి తానెక్కడ పడుకొన్నాడో, మరునాడుప్రొద్దున ఎంత దూరం వెళ్ళగలిగాడో, ఈ విషయాలెవ్వి గాని అలెక్సీకి తెలియనేతెలియవు. నిద్రలో నడిచివెళ్ళే, కాదు, దొర్లుకొంటూవెళ్ళే అతనికి మధ్యమధ్య ఏవోకొన్ని ఆటంకాలు కలిగేవనీ. వాటినేదో వొక విధంగా తప్పించుకోగలిగాడనీ మాత్రం అతనికి చూచాయిగా జ్ఞప్తికున్నదే కాని, అంతకంటె ఎక్కువగానే తెలిసింది కాదు. క్రిందపడ్డ ఒక మ్రానునుండి బంగారు తీగలలాగాకారే జిగురూ (రోజిన్). ఒకచోట కుప్పగా

పేర్చబడిన కొన్ని మ్రానులూ, వాటిచెంత రంపపుపొట్టూ, చిత్రికపొట్టూ ఇటువంటి వాటిని తాను చూసినట్లులాతనికి జ్ఞాపకం, ఎక్కడా ? ఎప్పుడూ ?.... తెలియదు.

ఉన్నట్టులుండి విచిత్రపు శబ్దమొకటి చెవులబడింది. ఉలిక్కిపడి నిద్రనుండి లేచినవాడిమాదిరి, బెదరు చూపులతో నల్దిక్కులా చూసాడు. తానున్నదొక అడవిలోని ఖాళీజాగా. నరకబడిన పైన్‌మ్రానులూ, కొమ్మలు నరికీ చదును చేసిన మ్రానులూ నేలపైన కనిపించాయి. మచ్చలు మచ్చలుగా పడిన ఎండపొడ ముచ్చటగా కనిపించింది. ఒకమూల చక్కగా నరికి పేర్చబడిన కట్టెల ప్రోగు కనిపించింది. సూర్యుడు నడినెత్తి కెక్కాడు. ఘాటుపైన్ రోజిన్ వాసన, కరిగే మంచుకు తడిసినమట్టివాసనా మిశ్రితమై ఆ ప్రదేశమంతా క్రమ్ముకొన్నాయి. లార్కుపిట్ట పైన్‌చెట్టు కొమ్మలనుండి ఎలుగెత్తి పాడుతోంది.

ఏదో అకారణభయం కలిగింది అలెక్సీకి. నల్దిక్కులా ఇంతింత కళ్లు చేసుకొని, బెదిరినజింక మాదిరి చూసాడు. ఈ చెట్లన్నీ ఎప్పుడో పడగొట్ట బడ్డవి కావు. ఇచ్చటి కట్టెల ప్రోవులను పేర్చి ఎన్నో రోజులుకాలేదు. పడగొట్టిన కొమ్మల ఆకు లింకా వాడలేదు. నరికిన మ్రానులనుండి రోజిన్ జిగురు యింకా కారుతూనే వున్నది. చెక్కబడి నేలపైనున్న చెట్ల బెరడు యింకా పొడారలేదు. ఒకవేళ జర్మనీ వా రేమొ ? యుద్ధభూమిని దడులు కట్టడానికీ, బాటల కడ్డంగా పేర్చడానికీ, మ్రానుల నరుకుతున్నారు కాబోలు ? ఏ నిమిషమైనా పనిచేసేవారు రావచ్చు. వారి కంటబడితే ప్రాణంతో బయటపడటం దుర్లభం. కాని ఒడలంతా బిగదీసుకుపోయి కదలలేకపోయాడు. భయమా ? అలసటా ? అతనికే తెలియదు. వెళ్ళిపోవాలి. కాని వెళ్ళడానికి శక్తిలేదు.

ప్రాకొంటూ వెళ్ళడానికి కూడా శక్తిలేకపోయింది. తనకంటి కెవ్వరూ కనిపించకపోయినప్పటికీ తన్నెవ్వరో యెచ్చటినుండో కనిపెట్టి చూస్తున్నారనే భ్రమ అతనికి కలిగింది. ఎవరది ? అంతా నిశ్శబ్దం. చెట్టుకొమ్మల్లోని లార్కుపిట్ట పాటలవర్షం కురిపిస్తోంది. ఎక్కడో దూరంనుండి వడ్రంగిపిట్ట సుత్తిదెబ్బలు వినిపిస్తున్నాయి. పిచ్చుకలకంటే చిన్నవిగానుండే టామ్‌టిట్ పక్షులు గుంపులు గూడి, పడిపోయిన మ్రానుల నెక్కి, తెగ వాగుతున్నాయి. ఇంతే అతని కంట బడిందీ, చెవికి వినబడిందీనూ. కాని, ఎవరో తన్నదేపనిగా చూస్తున్నారని అతనికి తోచింది. ఎవరది ?

ఎక్కడో వొక చిన్న కొమ్మ పుటుక్కున విరిగినశబ్దం. తల యెత్తి చూసాడు. ఒకప్రక్క గుంపుగానున్న పైన్‌చెట్ల కొమ్మలలో కొన్ని విచిత్రంగా కదుల్తున్నాయి. వాటినిపట్టి యెవ్వరో కదిలిస్తూన్నట్టున్నది. ఎవరో రహస్యంగా మాట్లాడుతున్నా రా కొమ్మలచాటునుండి. ఏమి చెప్పుకొంటున్నారో వినబడింది కాదు కాని, వారు మాట్లాడుతున్నా రన్నది మాత్రం నిశ్చయం. ఆనాడు పాడుపడిన

గ్రామంలో కోరలుచూపిన కుక్క సంఘటన జ్ఞప్తికివచ్చింది. ఒడలంతా గగుర్పాటు చెందింది.

తుప్పుపట్టిన రివాల్వరును తన పంట్లాం జేబులోనుండి తీసి ఎక్కుపెట్టాడు. దానిని కాల్చడానికి రెండుచేతులూ వుపయోగించినా కూడా వీలవుతుందో రాదో అనే భయం కలిగింది. ఉన్నట్టుండి కొమ్మల్లో అలజడి. అవన్నీ తెగ చలించాయి. ప్రక్కనున్న చెట్లకొమ్మలు కదిలాయి. ఎవరో వాటిని కదిపివేడుతున్నారు. పారిపోతారా ? లేక వచ్చి తనమీదేపడతారా ?

"ఎవరది ? మనిషా ? జంతువా ?" అన్నాడు అలెక్సీ. అదే తరుణంలో "చెలోవెక్ ?" అని తన్నెవరో ప్రశ్నించిన శబ్దం ఆతని చెవులబడింది. ఇదంతా తనకు గలిగిన భ్రమా, లేక, యదార్థంగానే ఆ రష్యనుపదం తన చెవులబడిందా ? అది రష్యను భాషాపదం ! నిశ్చయంగా రష్యనుమాట ! ! పట్టరానంత సంతోషంతో ఎలుగెత్తి అరిచాడు. రష్యనులు ! ఛివాలున లేచి, ఆ మాట వినబడిన చెట్లపంకపరుగెత్తాడు ! వాటి మొదళ్ళనుచేరి, దభీలున పడిపోయాడు. పిస్తోలు చేతినుండి ఎగిరి అంత దూరంగాపడింది.

# 14

స్మృతి తప్పిపోయిందేకాని. ఏదో అపాయం జరుగుతుందనే భయంలోనుండి వేధించటంవల్ల, త్వరలో తెలివివచ్చింది. చెట్టు కొమ్మల్లో ఎవరోవున్నారు. రహస్యంగా ఏమిటేమిటో మాట్లాడుకొంటున్నారు.

నెమ్మదిగాలేచి కూర్చొని పిస్తోలును చేతపట్టుకొన్నాడు. ఇతరులకు కనిపించకుండా ప్రక్కవాటుగా దాచిపెట్టుకొన్నాడు. ఇంతవరకూ ఆతని పళపర్చుకొన్న మత్తు ఎక్కడికో పోయింది. మంచి చైతన్యం కలిగింది. ఎవరీ మనుష్యులు ? ఒకవేళ జర్మనీవారి చేజిక్కిన రష్యను ఖైదీలా ? బలవంతంగా వీరిచేత చెట్లు కొట్టించి, కట్టెలు నరికిస్తున్నారుకాబోలు ? లేక వీరూ, తనమాదిరే, జర్మనీవారి నుండి తప్పించుకుపోవటానికి యత్నిస్తూన్న. రష్యనులేమో ? బహుశ ఈ ప్రాంతంలో నివసించే గ్రామ ప్రజలైవుంటే ఉండవచ్చు. ఎవరైతేనేమ "చెలోవెక్" అన్న రష్యను మాటను తాను స్పష్టంగా విన్నాడనటానికెట్టి సందేహమూలేదు.

మొద్దుబారిన ఆతని చేతిలోని పిస్తోలు గజగజ వణికిపోతోంది. ఏమయినా సరే, తన దగ్గిరనున్న మూడు తూటాలను వినియోగించవలసిన సమయమిదే కాబోలు ? సరే, ఎవడు వస్తాడోరానీ, అని అనుకొన్నాడు, అలెక్సీ.

అకస్మాత్తుగా చెట్టుకొమ్మలనుండి, ఎవరో చిన్నపిల్ల వాడిమాట లీ విధంగా వినిపించాయి. "ఎవరునీవు. డచ్చివాడివా ? ఫ్రెంచివాడివా ?"

అలెక్సీ అదిరిపడ్డాడు. అవి రష్యను మాటలు. అంతేకాదు. ఎవరో చిన్న పిల్లవాడిదాకంఠం.

"అక్కడేమిచేస్తున్నావు" అని ఇంకొక పిల్లవాడు చెట్టుకొమ్మలనుండి ప్రశ్నించాడు.

"నీ వెవ్వరో ముందుగాచెప్పు" మని అలెక్సీ అరిచాడు. ఆ మాటలు తనకే స్పష్టంగా వినపడ్డాయికావు. అంతక్షీణించి పోయాడు.

ఈ మాటలు వినిపించగానే చెట్టుపైనుండి గుసగుసలు వినబడ్డాయి. చెట్ల కొమ్మలు తిరిగి చలించాయి.

"ఊరికే దబాయించకోయ్. మేమంత తుంతలంకాములే. పదిమైళ్ళ దూరం నుండే జర్మనీ వాడిని మేము కనిపెట్టగలము. నీవు డచ్చివాడవా ?

"నీ వెవరు ?"

"అసంగతంతా నీ కెందుకు ?

"నేను రష్యను మనిషిని"

"అబద్ధమాడకు నీవు జర్మనువాడివి, పంత పందెం ?" "నేను రష్యను వాడిని : నిజంగా రష్యను దేశీయుడను. నేనొక వైమానికుడిని. జర్మను వాళ్లు నన్ను పడేసారు." అని అలెక్సీ ఒక్క గుక్కలో పై మాటలన్నీ అనేసాడు. ఆ చెట్టుపైనున్నవారు; రష్యనులు, సోవియట్‌వారు అది తనకు బాగా తెలుసు తన మాటలువారు నమ్మక పోవటంలో ఆశ్చర్యమేదీలేదు. యుద్ధ సమయంలో జాగ్రత్తగానుండాలి. లేకపోతే విరోధులు తప్పకుండా కళ్లల్లో మన్నుకొట్టుతారు. ఇంతవరకూ తనకున్నదనుకొన్నశక్తి యావత్తూ ఎక్కడికో వెళ్ళింది. కాలూ చేయీకూడా కదల్చలేక పోయాడు. ఒకవేళ ఆ మనుష్యుల విరోధులైతే ? తన్నుతాను రక్షించుకోగలశక్తి తనకు లేదని అనిపించింది. ఎందుకో ? కన్నీరు చెక్కిళ్ళ దిగజార జొచ్చింది. ఆపుకోవాలని అతనికి తోచింది కాదు.

"చూడు ! ఆయన ఏడుస్తున్నాడు. ఒహోయ్. ఏందుకేడుస్తున్నావు" అని చెట్టు కొమ్మలనుంచి వినబడింది.

"నేనూ రష్యా దేశీయుడనే, మీ మాదిరే నేనూ రష్యనువాడినే. వైమానికుడను."

"నీ విమానాశ్రయం పేరు ?"

"ముందు నీవెవరో చెప్పు."

"నా పేరుతో నీకేమిపని ? చెప్పు."

"మంచలావ్ విమానాశ్రయం. దిగివచ్చి నాకు సహాయం చేయరాదా ? బైటికిరా. నీకు మతిపోయిం...."

తిరిగీ చెట్లకొమ్మల్లో గుసగుసలు, ఒకటి రెండు మాటలు అలెక్సీకి వినబడ్డాయి.

"విన్నావా? పంచలాప్ విమానాశ్రయమట.... నిజంచెబుతున్నాడు కాబోలు.... పాపం.... చూడు, ఏడుస్తున్నాడు...." తరువాత, "ఓయ్! విమానం మనిషీ! ఆ పిస్తోలును పారవేయి, ముందు దానిని దూరంగాపెట్టు, లేకపోతే మేము రాము పారిపోతాము."

అలెక్సీ తన పిస్తోలును దూరంగా విసిరివేసాడు. కొమ్మలు కదిలాయి, ఏదో రెండు చిన్న పక్షుల్లాగా, జాగ్రత్తగా అటూ ఇటూ చూస్తూ, భయపడుతూ ఇద్దరు కుర్రవాళ్ళు అలెక్సీ చెంతకు వచ్చారు, వారిలో పెద్దవాడు బక్కగా, నీలి రంగు కనుగ్రుడ్లూ, గోధుమరంగు జుత్తూ, వాళ్ళ అమ్మదికాబోలు పెద్దకోటు తొడుక్కొని, తండ్రి చెప్పులూ, చేతిలో నొక గొడ్డలితో చూడచిత్రంగా నున్నాడు. రెండోవాడి తల జుత్తు ఎర్రగా నున్నది, ముఖంమీద పుట్టుమచ్చల్లాగా చాలా మచ్చలూ, ఏమి జరుగుతుందో చూడాలనే ఆశా, దగ్గరికివెడితే ఏమి ప్రమాదమోననే భయంతోనూ కొంచెం వెనుకాడుతూ వచ్చాడు.

రెండోవాడిట్లాగన్నాడు. "ఏడుస్తున్నాడు. నిజంగా ఏడుస్తున్నాడు. ఎంత చిక్కిపోయాడో! చూడు! అసలు ఎముకల బొమ్మలాగా లేడు?"

పెద్ద అబ్బాయి తన చేతిలోని గొడ్డలిని మరింత గట్టిగా బిగయపట్టుకొని అలెక్సీచెంత నున్న రివాల్వరును కాలితో దూరంగా తన్ని, "నీవు వైమానికుడివని చెప్పావు కాదూ? ఏవీ! నీదగ్గిర కాగితాలుంటే చూపు. పరీక్షిద్దాము" అని అన్నాడు.

"ఇక్కడ వున్న వారెవ్వరు? జర్మనులా? లేక మనవాళ్లా?" అని అంత క్లిష్టపరిస్థితిలోనున్నా కూడా అలెక్సీ చిరునవ్వుతో అడిగాడు.

"నా కెట్లా తెలుస్తుంది? ఈ అడవిలోనుండే మా కీ విషయాలన్నీ ఎవరు చెప్పుతారు?" అని ఆ అబ్బాయి చమత్కారంగా పలికాడు.

వేరెట్టి ప్రశ్నలూ వేయకుండా, అలెక్సీ తన కోటు జేబులో నున్న వైమానిక సర్టిఫికేటు పత్రాన్ని తీసి ఆ అబ్బాయిచేతి కిచ్చాడు. ఎర్రని అట్టా, దానిపై వెండి నక్షత్రమూ గల ఆ సర్టిఫికేటు పుస్తకాన్ని చూడగానే ఆ పిల్లలతత్వం వెంటనే మారిపోయింది. ఎంతకాలంగానో రష్యనుల చూడని ఆ బాలురకు నేడీ రష్యను వైమానికుని చూడగానే ప్రశ్న పరంపరలు పుట్టుకువచ్చాయి.

"అవును మనవాళ్లే ఇక్కడ వున్నారు. మూడు దినాలుగా ఇక్కడే వుంటున్నారు."

"నీ వెందుకింత చిక్కి పోయావు?"

"మనవాళ్లు వారికి బాగా బుద్ధిచెప్పారు. చెప్పలా, మరీ? ఈ జన్మకు మరిచి పోరులే. ఇక్కడొక పెద్దయుద్ధం జరిగింది. నీకేమితెలుసు? వారు పరిగెత్తివెళ్ళి పోవటం నీవుచూస్తే, వారూ సైనికులేనా అని అనిపించేది. నాకే నవ్వువచ్చింది, చెప్పవద్దు, వారిలో నొకడు వెళ్లేబండికొక స్నానాలతొట్టెనుకట్టి ఎవరికి కనబడ కుండా దానిలో దాక్కొని వెళ్ళిపోయాడు. బాగా దెబ్బలు తగిలిన వారిద్దరొక గుర్రం తోకపట్టుకొని వ్రేలాడుతుంటే, వేరొకడు దానిపైకెక్కి ముగ్గురూ పారి పోయారు....నీవుచూస్తే తప్పకుండా విరగబడి నవ్వేవాడివి.... సరే గాని, వారు నిన్నెక్కడ పడగొట్టారు?"

ఈ విధంగా గుక్కత్రిప్పుకోకుండా ప్రశ్నల వర్షం కురపించి, తరువాత ఆ బాలురు అలెక్సీకి సహాయం చేయడానికి పూనుకొన్నారు. వాళ్ళ మనుష్యులు సుమారు ఐదు కిలోమీటర్ల దూరంలో నున్నారట. ఆ పిల్లలు కట్టెలు మోసుకొని పోవటానికని తెచ్చిన స్లెడ్జి బండిలో అలెక్సీ పడుకోటానికి తగినంత జాగాలేదు. అలెక్సీ ఒత్తిగిలి పడుకోడానికికూడా శక్తిలేక బోర్లాపడుకొని వారితో తలఎత్తి మాట్లాడుతున్నాడు. పెద్ద అబ్బాయి పెరియోంకా, రెండోవాడిని త్వరగా తమ గ్రామానికివెళ్ళి ఎవరినన్నా పిలుచుకురమ్మని పంపించాడు. చిన్న పిల్లవాడు, ఫెడ్కా. వెళ్ళాక అలెక్సీ చెంత పెరెయోంకా, కాపలా కూర్చున్నాడు, ఎవరన్నా జర్మనీవారు వస్తారేమో కనిపెట్టటానికీ అలెక్సీను కాపాడటానికీ. తాను కాపలా వుంటున్నానని పైకి చెప్పేదేకానినిజంగా అతనికి ఇంకా అలెక్సీమీద నమ్మకం చిక్కిందికాదు. అతన్ని పరీక్షించాలనే తానిక్కడ వుండిపోయాడు!.... అతని అనుమానాలన్నీ అర్థమూ పర్థమూలేనివనే నమ్మకం చిక్కాక, పెరియోంకా మనసు విప్పి మాట్లాడు.

సగం మూసుకొన్నకండ్లూ, మెత్తని పైన్ ఆకులమీద పడుకొనివున అలెక్సీని చూస్తే ఆ అబ్బాయి చెప్పే విషయాలెంతవరకూ అతను వింటున్నాడో చెప్పటం దుర్లభం. ఎక్కడలేని అలసటాకలిగి, మత్తు కమ్మినట్టు పడుకొన్నాడు. వినబడే మాటలాతనికి అర్థమయ్యాయి కావు. కాని అది తన రష్యను భాష అనేదొక్క విషయ మాతనికెంతో సంతోషాన్ని కలిగించింది, ఈ ప్లావ్నీ గ్రామానికి సంభ వించిన కష్టాలు ఆ తరువాతకానీ, అలెక్సీకు విశదమయ్యాయికావు.

గత అక్టోబరునెలలో యీ అడవిప్రాంతానికి జర్మనులు వచ్చారట. అప్పటి కప్పుడే ఆకురాలుకాల మాసన్నమవుతోంది. బర్చిచెట్లన్నీ పసుపురంగు పండు టాకులతో నిండిపోయాయి. ఆస్పెన్‌చెట్ల ఎర్రటి పండుటాకులు. అడివంతా మంటలు మండుతూన్నట్టు ఎంత దూరానికో కనిపించాయి. ప్లావ్నీగ్రామ ప్రాంత భాగాల్లో ఎట్టి పోరుగానీ యింతవరకూ జరిగిందిలేదు. సుమారు ముప్పది కిలో మీటర్ల దూరంలో రష్యనువారు వచ్చిపడే జర్మనుల నడ్డగించి వారి నెంతో

వేధించుకుతిన్నారు. కాని జర్మను సైన్యాలముందు నిలువలేకపోయారు. రష్యను సైన్యాన్ని శుభ్రంగా తుడిచిపెట్టినట్టు రూపుమాపి, జర్మనులు పెద్దసరస్సుల ప్రాంతంలో నున్న ప్లావ్నీ గ్రామానికి చెంతగానున్న బాటమీదుగా తూర్పుకు సాగి వెళ్లారు. ప్లావ్నీగ్రామ మచ్చట నున్నదన్న విషయం వారికి తెలిసిందో, లేదో దానిజోలికి పోలేదు. దగ్గరలోనున్న బొలొగోయి రైలుసంధిని చేరి, దానిని వశపర్చుకోవాలని జర్మనులు వెళ్ళారు. అది వారి వశమైతే పశ్చిమ యుద్ధభూమినుంచి ఉత్తర భూభాగాలకు రాకపోకలులేకుండా నిలిపివేయడానికి వీలవుతుంది. ప్లావ్నీగ్రామ జనులూ, ఇంకా యీ సరస్సుల ప్రదేశంలోనున్న వారంతా చేరి జర్మనుల నడ్డగించడానికి దక్షిణంనుండి ఉత్తరంగా కొన్నివందల కిలోమీటర్లు పొడవుండేటట్లు గోడలను కట్టారు. ఆ వేసవికాలంలో ప్రారంభించి, ఆకురాలుకాలం వచ్చేదాకా నగర ప్రజలు, గ్రామవాసులు, స్త్రీలు, వయసు మళ్ళినవారు, పిల్లలు, ఒకరకం వారన కుండా అన్నివృత్తుల జనులూ, ఎండలకు ఎండి, వర్షానికి తడిసి, చిత్తడినేలలో పడి దోమలబాధ నోర్చుకొని, త్రాగడానికి సరియయిన మంచినీరయినా దొరకక పోయినా సహించి యీ గోడల కట్టారు.

వారి కష్టాలు కొద్దిగా ఫలించాయి. అనేకచోట్ల జర్మను లీ గోడల పడ ద్రోసుకొని వెళ్ళారు. కాని బొలొగోయీ రైలుసంధిని చేరలేకపోయారు. రష్యనులు వారి నా ప్రాంతంలో ప్రతిఘటించటంవల్ల దక్షిణాభిముఖులై వెళ్ళి జర్మనులు వొకచోట నిలబడి యెదురుతిరిగి పోరుకు దిగారు.

ప్లావ్నీ ప్రజలుండే దేశంలో ఇసుక ఎక్కువ. అక్కడ పంటలంతగా పండవు. కాబట్టి వారచ్చటి సరస్సులలో చేపలబట్టి బ్రతకటం నేర్చుకొన్నారు. తమ గ్రామం జోలికి రాకుండా జర్మనులు వెళ్ళిపోయారుగదాయని ప్లావ్నీ గ్రామ జనులకెంతో సంతోషం కలిగింది. వారందరూ సమిష్టి వ్యవసాయాని కలవాటుపడ్డ ప్రజలు. వారందరూచేరి ఖొల్ కోజ్ అధికారి అనే గ్రామపెద్ద నొకడిని ఎన్నుకొంటారు. జర్మనీవారికీ పేరు గిట్టక, గ్రామపెద్ద అని మార్చమని వీరి కాజ్ఞాపించారు. పేరులో ఏమున్నది ? సరేనని, పేరు మార్చారు. కాని యథాప్రకారం తమ సమిష్టి వ్యవసాయాన్ని, సోవియట్ పద్ధతుల ప్రకారం సాగిస్తూనే వున్నారు. ఈ జర్మనీవాళ్లు నేడుకాకుంటే రేపయినా తప్పకుండా వెళ్ళిపోతారనీ, తిరిగి స్వేచ్ఛగా తాము బ్రతుకవచ్చునీ వారికి గొప్ప నమ్మకం కలదు. మొట్టమొదట వచ్చిన జర్మను వారంతా సాధారణ సైనిక దుస్తులు తొడుగుకొంటే, తరువాత మరొక రకం జర్మనులు ప్లావ్నీ గ్రామానికి వచ్చారు. వారి టోపీలమీద మనుష్య కపాలమూ ఎముకలూ గల గుర్తున్నది. ప్లావ్నీనుండి జర్మనీలో పనిచేయటానికి పదిహేనుమందిని పంపించాలని ఆజ్ఞాపించారు. ఒక్కటంటే, ఒకే దినం గడువు ఇచ్చి, మనుష్యులను పంపించకపోతే కఠినశిక్షలు విధిస్తామని భయపెట్టారు. ఈ పదిహేనుమందీ ఊరు చివరగల ఖొల్ కోజ్ (సమిష్టి వ్యవసాయక సంఘం)

గుడిసెలో హాజరుకావాలి. ప్రతివొక్కడూ, తొడుగు కొన్న బట్టలు కాక ఇంకొక జతబట్టలూ, చెంచా, కత్తి, ముల్లూ, పదిదినాలకు సరిపడ భోజనసామాగ్రి తీసు కొని హాజరుకావాలని ఆజ్ఞాపించారు, జర్మనులు. ఒక్కడైనారాలేదు. జర్మనులకు కోపం మిన్నుముట్టింది. ఖోల్‌కోజ్ అధికారిసీ చిన్నపిల్లల బడి పంతులమ్మనూ, ఇద్దరు వ్యవసాయ సంఘ సభ్యులనూ, ఆ సమయానికా దారినిపోయే మరి పదిమంది గ్రామస్తులనూ పట్టుకొని, బలవంతంగా చెట్లకుకట్టి, బిగించి తుపాకులు ప్రేల్చి కాల్చిపారేసారు, ఆ శవాలను పూడ్చడానికి అంగీకరించలేదు. మరునాడు. తాము కోరినట్టు పదిహేనుమంది రాకపోతే, ఊరి ప్రజనందరినీ కాల్చిపారేస్తా మని బెదిరించారు; భయపెట్టారు.

మరునాడు ఒక్కడయినారాలేదు, ఆ రాత్రికి ఊరుకొని, తెల్లవారగానే జర్మను ఎస్. ఎస్. సైనికులు ఊరిలో జొరబడ్డారు. ఇండ్లన్నీ ఖాళీగా కనిపించాయి. ఒక్కడయినా కనిపించాడుకాడు. పెద్దా, పిన్నా అనే భేదంలేకుండా జనులంతా అకస్మాత్తుగా మాయిమైపోయారు. ఎన్నో సంవత్సరాలుగా సేకరించుకొన్న ఆస్తి పాస్తూలనూ, పశువులనూ, సామాగ్రినీ, సకలమూ వదిలిపెట్టి, ఆ జనులంతా రాత్రికి రాత్రే ఊరు విడిచి వెళ్ళిపోయారు. రాత్రులంటా ప్రదేశంలో దట్టమైన పొగమంచు క్రమ్ముతుంది, ఎదుటివాడే కనిపించడు. దానిని చాటుచేసుకొని ప్లావ్నీ జనులందరూ, అడవిలోకీ, పదునెమిది కిలోమీటర్లదూరం నడిచి వెళ్లిపోయారు, కను మరుగుగా అక్కడ భూమి అడుగున నివాసాలేర్పర్చుకొన్నారు. మొగవారంతా జర్మనుల నెదిరించడానికీ, పొంచుండి వారిని హతమార్చడానికీ పూనుకొనిన ఇతరు లతో చేరి వెళ్ళిపోయారు. స్త్రీలూ, పిల్లలూ మాత్రమే మిగిలారు. చలికాలమంతా ఎట్టాగో ఒకవిధంగా ఇక్కడ కాలంగడిపి, వసంతంరాగానే తిరిగీ తమ గ్రామానికి వెళ్ళడానికి వీలుంటుందని వారనుకొన్నారు. కాని తమ గ్రామానికెట్టి దుర్గతి పట్టిందో వారికి తెలియదు. జర్మలా గ్రామమును అగ్ని భగవానునికి ఆహుతి చేసారు. నేల మట్టమైపోయింది. ప్లావ్నీ. ఇంతకుముందెన్ని గ్రామాలనో ఇదేమాదిరి కాల్చిపారే సారీ జర్మనులు, ఈ ప్రాంతానికి మృత్యుమండలమనివారు పేరు పెట్టారు.

"అప్పుడు మా తండ్రి గ్రామాధికారిగా నున్నాడు" అని పెరియోంకాచెప్పే మాటలు అలెక్సీకి యేదో చాలా దూరప్రదేశంనుండి వినపడినట్టు తోచింది. "ఆ జర్మను సైనికులు మా నాన్నను చంపారు. నా అన్నయ్య పాపం కుంటివాడు. వాడినికూడా చంపారు. ఒకపర్యాయం పొలంలో కాలికి పెద్ద దెబ్బ తగిలి, ఎన్ని మందులు వేసినా మానిందికాదు. ఆఖరికి ఆకాలును కోసివేసారు.... మొత్తంమీద పదహారుమందిని చంపారు జర్మనివారు. నేను కండ్లారా చూసాను. మమ్మందరినీ వచ్చి చూడమని బలవంతంగా అక్కడ నిలుచోబెట్టారు. మా నాన్నను కాల్చివేసే ముందు "ఓరీ! గాడిదకొడుకుల్లారా! దీనికి తగిన ప్రతిఫలం మీ రనుభవించి

తీరుతారు. మీ కండ్లనుండి రక్తంకార్చి. ఏడ్చి. ఏడ్చి మరీ మీరు చనిపోతారు" అని అరిచారు.

ఆ అబ్బాయివంక తేరిపారజూచాడు, అలెక్సీ. పెద్ద కండ్లు. దీనంగాచూసే ఆనేత్రాలనుండి కన్నీరు కారుతోంది. కాని అలెక్సీ ఆ అబ్బాయి నోదార్చడాని కొక్కమాటయినా పలుకలేకపోయాడు. అలసటా, బ్రహ్మాండమైన నిద్రా మూసుకు వస్తున్నాయి. ఇటు ప్రక్క చేయి అటు ప్రక్కకు కదల్చడానికి కూడా సత్తువలేదని పించింది. రెండు గంటల క్రితం దొర్లుకుంటూ వచ్చాడు ఇచ్చటికి, కాని, ఆ శక్తి యావత్తూ యిప్పుడు తన నుండి యెచ్చటికో వెళ్లిపోయిందికాబోలు.

బలవంతంగా మెళకువ తెప్పించుకొని, "నీ వీ అడవిలో నివసిస్తున్నావా ?" అని ఆ బాలుని అడిగాడు.

"అవును. మేము ముగ్గురం వున్నాము: అమ్మా, ఫెద్కా నేనూ. మాకు ఒక అక్కయ్య వుండేది. దానిపేరు న్యూషా. చలికాలంలో ఒడలంతా ఊది పోయి చనిపోయింది. ఇంకొక తమ్ముడుకూడా ఉండేవాడు. వాడూ చచ్చిపోయాడు. ఇప్పుడు ముగ్గురం మాత్రం వున్నాము. జర్మనీవారు తిరిగి వస్తారా ? రారుగా ? నీవేమనుకొంటావు ? మా తాతయ్య, అంటే మా తల్లిగారి తండ్రి, ఆయనే ఇప్పుడు మా కందరికి పెద్ద జర్మను లికమీద రారని ఆయన చెప్పుతాడు. "చనిపోయినవారు తిరిగి రారనీ "తాతయ్యఅంటాడు....అమ్మకు వారెక్కడవస్తారో. ఎప్పుడు వస్తారో అని ఒకటే దిగులు. ఇక్కడినుండి పారిపోదామని అంటుంది. ఎప్పుడూ, అదిగో ! తాతయ్యా, ఫెద్కా వస్తున్నారు చూడు".

అంత దూరాన ఫెద్కా నిలబడి తనవంక వ్రేలుపెట్టి చూపిస్తున్నాడు, అతనిప్రక్క పొడగరి, వయసుమళ్ళి గూనుపడిపోయిన ఒక మనిషి నిలబడ్డాడు. వదులుకోటూ, నడుముకు కట్టుకొన్న త్రాడూ, జర్మను అధికారులు ధరించే టోపీ వంటి దొకటోపీ, పెట్టుకొని, ఎంతోదర్జాగా కనిపించాడు. అతనే వాళ్ళ తాతయ్య మిఖేల్. శాంతమైన నీలి నేత్రాలూ, మూరెడు తెల్లటి గడ్డమూ, అతన్నిచూస్తే ఏదో చిత్రంలోనుండే ఏ ఋషీశ్వరుడో లేచివచ్చినట్లున్నాడు. రంగురంగుల ఉన్నికంబళిని అలెక్సీమీద కప్పి, తన చేతుల్లోకి, చిన్నపిల్లవాడిని ఎత్తుకొన్నట్టు అలెక్సీను తాతయ్య తీసుకొన్నాడు.

"పాపం ! ఎంత చిక్కిపోయావూ ! ఎంతజాలిగా నున్నది. నిన్నుచూస్తే ఎముకలుతప్ప వేరేదీ నీ శరీరములోలేదు. అయ్యో పాపం. ఈ యుద్ధంవల్ల ఎంద రెందరి జీవితాలు చితికిపోతున్నాయో. అయ్యో, అయ్యో" అంటూ తాతయ్య అలెక్సీ శరీరం నిండా ఉన్ని కంబళి చుట్టాడు.

పసికందును చేత్తో తీసుకొన్నంత జాగ్రత్తగా అలెక్సీను తన చేతుల్లోని కెత్తుకొని, సుతిమెత్తంగా స్లెడ్జిబండిమీద పడకోబెట్టాడు. బండికుదుపుకు పడి

గోకుండా ఒక త్రాటితో ఆతని బండికి బిగించాడు. ఒక్కనిమిషం, అంతా సరిగ్గా వున్నదీ లేనిదీ చూస్తూ నిలబడి, తరువాత తాను తొడుగుకొన్న కోటును విప్పి, అలెక్సీ తలక్రింద మెత్తగా తలదిండుమాదిరి పేర్చాడు. స్లెడ్జి బండికి ముందు వక్క నిలబడి, గోనె పట్టాతోచేసిన నడుముపట్టీ నొకదానిని తన నడుముకు పట్టుకొన్నాడు, తాతయ్య. ఆ పట్టీకి కట్టబడిన రెండుత్రాళ్ళనూ ఇద్దరు మనుమళ్లకూ చెరొకటీ చేతి కందించాడు. "దేవుడేదిక్కు" అని బయలుదేరాడు. చెరొక కళ్లెమును పట్టుకొని అన్నదమ్ము లిద్దరూ బండితో పరిగెత్తి, మంచుపడిన ఆ భూమిమీద సాగి వెళ్ళారు. దాని చక్రాలక్రింద మంచు పగిలి కరిగింది.

# 15

రెండుమూడు దినాలు అలెక్సీకి తా నెక్కడ నున్నదీ తెలిసింది కాదు. వెచ్చగానుండే ఆవిరి రాత్రనక, పగలనక ఎప్పుడూ అతనిచుట్టూ మూసుకొని వుండేది. ఆ ఆవిరితెరవతల ఎవరన్నా ఉన్నారా; ఉంటే వారేమిచేస్తున్నారు అనేదేదీ అతనికి తెలియదు. కొన్నిదినాలు గడిచాకగాని, ఆ మొదటిదినాలలో జరిగిన విషయాలు అలెక్సీకి విదితమయ్యాయికావు.

ఈ మనుష్యులంతా అడవిలో ఇతరులకు తెలియరాని రహస్య ప్రదేశంలో నివసిస్తున్నారు. భూమిలోపల గుహలుత్రవ్వుకొని, పైన్‌కొమ్మలూ, ఆకులతో ఇంటికప్పులు నిర్మించుకొని వాటిలో వీరందరూ రహస్యంగా బ్రతుకుతున్నారు. ఇండ్లకప్పులమీద దట్టంగా మంచుపేరుకోపడం వల్ల ఎచ్చట ఇండ్లున్నాయో ఇతరులకు తెలిసేదికాదు. మంచునుండి లేచేపొగ. భూగర్భంనుండి వస్తూన్నట్టు అనిపించేది. గాలిలేనిరోజుల్లోఎక్కడిపొగ అక్కడే దట్టంగా క్రమ్ముకుపోయి, దారీ తెన్నూ తెలిసేదికాదు ఆ చుట్టుప్రక్కల అరణ్యభాగంలో.

మిఖేల్, ఎవరో రష్యను వైమానికుడిని తీసుకువస్తున్నాడనే సంగతి ఊరంతా పాకింది. ఏ పదిమందో ముసలివాళ్ళుతప్ప, అచ్చటి జనులందరూ స్త్రీలూ, చిన్నపిల్లలే. ఈ వైమానికుడు కేవలం ఎముకల బొమ్మమాదిరి చిక్కి వచ్చాడట! ఈ విషయాలన్నీ వినడంతోటే చూడాలని జనమంతా మిఖేల్ ఇంటిముందు గుంపుగూడారు. అంతదూరాన ఈ "మూడుగుర్రాల" బండి కనిపించింది. ఆడవాళ్ళంతా పరుగుపరుగునవెళ్లి దానిచుట్టూ మూగిన చిన్నపిల్లలను తరిమివేశారు. ఆ బండివెంబడే బిగ్గరగా ఏడుస్తూ, ఆ స్త్రీలంతా నడిచి వచ్చారు, ఒక్కరయినా మంచిబట్ట కట్టుకోలేదు. అన్నీ చినిగిపోయిన పేలికలే. వారినిచూస్తే వాళ్ళందరూ

ముసలివా రనిపించింది. భూమి అడుగుననున్న ఇండ్లనిండా కమ్ముకొన్న పొగకు వారి ఒడలూ, ముఖాలూ నల్లబడిపోయాయి. తెల్లని కనుగ్రుడ్లూ, నవ్వినప్పుడు తెల్లగా కనిపించే పల్వరుసా వారినిచూస్తే భయంకరంగా నున్నారు. నవ్వినప్పుడు మాత్రం వారిలో కొందరు పడుచువారని పోల్చుకోడానికి వీలయిందే కాని, లేకపోతే వారందరూ ముసలమ్మలనే వుద్దేశం కలగకతప్పదు.

"ఆడవాళ్ళు! ఈ ఆడవాళ్లకున్నంత చాదస్తం ఇంకెవ్వరికీ వుండదు. ఎందుకు వచ్చారు? మీకిక్కడ ఏమిపని? కోతులాడుతున్నాయా? కొండముచ్చులాడుతున్నాయా?" అని మిఖేల్ వాళ్ళమీద కోపించుకొన్నాడు.... "దారి వదిలి నిలవండి. మీకు పుణ్యం వుంటుంది. గొర్రెలమంద. అబ్బా, గొర్రెలమంద మేలు, వీరికంటే."

వా రాతని మాటలు వినిపించుకోలేదు. అలెక్సీని సమీపించి:

"పాపం! ఎంత బక్కచిక్కిపోయాడో! ఎముకల బొమ్మమేలు, ఇతనికంటే, కదలడేం? బ్రతికే వున్నాడా?"

"స్మారకముట్టులేదు, ఎందుకోగాని ఇతన్ని నిన్నచూస్తే కడుపు చెరుపవుతోంది. ఎంత చిక్కిపోయాడు; ఎంత సన్నగిలిపోయాడు!!" అనటం మొదలు పెట్టారు.

తరువాత అలెక్సీ ఎంతకాలంగా అరణ్యంలో తిప్పలు పడ్డాడో, ఎన్నెన్ని కష్టా లనుభవించాడో, తిండీ తిప్పలూలేకుండా ఎట్లా బ్రతుకగలిగాడో అనే విషయాలను గురించి ఎవరికితోచింది వారు చెప్పుకొంటూ ఆ స్లెడ్జితోనే నడిచారు. ఇంతలోకే తమ గ్రామం - భూమి క్రిందనున్న వూరు - వచ్చింది. "నాయింటికి రావాలంటే, నీయింటికి" అంటూ వారంతా అలెక్సీని ఆహ్వానించారు, బ్రతిమాలారు. కాని ఇదంతా అతనికి తెలియనే తెలియదు.

"మా యిల్లు చాలా విశాలమైనది.... ఇసుక.... క్రింద అంటే ఇసుక చల్లాము. కావలసినంతగాలి.... చలిపెట్టకుండా వుండడానికి కట్టెలపొయ్యి కూడా ఒకటి కట్టాము" అన్నదొకామె, ఇంతింత కళ్లు చేసుకొని.

"పొయ్యా! పొయ్యి వున్నంతమాత్రాన లాభమేమిటో చెప్పు? మీఇంట్లో ఎందరున్నారో, నాకుతెలియదా? అంతమందిలో ఈ మనిషిని తీసుకువెళ్లిపెట్టకు తల్లీ. రేపు చనిపోయేవాడు నేడే పోతాడు, మిఖేల్‌తాతా, నా యింటికి పంపించు. నా ముగ్గురు కొడుకులూ రష్యా సైన్యంలోనున్నారు. ఇంట్లో ఇంకా కొంత గోధుమపిండి వున్నది. వేడివేడి రొట్టెలు కాల్చిపెడతాను."

"కూడదు, నాయింటికి రావాలి, విశాలమైన ఇల్లు, ఇద్దరం మాత్రమే ఇంట్లో వున్నదల్లా, రొట్టెలను మాయింటికితెచ్చి అతనికీయవచ్చు, నేనూ, కియుషాన్నా

షూ ప్రాణంకంటె ఎక్కువగా కాపాడుతాము. మంచులో దాచిపెట్టిన కుక్కగొడుగులున్నాయి. వాటితో పులుసు కాచి పెట్టుతాను. మంచి ఆకలిపుట్టుతుంది."

"చావుకు కాళ్లుచాపుకు కూర్చున్నవాడికి కుక్క గొడుగు పులుసెందుకు అది జీర్ణమైచస్తుందా? మాయింటికి పంపించు, తాతా, మాయింట్లో వొక ఆవు ఉన్నది. ఎప్పటికప్పుడు పిండినపాలు త్రాగితే, ఇట్టే కోలుకుంటాడు."

వారంతా చెప్పే మాటలకు బదులుచెప్పాడుకాడు, మిఖేల్. స్లెడ్జిని ఊరు మధ్యనున్న తన ఇంటి గుమ్మందగ్గిరికి లాగుకొని వెళ్లాడు.

ఏదో వొక గుహలో, బల్లమీద తాను పడుకొన్నట్టు అలెక్సీకి జ్ఞాపకం వున్నది. ఆ గదిలో నొకమూల చిన్నదీపంతప్ప వేరే వెలుతురనేదే లేదు. జర్మను సైనికులు తమ మందుగుండుసామానులు తెచ్చుకొన్న పెట్టె చెక్కలనుండి వొక బల్లను తయారు చేశారు, ఆ యింటివారు, దానిచుట్టూ. కూర్చోడానికి చెట్ల మ్రానులనరికి నేలలో కుర్చీలమాదిరి నాటారు. ఆబల్లచెంత సాధారణంగా నొక స్త్రీ కూర్చొని వుండేది. చాలా చిక్కినశరీరమూ తలకొక రుమాలూ, మాసినబట్టలూ, ఆ రూపం చూచినప్పుడల్లా అలెక్సీకి జాలివేసేది. మిఖేల్ తాత యొక్క చిన్నకోడలు. వర్వారా ఈ స్త్రీ అన్న సంగతి తరువాతగాని అలెక్సీకి తెలిసిందికాదు.

అలెక్సీ చారల జముఖానా పరిచిన బల్లమీద పడుకొన్నాడు. ఆనాడు తాతగారు ఒంటినిండా కప్పిన ఉన్నికంబళీ ఇంకా అట్లాగే వున్నది, చితక పొడిచినట్టు ఒడలంతా నొప్పులు, కాళ్ళక్రింద ఎర్రగాకాలే ఇటుకలు పెట్టినట్టు లోకే మంటలు. కాని తా నిక్కడ ఇన్నిదినాల తరువాత సురక్షితంగా నుండడానికి వీలయిందనీ, ఎప్పటి కప్పుడు ఏ శత్రువు కంటపడతానో, ఎప్పుడు చావు మూడుతుందో అనే దిగులులేకుండా నుండటానికి అవకాశం చిక్కిందిగదా అనీ, ఆత డెంతో సంతోషించాడు.

ఒక మూలనున్న పొయ్యినుంచి లేచేపొగ తీగలు చుట్టుకొంటూ గదంతా వ్యాపించేది. ఆ పొగతోపాటు బల్లదగ్గిర కూర్చొనే వర్వారా, ఎప్పుడూ ఏదో వొక పనిచేస్తూ కనిపించే మిఖేల్ తాతకూడా తేలిపోతున్నట్టు ఆతనికి కనబడేవారు. అలెక్సీ కండ్లు మూసుకొని పడుకొన్నాడు. ఉన్నట్టుండి చల్లనిగాలి సోకి కండ్లు విప్పాడు. ఆ గది ద్వారాని కడ్డంగా కట్టబడిన పరదా నెవరో తొలిగించారు. ఆ పరదామీద జర్మనుల నల్లగండ భేరుండ పక్షి చిత్రం వొకటి ఉండటం అత డెన్నో పర్యాయము లింతకుపూర్వం గమనించాడు. ఎవరో వొక స్త్రీ ఆ పరదాను తొలిగించి గదిలోనికి వచ్చింది. తాను తెచ్చిన సంచీని బల్లమీదపెట్టి రెండు చేతుల తోనూ దానిని గట్టిగా పట్టుకొన్నది. నిట్టూర్చి, వర్వారాతోవచ్చిన స్త్రీ ఇట్లా గన్నది:

"ఇదిగో, ఈ సంచిలో కొంత సేమియా వున్నది. యుద్ధం ప్రారంభం కాగానే దీనినిండా సేమియాను నింపి భద్రంగా కాపాడుకొంటూ వస్తున్నాను. నా కుమారుడు కోస్టియెంకా కొరకని యిన్నిరోజులూ దాచాను. ఇకమీద దీనితో వాడికి పనిలేదు, మీ ఇంట్లోనున్న అతిధికి దీని నుపయోగించు. చిన్నపిల్లలకు కూడా దీని నుపయోగించవచ్చు. పాపం! చాలా బలహీనంగానున్నాడీమనిషి. దీనిని తప్పకుండా జీర్ణించుకోగలడు."

ఈ మాటలని, అక్కడొక్క నిమిషమైనా నిలబడక, వెంటనే ఆమె వెళ్ళిపోయింది ఆ మాటలువిన్నవా రందరూ ఎంతో దుఃఖించారు. ఇంకెవరో వొక స్త్రీ కొన్ని గోధుమ రొట్టెలుతెస్తే, మరొకామె ఉక్కగొడుగుల పులుసు తెచ్చింది. ఆ రొట్టెల పులుసువాసన గదినిండా నిండిపోయింది, అలెక్సీ కిట్టి వేడి వేడి రొట్టెలవాసన తగలగానే విపరీతమయిన ఆకలి పుట్టినట్లనిపించింది.

పెరియెంకా, ఫెడ్కాలిద్దరూ గదిలో ప్రవేశించారు. పెద్దబ్బాయి దర్జాగా నెత్తినున్న టోపీ నెత్తిపట్టుకొని "సుప్రభాతం" అన్నాడు అలెక్సీని చూస్తూ. రెండు పెద్ద పంచదారగడ్డలనూ, ఇంత పొగాకునూ ఆ బల్లమీద పెట్టాడు, పెరియెంకా.

"వీటిని తినుమ్మ పంపించింది. పంచదార నీకు చాలామంచిది" అన్నాడు. మిఖేల్ తాతతో, "నేడు తిరిగి ఆచోటికి వెళ్లాము. ఒక ఇనుపకుండా, రెండు పారలూ, పిడిలేని గొడ్డలీ దొరికాయి. ఎందుకయినా, ఎపుడయినా వుపయోగపడతాయని, వాటిని తీసుకువచ్చాము" అన్నాడు.

తన అన్న వెనకాలనిలబడ్డ ఫెడ్కా, బల్లమీదనున్న పంచదార గడ్డలపట్ల తదేకదృష్టితో చూస్తున్నాడు. పాపం! ఆ అబ్బాయికి నోరుపూరింది. కాబోలు, లొట్టలు వేయటం నలుగురికి వినబడింది.

ఈ గ్రామ ప్రజలలో గత చలికాలం చలిని భరించలేక, మూడింట వొకవంతు జనులు చనిపోయారు. చలినుండి రక్షించుకోడానికి బట్టలూలేవు. బలం పట్టడానికి తినతిండీలేదు, పాపం చనిపోకుండా వుండటానికి మార్గం? ప్రతి యింటిలోనూ ఒకరిద్దరు వంతున చనిపోయారు. మృత్యువు ఈ విషయంలోమాత్రం, పక్షపాతం చూపెట్టిందికాదు. ఇంతటి దుస్థితిలోనున్న ఈ అమాయకపు జనులు తనకు తెచ్చియిచ్చిన వస్తువులన్నిటినీ గురించి తలుచుకొంటే అలెక్సీకి ఒక్కచే ఏడుపు వచ్చింది.

తాను చేస్తూవున్నపనిని నిలిపి, మిఖేల్ తాత ఆ స్త్రీలు అలెక్సీ కొరకు తెచ్చిన వస్తువులను స్వీకరించేవాడు. "స్త్రీలు! ఆడవారు! త్యాగశీలతనూ, మైత్రి అపేక్షనూ మీకు మీరేసాటి. అలెక్సీ, నేనేమి చెబుతున్నానో వింటున్నావా? స్త్రీ హృదయం నవనీతంకంటే మెత్తనైనది తమ్ముడూ. తన తలనయినాసరే

తాకట్టుపెట్టి పరాయివాడికి సహాయంచేయడానికి నారీమణులు వెనుకాడరు. ఏమంటావు? నేననేది నిజమంటావా?" అని అనేవాడు. గుర్రాలజీనును మరమ్మతు చేయటమో, లేక చీకిపోయిన చెప్పులు సరిచేయటమో, ఎప్పుడూ ఏదోవొకపనిలో తాత నిమగ్నుడై కనిపించేవాడు.... "పనిపాటల విషయంలోకూడా అలెక్సీ ఆడవారు సామాన్యులని అనుకోవద్దుసుమా. మొగవారి కిసుమంతయనా వారు తీసిపోరు. మనకంటే కొన్నివిషయాలలో వారిదే పైచేయి. నీకు తెలుసో. తెలియదో కాని వచ్చినదల్లా ఒక్కటే వొకచిక్కు కలదు. నోరు! వారి నోటికి తాళం వేయగల మొగవాడులేడీప్రపంచంలో. నా అనిసియా చనిపోయినపుడు, "అబ్బా! ఇకమీదనైనా ఆడపోరులేకుండా బ్రతకడానికి వీలవుతుందని" అనుకొన్నాను. అట్లా నే ననుకొనటం గొప్పతప్పిదమని నా కప్పుడు తెలిసిందికాదు. దానికి తగినశిక్ష నిప్పుడు నేననుభవిస్తున్నాను. ఈ గ్రామంలోనున్న కొద్దిమంది యువకులూ. జర్మనువారిని పొంచుండి చంపే దళాలలో చేరడానికి వెళ్లిపోయారు. వారి ఆడవాళ్లందరినీ పోషించి, కట్టుదిట్టంలో నుంచేభారం నా నెత్తిన పడింది. ఆడ పటాలాని కాధిపత్యం నా వుద్యోగం, నీకు తెలుసో తెలియదో చెప్పుతున్నాను. విను! ఇదొక పెద్ద గొర్రెలమంద, అన్నీ ఆడ గొర్రెలే....నేనో?....పోతుమేకను! ....ఛీ, ఛీ" అని అనేవాడు. తాత. అప్పుడప్పుడు. ఇదంతా వేళాకోళమో లేక యధార్థమో అలెక్సీకి తెలిసిందికాదు.

ప్లావ్నీ గ్రామాన్ని తగులపెట్టడానికి ముందు జర్మనులు అందుండే వస్తువులనూ, సామాగ్రినీ, వ్యావసాయిక పనిముట్లనూ, పశువులనూ, పాత్రసామాగ్రినీ, కట్టుబట్టలనూ, కనపడినదాన్నంతా దోపిడిచేసారు. ఎన్నితరాలుగానో వారు కష్టపడి సంపాదించి, సమకూర్చుకొన్న యావదాస్తినీ కోల్పోయిన యీ జనులు. ఎప్పుడే జర్మనీవాడు వచ్చి తా మిచ్చట నివసిస్తున్నారనే సంగతిని కనిపెట్టుతాడో అనే దిగులుతో రోజులు గడుపుతున్నారు పాపం! ఆకలిమంటల కలమటించారు. తలదాచుకొనే స్థలంలేక చెప్పరాని అగచాట్లుపడ్డారు. కాని వారి సమిష్టి జీవిత విధానమును మాత్రం కోల్పోయారుకారు. కష్టాలు ఎక్కువయ్యేకొద్దీ వారిలో ఐకమత్యత పెంపొంది బలపడ్డది. నలుగురూచేరి ఈ భూమి కడుగుననుండే గ్రామాన్ని నిర్మించారు. పూర్వం, ప్లావ్నీలోనున్నట్టే, ఏయింటివారు ఆ యింటిలో నివాసా లేర్పర్చుకొన్నారు. తన అల్లుడు చనిపోగానే మిఖేల్ తాత ఈ గ్రామాధికారాన్ని స్వీకరించక తప్పిందికాదు. తన విధ్యుక్తధర్మాన్ని చెక్కుచెదరకుండా నిర్వహిస్తున్నాడు. ఈ గ్రామవాసులందరూ తాత చెప్పుచేతల్లో నుండి రాబోయే వసంతకాలంలో పంటలు పండించడానికి కావలసిన పనులన్నిటినీ శ్రద్ధగా చేస్తున్నారు.

స్త్రీ లందరూ, తాము ప్లావ్నీ గ్రామంనుండి తీసుకువచ్చిన ధాన్యమును ఉమ్మడిగా నొకచోట చేర్చిపెట్టారు. నలుగురూ దానిని వాడుకొంటున్నారు.

జర్మనుల కంటబడకుండా తీసుకువచ్చిన పశువులు కొన్ని ఈనాయి. వీటి నన్నిటినీ బహుజాగ్రత్తగా కాపాడుతున్నారు. తినతిండి లేకపోతే, వస్తులు పడుకొన్నారే కాని, పశువులజోలికి పోలేదు. వాటిని తమ ప్రాణాలకంటే ఎక్కువ తీపితో చూసుకొంటున్నారు. చిన్నబాలురు, సమయం కనిపెట్టి కాలిపోయిన ప్లావ్నీ గ్రామానికి రహస్యంగా వెళ్ళేవారు. పారలూ, గొడ్డళ్ళూ, నాగళ్ళూ, ఏది దొరికితే దానినంతా రహస్యంగా ఇక్కడికి చేరుస్తున్నారు. కొత్తపిడులను బిగించి వాటి నుపయోగించడానికి యత్నించారు. పాతగోనె పట్టాలను చింపి కుట్టి స్త్రీలు రకరకాల వస్తువులను తయారు చేశారు. చలికాలంలో స్త్రీ లందరూ వంతులువేసుకొని చెరువులలో చేపలుపట్టడానికి వెళ్ళారు. ఆ చేపలుతిని జనులంతా మృత్యుముఖంనుండి తప్పించుకోగలిగారు.

తరుచుగా ఎందరెందరో స్త్రీలు అలెక్సీ పడుకొనివున్నగదిలోనికి, తాత మిఖెల్‌ను చూడటానికి వచ్చేవారు. వారి సమిష్టి వ్యవసాయసంబంధమైన విషయాలెన్నో ఆతనితో చర్చించేవారు. వారి పోట్లాటలూ, కయ్యాలూ, కార్పణ్యాలూ తీర్చవలసిన బాధ్యత తాతమీదపడ్డది. పెద్దగొంతు చేసుకొని ఒకరుచెప్పేమాట మరొకరికి వినపడకుండా, స్త్రీలు అరుచుకొంటూ వచ్చినప్పుడల్లా తాత వారిని తెగ తిట్టి పోసేవాడు. నాలుగు చీవాట్లూపెట్టి వారినోర్లు నొక్కాక తగినసలహానిచ్చి పంపించేవాడు. వారి నీ విధంగా తిట్టిపోసినప్పటికీ తాతకు స్త్రీలంటే ఎంతో గౌరవభావం. వారుచేసే సహాయమును, వారు వెళ్ళిపోయిన పిదప, అలెక్సీతో చెప్పి, ఎంతోమెచ్చుకొనేవాడు. పైకి కాఠిన్యతను చూపినా, తాతయ్యది మెత్తటి మనస్సు అన్న సంగతి అచ్చటి స్త్రీలకు బాగా తెలుసు. కాబట్టే అతని నొక దేవుడి మాదిరి గౌరవించి, ఆదరించేవారు.

"అలెక్సీ! ఈ ఆడజాతిని అర్థంచేసుకొనటం తేలికయిన పనికాదు. తనదిఅన్న వస్తువుమీద స్త్రీలకున్నంత అపేక్ష మొగవాళ్ళకి వుండదు. తమ ప్రాణాలర్పించియైనాసరే తమదన్న వాటిని కాపాడుకొంటారు స్త్రీలు. మానవజాతిని కని, పెంచి పోషించే స్త్రీని చేతులెత్తి నమస్కరించాలి. ఆడవాళ్ళేగనుక లేకపోతే, ఇల్లు వల్లకాడుమాదిరి వుంటుంది. తన కడుపు కాలిపోతున్నాసరే, స్త్రీ తన భర్తకూ, బిడ్డలకూ ఉన్నది కొద్దిపాటి తిండినీ పెట్టుతుంది. మొగవారికిట్టి త్యాగం తెలియదు .... పోయిన జనవరినెలలో కొందరు రష్యను సైనికు లిచ్చటికి వచ్చారు. వారిలో మనవాడొక్కడైనా లేడు. ఆకలికి కడుపుకాలిపోతోంది. ఏదన్నా పెట్టమంటూ వచ్చినవాళ్ళకి, మన స్త్రీలు చూపిన ఆదరణ అద్వితీయమైనది. ఇంట్లో తమ బిడ్డలు ఆకలికి మాడిపోతున్నారు. చలికి వారి శరీరాలు నీరుపోసుకొని వుబ్బిపోయాయి. ఎవరిదగ్గిరాకూడా కడుపారా తమ బిడ్డలకు పెట్టేటంత ఆహారంలేదు. కాని వచ్చిన ఆ రష్యను సైనికుల సంచులన్నీ ఆహార పదార్థాలతో నిండిపోయాయి. వారికి తిన్నంతా పెట్టి, సంచులన్నీ

నింపి మరీ పంపించారు, మన స్త్రీలు! అలెక్సీ! వింటున్నావా? తమ బిడ్డలొక ప్రక్క చావు బ్రతుకులలోనున్నా దానిని లెక్కచేశారుకారు! స్త్రీ ఋణాన్ని తీర్చుకోగల మొగవాడు ప్రపంచంలోనే లేడు. ఏమంటావు! ఈ మాట నిజమంటావా, కాదంటావా?....నేనేగనుక రష్యాకు అధికారినైతే ఏమిచేస్తానో తెలుసా? జర్మనీవారిని రష్యానుండి తరిమిన మరునాడు పటాలములన్నిటినీ హాజరు చేయిస్తాను. వారియెదుట నొక రష్యను స్త్రీని నిలబెట్టి, "మ్రొక్కండిరా, మ్రొక్కండి. ఈ దేశమాతకు మ్రొక్కండి. ప్రతి వొక్క రష్యను స్త్రీకి సలాముచేయండి. మీ జన్మలు సార్థకమయ్యేమార్గ మిదివొక్కటే"నని బోధిస్తాను."

ఈ విధంగా మాట్లాడుకొంటూ పోతూంటే, అలెక్సీకి చక్కగా నిద్ర పట్టేది. ఎవరో జోలపాట పాడినట్టుగా మిఖెల్ తాత వుపన్యాసాలు అతన్ని నిద్ర పుచ్చేవి. ఒక్కొక్కపుడు తన జేబులోని జాబులన్నీతీసి, ఆ అమ్మాయి ఫొటోను చూడాలని అతనికి ఆశ కలిగేది. వాటిని తాతకు చూపిద్దామనికూడా ఎన్నో పర్యాయములు అలెక్సీ అనుకొన్నాడు. కాని బలం చాలిందికాదు. ఆ తాత స్త్రీల నంత ఆవేశంతో పొగిడేమాటలు విన్నప్పుడల్లా అలెక్సీకి తన జాబులలో నున్న అమ్మాయి ఫొటో జ్ఞాపకానికి వచ్చేది. ఆ ఫొటోనుండి వెచ్చటి ప్రేమ తన శరీరానికి తగులుతున్నట్టు అలెక్సీ శరీరం వేడెక్కేది.

తన మామ మిఖేల్ మాదిరే, ఆతని ఆఖరి కోడలుకూడా ఏదో వొకటి కుట్టుతూ బల్లచెంత కూర్చుండటం అలెక్సీ ఎన్నో పర్యాయములు చూశాడు. మొదట్లో ఆమె ఎవరో ముసలిస్త్రీ అని అలెక్సీ అనుకొన్నాడు. బహుశా తాత భార్య కాబోలు. తరువాత తరువాత కానీ, ఆమెకు ఇరవై ఇరవై రెండేండ్ల కంటే ఎక్కువ వయస్సు వుండదనే విషయం అతనికి అర్థమయింది. ఆమె నడక తీరూ, అందులో విదితమయ్యే చురుకుతనమూ, సోయగమూ అలెక్సీ నాకర్షించాయి. అప్పుడపుడా స్త్రీ జాలిగా అలెక్సీ వంక రెప్పవాల్చకుంగా చూసేది. నిట్టూర్చి ఏదోగొంతుకు అడ్డంపడిన దానిని మ్రింగినట్టు మ్రింగేది. తెల్లుబికివచ్చే శోకాన్ని దిగమ్రింగుతోందా అని అలెక్సీ ఎన్నోపర్యాయములు అనుకొన్నాడు. రాత్రులందు ఒక్కొక్కపుడా గదిలోని దీపం ఆరిపోయేది. కటికచీకటి వెలుపలనుండి ఇలకోళ్ళ శబ్దం వినిపించే ఆ ఒంటరి రాత్రులందు అలెక్సీలుకు మెళకువవచ్చి, కండ్లు తెరుచుకొని పడుకొనేవాడు. నిశ్శబ్దపు టా నిశీధిని తనబల్ల కంతదూరంగా నున్న బల్లమీద పడుకొనివున్న మనిషి ఏడుస్తూన్నట్టు లాతనికి వినబడేది. ఆ ఏడుపుని వినపడకుండా నుండాలని తాతయ్య కోడలు తలగడదిండుతో నోరునొక్కుకొనేది.

# 16

మిఖేల్ తాత ఇంటికి అలెక్సీవచ్చి రెండురోజులు గడిచి పోయాయి. ఇది మూడోదినం. ఆరోజు ప్రొద్దున ఎనిమిది గంటలకు మిఖేల్‌వచ్చి అలెక్సీ పరీక్షగా చూశాడు.

"ఒడలంతాపేలు, అలెక్సీ. నీశరీరంలో పేనులేని భాగమనేదేలేదు. నీకు తెలుసా ఈ విషయం? పేలు పెద్ద రాక్షసులు దురదపెట్టినా గోక్కోడానికి నీకు బలంచాలదు. ఛీ! వెధవ పేలు. నేనేమి చేయదలుచుకొన్నానో నీకు తెలుసా. నీకు స్నానం చేయించడానికి ఏర్పాటుచేస్తాను. ఇష్టమే? ఆవిరిస్నానం! నీ ఒడలంతా కాదు; నీ ఎముకలన్నీరుద్ది శుభ్రంచేస్తాను. స్నానంచేసి ఎన్నిరోజులయిందో పాపం" అన్నాడు.

ఆ గదిలో ఒక మూలనున్న బొయ్యిలో ఇన్ని కట్టెలుపెట్టి తాత మంట చేశాడు. ఆవేడికి నేలపగిలినశబ్దం అలెక్సీకి వినబడింది. ఇంటి వెలుపలకూడా నొకపెద్దమంట చేసి దానిమధ్య ఎర్రగా కాలడానికొక కొండరాయిని పెట్టాడు. గది చాలావేడిఎక్కి, భూమినుండి నీటి బిందువులు పడ్డాయి. తాత తన చొక్కానూ, షరాయినీతీసి చెడ్డీతో నిలబడ్డాడు. వర్యా రెండు బిందెల చన్నీటిని తెచ్చి గదిమధ్యలోనున్న కొయ్యతొట్టెలో పోసింది. నేలమీద అలెక్సీని పడుకో బెట్టడానికి మెత్తగా గడ్డినిపేర్చి, తాతయ్య బర్చిచెట్టాపట్టునొక దానిని తీసుకు వచ్చాడు. కొయ్యతొట్టి నీటిలో దోసెడు చాకలిసోడా వుప్పును కరిగించి. పెద్ద ఇనుపరేకుమీద, ఎర్రగాకాలేరాతిని తెచ్చాడు. తాత, అమాంతంగా దానిని నీటిలోవేశాడు. చుర్రున శబ్దించి నీరు కళపెళా పొంగింది. ఆవిరిలేచి గదంతా నిండిపోయింది. ఎదుటి మనిషి కనిపించటమే కష్టసాధ్యమైపోయింది. తాతా, వర్యా, ఇద్దరూ చేరి అలెక్సీని గడ్డిపాన్పుమీద పడుకోబెట్టారు. అతని బట్టల నూడ తీశారు. తాతయ్య. వారిద్దరూచేరి అలెక్సీ శరీరాన్నిబర్చిపట్టతో. వేడి వేడి సోడా నీటితోనూరుద్ది కడుగుతున్నారు. తెగ చెమట పోసింది కోడలికి. కోటునూ, తలకుచుట్టుకొన్న రుమాలునూ తీసి దూరంగాపెట్టి, తాతకు సహాయం చేస్తోంది. పొడుగుపాటి జడలు రెండు, నల్లతాచుల్లాగా ఆమె వీపుమీద జీరాడాయి. ఎక్కడ లేని చురుకుతనమూ, ఆ జడలూ చూడగానే, అలెక్సీకి ఈమె తరుణ వయస్సులో నున్న స్త్రీ అన్నవిషయం విదితమయింది. ఇంతవరకూ ఎవరో ముసలి స్త్రీ అను కొనబట్టి సరిపోయింది. కాని, అలెక్సీకి ఆమె పడుచు బాలిక అని తెలియగానే చాలా సిగ్గువేసింది. దిగంబరంగానున్నాడనే సంగతి అతనికి మరీ కష్టంగా తోచింది.

"ఫరవాలేదు, అలెక్సీ, మరేమీ ఫరవాలేదులే. స్నానం చేయకపోతే నీ శరీరం పుచ్చిపోతుంది. మే మీ పనికి పూనుకొనకపోతే, నీ కెవరున్నారు గనుక, స్నానం చేయించేందుకు. ఫిన్‌లాండులో ఆడవాళ్లూ, మొగవాళ్లూ కలిసి స్నానం చేస్తారట. అబద్ధమా ? ఏమో ! నాకేమి తెలుసు ? ఎవరో చెప్పారు. వర్యా పరాయి స్త్రీ కాదు. ఆస్పత్రినర్సుగా భావించుకోవాలి. ఎందరెందరు సైనికులనో నర్సులు స్నానాలు చేయించి బట్టలు మారుస్తారు, ఆస్పత్రులలో. వర్యా, గట్టిగా పట్టుకో, ఈతని చొక్కాను విప్పుతాను. అరె ! పూర్తిగా చీకిపోయింది. విప్పడానికి వీలు లేదు. పేలికలు పేలికలుగా చేతిలోకి వూడివస్తోంది."

వర్యా నేత్రాల్లో అలెక్సీకి భయం కనిపించింది. తన ఆకారాన్ని చూసే భయపడింది కాబోలు, తలనించుక వంకించి తన శరీరాన్ని చూసుకొన్నాడు, అలెక్సీ. విమానంనుండి పడ్డ తరువాత ఈ విధంగా తన్ను తాను చూసుకోడాని కిదే మొదటి పర్యాయం. గడ్డిమీద, చర్మం కప్పబడిన ఎముకల బొమ్మ, మోకాలి చిప్పలు ఇంత ఎత్తుగా, పాతాళానికి దించుకుపోయిన కడుపూ, చెరువుగట్టుమాదిరి నిలబడిన తుంటిభాగపు ఎముకలూ, విడివిడిగా లెక్కపెట్టడానికి వీలుగా దూర దూరంగా నిలబడిన ప్రక్క ఎముకలూ, ఇదీ ఆతని కంటబడిన దృశ్యం !

తాతయ్య బర్చిచెట్టు బెరడును నీటిలోముంచి, అలెక్సీని సమీపించి, ఆగి పోయాడు.

"అలెక్సీ ! నీవేనా, ఇది, లేక, నేను కలగంటున్నానా ? ఎముకలగూడు, ఎముకల ప్రోవు. ఇందులో ప్రాణం ఎక్కడ వున్నదో నాకు తెలియటం లేదు. జర్మనీ వారినుండి ఎట్లాగో వొక విధంగా తప్పించుకోగలిగావేకాని, ఈ శరీరంతో, నలుగురిలో, తిరిగి....పడటం...."అని నీళ్లనమిలాడు.

"వర్యా ! సిగ్గూ బిడియమూలేకుండా, ఎందుకట్లా రెండుకండ్లూ వప్పగించి చూస్తున్నావు ? మొగవాడన్నమాట మరిచిపోయావా ? కండ్లనిండా ఆ నీళ్లెందుకు ? అయ్యో ! ఇదేమిగ్రహచారం. పెదవులు పుండైపోతాయి. అంతగట్టిగా పంటితో కొరుకోక్కవద్దు. ఆడవాళ్ళతో వచ్చిన గొడవే ఇది. అలెక్సీ ! నీవేదీ అనుకోవద్దు, ధైర్యంగావుండు. యమధర్మరాజు రానీకుండా నా ప్రాణం, నీ ప్రాణానికి అడ్డు పెడ తాను. చూస్తానుగా, ఎట్లా వస్తాడో నీ దగ్గిరికి. ధైర్యం తెచ్చుకో. నాలుగైదు రోజుల్లో లేచి తిరిగేటంతశక్తి కలుగుతుంది. నిన్ను పోషించి పెంచేభారం మాది. తెలిసిందా ?"

చిన్న పిల్లవాడికి స్నానం చేయించేటట్టు, తాత అతని మీద వెచ్చని సోడా వుప్పునీళ్లుపోసి, నెమ్మదిగా, శుభ్రంగా తోమి కడిగాడు. అతని ఎముకల గూళ్లు ఎక్కడ వూడిపడిపోతాయో అని అలెక్సీకి భయంవేసింది. వర్యా ప్రక్కనే నిల బడి మామగారికి తోడ్పడింది. అలెక్సీ నామె చూడాలనే అనుకోలేదు. కాని ఆవిరి

తెరలనుండి ఏకాలో, ఏ చేయో కనిపిస్తే, దాని ఆకారం చూసి కొయ్యబారి పొయ్యేది.

మీషా, తన భర్త, ఆమెకు జ్ఞప్తికి వచ్చాడు. అతనితో నామె కాపురం చేసింది ఏ నాలుగు నెలలో, ఇంతలోనే యుద్ధం వచ్చిపడింది. అలెక్సీని చూస్తే తన భర్తకూడా ఇదేమాదిరి ఎంత కష్టపడుతున్నాడో అనిపించింది. అలెక్సీకికాదు, తాను సేవచేస్తున్నది. యుద్ధంలో దెబ్బతిని వచ్చిన తన భర్తకు అని ఆమెకు అనిపించింది. 'మాంచి పొడగరీ, బలిష్ఠుడూ, ఆజానబాహుడూ, తన భర్త ఎంతగా మారిపోయాడు ! జర్మను వారాతని నెంత హింసించారో, పాపం.' ఏము కల గూడై పోయి, ఇంటికి వచ్చి చేరుకొన్నాడు. ఈ గండంతప్పి తన మీషా నలుగురిలో పడతాడా ? అంత అదృష్టం తన నొసట రాసిపెట్టాడా, దేవుడు ? ఈ ఆలోచనలు కలుగటంవల్ల ఆమె కండ్ల నీరు గిర్రున తిరిగింది. పైకుబికివచ్చే శోకాన్ని అరికట్టడానికి గట్టిగా వుండుపడేటట్టు పెదవుల కొరుక్కొన్నది, పాపం. ఆమె మనస్సులో ఈ ఆలోచనలన్నీ చేరి వేధిస్తున్నాయని, మిఖేల్ తాతకు తెలియదు.

స్నానానంతరం, తన దొక శుభ్రమైన చొక్కాను అలెక్సీకి తాత తొడిగాడు. తిరిగీ బల్లమీద జమఖానాపరిచి పడుకోబెట్టాడు. ఒడలంతా ఎంతో తేలిక పడినట్టు లాతనికి తోచింది. ఏదో నూతనమైన శక్తి తన నరాల్లో పరుగులిడుతున్నట్టు లనిపించింది. ఆవిరి గదినుండి వెళ్లిపోయింది. పొడారినట్టి గదిలో వెచ్చవెచ్చగా పడుకొని వుండగా, వర్యా వేడి బిల్ బెర్రీటీని తెచ్చి ఇచ్చింది, తాత మనుమడు తెచ్చి పెట్టిన పంచదార గడ్డ నొకదానిని చిన్న ముక్కలుగా తుంచి, వర్యా ఆతనికి అందిచ్చింది. వాటిని చప్పరిస్తూ, ఘాటయిన టీని త్రాగుతోంటే అలెక్సీ ప్రాణం ఎంతో తేలికపడింది. తరువాత గాఢ నిద్రపట్టింది. ఆనాడు విమానం నుండి క్రిందపడ్డ తరువాత ఇంత గొప్ప గాఢనిద్ర పట్టడాని కిదే మొదటి రోజు.

గదంతా ఇంకా చీకటిగానున్నది. దీపం ఎప్పుడో ఆరిపోయింది కాబోలు. ఎవరో బిగ్గరగా మాట్లాడుతున్నారు. మిఖేల్ తాత గొంతుకూడా వినిపించింది. కాని వా రేమంటున్నారో ఆతనికి తెలిసిందికాదు.

"నీకు మతిపోయిందా ? ఒక్క మెతుకయినా తిని ఎరుగడు గదా. ఇంత గట్టిగా ఉడకబెట్టిన ఈ గ్రుడ్లను తినడానికి వీలవుతుందనే నీవు అనుకొన్నావా ? తిన్నాడా, మరుక్షణం చావుతప్పదు" అని తాత కఠినంగా అంటున్నాడు. "ఇప్పు డాతనికి కావలసినవి గ్రుడ్లుకాదు. వసిల్లీసా, గ్రుడ్లుపెట్టరాదు. కోడిపిల్ల మాంసంతో పలుచగా కాచినచారు త్రాగించడంకంటె వేరేదీ ఇప్పుడప్పుడే ఈయరాదు. అది త్వరగా జీర్ణమయి, మాంచి బలాన్నిస్తుంది. వసిల్లీసా, చూడు, నీ ఇంట్లో, పార్టీ సంకా....ఎందుకట్లా అదిరి పడ్డావు ?" అన్నాడు, తాత.

"పార్టిసంకా నీయ మంటున్నావా ? ఎంత ఆశ ? ఎంత చులకనగా అన్నా వయ్యా ! పార్టిసంకాట !....వీలుపడదు. నా బొందిలో ప్రాణముండగా ఆకోడిని నీవు కాదుగదా. నిన్ను పుట్టించిన ఆ బ్రహ్మ దిగివచ్చినా సరే తాకడానికి వీలు లేదు. కోడి మాంసంచారా ? ఎంత తేలికగా అన్నావయ్యా ! ఇంతవరకూ ఇచ్చినదంతా చాలదుకాబోలు," అన్నదా స్త్రీ. రౌద్రంగా.

"వసిల్లిసా ! నీవేనా ఈ విధంగా మాట్లాడుతున్నది ? నీ కొడుకు లిద్దరు యుద్ధభూమి నున్నారన్న విషయం మరచిపోయావా ? జ్ఞాపకముంటే, పాపం, మన కొరకు, నీ కొరకూ, నా కొరకూ పోరాడి ఈ దీనాతిదీనమయిన స్థితికి వచ్చిన, అలెక్సీకి, మన కొరకు తన రక్తం ధారపోసిన........"

"ఈతని రక్తం నాకేమీ అక్కరలేదు, పాపం ! నా బిడ్డ లిద్దరూ తమ నెత్తురును త్యాగం చేయడానికి వెళ్ళారు. ఇంత కంటె ఎక్కువగా ఏ తల్లి ఈయ గలదు ? చాలు, చాలు నన్నికమీద అడగవద్దు.... నేను ఈయనంటే ఈయను."

తలుపు తెరుచుకొని, గూను పడిపోయిన వొక మానవాకారం ఆ గదినుండి వెళ్ళిపోయింది. ఒక్క పెట్టున వెలుపలనున్న వెలుతురులోనికిజొరబడింది. దానిని, అలెక్సీ, చూడలేకపోయి, "అబ్బా" అని కండ్లు మూసుకొన్నాడు.

ఈ శబ్దం విని, తాత త్వరగా అతని దగ్గిరికివచ్చి :

"అలెక్సీ, నీవు నిద్రపోలేదా ? మేలుకొనేవున్నావా ? మా మాటలన్నీ నీకు వినిపించాయి కాబోలు. ఆ ముసలమ్మ మాటతీరేఅంత, కాని ఆమె హృదయ మెంత మెత్తనైనదో నాకు తెలుసు. ఆమె ఎంతటి గొప్ప కష్టాలననుభ వించిందో, అలెక్సీ, నీకు తెలియదు. వాళ్ళది పెద్దకుటుంబం. పదిమంది వుండే వారు. ఆమె పెద్దకొడుకు రష్యను సైన్యంలో పెద్ద వుద్యోగంలో నున్నాడన్న విషయం జర్మనులకు తెలిసింది. ఈ ముసలి తల్లిని తప్ప, మిగిలిన వారి నందరినీ వాళ్ళు పట్టుకు పోయారు. ఆమెకు ఇప్పుడున్నదల్లా ఈ ఒక్కకోడి. ఈ కోడి చాలా తెలివైనది. జర్మను సైనికులు కంటికగుపించిన కోళ్ళనూ, బాతుల లన్నిటినీ చంపివేసారు. వాళ్ళకి కోడి మాంసమంటే చాలా ఇష్టం. ఈ కోడి మాత్రం వారిచేజిక్కిందికాదు. సైనికులు ఇంట్లో ప్రవేశించగానే, ఇది అటక ఎక్కి, గుప్పుచప్పుడు కాకుండా పడుకొనేది. మన వాళ్లెవరువచ్చినా మామూలుగా ఇక్కడా అక్కడా తిరుగులాడేది. దానికీ భేదంఎట్లా తెలిసిందో చెప్పడం నాతరం కాదు. ఊరు మొత్తంమీద మిగిలిన కోడి ఇది వొక్కటే. పార్టిసంకా దానిపేరు" అన్నాడు, మిఖేల్.

అలెక్సీ కండ్లు తెరుచుకునే నిద్రపోయాడు. అడవిలోనుండే రోజుల్లో ఈ విధంగా నిద్రపోవట మాతనికి అలవాటు అయింది. అలెక్సీ బదులు మాట్లా డకపోవడంవల్ల, మిఖేల్ తనమాట లాపుచేశాడు. బల్లచెంతకు పోయి, ఏదీ

తోచనివాడిమాదిరి అదీ ఇదీ, దానిపైనుండే వస్తువులనుతీసి. ఇక్కడిదాని నక్కడా, అక్కడిదాని నిక్కడా మార్చిపెట్టాడు. తరువాత తిరిగి, ఈ విధంగా చెప్ప నారంభించాడు :

"అలెక్సీ ! ఆ స్త్రీని తూలనాడకు. ఆమె ఎంత గొప్ప కష్టాలకు పాల్ప డిందో ఆలోచించిచూడు. ఒకానొకప్పుడామె చుట్టూ పదిమంది కాపాడటానికి వుండే వారు. ఇప్పుడామె స్థితి నాలోచించిచూడు. ఒంటరిదై పోయింది. నా అనే వాళ్ళెవ్వరూ లేరు. శరీరంలో శక్తి పూర్తిగా నశించింది. ఉన్నదల్లా పాపం, ఈ ఒక్క కోడి పెట్టేగా ? ఏమంటావు, అలెక్సీ....మాట్లాడవేం ?....ఓహో ! నిద్రపోతున్నావా.... మంచిది, నిద్రపో."

అతడు నిద్రిస్తున్నాడనిగానీ, లేదనిగానీ చెప్పడానికి వీలులేదు. అదొక విధమయిన మగతగా పడుకొన్నాడని చెప్పాలి. అతనికి తొడిగిన చొక్కా వెచ్చగా, మెత్తమెత్తగా ఎంతో హాయిఅనిపించింది. గది వెలుపల ఇలకోడు లరు స్తున్నాయి. ఒక్క వ్రేలయినా కదిపేటంత శక్తి అతనిలో లేకపోయింది. తన శరీరంలోని ఎముకలన్నిటినీ ఎవరో తీసిపారేసి వాటిస్థానే వెచ్చవెచ్చని, మెత్తటి దూదిని నింపారన్నట్టూ, దానిలోని రక్తం ఇప్పుడిప్పుడే పరుగులిడటం నేర్చు కొంటోంది అన్నట్టూ అలెక్సీకి తోచింది. ఎముకలు చితికి, వాచిపోయిన పాదాలు చెప్పనలవికానంతగా మండిపోతున్నాయి. కాని, వాటి నిసుమంతయినా కదిపే శక్తి లేకపోయింది.

ఆ గదిలో జరిగే విషయాలన్నీ ఏదో వొక కలలో కనిపించినట్టులున్నాయి. ఇక్కడొక మనిషీ, అక్కడొక మాటా ఒకదానికొకటి అతకకుండా, ఘడియ ఘడియకూ తెగిపోయే సినీమా చిత్రాన్ని చూస్తున్నట్టులున్నది

వసంతకాలం ప్రారంభమయింది. లేత ఎండపడి కరిగిన మంచు ఇంటి కప్పులనుండి బొట్లుబొట్లుగా పడుతోంది ఇల్లంతా. కాలిపోయిన తమ ప్లావ్నీ గ్రామంనుండి రాత్రిపూట ఎవరికండ్లా పడకుండా అప్పుడప్పుడు తెచ్చుకోగలిగిన తినుబండారాలన్నీ దాదాపు ఖర్చయిపోయాయి. ఘూగర్భపు టీ గ్రామంనుండి పోరాడడానికి వెళ్ళిన యువకులు అప్పుడపుడు, ఒక్కరొక్కరుగా రాత్రులందు వచ్చేవారు. కాని, యుద్ధం తీవ్రంగా సాగటంవల్ల అట్టి రాకపోకలు నిలిచిపోయి చాలా కాలమయింది. వారిని గురించి ఎన్ని రోజులుగానో ఎట్టి సమాచారంగానీ తెలిసిందికాదు. స్త్రీలందరూ, తల్లులూ, భార్యలూ దిగులుపడిపోయారు. దీనికితోడు చిగురింతకాలం వచ్చేస్తోంది. మంచు కరగగానే, ఏదో చేతనయినంతగా నేలను సాగుబడి చేయకపోతే, తామంతా ఆకలికి చనిపోవడాని కెంతోకాలం పట్టదని వారికి తెలుసు.

ఒకరోజు మిఖేల్ చాలా సంతోషంగా అలెక్సీ దగ్గరకు వచ్చి "అలెక్సీ ! దీనిని చూడు. ఇదేమిటో తెలుసా ? గరిక; పచ్చని గరిక. కరుగుతూన్న మంచు

నుండి తొంగిచూసిం దీ గరిక. చలికాలం వెళ్ళిపోతోంది. దేవుడి పుణ్యమా అని చలికాలానికి ముందునాటిన గింజలు మొలకెత్తబోతున్నాయి అనడాని కిది శుభ సూచకం. వసంతకాలం రాగానే తిరిగీ భూమిని దున్ని మనవాళ్ళు గింజలు జల్లుతారు. కొత్తపంట పండినా, పండకపోయినా చిక్కులేదు. ఈ పంట మనవాళ్ళందరికీ నెలా, రెండు నెలలు తిండిపెడుతుంది....ఇదిగో వెళ్ళి, ఇప్పుడే ఈ సంతోష వార్తను ఆడవాళ్ళందరికి చెప్పివస్తాను."

గది వెలుపలనుండి గలగలా మాట్లాడే స్త్రీల కంఠాలు వినిపించాయి. మిఖేల్ తాత తీసుకువచ్చిన పచ్చని గరిక వారి హృదయాల నానందపరచి, బ్రతికి బాగుపడే రోజులు రానున్నాయనే ఆశాంకురం లోతుగా వేరూనింది.

నాటి సాయంత్రం, చేతు లూపుకుంటూ. పెద్ద పెద్ద అంగలిడుతూ మిఖేల్ వచ్చాడు. అలెక్సీ పడుకొనివున్న గదిలోనికి వచ్చి రావటంతో:

"నా ఆడమంత్రివర్గం తీర్మానించినదేదో, నీకు చెప్పాలని వచ్చాను. మాంచి ఆలోచన, వారు సూచించిన విషయం, కొందరు స్త్రీలు పల్లంగానుండే భూమిని దున్నుతారు. ఇది కొంచెం గట్టినేల, ఆవులను నాగళ్ళకు కట్టడానికి నిశ్చయించారు; ఎద్దులు మన దగ్గరలేవుగా? అందుకనే ఆవులను కట్టకతప్పదు. అంత పెద్దమందా నశించిపోయి, ఇప్పుడు ఆరు ఆవులు మాత్రం మిగిలాయి. ఎత్తుగానుండే భూమిని మరికొందరు స్త్రీలు పారలతోనూ, మట్టిగొడ్డళ్ళతోనూ సాగు చేస్తారట. ఇక మూడో జట్టువారు, కొండల ప్రాంతానికి వెడతారు. అది ఇసుకనేల. దానిలో బంగాళా దుంపలు బాగా పెరుగుతాయి. బలం తక్కువవాళ్ళూ, చిన్నపిల్లలూ మూడో జట్టులోనుంటారు. అది తేలికయినపని, తరువాత దొరతనం వారి సహాయం తప్పక లభిస్తుంది. కాని దానికొరకని మేమేమాత్రమూ కనిపెట్టుకొని కూర్చోము. మా పనిని మేము అవిచ్ఛిన్నంగా నెరవేరుస్తాము. మన మొగవాళ్ళ పుణ్యమాఅని, జర్మను లిక్కడికి రాకుండా వారిని పారద్రోలారు. ఇచ్చటి భూమిలో నొక్క అంగుళమైనా వృధాపోనీయము. బ్రతికి బాగుపడే రోజులు వచ్చాయి, అలెక్సీ. మనమందరమూ బ్రతికి బాగుపడే రోజులువచ్చాయి." అని గుక్కత్రిప్పుకోకుండా చెప్పాడు.

ఆ రాత్రి మిఖేల్ తాతకు నిద్రపట్టిందికాదు, ఎన్నో పర్యాయములు లేచి ఇటూ, అటూ పచార్లుచేశాడు. ఆరిపోయిన దీపాన్ని వెలిగించాడు. తిరిగీ పడుకొన్నాడు, మరొకసారి లేచివెళ్ళి, గది వెలుపలనున్న బొక్కెనలో, పెద్దలోటాను ముంచి, నీరు త్రాగాడు. అలెక్సీ దగ్గిరికివచ్చి:

"అలెక్సీ! నిద్రపోతున్నావా? నాకు నిద్రపట్టటంలేదు. ఎంతసేపటి నుండో మేలుకొని ఆలోచిస్తూ పడుకొన్నాను. ఎంతకీ నిద్ర రానంటూంది. మనప్లావ్నీ గ్రామంలో పూర్వమొక పెద్ద ఓక్‌వృక్షం, ఊరు మధ్యలో నుండేది. ఒకనాడు

పెద్ద గాలీ వానవచ్చి దానిమీద పిడుగుపడింది. చెట్టుతల అంత దూరంగా ఎగిరిపడి, చెట్టంతా మధ్యకు చీలిపోయింది. కాని రెండు సంవత్సరాలు గడిచేటప్పటికి కొత్త కొమ్మ వొకటి మొలిచి పెద్దదై ఎన్నో ఉపశాఖలు, మొలిచి తల్లి వృక్షాన్ని మించిపోయింది. మన ప్లావ్నీ సంగతీ ఇట్టిదేనని నాకు గట్టినమ్మకంకలదు. దేవుడి దయవల్ల సకాల వర్షాలు పడితే, సోవియట్ పరిపాలన క్రింద ఐదంటే ఐదు సంవత్సరాల్లో తిరిగి ప్లావ్నీ పూర్తిగా కోలుకుంటుంది. యుద్ధమెప్పుడు ముగుస్తుందా అని జనులంతా కనిపెట్టుకొని వున్నారు. మేమందరమూచేరి ప్లావ్నీని తిరిగి నిర్మిస్తాము. దీనికెట్టి సందేహమూలేదు. ఏమంటావు, అలెక్సీ" అని అన్నాడు.

ఆ రాత్రి అలెక్సీ స్థితి తాతకూ, ఆ యింటివారికీ అదుర్దా కలిగించింది. వేడినీటి స్నానంవల్ల అతని నరాలు, మొదట్లో మత్తుపడినట్టున్నప్పటికీ, సాయంకాలినికవి పూర్తిగా మేల్కొన్నాయి. నిండు చైతన్యం వాటిలో చూపెట్టి, అలెక్సీని వేధించుకు తినటం మొదలు పెట్టాయి. ఒడలంతా. ఇంతకు పూర్వమెన్నడూ తా నెరుగనంతగా బాధపెట్టింది. తీవ్రంగా జ్వరం కాసింది. బల్లమీద నెమ్మదిగా పడుకోలేకపోయాడు. ఇటూ, అటూ తెగ దొర్లాడు. పండ్లు కొరికాడు. ఎప్పుడూ ఎవరినో ఒకరిని పిలవటమూ, తిట్టిపోయటమూ, అదికావాలీ, ఇదికావాలీ అని సంధిపట్టిన వాడిలాగా తెగవాగాడు పాపం.

ఆ రాత్రంతా వర్యా అతని ప్రక్కనే కూర్చొన్నది. నిద్రపోతాదేమో, తరువాత తానూ వెళ్ళిపడుకోవచ్చునని, మోకాళ్లమీద గడ్డమాన్చి, అతని వంక జాలిగా చూస్తూ ఆ రాత్రంతా గడిపింది. అతని తలమీదా; వక్షంమీదా, జ్వరం తగ్గడానికి తడిబట్టలు వేసింది మీద కప్పుకొన్న కంబళీని అలెక్సీ తీసిపారవేయటమూ, వర్యా తిరిగి కప్పటంతో ఆ రాత్రంతా గడిచింది. అతని కా విధంగా సపర్యచేస్తూన్నంతసేపూ వర్యా, ఎక్కడో యుద్ధభూమిలో నానా అగచాట్లూ పడుతూ వున్నతన భర్తను గురించి తలుచుకొని తలుచుకొని, ఒకటే కన్నీరు కార్చింది.

తెలతెల్లవారేటప్పుడు తాత మిఖేల్, నిశ్శబ్దంగా ఆ గదిలోనికి వచ్చాడు. అలెక్సీ మైమరచి నిద్రిస్తున్నాడు. వర్యాతో ఏవో రెండు మాటలు మాట్లాడి, ప్రయాణానికి సిద్ధమయ్యాడు. పాత మోటారు టైర్ల నుండి తాను స్వయంగా తయారుచేసిన బూట్సులుతొడిగి. బర్చి చెట్టు బెరడునుండి చేసిన నడుముపట్టీని, కోటుమీద బిగించాడు, జూనిపర్ కొమ్మనుండి, తయారుచేసిన చేతి కర్రనుచేబట్టి, అలెక్సీతో నొక్కమాటయినా చెప్పకుండా, తాత వెళ్ళిపోయాడు.

# 17

తాత వెళ్ళిపోయిన సంగతి అలెక్సీకి తెలియదు. ఆరోజంతా మత్తుగా, మరో ప్రపంచంలో నున్నట్టు పడుకొన్నాడు. మరునాడు మధ్యాహ్నం, సూర్య కిరణమొకటి, ఇంటికప్పు సందులనుండి ప్రవేశించి, అలెక్సీ ముఖాన పడింది. వెంటనే మెళకువ వచ్చింది. మిగతా గదిఅంతా చీకటి, చేత్తో తాకేటంత వత్తుగా పేరుకొనింది.

గదిలో నెవ్వరూలేరు, అలెక్సీతప్ప. వెలుపల నుండి వర్యా పాడేపాట ఏదో వినిపిస్తోంది. ఇచ్చటి జనులందరూ తరుచుగా పాడేపాటలలో నిది వొకటి. ఆష్‌వృక్షమొకటి. తనకంత దూరాన నిలబడిన ఓక్‌వృక్షాన్ని సంబోధించి పాడే పాట, ఇది. తనమాదిరే ఒంటరిగా నిలబడిన ఓక్‌వృక్షాన్ని చూసి జాలిపడి, దానితో మైత్రి నపేక్షిస్తుంది. ఆష్ చెట్టు.

పనిపాటలుచేయడానికి పనికివచ్చే స్త్రీలందరూ యీ పాటను పాడటం, అలెక్సీ పలుమార్లు విన్నాడు వారందరూ క్రొత్త విమానాశ్రయంకొరకు భూమిని చదునుచేస్తూ యీ పాటను పాడుకొనేవారు. ఇంతవరకూ దాని నంతగా గమనించని అలెక్సీ, నేడు దూరంనుండి వినవచ్చే యిదే పాటను విని చకితుడయ్యాడు. ఒంటరిపాటు బ్రతుకు. తన భర్త ఎక్కడో యుద్ధభూమిలో అష్టకష్టాలూ పడుతున్నాడు. అతనికొరకు తా నిక్కడ రోజులు లెక్కించుకుంటూ ఎప్పుడు వస్తాడా అని యెదురుచూస్తూ ఈ ఆష్‌మొక్క, వర్యా తన ఊపిరిపట్టు, తన సర్వస్వం, భర్తకొరకు ప్రలాపిస్తోంది; ఆ కంఠంలో దుఃఖం కరుడుగట్టుకు పోయినట్టు వర్యా పాడుకొంటోంది :

"కనిపించినట్టులే కనిపించి – మురిపించి
మరిపించి, మాయమైపోయావా ?
కంటకయుతమైన – ఒంటరి జీవితం
గడుపుకోమని, నన్ను విడనాడిపోయావా ?
దేనికొరకీ బ్రతుకు ?
ఏ దేవునికొరకీ బ్రతుకు ?"

అలెక్సీ మనోనేత్రానికి వర్యా వెలుపల చెట్టుక్రింద, కండ్లనిండా నీరు గ్రుక్కుకు కూర్చున్నట్టులగుపించింది. అతని కెందుకో ఏడుపు వచ్చేసింది, కండ్లు మండజొచ్చాయి. ఏదో అడ్డంపడ్డట్టు, గొంతు మ్రింగనిచ్చిందికాదు. తన జేబులోనున్న జాబులు జ్ఞప్తికి వచ్చాయి, వాటిలోనున్న ప్రతి వొక్క అక్షరమూ

అతనికి కంఠోపాఠంగా తెలుసు. కొలువగట్టున కూర్చున్న ఆ బాలిక చిత్రాన్ని చూడాలనిపించింది, తిరిగీ. ప్రక్కనున్న లాగూ జేబులోని ఉత్తరాలను తీసుకో డానికి యత్నించాడు. కాని, శక్తి చాలిందికాదు. చేయి తోటకూరకాడలాగా బల్ల మీద పడిపోయిందేకాని, లేవనెత్తలేకపోయాడు. తిరిగీ ఆ గదంతా చీకటి పడి పోయినట్టూ, దానినిండా ఏదో రంగురంగుల పొగలు లేస్తూ తాను వాటితో తేలి పోతున్నట్టూ అలెక్సీకి తోచింది..

ఇద్దరి గొంతులు వినిపించాయి. ఒకటి వర్యా, రెండోది ఎవరో ఒక ముసలామె. ఆ రెండో కంఠాన్ని ఎప్పుడో తాను వినినట్టు లాతనికి తోచింది.

"ఏ విధమైన ఆహారంగానీ తిననే తినడా ?"

"తినలేడు. నిన్న నొక చిన్నరొట్టెతునక, చాల చిన్న తునకను తినాలని యత్నించాడు. పాపం మ్రింగుడుపడిందికాదు సరిగదా, వాంతి చేసుకొన్నాడు. పాలుతప్ప వేరే ఏదీ మ్రింగుడుపడదు."

"చూడు. వర్యా ! నేను మంచి చారు తెచ్చాను....పాపం, రెండు గుటకలు త్రాగితే బాగుండును. ఏమంటావు ?"

"వాసిలిసా అత్తా ! నిజంగా నీవు చారు తయారుచేసి...."

"మరి ? కోడిమాంసం చారు....ఎందుకట్లా చూస్తున్నావు. ఇదేమంత బ్రహ్మాండమయిన వస్తువు గనుక ?.........నెమ్మదిగా లేపు. కొంచెం త్రాగించి చూద్దాము.

ఈ మాటలన్నీ వింటూన్న అలెక్సీ కళ్లు తెరిచేలోగా వర్యా అతనిని బలం కొద్దీ కదిపి, పట్టరాని సంతోషంతో :

"అలెక్సీ ! అలెక్సీ ! ! మేలుకో. వాసిలిసా అత్త నీకు కోడిమాంసం చారు తీసుకువచ్చింది. లే !"

గదిలోని దీపకాంతిలో నొక ముదుసలి స్త్రీ చిలుకముక్కూ, తీక్షణమైన నేత్రాలూ, పెద్ద గూనూ, చాలా తమాషాగా కన్పించిం దాతనికి. ఆమె బల్లదగ్గిర నిలబడి తాను తెచ్చిన మూటను దానిపై పెట్టింది. దానికి చుట్టిన గోనె పట్టాను విప్పింది. దాని కడుగున తన దొక పాతకోటు చుట్టబడింది. దీనినే తీస్తే, నాలు గైదు మడతలుగా మడిచిన కాగితం. కాగితం లోపల చిన్న గిన్నె. ఆ గిన్నె మూత సందులనుండి గుప్పున చారువాసన కొట్టింది. అలెక్సీ కడుపులో జఠరాగ్ని ఒక్కపెట్టున లేచినట్టు కడుపంతా కాలిపోజొచ్చింది.

తనవనేమో, తానేమో అన్నట్టు వాసిలిసా ఉండిపోయిందేకాని తలఎత్తి చూసిందికాదు, తల వంచుకొనే :

"చూశావా, అబ్బాయీ. నీ కొరకని ఈ చారును కాచితెచ్చాను....వద్దని చెప్పకు, బాబూ.... త్రాగు.... తంద్రీ బలంపట్టుతుంది.... దేవుడు మేలుచేస్తే త్వరలో కోలుకొంటుంది, వళ్ళు"

ఈ ముసలామె పడ్డకష్టాలూ, ఆమెకల్లా మిగిలినదొకే ఒక కోడి, పాస్ట్రీ సంకా తప్ప వేరెద్దీలేదనే సంగతీ అలెక్సీకి జ్ఞాపకానికి వచ్చింది.... అతని కండ్లు నీరు నిండి పోయాయి. వర్యా, ఆ గదీ, బల్లా, దానిపైనున్న చారుగిన్నె అన్నీ నీటిలో తేలిపోతున్నట్టు లగుపించాయి. ఎంతో జాలిగా తనకేసి చూసే ముసలమ్మ కళ్లు మాత్రం, అతనికి స్పష్టంగా కనిపించాయి.

ఆ అవ్వ వెళ్ళిపోవడానికి సిద్ధపడటం చూసి, "అవ్వా! నమస్కారాలు" అని మాత్రం అలెక్సీ అనగలిగాడు.

వెంటనే ఆమె వెనుతిరిగింది:

"అదేంమాట? నమస్కారాలట? ఎందుకు? నా కొడుకులు యుద్ధం చేస్తున్నారు. పాపం! ఎట్లాగున్నారో ఎవరికితెలుసు, ఎవరైనా వాళ్ళకూ ఇంత చారు త్రాగిస్తారులే.... త్రాగు బాబూ....త్వరలో లేచితిరగాలి, ఇంకా ఈ విధంగా పడుకోరాదు.....సరా?"

"అవ్వా! అవ్వా!!" అంటూ ఆమెకేసి చేతులుజాపి, అలెక్సీ లేవబోయాడు. వర్యా, బలవంతంగా అతన్ని పడుకోబెట్టింది.

"ఏదీ, రెండు గుక్కలు త్రాగు" అంటూ, కాడవిరిగిన దొక అల్యూమినియం గరిటెలో రవంతచారును పోసి నోటికి అందించింది. "నెమ్మదిగా, త్రాగడానికి యత్నించ" మంటూ. తన ముఖము నవతల ప్రక్కకు త్రిప్పుకొన్నది. తాను ఏడుస్తున్నాననే సంగతి అలెక్సీకి తెలియరాదు.

"మిఖేల్ తాత ఏదీ?"

"పనిమీద వెళ్ళాడు. జిల్లా సంఘంవారిని కలుసుకోడానికని వెళ్ళాడు. తిరిగీ రావడానికి కొన్ని రోజులు పట్టుతాయి....అదంతా యిప్పుడెందుకులే.... ఏదీ?....రవంత చారుత్రాగు."

ఒక్క గుటక వేసాడో లేదో, ఎక్కడలేని ఆకలి పుట్టుకు వచ్చింది. కడుపంతా బిగతీసుకుపోయినట్టు తిమ్మిరెక్కింది, పదంటే పది చెంచాలు చారు మాత్రం త్రాగి, అంతటితో ఆగాడు. ఒక గంగాళం నిండుగా చారునిచ్చినా త్రాగాలనే ఆశ వున్నప్పటికీ, బలవంతంగా అంతటితో త్రాగటం మానుకొన్నాడు. ఈ బలహీనస్థితిలో ఇంకొక్క చెంచాడు చారు నెక్కువగా త్రాగినా, అదెంతో ప్రమాదకరమని అలెక్సీ గ్రహించగలిగాడు. అధికస్య అమృతం విషం.

మనస్సు నెమ్మదించింది. శరీరం బిగువు సడలింది. తీయటి నిద్రవచ్చింది. కొంత సేపయిన తరువాత మెలకువ వచ్చింది. మరింత చారు త్రాగాడు. తిరిగీ నిద్ర. గాఢనిద్ర. కుంభకర్ణుడి మాదిరి నిద్రించాడు. గందరగోళంగా మాట్లాడే తోడి స్త్రీల మాటలుకానీ, తా నెంత పిలిచినా, కదిపినా కూడా నిద్ర మేలుకొనక పోవటమూ చూచి వర్యా చాలా భయపడింది. ప్రాణం పోయిందేమో నని భయపడి, పదే పదే అతని గుండెమీద చేయిపెట్టి చూసింది.

బ్రతికేవున్నాడు. గుండె నెమ్మదిగా కొట్టుకొంటోంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తాపీగా సాగుతున్నాయి. ఆ రాత్రంతా నిద్రించాడు. మరునాడూ పూర్తిగా నిద్రించాడు. పిడుగుపడ్డాకూడా లేచేటట్టు లేడు.

మరునా డేదో శబ్దం; ఝుంయ్యి మనే శబ్దం; చాలా దూరంనుండి వినబడింది. అప్పు డప్పుడే తెల్లవారుతోంది. అలెక్సీకి మెలుకువ వచ్చింది. చెవి యొగ్గి విన్నాడు. తలగడనుండి రవంత తలనెత్తి, పంకించి ఎంతో శ్రద్ధగా ఆ దూరపు శబ్దా న్నాతడు వింటున్నాడు.

వెర్రి సంతోషమూ, అనిర్వచనీయమైన ఆవేశమూ అలెక్సీ ముఖంలో కనిపించాయి. కొయ్యబారిపోయి పడుకొన్నాడే కాని, కండ్లు రెండూ, రెండు జ్యోతుల్లాగా మెరిసిపోతున్నాయి. ఇలకోళ్ళశబ్దం యింకా వినిపిస్తోంది. రాత్రంతా మండి తెల్లవారుతోం దనగా చల్లారిపోయే పొయ్యినుండి మిణుకు మిణుకుమంటూ మంట కనిపించింది. పైన్ వృక్షశాఖలు గాలిలో వూగిసలాడుతూ దూరపు సముద్రఘోష మాదిరి శబ్దం చేస్తున్నాయి. వాటినుండి క్రిందపడే మంచునీటి బిందువులు టప్పు టప్పున శబ్దం చేస్తున్నాయి. ఈ రకరకాల శబ్దాలతో మిశ్రమై ఝుంయిమనే శబ్దం! వైమానికుడు, అలెక్సీ కా శబ్దమేమిటో ఇప్పు డర్థమయింది. విమానపు టింజనుల శబ్ద మది! ఆ శబ్దం, తెరలుతెరలుగా లేచిపడే అలలమాదిరి ఎంతో దూరంనుండి వినిపిస్తోంది. ఏదో విమాన మొకటి ఆ ప్రాంతంలో ఎగురుతోందనడాని కెట్టి సంశయమూ లేదు. ఆ విమానం ఆకాశంలో గుండ్రం గుండ్రంగా చుట్టుతూ ఎగురుతోంది. ఒకవేళ ఆ ప్రదేశాన్ని పరీక్షిస్తోంది కాబోలు! లేకపోతే, క్రింద దిగడానికి తగిన జాగాకొరకు వెతుకుతున్నదేమొ?

మోచేతిమీద లేచి "వర్యా, వర్యా" అని అలెక్సీ గట్టిగా అరిచాడు.

వర్యా ఆ గదిలో లేదు. ఇంటి వెలుపలనుండి ఆడవాళ్ళ గొంతుకలు బహు గందరగోళంగా వినిపిస్తున్నాయి. అటూ, ఇటూ వారంతా ఎంతో ఆదుర్దాగా నడుస్తూన్న అడుగుల చప్పుడు. ఏమి టీ గల్లంతు? ఎందుకొరకు?

ఉన్నట్టుండి గదితలుపు తెరవబడింది. ఫెడ్కా తొంగి చూశాడు:

"వర్యా అత్తా! వర్యా అత్తా!! ఎగురుతోంది....గుండ్రంగా చుట్టుతోంది.... మన వూరిమీద, సరిగ్గా మన ఇండ్లమీద, ఆకాశంలో చుట్టుతోంది" అని అరిచి, అలెక్సీ "ఏమిటీ?" అని అడిగేలోగా ఆ అబ్బాయి వెళ్ళిపోయాడు.

ఎంతో కష్టపడి అలెక్సీ లేచి కూర్చున్నాడు. అతని గుండె అదిరిపడి కొట్టుకొంటూన్నది. తీవ్రవేగంతో రక్త మాతని నాడులగుండా పరువులిడుతోంది. పాదాలు వేడిగా కాలిపోతున్నాయి. పైన ఆకాశంలో గుండ్రంగా తిరిగే విమానపు శబ్దాన్నిబట్టి అదెన్ని పర్యాయములు గుండ్రంగా చుట్టూతున్నదీ లెక్కపెట్టు తున్నాడు అలెక్సీ. ఒకసారి, రెండు, మూడు, నాలుగు పర్యాయములు లెక్కపెట్టాడు' అంతే. తిరిగీ నిద్ర త్రోసుకొనివచ్చింది. కండ్లు తమంతట తామే మూతలు పడ్డాయి. మరునిమిషం గురకపట్టి నిద్రపోయాడు.

కంచుకంఠం. అధికారపూరితమైన కంఠం. ఆ గదంతా మారుమ్రోగే కంఠం. అలెక్సీకి వినబడి నిద్రలేచాడు. ఎంత దూరంనుండి వినబడినా, ఎందరి మాటలతో కలిసి వినపడినా కూడా ఆ కంఠమెవరిదో అలెక్సీ యిట్టే కనిపెట్టగలడు. విమాన దళాధికారి, ఆంద్రీ డెగ్ట్యారెంకో దా కంఠం !

కండ్లు తెరిచి చూసాడు. సాక్షాత్తూ ఆంద్రీ నిలబడ్డాడు తన కెదురుగా. విశాలమైన నుదురూ, ఎత్తు చెంపలూ, కుడిచెంపమీద రెండు మూడంగుళాల కత్తివ్రేటుమచ్చా గోధుమరంగు కనుగ్రుడ్లూ, తెల్లని కనురెప్ప వెంట్రుకలూ, అచ్చంగా ఆంద్రీయే, ఆ మనిషి. "పందిరెప్పలని" అతనిని నలుగురూ ఎగతాళి చేస్తారు. ఇదికూడా అలెక్సీకి జ్ఞప్తికి వచ్చింది కాని, ఇదంతా ఏదో వొక కల, నిజంకాదని అనుకొన్నాడు. ఆంద్రీ యిక్కడికి వస్తాడని కలలోకూడా అలెక్సీ అనుకోలేకపోయాడు.

"తాతా ! ఏడీ, ఈ విచిత్రపు మనిషి ?" అని వచ్చిన ఆయనని అడిగాడు. సందేహంలేదు. తా నెరగనిది కాదు, ఈ కంఠం.

ఆ రూపం అకస్మాత్తుగా వచ్చి తన ఎదుట నిలిచినట్టే తిరిగి అకస్మాత్తుగా మాయమవుతుందని అలెక్సీ అనుకొన్నాడు. కాని అట్టిదేదీ జరిగింది కాదు. విశాల వక్షం అతని అలవాటుచొప్పున పై రెండు గుండీలూ పెట్టుకోకుండా తొడుగు కొన్న ఆ కోటూ, డెగ్ట్యారెంకో అనడాని కెట్టి సందేమూ లేదు. చేతిలోనున్న టోపీనుండి రేడియో తీగెలు వ్రేలాడుతున్నాయి. పొట్టిగా కత్తిరించుకొన్న తల వెంట్రుకలమీద ఆ గదిలోనున్న గుడ్డిదీపపు కాంతి పడుతోంది. ఏవేవో పొట్లాలను చేతిలో పట్టుకొని నిలబడ్డా డా మనిషి. డెగ్ట్యారెంకో తా నెరుగనివాడు కాడు. చిరకాలపరిచయం కలదు, అతనితో.

డెగ్ట్యారెంకో వెనుక మిఖేల్‌తాత నిలుచున్నాడు. ఆయన నేత్రాలు రెండూ, రెండు నక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి ఆదుర్దాతో. ఆతని వెనుక నొక నర్సు. చప్పిడిముక్కు లెనోచ్కా అని ఆమెను అలెక్సీ, ఇతర వైమానికులందరూ పరిహసించేవారు. ఆమె చేతిలో ఎర్రసిలువ సంచీ వొకటీ, ఏవో కొత్తరకం పూవులుకొన్నీ వున్నాయి.

అందరూ నిశ్శబ్దంగా నిలబడ్డారు. చీకటిలో ఏదీ కనిపించింది కాదు కాబోలు డెగ్ట్యారెంకో ఆ గదంతా దేనికొరకో వెతుకుతూన్నట్టు చూస్తున్నాడు. ఒకటి, రెండు పర్యాయములు అలెక్సీ పడుకొన్న బల్లవంక చూశాడు. కాని, దానిమీద నొక మనిషి వున్నట్టు లాతనికి తెలిసిందికాదు. అలెక్సీ కింకా తాను కలగంటున్నాడా, లేక ఇదంతా యథార్థమా అనే విషయం బోధపడలా.

"నీకు కనిపించడంలేదా? ఇదిగో యిక్కడ పడుకొన్నాడు చూడ"మని వర్యా, అలెక్సీ పైనున్న కంబళీని తొలిగించింది.

డెగ్ట్యారెంకో విచిత్రంగా అలెక్సీ ముఖంవంక తేరిపారజూచాడు.

"ఆంద్రీ!" అని అంటూ అలెక్సీ కొద్దిగా తలపైకెత్తి మోచేతిమీద లేచాడు.

"ఆంద్రీ! నన్ను నీవు గుర్తుపట్టలే కున్నావా?" అని గద్గదస్వరంతో అలెక్సీ అన్నాడు. అతని కాళ్ళూ, చేతులూ తెగ వణికాయి.

ఎముకల బొమ్మమీద నల్లగామాడిన చర్మం. ఈ ఆకారమెవరిదా అన్నట్టు ఆంద్రీ, అలెక్సీని చూస్తూ నిలబడ్డాడు. తా నెరుగున్న అలెక్సీకి యీ మానవాకారపు అస్థిపంజరానికీ పోలిక కుదిరిందికాదు. కండ్లు! అవును, ఆ రెండు కండ్లూమాత్రం ఏదో చిరపరిచితమైన మనిషి వన్నట్టు లగుపించాయి ఆంద్రీకి. వాటిలో అతని కెట్టి పోలిక గోచరించిందో అకస్మాత్తుగా ఆంద్రీ చేతిలోనున్న ఉక్కుటోపీ నేలమీద పడింది. చేతిలోనున్న పొట్లాలన్నీ క్రిందపడ్డాయి. వాటికి కట్టినకట్లు సడలి నేల మీద నారింజలు, ఆపిల్‌పండ్లు, బిస్కత్తులు పరుగులిడుతున్నాయి!

"లియోషా! నీవేనా?" అన్నాడు, గద్గదస్వరంతో. అతని కండ్లు మూతపడ్డాయి. "లియోషా! లియోషా!!" అంటూ ఆ పేరును స్మరించాడు. పసిబిడ్డ నెత్తుకొన్నంత తేలికగా అలెక్సీని తన రెండు చేతుల్లోకీ తీసుకొని, గాఢంగా వక్షానికి అదిమిపట్టి "లియోషా! మిత్రమా! నా లియోషా" అంటూ తెగవాపోయాడు, ఆ చెట్టంత మనిషి.

చేతులు జాపి, దూరంగా అలెక్సీని పట్టుకొని తిరిగీ పరీక్షించాడు. ఈ మానవుడు అలెక్సీ అని రూఢికాగానే, తిరిగీ తన హృదయానికి హత్తుకొని పెద్దగా నిట్టూర్చాడు.

"నీవే! సందేహంలేదు. లియోషా, నీవే! ఓరి! నీ దుంపతెగా! ఎంత మారిపోయావు" అన్నాడు. వర్యా, నర్సూ చేరి నెమ్మదిగా అలెక్సీని అతని చేతులనుండి తీసుకొని బల్లమీద పడుకోబెట్టారు. వెర్రి ఆవేశంతో యెక్కడ నలిపేస్తాడో అనే భయం వారికి కలిగింది.

"వదిలిపెట్టు, కొనవూపిరితో నున్నాడు" అంటూ వర్యా; "ఇటువంటి వుద్రేకం రోగికి మంచిదికాదు. పడుకోబెట్టు మ"ని నర్సూ చెబుతూ అలెక్సీని పడుకోబెట్టారు.

ఎంతకాలంగానో కనుపించకపోబట్టి యెప్పుడో చనిపోయాడని తమవా రంతా అలెక్సీని చనిపోయినవాళ్ళతో జమకట్టారు. ఆ అలెక్సీ బ్రతికేవున్నాడు. రెండు చేతులతోనూ తన కణతలను బలంకొద్దీ అదిమి పట్టుకొని, ఉన్నట్టుండి పెద్ద కేక వొకటి పెట్టాడు. ఆంద్రీ. అలెక్సీ భుజాలమీద తన రెండు చేతులూపెట్టి ఆతని కళ్ళల్లోకి నిదానించి చూశాడు. ఆ కళ్లు సంతోష సముద్రాల్లాగా, లోతుగా, గాంభీర్యంగా కనిపించాయి ఆంద్రీకి.

"బ్రతికేవున్నాడు! తస్సాదియ్యా, బ్రతికేవున్నావురా!! ఇన్ని రోజులుగా ఎక్కడ దాక్కొన్నావు? ఏం జరిగింది?"

లెఫ్టినెంట్ లినోచ్కా అని ఒక్కనాడైనా యెవ్వరూ యీ నర్సును పిలిచిన పాపాన పోలేదు. అందరికీ "చప్పిడిముక్కు" నటమే అలవాటయిపోయింది. పై అధికారిని చూడటానికి వెళ్ళినపుడు "వైద్యశాస్త్ర సోదరి" అని తన్ను తాను పరిచయం చేసుకొన్న యీ వెర్రిబాగుల నర్సు వైమానికులందరినీ తన మనసారా ప్రేమిస్తున్నానని చెప్పుకొనేది! ఆ వెర్రిపిల్ల లినోచ్కా.

"కాప్టెన్ సోదరా! జబ్బుమనిషినుండి తొలిగిపో. ఇది నేను నర్సు లినోచ్కాను చెప్పుతున్నాను. పో!" అని అధికారంతో పలికింది ఆంద్రీని చూసి.

తాను తెచ్చిన పూవు లిప్పు డక్కరకురావు, అలెక్సీ సమాధిమీద పెట్టాలని ప్రత్యేకంగా ఆ పనిమీదే విమానంలో వెళ్ళి తెచ్చిం దీ పూలగుత్తిని. వాడిపోయిన ఆ కుసుమగుచ్ఛాన్ని బల్లమీద పారేసి తన భుజానికి తగిలించుకొన్న ఎఱ్ఱ సిలువ సంచిని తెరిచి, అలెక్సీని పరీక్షించడం మొదలుపెట్టింది.

ఆతని కాళ్ళను వ్రేళ్ళతో టప్పుటప్పున మోది "నొప్పి పెట్టుతోందా? ఇక్కడ? ఈ చోటా?" అని అడిగింధి.

తలెత్తి అలెక్సీ తన కాళ్ళను చూశాడు. పాదాలు బాగా ఉబ్బిపోయాయి. నల్లగా కమిలాయి. రవంత తాకినాసరే వెంటనే విద్యుల్లతవలె నొప్పి శరీర మంతటా వ్యాపించింది. ఆతని కాలివ్రేళ్ళను చూస్తే లినోచ్కాకు భయంవేసింది. అవి మరీ మాడిపోయి గట్టిగా కొయ్యముక్కల్లాగా నున్నాయి. వాటిని తాకినా, గిచ్చినా అలెక్సీ కేమాత్రం కూడా తెలిసిందికాదు.

మిఖేల్ తాతా, ఆంద్రీ ఇద్దరూ బల్లదగ్గిర కూర్చున్నారు. ఆంద్రీ తెచ్చిన బ్రాంది సీసాలోనుండి తాత రెండు, మూడు ఔన్సులు త్రాగాడు, "పర్వదినం ఆంద్రీ! నేడొక పండుగరోజు" అంటూ మరొక పర్యాయం బ్రాంది సేవించాడు మిఖేల్. కీచుకంఠంతో, బిగ్గరగా అలెక్సీ ఎప్పుడు వారికి కనిపించిందీ, ఎక్కడ వారికి కనిపించిందీ అన్ని విషయాలూ తాత గుక్క త్రిప్పుకోకుండా ఆంద్రీకి చెప్పుతున్నాడు. ఈ విధంగా అలెక్సీని గురించి ఎంద రెందరికి ఎన్ని పర్యాయ ములు తాను చెప్పాడో మిఖేల్ కే జ్ఞాపకంలేదు.

"మా పిల్లవాళ్లిద్దరు, చెట్లు పడగొట్టిన జాగాలో ఇతన్ని చూచారు. జర్మనులు చుట్టి చెట్లను పడగొట్టి, కట్టెలు నరికారు. ఈ పిల్లల తల్లి, అంటే నాకూతురు, వాళ్లిద్దరినీ చితుకులు ఏరి తెమ్మని అక్కడికి పంపింది. 'అక్కడేదో తమాషాగా కనిపిస్తోంది. ఏమిటదీ?' అని మొదట్లో వారనుకొన్నారు. అలెక్సేని దూరం నుండి చూసి 'దెబ్బ తగిలి నడవజాలక దొర్లుకుంటూ వస్తోంది. ఎలుగుబంటిరా. బాబో' అనుకొని ఇద్దరూ పారిపోయారు.' ఇదేదో విచిత్రమైన ఎలుగులాగున్నది. అన్ని ఎలుగుగొడ్ల మాదిరీ కనుపించటంలేదు. ఎందు కివ్విధంగా దొర్లుకొంటూ వస్తోందో పరీక్షగా చూడటానికి చెట్టుకొమ్మల్లో దాక్కొన్నారు.

డెగ్త్యారెంకో తన సిగరెట్ డబ్బాను తాత చేతికిచ్చి "దొర్లుకుంటూ రావటమా? అంటే?" అని ప్రశ్నించాడు.

తాతయ్య ఒక సిగిరెట్‌ను తీసుకొని, తన జేబులోనున్న పాత వార్తా పత్రికనుండి ఇంతకాగితం చింపాడు. సిగరెట్‌కు చుట్టిన కాగితాన్ని చింపి, ఆ పొగాకు నంతా తన కాగితంలో పోసాడు. తానే దాని నొక సిగరెట్టుగా చుట్టి, వెలిగించి, రెండు దమ్ములు పీల్చాడు. తరావాత.

"సిగిరెట్ త్రాగుతావా అని అడిగావా? ఓ! త్రాగుతాను! నాకు అలవాటేలే" అని తాత చెప్పటం ప్రారంభించాడు. "జర్మనీవాళ్లు వచ్చాక పొగాకే దొరికిందికాదు. కాబట్టి ఎండబెట్టిన నాచు సిగరెట్టులను త్రాగటం నేర్చుకొన్నాను.... ఒక్కొక్కప్పుడు స్ప్రూజి ఆకులను చుట్టచుట్టి బీడీలను త్రాగేవాడినికూడా. ఏమిటీ నీ వడిగింది?.... అదా?....అవును దొర్లుకొంటూవచ్చాడట, నేను చూడలేదుగా? ఎట్లా దొర్లాడో నాకు తెలియదు. అలెక్సేని అడిగే తెలుసుకోవాలి. తరువాత. వీపుపై పడుకొన్నవాడల్లా ప్రక్కకు తిరిగి పొట్టమీదా. మరల ఒత్తిగిలి ఇదేమాదిరి వీపుమీదా మారిమారి పడుకొని దొర్లుకుంటూ వస్తున్నాడని మన అబ్బాయిలు చెప్పారు. చేతులూ, కాళ్ళమీదా దేక్కొంటూ వెళ్ళడానికి శక్తిలేకపోయింది. పాపం! చూశావా, నీ స్నేహితు డెంత గట్టివాడో!"

వర్యా, నర్స్యా చేరి అలెక్సేని మెత్తని ఉన్నికంబళ్ళలో వెచ్చగా చుట్టి పడుకోబెట్టుతున్నారు.

"ఫరవాలేదు. ఏమంత నొప్పిలెద్దూ?....చిన్నబిడ్డల్లాగా దిగంబరంగా ఎంత కాలం పడుకోగలవు గనుక?....ఈ నర్స్య తెచ్చిన కంబళ్లు ఒంటినిండా కప్పుకొని పడుకుంటే, ఎంతో తేలికను పడుతుంది నీ ప్రాణం...." అని మిఖేల్ అలెక్సేని ప్రోత్సహించాడు. తరువాత అంద్రీతో "నే చెప్పింది జాగ్రత్తగా విన్నావా? మీ పై అధికారుల కీ సంగతి చెప్పు. అలెక్సీ అసాధ్యుడు. ఇప్పటికి, చాదాపు ఒక వారం రోజులుగా మే మందరమూ ఎన్నోవిధాల ఇతనికి సహాయం చేశాము. కాని, ఇంకా ఎంత బలహీనమైన స్థితిలోనున్నాడో, నీకే తెలుస్తోందిగా, ఇదేమనిషి

ఒంటరిగా అడవుల్లో పడి, ఎత్తుపల్లాల లెక్కించకుండా, చిత్తడి భూముల సరకు చేయకుండా దొర్లుకుంటూ, దొర్లుకుంటూ వచ్చాడు. ఒంటికాలిమీద నిలబడి జపం చేయటమూ, ముండ్లపాన్పుపై పడుకోటమూవంటిపనుల కిదేమీ తీసిపోని సాహస కార్యం....ఏమంటావు ? ఎంత మంది కిట్టి మనోనిబ్బరం వుంటుంది?....ఊఁ ?"

డెగ్ట్యా రెంకోకి మరింత దగ్గరగా వెళ్ళి చెవులో నీ విధంగా చెప్పాడు, మిఖేల్. తాత గడ్డం అతని చెవికి తగిలి, గిలిగింతలు పెట్టింది. కాని, దూరంగా వెడితే ఏమనుకొంటాడో ?

"ఫరవాలేదు. చచ్చిపోడని నాకు ధైర్యం చిక్కింది. జర్మనులనుండి తప్పించుకొన్నవాడు, యముడినుండి తప్పించుకోగలడని ధైర్యంగా చెప్పవచ్చు.... అవునా ? ఎముకలూ, చర్మమూ తప్ప వేరేదీ లేదు. ఏ విధంగా దొర్లుకుంటూ రాగలిగాడో, ఆశ్చర్యం వేస్తుంది, ఇప్పటికీ. ఏదోవొక విధంగా తన వాళ్ళను చేరుకోవాలనే ఆశ అతని కింత బలాన్నిచ్చింది. సంధి పట్టినప్పుడల్లా, "విమానాశ్రయం." "విమానాశ్రయం" అని పలువరిస్తాడు. ఇంకొకటి, 'ఓల్గా' 'ఓల్గా, అంటాడు. ఈతనికి పెండ్లయిందా ? భార్యాపేరు నీకు తెలుసా ? ఎవరీ ఓల్గా ?.... ఆంద్రీ ! నేను చెప్పేమాటలు వింటున్నావా, లేదా ? ...విన్నే, డెగ్ట్యారెంకో, అడుగుతూన్నది "

ఆంద్రీ మరొక ప్రపంచంలో వున్నాడు. మిఖేల్ అడిగే ప్రశ్నలాతని చెవిని పడ్డాయికావు. అలెక్సీ వొక స్వ సాధారణమయిన వైమానికుడని అందరికీ తెలుసు, అతనిలో ఎట్టి ప్రత్యేక గుణాలు కాని ప్రాముఖ్యంగా కనిపించాయి కావు. .... అట్టివాడు. పాదాలు చితికిపోయి, కాళ్ళూ చేతులూ స్వాధీనం తప్పి ఎంత దూరం. ఎన్ని రోజులు దొర్లుకుంటూ వచ్చాడు ! .... ఒంటరిగా, నిర్మానుష్యమైన అరణ్యంలో, తిండీ తిప్పలూ లేక, ఆకలి దప్పుల జయించి దొర్లుకుంటూ వచ్చాడు !! శత్రువిమానం కంటపడితే చాలు, చివాలున తన విమానంలో పైకిలేచి వెళ్ళటమూ, మారణ యుద్ధంలో పాల్గొనటమూ, చావంటే ఇసుమంతయినా భయం లేకపోవటమూ : ఇవన్నీ డెగ్ట్యారెంకోకు తెలుసు.... కాని, దొర్లుకుంటూ రావటం ? ....దుస్సాధ్యం....తానెప్పుడూ చేయజాలడని ఆతనికి తోచింది.

"ఎప్పుడు మీకగుపించాడు ?"

"ఎప్పుడా?" అంటూ, మిఖేల్ తాత మరొక సిగరెట్టును తీసుకొని. మునుపటి మాదిరే పొగాకునంతా వేరొక కాగితంలోపోసి. చుట్టి వెలిగించాడు. "అవును ఎప్పుడూ, మాకు కనుపించింది ?" ఆ. జ్ఞప్తికి వచ్చింది, వెంట్ పండుగకు మొదటి రోజు....అంటే, నేటికి సరీగ్గా ఒక వారంరోజుల క్రితం."

డెగ్ట్యారెంకో తేదీలు లెక్కపెట్టుకొని చూసాడు. పద్దెనిమిది దినాలు. అన్నం నీరూ లేకుండా, అరణ్యంలోపడి, అలెక్సీ దొర్లుకుంటూ వచ్చాడు ! నమ్మశక్యమయింది కాదు.

గాఢంగా తాతను తన హృదయానికి అదుముకొని, "తాతా! నీ ఋణం తీర్చుకోడానికి వీలులేదు. నీకు నా కృతజ్ఞత నెట్లా చూపెట్టాలో తెలియటంలేదు, సోదరా" అన్నాడు.

"కృతజ్ఞత ?.... ఎవరికి కృతజ్ఞుడవయ్యా ?....నాకా ?....ఎవరన్నా వింటే నవ్విపోతారు ఆండ్రీ....కృతజ్ఞత! నేనేమన్నా పరాయివాడినా ? ....కాదా ? .... సరే....మరి, కృతజ్ఞత అనిఅంటా వెందుకు ?" తలవంచి, దిగాలుబడి నిలుచున్న వర్యాను చూసి, "అమ్మాయీ....ఎందుకట్లా నిలబడ్డావు ? చూడూ! నేలమీద పడిపోయిన ఆ వస్తువు లన్నిటినీ ఎత్తి పెట్టరాదూ ?....కృతజ్ఞత అంటున్నాడే మనిషి! అహోహో" అని నవ్వుకొన్నాడు.

నర్సు లినోచ్కా తన పనిని పూర్తిచేసింది. "లెఫ్టినెంట్ అలెక్సీ! నీవేవిధ మైన దిగులూ పడనక్కరలేదు. ప్రయాణానికి నిన్ను సిద్ధపరిచాను, మాస్కో నగరంలో ఇంతకంటె గొప్పగొప్ప గాయాలు తగిలినవారికి చికిత్స చేస్తారు. త్వరలో, బహుకొద్ది రోజుల్లో నీవులేచి తిరుగకపోతే, నాపేరు లినోచ్కాకాదు." అని అన్నది.

పదేపదే మాస్కోలో అతని శరీరం బాగుపడుతుందని నర్సుచెప్పే మాటల నుండి, దెగ్త్యారెంకోకు అలెక్సీయొక్క నిజస్థితి బాగా విదితమయింది. చాలా ప్రమాదకరమైన స్థితిలో నున్నాడని ఆండ్రీ గ్రహించాడు....తిరిగి తిరిగి ఆమె అదేమాటలు చెప్పటం ఆండ్రీకి విసుగెత్తించింది, 'చెవికోసిన నక్కమాదిరి' ఒకటే వాగుడని అనుకొన్నాడు. ఈ నర్సు కంతతెలివితేటలు లేవని, తమ దళం వారందరూ చెప్పుకొనటం కద్దు. ఆమెకు తెలిసిందల్లా ఒక్కటే ఒక్కవిషయం; మదపిచ్చపట్టినవారిని ఇట్టే సరిచేయగలదట!....కాబట్టి లినోచ్కా చెప్పేమాటలకు తానంతగా గాబరా పడనక్కరలేదని, తిరిగీ ఆండ్రీ తనకు తానే ధైర్యం చెప్పు కొన్నాడు.

ఒడలంతా పూర్తిగా ఉన్ని కంబళ్లు చుట్టారు. తలమాత్రం కనిపిస్తోంది. తాను చిన్నతనంలో ఈజిప్టు దేశచరిత్రను చదివేటప్పుడు. ఫెరోరాజుల శవాల పటాలీమాదిరివే పుస్తకంలో వుండేవన్న విషయం దెగ్త్యారెంకోకు జ్ఞాపకానికి వచ్చింది; అలెక్సీ ముఖాన్ని తడివి చూసాడు, ఆండ్రీ. ఎర్రటి, బిరుసుగడ్డం మేకుల్లాగా అతని చేతికి గ్రుచ్చుకొన్నది.

"లియోషా! అధైర్యపడకు. అంతా సలక్షణంగా ముగిసిపోయింది" (ఈ మాటలు విని అలెక్సీ అదిరిపడ్డాడు)........"నిన్ను వెంటనే మాస్కోకు విమానంలో పంపించమని హుకుం వచ్చింది. చాలా ప్రఖ్యాతిచెందిన చికిత్సా లయానికి నీవు వెళ్ళబోతున్నావు. అక్కడి వైద్యులంతా వైద్యశాస్త్రంలో అసామాన్యప్రవీణులు. ఇక నర్సులమాటా ? వాళ్ళని చూస్తేచాలు, శవాలు లేచి

నిలబడతాయి" అని అంటూ లినోచ్కాకు కన్నుగొట్టాడు. "నీవూ, నేనూ కలిసి తిరిగీ ఆకాశంలో ఎగిరేరోజులు రానున్నాయి. నా మాటలు నమ్ము" మని నర్సు మాట్లాడినట్టే తానూ, తనలోనున్న అధైర్యాన్నీ, సంశయాన్నీ కప్పిపుచ్చడానికి యత్నించాడు. అలెక్సీ చెంపలపైనున్న తన చేతికి తడి తగిలింది ! " ఎందు కింకా ఆలస్యం ? రండి, బయటికి తీసుకువెడదాము. కాలయాపన కిది సమయం కా ద"న్నాడు.

అలెక్సీని ఒక పడకమంచంమీద పడుకోబెట్టారు. వర్యా ఆతని సామానుల నన్నిటినీ చిన్న మూటకట్టింది.

వర్యా యస్. యస్. గుర్తుగల బాకును మూటలో కట్టుతుంటే అలెక్సీ చూశాడు. "తాతా ! దీని నా జ్ఞాపకార్థం నీ దగ్గిరవుండనీ, తాతా" అని ఆ బాకును ఆయనకు యిచ్చాడు; ఎన్నో పర్యాయము లెంతో అప్యాయంగా మిఖేల్ తాత ఆ బాకును చూడటమూ, చేత్తో పట్టుకొనటమూ అలెక్సీకి జ్ఞప్తికివచ్చింది.

"నమస్కారం ! అలెక్సీ ! నమస్కారం. ఇది చాలా శ్రేష్ఠమైన ఉక్కు. ఇదిగో దీనిమీద ఏదో లిఖించబడివున్నది. ఇది మన భాష కాదంటూ" డెగ్ట్యారెంకోకు చూపించాడు.

"జగమంతా జర్మనుమయం !" కడుపు చెక్కలయ్యేటట్టు డెగ్ట్యారెంకో నవ్వాడు.

"జగమంతా జర్మనుమయమా ? ఎన్నిరోజులో చూద్దాములే" అన్నాడు అలెక్సీ.

"సరే. పట్టండి, పట్టండి. తాతా, ఏదీ ఎత్తు" అన్నాడు ఆంద్రీ.

ఆ గది యొక్క ఇటుకు ద్వారంగుండా, బహు జాగ్రత్తగా, నెమ్మదిగా, గోడలకి తగలకుండా అలెక్సీని బయట జేరవేసారు.

అలెక్సీను చూడటాని కందరూ వచ్చి గుమిగూడారు, కాని వర్యా మాత్రం గదిలోనే వుండిపోయింది. ఆరిపోయే దీపాన్ని బాగా మంట చేసింది. అలెక్సీ పడుకొన్న బల్లనూ, దాని పైనున్న జముఖానానూ చేతులతో, వొడుగునా, తడివింది. నర్సు తెచ్చిన పుష్పగుచ్ఛమామె కంటబడింది. వాడిపోయిన ఆ పూవులను రెప్ప వాల్చకుండా చూసి, నెమ్మదిగా ఆఘ్రాణించింది. ఇంతగా వాడిపోయినా వాటి నుండి తీయటి, మత్తెక్కించే వాసన ఇంకా కొట్టుతోంది. వాటిని తన వక్షానికి హత్తుకొని, ఆ బల్లమీద బోర్ల పడిపోయింది. గట్లు తెగి కన్నీరు కారజొచ్చింది.

# 18

ప్లావ్నీ గ్రామానికి దగ్గిరనున్న ఒక చిన్న చెరువు గడ్డకట్టుకు పోయింది. దానిమీద వచ్చిన ఆ విమానం దిగింది. దారిపొడుగునా వున్న మంచుమీద మిఖేల్ తాతా, డెగ్త్యారెంకోల అడుగు జాడలగుపిస్తున్నాయి. వాటి వెంబడే ఆ వూరి జన లంతా విమానం దగ్గిరికి నడిచి వెడుతున్నారు. సెరెయోంకా, ఫెడ్కాలిద్దరూ దారి చూపిస్తోంటే తక్కిన పిల్లలందరూ వెన్నంటి గలగలా మాట్లాడుకొంటూ వెడు తున్నారు. అలెక్సీను కనిపెట్టిన ఘనత తనదేనన్న విషయం తనకు తెలిసినట్టు సెరెయోంకా తల పైకెత్తి. ఛాతీవిరిచి ముందు నడుస్తున్నాడు. ఆతని తండ్రివి, పెద్ద బూట్సులను తొడుగుకొని ఏదో పెద్ద సైన్యాధికారి మాదిరి ముందు వెళ్ళే ఆ అబ్బాయి వెనుక తాతా, ఆంద్రీ లిద్దరూ అలెక్సీను నెమ్మదిగా మోసుకువెళుతున్నారు. అలెక్సీ ప్రక్కనే నర్సు నడుస్తోంది. మాటిమాటికీ అతనికి కప్పిన ఉన్ని కంబళీని సర్దుతూ, మెడపట్టీని, చలిగాలి సోకకుండా సరిచేస్తూ వెడుతోంది. వెనుక ఆడ వాళ్ళూ, పిల్లలూ గుమిగూడి, పెద్ద ఊరేగింపు మాదిరి వెడుతున్నారు.

మంచునుండి ప్రతిఫలించే వెలుతురును అలెక్సీ చూడలేకపోయాడు. కండ్లు మిరుమిట్లు గొలిపి తల తిరిగింది. వెంటనే కండ్లు మూసుకొంటేనేగాని ఆ తలదిమ్ము తగ్గిందికాదు. అటుమీదట కొంచెంగా రెప్పలెత్తి, వాటి సందులనుండి వెలుతురును చూడటానికి అలవాటు చేసుకోడానికి వీలుకలిగింది. కానీ, గత వారమంతా గడిపిన ఆ గ్రామాన్ని మొదటిసారిగా చూశాడు, ఇన్నిరోజుల తరువాత.

ఏ ప్రక్క చూసినా ఒకటే అడవి. దట్టంగా పెరిగే ఆ చెట్ల శిఖరాలూ, కొమ్మలనుండి నేలపైన దట్టంగా నీడ పడుతుంది. ఆకూ, అలమూ లేకుండా నల్లటి స్తంభాలలాగా నిలబడ్డ బర్చి వృక్షాలూ, దట్టంగా ఆకులు పెరిగిన ఫర్ మ్రానులూ, పైన్ చెట్లూ గిజిబిజిగా పెరుగుతున్నాయి.

ఈ చెట్లక్రింద ఒకచోట కొంత ఖాళీప్రదేశం. దీని నన్నిప్రక్కలా పత్తుగా పడిన మంచు. ఎందరెందరో ప్రతిరోజూ నడవటంచేత ఈ కొద్ది ప్రదేశంలో మాత్రం మంచు కనిపించదు. ఇక్కడే భూగర్భపు గ్రామం కలదు. చిన్న పిల్లల బట్టలు పొదలమీద ఆరుతున్నాయి. పైన్ మ్రానుల కొనించిపెట్టిన టండలూ, మూకుళ్ళూ, రెండు బ్రహ్మాండమైన ఫర్ వృక్షాలమధ్య, నేలమీద ఏ చంటిబిడ్డో ఆడుకొంటూ అక్కడే వదిలిపెట్టివెళ్ళిన ఒకగుడ్డబొమ్మా అలెక్సీ కంటబడ్డాయి.

ఈ చెట్ల నీడలనుండి బయటపడగానే వెచ్చని ఎండ అలెక్సీమీద పడింది ఆ వెచ్చదనాని కాతని కెక్కడలేని సత్తువా కలిగినట్టులనిపించి, లేచి కూర్చోవాలని

అనుకొన్నాడు. కాని, తన కంత శక్తిలేదని తెలుసు. వెచ్చవెచ్చగా మీదపడే ఎండ కాతనికి తీయని నిద్రవచ్చేటట్టు లనిపించింది.

అతని కంఠ్తనుండికారే నీటిని లెనోచ్కా తన చేతిరుమాలుతో తుడుస్తూ, నెమ్మదిగా నడవమని చెప్పింది, తాతతో. ఈ మాట వినబడగానే, అలెక్సీ ఉహూ! వద్దు. త్వరగా వెళ్ళండి. త్వరగా" అని అవసరపరిచాడు. వీలయినంత త్వరగా వెళ్ళి విమానమును చేరుకోవాలి. ఇంత దూరమూ తనకొరకని వచ్చిన విమానం, ఆలస్యమైతే, తన్నచ్చటే వదిలి ఎక్కడకు వెళ్ళిపోతుందోననే భయం. ఎట్లాగైనా మాస్కో నగరం చేరుకోవాలి. అక్కడ చికిత్స పొంది, తిరిగీ విమానం నడిపి, జర్మనులపైబడి తన పగ సాధించుకోవాలని అలెక్సీ ఉవ్విళ్ళూరుతున్నాడు. త్వరగా వెళ్ళేకొద్దీ అతని ఒడలంతా కదిలిపోయి నొప్పి పెట్టింద. తాత మిఖేల్ అలిసిపోయాడు. ఇదంతా అలెక్సీ చూసికూడా "దయచేసి త్వరగా నడవండి, త్వరగా" అంటూ ప్రోద్బలం చేసాడు. మిఖేల్‌తాత అలిసిపోవటం కనిపెట్టి, స్త్రీ లిద్దరు అతనికి బదులు మోయడానికి వచ్చారు. అలెక్సీ ప్రక్కనే తాత నడిచి వెళుతుంటే ఆతని ముఖమంతా కందగడ్డలాగా కందిపోయింది. చెమట చెంపల వెంబడి కారిపోయింది.

"తరుము. అలెక్సీ! వాళ్ళని త్వరత్వరగా వెళ్ళమని తరుము. ఆలసించ డాని కిదిసమయంకాదు. నీవీవిధంగా వాళ్ళని తొందర పెట్టటం శుభ సూచకం. త్వరగా వెళ్లి మాస్కోను చేరుకొని ఒళ్లు సరిచేసుకొంటావులే....నాకు తెలుసు.... చూడు, ఆస్పత్రినుండి అప్పుడప్పుడు వుత్తరాలు వ్రాస్తావుగా?" నా చిరునామా జ్ఞాపకం పెట్టుకో! కలినిన్, బొలొగోయ్‌జిల్లా ఇప్పుడు ప్లావ్నీ అనబడే ఈగ్రామా నికి కొద్ది రోజుల్లో కలినిన్ అనే పేరు పెట్టబడుతుంది....నాకు రూఢిగా తెలుసు ... నేను చెప్పిన చిరునామాకు వ్రాయి .. తప్పకుండా జాబు వచ్చిచేరుతుంది." అంటూ మిఖేల్ వారివెంబడే. అయాసపడుతూ నడిచివెళ్లాడు.

అలెక్సీని పడకమంచంతో ఎత్తి విమానంలో పడుకోబెట్టారు. పెట్రోలు వాసన గుప్పున కొట్టి, అలెక్సీకి ప్రాణం లేచి వచ్చింది. అతని ముఖానికి గాలి తగలకుండా పెద్ద ప్లాస్టిక్ టోపీతో మూసారు. అక్కడకు వచ్చిన వారందరూ పెద్దగందరగోళంగా ఒకేసారి మాట్లాడుతూ, అతన్ని సాగనంపుతున్నారు, కాని, అలెక్సీకి అదేదీ కనిపించిందికాదు. ఆనాడు కోడిమాంసపుచారు తెచ్చిన అవ్వ కూడా అక్కడికి వచ్చింది. విమానం బయలుదేరబోయే సమయం; దాని గాలికి భయపడి, దూరదూరంగా నిలబడింది అవ్వ. చివరికెట్లాగో ధైర్యం తెచ్చుకొని ఇంజను దగ్గర కూర్చున్న ఆంద్రీని సమీపించి, చిన్న పొట్లమొకటి అతనికి అంది చ్చింది, మిగతా కోడిమాంసము నందులో మూటగట్టి తనకు ఈయాలని వచ్చిన ఈ మెనుగానీ. ఆడవాళ్లనూ. పిల్లలనూ దూరంగా తొలగిపొమ్మని తరుముతూ నిల బడిన మిఖేల్‌తాతనుగానీ అలెక్సీ చూడలేదు. విమానపు గాలికి తాతటోపీ ఎగిరి

పోయి అంతదూరాన పడింది. బట్టతలా నెరిసిన గడ్డమూ. అత డొక్కడే అంత మందిలోనూ ఒక్క పురుషుడు, తక్కిన వారంతా స్త్రీలే.

మంచుమీద జారుకుంటూ పోయినట్టులా విమానం నడవ నారంభించింది. కుడిప్రక్కగా తిరిగి నెమ్మదిగా గాలిలో లేచింది. జనుల తలల కది తగిలేటంత క్రిందుగా డెగ్ట్యారెంకో దానిని పోనిచ్చాడు. మితిమీరిన వేగంగా పైకి లేచీలేవడం తోనే ఎగిరివెళ్లటం డెగ్ట్యారెంకో స్వభావం. ఎన్ని పర్యాయములో పై అధికారులు యీ తొందర పనికిరాదని హెచ్చరించారు, చీవాట్లుపెట్టారు. కాని, నేడు బహు నెమ్మదిగా, జాగ్రత్తగా విమానమును డెగ్ట్యారెంకో పోనిచ్చాడు. వీలయినంత వరకూ భూమట్టానికి సమీపంగా ప్రవహించే నదుల నంటిపెట్టుకొని ఎగిరాదేకాని మహారణ్యాలమీద. ఆకాశమండలపు టంచుల తాకుతూ వెళ్ళలేదు. ఇదంతా అలెక్సీకి అణుమాత్రమూ తెలియదు. అతనికి పెట్రోలూ, డీజెల్‌నూనెల వాసన మాత్రం తగులుతోంది. ఆ వాసనల కతని ప్రాణాలు లేచివచ్చి చెప్పరాని ఆనందా న్ననుభవిస్తూ కండ్లు మూసుకొని పడుకొన్నాడు. విమాన మాగింది. ఎర్రశిలువ సైనికులు లోనికివచ్చారు. అలెక్సీ పడుకొన్న మంచమును బహు జాగ్రత్తగా యెత్తి క్రిందపెట్టారు. ఇంతకుపూర్వమే మాస్కోనుండి వచ్చిన ఎర్రశిలువ విమానం, పదిగజాల దూరంలో నిలబడివున్నది. దాని దగ్గిరికి అలెక్సీని మోసుకువెళ్ళారు.

# 19

అలెక్సీ దిగిన విమానాశ్రయం అతనికి చిరపరిచితమైనదే కాని, కొత్తది కాదు. అచ్చట ఎంతో హడావుడిగానున్నది. విసుగూ విరామం లేకుండా విమానపు టింజనులు శబ్దం చేస్తున్నాయి. ఆకాశంనుండి పెట్రోలు నింపుకోడాని కొక విమానదళం దిగగానే వెంటనే మరొకదళం ఆకాశంలో కనిపించేది. అది క్రిందికి దిగటమే ఆలస్యంగా నింకొక దళం తయారయ్యేది ఆకాశంలో. విమానాశ్రయంలో ప్రతి వొక్కడూ విశ్రాంతి అనేమాట లేకుండా పనిచేస్తున్నాడు. పై అధికారులలో కొందరికి అరిచీ, అరిచీ కంఠాలు పూడిపోయాయి.

ఇంత గందరగోళంగా నున్నప్పటికీ, అచ్చటి వారందరూ అలెక్సీని తెచ్చే విమాన మెప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నారు.

"ఇంకా రాలేదా? ఏదన్నా వార్త తెలిసిందా. ఎప్పుడు వస్తాడో?" అనీ, ఒకరినొకరు ప్రశ్నించుకొంటున్నారు. ఎర్రశిలువ విమానపు టింజను శబ్దం విని

పిస్తుందేమోనని వారందరూ పదేపదే చెవియొగ్గి వినటమూ, అరణ్యం దిక్కుగా ఆకాశంలోకి చూడటమూ, ఇదేపనిగా నున్నారు.

అలెక్సీకు తెలివివచ్చింది. మెత్తని పాన్పుమీద పడుకొనివున్న ఆతనిచుట్టూ నున్నవారిలో అనేకుల నాతడు గుర్తుపట్టగలిగాడు. అచ్చటి వారంతా పట్టరాని సంతోషంతో ఒక్కపెట్టున అరిచారు, అలెక్సీ కండ్లు తెరవగానే. అతని మంచాని కానుకొని సైనిక దళాధికారి నిలబడ్డాడు. తన హోదాకు తగినట్టు కొంచెం చిరు నవ్వుతో నిలబడ్డాడేగాని, ఇతరుల మాదిరి వెర్రిగా నవ్వటమూ, మాట్లాడటమూ అతనిలో కనిపించలేదు. అతని ప్రక్క ఎర్రబారిన ముఖంనుండి చెమటను తుడుచు కొంటున్న ఇంకొకాయననూ. విమానాశ్రయపు టధికారి ఇంకొకడినీ అలెక్సీ గుర్తు పట్టాడు. పూర్వం ఈ అధికారిని చూస్తే అలెక్సీ కెంతో అసహ్యంగా నుండేది, ఎప్పుడూ తలబిరుసుతనమూ, క్రింది వుద్యోగస్తులను చులకనచేయటమూ ఈయన కలవాటు. తన మంచాన్ని ముందుప్రక్క మోసి పట్టుకు వెడుతూన్న మనిషి యూరా ! పదే పదే యూరా వెనుతిరిగి అలెక్సీను చూస్తూ నడవటంవల్ల క్రమంగా నడవటానికి వీలయిందికాదు, ఆతనిప్రక్క ఎర్రటి తల జుట్టుగల సార్జెంట్ అమ్మాయి వొకామె నడుస్తోంది. ఈ స్త్రీకి తానంటే ఎంతో అయిష్టమని అలెక్సీ పూర్వం అనుకొనేవాడు. వాతావరణ పరిశోధనాలయంలో యీ బాలిక పని చేస్తోంది. అలెక్సీ కంతదూరంగా నడుస్తూ తన కనుకొలకులనుండి తమాషాగా తన్ను చూస్తోందని అలెక్సీకు తోచింది. తానంటే గిట్టనిది, ఎందుకావిధంగా తన కేసి చూస్తోందో అలెక్సీ తెలుసుకోలేక పోయాడు. ఈమె వెనుక కుకుష్కిన్ నడుస్తు న్నాడు. ఇతడంటే విమానాశ్రయంలో నెవ్వరికీ గిట్టదు. కలుపుగోలు తనమంటే కుకుష్కిన్‌కి రవంతయినా తెలియదు. కాని, నేడెందుకనో, కుకుష్కిన్ కూడా తనకేసి చూసి నవ్వుతున్నాడు ! అలెక్సీ ఆనాడు విమాన మెక్కబోయే ముందు తన పాత బాకీని ఇంకా, ఒక్క దమ్మిడీ అయినా తీర్చనందుకు, కుకుష్కిన్‌ని నలుగు రిలో తూలనాడాడు. దీనికి తన మీద పగ సాధించి తీరుతాడని అలెక్సీ అనుకొన్నాడు. కాని తన వంక జూచి నవ్వుతూ, తన ప్రక్కనే పరుగిడుతూ, జనులు గుంపు కూడకుండా జాగ్రత్తగా చూసుకొంటున్నాడు, కుకుష్కిన్. ఎంత మంది ! ఎంత మంది, చూడటానికి వచ్చారు !

తన కిందరు స్నేహితులున్నారనే సంగతే ఇంతవరకూ అలెక్సీకి తెలియదు. ఇంతటి గొప్ప గుణాలుగానీ, ఇంత వాత్సల్యంగానీ వారిలో నున్నాయని అలెక్సీ ముం దెన్నడూ అనుకోలేదు. ఇది తలుచుకొంటే అతనికి చాల తలవంపయింది. వాతావరణాలయపు టమ్మాయిని తా నెంత చులకనచేశాడో ! కుకుష్కిన్‌నిగురించి ఎంత నీచంగా తాను నలుగురితో మాట్లాడేవాడో ! ఎంత పరిహాసించేవాడో ! ఇదంతా తలుచుకొంటే వారితో తన్ను క్షమించమని అడగాలని అలెక్సీకి తోచింది కాని. శక్తి ఏదీ ? నలుగురి ముఖాలూ చూడగానే తాను తన స్వంత యింటికి

వచ్చినట్టు, తన అప్తులు నలుగురిమధ్యా ఇన్ని కష్టాలూపడి తుదకు సురక్షితంగా నున్నట్టూ అతనికి తోచింది. మనస్సు బహూ తేలికనుపడింది.

అంతదూరాన మంచులో నిలబడిన అల్యూమినియం రంగుగల ఎఱ్ఱ శిలువ విమానం దగ్గరికి అలెక్సీను మోసుకు వెడుతున్నారు. చలికి బిగుసుపోయిన దాని ఇంజనులను కొందరు పనివారు వేడి చేస్తున్నారు.

"మేజర్ సోదరా!" అని అకస్మాత్తుగా అలెక్సీ వీలయినంత గట్టిగా అరిచాడు.

ఈ మాటలు వినబడగానే మేజర్ అతనిచెంతకు వచ్చి. ఏమి చెప్పుతాడో వినాలని అలెక్సీ చెంత నిలబడ్డాడు.

"మేజర్ సోదరా! నన్ను మాస్కోకు ఈ విమానంలో పంపించవద్దు.... నన్ను మీ అందరితో ఇక్కడే వుండటాని కేర్పాటు చేయవలసింది" అన్నాడు.

తలకు తగిలించుకొన్న ఉక్కుటోపీ అలెక్సీ చెప్పే మాటలు వినబడకుండా అడ్డంతగిలింది కాబోలు, మేజర్ దానినితీసి, అలెక్సీకి మరింత దగ్గరగా నిలబడ్డాడు.

"మేజర్! నేను మాస్కో వెళ్ళను ...నాకు వెళ్ళడానికి ఏ మాత్రమూ ఇష్టంలేదు.... ఇక్కడే, మీ అందరితో ఈ ఆస్పత్రి విమానాశ్రయంలో ఉండి పోతాను" అని దీనంగా అడుగుకొన్నాడు. అలెక్స్.

"మంచిమాటే! ...నీకు వెంటనే తగిన చికిత్స చేయవలసియున్నది.... ఏ మాత్రం ఆలశ్యమూ జరగడానికి వీలులేదు."

ఇది విని, అలెక్సీ కెంతో విచారం కలిగింది. ఇక్కడ ఇంతమంది స్నేహితుల మధ్యనుంటే తన కింతవరకూ సంభవించిన కష్టాలుగానీ, తన కాళ్ళల్లోగల బాధగానీ తనకుతెలియవనీ, త న్నేవిధంగానూ అవి హింసించజాలవనీ అలెక్సీ అనుకొన్నాడు; ఆశపడ్డాడు.

వీరిద్దరూ మాట్లాడుకొనటం అంత దూరంనుండి విమానాశ్రయపు పెద్ద అధికారి చూశాడు. "ఏమిటంటున్నాడు, అలెక్సీ" అంటూ వారి నాతడు సమీపించాడు. "ఇక్కడే వుంటాను. మాస్కోకు పంపించవద్దంటున్నాడ"ని మేజర్ చెప్పాడాయనతో.

ఎవ్వరితోగానీ, ఎన్నడూ చనువుగా మాట్లాడటమంటే ఏమిటో తెలియని ఆయన ముఖం చక్కని చిరునవ్వుతో నిండిపోయింది.

"పిచ్చివాడు! వెనకా ముందూ తెలియని వెర్రిప్రేమ!....తన కొఱకనే విమాన దళాధికారి ప్రత్యేక విమానమును పంపించాడన్న సంగతి జ్ఞాపకంచేయి.... అశుభం, శుభం తెలియని చిన్నపిల్లవాడిమాదిరి మాట్లాతున్నాడు."

అలెక్సీ కీ మాటలు వినబడ్డాయి. తా నేమీ చిన్నపిల్లవాడిమాదిరి మాట్లాడటం లేదు. పూర్వ మొకప్పుడు విమానంక్రిందపడి తన కాలు విరిగింది. పది దినాల

పాటు ఈ విమానాశ్రయపు టాసుపత్రిలో నుండి కాలు సరిచేసుకొన్నాడు. ఇక్కడున్న వారంతా తన మిత్రులు. తానంటే పడిచస్తారు. ఇటువంటి వాతావరణంలో నుంటేనే చాలు తన కష్టాలన్నీ తీరిపోతాయి ఎంత పెద్ద చికిత్సాలయాలూ, ఎంతెంత గొప్పవైద్యు లున్నప్పటికీ ఆ మాస్కో నగరంకంటే ఇక్కడే తనకు త్వరలో ఆరోగ్యం చేకూరుతుంది. ఇదంతా ఆయనకు చెప్పాలని అలెక్సీ అనుకొన్నాడు. కాని తాను నోరువిప్పి చెప్పేలోగా విమానాశ్రయపు యంత్రం కూతకూసింది. ప్రమాదమనే హెచ్చరిక!!

మేజర్ అచ్చటనున్న వాళ్ళ నాపనీ, ఈపనీ చేయమని ఆజ్ఞాపించటం మొదలుపెట్టాడు. ఎవరిమానాన వారు తమ తమ పనులను చేసుకుపోతున్నారు. కొందరు కంటి కగుపించకుండా మంచుదిబ్బల వెనుక దాచివుంచిన విమానాలకు పరుగెత్తారు. మరికొందరు అడవిల్లో ఇతరులకంట బడకుండా నిలబెట్టిన విమానాలకు వెళ్ళారు. ఆకాశంలో పొడూగు పాముమాదిరి పొగ కనిపించింది. అదొక రాకెట్ నుండి వచ్చే పొగ అని అలెక్సీకి తెలుసు. ఈ రాకెట్ పొగకు అర్థం "జాగ్రత; సంసిద్ధంగానుండు" అనే సంగతీ అలెక్సీకి తెలిసిన విషయమే. అతని శరీరం కంపించింది; నాసికాపుటాలు చెమర్చాయి; వెన్నుపాము పొడూగునా విద్యుల్లతవలె ఏదో ప్రాకింది. అపాయమనే మాట వినపడినప్పుడల్లా ఇట్టి మార్పు లాతనిలో చూపెట్టడం కద్దు. లెనోచ్కా, యూరా, వాతావరణపు పరిశోధనాలయ స్త్రీ మాత్రం అలెక్సీదగ్గిర నిలబడ్డారు. వారు వెళ్ళి చేయవలసిన పనులెవ్వీ లేవు కాబోలు, వెంటనే వారు ముగ్గురూ అలెక్సీ పడుకొన్న మంచమును చేబట్టి వీలయినంత త్వరగా నడిచి అడవిని చేరారు.

విమానాశ్రయంనుండి ఫిరంగులు ఆకాశంలోనికి గుండ్లను బలంకొద్దీ విసురుతున్నాయి. ఒకదాని తర్వాత నింకొకటిగా విమానములనేకం నేల మీద పరుగులిడి వచ్చి ఆకాశంలోనికి లేచాయి. ఈ విమానపుటింజనుల శబ్దంతో కలిసి. దూరం నుండి, అడివిమీదుగా ఏదో ఝుంయ్‌మనే శబ్దం వినిపించింది, అలెక్సీకి. అతని శరీరపు కండరాలన్నీ గట్టిగా బిగదీసుకొన్నాయి. గుండె గట్టిగా, వేగంగా కొట్టుకొని, ఉచ్ఛ్వాస నిశ్వాసములు బలంగా సాగాయి. తాను మంచం మీద పడుకొన్న వొక రోగి ననే మాట మరిచిపోయాడు. తన విమానంలో కూర్చొని ఆకాశంలో నెగురుతూ శతృ విమానాల నెదుర్కొబోతున్నట్టు లాతనికి తోచింది. వన్య మృగాలను పసిబట్టి వెళ్ళే వేటకుక్కమాదిరి తాను తన విమానంలో ఎగిరి వెడుతూన్నట్టు అలెక్సీ భ్రమ పడ్డాడు.

అడవిలోని చెట్ల మధ్య అలెక్సీ పడుకొన్న మంచం దూరి వెళ్ళలేక పోయింది. యూరా, ఆ ఇద్దరు స్త్రీలూ తమ చేతుల్లో అలెక్సీ నెత్తిపట్టుకొని అడవి లోనికి తీసుకు వెళ్ళాలని అను కొన్నారు. దాని కాతడు ఒప్పుకోలేదు. అడవి అంచున నున్న వొక పెద్ద బర్చ్‌చెట్టు క్రింద తన మంచాన్ని దింపమని గటిగా పటు

బట్టాడు. అక్కడ పడుకొని జరిగే విషయాల నన్నిటినీ చూసాడు. నేలమీద నుండి ఆకాశంలో జరిగే పోరును చూడటమనేది ఎట్టి వైమానికుడికిగానీ సాధ్య పడని విషయం అలెక్సీ కూడా ఇంతకు ముందెన్నడూ ఈ రీతిగా చూడలేక పోయాడు. విమానంలో ఎగురుతూ ఆకాశంలో శత్రువులతో పోరాడేటప్పు డాతనికి కలిగిన అనుభవానికీ, ఇప్పుడు నేలనుండి చూసేటపుడు కలిగే అనుభవానికీ ఎటు వంటి పోలికా లేదనిపించింది. విమానాలు నెమ్మదిగా ఆకాశంలో ఎగురుతున్నాయి. ఒకదానినొకటి తరుముకొని పెడుతూ, మధ్య మధ్య, తాపీగా ఫిరంగులు ప్రేలుస్తు న్నాయి. అంతా ఏదో చిన్నపిల్లలాడుకొంటున్నట్టులా తనికి తోచింది. పైనుండి వినబడే శబ్దం ఏదో కుట్టుపని యంత్రం శబ్దంమాదిరో, లేక ఏ కొత్తకోటు గుడ్డనో చింపినట్టో వినబడిందాతని చెవులకు.

పన్రెండు జర్మను విమానాలు అడవిమీదుగా ఎగిరివచ్చి, ఆ విమానాశ్రయం మీద గుండ్రంగా తిరిగాయి. ఆ మీదట ఎత్తుగా, చాలా ఎత్తునకు ఎగిరి మేఘాల చాటుకు వెళ్ళిపోయాయి. అచ్చటినుండి వాటి ఇంజనుల శబ్దం వినిపిస్తోంది, దూరం నుండి వినబడే సముద్ర శబ్దంమాదిరి. నేలనుండి లేచే ఫిరంగి గుండ్లు పగిలి, శబ్దించి, పొగలు వెదజిమ్ముతున్నాయి. ఎండ పడి మెరిసే మేఘాలను చూడలేక పోయాడు అలెక్సీ. వాటినుండి అప్పుడప్పుడు, ఏ విమానందో ఒక రెక్క తళు క్కున మెరిసేది.

విమానాల ఇంజను శబ్దంతో కలిసి, మధ్యమధ్య రి-రి-రి-ప్, రి-రి-రిప్ మనే శబ్దాలు వినిపిస్తున్నాయి. కంటికొక్క విమానంతానీ కనిపించటంలేదు. కాని, ఆ మేఘాలచాటున ఘోరయుద్ధం జరుగుతున్నది. క్రిందినుండి చూసే అలెక్సీ కిదంతా చాలా విచిత్రంగా కనిపించింది. సావకాశంగా వైమానికులా మేఘాలమీద ఒకరినొకరు తరుముకొంటూ, దాగుడుమూత లాడుకొంటున్నారన్నట్టులా తనకి తోచింది. అట్టి విమానంలో తా నెగిరి పోరు సల్పేటప్పుడుండే స్థితికీ, క్రిందనుండి చూసేటప్పుడుండే స్థితికీ ఏ మాత్రం పోలికా అతనికి కనుపించలేదు. ఏదో స్వప్ర మత్తులో నున్నవాడిమాదిరి చూస్తూ పడుకొన్నాడు.

ఉన్నట్టులుండి, చెవులు చిల్లిపడేటంత గొప్ప ధ్వని వినపడేది. ఎవరో అంత యెత్తునుండి నల్లరంగులో అద్దిన కుంచెను విదిలిస్తే క్రిందపడే నలుపు చుక్కలమాదిరి బాంబులు కనిపించి, క్రిందికి రానురాను పెద్దవై, భయంకరంగా అరుచుకొంటూ వచ్చాయి. అవెక్కడ తనమీద పడతాయో అనే భయం అలెక్సీకి వేయలేదు సరికదా. అవెక్కడ పడతాయో చూడటాని కాతడు తలనెత్తి పరీక్షిం చాడు. ఆతడంత నిర్భయంగా వుండటం చూసి. ప్రక్కనున్న ముగ్గురూ ఆశ్చర్య పడ్డారు.

వాతావరణ పరిశోధనాలయపు స్త్రీ, అంత దూరంగా నిలబడి రెప్పవాల్చ కుండా అలెక్సీను చూస్తూ వున్నది. బాంబులశబ్దం విని పైకి చూస్తే అవి ఆకాశం

నుండి బహువేగంగా క్రిందికి పడుతున్నాయి. వెంటనే పరుగిడివెళ్లి: అలెక్సీమీద అడ్డంగా వంగి అతనిమీద అవిపడకుండా రక్షించడాని కన్నట్టు నిలబడింది. ఆమె ముఖంలో భయమూ, ఆదుర్దా పెనగొని ఆమెపెదవులు చలించుతున్నాయి. ఈ విధంగా తన ప్రాణానికి బదులు ఆమె తన ప్రాణాన్ని అర్పించటం చూచి అలెక్సీ అచ్చెరువు వొందాడు. ఇంతకు ముందు తానామెను గురించి ఎంతో తప్పుడు అభిప్రాయ పడ్డందుకెంతో నొచ్చుకున్నాడు.

పెద్ద శబ్దంతో ఒకటి. రెండు బాంబులు సమీపంలో ఎక్కడో పడ్డాయి. ఆ స్త్రీ శరీరమంతా కంపించిపోయి మరింత దగ్గరిగా అలెక్సీ మీదికి వాలింది. మూడోబాంబు మరీదగ్గరగా పడిందికాబోలు, అలెక్సీ పడుకొని వున్న ప్రదేశమంతా కంపించింది. ఇంతలోనే అకస్మాత్తుగా మరొకటి వచ్చి అతను ఏవృక్షం క్రింద పడుకొన్నాడో దానినే తాకి పెద్దకొమ్మ నొకటి తుంచి, అంతదూరంగా పారేసింది. ఫెళఫెళా కొమ్మ విరగటం చూచి ఆ స్త్రీ అకస్మాత్తుగా అలెక్సీ శరీరంమీద పడిపోయింది, కన్నీటితో తడిసిన ఆమె చెక్కిలి అలెక్సీ చెంపకు వెచ్చగా తగిలింది. ఆ భయంకర తరుణంలో "ప్రాణప్రియా, ప్రాణప్రియా" అనే మాటలామె పెదవులనుండి వెలువడటం చూసి అలెక్సీ విభ్రాంతి చెందాడు.

మరొక బ్రహ్మాండమైన శబ్దం. అచ్చటి భూమి గజగజవణికింది. పెద్దవృక్షలనేకం ఒక్కపెట్టున గాలిలోని కంతదూరం పైకెగిరాయి. వాటితలలూ, కొమ్మలూ ఫెళఫెళారవంతో విరిగి చెల్లాచెదరయ్యాయి. పైకెగిరిన మన్ను వర్షం మాదిరి క్రిందికి పడింది. ఆకాశమంతా ఘాటువాసనల పొగ క్రమ్ముకొని, వెల్లుల్లిపాయలవాసన వేసింది.

పొగ తేలిపోయింది. ఆకాశసమరం నిలిచిపోయింది కాబోలు, శబ్దాలు వినిపించలేదు. ఆ స్త్రీ, ఏమీ ఎరగనట్టు అలెక్సీ కంత దూరంగా నిలబడి వేరొక ప్రక్క చూస్తోంది, ఇంతకు ముందు పాలిపోయిన చెక్కిళ్లలోనికి రక్తం దిగి గులాబిమొగ్గల్లాగా కనిపించాయి అలెక్సీకి. అలెక్సీని చూడకుండా తన ముఖ మింకొక ప్రక్కకు త్రిప్పి, గద్గదస్వరంతో ఆమె యిలా గన్నది :

"నీకు నొప్పి కలిగించలేదుగదా ?....కలిగితే నన్ను క్షమించు....ఎంత బుద్ధిహీనురాలి నై పోయాను !....నా కప్పు డేదీ తోచిందికాదు."

"ఇప్పుడు క్షమించమని అడిగి ప్రయోజన మేమున్నది ?" అని యూరా కసురుకొన్నాడు. అలెక్సీ నట్టి విపత్సమయంలో కాపాడటానికి తాను వెళ్ళలేకపోయినందుకూ, ఆ భాగ్యం ఆ స్త్రీకి కలిగినందుకూ అతని కామెమీద కోపం వచ్చింది,

తలనిండా, ఒంటిమీదా పడ్డ మట్టినంతా దులుపుకొని యూరా చూశాడు. ఆ బర్చివృక్షం తల నెవరో ఛేదించినట్టు లది మొండిగా నిలబడి కనిపించింది. ఆ

విరిగిపడిన తల యెక్కడ, ఎంత దూరానపడిందో యెవరికీ తెలియదు. దాని పెద్ద గాయంనుండి బంగారుతీగల్లాగా కారే జిగురు, దారాలమాదిరి బిగదీసుకుపోయి, గాలిలో యిటూ, అటూ కదులుతోంది. మరికొంత జిగురు గుండ్రని ముద్దలు ముద్దలుగా నేలపై వర్షిస్తోంది. చెట్టు కన్నీరు కారుస్తోందని యూరా కనిపించింది.

లినోచ్కా అతని మనస్సులోని వుద్దేశాన్ని గ్రహించినట్టు "చూడు ! ఆ చెట్టె విధంగా ఏడుస్తోందో" అని అన్నది.

"దానికి పట్టిన గతే నీకూ పడితే నీవూ ఏడుస్తావులే....సరే వెడదాం పద. ఎర్రశిలువ విమానాని కెట్టి అపాయంగానీ జరగలేదని అనుకొంటాను" అని అన్నాడు యూరా.

జిగురుకారే అ వృక్షన్నీ, ఎండపొదనూ అంత దూరంగా నిలబడిన వాతావరణపు పరిశోధన స్త్రీనీ చూసి, చిరునవ్వు నవ్వి "వసంతం ! వసంతకాలం వచ్చిందని" అలెక్సీ అన్నాడు. ఆ స్త్రీ పేరయినా తనకు తెలియదుగదా అని ఎంతో నొచ్చుకొన్నాడు.

ముందుప్రక్క యూరా, వెనుకప్రక్క ఇద్దరు స్త్రీలూ వట్టి అలెక్సీని మోసుకుపోతున్నారు. బాంబుల ప్రేలుడుకు ఏర్పడ్డ పెద్ద గోతులూ, వాటి వేడికి కరిగి నీరయి ఆ గోతుల్లోకి ప్రవహించే మంచూ, ఆ ప్రదేశమంతా ఎంతో మారి పోయింది. అలెక్సీ ముఖానికి దగ్గరగా మంచమును పట్టుకొని మోస్తూవున్న ఆ అమ్మాయి చేయి కనిపించింది. బలంగా మంచి బిగువుగా పట్టుకొన్న ఆ చేతిని చూస్తే, ఇదే స్త్రీ తనపై పడి, తొట్రుపడుతూ "ప్రాణప్రియా !" అని పలికిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. అంతటి బేలతనం గల స్త్రీదా, ఈ బలమైన చేయి ? లేక తానే ఏదో ఊహించుకొన్నాడా ? అపోహపడ్డాడా ?

ఎర్రశిలువ విమానాన్ని చేరారు. దాని కేదన్నా దెబ్బతగిలిందేమోనని ఒకరి ద్దరు పనివారు పరిశీలిస్తున్నారు. ఒక్కటొక్కటిగా, యుద్ధాని కెగిరివెళ్ళిన విమా నాలువచ్చి దిగాయి. వాటిని వాటి వాటి స్థానాల్లో పైమానికులు నిలబెట్టివచ్చి. మైదా నంలో వరుసగా నిలబడ్డారు. వారంతా ఆకాశంవంక పరీక్షగా, దేనికొరకో చూస్తున్నారు.

"తొమ్మిదో నంబరు విమానం తిరిగిరాలేదు, కుకుష్కిన్ ఎక్కివెళ్ళిన దావిమానం. వా డేమయినట్టు ?" అన్నాడు, యూరా.

ఈ మాటలు చెవినిపడగానే, అలెక్సీకి కుకుష్కిన్ రూపం వండ్లకప గట్టిన ట్లగుపించింది. ఆ రోజు ప్రొద్దున తాను పడుకొన్న మంచం దగ్గరగా కుకుష్కిన్ నడుస్తూ రావటమూ, నలుగురితోపాటు తానూ దానిని మోయటమూ తలుచు కొన్నాడు. ఒకవేళ, కుకుష్కిన్ తిరిగి రాడేమో ? తిరిగి రాజాలనంత ప్రమాదం జరిగిందికాబోలు ననుకొన్నాడు అలెక్సీ.

"అదిగో, వస్తూన్నది విమానం" అని యూరా అరిచాడు.

అక్కడున్నవారంతా దానిని పరీక్షిస్తూ నిలబడ్డారు. వచ్చిన విమానం తక్కిమ్మా విమానాల మాదిరి దిగలేదు. గుండ్రంగుండ్రంగా విమానాశ్రయంమీద చుటుతోంది. పడుకొన్న అలెక్సీకి దాని రెక్క వొకటి విరిగినట్టూ, నేలపై దిగే చక్రాలలో వొకటి విరిగి వదులుగా వ్రేలాడుతూన్నట్టూ కనిపించాయి. ఎర్ర దీపాల తారాజువ్వలు విమానాశ్రయంనుండి పైకి లేచాయి. విమానం, ఎక్కడ దిగాలో తెలియనట్టు ఇంటికి తిరిగివచ్చిన తల్లిపక్షి తన గూడు కన్పించక ఆదుర్దాగా ఎగురుతూన్నట్టూ, గుండ్రంగా ఎగురుతోంది.

యూరా నిమానమును చూస్తూ, "క్రిందికి దుమికేస్తాడు.... పెట్రోలు పూర్తిగా కాలిపోయింది... ఉన్న ఆ నాలుగు చుక్కలూ అయిపోగానే దుమకటం కంటె వేరే మార్గం లేదంటూ" బిగ్గరగా, ఆదుర్దాగా అరుస్తున్నాడు.

ఇట్టి పరిస్థితు లేర్పడ్డప్పుడు విమానం చాలా ఎత్తున కెగిరి, వైమానికుడు పారచూట్ గొడుగును కట్టుకొని క్రిందికి దుమకటం సహజం. విమానాశ్రయం నుండి ఈ సందేశం రేడియోద్వారా కుకుష్కిన్‌కి పంపబడింది. కాని, ఎందుకనో, ఆ విమానం ఇంకా గుండ్రంగా చుట్టుతోంది!

యూరా తన గడియారాన్ని చూశాడు. విమానంలోని పెట్రోలు పూర్తిగా ఖర్చయిపోయి వుంటుందని అతనికి తెలుసు. ఇంకా ఎందుకని కుకుష్కిన్ క్రిందికి దుమికాడుకాడో అతనికి అర్థమయిందికాదు. దిగాలుబడి, రెండు చేతులూ నెత్తిన పెట్టుకొని, యూరా, నేలమీద చతికిలబడి, విమానాన్ని చూస్తున్నాడు. బహుశ కుకుష్కిన్, విమానమును త్యజించడానికి ఇష్టపడక, దానిని ఏదో ఒకవిధంగా నేలకు దింపడానికి చూస్తున్నాడా? ఇదే ఆలోచన అక్కడున్నవారందరికీ కలిగింది కాబోలు. "దుమికేయి....దుముకు....కుకుష్కిన్, నీ దుంపతెగా, దుమకరా" అని నలుగురూ అరిచారు.

విమానాశ్రయంనుండి ఒక విమానం పైకి లేచింది. అది కుకుష్కిన్ ఎగిరే విమానం దగ్గరికి వెడుతోంది. బహుశ కుకుష్కిన్ విమానంలోని రేడియో చెడిపోయి వుండవచ్చు. లేదా అతనికి మతి తప్పిపోయిందేమో? ఎందుకయినా మంచిదని విమానాశ్రయాధికారి, తానే పైకెగిరి వెళ్ళాడు. కుకుష్కిన్ విమానం చెంతకు వెళ్ళి, తన విమానపు రెక్కలతో, "నేను చేసేటట్టు చేయి. కుడిప్రక్కకు తిరుగు. పైకి చాలా ఎత్తుకు వెళ్ళు. పారచూట్ కట్టుకొని క్రిందికి దుముకు" అంటూ సంజ్ఞ చేశాడు. కాని, కుకుష్కిన్ ఆవిధంగా ఎగిరేబదులు ఉన్నట్టుండి క్రిందికి దిగటం మొదలు పెట్టాడు. మిగిలిన ఆ వొక్కరెక్క పడుకొన్న అలెక్సీకి లేచి నిలబడితే అందేటంత దగ్గిరగా కనిపించింది. మిగిలిన రెండో చక్రంమీద భూమిని తాకి కొంతదూరం పరుగిడి. గుండ్రంగా గిర్రున

చుట్టిం దా విమానం. ప్రక్కకు ఒరిగినందున దాని రెక్క తగిలి అక్కడవున్న మంచుయావత్తూ, దూది ఏకినట్లు పైకెగిసింది.

విమానం గుండ్రంగా తిరగటం నిలిచిపోగానే, నలుగురూ దానిని సమీపించారు. కుకుష్కిన్ దానిలో కనిపించాడుకాడు. దానిచెంత నేలపైన ఏదో నల్లగా కనిపించింది. స్పృహతప్పి పడిపోయిన కుకుష్కిన్ !

నలుగురూ ఎందుకూ పనికిరానివాడని అనుకొనే కుకుష్కిన్, ఏదో తన బాకీ తీర్చాడుకాదని ముఖం వాచేటట్లు నలుగురిలో తనవల్ల అవమానింపబడిన కుకుష్కిన్ ఇంతటి గొప్ప సాహసాన్నీ, త్యాగాన్నీ చూపించటం, అలెక్సీకి ఆశ్చర్యం వేసింది. ఇంత గొప్ప గుణా లాతనిలో ఉన్నాయనేది తానింతవరకు తెలుసుకోలేకపోయినందుకు అలెక్సీకి చాలా సిగ్గుకలిగింది. అందరితోపాటు తానూ పరుగెత్తుకెళ్లి కుకుష్కిన్‌ను అభినందించాలని ఆత్రంతో ఆశించాడు. కాని ? ....

కుకుష్కిన్ శరీరం ఒక మంచానికి కట్టి మోసుకు వస్తున్నారు. మత్తు తిరిగింది కాబోలు, బాధతో కుకుష్కిన్, గట్టిగా అరవటం మొదలుపెట్టాడు.

అలెక్సీ పడుకొన్న మడత మంచమును ఒదలకుండా విమానంలో ఎగించారు. అంతదూరంగా వాతావరణాశ్రయపు స్త్రీ నిలబడి దీనంగా ఒతనివంక చూస్తోంది ఆమె ఆనాటి ప్రొద్దున తన చెవులో చెప్పిన మాటలు తిరిగీ అలెక్సీకి జ్ఞప్తికి వచ్చాయి. ఆమె పేరుకూడా తనకు తెలియదు. ఎంత సిగ్గుచేటు !

మెమ్మదిగా, అలెక్సీ "సార్జెంట్ సోదరీ" అని ఆమెను పిలిచాడు.

ఆ మాట లామెకు వినిపించలేదు కాబోలు. ఒకటే గందరగోళంగానూ, శబ్దంగానూ వున్న దా ప్రదేశమంతా. ఆ స్త్రీ విమానమును సమీపించి ఏదో వొక పొట్లమును అలెక్సీకి అందిచ్చింది.

"లెఫ్టినెంట్ సోదరా ! ఇవి నీకు వచ్చిన జాబులు. భద్రంగా వీటిని దాచిపెట్టాను. నీవు తప్పకుండా తిరిగి వస్తావనే నమ్మకం నా కెందుకో గట్టిగా ఏర్పడ్డది....అదేమాదిరి వచ్చావు" అని నిట్టూర్చింది.

ఆ జాబుల కట్టను అలెక్సీ ఛాతీమీదనుంచింది. ముక్కోణాకారంగా మడిచిన కొన్ని జాబు లందున్నాయి. అవన్నీ తన తల్లి వ్రాసినవే. వాటిపై దస్తూరి అలెక్సీకి తెలుసు. మిగతావాటిపై నున్న దస్తూరి అలెక్సీ జేబులోనుండే జాబుల్లోని దస్తూరే ! వీటిని చూడగానే అలెక్సీ కండ్లు రెండూ రెండు జ్యోతుల్లాగా మెరిసాయని ఆ స్త్రీకి తోచింది. తనపై కప్పిన కంబళీని తొలిగించి, చేయి జాపి అలెక్సీ వాటి నందుకొన్నాడు.

ఆ అమ్మాయి చెక్కిళ్ళు కందాయి. కన్నీరు కారే నేత్రాలను క్రిందికి దించి, తొట్రుపడే పెదవులతో "ఇవన్నీ యెవరో వొక అమ్మాయి వ్రాసిన జాబులా?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పడానికి అలెక్సీకి సాహసం లేకపోయింది. అక్కడ పెద్ద గల్లంతుగానూ, శబ్దంగానూ వుండబట్టి, తనకు వినపడలేదని ఆ అమ్మాయి అనుకొంటుందని తనకు తానై ధైర్యం చెప్పుకొన్నాడు. బదులు పలకలేదు.

తన ప్రశ్న కెందుకు జవాబు చెప్పలేదా అన్నట్టు లా బాలిక అలెక్సీవంక చూస్తూ నిలబడింది. "ఇవి నా సహోదరినుండి వచ్చాయి. దానికి వివాహ మయింది, కాబట్టే ఇవన్నీ మరో పేరులో నున్నాయని" జంకకుండా అబద్ధ మాడాడు. కాని లోలోపల తన్ను తాను తిట్టుకొన్నాడు.

విమానం తలుపు తెరుచుకొని డాక్టరొకాయన లోపలికి వచ్చాడు. "ఓహో! అప్పుడే ఒక రోగి ఇందులో నున్నాడా? మంచిదే....సరే. రెండోమనిషిని కూడా తీసుకురాండి" అని ఆయన పలికాడు. అక్కడ యూరాకు వెనుకగా ఒదిగి నిలబడిన మన స్త్రీని జూచి, "ఎవరమ్మా? ఇక్కడేమి చేస్తున్నావు? విమానం బయలుదేరడాని కింకెంతో గడువులేదు. దిగివెళ్ళు....ఎవ రక్కడ! రెండో మనిషిని ఎక్కించండి" అన్నాడు.

"ఉత్తరం వ్రాయి....దయచేసి జాబులు వ్రాస్తూవుండు, నీకు పుణ్యముంటుం దని" ఆ అమ్మాయి, దిగి వెళ్ళిపోతూ అన్న మాటలు అలెక్సీ నెంతో కలిచివేశాయి.

యూరా. డాక్టరూ ఇద్దరూ చేరి వేరొక రోగి మంచమును విమానంలోని కెక్కించారు. ఆ మనిషి ఎవ్వరో కాని, పాపం, తెగ మూలుగుతున్నాడు. మంచ మును బిగించేటప్పు డాతని మీద కప్పిన కంబళీ రవంత జారిపోయి, ముఖం కని పించింది. అలెక్సీకి కుకుష్కిన్! ఆ ముఖంలో బాధ కరుడు గట్టుకుపోయింది. డాక్టరు విమానమంతా కలయజూసి, అలెక్సీని సమీపించాడు. అతని పొట్టమీద చరిచి,

"బలే బాగున్నది! చూశావా. ఒంటరిగా వుండకుండా నీ కొక స్నేహితుడు దొరికాడు! విమానం బయలుదేరబోతోంది, అందరూ దిగిపోండి....ఓహో! ఆ వనితారత్నం దిగివెళ్ళిందా? ఆహాహా....మంచిది" అంటూ ఇకిలించా డా డాక్టరు.

దిగి వెళ్ళటానికి యూరాకు కాళ్ళాడాయికావు. ఇది కనిపెట్టి, డాక్ట రాతన్ని బల వంతంగా బయటికి త్రోసాడు. విమానం తలుపు మూశాడు. ఇంజనులు శబ్దించాయి. విమానమంతా గజగజ వణికి, కుదించి కదిలి నేలమీద పరుగిడింది. పరుగు లోనే పైకి లేచింది. తరువాత అది ఎగిరి వెడుతూన్నట్టే లోపలపడుకొన్న అలెక్సీకి తెలిసిందికాదు.

డాక్టరు అలెక్సీని సమీపించాడు.

“ఎట్లాగున్నది. ఏదీ? నాడి పరీక్షించనీ” అంటూ అతని ముఖం వంక తేరిపారజూచాడు. “ఊః! పిడుగువంటి ఘటం!” అన్నాడు. “నిన్ను గురించి ఎందరెందరో నాకు చెప్పారు. నమ్మ శక్యంకానంత సాహసం! అసామాన్యుడవు అబ్బాయీ. నీవంటివారీలోకంలో ఏ కొద్దిమందో వుంటారు. నాకు తెలుసు” అన్నాడు.

తరువాత వెళ్ళి తన కుర్చీలో కూలబడ్డాడు, డాక్టరు. మరు నిమిషం గురక బట్టి నిద్రపోయాడు. ఎంతో అలిసిపోయాడుకాబోలు, ఇట్టే నిద్రపట్టింది దాతనికి.

“నీ కథ వింటే, నాకు జాక్ లండన్ విషయం జ్ఞప్తికి వచ్చిందని” డాక్టరు పలికిన మాటలు అలెక్సీ స్మరించుకొన్నాడు. జాక్ లండన్ కాళ్లు రెండూ మంచు కరిచి పుండ్లయిపోయాయి. దూరాన వినబడే తోడేళ్ళ అరుపులనుండి దేక్కుంటూ వెళ్ళి తప్పించుకొన్నాడు.

ఏ మాత్రంకూడా కదలకుండా ఎగిరివెళ్లే విమానంలో పడుకొన్న అలెక్సీకి త్వరలో నిద్రమత్తు కలిగింది. తా నొక విమానంలో ఎగిరి వెళ తున్నట్టే అతనికి తెలిసిందికాదు. యుద్ధమూ, బాంబుల ప్రేలుడూ, చెవులు దిమ్మెక్కే శబ్దాలూ, గాయాలూ, పుండ్లూ, సహించ నలవిగాని బాధా, పాదాలలో వుండే మంటలూ — ఇవన్నీ అతను మరిచిపోయాడు. తీయని నిద్రపట్టింది.

*

## రెండో భాగం

# 1

అలెక్సీ, కుకుష్కిన్ లిద్దరూ మాస్కోనగరంలోని చికిత్సాలయంలో చేర్చబడ్డారు. దెగ్త్యారెంకో. లెనొచ్కా నర్సు ఇంతకు ముందే చెప్పినట్టు లా చికిత్సాలయం చాలా గొప్పది. యుద్ధానికి పూర్వం ఈ భవనంలో చాలా పేరు పొందిన రష్యను వైద్యశాస్త్ర పరిశోధకు డొకాయన వుండేవాడు. ఆయన తన సహచరులతో చేరి గొప్పగాయాలు తగిలిన వాకి. చాలా జబ్బుపడిపోయినవారికి బాధ తెలియకుండా చేయడానికీ, బలం పట్టడానికీ కొత్తమందులనూ, పద్ధతులనూ కనిపెట్టాడు.

యుద్ధం వచ్చాక ఈ పెద్ద భవనాన్ని సైనికుల చికిత్సాలయంగా మార్చాడు. వీలయినన్ని మంచా లేర్పాటు చేశాడు. కాని, లెక్కకు మించినంతమంది ఎప్పుడూ రావటంవల్ల, చుట్టుప్రక్కలనున్న మోటారుకారు లుంచబడే ఇండ్లనూ, నవుకర్లూ, చాకర్లూ వుండే ఇండ్లనూ-అన్నిటినీ మంచాలతోనింపేశాడు. తనశాస్త్రపరికరాలనూ, గ్రంథాలనూ మూటకట్టుకొని, పెద్ద డాక్టరుకొరకు నియమించిన గదిలో ఒకమూల పెట్టి, తానూ అందులోనే కాలంగడిపేవా డీ శాస్త్రజ్ఞుడు. అక్కడికీ స్థలం చాలింది కాదు.

ధవళాతిధవళమైన గోడలుండే ఈ భవనం దేశమంతటా ప్రఖ్యాత చికిత్సాలయమని పేరొందింది. దాని అసంఖ్యాకమైన గదులనుండి మూలుగులూ, ఆక్రందనలూ, నిట్టూర్పులూ, సంధిపట్టి మాట్లాడేవారి పిచ్చిపిచ్చి మాటలూ ఎప్పుడూ వినబడుతాయి. రక్తసిక్తమై కట్టుబట్టలూ, దూదీ, రక్తధారలూ, చీముపట్టిన పుండ్లూ, ఎర్రటి మాంసపు గాయాలూ - ఈ ప్రదేశమంతా బహు బీభత్సకరంగా కనిపిస్తుంది. శాస్త్రసమ్మతమైన పద్ధతుల ప్రకారం చేసిన మంచాల ప్రక్కనే, తాత్కాలికంగా ఏవో మడతమంచాలు ఎన్ని వుపయోగించినా స్థలం చాలిందికాదు. పాత్రసామగ్రి కరువై పోయింది. ఉన్న పింగాణీ పాత్రలన్నీ సరిపోక. సొట్టలుపడ్డ అల్యూమినియం గిన్నెలూ, లోటాలూ, పళ్లాలూ వాడవలసి వచ్చింది. సామీప్యంలో పడ్డ బాంబొకటి ఈ భవనంలోనున్న గాజు తలుపు

లన్నిటినీ చెల్లాచెదరౌనర్చింది. వాటి కిప్పుడు వెలుతురు చొరబడని బల్లచెక్కలు బిగించారు నీటి సరఫరా సరీగ్గా లేకపోవటమూ, దీపాలనూ పొయ్యిలనూ మండించే పెట్రోలుగాలి తరుచు నిలిచిపోవటమూ జరిగేవి. పాతబడిన సారాయి దీపాలమీద పనిముట్లనూ, పరికరాలనూ ఉడకబెట్టి శుభ్రంచేయక తప్పిందికాదు. ఇక రోగులమాటా ? విమానాలూ, రైళ్లు, బస్సులూ, ట్రక్కులూ వాళ్లని తెచ్చి పడేస్తాయి.

మన శాస్త్రజ్ఞుడి నుండి, సాధారణ పనిచేసేవారివరకూ, అందరూ విసుగూ విరామం లేకుండా, పగలనక, రాత్రనక, అన్నం నీళ్లూకూడా మరిచి పనిచేస్తున్నారు. దినానికి పద్దెనిమిదీ, ఇరవై గంటలు విరామం లేకుండా పనిచేసి, అలిసిపోయి నప్పటికీ, అచ్చటి నర్సులంతా ఎప్పటికప్పుడు తెల్లని ఇస్త్రీ మడతలు పట్టుకొని చిరునవ్వు చిలికే ముఖాలతో కనిపించేవారు; డాక్టర్లు కూడా ఇదేమాదిరి గంటల తరబడి పనిచేసి, ఎక్కడ ఏమాత్రం మన్ను కనిపించినా, ఏరోగి దుప్పటీమీద ఏమాత్రం రక్తిమరక కనిపించినా పనివాళ్ళమీద విరుచుకుపడేవారు. బల్లలూ, కుర్చీలూ, తలుపులూ కిటికీలూ శుభ్రంగా నున్నాయో లేదో చూడటానికి తమ చేతి రుమాలుతో వాటిని తుడిచి పరీక్షించి, ఏమాత్రం దుమ్ము కనిపించినా మండిపడేవారు. రోజుకు రెండు పర్యాయములు మన పెద్దాయన చికిత్సాలయం లోని ప్రతి వొక్కరోగినీ చూడటానికి వెళ్ళేవాడు. ఆయన ననుసరించి, మల్లె పూవులవంటి ఇస్త్రీ మడతలు తొడుగుకొన్న డాక్టర్లూ, నర్సులూ పెద్ద పటాలం మాదిరి వెళ్ళి, ఆయన యిచ్చే సలహాలను తమ పుస్తకాలలో వ్రాసుకొనేవారు. మాంచి ఎత్తూ, విశాలమైన నుదురూ, గాంభీర్యమైన గడ్డమూ ఆయనను చూడగానే రోగులందరికీ ప్రాణం లేచివచ్చేది.

సోవియట్ కేంద్రసంఘసభ్యులలో ఒక డవటంబట్టి చికిత్సాలయకార్యాలేకాక ఆయన కింకా ఎన్నో పను లుండేవి. నిద్రాహారాలు మానుకొని ప్రతి రోజూ చికిత్సాలయానికి వచ్చేవాడు. ఏమాత్రం ఎవరివల్ల లోపంజరిగినా నలుగురి ఎదుటా పట్టుకొని ముఖం వాచేటట్టు వాళ్ళను చీవాట్లుపెట్టేవాడు. విమానదాడిని సూచించే సైరన్ కూసినా, లేక శత్రువులకు తెలియకుండా వుండడానికి నగరంమీద దీపా లన్నీ ఆర్పివేసినా కూడా యీ చికిత్సాలయంలో పని యధావిధిగా సాగేది. హిట్లరుకూ, ఆయన బృందానికీ చావంటే రష్యనులు భయపడరనీ, తమ విధ్యుక్త కార్యాలు నెరవేరుస్తారనీ చాటడానికి దీనికి మించిన అవకాశం చిక్కదనీ, ఆయన పనివారందరినీ ప్రోత్సహించేవాడు. సోమరిపోతులకూ, భయస్థులకూ ఆస్పత్రిలో తావులేదనీ, అట్టివారు రాజీనామాలిచ్చి వెళ్ళవచ్చుననీ నిర్మొఖమాటంగా చెప్పేవాడు. ఒక్క నిమిషంకూడా యెన్నడూ ఆయన ఆలస్యంగా వచ్చియెరుగడు. నర్సు లందరూ ఆయన రావటాన్నిబట్టి తమ గడియారాలను సరిదిద్దుకొనేవారు.

ఒకనాడీయన ఒకరి ప్రక్క నింకొకరుగా పడుకొన్న ఇద్దరు రోగుల మంచాల దగ్గరికి వచ్చాడు. ఈయన పేరు, ఇంతవరకూ చెప్పటం మరిచిపోయాము: వాసిలీ వాసిలెవిక్.

"ఏమిటీ బొమ్మలకొలువు?" అని గట్టిగా అరిచాడు. వారిద్దరినీ చూడగానే. అక్కడుండే డాక్టర్లలో పెద్దవాడు, వయస్సులోనూ, అనుభవంలోనూ కూడా పెద్ద డాక్టరీ మాటలు విని అదిరిపడి. టంచన్‌గా నిలబడి, భయపడే పిల్లాడిమాదిరి ఇట్లా గన్నాడు.

"గతరాత్రి వచ్చారు, వీళ్ళిద్దరూ....చాలా రాత్రి అయ్యాక వచ్చారు.... వైమానికులు....ఇతని తొడఎముకా, కుడిచేయీ విరిగిపోయాయి. .... రెండో మనిషి స్థితి సరీగా బోధపడటం లేదు. కాని, మొత్తంమీద చాలా ప్రమాదకర మైన స్థితిలో నున్నాడనడాని కణుమాత్రమూ సందేహంలేదు, పాదపు ఎముకలు పూర్తిగా చితికాయి....పాదమంతా విషం పట్టిపోయింది....మన లోకంలో లేడని చెప్పాలి. చాలా అలిసిపోయాడు....ఇతన్ని తీసుకువచ్చిన డాక్టరు పద్దెనిమిది దినాలు జర్మనుల కంటబడకుండా నేలమీద దొర్లుకుంటూ, దొర్లుకుంటూ ఇతను తిరిగి తప్పించుకొన్నా డని చెప్పాడు....నమ్మశక్యంకాని సంగతి .. ఏదో నలుగురూ చెప్పుకొనే మాటలు విని ఆ విధంగా చెప్పివుంటాడు....నిజం కాదని. నా వుద్దేశం ...." ఈ రెండో మనిషి వయస్సెంతో, ఆతని ఇప్పటి ఆకారాన్ని చూసి తెలుసుకోడానికి వీలు లేకపోయింది.

అ డాక్టరు చెప్పే మాటలన్నీ వినిపించుకోకుండా, వాసిలీ వాసిలెవిక్ రెండో మనిషికి కప్పిన కంబళీ నెత్తి చూశాడు. ఆ మనిషి రెండు చేతులూ తన వక్షం మీద అడ్డంగా పెట్టుకొని పడుకొన్నాడు. తెల్లటి చొక్కామీద, పొగ మారినట్లు కమిలిపోయి, ఎముక లెముకలుగా కనిపించే ఆ చేతులు ఏ శవం చేతులమాదిరో వున్నాయి. నెమ్మదిగా తిరిగీ కంబళీని కప్పి, డాక్టరును చూసి:

"ఇక్కడెందుకు పడుకొన్నారు?" అని వాసిలెవిక్ గర్జించాడు.

"దారిలోకూడా మంచాలు వేశాము. ఏవంతయినా సందులేదు. మీరే చెప్పారు...."

"మీరే చెప్పారు; మీరే చెప్పారు! నలభై రెండు లేదా?"

"అది కర్నల్ గది...."

"కర్నల్!....కర్నల్ గది! ఏ బుద్ధిమాలినవాడు చెప్పాడు?....కర్నల్ గదట!"

"సోవియట్ రాజ్య ప్రఖ్యాత సైనికుల కా గదిని విడిగా పెట్టాలనిచెప్పారు."

"ప్రఖ్యాత సైనికులు! వీరాగ్రేసరులు! ఈ యుద్ధంలో పోరాడే ప్రతి వొక్కడూ వీరాగ్రేసరుడే నన్నమాట మరిచిపోవద్దు. నా కిదంతా తెలియదని అను కొంటున్నావు కాబోలు! నాకు నేర్పవచ్చావు. వీ రిద్దరినీ వెంటనే నలభై రెండో

నంబరు గదికి పూర్చు. కర్నలూ, గిర్నలూ అంటూ ఆలస్యం చేసేవుగనుక, జాగ్రత్త !"

ఈ మాట లని, గదినుండి వెళ్ళాడు అతనితో వచ్చినవారంతా కుక్కిన పేనుల్లాగా ఆయన వెనకాలే దారిపట్టారు. అంతదూరం వెళ్ళి, వెనుతిరిగివచ్చి రెండో రోగి, ఆలెక్సీ భుజంమీద చేయినాన్చాడు. రోజూ మంచులతో పడగటం వల్ల అతని చేతులు రెండూ కందిపోయి, చర్మం ఊడిపోతోంది.

"జర్మను సైన్యాల కంటబడకుండా రెండు వారాలు నీవు దొర్లుకొంటూ, దేకుక్కుంటూ వచ్చావట. నిజమా ?

"నా పాదాలు రెండూ విషంపట్టాయా ?" అని గద్గద స్వరంతో, బెదిరిపోయిన జింకమాదిరి చూస్తూ, అలెక్సీ శాస్త్రజ్ఞు నడిగాడు.

తలుపు దగ్గర నిలబడ్డవారివంక మన శాస్త్రజ్ఞుడు కోపంగా చూశాడు. వాళ్లంతా అదిరిపడి అక్కడినుండి వెళ్ళిపోయాక అలెక్సీతో ఇట్లాగన్నాడు :

"నీవంటివాడిని మోసగించటం తగనిపని, అవును, పాదాలు విషం పట్టాయి. కాని అధైర్యపడనక్కరలేదు. కుదరని వ్యాధులంటూ లేవు. ధైర్యం వదులుకోరాదు. నేను చెప్పేది అర్థమయిందా ? మంచిది."

వెంటనే అక్కడనుండి వెళ్లిపోయాడు. వెళ్లిపోయే మనిషిని చూస్తూ, "విచిత్రమైన మనిషి" అని అన్నాడు, అలెక్సీ.

"పెద్రిఘటం ! మన ఎదుట తన గొప్పతనమంతా చూపించడాని కీ నాటకమంతా ఆడాడు" అని కుకుష్కిన్ పరిహాసం చేశాడు. "కర్నల్ గదిలో పడుకొనేటంత గొప్పవాళ్లము మనం ! అలెక్సీ, ఇప్పుడైనా తెలుసుకో, మనమెంత గొప్పవాళ్ల మో అనేసంగతి."

"విషం....విషమెక్కాయి....రెండు పాదాలూ" అని గొణుక్కున్నాడు, అలెక్సీ.

# 2

కర్నల్ గది ఆ భవనాని కొక చివరనున్నది. దాని దక్షిణపు, తూర్పుకిటికీల గుండా లోపల ఎండపడుతుంది. గది మరేమీ అంతపెద్దదికాదు. పూర్వ మీగదిలో రెండుమంచాలుండేవని, నేలమీద కనిపించే మంచాల కాళ్లగుర్తుల నుండి తెలుస్తుంది. ఒక్కొకమంచం చెంత చిన్న అలమారొకటీ, రెంటిమధ్యా బల్లవొకటీ వుండేవి. ఇప్పు డిదే గదిలో నాలుగు మంచాలున్నాయి. ఒకదానిమీద పసిబిడ్డను వెచ్చగా బట్టల్లో చుట్టి పడుకోబెట్టినట్టు వొకమనిషి పడుకొన్నాడు. శరీరమంతా

కట్లు. వెల్లకిలాపడుకొని కట్టుగుడ్డలలో జేసిన రెండు రంధ్రాలగుండా గది పై కప్పును చూస్తూ పడుకొంటాడు. ఎప్పుడూ ఇటూ, అటూ కదలడానికి వీలులేదు కాబోలు, ఎప్పుడూ వెల్లకిలా పడుకొనేవుంటాడు. అలెక్సీ మంచంచెంత ఇంకో మంచమున్నది దానిమీద వొక సైనికుడున్నాడు. సన్నని శరీరమూ, స్ఫోటకం మచ్చల ముఖమూ, అత డెప్పుడూ ఏదో వొకటి మాట్లాడుతూనే వుంటాడు.

ఆస్పత్రిలో రోగు లొకరితో నొకరు ఇట్టే స్నేహం చేసుకొంటారు. సాయం కాల మయ్యేటప్పటికి అలెక్సీకి తన ప్రక్కన పడుకొన్న మనిషిని గురించి ఎన్నో విషయాలు తెలిశాయి. అతనిది సైబీరియా. సమిష్టి వ్యవసాయ సంఘానికీ మనిషి అధ్యక్షుడుగా నుండేవాడు. మంచివేటగాడు. యుద్ధంరాగానే అందులో చేరి తన తుపాకికి కావలసినంత పని కల్పించాడు. ఎల్నా యుద్ధంలో ఇతనితోపాటు ఇతని కొడుకులిద్దరూ, అల్లుడూ కూడా పాల్గొన్నారు. తానొక్కడే డెబ్బైఅయిదు మంది జర్మను సైనికులకు స్వస్తి చెప్పాననీ, తన పేరు ఫలానా అనీ చెప్పాడు. అలెక్సీకి నమ్మ శక్యమయింది కాదు. ఈ పేరు సోవియట్ దేశమంతటా మార్మోగింది. సోవియట్ యుద్ధ వీరులలో ఒకడైన ఈ మనిషి, తన ప్రక్కన ఈ విధంగా అశక్తుడై పడుకొనటం తలచుకొని అలెక్సీ చాలా విచారపడ్డాడు. ఎన్నెన్ని వార్తా పత్రికల లోనో ఈ మనిషిని గురించి ప్రత్యేక వ్యాసాలూ, ఛాయా చిత్రాలూ ప్రకటింపబడిన రోజులున్నాయి. అప్పటి నర్సులూ, డాక్టరులూ, వాసిలెవిక్ కూడా ఈయనంటే ఎంతో గౌరవించేవారు. స్టెపాన్ ఇవనోవిక్ పేరు వినని వారంటూ లేరు.

ఇక నాలుగో మనిషి శరీరమంతా కట్లు కట్టారు. ఆ రోజంతా ఒక్క మాటయినా, ఎవ్వరితోగానీ మాట్లాడలేదు. అతని గురించి స్టెపాన్ ఇవనోవిక్ ఈ విధంగా చెప్పాడు :

గ్రిగోరిగ్వజెవ్ అతనిపేరు. సోవియట్ టాంకుదళంలో పనిచేసి, సోవియట్ యుద్ధ ప్రముఖులలో వొకడని పేరు సంపాదించాడీ మనిషి. యుద్ధం మొదలు పెట్టగానే దానిలో చేరి, బ్రెస్టులిటోవస్కు ప్రాంతంలో పోరాడాడు. తరువాత బైలోస్టాక్ యుద్ధంలో ఇతని టాంకు బ్రద్దలయి, ప్రాణాలతో బయట పడ్డాడు. ఆ దళాధికారి టాంకుమీద బాంబు ప్రేలి ఆయన చనిపోయాడు. సైనికులంతా మిన్స్కు నగరానికి పారిపోడానికి సమకట్టారు. ఈ తరుణం కనిపెట్టి గ్రిగోరి వారందరినీ సమకూర్చి పోరు సల్పి శత్రువుల పారద్రోలాడు. తిరిగీ బగ్‌దగ్గిర జరిగిన యుద్ధంలో గ్రిగోరీ టాంక్ కాలిపోయింది. ఆ దళాధికారి చనిపోవటం కనిపెట్టి, సైనికులందరినీ సమకూర్చి పోరు సలిపాడు. తరువాత మరిద్దరితో చేరి జర్మను పటాలముల వెనుకప్రక్కగా తమ టాంకులతో వెళ్ళి, వారి నెంతో వేధించుకుతిన్నాడు. ఆహారం, మందుగుండు సామాగ్రిని తీసుకువెళ్ళే జర్మను ట్రక్కుల నడ్డగించి, చెల్లాచెదరొనర్చి నానావిధాలా జర్మనుల హింసించా రీ

ముగ్గురూ. అడవుల్లోనూ, గ్రామ పొలిమేరలలోనూ పడిపోయిన జర్మను టాంకుల నుండీ, ట్రక్కులనుండీ తమకు కావలసిన పెట్రోలునూ, ఆహారపదార్థాలనూ తీసుకొని నెలరోజులపాటు పోరపిహాటం చేశాడు, గ్రిగోరీ.

ఇంతలోగా యుద్ధం గ్రిగోరీయొక్క స్వగ్రామ ప్రాంతానికి ప్రాకింది. తమ గ్రామానికి వెళ్ళాలనే ఆదుర్దాకొద్దీ తమ టాంకుల మూడింటినీ కాల్చిపారేసి, స్నేహితులతోకూడి, తన గ్రామానికి వెళ్ళడానికి అడవులదారిని పట్టాడు గ్రిగోరీ.

పూర్వ మొక పర్యాయం గ్రిగోరీ నాలుగు రోజులపాటు సెలవు తీసుకొని తన గ్రామానికి వచ్చాడు. అతని తల్లి ఆ ఊరిలో ఒక బడిని స్థాపించి ఎంతికాలం గానో దానిని పోషిస్తోంది. ఆమెకు చాలా జబ్బుగా నున్నదనీ, వెంటనే రావాలనీ గ్రిగోరీ తండ్రి కబురుచేశాడు. ఒక మంచంమీద శల్యావశిష్టంగా ఆ తల్లి పడుకొని వున్నది. బక్కచిక్కిన తన తండ్రి ఆమె ప్రక్కనే కూర్చొని సపర్యచేస్తున్నాడు. తెరలుతెరలుగా వచ్చే దగ్గుతో తండ్రి బాధపడుతోంటే, అభం శుభం తెలియని ముగ్గురు చెల్లెళ్ళూ బిక్కముఖాలతో తల్లి మంచందగ్గిర నిలబడ్డారు. ఈ దృశ్యమంతా గ్రిగోరీకి తిరిగి కండ్లకుగట్టిన ట్లగుపించింది. ఆ వూరి వైద్యురాలు జెన్యా తనతోపాటు రైలు స్టేషనుదాకా వచ్చి, దిగబడిచి మరీ వెళ్ళింది. అప్పుడప్పుడు వుత్తరాలు వ్రాస్తానని గ్రిగోరీ ఆమెకు వాగ్దత్తంచేసి, తిరిగీ యుద్ధభూమిని చేరుకొన్నాడు.

ఇవన్నీ తలుచుకొంటూ నడిచివెళ్లే గ్రిగోరీకి తనవారంతా ఎట్లాగున్నారో? తప్పించుకొని వెళ్ళిపోయారా? లేకపోతే వారెట్టి కష్టాలు పడుతున్నారో? అనే ఆలోచనలనేకం కలిగాయి.

తీరా తనగ్రామానికివచ్చి చూస్తే తన కండ్లను తానే నమ్మలేక పోయాడు. తన యిల్లుకాని, తన వారుకాని, డాక్టరు జెన్యాకాని, చివరికి తన గ్రామం కానీ, ఏవొక్కటీ కనుపించాయి కావు. కాలిపోయిన ఆఇండ్ల మధ్య తనలో తానే గొణుక్కొంటూ, తప్పటడుగులు వేస్తూ, వెర్రిచూపులు చూసే పొకముసలమ్మ ఒకపించింది. జర్మనులీగ్రామానికి వస్తున్నారని తెలిసికూడా, గ్రిగోరీ తల్లిదండ్రులూ, చెల్లెళ్లూ తప్పించుకు వెళ్ళలేకపోయారు. తల్లికి చాలా కాయిలాగా నుండటంచేత, ఆమె నచ్చటి నుండి కదపడానికీ వీలుచిక్కిందికాదు. ఆమె నచ్చటవదిలివేసి తమంతతాము వెళ్లడానికి వారికి కాళ్లాడలా. జర్మనులు ప్రవేశించారు. గ్రిగోరీ తండ్రి ఆ వూరి సమిష్టివ్యవసాయ సంఘానికధికారి అని తెలిసింది. సోవియట్ ప్రజలపై నున్న తమ ద్వేషాన్ని వెలిబుచ్చడానికి పాపం ఈ యింటివారి నందరినీ, యింటివెలుపల నున్న బర్చిచెట్టుకు వ్రేలాడదీసి, ఉరితీసిచంపారు. డాక్టరు జెన్యా ఆ వచ్చిన జర్మను పటాలాధికారిని చూడటానికి వెళ్ళింది. గ్రిగోరీ ఇంటివారిని కాపాడమని తన శాయశక్తులా ప్రార్థిస్తాననీ, ఎట్లాగైనాసరే వారిని బ్రతికించి తీరుతాననీ ధైర్యంగా

వెళ్ళింది. అంతే. ఆమె తిరిగిరాలేదు. జర్మను అధికారి డాక్టరు జెన్యాను బలాత్క రించాడన్న వదంతి బయలుదేరింది. రెండురోజుల పిదప డాక్టరు శవం, ఆ అధి కారి వున్న ఇంటినుండి తెచ్చి కాలువగట్టున పడేసారు. ఎవరో జర్మనులు ఎక్కి వచ్చిన టాంకులకు నిప్పు అంటించారు, మరునాడు రాత్రి. కోపంవచ్చి ఈగ్రామా నికి నిప్పటించి నేలమట్టం చేసారు. ఇది జరిగి యిప్పటికి నాలుగే రోజులయిందని, ఆముసలమ్మ చెప్పింది.

గ్రిగోరీని వెంటబెట్టుకొని పూర్వం వాళ్ళ ఇల్లువున్న చోటుకు తీసుకువెళ్లిందా అవ్వ. చిన్నతనంలో దాని కొమ్మకు ఊయలకట్టి ఊగిన, ఆ బర్చిచెట్టు సగం పొగ జూరి కనిపించింది. తాను ఊయల కట్టిఊగిన కొమ్మనుండి ఐదుత్రాళ్ళు వ్రేలాడు తున్నాయి. పిదప నదిగట్టుకు తీసుకువెళ్ళి డాక్టరు జెన్యా శవం తెచ్చిపడేసిన జాగాను చూపించింది. గ్రిగోరీ అప్పుడప్పుడు యుద్ధభూమినుండి డాక్టరు జెన్యాకు వుత్త రాలు వ్రాస్తానన్నవిషయం ఇప్పుడాతనికి జ్ఞప్తికివచ్చింది, కాని తానొక్క జాబు కూడా వ్రాయలేకపోయాడు. తీరుబడి లేదన్నమాట నిజమే, కాని, ఒక్క వుత్తర మయినా రానందువల్ల డాక్టరెంత నొచ్చుకొన్నదో గదా అని అనిపించి, తలవంచి రెండు నిమిషాలపాటు అక్కడ నిలబడి అడివిలో దిగవిడిచిన తన మిత్రులను కలుసుకోడానికి వెళ్ళిపోయాడు. దుఃఖం హృదయంలో గడ్డకట్టుకు పోయింది కాబోలు, పాపం, కండ్లు ఎర్రబారాయేకాని, ఒక్క చుక్కయినా కన్నీరు కారింది కాదు, ఒక్కమాటయినా, ఆ ముసలమ్మతో మాట్లాడలేకపోయాడు.

జూన్ నెలలో గ్రిగోరీ అతని పటాలమూ జర్మనులనొకచోట ఓడించారు. ఆగస్టు నెలలో టి. 34 టాంకుదళానికి గ్రిగోరీ ఆధిపత్యం వహించి చాలా పేరు ప్రతిష్టలు సంపాదించాడు." అద్వితీయ గ్రిగోరీ"అనే పేరు పత్రికలలో సంచికలలో ఎక్కడచూసినా కనబడింది. ఒకనాడు బహువేగంగా తనటాంకును నడిపించుకొంటూ వెళ్ళి జర్మనులు అడ్డంగాకట్టిన దడుల విరగద్రొక్కి, మట్టిలో బాంబులు పూడ్చి పెట్టిన మైదానాన్ని దాటి, తన రష్యను సైనికులున్న వొక గ్రామాన్ని చేరుకొన్నాడు. గ్రిగోరీని అడ్డగించడానికి సాహసించిన జర్మను డొక్కడయినా కనిపించాడుకాదు. మరొక పర్యాయం దారి ప్రక్కనున్న అడవిలో వొంచుండి అకస్మాత్తుగా జర్మను పటాలంమీదికి తన టాంకునుతోలి. గుర్రాలనూ. మనుష్యలనూ దాని చక్రాలక్రింద నలిపి చంపాడు.

ఆ సంవత్సరం చలికాలంలో జర్మనులొక గ్రామంలో మకామేర్పర్చుకొని వున్నారన్న సంగతి గ్రిగోరీకి తెలిసింది. వెంటనే టాంకుదళాన్ని చేకూర్చుకొని వారి మీద పడ్డాడు. ఆ యుద్ధసమయంలో పెట్రోలు కాగడా వొకటి వచ్చి గ్రిగోరీ టాంకుమీదపడ్డది. టాంకు పూర్తిగా నల్లటి పొగలు క్రమ్ముకొన్నప్పటికీ అందు లోని సైనికులు నదురూ, బెదురూ లేకుండా దాని నడిపించుకొంటూ వెళ్ళారు, బ్రహ్మాండమైన కొరివిదయ్యం మాదిరి మండుతూ, ఇరుప్రక్కలనుండి ఫిరంగుల

ప్రేలుస్తూ చెలరేగి జర్మను పటాలాన్ని చెల్లాచెదర గొనర్చి లెక్కలేనంత మంది సైనికులను తన చక్రాలక్రింద పచ్చడిచేసింది. ఈలని టాంకు గ్రిగొరీకీ, అతనితో నున్న సైనికులకూ తాము మృత్యువుతో చెలగాటమాడుతున్నా మన్న సంగతి బాగా తెలుసు. ఉన్నట్టుండి పెట్రోలు టాంకు నిప్పంటుకొనో, లేక తమ టాంకులోనున్న ఫిరంగిగుడ్లు పగిలో టాంకు బ్రద్దలై, వారి శవాలని నల్దిక్కులా పారేస్తుందని వారికి తెలియకపోలేదు. దట్టంగా లేచే పొగకు ఊపిరి సలిపింది కాదు. వారు తొడుగుకొన్న యినుప కవచాలు కాలిపోతున్నాయి. దాని కడుగున నున్న చొక్కాలనుండి పొగలు లేస్తున్నాయి. కాని వా రిసుమంతయినా వెను దీయక పోరాడుతునే వున్నారు. అకస్మాత్తుగా నొక బాంబు టాంకు చక్రాలచెంత పడి పగిలింది. టాంకు ప్రక్కకు దబీలుసపడింది. ఆ దెబ్బకు ఒక్కపెట్టున లేచిన మంచూ, ఇనుకా మండే మంటను ఆర్పివేశాయి. ఒడలంతా కాలిపోయిన గ్రిగొరీని లేవనెత్తారు. ఫిరంగుల కాల్చే మనిషికి దెబ్బతగిలి చనిపోవటం కనిపెట్టి, గ్రిగొరీ అతని స్థానము నాక్రమించాదన్న సంగతి తరువాతగాని తెలిసింది కాదు.

రెండు నెలలపాటు ఎవ్వరితోనూ ఎటువంటి మాటగానీ మాట్లాడక చావు బ్రతుకులలోనుండి ఇప్పు డిప్పుడే కోలుకొంటున్నాడు, గ్రిగొరీ.

ఆస్పత్రిలోనున్న రోగులకూ, వెలుపల ప్రపంచానికి యెటువంటి సంబంధం కానీ వుండదు. ఆ గది గోడలమధ్య నుండేవారికి బయటజరిగే యుద్ధ సమాచారాలు తెలియనీయరు. ఎంతమంది చనిపోతున్నారో, ఎన్నెన్ని గ్రామాలు అగ్నిదేవుని కాహుతి అవుతున్నాయో, ఎందరెందరి కుటుంబాలు కూలిపోతున్నాయో వీరి కే మాత్రమూ తెలియనీయరు. పెద్ద బాంబుల ప్రేలుడు శబ్దాలుకూడా బహు దూరంలో యెవరో ఈలలు కొడుతూన్నట్టు వినిపిస్తాయి. ప్రశాంతం, అంతా బహు నెమ్మదిగా వుంటుంది, వారుండే గదులలో. కిటికీ అద్దాల తలుపుమీద నెమ్మదిగా ప్రాకే ఈగకూడా వారి కొక పెద్ద విచిత్రంగా కనిపిస్తుంది. ఆస్పత్రి పని ముగిసీ ముగియటంతోనే, ఆ సాయంత్రం ఎవరో వొకాయనతో నర్సు సినీమా చూడటానికి వెడుతుందిట ; అందుకనే యీ రోజు ఎత్తుమడిమల బూట్సు తొడుగుకొని, టక్కుటిక్కుమంటూ తెగ తిరుగుతోంది. వాళ్ళ నర్సు ; ఇటువంటివన్నీ పడుకొని వున్న ఆ రోగులకు గొప్ప వింతలూ, విశేషాలుగా కనిపిస్తాయి. రోజూ రాత్రిపూట భోజనసమయంలో ఉడకబెట్టిన ప్రూన్ పండ్లిచ్చే వారు. నే డెందుకనో ఆపిల్ మురబ్బా నిచ్చారు ;....ఇటువంటి కబుర్లు చెప్పుకొంటూ కాలం వెళ్ళబుచ్చటానికి అలవాటు పడతారు. లేకపోతే, తప్పకుండా వారికి పిచ్చెక్కుతుందని చెప్పవచ్చు.

ప్రతి రోగినీ అతని గాయం విషయమైన ఆలోచనలూ, ఆదుర్దా ఎప్పుడూ పట్టుకొని పేధిస్తాయి. ఆస్పత్రిలోనికి తీసుకువచ్చి, మెత్తని పరుపుమీద పడుకోబెట్టి

నప్పటినుండే అతనికి తనమీద తనకే అసహ్యత ఏర్పడుతుంది. ఎందరెందరో ప్రాణాలకు తెగించి హోరాహోరీ పోట్లాడుతూంటే, శతృవుల మధ్య వీరతాండవ మాడుతూంటే, తా నీ విధంగా పడుకోటం అతనికి సిగ్గుచేటనిపిస్తుంది. తన్ను తానే తిట్టుకొంటాడు రోగి. నిద్రపోతున్నా, మేల్కొనివున్నా కూడా తన గాయమో, విరిగిన ఎముకలో, తెగిపోయిన అవయవాలలో ఎప్పుడూ అతనికి జ్ఞప్తికి వస్తాయి. నిద్ర లేచీలేవటంతోనే. పుండు ఆరుతువస్తోందా? నిన్నటికన్న నేడు బాధ తక్కువగా నున్నదా? జ్వరం కాస్తోందా? అనే ఆలోచన లాతనికి కలుగుతాయి. యుద్ధం చేసేటప్పుడు మృత్యువంటే తృణప్రాయంగా చూసిన మనిషి. తన శరీరారోగ్యన్ని గురించి చెప్పనలవికానంత దిగులుపడి చస్తాడు. డాక్టరు చెప్పే మాటల్లోని అంతరార్థాన్ని కనిపెట్టాలనీ, అతని ముఖంలో కనిపించే లక్షణాలబట్టి తన ఆరోగ్యపు నిజస్థితిని తెలుసుకోవాలని ఎంతో యత్నిస్తాడు; దిగులొందుతాడు; అదఃపాతాళంలోకి దించుకుపోతాడు.

కుకుష్కిన్ ఎప్పుడూ ఏదో వొకటి గొణుక్కొంటూ వుంటాడు. తనకట్లు సరీగ్గా కట్టలేదనీ, విరిగిన ఎముకులు తప్పుడుగా అతుగుకొంటాయనీ, తిరిగీ వాటిని విరిచి. కొత్తకట్టు కట్టాలనీ ప్రతిరోజూ అంటాడు. కాని గ్రిగోరీమాత్రం వొక్కమాటయినా పలికిన పాపానపోలేదు. నర్సు, క్లాడియా కట్లువిప్పి దోసెల్లతో వాస్‌లీనును తన పుండ్లమీద పూసేటప్పుడు రెప్పవాల్చకుండా చూసేవాడు. ఇదే మాదిరి ఎవరన్నా తన శరీరస్థితిని గురించి మాట్లాడితే, బహుశ్రద్ధగావినేవాడు, స్టిఫాన్ ఇవానొవిక్ ఒక్కడు మాత్రమే లేచి అటూ ఇటూ తిరిగేవాడు. కీళ్లన్నీ తగనినొప్పులు పెట్టటంవల్ల వంగిపోయి, మంచాలు పట్టుకొని ఆ గదిలో తిరుగాడేటప్పుడు, స్టిఫాన్, తన్నీస్థితికి తెచ్చిన బాంబుమీద కారాలూ. మిరియాలూ నూరేవాడు. బాంబుపడ్డ తరువాతే ఇతనికీ కీళ్లనొప్పులూ కనిపించాయి, పాపం.

డాక్టర్లు చెప్పుకొనే మాటలతో తన కెట్టి నిమిత్తముగానీ లేనట్టు అలెక్సీ పడుకొని వుండేవాడు. కాని విద్యుత్తీగలను తన పాదాలకి తగిలించడానికి, కట్లు విప్పినప్పుడల్లా, రెప్పవాల్చకుండా వాటిని చూసేవాడు. కమిలిపోయిన ఆ పాదాల చూస్తే తెగభయం వేసేది. వేళ్ళనుండి క్రమంగా పాదాలు పైభాగాలకు వాచుకుంటూ వస్తున్నాయి రోజురోజుకు. అవి బాగుపడతాయనే నమ్మకం అలెక్సీకి చిక్కిందికాదు.

ప్రతిదానికీ తెగచీదరించుకొనేవాడు, ఎవరన్నా హాస్యాలాడి నవ్వితే ఒళ్లమండుకు వచ్చేది. దుప్పటి మడతలు సరిగా లేకపోతే తెగతిట్టిపోసేవాడు. గదిని ఊడ్చే ముసలామె చేతినుండి పొరబాటున చీపురుక్రిందపడితేచాలు, ఎక్కడలేని కోపమూ వచ్చేది. ఆస్పత్రి భోజనం వంటబట్టి బలంచేకూరుతోంది, క్రమంగా. అతనికట్లు విప్పి కట్టేటప్పుడూ, పాదాలకు విద్యుత్ప్రసారం చేసేటప్పుడూ పాఠాలు నేర్చుకోడానికి వైద్య కళాశాలనుండి ఎందరో స్త్రీలు వచ్చేవారు,

పూర్వం మాదిరి. "ఎంత చిక్కిపోయాడు! ఏమిటిల బొమ్మమేలు" అనటం ఇప్పుడు మానుకొన్నారు. శరీరానికి బలం వచ్చేకొద్దీ అతని పాదాలు క్షీణిస్తున్నాయి. పాదాలనుండి వాపు మీగాళ్ళకు ప్రాకింది. వ్రేళ్ళు పూర్తిగా చచ్చుబడ్డాయి. వైద్యులు, లోతుగా కండలోకి దిగేటట్టు సూదులు గుచ్చి పరీక్షించారు. అలెక్సీకి చీమకుట్టినంత నొప్పికూడా కలుగలేదు. వాపు పైకెక్కకుండా వుంచటానికై వైద్యులొక వుపాయం ఎనిపెట్టారు. కాని, పాదాలలోని నొప్పి మునుపటి కంటె ఇప్పుడు విపరీతంగా పెరిగిపోయింది. పగలంతా తన తలగడ దిండ్లలో ముఖం దూర్చి, బోర్లా పడుకొనేవాడు. నర్సు క్లాదియా, రాత్రిపూట నొప్పి తెలియకుండా ఉండటానికి సూదిమందు నెక్కించేది.

డాక్టర్లు అప్పుడప్పుడు "ఛేదించటమం"టూ మాట్లాడటం మొదలుపెట్టారు. ఈ మాట విన్నప్పుడల్లా అలెక్సీ గుండెల్లో రాయిపడేది.

ఒకనాడు వాసిలెవిక్ ఆతని మంచందగ్గిర నిలబడి, అలెక్సీతో ఇట్లాగన్నాడు; "దేకులాడే పాపాయి ఎట్లాగున్నాడు? బాగా బలం పట్టుతూన్నట్లుతున్నదే? బహుశా, ఛేదించవలసి వుంటుందనుకొంటాను. ఏమంటావు?....కన్నుమూసి తెరిచేటంత కాలంకూడా పట్టదు....ఒక్క చిటికలో పని అయిపోతుంది."

బిగ్గరగా అరవాలనిపించింది, అలెక్సీకి. పండ్లు బిగపట్టి, బలవంతాన నోరు నొక్కుకొన్నాడు.

"ఓర్చుకోవాలి....భయపడనక్కరలేదు. సరే. ఈ మందు వాడిచూద్దాం" అంటూ వాసిలెవిక్ ఏదో మందుపేరు నొక కాగితంమీద వ్రాసి డాక్టరొకాయన చేతికిచ్చాడు.

ఆయన వెళ్ళిపోయాడు. దూరాన తలుపుమూసిన శబ్దం వినబడింది. కండ్లు రెండూ బిగువుగా మూసుకొని అలెక్సీ పడుకొన్నాడు "నా పాదాలు, నపాదాలు.... అయ్యో....పాదాలు" అంటూ లోలోపల కుమిలిపోయాడు. కాళ్లు నరికేస్తారా?.... తాను కుంటివాడయిపోవాలా?....తమ గ్రామం కామిషిన్‌లో, ఆర్కాషా అనే పడవసరంగొ కడున్నాడు....కుంటివాడు. నదిలో స్నానం చేయడానికి దిగేముందు తన కృత్రిమకాళ్ళ నూడదీసి గట్టుమీదపెట్టి, దేకొంటూ వెళ్ళి నీటిలో దిగేవాడా సరంగు. తానూ యికమీద అదేమాదిరి జీవించాలి కాబోలు!....దుర్భరం.

ఈ మనోవ్యాకులానికితోడు మరొక సంఘటనకూడా అతనికి చెప్పనలవి కానంత దుఃఖం కలిగించింది. కామిషిన్‌నుండి వచ్చిన జాబులన్నిటినీ చదివాడు. వాటిలో ముక్కోణాకారంగా మడిచిపెట్టిన జాబులన్నీ తల్లి వ్రాసినవి. తమ బంధువులందరి క్షేమసమాచారాలూ, వారందరూ తన రాకకై యెదురుచూస్తూవున్న సంగతీ వాటిలో నున్నాయి. దేవుడిదయవల్ల తాను సుఖంగా నున్నందుకు ఆ తల్లి పరమేశ్వరుని వేనోళ్ళ పొగడింది. అతనికి, తల్లికుండే పిచ్చి ప్రేమానుసారం

అనేక సలహా లిచ్చింది. "జాగ్రత్తగా వుండు; చలిరోజుల్లో ఉన్నిబట్టలు తొడుగు కొని జలుబుపట్టకుండా కాపాడుకో; పాదాలు అనవసరంగా నీటిలో తడపవద్దు, జ్వరం వస్తుంది: మొండితనం కూడదు; ఎందుకంటే ఆ జర్మనులు చాలా మోస గాండ్రు; వెనకా ముందూ చూచుకో:" ఈ విధంగా ఎన్నెన్నో సలహాలున్నాయి, ఆ జాబుల్లో. తన కటువంటి విషయాల్లో నమ్మకంలేదు కాని, ఎందుకయినా మంచిదని తమ ప్రక్క ఇంటామెతో అలెక్సీకొరకు చర్చిలో ప్రార్థించనున్నానని ఒక జాబులో ఆ తల్లి వ్రాసింది. ఒకవేళ దేవుడంటూ వుంటే ఆ ప్రక్కింటి స్త్రీ చేసే ప్రార్థనలు తన బిడ్డను రక్షిస్తాయిగా? మరొక వుత్తరంలో తన ముగ్గురు అన్నలదగ్గరనుండీ యెట్టి వర్తమానంగానీ రావటంలేదని తల్లి వ్రాసింది. వారు ముగ్గురూ దక్షిణాన యుద్ధభూమిలో నున్నారు. ఒకనాటిరాత్రి అలెక్సీ తల్లికో కల వచ్చింది. ఆమె నలుగురుకొడుకులూ వారి తండ్రీ పెద్ద బుట్టనిండా చేపలుపట్టి యింటికి వచ్చారట! అలెక్సీ తండ్రి చనిపోయి చాలా కాలమయింది. ఇరుగు పొరుగువారి కీ కలను చెప్పిం దామె. ఆమె కొడుకులలో నొకడు తప్పకుండా త్వరలో యింటికివస్తాడని వారాకలకు అర్థం చెప్పారు. తన పై అధికారుల నడిగి ఏ విధంగానయిగా నాలుగు రోజులపాటు సెలవు తీసుకొనిరమ్మని మరీ, మరీ వ్రాసిం దా పిచ్చితల్లి!

రెండోది, సీలింంగుకవరు. దానిమీద బడిలో చదువుకొనే అమ్మాయిల దస్తూరివంటి అక్షరాలున్నాయి. లోపల, ఓల్గా వ్రాసిన జాబులున్నాయి. ఓల్గా ఇతనితో చిన్నప్పుడొకేబడిలో చదువుకొన్నది. తరువాత అలెక్సీ కామిషిన్ రంపపు యంత్రాగారంలో కొంతకాలం పని నేర్చుకొన్నాడు. ఇప్పుడదే యంత్రాగారంలో ఓల్గా పనిచేస్తోంది. అందరు స్నేహితులవంటిదీ కాదీఓల్గా. ఆమెపేరు వింటేనే అలెక్సీకెంతో ఆనందం. అందుకనే ఆమె వ్రాసిన వుత్తరాలను ఎన్నో పర్యాయములు చదివాడు. వ్రాయబడిన మాటలేకాక, ఏదో రహస్య విషయము నామె తనకు చెప్తు తోందనే వుద్దేశంతో ఎన్ని పర్యాయములో చదివాడు. ఏమిటారహస్యం? తనకే తెలియదు.

ఓల్గాకు మితిమీరినంతపని. రోజూ తన ఇంటికికూడా వెళ్ళటంలేదు. ఇంటికి వచ్చివెళ్ళేటంత సావకాశమేలేదు. ఎప్పుడూ పని, ఒకటేపని, యంత్రశాల ఇప్పు డెంతోమారిపోయింది. అలెక్సీ దానిని గుర్తుపట్టడానికే వీలుండదు. నెలకొకరోజో, లేక, రెండురోజులోమాత్రం సెలవుదొరికితే, ఓల్గావెళ్ళి అలెక్సీ తల్లినిచూసి వస్తుంది. ఆమె పెద్దకుమారుల దగ్గరినుండి బొత్తిగా ఉత్తరాలే రావటంలేదు. ఈ దిగులుకు తోడు, శరీరారోగ్యంకూడా ఏమీ అంతబాగాలేదు కొద్ది దినాలుగా ఆమె తన ఆశ లన్నీ అలెక్సీమీదే పెట్టుకొని వుంటుంది. వీలయినప్పుడల్లా ఉత్తరాలు వ్రాయమనీ, విషాదవార్త లేవన్నా వున్నప్పటికీ వాటిని గురించి వ్రాయవద్దనీ, ఓల్గావ్రాసిన జాబు లలో నున్నది.

ఆ ఉత్తరాలు చదవగానే అలెక్సీకి ఏ విధంగానయినా తన తల్లి తానింటికి రావాలని కలిపెట్టుకొని వున్నదన్న విషయం విదితమయింది. తనకు వచ్చిన కలను గురించి వ్రాయటంలోని వుద్దేశం కూడా ఇదేనని అతనికి తెలిసింది. తన ప్రస్తుత పరిస్థితిని గురించి వ్రాయటమా? వద్దా? అనేది అలెక్సీకి తెసిందికాదు, వ్రాస్తే కన్నతల్లీ, ఓల్గా, ఇద్దరూ ఎంతో కష్టపడతారు. వారికిప్పుడప్పుడే తన నిజస్థితిని తెలుపకూడదనీ, వేరే ప్రదేశానికి మార్చబట్టి ఇకమీద వ్రాసే జాబులన్నీ ఈ క్రొత్త చిరునామాకు వ్రాయమనీ, నెమ్మదిగా జాబు వ్రాయడానికి నిశ్చయించాడు, బహుశ తానింకా ఈ ప్రాంతంలో చాలా కాలం వుండవలసి వస్తుందనీ వ్రాయడానికి కూడా తీర్మానించు కొన్నాడు.

ప్రతిరోజూ అలెక్సీని చూడటానికి వచ్చే డాక్టర్లు "ఛేదించట" మనే మాట నుపయోగించటం పరిపాటైపోయింది. తనకాళ్లు రెండూ నరికేస్తే, ఇంటికి వెళ్ళ డానికి ముఖం చెల్లదనిపించింది అలెక్సీకి. తన మొండికాళ్లను ఓల్గా కెట్లాచూపాలో అతనికి తెలిసిందికాదు. చూస్తే, ఓల్గా ఏమంటుంది? తన పెద్దకొడుకు అందరూ మృతినొందటబట్టి ప్రాణాలన్నీ తనమీదనే పెట్టుకొని బ్రతికే తల్లి దగ్గరికి తానెవ్విధంగా వెళ్ళాలో అతనికి బోధపడిందికాదు. ఇట్టి ఆలోచనలతో అతని మనస్సుకు స్థిమితమన్నదే లేకపోయింది. వరుష్కిన్ తన మంచంమీద ఒత్తిగిలినప్పుడల్లా దాని ఇనుపస్ప్రింగులు కీచుమనటంగానీ, గ్రిగోరీ నిట్టూర్పులుగానీ ఎల్లప్పుడూ గది కిటికీచెంత నిలబడి దానిమీద తన వ్రేళ్ళతో దరువువేసే ఇవానోవిచ్‌గానీ అలెక్సీకి తెలిసేవికావు. తన ఆలోచనలేమో తన ప్రపంచంమేమో అన్నట్టుండేవాడు.

"ఛేదించటమూ!.... ఘోరం.... ఎన్నటికీ విలువపడదు....ఛేదించట ....? దానికంటె చనిపోవటంమేలు....ఆమాట వింటేనే వెన్నులో వణుకుపుట్టినట్లని పిస్తుంది. ఈటొందిలో ప్రాణముండగా ఆపని జరిగేదు....జరగడానికివీలులేదు." ఈ మాదిరి తనలోతానే అలెక్సీ ఏన్నోపర్యాయములు అనుకొనేవాడు. ఈ "ఛేదించటమ"నే మాట తలుచుకొన్నప్పుడల్లా బ్రహ్మాండమైన ఓరక్క సాలిపొరటి తనమీద పడి, తన పదునైనకాళ్ళతో తన కండలన్నిటినీ ముక్కలు ముక్కలుగా నరికి భక్షిస్తూన్నట్టు అతనికి భ్రాంతికలిగేది!

# 3

నలభై రెండో నంబరు గదిలో కొద్ది దినాలపాటు ఈ నలుగురు రోగులే వున్నారు. ఒకరోజు నర్సు క్లావ్డియా ఇద్దరు పనిచేసే వారితో ఆ గదిలోనికి వచ్చి, ఇంకొకాయన కాగదిలో మంచం వేయాలనీ, అందరి మంచాలూ కొంచెం సర్ది ఏర్పాటు చేయాలనీ చెప్పింది. ఇవానోవిక్ మంచమును కిటికీదగ్గర వేశారు, ఇదా తనికెంతో సంతోషం కలిగించింది. తన మంచంమీద కూర్చునే కిటికీగుండా చూడ వచ్చుగా? కుకుష్కిన్ మంచమును ఏపంత ఇవానోవిక్ మంచందగ్గరికి జరిపి, ఆ ప్రదేశంలో ఎత్తు తక్కువయిన మంచమొకటి వేశారు. దానిమీద మెత్తని పరుపులు రెండింటినివేసి, ఇస్త్రీ మడతదుప్పటి పరిచారు.

కుకుష్కిన్‌కు పట్టరానంత కోపంవచ్చింది. తన పిడికిళ్ళతో దబదబా మంచం మీద బాదాడు. పెద్ద గొంతుచేసుకొని నర్సునూ, డాక్టర్లనూ, ఆ ఆస్పత్రినీ తిట్టి పోసాడు. ఇవానోవిక్‌ను కొట్టబోయాడు. నీళ్ళుత్రాగే కూజానెత్తి నర్సుమీద విసరబోయే సమయానికి, అలెక్సీ కుకుష్కిన్‌వంక రెప్పవాల్చకుండా ఒకే ఒక నిమిషం చూశాడు. కుకుష్కిన్ కుక్కిన పేనులాగా నిశ్శబ్దంగా తన పరుపుమీద వ్రాలాడు.

ఇంతలోనే ఐదోమనిషిని గదిలోనికి మోసుకొని వచ్చారు.

ఆ మనిషి స్థూలకాయుడు కాబోలు; మోసుకువచ్చే మంచం చాలా దించుకుపోయి, కిర్రుకిర్రున శబ్దించింది. ఒక్క వెంట్రుకయినాలేని ఆతని తల, శరీరంతో సంబంధం లేనట్టు తలగడమీద ఇటూ, అటూ ఆడుతోంది. పూర్ణం బూరెమాదిరి వాచిపోయిన ఆ ముఖంలో ఎట్టి చైతన్యంగానీ కనిపించదు. ఏదో యమబాధ ననుభవిస్తూన్నట్టులా మనిషి పెదవుల బిగబట్టాడు.

ఇంతవరకూ స్పృహతప్పినట్టు లున్న ఈ మనిషి మంచంమీద పడుకోబెట్టగానే కండ్లు విప్పాడు. మోచేతిమీద లేచికూర్చొని గదినీ, అందులోనున్న వారందరినీ కలయజూశాడు, "ఇక్కడ బాగానే వున్నదా?" అన్నట్టు. ఇవనోవిక్‌ను చూసి కన్నుగీటాడు. అలెక్సీ కెందుకనో, చూడగానే ఈ మనిషి అంటే అసహ్యం వేసింది. నర్సూ, మరిద్దరు పనివారూ చేరి, వచ్చిన రోగికాళ్ళ నెత్తి మంచంమీద సరుబాటు చేశారు. ఆతని ముఖం వెలవెలబారి, అకస్మాత్తుగా వెర్రిచెమటలు పోశాయి. పండ్లు బిగబట్టి, గట్టిగా కళ్ళుమూసుకొన్నాడు. పాపం, ఎంత బాధపడుతున్నాడోగదా అని అలెక్సీకి జాలివేసింది.

నర్సు వెళ్ళిపోయింది. ఏపంతసేపు పడుకొని ఆ మనిషి లేచికూర్చొన్నాడు. తాను తెచ్చుకొన్న పుస్తకాలను ప్రక్కనున్న అలమారులో, పై అరలో సర్దాడు.

రెండో అరలో పండ్ల పేస్టూ, బ్రష్షూ, ఉడుకులాన్ సీసా. క్షౌరం చేసుకొనే కత్తి, సబ్బు వగైరాలన్నీ సర్దాడు. తరువాత ఆ గదిలోనున్నవారితో ఉత్సాహంగా అన్నాడు :

"పరిచయపరుచుకొందామా? కమాండర్ సెమియోన్ పరోబియావ్ నాపేరు. చుట్టాబీడీ అలవాటులేదు. కలుపుగోలుతనం నా స్వభావం. నన్ను మీలో సోదరునిగా చేర్చుకొంటారా?"

తరువాత అంతదూరంగా నిలబడిన ఆస్పత్రి పనిమనుష్యులను చూసి చిరునవ్వు నవ్వి, "నేనిక్కడ కొద్దిరోజులే వుంటాను. ఎక్కువ రోజులుండటానికి వీలులేదు. నాపటాలం వాళ్ళంతా నా కోసం ఎదురుచూస్తూ వుంటారు. మంచుకరిగి నేల గట్టిపడగానే నేను వెళ్ళిపోతాను. ప్రఖ్యాతిచెందిన పదాతి అశ్వదళం మాది....ఏమంటారు?" అంటూ ఆ గదంతా మారుమ్రోగేటట్టు మాట్లాడాడు.

"ఈ గదిలోనివా రెవరూ యిక్కడ చాలారోజులు వుండరు....నీ వొక్కడవే కాదులే!....మంచు కరగగానే మన మందరమూ వెళ్ళిపోతాము....కాళ్ళు ముందూ, తల వెనుకా... యాభై యొక్కొనెంబరు గదికి వెళతాము మన మందరమూ" అని కుకుష్కిన్ గోడప్రక్క వొత్తిగిలి పడుకొన్నాడు.

ఈ ఆస్పత్రిలో యాభై యొక్క నెంబరుగది అనేదేలేదు. రోగులంతా శవాలను పేర్చే గది కా పేరు పెట్టారు. కుకుష్కిన్ చెప్పిన మాటలు పరొబియావ్‌కు కొంచెంకూడా నచ్చలేదు. కాని కుకుష్కిన్‌మీద కోపగించుకొనే బదులు లాలనగా జాలిగా చూసి :

"నీ వయ స్సెంత తమ్ముడూ? ముసలిగడ్డం! ముసలిగడ్డం మాదిరి మాట్లాడుతున్నా వేం? అప్పుడే ఇంత ముసలివాడవై పోయా వెందుకు?" అని ప్రశ్నించాడు.

# 4

నలభై రెండో నెంబరు గదిలోని వా రంతా యీ కొత్త రోగిని కమిసార్ అని పిలవటం మొదలుపెట్టారు. అతను వచ్చిన మరుక్షణంనుండీ వారి జీవితాలు చాలా మార్పుచెందాయి. వచ్చిన రెండు రోజుల్లో అక్కడున్న నలుగురితో స్నేహం కుదుర్చుకొన్నాడు కమిసార్. ఇవానోవిచ్ "ఇతరుల హృదయద్వారాలను తెరిచేదానికి కమిసార్ దగ్గిర పెద్ద తాళంచెవుల గుత్తి వున్న" దన్నాడు!

ఇవానోవిక్‌తో గుర్రాలను గురించీ, వేటాడటమును గురించీ వదలకుండా మాట్లాడేవాడు. వీ రిద్దరికీ గుర్రాలన్నా, వేటాడటమన్నా ఎక్కడలేని సరదా.

అలెక్సీ యుద్ధసంబంధమైన విషయాలు చర్చించాడు. విమానాలూ, టాంకులూ చాలా ముఖ్యమైనవే కాని, అశ్వదళం వీటి కణుమాత్రం కూడా తీసిపోదంటాడు కమిసార్. బాగా తరిఫీదుపొందిన గుర్రాలనూ, తెలివైన సైనికులనూ తెచ్చి, నవీన యుద్ధపరికరాలను వారికిచ్చినట్టయితే, వారిని నడిపించగల యోధులెందరో వున్నారు. నలుగురూ చూసి ఆశ్చర్యపడేటంత సాహసకృత్యాల నిట్టి అశ్వదళాలు సాధించ గలవు. ప్రఖ్యాత టాంకు యోధుడు, గ్రిగోరీతో టాంకుల గురించి మాట్లాడే వాడు. గ్రిగోరీ తన టాంకులో కూర్చొని వీరవిహారం చేసినయుద్ధ భూమిలో, అదేసమయమందు, కమిసార్ తన అశ్వికులనూ నడిపించాడు. ఇందువల్ల వారిద్ద రికీ అన్యోన్యంగా మాట్లాడుకోడానికెన్నో సంగతులుండేవి. ఎచ్చెలెచ్చట పోష సలిపిందీ, జర్మను లెంతగా హడలిపోయి తమ కాళ్ళకు బుద్ధిచెప్పిందీ చెప్పి కమిసార్ విరగబడి నవ్వేవాడు. ఇదంతా వింటూన్న గ్రిగోరీ, యథాప్రకారం ఒక్కమాటయినా మాట్లాడలేదు; కాని, కమిసార్ చెప్పేమాటలన్నిటినీ బహు శ్రద్ధగా వినేవాడు. అతను చెప్పేదానినంతా హర్షిస్తున్నట్టు తలనూపేవాడు. అంతే. కుకుష్కిన్‌కి, కమిసార్‌పై నున్న కోపమంతా ఎక్కడికో వెళ్లిపోయింది. కమిసార్ తనతో చదరంగమాడమని కుకుష్కిన్‌ను పిలవటంతో వారిద్దరికీ గొప్ప స్నేహం కుదిరింది. చదరంగమాడేటల్ల కుకుష్కిన్ మంచంమీదపెట్టి ఆటనాడే వారు కమిసార్. "కళ్లుమూసుకొని" ఆడేవాడు. ఒక్కసారికూడా కుకుష్కిన్ గెలిచాడుకాదు. దీనివల్ల అతనికి కమిసార్‌మీద గురుభావమేర్పడి, అతనితో గొప్ప స్నేహం కుదిరింది.

ప్రొద్దున్నే పనిమనుష్య గదిలోకివచ్చి కిటికీలు తెరవటంతోటే చల్లనిగాలి, మంచువాసన కొట్టే గాలిలోనికి జొరబడేది. అందులో నుండేవారందరూ ఊపిరి తిత్తుల నిండా దానిని పీల్చుకొని, వెలుపలినుండి వినబడే పక్షుల పాటలనూ, మాటలనూ వింటూ ఎంతో ఆనందిస్తారు. ఇదేమాదిరి కమిసార్ ఈ గదిలోనికి వచ్చినదిమొదలూ, ఆ గదంతా నూతనోత్సాహంతోనూ, శక్తితోనూ నిండిపోయింది. అప్రయత్నంగా సహజంగా కమిసార్ పలికే ఒక్కొక్కమాటా, చేసేపనులూ ఆ నలభై రెండో నంబరు గదిలోని వారినందరినీ గొప్పగా మార్చివేసాయి. లోలోపల అతడెంత బాధపడేవాడో, దేవుడికి తెలియాలీ, అతనికితెలియాలి. కాని అన్యులకు తెలియనిచ్చేవాడుకాడు.

ప్రొద్దున్నే లేవగానే తన మంచంమీద కూర్చొని "కసరత్" చేస్తాడు. చేతులరెంటినీ సాచటమూ, ముడవటమూ, శరీరాన్ని ఒకసారి కుడిప్రక్కకూ, మరో పర్యాయం ఎడమప్రక్కకూ వీలయినంత ఎక్కువగా వంచటమూ, మెడను వంచి తలను గుండ్రంగా త్రిప్పటమూవంటి కసరత్తును ప్రతిదినమూ చేస్తాడు. ముఖమూ, ఒళ్లూ కడుక్కోడానికి ప్రొద్దున్నే నీళ్లు తెస్తారు. తనకుతెచ్చే నీరు

ఎంత ఎక్కువ చల్లగానుంటే కమిసారు కంత ఇష్టం. పెద్ద శబ్దంచేస్తూ ముఖం కడుగుకొని తడి తువ్వాలుతో శరీరం తుడుచుకొంటాడు. ఒడలంతా ఎర్రగా కందగడ్డ మాదిరి కందిపోతుంది. ఇదంతా చూస్తే, తతిమ్మా రోగులందరికీ కన్నుకుట్టేది. వార్తా పత్రికలనుతెచ్చే నర్సు వచ్చీరావటంతో ఆమె చేతిలోనుండి వాటినిలాగుకొని మున్ముందు సోవియట్ సమాచార పత్రికనొకసారి తిరగవేస్తాడు. తరువాత వివిధ యుద్ధభూములనుండీ పత్రికా విలేఖరులు తెలిపే యుద్ధవార్త లన్నిటినీ చూస్తాడు. తనకేదన్నా ఒక అంశం నచ్చితే దానిని బిగ్గరగా చదివి, "భేష్! బాగున్నదం"టూ దానిని పెన్సలుతో గుర్తుపెడతాడు. ఒక్కొక్కపుడు వున్నట్టుండి, "గాడిదకొడుకు! అబద్ధాలు వ్రాస్తున్నాడు. నా తలతాకట్టు పెడతాను, కావాలంటే. యుద్ధభూమి దగ్గరికిపోయి వుండడు. గొప్పగా ఉన్నవీ లేని వన్నీ వ్రాస్తే సరిపోతుందా?" అని బిగ్గరగా అరుస్తాడు. ఒక పర్యాయం పత్రికా విలేఖరొకడు వ్రాసిన విషయాలేవీ కమిసారుకు ఏ మాత్రమూ నచ్చలేదు. వెంటనే ఆ పత్రికా సంపాదకులకు ఘాటుగా వొక జాబు వ్రాసాడు. తెలిసీ తెలియని విషయాలలో జోక్యం కల్పించుకోవద్దనీ, యుద్ధసమాచారాలు తెలపటమంటే ఏవో కట్టుకథలు వ్రాయటం కాదనీ ఆ విలేఖరికి బుద్ధి చెప్పమనీ వ్రాసాడు. మరొకప్పుడు చదివినదేదో వొక విషయమును గురించి ఆలోచిస్తూ, తలగడ దిండు కానుకొని చాలాసేపు కూర్చుంటాడు. తరుచుగా తన అశ్విక దళమును గురించీ, వా రొనర్చిన సాహసకార్యాలను గురించీ బహు చమత్కారంగా చెప్తుతోంటే, నలుగురికీ వినముచ్చటవుతుంది. ఆ దళంలో పిరికిపందలనేవారు లేరని చెప్పేటప్పుడాతని రెండుకళ్ళూ రెండు జ్యోతుల్లాగా మిగేలు మంటాయి.

ప్రతిరోజూ మధ్యాహ్న భోజనానంతరం రెండుగంటలసేపు జర్మను భాష నేర్చుకొనటానికి మొదలుపెట్టాడు. మాటల ననేకం కంఠోపాటంచేసి, వాక్యాల నుపయోగించి మాట్లాడటం నేర్చుకొన్నాడు.

"కోడి పిల్లకు జర్మను భాషలో ఏమంటారో మీకు తెలుసా? "క్యూ కెన్ కెన్" బాగుందలా? ఆ పేరు వింటేనే మెత్తి మెత్తని ఈకలూ, చిన్నపక్షీ జ్ఞాపకానికి వస్తాయి. ఇంకొకమాట. చిన్నగంటను, "గ్లోక్లింగ్" అంటారు. ఈ మాటలు వుచ్చరింపులోనే గంటల శబ్దం వినిపించినట్టుంది, చూశారా?" అంటూ తోటిరోగులతో మాట్లాడుతాడు, తరుచుగా.

ఉండబట్టలేక, ఇవానోవిక్ వొకనాడీవిధంగా ప్రశ్నించాడు.

"కమిసార్! ఎందుకీ జర్మను భాష నీకు? పుణ్యమా, పురుషార్థమా? పనిలేక అలిసిపోవటం తప్ప, నాకేదీ ప్రయోజనం కనిపించదు".

కమిసార్ కన్నుగీటి, "ఇవానోవిక్! నీకు తెలిసిన దింతేనా? రేపు బెర్లిన్ నగరాన్ని మనవారాక్రమించుకొంటే, అక్కడుండే జర్మను అమ్మాయిలతో

ఏ భాషలో మాట్లాడ మంటావు.... ? నీవే చెప్పు....వారికి రష్యన్ను అర్థంకాదుగా !" అన్నాడు.

మాస్కోనగర ప్రాంతంలో జరిగే యుద్ధం బెర్లినును చేరడానికింకా చాలా కాలం పట్టుతుందనీ, జర్మను బాలికలతో మాట్లాడేరోజులు తాము చూడకపోవచ్చు ననీ ఇవానొవిక్ చెప్పాలనుకొన్నాడు. కాని కమిసార్ ముఖంలో తాండవించే ఆనందాన్ని చూసి చెప్పడానికి ధైర్యం చాలిందికాదు.

"రష్యనులో మాట్లాడమని యెవ్వరూ చెప్పరు. కాని, ఇప్పటి నీ దేహ స్థితిని ఆలోచించుకొనటం మంచిది. ఎన్నెన్ని ఆపదలనుండి తప్పించుకొన్నావో, ఎంతటి బలహీనంగానున్నావో ఆలోచించటం...." అనే ఆతనిమాటల కొస్తుతగిలి కమిసార్,

"ముసలిగడ్డం ! ఎక్కువగా బుజ్జగిస్తే పిల్లలమాదిరే మన శరీరంకూడా ఎందుకూ పనికిరాకుండా పోతుంది....నీ కీ సంగతి తెలియదా ?" అన్నాడు.

ఆ గదిలో నెవ్వడికిగానీ గడ్డ మనేదే లేకపోయినప్పటికీ, కమిసార్ ప్రతి వొక్కడినీ "ముసలిగడ్డ" మనేవాడు. అలా గన్నాడని ఎవ్వరికీ కోపంవచ్చేది కాదు. తమతో అంత చనువుగా నున్నందుకు వారంతా యెంతో సంతోషించేవారు.

కమిసార్ సంగతి అలెక్సీకి అణుమాత్రం కూడా బోధపడ్డదికాదు. అంతటి ఉత్సాహం అతని కెక్కడినుండి వస్తుందో అలెక్సీ తెలుసుకొలేకపోయాడు, మేలుకొనివున్నప్పు డింత సరదాగానుండే ఆ మనిషి నిద్రపోయేటప్పుడు ఇటూ అటూ వొత్తిగిలి తెగమూలిగేవాడు. పండ్లు పట పట కొరికేవాడు బాధను భరించ లేక గాబోలు ఆతని ముఖం బహు భయంకరంగా కనిపిస్తుంది. తనలోని బాధ పరులకు తెలియకుండా వుండాలని కాబోలు, పగటిపూట నిద్రపోయేవాడేకాడు. వచ్చిపోయే డాక్టర్లతో తాపీగా మాట్లాడటమూ, హాస్యాలాడి నవ్వించటమూ చూస్తే, కమిసార్‌కు గల వ్యాధి ఏమిటా అనే సంశయం కలుగకమానదు. కాని దెబ్బతినిన అతని శరీరావయవాలను వైద్యులు తాకి పరీక్షించేటప్పు డాతడు పక్క బట్టలను బిగువుగా పిడికిట పట్టుకొనేవాడు. ముక్కు ముచ్చెమ్మటలు పోసేది. ఆత్మనిగ్రహంలో ఆరితేరిన కమిసారు తప్ప తదితరులెవ్వరూ అంతటి బాధనూ ఓర్చుకొని, వచ్చిన డాక్టర్లతో హాస్యాలాడలేరని అలెక్సీకి తోచింది. తన కెన్నెన్ని మత్తుమందులో యిచ్చేవారు. కాని తన పాదాలుపెట్టే బాధ నోర్చుకోలేక రాత్రంతా కప్పుకొనే కంబళీని నోట కుక్కుకొనేవాడు. లేకపోతే పెద్ద పెట్టున ఏడుపు వచ్చేస్తుందని భయం. కమిసార్‌కు గల ఓర్పూ, ధైర్యమూ తనకు లేనందుకు అలెక్సీకెంతో తలవంపులయింది. కాని గత్యంతరం ?

"ఛేదించట" మనేమాట విన్నపుడల్లా తనగుండె నిలిచిపోయిందనీ అలెక్సీ అనుకొనేవాడు. కాళ్ళులేకుండా బ్రతికేకంటె చనిపోవటం మేలనిపించింది,

# 5

తానెన్ని దినాలుగా ఏ రోజు రాకూడదని అనుకొన్నాడో అదే రోజు వచ్చింది. వాసిలెవిక్ ఆనాడు అలెక్సీ మంచందగ్గర రోజూకంటె ఎక్కువకాలం నిలబడ్డాడు. అలెక్సీ ముఖంవంక రెప్పవాల్చకుండాచూసి, "తీసివేయాలి !" అన్నాడు. నోరు విప్పిన అలెక్సీ మాట్లాడేలోగా, "తీసివేయాలి.... వేరేమార్గంలేదు. నేను చెప్పేది వినిపిస్తోందా ? లేకపోతే నీ పనిసున్నా అవుతుంది !.... అర్థమయిందా ?" అన్నాడు, ప్రొఫెసర్ వాసిలెవిక్.

వెనుకకు తిరిగిచూడకుండా, తనతోవచ్చిన వైద్యులతో ఒక్కమాటయినా మాట్లాడకుండా ఆయనగదినుండి వెళ్ళిపోయాడు. గదంతా నిశ్శబ్దం, కొయ్యబారిపోయి అలెక్సీ రెండుకండ్లూ ఇంటికప్పు పరీక్షించిచూస్తూ పడుకొన్నాడు. కామిషిన్ గ్రామంలోనుండే పరుగూ, అతని మొండికాళ్లా, దేక్కొంటూ కాలువలో బాతనుదిగటమూ, అన్నీ, అలెక్సీ కండ్లకగుపించాయి.

"లియోషా", అని కమిసారాతని నెమ్మదిగానే పిలిచాడు.

"ఏమిటి ?" అని గోతిలోనుండి మాట్లాడినట్లు అలెక్సీ అన్నాడు.

"తమ్ముడూ ! గుండె నిబ్బరం.... ఓర్చుకొనటం తెలుసుకోవాలి" అని అన్నాడు కమిసార్.

పరుగుదృశ్యం మాయమైపోయింది. మొండికాళ్ళతో దేక్కొంటూ తాను నదిలోకి దిగుతున్నాడు. రంగు రంగుల పూలగౌను, ఓల్గా తొడుగుకొన్నది. గాలిలో రెప రెపా కొట్టుకొంటోంది. కండ్లనీరు గ్రుక్కుకొని, రక్తం వచ్చేటంత బిగువుగా పెదవుల కొరుక్కొంటూ, ఓల్గా నదీతీరాన నిలబడి తనవంక చూస్తోంది! ........అలెక్సీ శరీరమంతా చలిజ్వరం వచ్చినట్లు గజగజ లాడింది. తనలో తానే వెక్కి వెక్కి ఏడుస్తూ బోర్లా పడుకొన్నాడు. గదిలోనివా రందరికీ ఏది చేయడానికీ తోచిందికాదు. స్టిపాన్ ఇవానొవిక్ నెమ్మదిగా లేచి, పెద్ద కోటొకటి తొడుగుకొని, మంచాలు పట్టుకొని నడుచుకొంటూ అలెక్సీ దగ్గిరికి వెళ్ళబోయాడు. ఇది గమనించి కమిసార్ "వెళ్ళవద్దు. మనస్తృప్తిగా ఏడవనీయ" మన్నట్టు లాతనికి సంజ్ఞ చేశాడు.

ఏడుపు నిలిచిపోయింది. అలెక్సీ మనస్సెంతో తేలికను పడినట్లాతనికి తోచింది. ఇంతవరకూ వేధించుకుతినిన, అతని ప్రాణాన్ని కొరుక్కొనితినిన సమస్య తీరిపోయింది. ఆ సాయంత్రం అలెక్సీని శస్త్రచికిత్సచేసే గదికి తీసుకొని వెళ్ళడానికి పనిమనుష్యులు వచ్చారు. ఒక్కమా టయినా పలుకకుండా వారితో

వెళ్లాడు. ఎలెక్ట్రికోల బల్లలూ కత్తులూ, కటారులూ గల ఆ గదిలో పడుకొని వున్నప్పుడు కూడా ఒక్క మాటయినా మాట్లాడలేదు. డాక్టర్లు అతని నాడినీ, గుండెనూ పరీక్షించి మత్తుమందు పెట్టడానికి తగినంతబలం లేదన్నారు. వాసిలెవెక్ పాదాలనొప్పి తెలియకుండా కాళ్ళకుమాత్రం మత్తుమందు నుపయోగించాలని చెప్పాడు. ఇవన్నీ వింటూవున్న అలెక్సీ నోరువిప్పి ఒక్కసారి అయినా పలికాడు కాదు. ఆ శస్త్రం బాగా సులభమైనదే అయినప్పటికీ స్వయంగా వాసిలెవెక్ ఆ పనికి తానే పూనుకొన్నాడు. శస్త్రంచేసే టప్పుడు అతను అదర్దాగా, పదే పదే నాడిని పసిపెట్టుకొనివున్న డాక్టరువంక చూసాడు, అలెక్సీ దానిని భరించగలడో లేదో అనే భయంకొద్దీ.

ఎముకలను రంపంతో కోసేటప్పుడు చెప్పనలవికానంత నొప్పి పెట్టింది. అప్పుడుకూడా అలెక్సీ నోరు విప్పాడుకాడు. తెల్లనిదుస్తులూ, కండ్లుమాత్రం కనిపించేటటువంటి టోపీ పెట్టుకొని తనచుట్టూ నిలబడి మనుష్యులంతా ఏమి చేస్తున్నారో అతనికి తెలియదు. వారివంకచూస్తూ, కాళ్ళలోని నొప్పులను మరిచి పోడానికి యత్నించాడు. శస్త్రచికిత్సానంతరం తిరిగి అలెక్సీని వేరేగదిలోకి తీసుకు వెడుతోంటే అతనికి స్పృహతప్పింది.

కండ్లు తెరిచిచూస్తే నర్సు క్లావ్దియా అతనిచెంతనిలబడి వుండటం కని పించింది. ఎంతోజాలిగా ఆమె ఎందుకు చూస్తోందో అలెక్సీకి తెలియలేదు. శస్త్రసంబంధమైన విషయాలెవ్వీగానీ అతనికి జ్ఞప్తికిరాలేదు. అతనికండ్లు తెరవటం చూచి, నర్సు చిరునవ్వునవ్వి, కంబళీ క్రిందనున్న అలెక్సీ హస్తాన్ని నెమ్మదిగా ఒక్క నిమిషం, అదిమిపట్టుకొన్నది.

"అంత ధైర్యంగా వుంటావని నేనను కోలేదు" అంటూ నాడిని పరీక్షించ టానికాతని చేతినందుకొన్నది. "ఏమిటీనర్సు అనే మాటల కర్థం ?" అని విస్తు పోయాడు. కాళ్ళునొప్పిగా నున్నసంగతి అతనికప్పుడుగాని తెలిసిందికాదు. పూర్వం మాదిరిపాదాల్లో మంటలూ, పోట్లూ, నరాలన్నీ మెలిబెట్టినట్లులుండటానికి బదులు, ఏదో బరువుగా, బిగువుగా తన మోకాళ్ళ క్రింద పట్టలాగుతున్నట్టు లనిపించింది, తన కాళ్ళకు కప్పిన దుప్పటి మునుపటికంటె పొట్టిగా నున్నట్టు లాతనికి తట్టింది. వెంటనే శస్త్రచికిత్సకు తీసుకువెళ్ళి పడుకోబెట్టి గది జ్ఞాపకానికి వచ్చింది. వాసిలివెక్ చుట్టు ప్రక్కలనున్న వారిమీద కోపగించు కొనటమూ, తాను పడుకొని వున్న మంచానికి దగ్గరనున్న పింగాణీ పళ్ళెంలో బరువైన వేవో వస్తువులు దభీలునపడె శబ్దమూ అతనికి జ్ఞప్తికి వచ్చాయి. "అప్పుడే అంతపని అయిపోయిందికాబోలు !" అనుకొని చిరునవ్వు తెప్పించుకొని నర్సుతో, "పూర్వం కంటె నేను పొట్టిగానున్నట్టులున్నదే ?" అన్నాడు.

ఎంతో జాలిగా నర్సు ఆతని చెంపలుతాకి, "ఫరవాలేదు. ఇకమీద ప్రాణం తేలికను పడినట్లుంటుందని" అన్నది.

"నిజం మునుపటంత బరువును మోసుకొంటూ తిరగనక్కర్లేదు"

"ఊహూఁ! అట్లా మాట్లాడవద్దు. నీ వెంత ధైర్యంగా నున్నావో నీకు తెలియదులే. కొందరు పెద్దపెట్టున కేకలు పెడతారు. కొందరిని పటకాలతో బల్లకు బిగించవలసి వుంటుంది. నీ వొక్క శబ్దమైనా చేశావుకావు. ఒక్క మాటన్నా అన్నావు కావు....అబ్బా!....యుద్ధం....పాడు యుద్ధం!" అంతట కమిసార్ బిగ్గరగా యీ విధంగా నర్సుతో అన్నాడు:

"నీ సంధి మంత్రాలు కట్టిపెట్టవమ్మా........ఈ ఉత్తరాలు తీసుకువెళ్ళి అలెక్సీ కీయి. అదృష్టమంటే అలెక్సీది. ఎన్ని వుత్తరాలో!....ఇన్నీ ఒక్క రోజులో వచ్చాయి."

అలెక్సీ చేతి కొక వుత్తరాలకట్ట సందిచ్చారు. అవన్నీ ఆతని వైమానిక దళంనుండే వచ్చాయి. వాటిమీద వేర్వేరు తారీఖులున్నాయి కాని, ఎందుకనో అవన్నీ ఒకేరోజు వచ్చి చేరాయి. సగం నరికేసిన కాళ్ళను చాపి, వెల్లకిలా పడుకొని ఆ వుత్తరా లన్నిటినీ చదివాడు. యుద్ధభూమీ, అచ్చటి ప్రమాదాలూ, ధైర్యసాహసాలూ, త్యాగమూ వంటి విషయాలను తలుచుకొంటే అలెక్సీకి అమాంతంగా అచ్చటికి ఎగిరి వెళ్లాలనిపించింది. కాని కాళ్ళులేని మొండివాడు; తా నెక్కడ? యుద్ధ మెక్కడ?

ఆ జాబులలో యుద్ధాన్నిగురించిన ముఖ్యవిషయాలమాదిరే, అనేక చిల్లర విషయాలూ ఎన్నో వున్నాయి. తమ పటాలానికి ఎర్రపతాకం బిరుదు చిక్కింది. ఇవాన్‌చుక్‌కు ఒకే పర్యాయం రెండు పతాకా లిచ్చారు. యాషిన్ వేటాడటానికి వెళ్ళినప్పు డొక నక్కని కాల్చాడు. కాని దానికి తోకలేదు. రస్టాల్ వన్నొకటి పుచ్చి, చిగురువాచి వుండయింది. ఇందువల్ల ఆతనిని నర్సు వినోచ్కా దగ్గిరికి రానీయలేదు! ఈ మాదిరి వెన్నో చిల్లర సమాచారాలన్నిటినీ ఎంతో ఆప్యాయంగా అలెక్సీ చదువుకొన్నాడు. తన మిత్రులున్న విమానాశ్రయమూ, దాని కానుకొని వున్న అడవీ ఆతనికి జ్ఞప్తికి వచ్చాయి. అమాంతంగా ఎగిరివెళ్ళి తన మిత్రు లందరితో సరససల్లాపా లాడాలని మనసుపుట్టింది కాని? ...

అత డా విధంగా జాబుల చదువుకొంటూండటం చూసి, కమిసార్ నర్సుతో రహస్యంగా "చూశావా? మీరందరూ నొప్పి తెలియకుండా వుండడాని కిచ్చే మందు లన్నిటికంటే నా ఉపాయం యెంత బాగా పనిచేస్తోందో చూడ" మని అన్నాడు. ఇటువంటి ఉత్తరాలు చదువుకొనటంలో నుండే ఆనందం కమిసార్‌కు బాగాతెలుసు. అందుకనే అప్పు డప్పుడు వచ్చిన ఈ జాబులన్నింటినీ అప్పుడే

# 6

పెద్ద శస్త్రచికిత్స లొందినవారనేకులకు సంప్రాప్తించే విషమపరిస్థితులే అలెక్సీకి కలిగాయి. ఎవ్వరితోగాని ఏమాత్రంకూడా మాట్లాడటం మానేశాడు. తన ఇష్టనిష్ఠూరాలను చెప్పుకొనటమో, లేక ఏడవటమో, చికాకుపడటమో యివి ఎన్నీ అతనికి దూరమయ్యాయి. మనస్సు పూర్తిగా కొయ్యబారిపోయింది.

మంచంమీద వెల్లకిలా పడుకొని గది డాబాలో వంకరటింకరగా బీటువడిన చారవంక రెప్పవాల్చకుండా చూసేవాడు. ఎవ్వరితోగాని, ఎటువంటి మాటగానీ మాట్లాడేవాడు కాడు. వారడిగిన ప్రశ్నలకు "అవున"నో, లేక "కాద"నో మాత్రం జవాబు చెప్పేవాడు. ఈ సమాధానాలుకూడా తరుచుగా అసందర్భంగా నుండేవని అలెక్సీకి తెలియదు. డాక్టరులిచ్చే మందులన్నీ త్రాగేవాడు, తెచ్చిపెట్టిన ఆహారమును బాగున్నదనిగానీ, బాగా లేదనిగానీ పల్లెత్తుమాటయినా అనకుండా ఏదో ప్రాణంలేని యంత్రంమాదిరి తినేవాడు డాబాలో కనిపించేబీటు మీద ఏకాగ్రతగా మనస్సు నిలిపిచూస్తే దానిలోనేదో గొప్ప అంతరార్థం గోచరిస్తుందా అన్నట్టు ఉండేది. అలెక్సీనూ అతనికండ్లనూ చూస్తే.

"ఏయ్! ముసలిగడ్డం! ఏమిటయ్యా తెగ ఆలోచిస్తున్నావ"ని కమిసార్ అన్నాడొకరోజు.

అలెక్సీ అతనివంక ముఖం త్రిప్పి ఆతడన్న మాటలు తన కర్థం కానట్టు వెర్రిచూపు చూసాడు.

"ఏమిటాలోచిస్తున్నావు?....దేనిని గురించి?" అన్నాడు తిరిగి కమీసార్.

"ఏదీలేదు."

ప్రొఫెసర్ వాసిలివెక్ ఒకనాడాగదిలోకివచ్చి, "ఏమయ్యా! బ్రతికే వున్నావా? విశేషాలేమిటి?....నీవు అందరివంటి మనిషివికావు. అసామాన్యుడవు. యుద్ధ వీరులలో నీవంటివారెందరో వుండరు, ఏవంతయినా నొప్పి అనిగానీ, అమ్మా అనికానీ అనలేదు. పద్దెనిమిదిరోజులు జర్మనుల కంటబడకుండా దేకుకొంటూ దొర్లుకొంటూ రావటం ఇతరులకు సాధ్యపడదు, పిడుగువంటిగుండె నీది. నా జీవితంలో నేనెన్నో శస్త్రచికిత్సలు చేసాను. ఏందరో రోగులను చూసాను. కాని, నీవంటి వాడిని చూడలేదు. నా మాటనమ్ము" అని అలెక్సీతో అన్నాడు. అతని ముఖంవంకచూసి, తిరిగీ "ఎందుకట్లా ముఖంచిట్లిస్తున్నావు? ఈ మనిషంతవాడు లేడని మనము పొగుడుతూంటే, చూడండయ్యా, నన్ను చూసి ముఖం చిట్లిస్తాడు! నేను వైద్యశాఖలో లెఫ్టినెంట్ జనరల్ననేమాట నీకు తెలియదుకాబోలు, నవ్వు, నవ్వవయ్యా నవ్వు, నేనాజ్ఞాపిస్తున్నాను.... నవ్వూ" అన్నాడు.

బిగదీసుకు పోయిన పెదవులను పాతబడిన రబ్బరు సాగేటట్లు సాచాడు, అలెక్సీ. ఇంతమాత్రమే అతను నవ్వగలిగాడు. పైకే వెకిలిగా నవ్వినా లోలోపల, తనివరికీగతి పడుతుందని తెలిస్తే నానా అవస్థలూపడి జర్మనుల కంటపడకుండా "ప్రాణంతో వచ్చేవాడినేకాను, నా పిస్తోలులో మూడు తూటాలుంటే కూడా వాటి నుపయోగించామకాన"ని అనుకొన్నాడు.

ఇటీవలే రెండు జర్మను విమానాలను ఎదుర్కొనిన రష్యను వైమానికుల గురించిన విషయాలను కమిసార్ ఒక పత్రికనుండి చదివాడు. ఆరు రష్యను విమానాలలోనూ ఒక్కటే ఒక్కటి నష్టమయింది. ఎనిమిది శత్రువిమానాలు కూలిపోయాయి. రష్యను సైనికుల ధైర్యసాహసాలను మెచ్చుకొంటూ కమిసార్ బహు హుషారుగా మాట్లాడాడు ఏ విధంగా అన్ని విమానాలును రష్యనులు పడగొట్టారో, ఎవరికితోచినట్టు వారుచెప్పారు. కుకుష్కిన్ కూడా ఎంతో సరదాగా, నలుగురితోనూ చేరి మాట్లాడాడు కాని, అలెక్సీ మాత్రం ఒక్కమాటయినా అనిన పాపానపోలేదు. విమానమెక్కి వెళ్ళటమూ, శత్రువులపై బడి వారినీ చింపరవందర చేయటమూ తన కీజన్మలో లేవుగదా అని తనలోతానే కుమిలిపోయాడు.

రష్యను యుద్ధసమాచార పత్రికలను చదవటంవల్ల, త్వరలో పెద్ద యుద్ధం చెలరేగనున్నదని ఆ గదిలోనివారందరికీ గట్టి నమ్మకం కలిగింది. రష్యనులు తీవ్ర ప్రయత్నాలుచేసి, బ్రహ్మాండమైన సైన్యమును కూడదీయనున్నారని, కమీసారూ ఇవనోలిక్కులు మాట్లాడుకునేవారు. వారితో కుకుష్కిన్ కూడా కలిసేవాడు. ఎప్పుడీయుద్ధం మొదలుపెట్టేదీ ఎక్కడ మొదలుపెట్టేదీ: ఇటువాంటి విషయా లన్నిటినీ వారందరూ ప్రతి దినమూ తెగచర్చించేవారు. అలెక్సీ ఒక్కడు మాత్రమే, ఎటువంటి జోక్యంగాని లేనట్టు, ఒంటరిగా దుప్పటికప్పుకొని పడుకొనేవాడు. వారందరికీ, ఆరోగ్యంచేకూరి, యుద్ధంలో పాల్గొనేభాగ్యం వున్నది. తన కట్టి అదృష్టంలేదు, "నేలను ప్రాకేవాడు ఎగురజాలడనే" మాటలు తరుచు అతని చెవిలో వినబడేవి.

నర్సుక్లావ్దియూ ఒక దినం కొన్ని పూవులను తెచ్చి, వారందరి మంచాల చెంతానున్న కూజాలలో నలంకరించింది. ఆ యుద్ధపురోజుల్లో మాస్కోనగరంలో మచ్చునకైనా పూవులగుపించేవికావు. ఎక్కడినుండి వీటిని క్లావ్దియా తెచ్చిందో ఎవరికీ తెలిసిందికాదు. వాటిస్వచ్ఛమైని, చల్లని తీపివాసన నలభై రెండో గదంతటా నిండిపోయింది. ప్రతి వొక్కడూ ఆమెనెంతో అభినందించాడు.

ఇదంతా చూస్తూ పడుకొన్న అలెక్సీకు కామిషిన్‌లో పూర్వం జరిగిన విషయమొకటి జ్ఞప్తికి వచ్చింది. పెద్దవర్షంపడి, బాట ప్రక్కకాలువలన్నీ నిండి పోయాయి, రాళ్ళు పరిచినబాటల మీదగల శబ్దంతో ఆ నీరు ప్రవహిస్తోంది. తానూ, ఓల్గా ఇద్దరూ ఒకరిప్రక్క వొకరు వాల్గా నదీతీరాన నిలబడివున్నారు. దాని విశాల

హృదయం మీద మంచుగడ్డలు తేలుతూ వెడుతున్నాయి, లార్కు పిట్టల మృదు మధురగానంతో గాలి నిండిపోయింది. ఆ మంచుగడ్డలు మానవాకారం దాల్చాయి, ఓల్గా, తానూ వాళ్లా నదీజలంలో తేలుతూ వెడుతున్నట్లు అలెక్సీకు తోచింది. వారిద్దరూ అదృశ్యాన్ని చూస్తూ, ముగ్ధులైపోయి ఎంతోసేపు నిలబడ్డారు, తీయని తలంపులాతని హృదయంలో తలెత్తాయి. తానూ, ఓల్గాచేరి ఆనందమయ జీవిత మును గడిపే రోజులు త్వరలో రానున్నాయనే నమ్మకం వారిద్దరికీ కలిగింది కాటోలు, దగ్గిరికి జరిగి, ఒకరిచేతులు నొకరు పట్టుకొని నిలబడ్డారు. ఆనాటి తన కలలు, జీవితాంతం వరకూ కలలుగానే వుంటాయి కాటోలు! కాళ్లులేని తనతో జీవితాంతం వరకూ బ్రతకడానికి ఓల్గా ఎన్నటికీ అంగీకరించదు. నిశ్చయం, ఒక వేళ ఆమె దానికి ఒప్పుకొన్నా. అటువంటి త్యాగము నామె చేయటానికి తానెన్నడూ అంగీకరించలేడు. యౌవనమూ, సొగసూ, అపారమైన ప్రేమా, వీటి నొకొక్కటీ వాడి కొరకా? తాను వెడుతోంటే వెనకాలే కుంటుకుంటూ కర్రల సూతగొని వచ్చే తన కొరకు ఓల్గా త్యాగం చేయడానికి తానెన్నడూ ఒప్పుకోరాదు. అంత కంటె ఎక్కువ స్వార్థపరత్వం వేరొకటి ఉండజాలదు....నర్సును నెమ్మదిగా తన దగ్గిరికి రమ్మని, అలెక్సీ సంజ్ఞ చేశాడు....తీయని మత్తు వాసనల వెదజల్లే ఆ పుష్ప గుచ్ఛాలను తన మంచందగ్గిరనుండి తీసివేయమన్నాడు. అట్టి ఆనందాన్ని అనుభవించడానికి తనకు యోగ్యత లేదని అలెక్సీ నిశ్చయించుకొన్నాడు.

పూవులనైతే తీసివేయించగలిగాడే కాని, తన మనస్సులోని తలంపులను తొలగించటం అలెక్సీకి శక్యమయింది కాదు. తన కాళ్ళను నరికివేశారని తెలిస్తే ఓల్గా ఏమంటుందో! తన దారిని తాను వెళ్ళిపోతుందా? తన సంగతే మరచి పోతుందా? ఎన్నటికీ ఓల్గా ఈ విధంగా వర్తించదని తనకు తానే తిరిగి చెప్పు కొన్నాడు. ఓల్గా అటువంటి స్త్రీ కాదు. తప్పక తనతో జీవితం గడపడానికి ఒప్పు కొంటుంది....కాని దీనివల్ల ఆమెకు కలిగే సంతోషం?....తన వృత్తిలో పైకిరావ డానికి అణుమాత్రం కూడా వీలుండదు. కుంటి మొగుణ్ణి కనిపెట్టుకొని కూర్చో డానికి బాధ్యతాయుత, పెద్ద వుద్యోగాలు చేయడానికి జత కుదరదు. కాబట్టి ఏదో ఒక విధంగా పొట్టనింపుకోడానికీ, కుంటి భర్తను కాపాడటానికీ, ఏ చిల్లర పని లోనో చేరుతుంది, ఓల్గా. ఆమె కనిన కలలూ, సంకల్పించుకొనిన కార్యాలూ బూటకాలవుతాయి. ఎవరు చెప్పగలరు? కుంటి మొగుణ్ణి పోషించటం చాల దన్నట్టు నలుగురు బిడ్డలూ పుట్టుకువస్తారేమో!

ఇటువంటి జీవితమును గడపమని ఓల్గాతో చెప్పడానికి తనకెట్టి అధికారం లేదనిపించింది, అలెక్సీకు. మరిద్దరూ ఒకరినొకరు ప్రేమిస్తున్నారే కాని, ఇంత వరకూ పెళ్ళి విషయమై ఎటువంటి నిశ్చితాభిప్రాయం కానీ ఆమె వెలిబుచ్చనూ లేదు, తాను కూడా ఆమెతో చెప్పలేదు. కాబట్టి ఈ పెండ్లి జరగకుండా చేయటం తన బాధ్యత, ఆమె జీవితమును పాడుచేయటానికి తనకు హక్కులేదు, తనంతట

తానే ఈ పెండ్లి జరగకుండా తగిన చర్య తీసుకోవాలి. మంచి ఉపాయమాలో చించాలి. జాగుచేయటానికి వీలు సమయము కాదు. ఓల్గాకు అనవసరంగా కష్టాలు కల్పించకూడదు.

తానొకటి తలిస్తే దైవమింకొకటి తలుస్తాడన్నట్లు, అప్పుడే వచ్చిందంటూ, అప్పత్రి పోస్టుమాన్ ఒక ఉత్తరాన్ని తెచ్చి అలెక్సీ కిచ్చాడు. అది కామిషిన్ నుండి వచ్చింది. ఓల్గా వ్రాసిన ఉత్తరం. తన విషయమై ఓల్గా ఏదో అనిర్వచనీయమైన అపార్థాన్ని పడుతున్నట్లు అందలి వార్తలు సూచించాయి. తా నెన్నటికీ అలెక్సీను త్యజించననీ, అతని కెట్టి కష్టాలు వచ్చినా, ఎంతటి దురవస్థ కలిగినా, తనతోనే వుంటాననీ వ్రాసింది. తన కొరకె ఆమె జీవిస్తూన్నదనీ, ప్రతినిమిషమూ అతనిని గురించే కలలుగంటున్నాననీ కూడా వ్రాసింది. ఎంత కష్టంగా నున్నప్పటికీ తానీ పనిలో నుండటానికీ, సరిగా నిద్రకూడా పోకుండా రాత్రింబవళ్ళు పని చేయడానికీ, సెలవు రోజుల్లో యుద్ధభూమిని కాలువలు త్రవ్వడానికీ, ఇంతేకాదు. అర్ధాకలితో రోజులు గడపడానికీ కారణం. త్వరలో తానాతని కలుసుకొంటాననే గట్టి నమ్మకమేనట. "నీవు యుద్ధానికి వెళ్ళేముందు నీ కుక్కతో నిలబడి తీసుకొనిన ఛాయాపటం ఎప్పుడూ నా దగ్గిరే వుంటుంది. దానిలో వ్యక్తమయ్యే నీ చిరునవ్వు నా కెక్కడలేని బలమునూ ఇచ్చి. ఈ కష్టాలనూ, ఎడబాటునూ ఓర్చుకోడానికి చేయూతనిస్తుంది. మా అమ్మ నా కిచ్చిన మెడబిళ్ళలో ఈ పటాన్ని బిగించి ఎప్పుడూ నా మెడలో వేసుకొంటాను. దిగులుపడిపోయి, దారీ — తెన్నూ తెలియనపుడల్లా నీ పటాన్ని చూస్తానంటే. నామాట నమ్ము.... మన మిద్దరం, ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకొన్నంతకాలమూ. మన కెట్టి భయమూ లేదు. ఎవరుగాని మనకెట్టి చెరుపూ చేయలేరు." అతని తల్లికి జాబు వ్రాయమన్నది. ఓల్గా. ఆమె తన విషయమై చాలా పర్యాయములు అడుగుతూ వుంటుందట.

ఎప్పుడు ఇంటినుండి జాబులువచ్చినా, అలెక్సి ఎంతో సంతోషంగా చదివేవాడు. వాటిని చదువుతోంటే తన కష్టాలన్నీ మరచిపోయి, ప్రాణం లేచి వచ్చినట్టుండేది. కాని, ఇప్పుడో? సంతోషానికి బదులు చెప్పనలవికానంత దుఃఖంవస్తుంది. తనకు పట్టిన గుర్గతినిగురించి ఇంటికివ్రాసేటంత సాహసం లేకపోయింది. తన కాళ్ళను నరికేసారని వ్రాయనేలేదు. అతను చేసిన గొప్ప పొరబాటుపనే అది.

"వాతావరణాలయపుటమ్మాయికి" మాత్రం తన యథార్థపుస్థితినీ, తన మనోవ్యాకులతనూ గురించి విపులంగా వ్రాశాడు. వేరెవ్వరికీ వ్రాయలేదు. ఆమెతోటి పరిచయం బహు తక్కువకాబట్టే ఆ అమ్మాయికి వ్రాయడానికి సంకోచించాడుకాదు. ఆమె పేరయినా తనకు తెలియకపోయినా తనకు తోచిన చిరునామాకు వ్రాశాడు, ఆ వుత్తరాలు ఆమెకు చేరుతాయో లేదో, అతనికే తెలియదు,

చేరకపోయిన భావాలేవు. వాటిని వ్రాయటం మూలంగా అతని మనస్సు తేలిక పడ్డది. అంతటితోనే తృప్తిపొందాడు.

రోజులు గడిచేకొద్ది అలెక్సీ చాలా మారిపోయాడు. శస్త్రం జరిగేటప్పుడున్న మనోధైర్యం ఇప్పుడతనిలో కనిపించదు. పుంస్త్వ అటుకువచ్చేకొద్ది తనలోకి తానే ముడించుకుపోయి, ఎవ్వరితోనూ ఎటువంటిమాటా మాట్లాడటం మానుకొన్నాడు. రోజుకు రోజు క్షీణించిపోతున్నాడని పలుగురూ చెప్పుకొనటం సరిపాటయింది: కాని ఎవరుగానీ అలెక్సీకి ఏ విధంగానూ సహాయం చేయలేకపోయారు.

## 7

వసంతకాలం వచ్చేసింది.

దానిప్రభావం నలభై రెండో నంబరు గదిలోకూడా వ్యక్తమయింది. ఎప్పుడూ ఐడోఫారం మందు వాసనలుకొట్టే ఆ గదిలోకి, కిటికీలద్వారా చల్లని, పరిశుభ్రమైన గాలి, కరిగే మంచువాసనల గాలి వీయ నారంభించింది. వెలుపలినుండి పిచ్చుకల కిచకిచలూ, ఆస్పత్రి చెంత ములుపుతిరిగే రోడ్డుమీద చర్రున వెళ్ళే కార్ల శబ్దమూ, మంచు కరిగిన గట్టి తారురోడ్డుమీద నడచివెళ్ళే మనుజుల అడుగులూ, సాయంత్ర సమయంలో ఎవరో వాయించే ఎకార్డియన్ గానమూ, మన నలభై రెండో గదిలో వినబడుతున్నాయి. ఆ గది కిటికీ వాకిదానినుండి పోప్లార్ చెట్టు కొమ్మనిండా పసుపు జిగురుపూత పూసిన అకు మొగ్గలు కనిపిస్తాయి. లేత ఎండ వాటిపైబడి చూడ ముచ్చటగా నుంటుంది. ఎంత పౌడరు పూసుకొన్నా మరుగుపుచ్చడానికి వీలుకానన్ని పసుపురంగు మచ్చలు నర్సు క్లాదియా ముఖంనిండా కనిపించాయి, పాపం. కరిగిన మంచునీరు టప్పు టప్పుమంటూ కిటికీ అద్దాలమీద పడి, చిందులు త్రొక్కింది.

మానవ హృదయాలు కరిగి తీయని కలల కన జొచ్చారు, మనుజులు.

“ఇవానొవిక్! చేతి తుపాకితో అడవుల్లో తిరగవలసిన రోజులివి!,” అన్నాడు, ఒకనాడు కమిసార్. “మంచికమీద, జంతువు కెదురుచూస్తూ కూర్చుండగా తెల్లారుతుంది!....అరుణోదయపు లావణ్యమూ, గిలిగింతలు పెట్టే చల్లని గాలీ!.... నీకు తెలుసుగా....ఉన్నట్టుండి....రెప, రెప, రెప శబ్దం.... ఎగిరే పక్షి రెక్కలు— తోక వ్రేలాడేసుకొని, నీవున్న చెట్టుమీద కూర్చుంటుందొక పక్షి...., తరువాత ఇంకొకటి, మరొకటిగా వచ్చి వ్రాలుతాయి....”

ఇవానొవిక్, నోరు ఊరినట్లు లొట్టలు వేస్తాడు, కమిసార్ ఈ విషయమును గమనించనట్టు, తన గాలిమేడలను నిర్మించుకొంటూ పోయాడు,

తరువాత రవంత మంటచేసి, తెచ్చుకొనిన మైనం బట్టను దాని చెంత నేల మీదపరిచి. వేడివేడి టీని తయారుచేస్తావు .. పొగ వాసన కొడుతూవుంటే ఆ టీని త్రాగి ఓ ఎంత వోడ్కా (బ్రాందివంటి సారాయి)ను సేవిస్తే తల్లిముండామోయా. దానిశక్తి నరనాడులకూ ఎక్కుతుంది....ఊః....పడిన కష్టమంతా........"

"కమిసార్ భాయీ ! చాలు, చాలు. ఆపు" అన్నాడు ఇవానొవిక్." మా ప్రాంతాల్లో ఇప్పుడేది దొరుకుతుందో నీకు తెలుపుదలచుకొంటాను. పైక్ !! నీ వెప్పుడూ వినలేదా ? బలే సరదాగా నుంటుంది. పైక్ వేట. క్వాసో గాపోప్ప డబ్బుకూడా సంపాదించవచ్చు. నదుల్లోని మంచు కరిగి నదులన్నీ నిండి పోతాయి. మాది పల్లపసీమలో పైక్ కొట్టుకువచ్చునది. గట్లమీదా, ప్రక్కనున్న గడ్డిలోనూ, నాచుముక్కల్లోనూ గుమిగూడుతాయి, అప్పుడే అవి గ్రుడ్లుపెట్టు తాయి. నది గట్టుమీద నడిచి వెళుతూంటే, పెద్ద కట్టెలమాదిరి పైక్ చేపలు నేలపైనంతా కనిపిస్తాయి ! తుపాకితో నీకు ఇష్టమైనన్ని చేపల్ని కాల్చవచ్చు. తెచ్చిన సంచి ఒక్క నిమిషంలో నిండిపోతుంది. తల్లితోడు ! కాదంటే."

ఎంతోసేపు ఈ విధంగా వీరిద్దరూ కబుర్లు చెప్పుకొన్నారు. క్రమంగా యుద్ధపు కబుర్లలోకి దిగి, ఇప్పుడు రష్యను సేనలేమిచేస్తున్నాయో ? త్రవ్విన కాలువ లన్నీ నీరునిండాయా ? కట్టిన దడులన్నీ కరిగే మంచుతోనడిచి వేరొక చోటికి వెళ్లాయా ? అనే విషయాలు చర్చించారు. నెమ్మెంటూ, తారురోడ్లమీద నడవటాని కలవాటుపడిన జర్మనులు కరిగే మంచు మైదానాలలో నానా అవస్థలూ పడు తున్నారు కాబోలుననీ మాట్లాడుకొన్నారు,

స్టిఫాన్ ఇవానొవిక్ ఎప్పుడూ ఏదో వొకపని చేస్తూనేవుంటాడు, అతని చేతులు ఊరకుండనోపవు. ఒకనాడు తాను తినగా మిగిలిన చిన్న రొట్టె తునకను త్రుంచి ముక్కలుచేసి, తన కిటికీ అంచుమీద నుంచాడు. ప్రక్కనున్న చెట్టుమీది పిచ్చుకలు అమాంతంగా అక్కడ వాలి వాటిని తిని ఎగిరిపోయాయి. ఆ పిచ్చుకల చూడాలని, వాటికింత తిండిపెట్టాలనే ఆశ నలుగురికీ కలిగింది. ప్రతిరోజూ మధ్యాహ్నం భోజనమప్పుడు, కావాలనే ప్రతి వొక్కడూ ఒక రొట్టెముక్కను తినకుండా దాచిపెట్టేవాడు. ఆ ముక్కలన్నీ తీసి ఇంతింత తునకలుచేసి ఇవానొవిక్ చేతికిస్తే, అతను వాటిని తన కిటికీ అంచునపెట్టి, దూరంగా జరిగి చూచ్చునేవాడు. కిచకిచలాడుతూ పిచ్చుకలు వచ్చి వ్రాలేవి. ఒకదానితో నొకటి పోరాడుతూ, తిట్టుకుంటూ, త్రోసుకొంటూ గిజిబిజిగా ఆ ముక్కలన్నిటినీ తింటాయి. తరువాత రెక్కలు విప్పి వడ్లగింజలవంటి తమ ముక్కుతో రెక్కల దువ్వుకొని. తోక లెగురవేసి. తలలు వంచి ఓర చూపులు చూచి, తుర్రుమని చెట్టుమీదికెగిరి వెడతాయి. ఇదంతా చూస్తూ ఆ నలుగురూ తమ కష్టాలను రవంతసేపయినా

మరిచిపోతారు. పిచ్చుకలకు ఎందుచేయటమూ, వాటిలో కొన్నింటికి పేర్లు పెట్టటమూ వారందరికీ ఎంతో సంతోషాన్నిచ్చింది. వాటిలో తోక సగం తెగిన పిచ్చుకొకటి వున్నది. అది బలే కజ్జాకోరు. అందుకనే కాబోలు దానితోక నెవరో ఎప్పుడో సగం తుంచేశారంటాడు, ఇవానొవిక్. దాని కాతడు "ఫిరంగి టామీ" అని పేరు పెట్టాడు.

ఇంతవరకూ ఒక్కమాటయినా పలుకని టాంకు పైలట్ గ్రిగోరీ లీవా, ఈ పిచ్చుకలకు వశుడై పోయాడు. మొదటిరోజు, మంచాలు పట్టుకొని నెమ్మదిగా కిటికీదగ్గిరికి నడిచి వెళ్ళే ఇవానొవిక్‌ను చూసీచూడనట్టూరుకొన్నాడు. రెండో రోజు పిచ్చుకలు వచ్చీరావడంతో మోచేతిమీద లేచి వాటిని చూస్తూ కాలం గడిపాడు. మూడోరోజు తీయని భక్ష్యాలలో సగం వాటికొరకని దాచిపెట్టి ఇవానొవిక్ చేతి కిచ్చాడు ...ఒకనాడు టామీ రాలేదు. గ్రిగోరీ చాలా నొచ్చుకొన్నాడు. కుకుష్కిన్ "ఏ పిల్లో దానిని తినివేసి వుంటుంది. కజ్జాకోరుపిట్ట పోతే పోయిందిలే" అన్నాడు. గ్రిగోరీ కంట్లో నిప్పులు రాల్చాయి. "సణుగుడు గాడని" కుకుష్కిన్‌మీద కోపగించుకొన్నాడు. రెండోరోజు తిరుక్క టామీ ప్రత్యక్షమయింది. యథాప్రకారం తక్కిన పిచ్చుకల పొడిచి, తరిమి పెద్ద అట్టహాసం చేసింది. గాజుపూసలవంటి తన కండ్లు తెరచి గదిలోనివారిని కలయజూచింది. గ్రిగోరీ సంతోషం పట్టలేక గొల్లున నవ్వాడు ఎన్ని నెలలో.... ఆతడీ మాదిరి నవ్వి!!

త్వరలో గ్రిగోరీ తత్వం పూర్తిగా మారిపోయింది. నవ్వులూ, పకపలూ, నలుగురితో కలుపుగోలుతనమూ, మాటా, మంతీ: మునుపటి గ్రిగోరీయేనా ఈ మనిషి అనిపించింది! దీని కంతకీ కారణం కమిసారే. ఇవానోవిక్ అన్నట్టు మానవ హృదయాలను తెరిచే తాళంచెవులగుత్తి కమిసారు పెట్టుకున్నాడు కాబోలు.

ఆ గదిలోనివారికి వచ్చిన వుత్తరాలను నర్సు క్లావ్డియా తెచ్చియిస్తుంది. అటువంటప్పు డొక చిన్న నాటక మాడిస్తుం దానర్సు. ఉత్తరాలు కనిపెంచకుండా తన చేతులు వెనకప్రక్క పెట్టుకొని వచ్చి, "ఇవ్వాళ ఎవరు నాట్యమాడుతారు?" అని అడుగుతుంది. ఎవడికి జాబులువస్తే ఆ మనిషి తన మంచంమీద హాస్యాని నాట్యమాడాలి. అప్పుడుకాని జాబుల నీయదు.

కమిసార్ కీగతి తరుచుగా పట్టుతుంది. అతని కెందరెందరో, ఎప్పుడూ, ఏదో ఒకటి వ్రాస్తూనే వుంటారు. తన అశ్వదళంనుండీ, తనతో చేరి యుద్ధంచేసిన యితర సైనికాధికారులనుండీ, సాధారణ సిపాయిలవద్దనుండీ మాత్రమే కాక, ఇంకా అనేక రకాలవారి జాబులుకూడా వస్తాయి. కొందరు సైన్యాధికారుల భార్యలు "గతించిన రోజుల, తీయని తలంపుల" గురించి వ్రాస్తే, తమ మాటవినని భర్తలకు భయంచెప్పమని మరికొందరు వ్రాస్తారు. తమ భర్తలు యుద్ధంలో చనిపోబట్టి, లోకవ్యవహారాలను గురించి సలహాలడిగే స్త్రీల జాబులూ, కజికిస్తాన్‌లో

నొక సైన్యాధికారి - ఆతనెప్పుడో, పాపం చనిపోయాడు - చిన్నకూతురు వ్రాసే జాబులూ, ఇటువంటివెన్నో ! ఆ అమ్మాయిపేరు మన కమిసారుకు నోరుతిరగదు. ఎంత యత్నించినా ఆ పేరు జ్ఞాపకమే వుండనంటుంది. ఇన్ని జాబులనూ శ్రద్ధగా చదివి, వాళ్ళందరికీ ప్రత్యుత్తరాలు వ్రాస్తాడీ కమిసార్. పై అధికారులకు ఫలానా సైన్యాధికారివిషయం గమనించవలసిందనీ, భార్య చెప్పినమాటలను శిరసావహించ మని కొందరికీ, ఫలానా కమాండరు భార్యాబిడ్డలుండే తన ఇంటిలో వెంటనే చలి మంట వేసుకోడానికి పొయ్యిని కట్టించమనీ, లేకపోతే. తానే స్వయంగా వచ్చి ఆ యింటివాడి తలను "మెలిపెట్టి త్రుంచివేస్తా"ననీ ఈ విధంగా వ్రాస్తాడు. కజకిస్తాన్ అమ్మాయికి వ్యాకరణంలో చాలా తక్కువ మార్కులు రావటం చూసి తనకు తలవంపులయిందనీ, తిరిగీ వచ్చే పరీక్షలో మంచి మార్కులు రావాలనీ హెచ్చరిస్తూ, ప్రోత్సాహపరుస్తూ వ్రాస్తాడు.

స్టిపాన్ ఇవానొవిచ్‌కికూడా చాల జాబులు వస్తాయి, ఇంటినుండీ, యుద్ధ భూమినుండీకూడా. ఆతని కుమారు లిద్దరూ యుద్ధం చేస్తున్నారు. కుమార్తె ఒక ఖోల్‌ఖోజ్ దళానికి అధికారిగా వుంటోంది. ఖోల్‌ఖోజ్ అంటే సామూహిక వ్యవసాయసంఘం. తమ ఖోల్‌ఖోజ్‌నుండి ఎందరో యుద్ధంలో చేరడానికి వెళ్ళారు. కాని వారు నియమించుకొనిన కార్యాలన్నీ అవిచ్ఛిన్నంగా సాగుతున్నాయి. వాటిలో కొన్ని అప్పుడే ముగిశాయికూడా. ఇట్టి జాబులు వచ్చీరావటంతోటే నలుగురికీ ఇవానొవిచ్ చదివి వినిపిస్తాడు. నర్సు క్లావ్డియా పనిచేసే మనుష్యులూ, ఆస్పత్రిడాక్టర్లూ, వారు వీరనక, ప్రతివారికీ ఇవానొవిచ్ ఇంటివిషయాలన్నీ తెలిసేవి.

కలుపుగోలుతన మెరుగని కుకుష్కిన్‌కుకూడా బర్నాల్‌లో ఎక్కడో వసించే అతని తల్లిదగ్గరనుండి అప్పుడపుడు వుత్తరాలు వస్తాయి. నర్సు చేతినుండి దాని నమ్రతంగా తీసుకొని, గదిలోనివారంతా నిద్రించేటప్పుడు దానిని రహస్యంగా చదువుకొంటాడు. అటువంటప్పు డాతని ముఖంలో ఎక్కడలేని సంతోషమూ, సౌకుమార్యమూ కనిపిస్తాయి. ఇటువంటి గుణాలు కుకుష్కిన్‌లో సాధారణంగా వ్యక్తంకావు. అతని తల్లి ఏదో వొక గ్రామంలో డాక్టరుగా వుంటోంది. ఎందుకనో తన తల్లిపై తనకుండే ప్రేమ ఇతరులకు తెలిస్తే అది అవమానకర మనే వుద్దేశం అతనికి వుండేది.

టాంకువీరుడు గ్రిగోరీ వొక్కడే ఇటువంటి సరదా లేవీ ఎరుగడు. అతనికి ఉత్తరాలే వచ్చేవికావు. వాళ్ళంతా వచ్చినజాబులను చర్చిస్తూ ఉండేటప్పుడు గ్రిగోరీ ఒంటినిండా దుప్పటి కప్పుకొని గోడప్రక్కగా తిరిగి పడుకొంటాడు. తన ఒంటరితనాన్ని తలుచుకొనీ, తన కెవరూ వ్రాసేవారే లేరుగదాఅనీ గ్రిగోరీ ఎంత దుఃఖపడేవాడో తెలుసుకొనటం మనుష్యమాత్రులకు సాధ్యపడదు. ఒకనాడు ప్రతిరోజూకంటే రెట్టింపు సంతోషంతో నర్సు క్లావ్డియా గదిలోకి వచ్చి, కమీసారును చూస్తూ :

"ఇవ్వాళ నాట్యమాడే దెవరో చెప్పుకో" మన్నది.

ఇంతింత కళ్లుచేసుకొని గ్రిగొరీవంక చూస్తూ నిలబడింది. ఏదో విచిత్రం జరగబోతుంది. చూద్దామన్నట్టు లా గదిలోనివారంతా ఊపిరిబిగబట్టి నర్సువంక చూశారు.

"లెఫ్టినెంటు గ్వాజెవ్ గ్రిగొరీ ! నాట్య మాడవలసినది. నేడు నీవంతు.... ఊఁ మొదలుపెట్టమ"న్నది నర్సు.

గ్వాజెవ్ అకస్మాత్తుగా ఆమెకేసి తిరిగాడు. కట్టుబట్టల సందునుండి అతని రెండుకళ్ళూ తళుక్కున మెరిశాయి.... వెంటనే తన ఆదుర్దాని అణచిపెట్టుకొని, గద్గద కంఠంతో ఈ విధంగా అన్నాడు :

"ఏదో పొరపాటు జరిగివుండాలి. ఇంకొక గదిలో మరొకాయన. గ్వాడ్జెల్ అనేవా డుంటాడు ఆ వుత్తరాలు నావి కావు," కాని అతని కండ్లు క్లావ్డియా చేతి జాబులను తదేకదృష్టితో పరిశీలిస్తూనే వున్నాయి.

"పొరపాటుకాదు చూడు ! లెఫ్టినెంటు, జి. ఎం. గ్వాజెవ్ !.... ఇంతే కాదు, నలభై రెండో గది అని కూడా వున్నది.... సరా ?" అన్నది నర్సు.

దుప్పటిక్రింద నుండి కట్టుకట్టిన చేతిని జాపి, ఆ జాబుల నందుకొన్నాడు గ్రిగొరీ. పండ్లతో పట్టుకొని వాటిని చింపేటప్పు డాతనిచేయి వణికింది. తన కండ్లను తానే నమ్మలేకపోయాడు ! ఒకే వైద్యకళాశాలలో. ఒకే క్లాసులో చదివే ముగ్గురు బాలికలు, మూడు విడివిడి పుత్తరాలు వ్రాశారు. దస్తూరీలో భేదమున్నప్పటికీ, వారందరూ దాదాపు ఒకే విషయాలను, ప్రేమ ఉట్టిపడేట్టు తనకు వ్రాశారు !! టాంకు దళాధికారి, వీరగ్రిగొరీ ఆస్పత్రిలో నున్నాడని వారికి తెలిసింది. ఆతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు సలుపడానికి వా రెంతో ఆసక్తితో వున్నారు. ఈ తమ చర్యను పెడర్థం చేసుకోవద్దనీ, తన క్షేమసమాచారముల నన్నిటినీ తమకు తెలుపమనీ ప్రార్థిస్తున్నారు. వారిలో ఒక బాలిక, అన్యూతా, అతనికి తన శక్తివంచనలేకుండా వీలయినంత సహాయం చేస్తాననీ, చదువుకో డానికి పుస్తకాలు కావాలా ? లేక వేరేదన్నా కావాలా ? అనీ వ్రాసింది. పరాయి మనిషిగా తలంపవద్దనీ, తన కేది కావలసినా తనకు వ్రాయమనీ మరీమరీ ప్రార్థిస్తున్నానన్నది !!

ఆ రోజంతా ఆ జాబులను చదువుతూ, వాటివంక చూస్తూ వాటిమీద చిరునామాలను మనఃపాఠం చేసుకొంటూ గడిపాడు. ఇటువంటి వుత్తర ప్రత్యుత్త రాలు అనేకమంది వ్రాసుకొంటారనే విషయం గ్రిగరీకి తెలియనిదికాదు. పూర్వ మొకప్పు డీతని కెవరో ఒక జత ఉన్ని మేజోళ్ళను ఎక్కడినుండో పంపించారు. వాటిలో నొక స్త్రీ చిరునామా కనిపించింది. గ్రిగొరీ ఎంతో సంతోషపడి కొంత కాల మా స్త్రీతో ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాసుకొంటూ కాలం గడిపాడు. ఒకరోజు జా

స్త్రీ తన ఫొటోను పంపించింది. ఆమెకు నలభై ఏండ్లు పైనుంటాయి. నలుగురు పిల్లలున్నారు. అతని కుర్రతనపు ఆవేశాన్నీ, పొరపనూ ఎగతాళిచేస్తూ వ్రాసిందామె. అటుమీదట ఉత్తరాలు వ్రాయటం గ్రిగోరీ మానుకొన్నాడు ... కాని, ఈ మూడుజాబులూ అతని మనస్సు నెంలో కలవరపరిచాయి. తలవని తలంపుగా రావటమూ, ముగ్గురి వుత్తరాలూ ఒకేరోజున రావటమూ గ్రిగోరీకి చాలా ఆశ్చర్యం కలిగించింది. వారికి తన సంగతి ఎట్లా తెలిసింది ? ఇదే ప్రశ్నను గదిలోనివా రందరూ అడిగారు. కమిసార్ యీ ప్రశ్న నడిగేటప్పుడు నర్సు క్లావియావంక తమాషాగా చూసి, రవ్వంత చిరునవ్వు నవ్వాడా ? లేక అదంతా కేవలం తన భ్రాంతా ? ఇది అలెక్సీకి తెలిసింది కాదు. కమిసారు కీ వుత్తరాలతో ఏదో దురూహ్యమైన సంబంధమున్నదా ?

ఎవరు వ్రాశారో, ఎవరు వ్రాయలేదో, అది దేవుడికే తెలియాలి. మరునాడు ప్రొద్దున్నే, గ్రిగోరీ తనకు కాగితాలనూ, కలమునూ ఈయమని కమిసారు నడిగాడు. ఆ రోజంతా ఉత్తరాలు వ్రాయటమూ, వ్రాసిన వాక్యాలు కొట్టివేయటమూ, ఎన్నో వుత్తరాలను చింపివేయటమూ ఇదేపని. సాయంత్రానికి మూడు జాబులు తయారుచేశాడు గ్వాజ్దెవ్.

కొద్దిరోజులలో వారిలో ఇద్దరు అమ్మాయిలు వ్రాయటం చాలించుకొన్నారు. అన్యూతా మాత్రం ముగ్గురి బదులూ వ్రాసింది. ఆమె వ్రాసిన విషయాలన్నిటినీ, గ్వాజ్దెవ్ తన మిత్రులందరికీ చదివి వినిపించాడు. వైద్యకళాశాల మూడో సంవత్సరపు చదువునుగురించి ఎన్నెన్నో విషయాలు వారందరికీ తెలిశాయి. జీవశాస్త్రం చాలా బాగుంటుంది. జీవరసాయనిక శాస్త్రమంత కష్ట మింకొకటి లేదు. ఫలానా ఆచార్యుడు బహుచక్కగా బోధిస్తాడు. కాని ఇంకొకాయన పాఠాలంటే అందరికీ పెద్ద తలనొప్పి. గత ఆదివారం విద్యార్థులందరూచేరి పెట్లునరికి నాలుగు లారీల నిండా కట్టెలు నింపారు. యుద్ధభూమికి దాపుననున్న ఆస్పత్రిలో పనిచేస్తూ, తమ చదువును సాగించటం చాల కష్టమైనపని. ఫలానా అమ్మాయికి తగనిగర్వం. తనంతటి అందగత్తెలే దనుకొంటుంది. దానిని చూస్తే ఎవ్వరికీ సరిపడదు. అసలది, చదువు సంధ్యల నణుమాత్రంకూడా గమనించదు.

గ్వాజ్దెవ్ రోజు రోజుకు మారిపోతున్నాడు. పుష్పం వికసించినట్టు లాతని వ్యక్తిత్వం వికసించింది.

కుకుష్కిన్ తనకు కట్టిన కొయ్యచెక్కలను తీయించివేశాడు. దేనినీ పట్టుకోకుండా ఇవానోవిక్ గదంతా తిరగటం మొదలుపెట్టాడు. కిటికీచెంత నిలబడి, "లోకాన్ని చూస్తాడు." కమీసారూ, అలెక్సీమాత్రం దినదినమూ క్షీణించిపోజొచ్చాడు. కమిసారు తన ప్రాతఃకాలపు కసరత్తును చేయలేకపోయాడు. అతని శరీరం పసుపుపచ్చగా ఊదిపోయింది. చర్మం పలచగా గాజుపొరమాదిరి,

కనిపించింది. చేతులను మడవటమే కష్టమయింది. పెంచానుగానీ, పెన్సిలునుగానీ పట్టుకొనే శక్తి పోయింది.

ప్రతిదినమూ ప్రొద్దుటపూట ఒక పరిచారిక స్త్రీ, కమిసారు శరీరాన్ని తువాలుతో తుడిచి, ఆహారం తినిపించేది. తా నింతగా అశక్తుడయిపోవటం కమిసారు మనస్సును కలచివేసింది. కాని తన మనోభావాన్ని ఇతరులకు చూపించకుండా వుండటానికి కాబోలు ప్రతిదినమూ వార్తాపత్రికలు చదివి, వ్యాఖ్యానం చేసేవాడు. జర్మనుభాషను నేర్చుకొనేవాడు. కాని చదివే పుస్తకమును చేత్తోపట్టుకోడానికి శక్తి చాలిందికాదు. ఇవానొవిక్ కొన్ని ఇనుపతీగలతో ఒక చట్రమును తయారుచేశాడు. కమిసార్ పడుకొని, ఆ చట్రాన్ని తన వక్షంమీద పెట్టుకొంటే, ఇవానొవిక్ దానిపైన పుస్తకమునుంచి ప్రక్కనే నిలబడతాడు. పుటలు త్రిప్పి, కమిసారు చదువుకోడానికి సహాయం చేస్తాడు. నర్సు గదిలోకి రాగానే రేడియోవార్త లేమిటని అడిగి తెలుసుకొనేవాడు. తరువాత వాసిలెవిక్ అనుమతిమీద కమిసారు తలచెంత నొక రేడియోను ఏర్పాటుచేశారు.

ఒంట్లో బలం క్షీణించే కొద్దీ మానసికంగా బహుపట్టుదలతో పనులు చేయటం ప్రారంభించాడు కమిసారు. తనకు వచ్చే వుత్తరా లన్నిటికీ, కుకుష్కిన్ చేతా, గ్రిగోరీచేతా బదులుజాబులు వ్రాయించేవాడు. కొంచెంగా కునుకుపట్టి అలెక్సీ పడుకొన్నాడు, ఒకదినం. బిగ్గరగా మాట్లాడే కమిసారు కంఠం వినబడి, అదిరిపడి లేచాడు.

కమిసారు పుస్తక చట్రంమీద నొక వార్తాపత్రిక వున్నది. "దీని నెవరుగానీ ఇచ్చటినుండి తీసుకుపోరాదని" దానిమీద పెద్ద అక్షరాలు కనిపించాయి. కాని, కమిసారుకు దాని నెవరో తెచ్చి ఇచ్చారు.

"ఈ మనుష్యులకు మతిపోయిందనుకొంటాను. యుద్ధ ప్రభావం కాబోలు! క్రివ్‌స్టాల్ పనికిమాలినవాడూ, నియంతానట! రష్యన్ సైన్యంలో ఇతనికి మించిన జంతువైద్యు డింకొకడు లేడు. నియంత!! కుకుష్కిన్! ఏదీ, ఈ ఉత్తరం వ్రాయ"మని కమిసారు గర్జిస్తున్నాడు. ఉత్తరం వ్రాసి పంపించాక, ఎంతోసేపు, "చవట వెధవలు! తెలివి తక్కువ సన్యాసులం"టూ తిట్టిపోశాడు. దిండుపైనున్న తలను ఇటుప్రక్కనుండి అటుప్రక్కకయినా త్రిప్పేటంత శక్తిలేని ఈ మనిషి, ఇంత రౌద్రంగా యుద్ధ విషయాలను చర్చించటమూ, అంత బాధ్యతా తనదేనన్నట్టు వర్తించటమూ అలెక్సీ కెంతో ఆశ్చర్యం కలిగించాయి.

నాటి సాయంకాలం మరో చిత్రం జరిగింది. స్టిపాన్ ఇవానొవిక్ అలవాటు చొప్పున కిటికీచెంత కూర్చుని చూస్తున్నాడు. అంత దూరాన కనిపించే నది మంచు పేరుకుపోయింది. ఆ మంచులో ఒకచోట పెద్ద రంధ్రమూ, దానిచెంత కొందరు స్త్రీలూ వున్నారు, వారు తమచేతుల్లోనున్న గునపాలతో మంచులోనున్న ఆరంధ్రపు అంచులమీద పొడిచి, పగిలిన మంచును, కడవరాళ్ళమాదిరి విరుగగొట్టుతున్నారు.

ఈ పెద్ద మంచుగడ్డరాళ్ళను ఏటవాలుగా అనించిన కొయ్యలమీద పట్టిలాగి ఒక చోట చేరుస్తున్నారు. మంచుగడ్డను ఎక్కించుకొని తీసుకువెళ్ళడానికి ఒక స్లెడ్జిబండి వచ్చింది.

దానిని తోలుకువచ్చిన ముసలివాడు, గుర్రాలను విప్పి నిలబడివున్నాడొక ప్రక్కగా. ఇవానోవిక్ ఇదంతా చూస్తూ కూర్చొనగా, అతని కనేక ఆలోచనలు కలిగాయి. ఖోల్‌ఖోజ్‌లతోచేరి పనిచేసిన ఇతను ఈ పనిచేసే వారందరినీ ఏ విధంగా ఏర్పాటుచేస్తే బాగుంటుందో, దానివల్ల ఎంతత్వరగా పనిసాగుతుందో అనే విషయాలను గురించి ఆలోచించ సాగాడు. మొత్తంమీద కావలసినవారి కంటే ఎక్కువ స్త్రీలున్నారు కాబట్టి ఒకరి కొకరు అడ్డం తగులుతున్నారు. వారందరినీ మూడు భాగాలుగా విభజించి, ఒక్కొక భాగం మనుష్యులకూ ఒక్కొక్కపని చెప్పిన నియమిస్తే మంచిది. ఏ జట్టువారు ఎంత ఎక్కువ మంచు తీస్తే వారికంత ఎక్కువకూలి యీయడానికి ఏర్పాటుచేస్తే, పని భలే పోటా పోటీగా సాగుతుంది. వారందరిలో బహుచలాకిగా పనిచేసే వొక అమ్మాయి అతని దృష్టి నాకర్షించింది. వారందరికీ ఆ అమ్మాయిని పెద్దగా నియమించాడు ఇవానొవిక్. ఆమె వారందరికి సమిష్టి కృషిని బోధించగలదు... ఆ అమ్మాయి తెలివితేటలుగలదానిమాదిరి కనిపిస్తోంది....

ఈ ఆలోచనలలో నిమగ్నుడైన ఇవానొవిక్ స్లెడ్జికి కట్టిన గుర్రాలలో వొకటి ఆ మంచురంధ్రంలో పడిపోవటం చూడలేదు. స్లెడ్జిబండి తాత భయపడి దానిని పట్టి వెలుపలికి లాగట మాతని కంటబడింది. యత్నించేకొద్దీ గుర్రం, కాళ్ళు జారి పైకి రాలేక బహు తికమకలుపడుతోంది. స్లెడ్జియొక్క బరువు కది పూర్తిగా నీటిలో పడిపోవు టందికాదు. కాని అడుగున ప్రవహించే నీటివేగమునా గుర్రం తట్టుకోలేకున్నది. స్లెడ్జితాత స్లెడ్జినిపట్టీ, గుర్రపు కళ్ళెమునుపట్టీ లాగుతూ గాబరా పడిపోతున్నాడు. "అయ్యో గుర్రం మునిగిపోతుంద"ని ఇవానోవిక్ ఒక్క కేకపెట్టాడు.

కమిసార్ మాటలు విని, అమాంతంగా లేచి కిటికీ దగ్గిరికి వచ్చాడు. అతని ముఖమంతా పాలిపోయి చెమటలు కారింది. ఒక్క నిమిషంలో పరిస్థితి అర్థమయింది.

"మూర్ఖుడు! గుర్రాన్ని పట్టిలాగితే అదెన్నటికీ బయటపడదు. స్లెడ్జికి బిగించినదాని జీనుపట్టాలను కోస్తే చాలు, తనంతట తానే బైటపడుతుంద"న్నాడు.

ఇవానోవిక్ కిటికీపైకెక్కి నిలబడ్డాడు. గుర్రం మరి నీటిలోకి దించుకు పోతోంది. నీరు దాదాపు కంఠంలోతుకు వచ్చింది. "గుర్రం చనిపోతుంది.... పట్టాలు నరకమను... ముసలివాడితో పట్టాలు నరకమ"ని కమిసార్ తొందర పెట్టాడు.

రెండు చేతులూ జోడించి నోటి కిరుప్రక్కలా పెట్టి. ఇవానోవిక్, "ఏయ్ ! ముసలాడా ! జీనుపట్టాలు కోసేయి....నీ నడుముపట్టీలో గొడ్డలున్నది. పట్టాలు నరికితే గుర్రం బయటపడుతుంద"ని బిగ్గరగా అరిచాడు. ఎక్కడనుండి వినబడ్డదీ తెలియక ఆకాశవాణి కాబోలుననుకొని, తాత గుర్రం పట్టాలను తన గొడ్డలితో నరికాడు. ఒకటి రెండు పర్యాయములు కాళ్లు జారాయి. మూడో యత్నం ఫలించి గుర్రం బయటపడింది. ఆ గుంత కంతదూరంగా వెళ్లి నిలబడి, కుక్కమాదిరి ఒళ్లు దులుపుకొన్నది.

"ఏమిటీ గల్లంతు ? మిమ్మిద్దరినీ మంచంమీదినుండి లేవమని ఎవరు చెప్పారు ?" అనేమాటలు వినిపించాయి. వాసిలెవిక్ గది గుమ్మంలో నిలబడి వారివంక రౌద్రంగా చూస్తున్నాడు. ఇవానోవిక్ ఏదో చెప్పబోతే అడ్డువచ్చి, "ఆస్పత్రి చట్టాల నతిక్రమించేవారి కిక్కడ స్థలంలేదు. పనిచేసేవాళ్ళు. నర్సు, అందరూ చచ్చిపోయారా ? .... ఎక్కడికి వెళ్ళారు ?" అంటూ ఆయన చకచకా వెళ్లిపోయాడు. మారుమాటాడకుండా కమిసారూ, ఇవానోవిక్ లిద్దరూ వచ్చి తమ మంచాలమీద భయపడిపోయిన చిన్నపిల్లలలాగా పడుకొన్నారు.... కొంతసేపటికి నర్సు క్లావ్డియా వచ్చింది. కండ్లు ఎర్రబారివున్నాయి. ముక్కుచివర కందిపోయింది. తెగ ఎగబీలుస్తూ, ప్రొఫెసర్ తనమీద చాలా కోపం చేసుకొన్నాడని చెప్పింది. కమిసారు ముఖం కాగితంలాగా తెలుపెక్కిపోయింది. కండ్లు మూతలుపడ్డాయి. కదలక మెదలక శవంమాదిరి పడుకొనట మామె చూసి భయపడింది.

ఆనాటి సాయంత్రం కమిసారు స్థితి చాలా ఆదుర్దా కలిగించింది. కర్పూరం మందును రక్తంలోనికి ఎక్కించి, ప్రాణవాయువును పీల్చడాని కిచ్చారు. చాలా కాలం అదేమాదిరి పడుకొన్నాడు. కండ్లు తెరిచిచూస్తే ప్రాణవాయువు తిత్తిని చేతబట్టుకొని ఆదుర్దాగా నిలబడిన క్లావ్డియా కనిపించింది.

చిరునవ్వు నవ్వి "నర్సూ.... నీ వేమాత్రమూ దిగులుపడవద్దు. నరకానికి వెళ్ళినాకూడా ముఖంమచ్చలు పోవటానికి అచ్చటి రాక్షసులు ప్రయోగించే మందు నడిగి, ఇంత తెచ్చి నీకు ఇచ్చి మరీపోతాను. భయపడవద్ద"న్నాడు కమిసార్.

లోలోపలే అతని శక్తినంతా తినివేస్తూవున్న వ్యాధినుండి తప్పించుకోలేక పోయినా, ఎక్కడలేని శక్తినీ తెచ్చుకొని నలుగురితో హాస్యాలాడే కమిసారును చూస్తే అలెక్సీ కెంతో జాలివేసింది.

# 8

అలెక్సీ స్థితి ఏమాత్రం కూడా బాగాలేదు. అణుమాత్రంకూడా కోలుకోలేక పోయాడు. "వాతావరణాలయపు టమ్మాయికి" తన కష్టాలన్నిటినీ పూసగ్రుచ్చినట్టు వ్రాసాడు. ఇచ్చటినుండి ప్రాణాలతో బయటపడతాననే ఆశ తనకేమాత్రమూ లేదట. రెక్కలు విరిగిన పక్షీ, కాళ్లులేని వైమానికుడూ ఒక్కటే నంటాడు. ఏదో పొట్ట నింపుకొంటూ బ్రతకవచ్చేగాని, ఎగరటమనేది కలలోని మాట. రెక్కలులేని పక్షిమాదిరి బ్రతకటంకంటే చనిపోవడం మేలు. కాని ఆ క్షణం ఎప్పుడువస్తుందో తనకే తెలియదు. త్వరగా రారాదా? ఆమె పేరయినా ఎరుగని ఆ అమ్మాయి కీ విధంగా వ్రాయటం అతనికే ఆశ్చర్యం వేసింది. తన కిట్టి కష్టాలు వచ్చాయని వినగానే, ఆమె చాలాకాలంగా తా నతన్ని ప్రేమించుతున్నానని వ్రాసింది. నలుగురి మాదిరీ అలెక్సీకూడా బాగుంటే, తా నీ విషయం అతనికి చెప్పకుండానే వుండేదట. తనకంత ధైర్యం చాలదని వ్రాసింది.

"ఆడవాళ్ళ కుతంత్రాలు నీకు తెలియవు. సైనికుల కీరోజుల్లో గొప్పపలుకుబడి వున్నదని దానికి తెలుసు. కాళ్లు లేకపోతే పోనీ .... తరువాత జన్మాంతరం వరకూ గొప్ప పింఛనీవస్తుందని, దాని ఆశ"అన్నాడు, రాతిగుండె కుకుష్కిన్.

విమానాశ్రయంలో తనవెంత బాంబు పడింది. తన కెట్టి అపాయం కలుగుతుందోనని తనపై వ్రాలి, కాపాడిం దా అమ్మాయి. ఆమె ముఖ మప్పు డెంతో పాలిపోయి, కత్తితో కోసినా వొక్క నెత్తురుచుక్కయినా కారదన్న ట్లాతవి కనిపించింది. ఆ విషయాలను అలెక్సీ మరిచిపోజాలడుగా? ఇదంతా సణుగుడుగాడు, కుకుష్కిన్ కేమితెలుసు?

ప్రతి వొక్కని హృదయద్వారం తెరవటానికి తాళంచెవులున్నాయని పేరు పొందిన కమిసారు, అలెక్సీ విషయంలో నెగ్గలేకపోయాడు. ఒకరోజు నలభై రెండోనంబరు గదిలోని తెవరో ఒస్త్రోవ్‌స్కీ రచించిన "కాకలుతీరిన యోధుడ"నే పుస్తకమును తెచ్చారు. ఆ పుస్తకమును గట్టిగా, ఆగదిలోనివారు వంతులువేసుకుని చదివారు. తన కొరకే ఆ విధంగా చదువుతున్నారనే సంగతి అలెక్సీకి తెలుసు, కాని తనకాపుస్తకం ఏమాత్రంకూడా నచ్చిందికాదు పవెల్‌కొర్చాగిన్ అంటే అలెక్సీకి తన చిన్నతనంనుండే చాలా అభిమానం. కాని కొర్చాగిన్ వైమానికుడు కాడు. "గాలికొరకు ఆయాసపడటమంటే" అతని కేమితెలుసు? ఒస్త్రోవ్‌స్కీ పుస్తకం వ్రాసిన రోజులలో, యుద్ధం జరగటంలేదు. మొగవాళ్ళూ, స్త్రీలూ, యుద్ధభూముల్లో ప్రాణా లర్పించలేదు. ఎత్తుచాలని చప్పిడిముక్కు బాలబాలురు, కొయ్యపెట్టెలమీద నిలబడి యంత్రాగారములలో బాంబులు తయారుచేసిన కాలం

కొదది. అందరూ అన్నివిధాలపనులు చేస్తోంటే, తా నొక్కపనీ చేయ శక్తిలేక దిగాలుపడి తనమాదిరి ఆస్పత్రి మంచంలో పడుకొనిన మనిషి వ్రాసిన పుస్తకం కాదీ గ్రంథం. అట్టి పుస్తకం తన కిచ్చే సలహాలనేవే వుండజాల వనుకొన్నాడు అలెక్సీ. కమిసారు తాను ఓడిపోయానని గ్రహించాడు. కాని అంతటితో కార్యం పరిసమించుకోలేదు. అలెక్సీతో ఏదో మాటలసందున కుంటివా డొకాయన చాలా పెద్దవుద్యోగం చేశాడని చెప్పాడు. ఈ మాట వినగానే, ఇవానోవిక్ తమ గ్రామంలో ఒక చేయిపోయిన డాక్టరున్నాడనీ, ఆత డెంతో తెలివైనవాడనీ, మంచి నేర్పరిఅనీ చెప్పాడు. ఆ డాక్టరుకు వేటాడటమంటే ఎంతోసరదా. ఉన్న ఆఒక్క చేత్తో వేటకువెళ్ళి ఎన్నిపక్షులనో కాల్చితెచ్చేవాడు. చెట్టుకొమ్మపైనున్న ఉడత కంటికి గురిచూసి, టఫీలున కొట్టేవాడు. ప్రొఫెసర్ విలియంసునుగురించి కమిసారు కొన్ని విషయాలుచెప్పాడు. అతని చేతులలో ఒకదానిని నరికివేశారు. ఉన్న ఒక్కచేత్తో ఆతడు వ్యవసాయ సంబంధమైన పరిశోధన లెన్నోచేసి గొప్ప ప్రఖ్యాతిజెందాడు. వ్యవసాయ కళాశాలాధికారిగా వుండేవాడు.

ఇట్టి దృష్టాంతా లెన్ని విన్నప్పటికీ అలెక్సీ మనస్సు మారిందికాదు. కాళ్లు లేకపోయినా. మనిషి ఆలోచించగలడు. మాట్లాడగలడు. వ్రాయగలడు. ఇతరుల నిదిచేయమనీ అదిచేయమనీ చెప్పి చేయించవచ్చు. జబ్బులు కుదర్చడానికి వీలుంటుంది. వేటాడనూవచ్చు. కాని తనసంగతివేరు. పుట్టుకతోనే తానువైమానికు డుగా పుట్టాడనటం అతిశయోక్తి కాదు. తన చిన్నతనంలో ఒకదినం పుచ్చకాయల తోటలో కావలా కాస్తూవున్నాడు. ఎండి, బీట్లుపడిన నేలమీద ప్రాకే ఆ పుచ్చతీగ లకు బ్రహ్మాండమైన కాయలు, చారల చారలకాయ లనేకం పెరిగాయి. వాల్గా లోయలో యింత పేరుపొందిన పుచ్చకాయ లింకొకచోట పెరుగవు. అప్పు డాకా శంలో, మేఘమండలాన్ని చీల్చుకుంటూ, వెండితుమ్మెద వొకటి తూర్పుగా ఎగిరి వెళ్ళింది. దానిని చూసి ముగ్ధుడైపోయి, అలెక్సీ ఎంతోసేపు నిలబడ్డాడు.

ఆ రోజునుండే అలెక్సీ గాలిమండలానికి వశుడైపోయాడు. బడిలో పాటాలు చదివేటప్పుడూ, పిదప ఏదోఒక యంత్రాగారంలో పనిచేర్చుకొనే టప్పుడూ కూడా తానొక వైమానికుడను కావాలని గాలిమేడలు కట్టుకొనేవాడు. రాత్రిపూట అందరూ నిద్రపోయేటప్పుడు, తాను లాపిడెవ్స్కీతోవెళ్లి చెల్యుస్కిన్ పర్వతాల్లో దారి తప్పిపోయినవారిని రక్షించినట్టూ, వొడొప్యానవ్‌తో ఎగిరివెళ్లి ఉత్తరధృవపు గట్టి మంచుగడ్డమీద దిగినట్టూ, చకలావ్‌తో వెళ్ళి అమెరిక సంయుక్త రాష్ట్రాలకు ఉత్తరధృవంమీదుగా కొత్తమార్గం కనిపెట్టినట్టూ ఊహించ కొని, ఉవ్విళ్లూరాడు.

కమ్యూనిస్టు యువజన సంఘంవా రాతన్ని ఆమూర్‌నదీ ప్రాంతానికి ఇతర ంతో పంపించారు. కామ్సొమెలస్కో అనే గ్రామము నా ప్రదేశంలో యీ యువ కులు నిర్మించారు. తనమాదిరే విమానం పిచ్చిగల పదిమందిని చేరదీసి, అక్క డొ

చిన్న విమానాశ్రయమును నిర్మించాడు. చీకటి పడీపడటంతో పొగమంచు ఆ ప్రదేశంపై కమ్ముకొనేది. తయారవుతూన్న ఊరిలోని ఇండ్లగుపించనంత దట్టంగా మంచుపడేది. పగలంతా పనిచేసి అలిసిపోయిన యువకులనేకులు తమ తమ చిన్న గుడిసెలలో దూరి, చలిమంటలు వేసుకొనేవారు. ఇండ్లవెలుపలకు వచ్చి కర్రల మంటచేసి, ఆ పొగకు దోమలురాకుండా చేసుకొనేవారు. తరువాత వారందరూ ఎవరిమానాన వారు నిద్రపోతూంటే, అలెక్సీ, అతని స్నేహితులూ ఒంటి నిండా కిరసనాయిలు పూసుకొని బయలుదేరేవారు. కిరసనాయిలు వాసనకు దోమలు దగ్గరికి రావు. గొడ్డళ్లు, గునపాలు, కత్తులు, పారలు పట్టుకొనివెళ్ళి, చెట్లు పడగొట్టి, నేలను త్రవ్వి, సాఫీచేసి, తుపాకిమందుపెట్టి పెద్దవృక్షాలు కాల్చి పడగొట్టి విమానాశ్రయమును కొద్దిరోజుల్లో నిర్మించారు.

విమాన తరిఫీదును పొందే ఆరోజుల్లో వొకనాడు. ఈ విమానాశ్రయం నుండే, అలెక్సీ మొట్టమొదటిసారిగా పైకెగిరి వెళ్ళాడు. తన చిన్నతనపు కలలన్నీ ఫలించడానికిది మొదటిమెట్టు గదాయని అతడెంతో వుప్పొంగిపోయాడు.

తరువాత ఒక సైనికవిమాన కళాశాలలో చేరి ఎగరటం క్షుణ్ణంగా నేర్చుకొన్నాడు. ఇంతేకాదు, ఇతరులకు నేర్పడానికితని నొక గురువుగా నియమించారు. ఇంతలోనే యుద్ధంవచ్చింది. ఎందరు వద్దన్నా, వారిమాటలు వినిపించుకొనక, తన ఉద్యోగానికి రాజీనామానిచ్చి యుద్ధంలో చేరాడు. అప్పటి నుండీ అలెక్సీ బ్రతుకంతా మేఘమండలంలోనే గడించింది ...

తనతోవిలియంను గురించి కమిసారూ, ఇవానోవిచ్కులు చెబుతోంటే అతనికి చీకాకువేసింది. "విలియం వైమానికుడు కాద"ని చెప్పి అలెక్సీ తన మంచంమీద పెడముఖంపెట్టి పడుకొన్నాడు.

ఇంతమాత్రానికే అధైర్యపడేమనిషి కాదు, కమిసార్. మరొక దినం కమిసార్ ఒక వారపత్రికను చేతికందిస్తూ, అలెక్సీతో, "అలెక్సీ దీనిని చదువు నిన్ను గురించే ఇందులోనున్నద"న్నాడు,

ఇవానోవిక్ ఆ పత్రికను అలెక్సీకి తెచ్చిఇచ్చాడు. అందొక వ్యాసము నెవరో పెన్సిలుతో ప్రత్యేకించి గుర్తించారు. తన పేరందులో వుంటుందనుకొని అలెక్సీ దానిని పూర్తిగా చదివాడు. కాని అది కనిపించిందికాదు. ఐరోపా మొదటి సంగ్రామంలో పోరాడిన వొక వైమానికుని పటం అలెక్సీకి కనిపించింది. ఇరవై అయిదేళ్లూ, పొట్టి మీసాలూ, వైమానిక టోపీ, దుస్తులూ; ఆ మనిషి పటం ముచ్చటగా నున్నదనిపించింది, అలెక్సీకి........

"చదువు, పూర్తిగా చదువు, అది నీకొరకే వ్రాయబడిన విషయం" అన్నాడు కమిసార్.

అలెక్సీ చదివాడు. అదొక రష్యన్ వైమానికుని గురించి వ్రాయబడింది. అతనిపేరు కర్పోవిక్, ఐరోపా మొదటి యుద్ధంలో కర్పోవిక్ విమానముకు

జర్మను విమానంనుండి కాల్చిన మరఫిరంగి గుండొకటి తగిలి అతనిదొకపాదం తుత్తునియలయింది. ఆ కాలితోనే విమానమును నడిపించి వచ్చి తన విమానాశ్రయంలో వ్రాలాడు. ఆ పాదాన్ని ఛేదించారు. కాని కర్పొవిక్ విమానదళమును విడిచివెళ్ళడానికి సమ్మతించలేదు. కృత్రిమ పాదము నొకటి చేయించుకొని, దానితో అనేకదినములు తరిఫీదునొంది తిరిగి తన దళంలోచేరాడు. వైమానిక కళాశాలలో ఆచార్యుడుగా నియమింపబడి, అప్పుడప్పుడు తన కృత్రిమ పాదముతోనే విమానంలో ఎగిరివెళ్లాడు. అతనికి సెంట్ జార్జి శిలువను బహూకరించి ఎంతో గౌరవించారు. చాలా కాలం రష్యను వైమానిక దళంలో పనిచేసి ఆఖరికి విమానం పడిపోవటంవల్ల మృతినొందాడు.

ఒకటి. రెండు. మూడు పర్యాయములు అలెక్సీ ఆ వ్యాసమును చదివాడు. రెప్పవాల్చకుండా ఆ వైమానికుని చిత్రంవంక చూసాడు. ఆ ముఖంలో పట్టుదలా, ధైర్యమూ అతనికి గోచరించాయి. తన జుత్తులో వ్రేళ్లు చొప్పించి దానిని పూర్తిగా కలచివేస్తూ ఎంతసేపో అలెక్సీ ఆ పత్రికను చూస్తూ పడుకొన్నాడు. గదిలోని వారందరూ అతని చేష్టలన్నిటినీ, మాట్లాడకుండా గమనించారు. తన తలగడదిండు క్రిందనుండి పెన్సిలొకదానిని తీసి, ఆ వ్యాసంచుట్టూ దానితో నల్లగా గీసాడు.

"చదివావా ?" అని కమిసారు అలెక్సీ నడిగాడు. బదులు చెప్పలా, ఆ పత్రిక వంక చూస్తూ పడుకొన్నాడాతడు,

"చదివావుగా....? ఏమిటి నీ వుద్దేం ?" అని తిరిగీ కమిసారు అడిగాడు.

"ఒక్క-పాదం మాత్రం పోయింది" అన్నాడు, అలెక్సీ.

"అయితేనేమి ? నీవు సోవియట్ వైమానికుడి వన్నసంగతి మరిచి పోయావా ?"

"అతడు ఫార్మన్ విమానము నుపయోగించాడు. అదీ వొక విమానమేనా ? దానిని నడపటం చాలా సులభమైనపని"

"కాని....నీవు సోవియట్ వైమానికుడివి" అని తన మాటమీదే కమిసార్ నిలఖడ్డాడు,

"సోవియట్ వైమానికుడు" అని, అలెక్సీ అపత్రికను చూస్తూ పడుకొన్నాడు. ఉన్నట్టు లుండి ఆతని ముఖం విప్పారింది. దానిలో యేదోవొక తేజస్సు కనిపించింది. ఆ గదిలోనివారి నందరినీ కలయజూసాడు. ముందెన్నడూ వారిని చూడనట్టు.

ఆ రాత్రి పడుకోబొయ్యేముందు ఆ పత్రికను తలగడదిండుక్రింద పెట్టుకొని, మరీ నిద్రపోయాడు. చిన్నతనంలో ఆతని తల్లి ఏవో పాతబట్టలతో ఒక ఎలుగ్గుబంటి బొమ్మ నొకటి కుట్టి అలెక్సీ కిచ్చింది. నిద్రపోయేముందు, ఎవరికీ

తెలియకుండా అ బొమ్మను తన తలగడక్రింద ఇదేమాదిరి దాచేసేవాడు. ఈ సంగతి జ్ఞప్తికివచ్చి, ఆ గదంతా మార్మ్రోగేటట్టు బిగ్గరగా నవ్వాడు.

ఆ రాత్రి అలెక్సీకి నిద్ర పట్టిందికాదు. గదంతా నిశ్శబ్దం. గ్రిగోరీ తన మంచంమీద పొరలినప్పుడల్లా అది కిర్రుకిర్రుమని శబ్దం చేసింది. కమిసారు పండ్లు కొరికాడు నిద్రలో. ఎన్నో పర్యాయములు పలవరించాడు. ఇవేవీ అలెక్సీకి తెలియవు. పలుమారు దిండుక్రింద పత్రికను తీసి ఆ మనిషి పటంవంక చూసాడు. ఆతని చిరునవ్వు ముఖం అలెక్సీ నెంతో ఆకర్షించింది. దానివంక చూస్తూ "చాలా కష్టమైన పని. కాని దానిని నీవు సాధించావు. నా విషయం వేరు. ఇది పదిరెట్లెక్కువ కష్టం. కాని, ఫరవాలేదు. నేనూ సాధిస్తాను. చూస్తూవుండ"మని అన్నాడు.

నడిరాత్రి అయింది, తన చెంతనే పడుకొని కమిసార్ కదలక మెదలక పడుకొనటం అలెక్సీకి ఆశ్చర్యం వేసింది. అతని ముఖమంతా పాలిపోయింది. ఊపిరిపీలుస్తూన్నట్లు, కనిపించిందికాదు, వెంటనే అలెక్సీ తన మంచం ప్రక్కనున్న గంటను గణగణ మ్రోగించాడు, నర్సు క్లావ్దియా పరుగెత్తుకొని వచ్చింది. నిద్రకండ్లూ, వ్రేలాడే రెండు జడలూ. ఈమాదిరామెను చూడటమిదే అలెక్సీకి మొదటిసారి. ఆమెకేదీతోచక ఆస్పత్రి డాక్టరును పిలుచుకువచ్చింది. కమిసారు నాడిని పరీక్షించి కర్పూరం సూదిమందునిచ్చాడు. ప్రాణవాయువును పీల్చడానికి ఏర్పాటుచేసి, డాక్టరూ, నర్సూ ఇద్దరూ అతని చెంత నిలబడి ఒక గంటకాలం నానాతిప్పలూ పడ్డారు. తరువాత కమిసారు మనుష్యులలోపడి కండ్లు తెరిచాడు; నర్సునుచూసి చిరునవ్వు నవ్వుతూ :

"మీకందరికీ ఇంతకష్టం కలిగించినందుకు నన్ను క్షమించాలి నరకమును చేరలేకపోయాను. నీ ముఖం మచ్చలకు మందు తీసుకురావడానికి వీలుచిక్కిందికాదు. ఇంకాకొద్దిదినాలు, నర్సూ. నీవు వాటిని భరించాలి" అన్నాడు.

ఈహాస్యపు మాటలనువిని అందరి ప్రాణాలు తేలికను పడ్డాయి. కమిసారొక మహావృక్షం, సాధారణ విషయాలకాతడు చలించడు. డాక్టరు సెలవు తీసుకొని వెళ్ళాడు. పనివారందరూకూడా వెళ్ళిపోయారు, కాని నర్సు క్లావ్దియా అతని మంచంమీద, ఓరగా కూర్చున్నది. అలెక్సీ తప్ప తక్కిన రోగులందరూ తిరిగి నిద్రపోయారు. అతను మాత్రం కృత్రిమ పాదాలను గురించి ఆలోచిస్తూపండుకొన్నాడు. వాటిని విమానపు యంత్ర భాగానికి పటకాతో బిగించటం మంచిఉపాయమని అతనికి తోచింది. పూర్వమొక వైమానికుని గురించి వినిన విషయమాతనికి జ్ఞప్తికి వచ్చింది. పొట్టివాడవటంవల్ల అతని కాళ్ళు విమానభాగాలకు అందేవికావు, అందుకని రెండు కొయ్యదిమ్మలు చేయించుకొని వాటిని రెండు పాదాల క్రిందా బిగించుకొన్నాడు; తానూ ఇదేమాదిరి చేయటానికి వీలంటుందని అలెక్సీ అనుకొన్నాడు.

"నే నీ పనిలో నీకు వెనుక పడిపోనులే" అని కర్బోవిక్ పటమునుచూచి అన్నాడు. "నేను ఎగురుతాను. ఎగిరి తీరుతా" ననే మాట ఆ రాత్రంతా అలెక్సీ చెవులలో మార్ర్మోగింది. నిద్ర పట్టకపోయినా, కండ్లు మూసుకొని, ఆ మాటను స్మరిస్తూ పడుకొన్నాడు. చూసేవాళ్ళకు నిద్రపోతున్నా డనిపించింది.

అప్పు డాతనికీ క్రింది సంభాషణ వినపడింది.

"నీ చర్య నా కేమాత్రం కూడా నచ్చటంలేదు. ఎప్పుడూ ఒకటే నవ్వులూ, వేళాకోళాలూనా ? ప్రాణంమీదికి వచ్చినాకూడా నీ హాస్యపు మాటలను కట్టిబెట్ట లేవు.... వేరే గదిలో, విడిగా పడుకొంటే ఎంతో బాగుంటుంది.... నిన్ను చూస్తే నాకు తగని ఏడుపు వస్తుందంటే నామాట నమ్మ."

ఏదో తన మానాన తన పనులు చేసుకుపోయే నర్సుక్లావియా ఈ విధంగా మాట్లాడటం, అలెక్సీ కెంతో ఆశ్చర్యం వేసింది. ఆమె కంఠంలో ఆదుర్దా, దుఃఖమూ, ఆవేశమూ వ్యక్తమవుతున్నాయి. ఇంకా.... ఇంకా.... ఇతర వుద్దేశాలు.... ఆమెకే తెలియనివి.... అమె మనస్సులో నున్నాయా ?.... చేతిరుమాలుతో, ఎక్కువ వెలుతురు పడకుండా, మంచం చెంతనున్న దీపాన్ని నర్సు మూసింది. పాలిపోయి, ఉబ్బినట్లున్న కమిసారు ముఖం ఆ మసగలో భయంకరంగా అలెక్సీకి కనిపించింది. అతని చెంతనే కూర్చొనిన నర్సు- అలెక్సీ దృష్టి నాకర్షించింది. ఆ వెలుగు నీడలలో నర్సూ, అమె వాలుజడల జంటా, ఆదుర్దాను సూచించే కన్నులూ, అలెక్సీ కెంతో ఆకర్షణీయంగా కనబడ్డాయి. ఈరీతిగా ఆకర్షింప బడటం మంచిది కాదనుకొన్నాడు. కాని ఆమెవంక చూడకుండా వుండలేక పోయాడు,

"అమ్మాయీ ! ఇదేమిటి....? ఈ విధంగా ఏడువరాదు.... ఏమిటీ వెర్రి ఏడుపు....? ఏదీ.... నిద్రపుచ్చే మాత్రలను రెండు మ్రింగుతావా?" అని చిన్నపిల్లల నోదార్చినట్లులా కమిసారు అన్నాడు.

"అదిగో ! తిరిగి నవ్వులూ, వేళాకోళాలూ.... నీవంటి విచిత్రమైన మనిషి వేరొకడుండడు.... ఏడవవలసిన తరుణంలో కూడా, నీవు నవ్వుతున్నావు. నీశరీర బాధను మరిచిపోయి, నన్ను ఓదార్చడానికి యత్నిస్తున్నావు.... చూడు నామాటలు విను.... ఎంతో బ్రతిమాలుతున్నాను. ఇకమీదట ఈ మాదిరి ప్రవర్తించవద్దు.... నాయందనుగ్రహించి, నీ వేళాకోళం కొంచెంకట్టిపెట్టు, నీకు పుణ్యముంటుంద"ని నర్సు బ్రతిమాలుకొన్నది.

తలవంచి, రెండుచేతులతో దాన్ని మూసుకొని, ఏడ్చిందానర్సు. జాలిగా ఆమెవంక చూస్తూ, కమిసా రీవిధంగా అన్నాడు.

"ఇంతకాలానికి ఇప్పుడీ స్వభావమును మార్చుకొనటం నావల్లకానిపని. ఎంతకాలంగానో నేనీవిధంగానే బ్రతుకుతూవచ్చాను. ఇప్పుడు మార్చడానికి నాకు శక్తిచాలదు. స్వవిషయాలను నేనెన్నడూ గమనించిన పాపానపోలేదు,

ఇప్పుడీవయస్సులో కొత్తగుణాలు అబ్బటం దుర్లభం. ఏదో, ఇదేవిధంగా రోజులు వెళ్ళబుచ్చాలి."

పెద్దగా నిట్టూర్చాడు, కమిసారు. నర్సు తలయెత్తి అతనివంక, దేనినో అపేక్షిస్తూన్నట్టు చూసింది. ఆమెను చూసి రవంత చిరునవ్వునవ్వి, తిరిగీ కమిసారు తన మామూలు ధోరణిలో.

"ఇదిగో, ఈ కథవిను. నాకిది ఇప్పుడే జ్ఞప్తికి వచ్చింది. ఇది కథకాదు. టర్కీ యుద్ధ సమయంలో జరిగిన విషయం. ఒక ఆశ్వికదళం, విరోధులను తరుముకొంటూ బస్మాచీ యెడారిని చేరింది. అవన్నీ రష్యా దేశపు గుర్రాలు, వాటికి ఎడారులంటే బొత్తిగా అలవాటులేదు, ఒకదాని తరువాత ఇంకొకటిగా అవి వేడిని తట్టుకోలేక క్రిందపడి చనిపోయాయి. ఆశ్వికదళం, కాలిదళంగా మారి పోయింది. దళాధికారి చేతిలోనున్న తుపాకులూ. తూటాలూ తప్ప తక్కిన వస్తువులన్నిటినీ అక్కడే వదిలిపెట్టి, ఫలానా వూరికి మేమందరమూ వెళ్ళడానికి ఆజ్ఞాపించాడు. దానిని చేరుకోడానికి నూట అరవై కిలో మీటర్లు, ఈ ఎడారిని పడిపోవాలి. ఎడారి అంటే ఎట్లాగుంటుందో నీకు తెలుసా, అమ్మాయి? మూడు దినాలు నడిచాము ఎండ మండిపోతోంది. తాగటానికి నీరులేదు. నోరు పొడారి పోయి నోటిలోపలి చర్మం కూడా పగిలింది. ఎక్కడచూసినా ఒకటే ఇసుక, కాళ్ళ క్రింద, పళ్ళసందుల్లో, కండ్లల్లో, ముక్కురంధ్రాలలో : ఎక్కడపడితే అక్కడంతా ఇసుక గరగరలాడింది. ఖర్మం చాలక ఎవడైనా ఆ ఇసుకలో వడ్డాడాఅంటే అంతే, తిరిగీ పైకిలేవటం దుర్లభం. మాలో వాలోడీ౹ా అనబడే కమిసారొక డున్నాడు; తెలివైనవాడు కొంచెం బొద్దుగానుంటాడు: అతడొక గొప్ప చరిత్ర కారుడు కూడా. తప్పకుండా ఆ కమిసారు పడిపోతాడని మేమందరమూ అను కొన్నాము, కాని, "ఇంకెంతో దూరంలేదు. ఇదిగో వచ్చేసాము" అంటూ మమ్మందరినీ ఎంతో వుత్సాహపరిచాడు. అతని అనుమతిలేకుండా ఎవడన్నా ఆ ఇసుకలో కూర్చొంటేసరి, "వెంటనే లేస్తావా? లేకపోతే ఈ తుపాకితోకాల్చి వేయమంటావా?" అని బెదరించాడు.

ఆ వూరికింకా పద్నాలుగు కిలో మీటర్లు, వెళ్ళాలి. మే మందరమూ ఇంకొక్కడుగయినా పెట్టలేనంత అలిసిపోయాము. అప్పుడా కమిసారు పాట నొకటి మొదలు పెట్టాడు. అతని కంఠం కొంచెం కూడా శ్రావ్యంగా నుండదు కాని అప్పుడా పాట వినగానే మా కందరికీ ఏదో చెప్పజాలనంత శక్తి వచ్చిన ట్లనిపించి, అందరమూ పాట మొదలు పెట్టాము. ఆ రోజుల్లో ఆ పాటను ప్రతి వొక్కడూ పాడేవాడు : "చుబారికే, చుబాచికీ" బలే సరదాగా పాడారందరూ. నేను తాళంవేసినట్టు, "లెఫ్టు. రైట్—లెఫ్టు రైట్" అంటూంటే దానికి సరీగ్గా అడుగు లిడుతూ అందరమూ నడిచాము.

అ పాట అయిపోతే, వేరొకటీ, దాని తరువాత మరొకటీ : ఈ విధంగా పాడుకొంటూ నడిచాము. నీకు నేను చెప్పేది అర్థమవుతోందా? కాళ్లు మాడిపో తున్నాయి. తల ప్రేలిపోయేటట్లు ఎండ కాస్తోంది. గొంతు పొడారిపోయింది. కాని మా పాటలేమో, మే మేమో అన్నట్లు పాడుకొంటూ వెళ్లి అ వూరు చేరాము, దారిలో ఒక్కడినైనా కూర్చోనీయకుండా ఆ పాటలు మమ్మందరినీ ఆ వూరు చేర్చాయి....ఏమంటావు?

"కమిసారు విషయం?"

"ఇంకా బ్రతికేవున్నాడు. పురాతన శిల్పమంటే ఆతని కెంతో ఇష్టం. ఎప్పుడూ ఏదో వొక పురాతన శిల్పాన్ని పరీక్షిస్తూ, దానినిగురించి వ్యాసాలు వ్రాస్తూ వుంటాడు....ఆతని కంఠం పూర్తిగా పాడయిపోయింది. ఆ రోజునుండీ.... కాని ఫరవాలేదంటాడు, తా నేమీ సంగీత పాటకుడిని కాదంటాడు.... చూసావా, తమాషా?....సరి. నేటి కింతటితో కబుర్లు చాలించాలి........వెళ్ళు........పడుకొని నిద్రపో.... చిన్నపిల్లలు బాగా నిద్రపోవాలి. లేకపోతే పెరుగరు .... ఇకమీద, ఈ రాత్రి తిరిగీ చచ్చిపోనులే....ఇదిగో నీమీద ఒట్టు!"

అలెక్సీకి నిద్రపట్టింది. ఆరాత్రి అతనికి కలలో పెద్ద ఎడారిలో తాను వెడుతూన్నట్లు: నోరంతా ఎండిపోయినా తానే దోపాడుతున్నట్లూ కనిపించింది, కలలో నాతని కగుపించిన కమిసారు వాలొడిన్,అచ్చంగా కమిసారు వరొబియావ్ మాదిరే వున్నాడు!

అలెక్సీ చాలా ప్రొద్దెక్కి నిద్రలేచాడు. ఎండపొడ గదిలో మధ్యభాగంలో పడుతోంది. నడినెత్తికి సూర్యుడు వచ్చాడని అలెక్సీ తెలుసుకొన్నాడు. ఏదో వొక కల. అదేమిటో సరిగాజ్ఞాపకంలేదు....చూస్తే తన చేతిలో వార్తాపత్రిక కని పించింది....కర్పొవిక్ తనకేసి చూస్తూన్నట్లులనిపించి, ఆ పటానికి కన్నుగీటాడు, అలెక్సీ.

కమిసారాతనిచూసి "ఎందుకాతని చూసి కన్ను కొట్టుతున్నావని?" అడిగాడు.

"మేము ఎగురబోతున్నాము."

"అదెట్లా వీలుపడుతుంది? అతని దొకేవొకపాదం పోయింది. నీకు రెండుపాదాలూ లేవుగా?"

"నేనొక సోవియట్ రష్యను వైమానికుడిని" అన్నాడు. ఆ కంఠంలో బిగువూ, మనోనిబ్బరమూ వ్యక్తమయ్యాయి. కర్పొవిక్ ఒకపాదం లేకున్నా ఎగిరాడు. రెండుపాదాలు లేకపోయినా తానూ ఎగిరితీరుతాననే మనోనిబ్బర మూ కంఠంలో వినిపించింది.

మధ్యాహ్నం భోజనమపుడు తన కిచ్చిన దానినంతా తినేశాడు. ఖాళీపళ్లెంవంక విచిత్రంగా చూసి మరింత అడిగి పెట్టించుకొన్నాడు. గొప్ప సంతోషంతో ఈల

వేశాడు. పాటపాడాడు. అందరికీ వినబడేటట్టు తనలో తానే ఏదేదో మాట్లాడాడు. మధ్యాహ్నం వాసిలివెక్ రాగానే, తనకు త్వరగా బలం పట్టడానికేమి చేయాలని గ్రుచ్చి గ్రుచ్చి అడిగాడు. బాగా తిని, నిద్రపోవాలని ఆయన చెప్పాడు. అలెక్సీ ప్రతిరోజూ రెండోపర్యాయం అడిగి భోజనం పెట్టించుకొనేవాడు. మాంసపు బజ్జీలను రోజుకు నాలుగేసి తిన్నాడు.

సంతృప్తికలిగిన మనిషిలో ఎక్కువగా స్వార్థపరత్వం కనిపిస్తుంది. ప్రొఫెసర్ వాసిలివెక్‌ను తనకు బలంపట్టడాన్ని గురించి ఎన్నో ప్రశ్నలు వేశాడేకాని. అతనిలో మార్పు లేమైనా కనిపించాయా, లేదా అని ఒక్కరోజయిన గమనించాడు కాదు. ఒకరోజాయన మామూలుగా వచ్చే సమయానికే వాళ్ళ గదిలోకి సాయంత్రం పూట వచ్చాడు. వెంటనే అతడు మామూలుగా లేడనే విషయం ఆ గదిలోని వారందరికీ తట్టింది. ఏదో మనోవ్యాకులమునకు లోనయినట్లు వారికి తోచింది. యథాప్రకారం అందరినీ పరీక్షించాడు, ప్రశ్నించాడు. కాని ఎప్పటి మాదిరిగాలేడు. ఈ సంగతి అలెక్సీ వొక్కడు తెలుసుకోలేకపోయాడు. వాసిలెవిక్ నేత్రాలు ఎర్రబారాయి. కణతలందున్న రక్తనాడు లదిరి, అదిరిపడుతున్నాయి. చాలా చిక్కిపోయినట్టూ, ఒక్కరోజులోనే చాలా ముసలివాడయినట్టూ అగుపించాడు. తలుపు ఎడిమీద దుమ్ము దులిపే బట్ట మంచినందుకు కొాక పనిమనిషిమీద కోపగించుకొన్నాడు. కాని ఎప్పటిమాదిరికాదు. "అలా చేయరాదని ఎన్ని పర్యాయములు చెప్పాలి?" అని మాత్రం అన్నాడు. కమిసారును పరీక్షించి ఏదో ఒక మందు పేరును చీటీమీద వ్రాసి, వచ్చినట్లే, నెమ్మదిగా గదినుండి వెళ్ళిపోయాడు. అతనితో వచ్చిన డాక్టర్లూ నర్సులుకూడా ఆయన ననుసరించి చల్లగా జారిపోయారు. గది గుమ్మం దగ్గర తల తిరిగింది కాబోలు దభాలున పడిపోబోయాడు. ప్రక్కనున్న డాక్టరొకడాతని పట్టుకోకపోతే తప్పకుండా క్రిందపడేవాడే. ఒడ్డూపొడుగూ; కంఠమూ ఎల్లప్పుడూ బహుచలాకిగా నుండే ఈ మనిషి ఇంతగా మారిపోవడం అందరికీ ఆశ్చర్యం వేసింది. ఆ గదిలోని రోగులందరికీ అతడంటే ఎంతో ప్రేమా, గౌరవమూ ఏర్పడ్డాయి. పాపం! ఏమి కష్టమో! ఎంత గొప్ప కష్టమో!! వారికేదీ బోధపడిందికాదు.

మరునాడు వాసిలివెక్ ఎందుకంతగా మారిపోయాడో నలుగురికీ తెలిసింది. ఆయన కొకడే ఒక్కకొడుకు. అతని పేరు కూడా వాసిలివెక్కే. తండ్రి మాదిరే కొడుకుకూడా, డాక్టరు వుద్యోగంలో నుండి కొత్త విషయాలను కనిపెట్టడానికి ఎన్నో పరిశోధనలను చేసాడు. ఆ అబ్బాయి, ఎక్కడో పశ్చిమ యుద్ధభూమిలో మృతినొందాడు. తెల్లవారగానే ఆస్పత్రిలోని వారందరూ వాసిలివెక్ యధాప్రకారం వస్తాడో, రాడో అనేవిషయం చర్చించుకొంటూ అక్కడక్కడ చిన్నగుంపులుగా నిలబడ్డారు. బిగ్గరగా మాట్లాడటానికే ధైర్యంలేకపోయింది. వాసిలివెక్ మామూలుగానే వచ్చాడు. నలభై రెండో నంబరు గదిలో ఆయన వచ్చేసమయానికి ఎండ

పొడ తూర్పు గోడమీద, రంగు ఊడిపోయిన వొకచోట ప్రతిరోజూ పడుతుంది. ఆ గదిలోని వారందరూ ఆ ఎండపొడని చూస్తూ కూర్చున్నారు. వాసిలివెక్ వస్తాడా ? ఎండమామూలు చోటును చేరింది. గదివెలుపల అడుగులు వినబడ్డాయి. వాసిలివెక్ గదిలోకివచ్చాడు. జలుబు పట్టినట్టులాతని ముక్కు కందింది, కళ్ళు నీరుకారుతున్నాయి. మాట నెమ్మదిగా వచ్చింది. కమిసారు యొక్క జ్వరమును గుర్తించిన అట్టను తీసుకొన్నప్పుడాతని చేయి వణికింది....కాని తన పనులన్నిటినీ యథావిధిగా. సక్రమంగా చేసుకొని వాసిలివెక్ వెళ్ళిపోయాడు. ఈ చర్య అందరికీ చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆతనిపై తమకున్న గౌరవం, ఇప్పుడు పదిరెట్లు ఎక్కువగా పెరిగింది.

ఆస్పత్రిలోని రోగులందరూ ఆనాడు, ప్రతి రోజూకంటే సంతోషంగా కనిపించారు. తమ శరీరారోగ్యం బాగున్నదనీ. జబ్బు నిన్నటికంటే నేడు ఎంతోమేలనీ, నలుగురూ చెప్పి ఆయన కుత్సాహం కలిగించటానికి యత్నించారు. ఆస్పత్రిలో ఏర్పాటులనూ. ఇచ్చేమందులనూ, వారియెడలచూపే శ్రద్ధనూ, ప్రేమనూ ఎంతో మెచ్చుకొన్నారు. తమ కందరికీ తండ్రివంటి ఆ మనిషికి కలిగిన కష్టానికి వారందరూ ఎంతో దుఃఖించి, తమకు వీలయినంతగా తోడ్పడటానికి యత్నించారు.

నేడీవిధంగా అందరూ వర్తించటమూ, మాట్లాడటమూ వాసిలెవిక్‌కు ఆశ్చర్యం కలిగించాయి కాబోలు ! ఎవరు చెప్పగలరు ?

లేకపోతే, వారంద రావిధంగా వర్తించటానికి కారణం అతడు గ్రహించాడా ? గ్రహించినట్టయితే, తనపై వారికున్న ప్రేమాతిశయం, కష్టమును భరించ డాని కాతనికి తగిన బలమునూ, మనోధైర్యమునూ ఇచ్చిందా ? ఎవరికి తెలుసు ? ఎవరు చెప్పగలరు ?

# 9

కిటికీ దగ్గిరనున్న పోప్లర్ వృక్షంనిండా ఆకు మొగ్గలు పుట్టాయి. వాటి నుండి లేత పసుపుపచ్చని ఆకులు తొంగిచూస్తున్నాయి. అక్కడక్కడ కంబళీ పురుగులవంటి ఎర్రని పూవు లగుపించాయి. వాటిమీద లేతఎండ పడినప్పుడు ఆ ఆకులన్నీ నూనె కాగితంతో చేసినట్లగుపిస్తాయి. ఘాటయిన పోప్లర్ నూనె వాసన ఆస్పత్రిలోనుండే మందువాసనల పారద్రోలి, ఆ చుట్టు ప్రక్కలనంతా వ్యాపించింది.

ఇవానొవిక్ పుణ్యమాఅని బాగాతిని, తెగబలిసిన పిచ్చుకలు పెద్ద అట్టహాసం చేయటం మొదలెట్టాయి. 'టామీ'కి కొత్తతోక పెరిగింది. తోకతోపాటే దాని చిలిపిచేష్టలూ, కజ్జాకోరుతనమూ కూడా పెచ్చుపెరిగాయి. ప్రతిరోజూ ప్రొద్దున పూట పిచ్చుకలన్నీ గుమిగూడి కిటికీ అంచున కూర్చొని గందరగోళంగా కబుర్లు చెప్పుకొనేవి, పోట్లాడేవి, సరసల్లాపాలాడేవి. ఇదంతా ఆ గదిలోని వారి కమితా నందం కలిగించేది.

మాస్కో నదిలోని మంచు పూర్తిగా కరిగిపోయింది. మొదట్లో వెల్లువలై పారిన నది ఇప్పుడు ప్రశాంతంగా గట్లమధ్య పారుతోంది. దానిమీద ఓడలు, పడవలు, డింగీలు ఇంకా రకరకాల పడవలన్నీ ప్రయాణాలు సాగిస్తున్నాయి. ఆ రోజుల్లో వర్తక వ్యాపార సరకుల సరఫరాకీ పడవలెంతో పనికివచ్చాయి. నేలమీద సరుకులను తీసుకు పోవడానికి వీలులేకపోయింది. మాస్కోనదిలోని మంచు కరిగి వరదలు రాగానే చాలా మంది చనిపోతారని కుకుష్కిన్ చెప్పిన జోస్యం ఫలించలా. కమిసారు తప్ప మన నలభై రెండోనంబరు గదిలోని వారంద రూ బాగా. త్వర త్వరగా కోలు కొంటున్నారు. ఆస్పత్రినుండి విడుదలయ్యే రోజు ఎప్పుడు వస్తుందా అని అందరూ కనిపెట్టుకొనివున్నారు.

వారందరిలోను మొట్ట మొదటిగా ఇవానోవిక్ ఆస్పత్రి నుండి బయటపడ్డాడు. అంతకు క్రితం రోజు ఇవానొవిక్ ఆస్పత్రిలోని వేర్వేరు భాగాలకూ వెళ్ళాడు. అందరు రోగులనూ, నర్సులనూ, పనివారినీ పలకరించాడు. ఏదో వెర్రి ఆవేశమూ, ఆదుర్దా, సంతోషమూ, దిగులూ అతని గుండెల్లో పెనవేసుకొన్నాయి కాబోలు. పిచ్చివాడి లాగా ఇక్కడా అక్కడా తెగ తిరిగాడు. సాయంత్రం చీకటి పడబోతోంది. ఇవానోవిక్ తన మంచం చెంతనున్న కిటికీమీదకెక్కి కూర్చొని చూడడం మొదలు పెట్టాడు. గదిలో కమిసారూ, అలెక్సీ మాత్రమున్నారు. కమిసారు ఇవానోవిక్‌ను చూస్తూ పడుకొన్నాడు. అలెక్సీ నిద్రపట్టించుకోడానికి యత్నిస్తున్నాడు.

అంతటా ఎంతో శాంతంగా వున్నది. కిటికీపై కూర్చొన్న ఇవానోవిక్ మీద అస్తమయ సూర్యుని ఆఖరు కిరణాలు పడుతున్నాయి. కమిసారు ఇవానొవిక్ కూర్చున్న కిటికీ ప్రక్కకు తిరిగి, తనకు తానే ఈవిధంగా అనుకోటం మొదలు పెట్టాడు :

"సంధ్యాసమయం !.... గ్రామ పొలిమేరలలో శాంతి.... సద్దణిగి లోక మంతా ప్రశాంతంగానుండే గోధూళీ సమయమిది.........కరిగే మంచుకు తడిసిన నేల వాసనా తడిఎరువూ, కాలే కట్టెలపొయ్యినుండి లేచే పొగవాసనా, ఘాటూ. పశువులపాకలో కనకాచుకొన్న ఆవు గడ్డిని మెత్తగా త్రొక్కుతోంది, దూడనీనే తరుణం సమీపించిందని దానికి తెలుసు....చిగురింతకాల మాసన్నమయింది.... స్త్రీలు తమతమ పొలాలలో ఎరువును వేస్తారని అనుకొంటాను .... గింజలు

నాటారా? నాగళ్ళన్నీ తమ పనిని పూర్తిచేసి విశ్రమిస్తున్నాయి కాబోలు....మంచి పంట పండుతుందా....? లేకపోతే మట్టిలోని గింజలు మట్టితోనే కలిసిపోతాయా?"

"కమిసార్! నీవొక మాంత్రికుడవని నే ననుకొంటాను....నా మనస్సులోని ఆలోచనలనే నీ విప్పుడీవిధంగా వ్రాక్కుచ్చావు. ఆశ్చర్యం! .... స్త్రీలు లోకజ్ఞానం కలవారే. కాని ఒంటరిగా, వారి మొగవాళ్ళంతా యుద్ధాలుచేస్తూంటే.... ఒంటరిగా, తమంతటతామే, ఈ పనులన్నీ, పాపం, చేస్తున్నారు కాబోలు!" అన్నాడు, కిటికీమీద కూర్చున్న ఇవానొవిక్.

తిరిగీ ప్రశాంతం... నదిపైనుండి వొక ఓడకూత వినపడింది. అ ధ్వని దిగంతములా మార్రోగ్మి. పిడుగు శబ్దంమాదిరి ఆకాశంలో దొర్లుకుంటూవెళ్ళింది.

"నీ వే మంటావు?....యుద్ధం త్వరలో ముగుస్తుందా?....పంట కోసే సమయానికి యుద్ధం ఆఖరవుతుందని చెప్పడానికి వీలున్నదా?" అని యేదో రహస్యం మాట్లాడుతున్నట్లు ఇవానొవిక్ అడిగాడు.

"ఆ గొడవంతా నీ కెందుకు? నీ మాదిరి వయస్సు మళ్లినవారిని యుద్ధంలో చేరమనరు. అసలు నీ అంతట నీవే యుద్ధంలో చేరావు. ఈ సంగతి మరిచిపోవద్దు. నీవు వ్రాసుకొంటే నిన్ను తప్పకుండా విడుదలచేస్తారు. మీ ఊరికి వెళ్ళి ఆడవారందరినీ చేకూర్చుకో, పెత్తనం సాగించు. పనిపాటలు తెలిసిన మొగవాళ్లు కొందరైనా గ్రామాల్లోనుండి పాడిపంటలూ వగైరాల విషయం చూసుకొనడంకూడా ముఖ్యమైన విషయమేగా?........ఏమంటావు? ముసలిగడ్డం?" అన్నాడు కమిసార్.

ఈ మాటలు విని, చిన్నపిల్లవాడిమాదిరి, ఇవానొవిక్ కిటికీనుండి దభీలున క్రిందికి దుమికాడు.

"యుద్ధంనుండి విరమించమంటావా? నేనూ అదే విషయం ఆలోచిస్తూ ఆ కిటికీమీద కూర్చున్నాను. ఇంతవరకూ మూడు యుద్ధాలల్లో పోరాడానుగా? నా వయస్సు కిది చాలదూ? ఇంకా పోరాడాలా? ఏమంటావు? నీ సలహాకూడా ఇదేనని వినటంతో నా మనస్సు తేలికనుపడ్డది" అన్నాడు, ఇవానొవిక్.

"నీ వనే మాటలు నిజమే, నేను గ్రామ స్త్రీలలో నొకడినిగా చేరివుండాలని తీర్మానించుకొన్నాను. కాబట్టి నన్ను సైన్యంనుండి విడుదలచేయండి. ఇతర రష్యనులు నన్ను జర్మనులనుండి కాపాడేటట్లు ఏర్పాటు చేయండి అని అర్జీ పెట్టుకో" మన్నాడు, పట్టపగ్గాలు లేని కోపంతో, అలెక్సీ!

ఇవానొవిక్, ఏమనాలో తెలియక అలెక్సీని తేరిపారజూచాడు. కమిసారు కనుబొమలు ముడిపడ,

"నేను నీ కీయగల సలహా ఏమున్నది, ఇవానొవిక్! నీ మనస్సాక్షి నడుగు. నీ రష్యను గుండె ఏది చెబితే అదే చేయి; దానికంటె నీకు శ్రేయస్కరమైన సలహా నిచ్చేవారెవ్వరూలేరు" అన్నాడు.

మరునాడు స్టిపాన్ ఇవానోవిక్‌కు ఆస్పత్రినుండి యింటికి వెళ్ళవచ్చునని చెప్పారు. తన సైనిక దుస్తులనూ, పతకములనూ, తళతళా మెరిసిపోయేటట్టు రుద్దిన బూట్సులనూ తొడుగుకొని నలభై రెండో గదిలోకి వచ్చాడు. పొట్టి మనిషి· వయస్సు మీరినవాడూ అయినా ఆ దుస్తులను తొడుక్కొని టిప్ టాప్‌గా నడు స్తూంటే, కనీసం పదునైదేండ్లు చిన్నవాడిలాగా కనిపించాడు. ఆతని కోటుమీద సోవియట్ వీరాగ్రే సరనక్షత్రమూ, లెనిన్ వీరచిహ్నమూ. "ధైర్యసాహసాల" పతాకమూ ఎంతో ముచ్చటగా కనిపించాయి. ఆస్పత్రిలో జబ్బు మనుష్యులు తొడుగు కోడానికిచ్చిన అంగీని దర్జాగా అంగవస్త్రంమాదిరి పైన వేసుకొన్నాడు. నఖశిఖ పర్యంతమూ, తళతళా మెరిసే బూట్సులనుండి, సూదిమొనలమాదిరి దువ్వి, దిద్దిన మీసాలవరకూ, నూటికి నూరుపాళ్ళ సోవియట్ యుద్ధవీరుడిమాది రున్నాడు. 1914 సం॥లో ప్రచురించిన క్రిస్టమస్ కార్డులోని రష్యనుయోధుని చిత్రంమాదిరి వున్నాడని, ఇవానోవిక్‌ను చూసి నలుగురూ అన్నారు.

తనతో యింతవరకూ నలభై రెండో నంబరు గదిలో నున్న మిత్రులొక్కొ కరిదగ్గిరికీ వెళ్లి, మిలిటరీపద్ధతిని నిటారుగా నిలబడి, సలాముచేసి వెళ్ళిపోతానని చెప్పాడు. అప్పుడాతని చూస్తే ఎంతో ముచ్చటయింది.

"సోదరా! రెజిమెంటల్ కమీసార్! నాకు సెలవిప్పించు" అని కంచు కంఠంతో పలికాడు.

"శుభం! సోదరా జయప్రదంగా వెళ్లు. జయప్రదంగా నీ కార్యాలన్నీ నెరవేరు గాక" అని తన శరీరమెంతో బాధపెట్టుతూన్నప్పటికీ కమీసారాతని ప్రక్కకు తిరిగి కరస్పర్శ చేసాడు.

మోకాళ్ళమీద కమీసారు మంచంచెంత కూర్చొని, ఆతనితలను తన హస్తా లతో పట్టుకొన్నాడు, ఇవానొవిక్. రష్యను ఆచారప్రకారం, ఒకరినొకరు మూడు పర్యాయములు ముద్దు పెట్టుకొన్నారు.

"త్వరగా నీ శరీరం కోలుకొని బలం పట్టుగాక. దేవుడు నీకు పూర్ణాయుర్దా యమునూ, దేహపుష్టి నీ ప్రసాదించుగాక. నీవంటి దయార్ద్రహృదయు లీలోకంలో ఏ కొద్దిమందో వున్నారు. మమ్మందరినీ తండ్రిమాదిరి కాపాడావు. నీ వొనర్చిన మేలును ఆ జన్మాంతం జ్ఞప్తికుంచుకొంటాను" అని, ఇవానొవిక్ గద్గదకంఠంతో పలికాడు. రెండు పర్యాయములు ముక్కు నెగబీల్చి, కండ్లు అద్దుకొన్నాడు.

"వెళ్లు, స్టిపాన్ ఇవానొవిక్, ఇకమీద జాగుచేయరాదు. కమిసార్ అలిసి పోతారు" అని నర్సుక్లావ్దియా హెచ్చరించింది,

"సోదరీ, నా మనఃపూర్వక కృతజ్ఞత నంగీకరించు. ఎంతో ప్రేమతో. ఎంతో జాగ్రత్తగా నన్ను కాపాడావు" అన్నాడు ఆమెతో. "సోవియట్ దేవ దూతవు నీవు. అతిశయోక్తి కా దిది" అన్నాడు, తిరిగీ.

అతని ముఖమంతా కందిపోయింది. ఇంకా ఏ మేమో అక్కడున్నవా రందకీ చెప్పాలని మనస్సులో నున్నది. కాని దానినంతా దిగమ్రింగి వెళ్ళి పోయాడు స్టిపాన్ ఇవానొవిక్.

“నీ కే చిరునామాకు వుత్తరాలు వ్రాయాలో చెప్పకుండా వెడితే ఎట్లా?” అన్నాడు కమిసార్.

“కమిసార్ సోదరా? యుద్ధం చేసేవారందరికీ యుద్ధ కార్యాలయానికి జాబులు వ్రాయాలన్నది నీకు తెలీయని విషయమా?” అని, మరొక పర్యాయం ఆ గదిలోని వారందరికీ నమస్కరించి వెళ్ళిపోయాడు.

గదంతా, ఇవానొవిక్ వెళ్ళటంతో, వెలవెలపోయింది. కొంత సేపటిదాకా ఎవరుగాని, ఏదిగాని మాట్లాడారుకారు. తరువాత తమ తమ దళంవారిని గురించీ. యుద్ధాన్ని గురించీ మాట్లాడుకొనటం మొదలుపెట్టారు. పెద్ద సన్నాహాలు, గొప్ప యుద్ధంకొరకు జరుగుతున్నాయని వారందరికీ తెలుసు. వారందరినీ, త్వరలో. బహు త్వరలో ఆస్పత్రినుంచి పంపిస్తారని తెలుసు కాబట్టే, తిరిగి వారికీ యుద్ధ విషయాలను తెలుసుకోవాలనే ఆదుర్దా కలిగింది. కుకుష్కిన్ గదంతా తిరగటం మొదలుపెట్టాడు. నర్సులతో పేచీలు పెట్టుకొనటమూ, ఇతర రోగులతో వేళా కోళాలాడటమూ, మెత్తముమీద ప్రతి వొక్కనితో ఏదోవొక విషయమై కలహిం చడమూ ప్రారంభించాడు. టాంకుయోధుడు, గ్రిగోరీకూడా లేచి తిరగటం మొదలు పెట్టాడు. అద్దంముందు నిలబడి తెగచూసుకొనేవాడు, కట్లూడదీసిన ముఖమునూ, మెడనూ, భుజాలనూ పరిశీలించుకొనేవాడు. అతనికీ వైద్య కళాశాల పుటమ్మాయి, అన్యూతాకూ ఉత్తర ప్రత్యుత్తరాలు చాలా జోరుగా సాగుతున్నాయి. ఆ కళాశాల లోని ప్రతియొక్క విషయమూ అతనికా జాబులద్వారా ఆ అమ్మాయి తెలిపేది. కాలిపోయి వికృతంగా నున్న తన ముఖమును అద్దంలో చూసుకొన్నప్పుడల్లా అతని మనస్సు చివుక్కుమనేది. మసగ వెలుతురులో ఆ ముఖం అందవికారంగా నుండేదికాదు. ఎత్తునుదురూ, తీర్చి దిద్దినముక్కూ. ఆస్పత్రిలో చేరినతరువాత పెం చిన పొట్టిమీసమూ, నిండు పెదవులూ. బాగున్నానని అతడనుకొనేవాడు. కాని వెలు తురులో చూస్తే ముఖంనిండా కాలినమచ్చలూ, బిగదీసుకుపోయిన చర్మమూ; అత నికే అసహ్యం వేసేది. కోపంవచ్చినా. లేక అప్పుడే స్నానంచేసి ఒళ్లు తుడుచు కొనిన వెంటనే అద్దంలో చూసుకొన్నా. ఈ మచ్చలు మరీ కొట్టవచ్చిన ట్లగు పించేవి. ఎంతో ఏడుపు వచ్చేది, పాపం. అలెక్సీ ఆతన్ని ఓదార్చడాని కనేకమారులు యత్నించాడు.

“ఎందు కా విధంగా దిగులుపడతావు? నీ వేదన్నా సినీమాలో చేర బోతున్నావా? ఆ అమ్మాయికి నీపైనుండే ప్రేమ యధార్థమైతే నీ రూపలావణ్యా లతో పనివుండదు. అందంగాలేవని నిరాకరిస్తే. బలాదూర్, అటువంటిదానితో

కాపరం వెలగబెట్టడం ఎన్నటికయినా ప్రమాదకరమే. పీడ దిదలిపోయిం దనుకొని నీకు తగినదానిని, నిన్ను, కోరేదానిని తెచ్చుకొంటావు" అనేవాడు అలెక్సీ.

"ఆడవాళ్ళంతా ఒకచేరక" మన్నాడు కుకుష్కిన్.

"నీ తల్లి సంగతి అంతేనా?" అని ప్రశ్నించాడు కమీసార్.

ఈ చిన్న ప్రశ్న లెఫ్టినెంటు కుకుష్కినను నెంతో గాబరాపెట్టింది. అకస్మాత్తుగా మంచంనుండి లేచి నిలబడ్డాడు. ముఖం పాలిపోయింది, కండ్లు జిగేలు మన్నాయి.

"చూశావా? లోకంలో నా వెర్రినాయనా, కొందరు వుత్తమ స్త్రీ లున్నారనేది యిప్పడయినా తెలుసుకో! గ్రిగొరీని ప్రేమించే అమ్మాయికూడా ఉత్తమురాలెందుకు కాగూడదు? జీవితంలో నీ వేదికోరి, దేని నాశిస్తే, అదే నీకు చేజిక్కుతుంది" అన్నాడు కమీసార్.

ఆ గదిలోనివా రందరూ మొత్తంమీద బాగా కోలుకొంటూ సంతోషంగా నున్నారు. కాని, కమీసా రొక్కడే దినదినం క్షీణిస్తూ వస్తున్నాడు. నల్లమందూ, కర్పూరం సూదులిచ్చి, నొప్పి తెలియకుండానూ, నిద్రపట్టేటట్టూ తరుచు చేయడం వల్ల మరో ప్రపంచంలో నివసిస్తూన్నట్టు లెప్పుడూ పరధ్యానంగానూ, మగతగానూ వుండేవాడు. ఇవానొవిక్ వెళ్ళిపోవడ మాతనికి మరీ కష్టమనిపించింది. ఇది కనిపెట్టి అలెక్సీ తన మంచమును కమిసారు మంచం చెంత వేయించుకొన్నాడు. తనకు చేతనయినంతగా అతనికి సహాయం చేయాలనేభావం అలెక్సీకి కలిగింది, కాబోలు.

కాళ్ళులేని బ్రతు కెంత కనాకష్టంగా వుంటుందో అలెక్సీకి తెలుసు. అట్టి బ్రతుకును సాగించడాని కెంతో మనోనిబ్బరం వుండాలి. కమిసారునుచూస్తే అతని కెంతో ఆశ్చర్యంకలిగేది. శరీరారోగ్యం పూర్తిగా నశించిపోయింది. చెప్పనలవి కాని బాధ. రోజురోజుకూ కృశించిపోతున్నాడు. కాని ఆ మనిషిలో అధైర్యమూ. ఆదుర్దా, దిగులూ, నిరుత్సాహ మనేవి యెక్కడా కనుపించవు. ఇంతేకాదు. అతనితో వుంటేనే చాలు. తన కెక్కడలేని ధైర్యమూ: జీవితంమీద ఆశా, పుట్టుకు వస్తాయి. ఇటువంటి వ్యక్తికి తాను చేయగల సహాయ మేదైనా వుంటేచాలు, దాని నొనరిస్తే, తన జన్మ సార్థకమవుతుందని అలెక్సీ అనుకొన్నాడు.

ఒకనాటి సాయంత్రం, ఆస్పత్రిలోని వారందరూ ప్రశాంతంగా పడుకొన్నారు. నిద్రపోతున్న వారి గురకలూ, బాధపడేవారి నిట్టూర్పులూ దూరంగా, ఎక్కడినుండో వినిపిస్తున్నాయి. తన మంచంమీదినుండి చూస్తే ఇరుప్రక్కలా నున్న గదుల మధ్యదారీ, దానికవతలి చివర కూర్చొనిన నర్సూ అలెక్సీకి కనిపించారు. బల్లదగ్గిర కూర్చొని, ఆనర్సు ఏదో కుట్టుసూదులతో అల్లుతోంది. అడుగులశబ్దం! నెమ్మదిగా వాసిలివెక్ సమీపించాడు. దిగాలుపడి, ఆదరాబాదరా కుట్టుపనిని బల

మీదవడేసి నర్సు నిలబడింది. కూర్చోమని సంజ్ఞచేసి వాసిలెవిక్ నెమ్మదిగా నడిచి వస్తున్నాడు. చెదిరినతలా, గుండీలు పెట్టుకొనని కోటూ, వంచిన మెడా వెనుక ప్రక్క జోడించుకున్న చేతులూ, అడుగుల్లో, అడుగులిడుతూ నడిచే అతనిని చూస్తే అలెక్సె కేదో వింతభయం వేసింది.

"వాస్యా వస్తున్నాడని" అలెక్సీ. కమీసారుతో రహస్యంగా చెప్పాడు. వారిద్దరూ అలెక్సీ తయారు చేయించుకోవలసిన కృత్రిమ పాదాలను గురించి అప్పుడు గుసగుస లాడుతున్నారు.

వస్తూ వస్తూ వాసిలివెక్ దారిలో ఏదో అడ్డంవచ్చినట్టు లకస్మాత్తుగా ఆగి, గోడకు జేరగిలబడి ఒక నిమిషం నిలబడ్డాడు. వెంటనే తిరిగి నడక ప్రారంభించి నలభై రెండో నంబరు గదిలోకి వచ్చాడు. ఏదో జ్ఞాపకానికి తెచ్చుకొనేవాడి మాదిరి గదిమధ్య నిలబడి తల గోక్కొన్నాడు, అతనినుండి డెట్టాల్ మందువంటి వాసన వేసి గది నావరించింది.

"వాసిలివిక్ సోదరా! ఏదీ, ఒక్కనిమిషం కూర్చో పిచ్చాపాటీ మాట్లాడుదా" మన్నాడు కమిసార్.

మంచంచివర వాసిలివెక్ కూర్చొన్నాడు. కణతలను తన వ్రేళ్ళతో అదిమి పట్టుకొనటం చూస్తే తలనొప్పితో బాధపడుతూన్నట్టులున్నది. అప్పుడపుడు వాసిలివెక్ కమిసారు మంచందగ్గిర నిలబడి యుద్ధ సమాచారాలు చర్చించేవాడు. ఆ ఆస్పత్రిలోని రోగులందరిలోనూ, ఈ విధంగా చనువుగా కమిసారొక్కనితోనే ఆయన మాట్లాడేవాడు. కాబట్టే నేటి సాయంత్రం కమిసారును చూడటానికి రావటంలో ఆశ్చర్యమేదీలేదు. కాని, కమిసారుతో ఏదో వొక విషయమై ప్రత్యే కంగా మాట్లాడటానికాయన వచ్చాడని అలెక్సీకితోచి, నిద్రపోతున్నట్టు నటించాడు.

"ఇవ్వాళ ఏప్రిల్ ఇరవై తొమ్మిది....వాడి పుట్టినరోజు....ఇప్పుడాతనికి.... కాదు బ్రతికి వున్నట్టయితే....ముప్పై ఆరోఏడు" అన్నాడు వాసిలెవిక్. లోతు గుంటలోనుండి వినబడినట్టు లీమాటలు వినిపించాయి.

వాచిపోయిన తన చేతిని, కమిసారు కంబళి క్రిందినుండి ఎత్తి దానితో వాసిలెవిక్ చేతిని పట్టుకొన్నాడు. అంతే: ప్రొఫెసర్ వాసిలెవిక్ వెంటనే చిన్న పిల్లవాడిమాదిరి ఏడుపు ప్రారంభించాడు, కన్నీరు చెక్కిళ్ళ దిగజారటం చూస్తే, ఇంతటి ఈ మనిషీ ఏడుస్తున్నాడా? నిజమేనా? అనిపించింది, అలెక్సీకి. తనకూ ఏడుపు వచ్చిందికాబోలు, ఎక్కడ ఇతరులు చూసిపోతారో అని అలెక్సీ దుప్ప టిలో ముఖం కనిపించకుండా కప్పుకొన్నాడు.

"వెళ్లిపోయేముందు నన్ను చూడటానికి వచ్చాడు." అంటూ ప్రొఫెసర్ చెప్పుతున్నాడు' "తాను యుద్ధంలో చేరానని, తనస్థానే వేరెవరినైనా ఆస్పత్రిలో నియమించమనీ అన్నాడు. ఎన్నేండ్లనుండో నాతో ఇదే ఆస్పత్రిలో పనిచేసాడు.

ఆతనిచర్య నాకు కొంచెంకూడా బోధపడలా. ప్రఖ్యాత వైద్యుడు విషయాలను పరిశోధించి నూతన చికిత్సల కనిపెట్టగల సామర్థ్యంగల తాను, తుపాకీ పుచ్చుకొని యుద్ధానికి వెడతానంటే నాకు ఒళ్లు మండిపోయింది. బాగా తిట్టానని నాకు జ్ఞాపకం. దానికి వాడేమన్నాడో తెలుసా? "నాయనా! ప్రఖ్యాత వైద్యుడుకూడా తుపాకి చేపట్టి యుద్ధానికి వెళ్ళవలసినరోజు లంటూ వున్నాయి. నాకు బదు లెవరిని నియమిస్తావు" అన్నాడు. టెలిఫోనును తీసుకొని, దేశ రక్షణార్థం యీ ఆస్పత్రి యిందులోని పనీ ఒడుదుడుకులు లేకుండా సాగటం చాలా అవసరం. కాబట్టి వాడిని యుద్ధానికి పంపించడానికి వీలులేదనీ, వాడి పేరును తీసివేయమనీ. యుద్ధ కార్యాలయాని కొకమాట చెబితే చాలు. వా డిక్కడే, ఇప్పుడు బ్రతికివుండేవాడు. ఏమంటావు?

ఒక్క నిమిషం ప్రొఫెసర్ వాసిలెవిక్ ఆగాడు. నిట్టూర్చి తిరిగీ:

"నీ కెంత నొప్పిగా వుంటుందో నాకు తెలుసు....ఆ చేతిని కంబళీక్రిందనే వుంచు. ఆ రాత్రంతా నాకు కునుకే పట్టలా. ఏదీ నిశ్చయం చేసుకోలేకపోయాను. నీకు నేను చెప్పేది అర్థమవుతోందిగా? నా కొక స్నేహితుడుండేవాడు. అతని పెద్దకొడుకు యుద్ధంలో చేరాడు. పెళ్లిన మొదటిరోజే పాపం ఆ అబ్బాయి చని పోయాడు. ఆతని తండ్రి ఏమి చేశాడనుకొన్నావు? రెండో కొడుకును పంపాడు. వైమానిక దళంలో చేరి పోరాడుతున్నాడు. వైమానికుల జీవిత మెంత కష్ట భూయిష్టమో నీకు తెలియని విషయం కాదుగా? ఆ స్నేహితుడు నాకు జ్ఞాపకానికి వచ్చాడు. నాకు చాలా సిగ్గువేసింది. టెలిఫోను చేయలేకపోయాను."

"చేయలేదని యిప్పుడు పరితపిస్తున్నావా?"

"లేదు. మున్మూటికీ లేదుకాని, నా వొకే ఒక్క కొడుకును చేతులారా చంపుకొన్నానా అని అనుకోకుండా వుండలేను. మే మిద్దరమూ ఇప్పు డీ ఆస్పత్రిలో నుంటే, ఎంతపనో చేసేవారము. ఇదికూడా దేశసేవే గదా?....వాడు చాలా తెలివైనవాడు — చురుకుతనమూ, సాహసమూ; తలుచుకుంటే కడుపు చెరువవు తుంది; అప్పుడేగనుక నేను టెలిఫోను చేసినట్లయితే, నా కొడుకు సోవియట్ వైద్య నిపుణులలో పెద్ద పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనేవాడు."

"టెలిఫోను చేయలేదని విచారపడుతున్నావా?"

"ఏమిటి? .... ఏమన్నావు? .... అదా? .... ఏమో ....నాకేదీ తెలియకుండా వున్నది".

"ఒకవేళ అదే సమస్య నీ కీ నాడు ఎదురయిందనుకో, ఇప్పుడింకోవిధంగా వర్తిస్తావా?"

బదులు రాలేదు. నిశ్శబ్దం. కమిసారు ఊపిరిపీల్చటం అలెక్సీకి స్పష్టంగా వినబడింది. మంచం కిర్రుకిర్రుమంటూ చప్పుడు చేస్తోంది. బహుశా ఏమి చెప్పాలో తెలియక దానిపైన కూర్చున్న ప్రొఫెసర్ కాళ్లూపుతున్నాడు కాబోలు.

"ఏమంటావు?" అన్నాడు, కమిసార్. ఆ ప్రశ్నలో సానుభూతి, ఆదుర్దా ఉట్టిపడ్డాయి.

"నా కేమిచెప్పాలో తెలియకున్నది....నీ ప్రశ్నకు వెంటనే బదులు చెప్పటం నాకు చేతకాకున్నది .... ఏమో! నాకేదీపాలు బోనంటోంది ... బహుశా .... పూర్వంమాదిరే .... అంతా, ఇప్పుడూ .... అందరి తండ్రులవంటి వాడినే, నేను కూడా....వారికంటే నాలో గొప్పతన మేమున్నది? వారికి నేను తీసిపోజాలను.... అబ్బా! ఎంత భయంకర మీ యుద్ధాలు? ..."

"నీకెంత కష్టంగా నున్నదో, ప్రతి వొక్క తండ్రికీ అంతే కష్టం....నా మాట నమ్మ....అంతే కష్టం"

ఎంతోసేపు ఒక్క పలుకయినా పలకకుండా వాసిలివెక్ కూర్చున్నాడు. ఆతని మనస్సులోని కలవరమూ, ఆందోళనా కొంచెం కాకపోతే కొంచెమైనా నెమ్మదిస్తేగాని మాట్లాడలేక పోయాడు. చివరికి :

"నిజం. నీవన్నది నూటికి నూరుపాళ్ళు యదార్థం. అతనికీ ఎంతో కష్టమని పెంచి వుండాలి .... అయినప్పటికీ తన రెండో కొడుకుని పంపించాడు....ఎంతో కృతజ్ఞుడను .... సోదరా! నమస్కారం .... ఊ .... భరించాలి .... వేరేమార్గం లేదు .."

నెమ్మదిగా లేచాడు. కమిసారుచేతిని బహు సున్నితంగా ఎత్తి కప్పుకొన్న కంబళీ క్రిందపెట్టి ఒంటినిండా కంబళీ కప్పాడు, వాసిలెవిక్. నిశ్శబ్దంగా గదినుండి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి తిరిగీ కమిసారుకు చాలా తొందరచేసింది. స్పృహ తప్పిపోయింది. పండ్లు కొరికాడు. పెద్దపెట్టున "అమ్మా! అమ్మా!" అంటూ ఇటూ, అటూ తెగపొర్లాడు. ఉన్నట్టుండి కొయ్యబారిపోయి పడుకొనేవాడు. అటువంటప్పు డాతనిచూస్తే ప్రాణం పోయిందనే భయం కలిగింది. తన కొడుకు చనిపోయినతరువాత వాసిలెవిక్ పెద్ద డాక్టరుగదిని వదిలిపెట్టాడు. ఏదో వొక మూల నున్న చిన్న గదిలోనికి మారి, బల్లమీద మైనపుగుడ్డ పరుచుకొని నిద్రించాడు. ఆ రాత్రి కమిసారును చూడటాని కాతనికి కబురుచేశారు. పరీక్షించి కమిసారు మంచంచుట్టూ తెరను కట్టమనిచెప్పాడు. యాభయ్యోనెంబరు గదికి వెళ్లే సమయం దగ్గిరిలోపడ్డదని దీని కర్థం !

కర్పూరం సూదిమందులూ, ప్రాణవాయువూ యిస్తూ పక్కనే కనిపెట్టుకొని వాసిలివెకూ్క, మరొక డాక్టరూ చాలాసేపు కూర్చున్నారు. కమిసారు తిరిగీ స్పృహలోపడ్డాడు. తెలతెల్లవారు తొందనగా వా రిద్దరూ రవంతసేపయినా నిద్ర పోవడానికి తమ గదులకు వెళ్లారు. కన్నీరు కారుస్తూ క్లావ్దియా ఆ రాత్రంతా కమిసారుతో వుంది. అలెక్సీకి నిద్రపట్టలా. "ఇకమీద బ్రతుకదు కాబోలు !"

సనుకొన్నాడు. చాలా దిగులుపడ్డాడు. పండ్లు బిగపట్టి కమిసారు యేదో అంటున్నాడు. అదేదో సరిగా వినిపించింది కాదు. దాహం....దాహం అన్నట్టు వినబడింది.

క్లావ్డియా తెరవెలుపలికి వచ్చి, ఒక గాజు లోటాలో యింత నీరు పోసింది. ఆమెచేతు లదిరిపోతున్నాయి. ఆ లోటా ఎక్కడ క్రిందపడిపోతుందో అనుకొన్నాడు అలెక్సీ. దానిని తీసుకువెళ్ళి కమిసారు కిచ్చింది...కాని దాని నాతడు త్రాగలా....పండ్లు బిగదీసుకుపోబట్టి లోటా టంగున వాటికి తగిలి నీరు తలగడ దిండుమీద చిందింది. సంధిపట్టినవాడి మాదిరి మంచంమీద ఇటూ అటూ దొర్లాడు. ....దాహం ?....ఆ మాట దాహమా?, కాదా?అనే అనుమానం కలిగింది, అలెక్సీకి. చెవియొగ్గి విన్నాడు....దాహం కాదు....ప్రాణం ! .... మరొకసారి విన్నాడు ప్రాణం !....ప్రాణంకొరకు పోరుసలుపుతున్నా డీ మనిషి....అప్పుడే తాను మృతి నొందరాదు....ఇంకా బ్రతకాలి....ప్రాణం ! ప్రాణభిక్ష ! !....మృత్యువుతో యుద్ధం చేస్తున్నాడు !

కమిసారు కొంత సేపట్లో నెమ్మదించాడు. కండ్లు విప్పాడు.

"బ్రతికించావురా, దేవుడా !" అని క్లావ్డియా అతనిచుట్టూ కట్టిన తెరను మడిచి దాచేసింది.

"వద్దు....వద్దు....తెర నట్లాగే వుండనీ....అదుంటే కొంచెం వెచ్చగా నున్నట్టులున్నది ... ఎందుకేడుస్తున్నావు ?... మానవ జీవితాలలో సుఖమూ, దుఃఖమూ రెండూ వుంటాయి...నా సోవియట్ దేవదూతా ! ఎందుకమ్మా ఏడుస్తావు ?...నీవంటి దేవదూతలతోటి పరిచయం...తేలికగా కలగదు కాబోలు... మృత్యుద్వారం చొరబడితేనేకాని మెరుగుపించరు...దురదృష్టులం, మేమంతా..."

# 10

పాదాలు రెండూ లేకపోయినా విమానంలో ఎగరటానికి వీలున్నదని తెలిసిన తరువాత అలెక్సీ తత్త్వం చాలా మారిపోయింది. ఇంతకుముందు భారంగా తోచిన జీవిత మిప్పుడెంతో తీపి అనిపించింది. బ్రతికి చేయవలసిన కార్యాలింకా ఎన్నో ఉన్నాయనీ వాటి నెప్పుడు నెరవేర్చడానికి వీలవుతుందా అనీ ఒకటే ఆతురపడ జొచ్చాడు, అలెక్సీ.

తిరిగీ యుద్ధ విమానంలో ఎగిరి వెళ్లాలనే ఆశ అతనికి కలిగింది. వీలయినంత త్వరలో తానా కార్యమును సాధించడానికి కే యే పను లొనర్చాలో.

ఎట్టెట్టి సామాగ్రిని చేకూర్చుకోవాలో అనే ఆలోచనలో పడిపోయాడు.పూర్వం రెండు కాళ్ళూ పడిపోయినా ఏ విధంగానైనాసరే శత్రువుల చేజిక్కరాదని శపథంపూనాడో యిప్పుడంత గట్టిగానూ విమానమెక్కి తిరిగి యుద్ధంలో పాల్గొనవలెనని శపథం పూనాడు. చిన్నప్పటినుండీ అలెక్సీ స్వభావమే ఇది, ఏది తలపెట్టినా దానిని సాధించే దాకా ఆతనికి వేరొకపని తోచేదికాదు. మొదటి విషయం: ఇన్ని దినాలుగా తిండీ తిప్పలూ లేక, విశ్రాంతి అంటే ఏమిటో తెలియక అష్టకష్టాలూ పడ్డాడు; . కాబట్టి బాగా తిని జీర్ణం చేసుకోవాలి. కావలసినంత నిద్రపోవాలి. రెండోది తిరిగి వైమానికదళంలో చేరడానికి బాగా బలం పట్టాలి. తనకు వీలయినంతవరకూ తగిన కసరత్తు చేయటమవసరం. మూడో విషయం: ఇదే అన్నిటికన్నా చాలా కష్టమైన పని. పాదాలూ, మీగాళ్లూ తనకు లేవు. మిగిలిన కాలిభాగాలను బాగా బలంగా పెంచాలి. ఇంతేకాదు, వాటి నుపయోగించి, పాదాలు లేకపోయినా విమానమును నడపడం నేర్చుకోవాలి. తన కాళ్లు తన చెప్పుచేతలలో నుంచుకోడానికి పూనుకోవాలి.

కాళ్లు, అంటే పాదాలు లేనివాడు నడవటమే ఎంతో కష్టం. ఇక విమానమును, మరీ అందులో పైనికదళ విమానము నుపయోగించుట యెంత కష్టమైన పనో ఆలోచించు. కాని ఈ కార్యమును సాధించటానికే అలెక్సీ సమకట్టాడు. యుద్ధసమయంలో విమానమును నడపాలంటే కాళ్లు పూర్తిగా తన స్వాధీనంలో నుండాలి. పరిస్థితులను కనిపెట్టి వెంటనే తదనుగుణ్యంగా వర్తించాలి. కనురెప్పపాటు ఆలస్యమయినా సర్వనాశనం కావచ్చు. చేతులు పనిచేసినంత చురుకుగానూ కాళ్లు పనిచేయాలి. తన కాళ్లకు తగిలించుకొనే కొయ్యదిమ్మలూ, వాటిని కట్టి బిగించే కట్టుత్రాళ్లూ అచేతన వస్తువులుగా నుండటానికి వీలులేదు. అవి తన శరీరపు రక్తమాంసపు టవయవాల మాదిరి తనతో లయమైపోవాలి. నూటికి నూరుపాళ్లూ తన స్వాధీనంలో నుండాలి.

ఏ వైమానికుడి నడిగినా పైనుదహరించిన పను లన్నీ దుస్సాధ్యమని నిర్మొగమాటంగా చెప్పుతాడు. కాని అలెక్సీ కట్టి వుద్దేశం కలిగిందికాదు. తాను తప్పకుండా సాధించితీరగలననే గట్టి నమ్మకం అతనికున్నది. డాక్టర్లు చెప్పిన మందు లన్నిటినీ పుచ్చుకొన్నాడు. పెట్టిన తిండినంతా, సహించినా, సహించకపోయినా, తిన్నాడు. తనకే ఆశ్చర్యంవేసింది, తన చర్య. ఆకలివేయకపోయినా కూడా మరింత అడిగి పెట్టించుకుతిన్నాడు ఆస్పత్రి నియమానుసారం నిద్రపోవడం నేర్చుకొన్నాడు. మధ్యాహ్న భోజనానంతరం నిద్రపోవటం కొత్తగా అలవర్చుకొన్నాడు. పూర్వ మెప్పుడూ మధ్యాహ్నం నిద్రపోయినపాపాన పోలేదు.

తిండీ నిద్ర విషయమొక ఎత్తూ, కసరత్తు నభ్యసించటం వేరొక ఎత్తూ అయింది. కాళ్లులేక మంచంపట్టిన మనిషికి తా నింతకు పూర్వం చేసిన కసరత్తు యేందుకూ పనికిరాకపోయింది. పడుముమీద చేతులుంచి శరీరాన్ని ముందుకూ,

వెనకకూ వీలయినంత యెక్కువగా వంచటమూ, పడి యెడమలకు వంచటమూ. బలంకొద్దీ తల నిటూ, అటూ వంచటమూ. త్రిప్పడమూ నేర్చాడు. అతని వెన్ను పూసలన్నీ, మెటికలు విరిచినట్లు విరిగేవి. గదిలోనివా రందరూ ఈ చేష్ట లన్నిటినీ చూసి నవ్వేవారు. కుకుష్కిన్ రష్యాలో పేరుపొందిన పహిల్వాను యందరికంటే అలెక్సీది త్వరలో పైచేయి కాక తప్పదని యెగతాళి చేశాడు. ఈ కసరత్తు అంటే కుకుష్కిన్‌కు పెద్ద తలనొప్పి. అలెక్సీ తన కసరత్తు మొదలుపెట్టితే చాలు, కుకుష్కిన్ సణుగుకొంటూ గదినుండి బయటికి వెళ్ళిపోతాడు.

కాళ్ళకు కట్టిన కట్లు విప్పారు. వాటిని కొంత స్వేచ్ఛగా ఆడించటానికి వీలు చిక్కగానే వేరొక పరిశ్రమ కనిపెట్టాడు. మొండికాళ్ళను మంచం పట్టెలో బిగించి, నడుమున చేతులుంచి ముందుకు యెంత వీలయితే అంతవరకూ వంగి, పైకి లేచి, వెల్లకిలా పడుకొనేవాడు. రోజులు గడిచేకొలదీ యీ వంగ టమూ, లేవటమూ నెమ్మదినెమ్మదిగా సాగించి, ఎక్కువ పర్యాయములు చేయటం నేర్చుకొన్నాడు. వెల్లకిలా పడుకొని ఒక కాలును పైకెత్తి, మోకాలును మడిచి, మోకాలుచిప్ప తన గడ్డానికి తాకేటట్టు వంచి, ఒక్కపెట్టున కాలును ముందుకు సాచేవాడు. ఇదేమాదిరి రెండో కాలితోనూ చేశాడు. మొట్టమొదట్లో ఈపని చాలా కష్టమనిపించింది. పాదాలు లేని కాళ్ళను సాచినప్పుడల్లా కాళ్ళ నరాలు జివ్వున లాక్కుపోయెడివి. కాళ్లు వణికేవి. సాగననేవి. ఏ తోకో, లేక ఏ రెక్కో విరిగిన విమానమును నడిపించట మెంతకష్టమో, అంతకంటే ఎక్కువ కష్టమనిపిం చింది, తన కాళ్లను స్వాధీనపర్చుకొనటం. తానెంత యత్నించినప్పటికీ అన్ని అవయవాలూ వున్న శరీరంమాదిరి తన శరీరం పనిచేయజాలదని అతనికి తోచింది. కొరతకొరతగానే వుంటుంది కాబోలు!

కాళ్ల కసరత్తు చెప్పనలవికానంత నొప్పిని కలిగించినప్పటికీ ప్రతిరోజూ, ఒక రోజుకంటె రెండోరోజు ఎక్కువసేపు చేయటం నేర్చుకొన్నాడు. కండ్లు నీరు క్రమ్మేవి. పెకలించుకు బయటపడాలన్న ఏడ్పును పండ్లు బిగబట్టి, పెదవులను పుండ్లయ్యేటట్లు కరుచుకొని దిగమ్రింగేవాడు. కొద్దిరోజులు దినానికొక మారే కస రత్తును చేసి, క్రమంగా రెండు పర్యాయములు చేయడానికి నేర్చుకొన్నాడు. ఒక్కొక్క పర్యాయమూ అది ముగియటంతోటే, సొమ్మసిలిపోయి వెల్లకిలా పడిపోయేవాడు. తిరిగీ చేయడానికి తనకు శక్తి లేదనిపించేది, అటువంటపుడు. కాని తిరిగీ కసరత్తు చేయవలసిన సమయం రాగానే నిర్దాక్షిణ్యంగా ఆ పనికి పూనుకొనేవాడు. రోజులు గడిచేకొలదీ మెత్తగా దూదిపింజవంటి కండరాలు బిగువెక్కటానికి ప్రారంభిం చాయి పెద్దవిగా పెరగజొచ్చాయి. ఇది చూచి అతనికి కలిగిన సంతోషం ఇంతా, అంతా కాదు. పూర్వంమాదిరి తన కాళ్ళల్లో కండలు తేలి కనిపించాయి.

అతని మనస్సంతా ఎప్పుడూ కాళ్ళల్లో నుండేది. ఒక్కొక్కపుడు తన పాదాలలో ఏదో మంటగా నున్నట్టు లనిపిస్తే యీ కాలును తీసి ఆ కాలుమీద

వేసేవాడు. అప్పుడుగాని తనకు పాదాలే లేవని తెలిసేదికాదు. లేని పాదాలు కుంటలుపెట్టాయని తనకు భ్రమ కలగడాని కాత ఎంతో ఆశ్చర్యపడ్డాడు. పాదాలు తడిసినట్టూ, గిలిగింతలు పెట్టినట్టూ ఆతని కనేక పర్యాయములు భ్రమ కలిగింది. తన మనస్సూ, శరీరమూ యింకా ఆ పాదాలను మరిచిపోలేదు కాబోలు! రాత్రిళ్ల నిద్రలో అతనికి పాదా లున్నట్టూ, వాటిపై త్వరత్వరగా నడిచి వెడుతూన్నట్టు కలలు కన్నాడు. "సంసిద్ధంగా నుండు"మని విమానాశ్రయపు యంత్రం కూసినట్టూ తాను వడివడిగా పరుగెత్తి తన విమానం రెక్కపై కెగిరి కూర్చొని, నడిపించే చోటుకు జారి కూర్చున్నట్టూ, పాదాలతో మీటల నొక్కగానే యూరా పరుగెత్తి వచ్చి, విమానపు టింజనుకుకప్పిన మైనంబుట్టను తీసివేసినట్టూ కలలు కన్నాడు. మరొకపుడు వోల్గానది గట్టిమైదానంలో రంగురంగుల పూవులమధ్య తానూ, ఓల్గా చేయీ చేయీ జోడించి పాదాల కెట్టి చెప్పులూ లొడుక్కోకుండా పరుగెత్తి ఆనందంగా కాలం గడిపినట్టు కల వచ్చింది. ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. నిద్ర లేచి చూసుకొంటే మొండికాళ్లు! పాదాలులేని మొండిబ్రతుకు!!

ఇటువంటి సమయాల్లో అలెక్సీ అధఃపాతాళంలోకి దించుకుపోయేవాడు. తానుచేసే కసరత్తులూ, తినే తిండ్లూ వృథా. పనిలేక శరీరాన్ని వేధించడంతప్ప. తన కెట్టి ప్రయోజనంగానీ లే దనుకొన్నాడు. విమానంలో ఎగరటం ఈ జన్మలో కుదరనికార్యం. ఓల్గాతో పరుగులిడి ఆడుకొనటం తలుచుకొంటే తన నిస్సహాయ తకు తానే అవమానపడ్డాడు. తన అశక్తత విదితమయ్యేకొలదీ ఓల్గామీది ప్రేమ ఇనుమడించింది, రోజులు గడిచేకొలదీ ఆమెపై ఆశ అంతులేకుండా పెరుగుతోంది.

ప్రతి నాలుగుదినాల కొక పర్యాయమూ క్లావ్దియా అతనిదగ్గిరికి వచ్చి ఉత్తరాలకొరకు 'నృత్యం' చేయమనేది. మంచంమీద కూర్చుని చేతులూ, కాళ్ళూ కదిలించీ, చప్పట్లు కొట్టి నవ్వితేనేగాని వాటి నిచ్చేదికాదు. ఓల్గానుండి ఇప్పుడు వచ్చే జాబులు మునుపటికంటె చాలా ఎక్కువపుట లుంటున్నాయి, ఇంతవరకూ ఎక్కడో, ఆమెలో, ఆమెకు తెలియకుండానే వున్న ప్రేమ, తనమీది ప్రేమ, మేల్కొని ఆమెను కూర్చోనిచ్చిందికాదు, నిలుచోనిచ్చిందికాదు. అపారమైన ఆ ప్రేమకు తన కెట్టి అర్హతగానీ లేదని అలెక్సీకి తోచినది. ప్రేమ వుట్టిపడేటట్టు లుండే ఆ జాబులను యెంత చదివినా అతనికి తృప్తికలిగిందికాదు.

తన చిన్నతనంలో రంపపు యంత్రశాలలో చేరి చదువుకొన్నవా రందరూ కొంత కాలానికి అచ్చటినుండి వెళ్ళిపోయారు. చదువుకొనే రోజుల్లో అశుభమూ శుభమూ తెలియని ఆ అమాయకపు రోజుల్లో తమ స్నేహమును ప్రేమ అనుకొనే వారు. పెద్దవారైన పిదప తమ ఆశయాలను నెరవేర్చుకొని సుఖంగా నుండాలని కలలు కన్నారు. అచ్చటినుండి వెళ్ళిపోయిన తరువాత చాలామంది ఒకరి నొకరు తిరిగి కలుసుకొనేలేదు. వారి వారి పనులమీద ఎక్కడెక్కడికో వెళ్ళిపోయారు. ఓల్గా వేరొక కళాశాలలో చదవటానికి వెళ్లింది. ఆమె తిరిగి వచ్చేలోగా, అలెక్సీ

ఒంపపు యంత్రశాలనుంచి వెళ్ళిపోయాడు. విమాన కళాశాలలో చేరాడు. తిరిగీ, ఇక కొద్ది రోజులలో యుద్ధం ప్రారంభమవుతుందనగా వారు కలుసుకొన్నారు. ఈ విధంగా సంభవించాలని వా రనుకోలేము. తలవని తలవంపుగా కలుసుకొన్నారు. ఒక దినం అలెక్సీ తన తల్లితో ఎక్కడికో వెడుతూంటే ఎవరో ఒక అమ్మాయి ఎదురువచ్చింది. ఆ అమ్మాయి నాతడు చూడనన్నా చూడలేదు. నడిచివెళ్ళే ఆ కాళ్లు బహు సొగసుగా నున్నాయనిమాత్రం అనుకొన్నాడు.

"ఆ అమ్మాయి నెందుకు పలుకరించావుకావు? అది ఓల్గా" అన్నది తల్లి.

అలెక్సీ వెనుతిరిగి చూశాడు. సరిగ్గా అదే సమయానికి ఓల్గాకూడా వెనుతిరిగి చూసింది. ఒక్క పరుగున వెళ్ళి, "నీవా?" అన్నాడు. ఏదో అప్సరసను చూస్తూన్నట్లూ, ఇంతకుముం దెన్నడూ తన కగుపించని ఆకర్షణీయమైన దేదో ఆమె ముఖంలో కనిపించినట్లూ, ఆమెవంక రెప్పవాల్చకుండా చూసాడు.

"అలెక్సీయా!" అని, ఆ అమ్మాయికూడా విస్తుపోయి అతనివంక చూసింది.

ఏ ఆరు, ఏడు సంవత్సరాల తరువాతో తిరిగీ ఇప్పుడు కలుసుకొన్నారు. ఓల్గాలో యౌవ్వన లక్షణాలూ, శృంగారమూ, లావణ్యమూ కనపడుతున్నాయి. గుండ్రటి ముఖమూ, ముక్కుమీద ముద్దొస్తూ కనిపించే ఒకటి రెండు పుట్టుమచ్చలూ, ఇంతలేసి కళ్లుచేసుకొని. కనుబొమ్మలెగురవేస్తూ అతన్ని చూసింది. చిన్నప్పుడు, చాలీచాలని కోటు తొడుక్కొని ఎర్రగా కందిన గుండ్రని ముఖముండే తనతో చదువుకొన్న అమ్మాయికీ, ఇప్పుడు తన యెదుటనిలబడిన ఈ యుక్తవయస్సు వచ్చిన జవరాలికీ అలెక్సీ కెటువంటి పోలికా కనిపించిందికాదు.

తన తల్లి తనకొరకు కనిపెట్టుకొని వున్నదన్న సంగతే మరిచిపోయి, ఆ ఓల్గానుచూస్తూ నిలబడ్డాడు. ఇన్ని సంవత్సరాలుగా ఆమెను చూడకపోయినప్పటికీ, ఆమె స్వరూపం ఎప్పుడూ తన హృదయంలో నుండేదని అలెక్సీ కిపుడు జ్ఞప్తికి వచ్చింది.

"అంటే నీవిప్పుడింతగా మారిపోయావన్నమాట" అన్నాడు, అలెక్సీ.

"ఇంతగా అంటే?" అని ప్రశ్నించిదామె. పూర్వపు కీచుకంఠస్వరం మారిపోయింది. ఇప్పుడందులోనిండు తనం కనిపించింది.

ఉన్నట్టుండి చెట్ల ఆకుల్లో ఈల లూదుకొంటూ గాలిలేచి దూసుకుపోయింది. ఓల్గా తొడుగుకొన్న గౌను గాలికి పైకి ఎగరబోతూంటే, చటుక్కున దానిని పట్టుకొన్నప్పుడామె ముఖమంతా కందిపోయింది. ఇంతటి సిగ్గు ఓల్గాలో కనిపించటం అలెక్సీకి ఆశ్చర్యం వేసింది.

"అదిగో ఆ మాదిరి, మారిపోయావు" అన్నాడు, అలెక్సీ.

"ఆమాదిరంటే?" అని ఓల్గా రెట్టించి అడిగింది.

దూరాన నిలబడిన తల్లి వారిద్దరినీ చూసి తనలోతానే సంతోషపడింది. చిరునవ్వు ముఖంతో అచ్చటినుండి నెమ్మదిగా నడిచివెళ్ళింది. వా రిద్దరికీ ఈ విషయం

తెలియదు. ఒకరితో నొకరు మాట్లాడుకొంటూ, ఒకరిమాట కింకొకరు అడ్డువచ్చి గుక్క త్రిప్పుకుండా ఏవేవో చెప్పుకొంటూ నిలబడ్డారు. "చూడు....నీకు జ్ఞప్తి వున్నదా?...", "అప్పుడే మరచిపోయావా?...", "...ఎక్కడున్నాడు?", "...నిగురించి ఏదయినా నీకు తెలుసా?" అంటూ జంటపిచ్చుకల్లాగా కిచకిచ లాడారు.

ఈ విధంగా ఎంతసేపు నిలబడ్డారో వారికే తెలియదు. తరువాత, "ఆ కని పించే ఇండ్ల కిటికీలవంక చూడమని" ఓల్గా అన్నది. వారిద్దరినీ చూస్తూ కిటికీల వెంట నిలబడిన మనుష్యులు వారికి కనుపించారు. "తొందరగా వెళ్లిపోవాలా?" అని ప్రశ్నించింది. ఓల్గా.

"ఎందుకు?" అన్నాడు.

"వెళ్ళనక్కరలేకపోతే, వోల్గా నదీతీరానికి వెళ్ళవచ్చుగా? ఎంతో బాగుం టుంద"న్నదామె.

చెట్టాపట్టాలు పట్టుకొని, గాలిమీద తేలిపోతూన్నట్లు వారిద్దరూ నడిచివెళ్లారు. తమ చిన్నతనంలో ఒక్కమారయినా ఈ విధంగా ఒకరిచేతు లింకొకరు పట్టుకొని ఎన్నడూ నడిచారు కాదన్నది అలెక్సీకి జ్ఞప్తికి వచ్చింది. వోల్గా నదీతీరమందున్న గుట్టపైకెక్కి నిలబడ్డారు. అక్కడినుండి నదీ, దానిమీద తేలివెళ్లే పెద్ద మంచు గడ్డలూ చూపుమేరవరకూ కనిపించాయి.

ఆ రోజునుండీ అలెక్సీ చాలా మారిపోయాడు. తరుచుగా ఇంట్లో నుండే వాడు, పూర్వం, ఇప్పుడో రింపపు యంత్రాగారంనుండి ఓల్గా సాయంకాలం తిరిగి వచ్చే సమయానికెదురు చూస్తూ వుంటాడు. పూర్వం ఏ చొక్కా తొడుగుకొన్నా, ఏ షరాయి తొడుగుకొన్నా సరిపోయింది. కాని ఇప్పుడు ఇస్త్రీ చేసిన మడతలు తప్ప వేరే దుస్తులను తాకడు. తన కోటు గుండీలకు సీమసున్నంపట్టించి తళతళా మెరిసేటట్టు తోముతాడు. అప్పు డప్పుడే పెరిగే గడ్డమును, రోజు విడువక ప్రతి రోజూ క్షౌరం చేసుకొంటాడు. తన వైమానికటోపీని తల కొక ప్రక్కగా పెట్టు కొని షోకిల్లాలాగా తయారవుతాడు. అద్దంయెదుట నిలబడి ఇటు తిరిగీ, అటు తిరిగీ తొడుగుకొన్న దుస్తులనూ, దువ్విన తలనూ పలుమారు సరిచేసుకొంటాడు. పగటిపూట కూడా వున్నట్టులుండి యెక్కడికో కనిపించకుండా వెడతాడు. ఎక్క డికి వెళ్ళావురా. నాయనా అంటే ఏదో వొక సాకు చెబుతాడేకాని, సరియైన జవా బీయడు. దీనికి కారణమేదో ఆ తల్లికి తెలియకపోలేదు. పూర్వ మంతగా తన మంచిచెడ్డలను గమనించటంలేదని ఆమెకు అనిపించింది. కాని వొద్దస్తమానమూ పెద్దవారినే కనిపెట్టుకొనివుంటే చిన్నవాళ్ళు తాము పెరగనేరరన్న విషయం గ్రహించి, ఊరడిల్లింది.

ఒక్కమా రయినా తమ ప్రేమనుగురించి వారు మాట్లాడుకోలేదు. వాల్గానదీ తీరాన వా రిద్దరూ సూర్యాస్తమయశోభను తిలకిస్తూ కూర్చునేవారు, లేదా ఊరి

వెలుపల పుచ్చకాయల పొలాల్లో తిరిగేవారు. నల్లని ఆకుపచ్చరంగూ, వాటిమీద చేతివ్రేళ్ళను జాపినట్లగుపించే తెల్లని చారలూ గల వాటి ఆకులమధ్య వాటిని త్రొక్కకుండా తిరిగేవారు. అతని సెలవురోజులు అయిపోవస్తున్నాయి. అవి ముగిసేలోగా ఓల్గాకు తన ప్రేమనుగురించీ, తన ఆశలనుగురించీ చెప్పాలని ఎన్ని పర్యాయములో అనుకొన్నాడు. కాని చెప్పలేకపోయాడు. సాయంకాలం ఓల్గా తన పనినుండి యింటికివచ్చే సమయానికి యంత్రశాల గేటువద్ద అలెక్సీ కాచుకొనివుండేవాడు. ఆమెతో అద్దెకు తీసుకొనిన చిన్న గదికి వెళ్ళేవాడు. సున్నంకొట్టిన దాని తెల్లని గోడలను చూసినప్పుడల్లా అతనికి తన విమానంలోని గదులు జ్ఞాపకానికి వచ్చేవి. అలెక్సీ కుర్చీమీద కూర్చునేవాడు. ఒకప్రక్కగా నొక బట్టతెరను అడ్డంగా కట్టి దానినొక చిన్న గదిగా నుపయోగిస్తుంది ఓల్గా. ఆమె దాని వెనుకకు బట్టలు మార్చుకొని, ముఖం కడుక్కోడానికి వెళ్ళేది. ఆమెకొరకు కనిపెట్టుకొని కూర్చుంటే అతనికి ఆ తెర అడుగునుండి ఆమె కాళ్ళు, దాదాపు మోకాళ్ళవరకూ కనిపించెడివి. భుజాలూ, మెడాకూడా, ఎంత వద్దనుకొన్నా చూడ మన్నట్టులా తెరపైనుండి కనిపించేవి. వాటిని చూడకుండా వుండలేకపోయాడు. ఎదవ ముఖమూ, చేతులూ సబ్బుతో రుద్ది కడుగుకొని తల దువ్వుకొని బయటికి వచ్చేది. తెల్లవారుఝామున మంచుపడి తడిసిన గులాబిపూవుమాదిరి తాజాగా కని పించేదని, అలెక్సీ తనలో తాననుకొనేవాడు. తెల్లని పట్టుజాకెట్టు తొడుగు కొన్నప్పుడల్లా అతనికండ్లు రెండూ దానిమీదే నిలబడేవి.

సినిమాకూ, సర్కస్సుకూ, లేక ఉద్యానవనానికీ వెళ్లేవారు. ఎక్కడికి వెళ్లినా, అన్నీ అలెక్సీకి ఒకేమాదిరి వుండేవి. అతడా తెరవంకనో, లేక సర్కస్సు చేసేవారివంకనో, లేక వనంలో విహరించేవారినో చూస్తేగా, ఇది బాగుందీ, అది బాగాలేదని అనడానికి: ఎప్పుడూ ఆతని నేత్రాలామెను తప్ప మరోదానిని చూశాయికావు. అటువంటపుడు, "ఏమయినా సరే ! నేటిరాత్రి ఇంటికి వెళ్ళేటప్పుడు నేను ప్రేమిస్తున్నానని తప్పక చెప్పి తీరుతాన"ని నిశ్చయించుకొనేవాడు. వెళ్ళేరోడ్డు ఓల్గా గదిముందు వచ్చి నిలిచేది. అలెక్సీ మనోనిశ్చయం. మనస్సులోనే కాపుర ముండేది.

ఒక అదివారంరోజు ప్రొద్దునపూట వారిద్దరూ కలిసి వాల్గానది అవతలిగట్టుకు షికారు కెళ్ళారు. తెల్లని పంట్లాముమీద, అందమైన మెడ తెరుచుకొనిన షర్టు తొడుగుకొన్నాడు, అలెక్సీకి. ఎంతో ముచ్చటగా నున్న దా షర్టు అని తల్లి మెచ్చు కొన్నది: తాను ఆమె యింటికి వెళ్లేటప్పటికి ఓల్గా సిద్ధంగా అతని రాకకెదురు చూస్తూ వున్నది. చిన్న తువ్వాలులో చుట్టిన పొట్లమొకటి చేతికందిచ్చింది.

ఇద్దరూ బయలుదేరారు. వోల్గానది గట్టునున్న పడవ నొకదాని నేర్పాటు చేసారు. పూర్వమేదోవొక యుద్ధంలో గాయపడి కాళ్ళు రెండూ నరికివేశారు, ఆ సరంగుకు. నేలమీద దేక్కొంటూవెళ్ళి పడవను ఒడ్డుకు వట్టాడు. చిన్నతనంలో

వోల్గానదిలో చేపలు పట్టటం, అలెక్సీ ఇతని దగ్గరే నేర్చుకొన్నాడు. అప్పటి వాళ్ళందరికీ ఈ మనిషంటే ఎంతో జాలి, ప్రేమా. ఓల్గా పడవ వెనకప్రక్క కూర్చొని నీటిలో చేతినిదింపి, పరధ్యానంగా కూర్చున్నది. పడవ వోల్గానదికి ఐమూలగా పోయి, పచ్చని గరిక పెరిగిన అవతలిగట్టు చేరింది. వారు వెడుతొంటే అలెక్సీ పడవ నడిపేవానితో :

"అర్కాషా మావయ్యా ! నే నెవరో గుర్తున్నదా ?" అన్నాడు.

వారివంక చూడకుండానే, "తెలియద"న్నాడు.

"ఏమి మాటలు ? నా పేరు అలెక్సీ. చిన్నప్పుడు నాకు చేపలను పట్టడం నేర్పావు, జ్ఞాపకం లేదా ?"

"నేర్పితే నేర్పివుండవచ్చు. ఎప్పుడూ ఎంతోమంది కుర్రకుంకలు ఇక్కడే వుండేవారు. వాళ్ళందరూ జ్ఞాపకముంటారా ?"

ఇంతలోకే పడవ అవతలిగట్టును సమీపించింది. సరంగు, "ఇంతవరకే నేను వెళ్ళడానికి వీలున్నది. దీనికి పైగా వెళ్ళాలంటే లైసెన్సు కట్టాలి. నాకు లైసెన్సు లేదు. కాబట్టి మీరిక్కడ దిగండి" అంటూ పడవను ఒడ్డుకు చేర్చబోయాడు. అతని కొయ్యకాలు ఇసుకలో దించుకుపోయింది. అంతకంటే పడవ ఒక్క అడుగయినా కదలనని నిలబడింది. "దుమికేయండ"న్నాడు, అర్కాషా మావయ్య.

"ఎంత ఈయమంటావు ?" అని అలెక్సీ అడిగాడు.

"నీకు తోచినంతా, మంచి సరదాగా కనిపిస్తున్నారు మీరిద్దరూ కాబట్టి, రవంత ఎక్కువగానే ఇస్తే బాగుంటుంది. నీ వెవరో జ్ఞాపకం రావటంలా, నిజంగా జ్ఞాపకంలేదు."

కాళ్లు తడిసినా ఫరవాలేదు. చెప్పులుతీయటం మంచిదన్నది ఓల్గా. పాదాలు నీటిని తాకాయి. మెత్తని తడిమట్టిలో దిగగానే వా రిద్దరికీ యెక్కడలేని ఆనందమూ కలిగి చెప్పులు లేకుండా నది గట్టు గడ్డిలో చిన్నపిల్లల్లాగా పరుగెత్తి, గంతు లేయా లనిపించింది.

"ఏదీ ! నన్ను ముట్టుకో"మని ఓల్గా గడ్డిమీద పరుగెత్తింది.

అలెక్సీ ఆమెవెంట బడ్డాడు. రంగుపూవుల ఆమె గౌనుమాత్రం దూరాన అక్కడక్కడ చెట్ల సందుల్లో కనిపించింది. మెత్తని గడ్డిపూల మొక్కలూ గుబురులా పెరిగిన ఆ నేలమీద పరుగిడుతుంటే పాదాలు గిలిగింతలుపెట్టాయి. తన భావిభాగ్యోదయమంతా పరుగిడివెళ్ళే ఓల్గాను పట్టుకొనటంమీదే ఆధారపడినట్లాతనికి తోచింది. ఆ పచ్చని గరికభూమిలో, పుష్పసౌరభభరితమైన గాలివీచే ఆ ప్రదేశంలో తన మనోభీష్టము నామెకు తెలుపడానికే నిశ్చయించుకొన్నాడు. ఏలాగయినా సరే ఆమెను పట్టుకొనితీరాలి. చేతికందేటట్లగుపించి అలెక్సీ చేయి జాపేటంతలో లేడిపిల్లలాగా ఛెంగున నొకప్రక్క కురికి, గల గల నవ్వుతూ పరుగెత్తింది ఓల్గా.

ఏమయినా సరే ఆతని చేతి కందకూడదని ఓల్గా అనుకొన్నది. ఇది గ్రహించి, అలెక్సీ ఆమెను తరుముకొని వెళ్ళటం మానుకొని నిలబడ్డాడు. అంతట ఓల్గా నదీతీరానికీ పరుగిడి మెత్తటి ఇసుకలో బోర్లపడుకొన్నది. స్వచ్ఛమైన ప్రాతః కాలపు చల్లని గాలిని పీలుస్తోంటే తదనుగుణ్యంగా చలించే ఆమె కుచద్వయం అలెక్సీ దృష్టి నాకర్షించింది. గడ్డిమీద ఆకాశంనుండి రాలిన నక్షత్రాలమాదిరి డైజీ పూవు లగుపించాయి. వాటి మధ్య కూర్చున్నప్పు డాత డెన్నో ఛాయా పటాలా మెరి తీసాడు. తరువాత వా రిద్దరూ ఓల్గా నదిలో దిగి కేరింతలు కొడుతూ, యీదులాడుతూ యెంతోసేపు స్నానం చేసారు. గట్టుకు వచ్చాక అలెక్సీ ఒక చెట్టు వెనుకకు వెళ్ళి అటు తిరిగి నిలుచున్నాడు. ఓల్గా తలా, ఒళ్ళూ తుడుచుకొని బట్టలు మార్చుకొన్నది.

రమ్మని ఓల్గా పిలిస్తే అలెక్సీ వెనుతిరిగి, చెట్టుచాటునుండి వచ్చాడు. పల చన గౌను తొడుగుకొని తలకొక టర్కీ తువ్వాలు చుట్టుకొని ఓల్గా ఇసుకలో కూర్చొన్నది. మూటకట్టి తెచ్చిన చిన్న తువ్వాలును నేలమీద పరిచి, గాలికి ఎగర కుండా నాలుగుమూలలా గులకరాళ్లుంచి; తీసుకువచ్చిన తినుబండములను దానిపై పరిచింది. పండ్లూ, నూనెకాగితంలో జాగ్రత్తగా చుట్టితెచ్చిన వేపుడుచేపలూ, తాను స్వయంగా తయారుచేసిన బిస్కత్తులూ తిన్నారు. విడి విడి సీసాలలో పొడి ఉప్పూ, ఆవాలపొడీకూడా, మరిచిపోకుండా తెచ్చింది. ఆ అమ్మాయి చూపే అతిధి సత్కారానికి అలెక్సీ ఉప్పొంగిపోయాడు. "ఇంతకుమించిన మంచితరుణం రాబోదు. తప్పకుండా నా ప్రేమను ఓల్గాకు వ్యక్తపరుస్తాను. ఇక్కడినుండి వెళ్ళిపోయే ముందు తప్పకుండా నన్ను పెండ్లాడటానికి అంగీకరింపచేస్తాను. ఒప్పించితీరుతా" నని అనుకొన్నాడు.

ఆ మెత్తటి ఇసుకలో వెచ్చగా మీదపడే ఎండలో ఎంతోసేపు వారిద్దరూ పడుకొని కబుర్లు చెప్పుకొన్నారు. మరొకసారి స్నానంచేసి, తిరిగీ సాయంత్రం ఓల్గాగదిలో కలుసుకోడానికి ఏర్పాటుచేసుకొని బయలుదేరారు. చాలా అలిసి పోయారు. కాని ఆ అలసటలోనే ఆనందమున్న దనిపించింది. ఓరేవున చేరి అర్కాషాను పిలిచారు. పిలిచీ పిలిచీ వారి గొంతులు పూడిపోయాయి. దూరపు గడ్డిమైదానంలో సూర్యు డస్తమిస్తున్నాడు. అతని అస్తమయకిరణాలు నదికవతలి గట్టుననున్న కొండమీదపడి అదంతా ఎర్రగా ప్రకాశించింది. నగరపుటిండ్ల కిటికీల నుండి దీపాలొకటొకటిగా తొంగిచూశాయి. అంతటా నిశ్శబ్దం ఉక్కపోస్తోంది. సాధారణంగా ఏకొద్దిమందో మాత్రం వీధుల్లో ఇటువం టప్పుడగుపిస్తారు. కాని నేడెందుకనో జనం క్రిక్కిరిసి వీధులమీద కనిపించారు. జనులతో నిండిన రెండు మోటారుట్రక్కులు రివ్వున వెళ్లాయి ఆ రోడ్డు మీద. కొందరు జనులు, ఎవరో తెలియదు, సైనికదళం మాదిరి నడిచి వెడుతున్నారు.

"అర్కాషామానయ్య త్రాగి వుంటాడు. అందుకనే ఎంతపిలిచినా రావటం లేదు: ఓల్గా! ఒకవేళ ఈ రాత్రంతా ఇక్కడే గడపవలసి వస్తుందేమో," అన్నాడు అలెక్సీ.

"నీవుంటే, ఎక్కడున్నప్పటికీ నాకెట్టి భయమూ లేదు," అంటూ ఆతని కండ్లల్లోకి చూసిందామె. చేయిజాచి ఓల్గాను తన చెంతకు తీసుకొన్నాడు. గాఢంగా తన వక్షానికి హత్తుకొని ఆమె పెదవులు ముద్దు పెట్టుకొన్నాడు. ఇదే ఆ అమ్మాయిని ముద్దు పెట్టుకొనటానికి మొదటిసారీ, ఆఖరుసారీకూడా. నీటిలో పడవ తెడ్డుల శబ్దం వినబడింది. పడవనిండా మనుష్యులగుపించారు. పానకంలో పుడకలాగా ఈ పడవ ఇప్పుడే రావాలా అనిపించింది. విడివడిపోయి వచ్చే పడవను సమీపించారు. అనిర్వచనీయమైన భయం, తమకు తెలియనిదేదో వొక ఆదుర్దా వారికి కలిగింది, వచ్చే పడవను చూస్తే.

దానినిండా పక్కని తెలవుదినాల దుస్తులు, తొడుగుకొన్న మనుష్యులగుపించారు. కాని, ఎందుకనో వారి ముఖాలు కళావిహీనంగా కనిపించాయి. నిశ్శబ్దంగా వారంతా పడవ దిగి గట్టుకు వచ్చారు. వడివడిగా ఆదుర్దాగా వారంతా పడవ దిగిదిగటంతో, వీరిని పలకరించకుండా వెళ్ళ నారంభించారు. స్త్రీల కండ్లు ఎర్రబారి కన్నీరు క్రమ్ముకొన్నాయి. ఏమిజరిగిందో వీరిద్దరికీ అర్థం కాలేదు. వెళ్లి పడవలో కూర్చున్నారు. వారివంక చూడకుండా అర్కాషామామయ్య పెడముఖం పెట్టి:

"యుద్ధం !! మాలొటావ్ నేటి వుదయం రేడియోలో చెప్పాడు"అన్నాడు.

"యుద్ధమా ?....ఎవరితో ?....నని అలెక్సీ అమాంతంగా లేచి నిలబడ్డాడు.

"ఇంకెవరితో ? తిరిగి అదే ఫాసిస్టు గాడిదలతో" అన్నాడు, అర్కాషా. "జనులందరూ యుద్ధంలో చేరడానికి అప్పుడేవెళ్లారు. ప్రొద్దుననుండీ ఒకటే హడావుడి, నగరమంతటా"

తిన్నగా. ఇంటికన్నా వెళ్ళకుండా, అలెక్సీ యుద్ధకార్యాలయానికి వెళ్లాడు. ఆ రాత్రి పండ్రెండున్నర రైలులో ప్రయాణం, వైమానిక దళంలో చేరడానికాతని నియమించారు. త్వరగా ఇంటికి పరుగిడి, ఇన్నిబట్టల నొకపెట్టెలో సర్దుకొనడానికే వ్యవధిచాలింది కాదు. ఓల్గాతో వెళ్లివస్తానని ఒక్కమాటయినా చెప్పలేక పోయాడు.

ఎప్పుడో వొకపుడు మాత్రం వారిద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఇందువల్ల వారి అన్యోన్య ప్రేమా. ఆకర్షణా క్షీణించాయని అనుకోరాదు గుండ్రని అక్షరాలు, బడిపిల్లలు వ్రాసినటులుండే ఓల్గా జాబుల కెదురుచూసేవాడు. వాటిని భద్రంగా తన కోటుజేబులో నుంచుకొని, తీరిక చిక్కినప్పుడల్లా చదువుకునేవాడు. అడవిలో ఒంటరిగా దొర్లుకొంటూ వచ్చే దినాలలో ఇవే జాబులాతని హృదయానికంట కరుచుకొని ఎక్కడలేని ధైర్యాన్ని కలిగించాయి. వారిద్దరికీ

అకస్మాత్తుగా ఎడబాటు సంభవించటం మూలాన, ఈ జాబులలో ఏదో పురాతన స్నేహితులు ఒకరి కొకరు వ్రాసుకొన్నట్టు వ్రాసుకొనేవారేకాని, వారిద్దరిహృదయాలలోనున్న అన్యోన్యానురాగమును గురించీ, వారుకనెడి తీయని కలల గురించీ ఒక్కమాటయినా వ్రాయడానికి ధైర్యం చిక్కిందికాదు. ఎవరివుద్దేశాలు వారి హృదయంలోనే వుండిపోయాయి.

ఆస్పత్రిలోనుండగా ఆమె దగ్గిరినుండి వచ్చే వుత్తరాలనుచూస్తే అలెక్సీ కెంతో దిగులయ్యేది. ఇప్పుడిప్పుడు వచ్చే వుత్తరాల్లో ఓల్గా తన మనస్సువిప్పి వ్రాయుటం ప్రారంభించింది. ఆనాడు అర్కాషా మావయ్య అప్పుడే రాకపోతే ఎంతో బాగుండేదట తనకెట్టి కష్టం వచ్చినప్పటికీ అధైర్యపడనక్కరలేదు. తన మేలు నాశించి, సతనిత్యం తనకొరకు కనిపెట్టుకొనివుండే వ్యక్తి, ఒకామె కలదన్న సంగతి మరిచిపోవద్దు. పరాయి దేశాలలో తిరిగేటప్పుడు తనకొక ఇల్లూ వాకిలీ వున్నాయనీ, యుద్ధానంతరం వచ్చి దానిలో, తన రాకకెదురు చూసేవారితో కలసి వుండాలనేదీ మరిచిపోవద్దు. ఈ విధంగా ఓల్గా తనకు వ్రాయగలదని అలెక్సీ కలలోకూడా అనుకోలేదు. ఆమె చిత్రాన్ని చూసినప్పుడల్లా, పెద్ద గాలివేస్తే జిల్లేడు కాయనుండి ఎగిరివెళ్ళే గింజలమాదిరి, ఓల్గా ఎగిరిపోతుందేమోననేది విచిత్ర పుటాలోచన ఒకొక్కపుడాతని ప్రాణాలనుపట్టి పీడించేది. ఈ వుత్తరాలు, వ్రాసేది ఎవరో సాధారణ స్త్రీ కాదు—తన కొరకు పంచప్రాణాలూ బిగబట్టి ఎదురు చూసే నారీరత్నం. తన ప్రియుని రాకకెదురుచూస్తూ ఇంటి గుమ్మానికానుకొని కలలుకనే కళావతి, ఓల్గా. ఇది తలచుకొంటే ఆతనికి చెప్పనలవికానంత సంతోషం కలిగేది. కాని తన కట్టిస్త్రీని సుఖపెట్టగల అర్హతలేదని దిగులుపుట్టి, తానామె జోలికి పోరాదని బుద్ధిచెప్పుకొనేవాడు. ఆమె అనుకొనేటట్టు తాను సర్వాంగసుందరుడు కాడనీ, వికలాంగుడనీ, అర్కాషా మావయ్యాలాగా పాదాలు లేని కుంటివాడనీ వ్రాయాలని ఎన్నో పర్యాయములు అనుకొనీ, తీరా వ్రాయిడానికి చేతులురాక, ఊరుకొన్నాడు. నిజంతెలిస్తే తన తల్లి ఎక్కడ చనిపోతుందోననే భయంకొద్దీ, ఓల్గాకుకూడా ఒక్క మాటయినా వ్రాయలేదు. తానామె నీ విధంగా మోసగించటమాతని కెంతమాత్రమూ గిట్టిందికాదు. కాని ?....

కామిషిన్ నుండి వచ్చే జాబులాతని మనస్సును కలిచివేసేవి, సంతోషమూ, దుఃఖమూ ; ఆశా, నిరాశా ; ఒకేసారి ఇట్టి విరుద్ధ భావాలకులోనై చెప్ప జాలనంత కష్టము ననుభవించేవాడు. అబద్ధాలకు కాళ్ళు. లేవంటారు. కాబట్టే ఒక అబద్ధాన్ని నిలబెట్టడానికింకా అబద్ధంకావాలి. చూస్తూ చూస్తూ తెగఅబద్ధాలాడటానికి జంకి ఓల్గాకు వ్రాసేజాబులన్నీ ముక్తసరిగా వ్రాయటం నేర్చుకొన్నాడు. అట్టి జాబులా బాలిక హృదయమ్మును నెంత పుండుచేస్తాయో అతనికి తెలియకకాదు; గత్యంతరంలేక,

"వాతావరణాలయపు టమ్మాయి"కి వ్రాయుట మాతనికి తేలికగా కనిపించింది. ఆ అమ్మాయికి తనమీద ఎదో అవ్యాజప్రేమ వున్నదేకాని, తన కామెను గురించి ఏదిగానీ తెలియదు. కాబట్టే ఆస్పత్రి నుండి, తన కష్టనిష్ఠూరాలన్నిటినీ ఆమెకు పూసగ్రుచ్చినట్లు వ్రాయడానికి కష్టమనిపించిందికాదు. ఆ విధంగా వ్రాయటంమూలంగా కొంతకాకపోతే కొంతయినా మనస్సులోని భారం తగ్గినట్టనిపించింది. కొద్దిరోజుల తరువాత ఏదోవొక నోటు పుస్తకం నుండి చింపినకాగితం మీద వ్రాసిన వుత్తరం ఆమెదగ్గిరనుండి వచ్చింది. దానినిండా లెక్కకుమించిన ఆశ్చర్య గుర్తులున్నాయి. వాక్యం వాక్యానికీ ఒకటీ రెండూ వంతున కనిపించాయి, ఈ గుర్తులు, ఆమె కన్నీరుపడి, చెదిరి చెరిగాయి ఎన్నో అక్షరాలు యుద్ధనిబంధనలనేవి గనుక లేకపోతే, వెంటనే ఉద్యోగానికి రాజీనామా పెట్టి తన దగ్గరనుండి సపర్యచేసి తన అలెక్సీని కాపాడుకొంటుందట, తరుచుగా తన దేహారోగ్యమును గురించి వ్రాయనున్నది. ఈ బాలికయొక్క అమాయకత్వమూ, నిర్మలమైన ఆపేక్షచూస్తే ఆనాడు ఓల్గా పెంపుడు అయిన తన సహోదరి అని ఆమెతో అబద్ధం చెప్పినందుకు చాలా అవమానపడ్డాడు, దుఃఖించాడు. ఇటువంటి మనిషిని మోసగించరాదనుకొని తానొక స్త్రీని ప్రేమిస్తున్నాననీ, ఆమెకుగాని. తన తల్లికిగాని తనకుపట్టిన దుర్గతిని గురించి వ్రాయలేదనీ వెంటనే జాబు వ్రాసాడు.

ఈ జాబుకు బదులు బహు త్వరలో వచ్చింది. ఒక సైనికాధికారి, మేజరొకాయన ద్వారా ఉత్తరమునూ, చిన్నపొట్లము నొకటీ వాతావరణాలయపు టమ్మాయి" పంపించింది. ఈ మేజరు తనతో స్నేహం చేసుకోడానికి చాలా యత్నించాడట, మంచివాడు, కాని తన కతడంటే ఎందుకో సరిపడదు. మొత్తం మీద ఆ వుత్తరం చదివితే ఆ అమ్మాయి మనస్సు చాలా వుండయిందని అలెక్సీకి విదితమయింది. ఎంత ప్రయత్నించినా తనకు అలెక్సీ వ్రాసిన జాబువల్ల కలిగిన ఆశాభంగమును కప్పిపుచ్చలేక పోయింది. తన కింతకుపూర్వమే నిజం తెలపనందుల కామెకు కలిగిన కోపంకూడా అందులో వ్యక్తమవుతోంది. ఒకవేళ తాను ప్రేమించే అమ్మాయి తనతో స్నేహం వదలుకొన్నా లేక తనకు కలిగిన దురవస్థకూ, కుంటితనానికీ సానుభూతిని చూపలేకపోయినా, "వాతావరణాలయపు టమ్మాయికి" వ్రాయవచ్చుననే సంగతి మరిచిపోవద్దన్నది. కాని ఇకమీదయినా నిజం వ్రాయాలి. గ్రామాలనూ, పట్టణాలనూ వదిలివచ్చిన స్త్రీలతత్వం తరుచుగా చాలా మారిపోతుంది. ఎప్పటిమాదిరే వుంటారని చెప్పటానికి వీలులేదు అనికూడా చమత్కారంగా సూచించింది. ఆమె పంపిన పొట్లంలో పారఘూట్ సిల్కునుండి తయారుచేసిన వొక డజను చేతిరుమాళ్ళున్నాయి. వాటిమీద తనపేరు కుట్టింది. విమానం చిత్రించబడిన పొగత్రాగు పైప్ ఒకటీ, దువ్వెనా, ఉడుకులాంసీసా, ఒంటికి రుద్దుకోడానికి మంచివాసనసబ్బూ కూడా అందులో నున్నాయి. ఉడుకులామూ, వాసనసబ్బూ ఆమె కెవరో పంపించి వుంటారు, వాటిని అట్లాగే, తాక

కుంచా తనకు పంపించింది. యుద్ధభూమిలో నున్నవారికిటువంటి వస్తువులంటే ప్రాణం లేచివస్తుందని అలెక్సీకు తెలుసు. కాబట్టే ఆమె ఎంత గొప్పత్యాగం చేసిందో గ్రహించగలిగాడు. వాటిని తనమంచం చెంతనున్న బల్లమీద ఏర్పాటు చేశాడు. వాటిని చూస్తే అతనికి చాలా తలవంపులయింది.

కసరత్తుల మూలంగా త్వరత్వరగా బలం పట్టుతున్నాయి కాళ్ళు. తానింక కొద్దిదినాలలో ఆస్పత్రినుండి వెళ్ళిపోవచ్చునని అనుకొన్నాడు. ఓల్గా దగ్గిరినుండి వచ్చే జాబు లాతనికెంతో కష్టంగా నుండేవి. ఆమెపై ప్రేమ దినదినాభివృద్ధి చెందుతోంది. తన్నంత ఎక్కువగా ప్రేమించే ఓల్గాకు అబద్ధాలు వ్రాయటమూ, తన కెట్టి ప్రేమా లేకపోయినా మరొక అమ్మాయికి తన కష్టాలన్నీ తెలిపి ఆమెకు కష్టం కలిగించటమూ అతని కేమాత్రం కూడా నచ్చలా. ఇదంతా తలుచుకొని తెగకంటక పడేవాడు.

తాను తిరిగీ విమానమును నడిపించేటంతవరకూ ఓల్గాకు నిజం తెలుప కూడదని నిశ్చయించుకొన్నాడు.. అంతకుపూర్వం తెలపటంవల్ల ఆమె మనస్సును అనవసరంగా నొప్పించటంకంటె వేరెట్టి లాభమూ వుండదు. ఈ ఆలోచన తట్ట టంవల్ల తనకు త్వరగా బలం పట్టాలనే ఆశ మరింత బలపడింది.

# 11

మే నెల ఒకటో తారీకు, కమిసారా దినం చనిపోయాడు.

నాటి ప్రొద్దున అతనికి స్నానం చేయించేముందు. యథాప్రకారం గడ్డంచేసే స్త్రీవచ్చింది. మాస్కో నగరం గురించీ, వాతావరణమును గురించీ ఆమెతో చనువుగా మాట్లాడాడు. మాస్కోనగరంలో బాటల కడ్డంగా కట్టిన దడులను తీసి వేస్తున్నారని తెలిసి చాలా సంతోషించాడు. ఈ సంవత్సరం మేనెల ఐదోతేదీ వుత్సవాలు జరపరని విని దుఃఖించాడు. తనముఖంమీది మచ్చలు కనిపించకుండా వుండాలని ముఖానికి విపరీతంగా పౌడరు కొట్టుతోందని నర్సుక్లావ్దియాను ఏడిపించాడు. చాలా హుషారుగా కనిపించా డారోజు ప్రొద్దున గండం తప్పింది, ఫరవా లేదని నలుగురూ అనుకొన్నారు....ఉన్నట్టుండి ప్రాణం విడిచాడు!

వార్తా పత్రికలను చదివేటంత శక్తిలేదని, అతని మంచంచెంత రేడియో నొకటి ఏర్పాటు చేసారని ఇంతకు ముందే చెప్పబడింది. పక్కమీద పడుకొని చెవులకు వినేబిళ్లలు తగిలించుకొనేవాడు కమిసారు. గ్రిగోరీకి రేడియోలను గురించి కొద్దిగా తెలుసు. వినే బిళ్ళలను మార్చి మైక్‌మాదిరి తయారు చేసాడు.

పాటలూ, వార్తలూ అన్నీ చుట్టుప్రక్కలనుండే నాలుగైదు గదులవాండరికీ స్పష్టంగా వినిపించాయి. ఆరోజునుండి, ప్రొద్దున్నే సరిగ్గా తొమ్మిది గంటలకు యుద్ధవార్తలు వచ్చేవి. ఊపిరి బిగబట్టి జనులందరూ వాటిని వినేవారు. "ప్రఖ్యాత లెనిన్ పతాకం ఎగురుతోంది చూడండి, దాని నెగురవేస్తూ దిగ్విజయానికి సాగి పోండి" అనే మాటలతో ఆ యుద్ధవార్తలు ముగిసిపోయేడివి ప్రతిరోజూ: అవి ఆఖరయిన కొంతసేపటిదాకా ఎక్కడివారక్కడే నిశ్శబ్దంగా నుండేవారు.

"కమిసార్ సోదరా ...! ఇది నాకు కొంచెం అర్థంకాకున్నది. దీని అర్థ మేమిటో చెప్పు" మంటూ కుకుష్కిన్ కమిసారు దగ్గిరికి వెళ్లాడు. అకస్మాత్తుగా పెద్ద కేకపెట్టాడు, "కమిసార్ . సోదరా" అని.

అందరూ కమిసారువంక తిరిగి చూసారు. బిగదీసుకుపోయి, నిటారుగా కమిసారు మంచంమీద పడుకొన్నాడు. రెప్పవాల్చకుండా గాజుగుండ్ల వంటి కండ్లతో పైకప్పును చూస్తున్నాడు. వెలవెలబారి, కుష్కించిపోయిన ముఖంలో శాంతీ, గాంభీర్యమూ ఉట్టిపడుతున్నాయి.

"చనిపోయాడు" అంటూ కుకుష్కిన్ అతని మంచందగ్గిర మోకాళ్ళమీద కూలపడ్డాడు. "చనిపోయాడు" అన్నాడు, తలవంచి.

పనిచేసే స్త్రీలూ, నర్సులూ ఇటూ అటూ పరిగెత్తారు. కోటు గుండీలు పెట్టు కొంటూ డాక్టరొకాయన వడివడిగా నడిచివచ్చాడు. వీరెవరిని గానీ చూడకుండా కుకుష్కిన్, అందరితో పేచీలుపెట్టుకొనే కుకుష్కిన్, ఎప్పుడూ ఏదో వొక విషయమై సణిగే కుకుష్కిన్, కమిసారు మీదపడి, రెండు చేతులతో మొహం మూసుకొని, చిన్న పిల్లవాడిమాదిరి వెక్కివెక్కి ఏడ్చాడు ...

ఆ సాయంత్రం సగం కాళీగానున్న వలభై రెండో నంబరు గదిలోకి వేరొక రోగిని తీసుకువచ్చారు; వైమానిక మేజరు, పవెల్ ఇవానొవిక్ స్ట్రిఖొవ్, మాస్కోనగర రక్షణ కేర్పాటుచేసిన విమానదళంలో ఇతడొక పెద్ద మేజరు. ఆ రోజుల్లో పెద్ద వైమానిక దళమును లేవదీసి మాస్కో నగరం మీదపడి సర్వ నాశనంచేయాలని జర్మను లేర్పాటుచేసారు. నాలుగుమూలలనుండీ ఒకే పర్యాయం విమానాలువచ్చి మాస్కోను ముట్టడింప యత్నించాయి. కాని వాటిని దారిలోనే రష్యను విమానాలడ్డగించాయి. పెద్దపోరు జరిగింది, ఒకేవొక జంకర్ విమానం తప్పించుకొని, చాలా ఎత్తునకెగిరి మాస్కోను సమీపిస్తోంది, ఏదో విధంగా ఆ నగరం మీద పది బాంబులు పడేయాలనే పట్టుదలతో దానిలోని జర్మనులు ఎగిరి వస్తున్నారు. ఇంతకుముందే ఈ విమానమునూ, దాని పోకడనూ గమనించాడు స్ట్రిఖొవ్ అమాంతంగా తన విమానంలో పైకి లేచాడు. ప్రఖ్యాత రష్యను విమానమూత డెక్కింది. ఎగిరే జర్మను విమానము కంటెఎత్తుగా పైకెగిరాడు, దానిమీద నేరుగా తానెగురుతున్నాడు. అక్కడికి మాస్కోనగరం ఆరు కిలోమీటర్ల దూరములోనున్నది. చమత్కారంగా జర్మను విమానం వెనుక ప్రక్కకు

ఎగిరి తన ఫిరంగి మీటను నొక్కాడు. మరొక పర్యాయం నొక్కాడు. ఫిరంగి ప్రేలుడు వినిపించిందికాదు! మీట చెడిపోయింది.

జర్మను విమానం తనకంత దూరంముందుగా పెడుతోంది. స్ట్రిఖొవ్ తన విమానమును దాని దగ్గరికి పోనిచ్చాడు. జర్మను విమానంతోక కిరుప్రక్కలానున్న జంట ఫిరంగుల మొనలాతనికి కనుపించాయి. ఆ లేత ఎండలో మాస్కోనగరపు ఇండ్లూ; సౌధాలూ సముద్రతీరం మీద కనిపించే ఆలుచిప్పలమాదిరి, అంతటా కనిపించాయి. స్ట్రిఖొవ్ తన వైమానికటోపీని తీసి వేసాడు. విమానం ఇంజనుపైనుండేకప్పు నెత్తిపెట్టి, జర్మను విమానమును వెంబడించాడు. ఒక దానికొకటి అంటిపెట్టుకొని ఆ రెండూ ఎగరటంచూస్తే ఏదో త్రాడుబిగించి కట్టారా ఆ రెంటికీ అనిపించింది. జర్మను ఫిరంగుల చెంతనున్న మనిషి స్ట్రిఖొవుకు స్పష్టంగా కనిపించాడు. వీలుచిక్కితే రష్యను విమానమును కాల్చిపారేయాలని అతను కనిపెట్టుకొని వున్నాడు. అతని కంటి గ్రుడ్లూ? ఎర్రటి తల జుట్టూ బహు స్పష్టంగా స్ట్రిఖొవుకు కనిపించాయి. ఏ సెకోన్కు, ఏమాత్రం గురికి అందినా కాల్చి పారేయడానికి జర్మనువాడు తన ఫిరంగుల నెక్కుపెట్టి. అటూ అటూ త్రిప్పు తున్నాడు. వాటి మొనలు, సమయం చిక్కితే, నిప్పును వెలిగ్రక్క దాని కాతనికై వేచివున్నాయి, అకస్మాత్తుగా పిస్తోలు పట్టుకొని ఎదురైన పోంగమాదిరా విమానం అతనికి గోచరించింది. నేలమీదనే గనుక అట్టి సంధర్భం ఏర్పడితే అమాంతంగా యెదుటివాడిమీద పడి పోరాడవచ్చు. కాని, గాలిలో ?.... తన విమానము నొక్కిపెట్టిన ముందు కురికించి, అమాంతంగా జర్మను విమానం తోకమీద పడ్డాడు స్ట్రిఖొవ్ !

తన విమానం పగిలినశబ్దం షూతనికి వినిపించలా, గాలిలో నంత ఎత్తుకు ఎగిరిపడి. గిరిగింతలు కొడుతూ క్రింద పడిపోతున్నాడని మాత్రం తెలిసింది. రాను రాను నేలఎగిరి తనమీదికి ఉరుకుతోంది. సమీపిస్తోంది. పచ్చని బయళ్లు లేచి తన మీదికి వస్తున్నాయి. తన పారాషూట్‌ను విప్పాడు, దాని త్రాళ్ళకు వ్రేలాడుతూ క్రిందికి వాయువేగంతో పడిపోతున్నాడు. జర్మనుజంకరు విమానంతోక విరిగి అంతదూరాన క్రిందికి పడిపోతోంది. విమానం, ఎండుటాకుమాదిరి గాలిలో దొర్లు కొంటూ, బోర్లాలు కొట్టుతూ పడిపోతోంది. త్రాళ్ళనుండి వ్రేలాడుతూ క్రిందికి దిగి మాస్కోనగరపు టొక ఇంటిమీద పడిపోయాడు. నగర వీధులనుండి, దీనినంతా చూస్తూ గుంపులు గుంపులుగా జనులు నిలబడ్డారు. స్పృహ తప్పిపోయిన స్ట్రిఖొవ్ శరీరమును చెంతనున్న వొక గృహంలో చేర్చారు. కబురుచేసిన డాక్టరు, వీధంతా నిండిపోయిన జనులలో సందు చేసుకొని రావటం చాలా కష్టమయింది. స్ట్రిఖోవ్ మోకాలుచిప్పలు రెండూ చితికిపోయాయి.

వెంటనే స్ట్రిఖొవ్‌ను గురించిన రేడియోవార్త దేశమంతటా వ్యాపించింది. మాస్కో నగరసోవియట్ అధికారి స్వయంగా తానాతని తీసుకువెళ్ళి పెద్ద ఆస్ప

త్రిలో చేర్చాడు. నలభై రెండో నంబరు గదిలోని కాతనితో ఆస్పత్రి పనివారు కొందరు వచ్చారు. మాస్కో నగరజనులు బుట్టలనిండా పండ్లూ, పూవులూ, చాక్లెట్లూ అతనికి పంపించారు. వాటిని మోసుకువచ్చారా పనివారు.

స్ట్రిహోప్ నలుగురితో చాలా చనువుగా నుండేవాడు. గదిలో నతని పడుకోబెట్టి నర్సులూ, డాక్టరులూ వెళ్ళిపోగానే, అలెక్సీని చూచి, ఆస్పత్రిలో ఎట్టి తిండి పెడతారని అడిగాడు" ఆస్పత్రి నియమాలు చాలా కఠినంగా నుంటాయా? నర్సులలో ఒకరిద్దరయినా అందక త్తెలున్నారా? అని ప్రశ్నించాడు. మోకాళ్ళకు కట్లు కట్టేటప్పుడు నర్సు క్లాడియా కేదో నవ్వు పుట్టించే కథలు చెప్పాడు. ఆమె బలే ఘనందుగా నున్నదని చెప్పి, కన్ను గీటాడు.

"మంచిపిల్ల! అ అమ్మాయి! కొద్దిగా కఠినంగా కనిపిస్తుంది, కాదూ? దేవుడూ? దయ్యమూ అంటూ మాట్లాడి భయపెట్టుతుంది. అదంతా ఒకనాటకం తెలివితేటలుపయోగించాలి. బ్రహ్మాండమైన కోటలను ముట్టడించినట్టే ఆడవాళ్ళ హృదయాలనూ ముట్టడించాలి. తప్పక వశంచేసుకోవచ్చు." అని బిగ్గరగా నవ్వాడు, స్ట్రిహొప్.

చాలా కాలంగా ఆస్పత్రిలో నున్నవాడి మాదిరి నలుగురితో చనువుగా. వచ్చిన మరునాటినుండే వర్తించాడు. ఎవరిని పడితేవారిని "ఏమండీ" అంటూ చొరవగా పలకరించేవాడు. తన ప్రక్కనే పడుకొన్న అలెక్సీ అలమారునుండి పట్టుచేతి గుడ్డనొకటి తనదేనన్నట్టుగా తీసుకొని, తన తలగడక్రింద పెట్టుకొన్నాడు.

"ప్రియురాలు పంపించిందా?" అంటూ అలెక్సీ నడిగి కన్నుకొట్టాడు. "చాలా చేతి రుమాళ్ళున్నాయిగా? నేనొకటి తీసుకొన్నా ఫరవాలేదు. చాలకపోతే. కాకితో కబురు పంపితే చాలు, మరొకడజను రుమాళ్లు కుట్టి పంపిస్తుంది"అన్నాడు.

అంత చలాకీగా మాట్లాడుతూన్నప్పటికీ. ఈ మనిషికి చాలావయస్సు అయిందని అతనిముఖం చెబుతుంది, నుదురుమీద నాగలిచాలు మాదిరెన్నో గీతలూ. ముడతలూ వున్నాయి. కాని అనుభవజ్ఞుడూ, చిరకాలంగా యుద్ధభూములలో బ్రతికాడూ కాబట్టి అతనికి ఎప్పుడెక్కడనున్నా, అదే తన ఇల్లుమాదిరి అనిపించేది. తన మిలిటరీ సంచీసీ, సబ్బుపెట్టె, పండ్లుతోముకొనే బ్రష్షునూ ఎక్కడ సర్దుకొంటే అదంతా తన ఇల్లు అంటాడాయన. అందరితో చాలాచనువుగా వర్తించటంవల్ల నలుగురూ ఇతనికి స్నేహితులయ్యారు. అతను వచ్చినప్పటి నుండీ ఆ గదిలో నవ్వులూ. వేళాకోళాలేకాని. మూతిమూరెడు చేసుకొని వుండటానికి వీలులేకపోయింది. అలెక్సీ కొక్కడికి మాత్రం అతనంటే సరిపడలా, ఆడవాళ్ళంటే అతడు పడిచస్తాడు. అలెక్సీ కిదెంతమాత్రమూ నచ్చలా, ఆడవాళ్ళ విషయమై పెద్దబడాయికోరుమాదిరాతడు మాట్లాడటం అలెక్సీకి అసహ్యమనిపించింది.

మరునాడు కమిసారును పూడ్చిపెట్టారు.

అలెక్సీకి కుకుష్కిన్, గ్రిగోలీలు తమ గదికిటికీపైకెక్కి దాని అంచునుంచొని చూసారు. పెద్ద ఫిరంగి బండికి పండ్రెండు గుర్రాలు కట్టారు, బ్యాండు వాయించే దళంవచ్చింది, వారి వెనుక సైనికులు కొందరు నడిచివచ్చారు. నర్సు క్లావ్డియా గదిలోకివచ్చి కిటికీనుండి క్రిందికి దిగమన్నది. పైకి చూడటానికి మామూలుమాదిరే కనిపించినా ఆమె కంఠంలో దుఃఖం కరుడుకట్టుకొన్నట్లు అలెక్సీకి తోచింది. స్ట్రిఖొవ్ యొక్క జ్వరంకొలవాలని వచ్చిన క్లావ్డియా, ఉష్ణ మానిని తీసేటపుడు వెలుపలనుండి బ్యాండు వినబడింది. అప్పుడే బ్యాండును వాయించటం మొదలుపెట్టారు క్లావ్డియాముఖం వెలవెలబోయింది. ఉష్ణమానిని చెయి జారి క్రిందపడింది. పాదరసం గుండ్లు నేలపై గదంతా పరుగెత్తాయి. చేతులతో గట్టిగా ముఖం మూసుకొని క్లావ్డియా గదినుండి పారిపోయింది.

"ఎందుకట్లా పారిపోయింది ? ఆమనిషిని ప్రేమించింది కాబోలు."నని, స్ట్రిఖొవ్ కిటికీమీద కూర్చున్నవారితో అన్నాడు.

ఒక్కరయినా బదులుచెప్పలా.

ఫిరంగి బండిమీద ఎర్రని వస్త్రం కప్పినపెట్టె వారికంట బడింది. లెక్కలేనన్ని పుష్పగుచ్చాల మధ్య కమీసారు శవమున్నది, మఖమల్ బట్టలకు, కమిసారు సంపాదించిన సైనిక పతకములను గ్రుచ్చి, సిపాయిలు వాటిని సగౌరంగా మోసుకువచ్చారు. ఒకడు, ఇద్దరు. ముగ్గురు – ఎనమందుగు రావిధంగా గుర్రపు బండీ వెనుకనడిచారు:వారివెనుక సైన్యాధికారులు. వాసివెలిక్ కూడా సైనికోద్యోగి దుస్తులు తొడుగుకొని వారితో వెళ్ళాడు. కాని అతను నెత్తినటోపీ పెట్టుకోలేదు, వారి కంతదూరంగా, నర్సు క్లావ్డియా, నర్సులు తొడిగే తెల్లటి దుస్తులు తొడిగింది. కాని టోపీ పెట్టుకోలేదు. ఎక్కడికి వెడుతోందో తెలియనట్లు పరధ్యానంగా నడుస్తోంది క్లావ్డియా. ఎవరో ఆమెపైకొక పెద్ద చలిచొక్కాను విసిరారు. అది ఆమెపైబడి క్రిందికి దిగజారి నేలపై పడిపోయింది. వెనకాల వచ్చే సైనికులా చొక్కాను త్రొక్కకుండా ప్రక్కకు వొత్తిగిలి వెళ్ళారు.

"ఎవరా మనిషి ?" అన్నాడు స్ట్రిఖొవ్.

అతనికి తన మంచంనుండి లేచి కిటికీచెంతకు వెళ్ళాలనిపించింది. కాళ్ళు రెంటినీ కొయ్యచెక్కలలో బిగించబట్టి వీలుపడింది కాదు.

ఊరేగింపు వెళ్ళిపోయింది. దూరంనుండి, నదీతీరంనుండి, బ్యాండు వినిపించింది. ఆస్పత్రి గోడలకవి తాకి మార్మోగింది. ఎవరో వచ్చి ఆస్పత్రి సింహ ద్వారమును మూసారు. కాని నలభైరెండో నంబరుగది కిటికీపై కూర్చొన్న ముగ్గురూ క్రిందికి దిగలా. వెళ్ళిపోయే ఊరెగింపును చూస్తూ ప్రతిమల్లాగా కూర్చున్నారు.

"ఎవరిదాశవం ? మీరందరూ కొయ్యబారిపోయారు ! కిటికీని వదిలివచ్చేటట్టు కనిపించద"న్నాడు మేజర్. కిటికీనుండి చూడాలని తన మోచేతులమీద లేచాడు,

"అదా?....సిసలైన వొక మనిషియొక్క ఆఖరి వూరేగింపు....బోల్షివిక్ మనిషి," అన్నాడు కుకుష్కిన్.

"సిసలైన మనిషి" అనేమాట అలెక్సీ మనస్సులో బలంగా నాటుకు పోయింది. వేరొకమాట ఏది కానీ, కమిసారుయొక్క గుణగణాలను అంత చక్కగా వర్ణించలేదనిపించిందాతనికి. తన ఆఖరు ప్రయాణం చేసి వెళ్ళిపోయిన అతనిమాదిరే తానుకూడా సిసలైనమనిషి అనిపించుకోవాలని అలెక్సీ నిశ్చయించుకొన్నాడు.

# 12

కమిసారు వెళ్ళిపోవటంతో నలభై రెండో నంబరు గదిలో ఎంతో వెలితి కనిపించింది.

అతని మాదిరి ప్రోత్సాహకరంగా, చలాకీగా మాట్లాడేవా రెవ్వరూ లేక పోయారు. ఆస్పత్రులలో తరుచుగా ఎవరి రోగాలతోవారు కాలం గడుపుతూ, దిగులుపడి రోజులు గడుపుతారు. వారి దిగులునూ, దుఃఖాన్నీ. గుండెల్లోని బరువునూ కమిసారు వొక్కడే తీర్చగలిగాడు. గ్రిగోరీతో అతని వైద్య కళాశాల బాలికను గురించి హాస్యాలాడటానికీ, అలెక్సీకి తగిన సలహాలీయడానికీ, ప్రతి వారితో కజ్జాకు కాలుదువ్వే కుకుష్కిన్‌కు ముక్కుత్రాడు బిగించి పట్టుకోడానికీ ఇప్పుడా గదిలో ఎవ్వరూ లేకపోయారు. వీరందరినీ, సూదంటురాయి మాదిరి ఆకర్షించిన వ్యక్తి వెళ్లిపోయాడు.

అదృష్టవశాన వీరందరికీ బాగా బలం పట్టుతోంది. ఆస్పత్రినుండి బయట పడే రోజును కనిపెట్టుకొని వుండేవారు. తమతమ బాధలను గురించి పూర్వం మాదిరి ఎక్కువాలోచించటం మానుకొన్నారు. వెలుపల ఏమి జరుగుతుందో? తాము కనిపించగానే, తమ సైనికదళం వారెవ్విధంగా తమ్మాహ్వానిస్తారో? వారందరితో కలిసి తిరిగీ తాముకూడా యుద్ధంలో పాల్గొనాలనే ఆశ. దినదినాభివృద్ధి కాజొచ్చింది. చేతులు, తుపాకిని పట్టుకోడానికి, పురపురలాడాయి. కొద్ది దినాలుగా యుద్ధ వార్తలు, స్వల్పంగానే తెలుస్తున్నాయి. రష్యను సైనికులొక బ్రహ్మాండమైన యుద్ధానికి గుప్పుచప్పుడు కాకుండా, తయారవుతున్నారనే విషయం ఈ ఆస్పత్రిలో వున్నవారికికూడా తెలుసు. అది ప్రారంభించేలోగా తమకు విడుదల లభిస్తుందా? ఆ పెద్ద యుద్ధంలోచేరి పోరాడటానికి తమకు అవకాశం వుంటుందా? ఇట్టి ఆలోచనలతో వారు రోజులు గడుపుతున్నారు.

గాయాలు మాన్పుకొని తిరిగీవెళ్ళి యుద్ధంచేసిన వారెందరోవున్నారు. కాని అలెక్సీ విషయమిట్టిదికాదు. పాదాలు రెండూలేనితాను, ఎన్నాళ్ళు, ఎంతకష్టపడినా తిరిగీ విమానం నడిపించడానికి వీలవుతుందా? కాళ్ళకుబలం పట్టుతేవట్టవచ్చు, కాని పాదాలులేని కొరత? మరింత నిక్కచ్చిగా సాముచేయజొచ్చాడు. ప్రతి రోజూ ప్రొద్దునపూటా, సాయంకాలమూ రెండేసి గంటల కసరత్తుచేసాడు. కొనాళ్ల పిదప మధ్యాహ్నమపుడు కూడా చేయటం మొదలుపెట్టాడు.

మేజర్ స్ట్రిఖొవ్ అతని నెంతో ఎగతాళిచేసేవాడు. "ప్రేక్షకులారా! చూడండి. అపూర్వదృశ్యం. ఫహిల్వాన్ అలెక్సీకి సైబీరియాదేశపు టరణ్యాలలో మించినవాడంటూలేడు. ఇతనుచేసే అద్భుత కసరత్తు నిపుడుచూడబోతున్నార"ని. పెద్ద సర్కస్సులో చెప్పినట్టు, అలెక్సీ కసరత్ ప్రారంభించగానే అనేవాడు.

అలెక్సీ నిజంగా నొకవిచిత్రమైన ఫహిల్వాను మాదిరే కనిపించాడు. నలుగురికీ, పడుకోటమూ, లేచికూర్చోటమూ: ప్రక్కలకు వాలటమూ, మెడ కసరత్తూ; చేతులకుసామూ: ఈ పనులన్నీ ఏదో మరత్రిప్పి వదిలిపెట్టిన యంత్రంమాదిరి, ఒకదాని తరువాత నింకొకటిగా, ఆగకుండా చేసుకుపోయేవాడు. నడవడానికి వీలయిన ఇతర రోగులంతా, ఇతనీవిధంగా సాముచేస్తోంటే. ఇటూ అటూ ఆస్పత్రి వసారాలలో పచార్లు చేసేవారు. లేచి తిరుగజాలని స్ట్రిఖోవ్ ముఖం నిండా దుప్పటికప్పుకొని నిద్రపోయేవాడు. పాదాలులేనివా రెన్నడూ విమానమును నడపజాలడని అందరూ అనేవారు. కాని అలెక్సీ చూపే కార్యదీక్ష, ఏకాగ్రతా వారి కాశ్చర్యం కలిగించాయి, వేరెద్దీచేయజాలక అతని కసరత్తును గురించీ, లేనిపోని అతని ఆశలను గురించీ ఎగతాళి చేయజొచ్చారు.

మేజర్ స్ట్రిఖొవ్ మోకాలిచిప్పలకు, గొప్పదెబ్బ తగిలింది. అవి మానుకు వస్తున్నాయేకాని, పూర్తిగా మానడానికి ఇంకా కొంతకాలం పట్టేటట్టున్నది. కాళ్ళు కదలకుండా వాటిని చెక్కలలో బిగించారు.

పాడుకాళ్లు. పాడుకాళ్లు" అంటూ తెగవిసుగుకొనేవాడు. కనుపించిన వారందరిమీదా కారాలూ, మిరియాలూ నూరేవాడు. ఒక్కొక్కపుడు మరీకోపం వచ్చి దగ్గిరికి వచ్చిన వాళ్లందరినీ కొట్టడానికి యత్నించేవాడు. ఇదంతా కనిపెట్టి అటువంటప్పు డాతని జోలికి పోయేవారుకారు, తమపనులేవో తామేమో అన్నట్లు వుండేవారు. "వాగి, వాగి వాడే ఊరుకొంటాడు. కాలి కాలి చిచ్చుబుడ్డి చల్లబడి పోతుందంటూ" అతని చేష్టలను గమనించేవారేకాదు.

దొడ్డికి వెళ్ళటానికీ, వెళ్లేటప్పుడు హాయిగా సిగిరెట్టు పీలుస్తూకూర్చోటానికీ బదులు పక్కలో పెట్టిన పళ్లెంలో పోవటం అతని కెంతమాత్రం సరిపడింది కాదు. నలుగురు పెద్దమనుష్యుల మాదిరీ దమ్ము పీలుస్తూ దొడ్డికి వెళ్ళగలిగితే తన జబ్బు కుదురుతుంది అనేవాడు. ఇంకొకకారణం కూడా చెప్పేవాడు. కొద్ది దినాలక్రితం తన కాళ్ళకు కట్టిన కట్లను మార్చడానికి. ఎర్రటి తలజుత్తుగల నర్సు

వొకామె వచ్చింది. ఆమెపై మరులు కొన్నాడట. అప్పుడే వారిద్దరూ ఒకరినొకరు చూచి కనుసంజ్ఞలు చేసుకొన్నారు కూడా. అనర్సు, ఆస్పత్రిలో ఎక్కడో శస్త్ర చికిత్సలు చేసే భాగంలో వుంటుంది. ఆమె దగ్గిరికి తాను వెళ్ళగలిగితే తన వాధపోతుందనీ. కాళ్లు ఇట్టే బాగవుతాయనీ అనేవాడు. ఇందులో అంతాకాకపోతే, కొంతయినా నిజంవుండవచ్చు నంటాడు అలెక్సీ. కాని స్ట్రిఖొవ్ విషయమై ఆత డింకొక విచిత్రం. గమనించాడు. ఆస్పత్రిమీద ఎప్పుడే విమానం ఎగిరేశబ్దం వినబడినా. రేడియోలో తానెరిగిన ఏ వైమానకుడి ధైర్యసాహసాలను గురించి చెప్పబడినా స్ట్రిఖొవ్ వెంటనే పిచ్చులూ. వెర్రులూ ఎత్తినట్టు ప్రవర్తించేవాడు. ఇదంతా తన అశక్తతను తానే నిందించుకొనటమేగాని అన్యులమీది కోపంకాదని అలెక్సీకి తెలుసు. ఇది తలుచుకొన్నప్పుడల్లా తన పరిస్థితులు స్ట్రిఖొవ్ పరిస్థితుల కంటె బాగున్నాయని అతనికి అనిపించింది. దేవుడుమేలుజేస్తే తానూవొక "సిస లైనమనిషి"గా మారేరోజులు దగ్గిర పడ్డాయని అనుకొన్నాడు.

మేజర్ స్ట్రిఖొవ్ కడుపారతిని, ఎప్పుడు పడితే అప్పుడేదోనొక దాన్ని గురించి నవ్వుతూ. ఆడవాళ్ళని గురించి మాట్లాడేవాడు. తనవంటి గొప్ప రసికు డింకొకడా ఆస్పత్రిలో లేడని అనేవాడు. ఆడవాళ్ళను ప్రేమించినట్టే, అప్పుడప్పుడు వారిని తెగతిట్టిపోసేవాడు. తమ మొగవారంతా యుద్ధం చేస్తోంటే ఇండ్లను కని పెట్టుకుకూర్చున్న ఆడవాళ్ళ మాట చెబితే. మరీ మండిపడేవాడు.

అలెక్సీ కాతని గుణాలెవ్వీ నచ్చలా. స్త్రీలను గురించి అల్పంగా మేజరు మాట్లాడినప్పుడల్లా, అతనికి ఓల్గా జ్ఞాపకానికి వచ్చేది. లేదా. ఆ రెండో అమ్మాయి "వాతావరణాలయపు బాలిక" జ్ఞాపకానికి వచ్చేది. ఒక వర్యాయం. ఆమె విమానాశ్రయంలో నుండే రోజుల్లో ఎవరో ఒక సిపాయి చొరవచేసి ఆమె గదిలో ప్రవేశించి బలాత్కారం చేయబోయాడు. తుపాకి ఒకటి చేబట్టి, టపీమని వాడి తలమీద దాని కొయ్య పిడితో బాది బయటికి తరిమింది. ఆ దిన మాతడు ప్రాణంతో బయటపడటం గొప్ప అదృష్టమని నలుగురూ చెప్పుకొన్నారు. స్ట్రిఖొవ్ ఆడవాళ్ళ పేరెత్తితే, అలెక్సీకి వీ రిద్దరూ జ్ఞప్తికి రావటంవల్ల అతనంటే చెడ్డ అసహ్యం వేసేది. ఒకనాడు స్ట్రిఖొవ్ ఏదో కథ వొకటి చెప్పి, "ఆడవారంతా ఒకే రకం. వారిలో మంచి చెడ్డలంటూ లేవు" అనీ, రెండు నిమిషాల్లో ఎంతటి స్త్రీ నయినా ఇట్టే బోల్తా కొట్టించవచ్చనీ అన్నాడు. అలెక్సీకి పట్టరాని కోపం వచ్చి పిడికిలి బిగబట్టి :

"ఎవరైనా అంతేనా ?" అన్నాడు.

"నిస్సందేహంగా అంతే" నన్నాడు మేజర్ :

సరీగ్గా ఆ సమయానికి నర్సు క్లావియా ఆ గదిలోకి వచ్చింది. వా రిద్దరినీ చూసి, భయపడి.

"ఏమి జరిగింది? ఎందుకంత కోపంగా వున్నారని?" ప్రశ్నిస్తూ. తలచుట్టుకొనిన రుమాలునుండి బయటపడిన ముంగురులను సర్దుకొన్నది.

"మేమిద్దరమూ ఏదోవొక విషయం చర్చిస్తున్నాము, మాకేదీ పొద్దుపోక పోతే ఏదన్నా వొకపని కల్పించుకోవద్దా?" అన్నాడు మేజర్. చిరునవ్వు ముఖంతో"

ఆనాటినుండీ క్లాడియాతో మరింత చనువుగా మాట్లాడటం మొదలుపెట్టాడు. మేజర్. నవ్వుపుట్టించే కథల నెన్నింటినో చెప్పేవాడు. ఇతరులకు వినిపించకుండా. ఇంతేకాదు, పైమానికు లెవరుగానీ చేయరాని పనినొకటికూడా చేశాడు. తానొనర్చిన యుద్ధాలను గురించీ. వాటి రహస్య విషయాలనుగురించీ పైమానికు డితరులతో చర్చించరాదు. మేజర్ ఈ విషయంలో కూడా తప్పుగా వర్తించాడు. తన వొంటరిజీవితమును గురించీ. ఎంత కాలంగానో విడిచిపెట్టి వచ్చిన భార్యా బిడ్డల గురించీ, తెగ వాపోయేవాడు; క్లాడియాముందు. కాని. మేజర్ స్ట్రిఖావ్‌కు పెండ్లి పెడాకులూ కాలేదన్న సంగతి అందరికీ తెలుసు.

క్లాడియా అతని మంచంమీద. ఒక ప్రక్కగా కూర్చుని స్ట్రిఖావ్ చెప్పే కథలనూ, అతని సాహసకార్యాలనూ వినేది. అటువంటప్పుడు పరధ్యానంగా వున్నట్టు లాతడామె చేతిని తాకేవాడు. తరువాత దానిని గట్టిగా అదిమి పట్టుకొంటే క్లాడియా తన చేతిని తీసివేసిందికాదు. ఇదంతా చూస్తే అలెక్సీకి గిట్టిందికాదు. ఆ గదిలో నున్నవారందరికీ, అందరు స్త్రీలూ ఒకేరకమని తాను చెప్పిన మాటలను రుజావు చేయడాని కాతడావిధంగా వర్తిస్తున్నాడనే అనుమానం కలిగింది. ఆ విధంగా నడుచుకోవద్దని గదిలోని ముగ్గురూ మేజరును హెచ్చరించారు, లాభంలేకపోయింది. స్ట్రిఖావ్‌కు తగిన బుద్ధి చెప్పాలని వారందరూ అను కొంటూంటే ఒక విచిత్రం జరిగింది.

ఒకనాటి సాయంత్రం, తీరుబడిగా నుండబట్టి, క్లాడియా బాతాఖానీకొరకా గదిలోకి వచ్చింది. ఈ విధంగా ఆమె అప్పుడప్పుడువచ్చేది. మేజర్ మంచంమీద కూర్చుని అతడేదో కథ చెబుతోంటే వింటోంది. ఉన్నట్టుండి, క్లాడియా అదరిపడి లేచి నిలబడింది. స్ట్రిఖావ్ చిన్నబుచ్చుకొన్నట్లగుపించాడు.

"మేజర్! నీవు రోగిగా నుంటటం మేలయింది. లేకపోతే పెడచెంపలు వాయించేద్దును" అన్నది.

"చూడు క్లాడియా, చూడు ఎంత ఒట్టుపడితేఅంతఒట్టు....నేనా విధంగా అనుకోలేదు....అయినా ఏమంత మునిగిపోయిందిప్పుడు?" అన్నాడు మేజర్.

"ఏమి మునిగిపోయిందా?" అని, కాలికి అంటుకొన్న పేడను చూసినట్లు లాతనివంక చీదరింపుగా చూసింది, "సరే, ఇంక ఏమాత్రం కూడా మాట్లాడవద్దు వింటున్నావా? ఇదిగో, ఇందరముందరా చెబుతున్నాను, విను నీ కేదన్నామందో

మాకొకావాలంటేతప్ప. ఇకమీద నాతో పల్లెత్తయినా మాట్లాడనక్కరలేదు. మరిచి పోవద్దీమాట – సరే. నే వెడతానంటూ" క్లావ్దియా గబగబా నడిచి వెళ్లిపోయింది.

గదంతా నిశ్శబ్దం. కొంతసేపయ్యాక అలెక్సీ బిగ్గరగా నవ్వాడు. నలుగురూ చేరి మేజర్ మీదవిరుచుకు పడ్డారు.

"తగినశాస్తి జరిగిందా?" అన్నాడు అలెక్సీ "రెండు చిటికల్లో ఎట్టి స్త్రీ నయినా వశంచేసుకొంటానన్నావు, జ్ఞాపకమున్నదా?"

స్ట్రిఖొవ్ చాలా చిన్నబుచ్చుకొన్నాడు. కాని. వోడిపోయానని వొప్పు కోడానికిష్టపడక

"నిజం ఈ పర్యాయం అపజయ మొందాను. ఇంతలో మించిపోయిన దేమున్నది? మరొకసారి ముట్టడిస్తే కోట పగిలిపోక తప్పద"న్నాడు.

రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా నిద్రపోలా. తనలో ఏదో తలపోస్తూ, ఈల వేసుకొంటూ, మధ్య మధ్య "నిజం, అపజయం" అంటూ కాలం గడిపాడు.

పై సంఘటన జరిగిన కొద్ది రోజు లనంతరం కుకుష్కిన్‌ను ఆస్పత్రినుండి వెళ్ళిపోవచ్చునన్నారు. నలుగురితో వెళ్లిపోతానని. సర్వసాధారణంగా చెప్పాడే కాని. అయ్యో వెళ్లిపోతే తిరిగి ఎప్పుడో వీ రందరినీ చూడటమనే భావం అతనిలో కనిపించలా. ఆస్పత్రి జీవితమంటే తనకు ముఖం మొత్తిందన్నాడు. అలెక్సీనూ క్లావ్దియానూ చూడటానికి వెళ్ళినప్పుడు తన తల్లిదగ్గరనుండి ఉత్తరాలు వస్తే, భద్రపరిచి, తనకు జాగ్రత్తగా పంపించమని మరీ మరీ అడుగుకొన్నాడు. ఇతరు లందరితో మాటవరుసకు మాత్రం వెడుతున్నానని చెప్పాడు,

"నీ కెంత గొప్ప స్వాగత మిచ్చారో మన స్నేహితులందరూ, వెళ్ళగానే నాకు వ్రాయి. అప్పుడపుడు నీ క్షేమసమాచారాలు తప్పకుండా వ్రాస్తూ వుండ" మన్నాడు, అలెక్సీ.

"నీకెందుకు వ్రాయాలి? నేనంటే నీకొక లెఖా? పత్రమా? నేను వ్రాయను. కౌగితం దండుగ" అన్నాడు,

"సరే! నీ చిత్తంవచ్చినట్టు చేయి,"

ఈ ఆఖరిమాటలు వినపడ్డాయో, లేదో తెలియదు' వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. ఆస్పత్రి గేటుదాటి మలుపుతిరిగి తనదారిని తాను వెళ్ళిపోయాడు. కిటికీలోనుండి మిత్రులందరూ చూస్తూ వుంటారని కుకుష్కిన్‌కు తెలిసీ: వెనుతిరిగి చూడలేదని గదిలోనివారందరూ అనుకొన్నారు,

వెళ్లిన రెండు మూడు రోజులకే కుకుష్కిన్ దగ్గిరనుండి అలెక్సీకి జాబు వచ్చింది. తాను తిరిగి వచ్చాడని మిత్రులందలూ చాలా సంతోషించారని మాత్రం వ్రాసి, దరిమిలా జరిగిన పోరులో తమ పురాతన స్నేహితులు కొందరు చనిపోయారని వ్రాసాడు, వారిపేర్లు కూడా వ్రాసాడు. తన రాకకు పటాలంలోని వారందరూ ఎదురుచూస్తున్నారట. దళాధికారికి. అలెక్సీ కసరత్తు చేస్తున్నాడని

తెలియగానే, "అలెక్సీ తప్పకుండా తిరిగివస్తాడు, నాకు తెలుసు, ఏది నిశ్చయించు కొన్నా అదితప్పక నెరవేర్చి తీరుతాడ"న్నాడట. వేరొకాయన అసాధ్యమైనపని నెవ్వరూ చేయలేరని అంటే, దళాధికారి, అలెక్సీకి 'అసాధ్య' మనే మాట తెలియ దన్నాడు. "వాతావరణాంయపుటమ్మాయి" వచ్చింది మొదలూ అలెక్సీని గురించి తెగ అడిగిందనీ, తన కంతట విసుగెత్తి, "వెనుతిరిగి వెళ్ళిపో" మ్మన్నాననీ వ్రాసాడు. తాను వెళ్ళిన రెండోరోజే, విమానంలో ఎగిరాడు. కాళ్లు బాగా బలం పట్టి తన స్వాధీనంలో నున్నాయట. కొత్తరకం విమానాలు – L - a 5 విమానాలు– రానున్నాయి, దెగ్త్యారెంకో ఈ విమాన మొకదానినప్పుడే వుపయోగించాడు. జర్మనువిమానాలు వీటిముందెందుకూ పనికిరావు, దిగతుడుపు తుడచడానికి కూడా ఉపయోగపడవని వ్రాసాడు.

# 13

వేసవి వచ్చింది. మన నలభై రెండోనంబరు గదికి వెలుపలనున్న పోప్లార్ చెట్టు ఆకులు గట్టిపడి, నిగనిగా మెరుస్తున్నాయి. ఒకదానితో నొకటి ప్రొద్దస్త మానమూ గలగలా మాట్లాడుకొనేవి. వాటిమీద పగలంతా వచ్చివెళ్లేబండ్లు ఎత్తి పోసిన రోడ్డు దుమ్ముపడి సాయంకాలానికవి మాసిపోయేవి. గుబురుగా పెరిగిన పూలగుత్తులు, కుంచెలమాదిరి గాలిలో చలించాయి. వాటినుండి లేచిన మెత్తని పుప్పొడి మాస్కోనగరమంతటా గాలిలో తేలుతూ వెళ్లేది. ఆస్పత్రి కిటికీలూ, తలుపులమూలల్లో గులాబిరంగు కుంకుమమాదిరి పుప్పొడి కుప్పలుగా పేరుకొనేది.

ఒకరోజు ప్రొద్దున ఎనిమిదింటికి క్లావ్డియా గదిలోకి ఇంకొక మనిషిని వెంటబెట్టుకొని వచ్చింది. తెల్లటి తగరం చట్రపు కండ్లద్దాలు పెట్టుకొన్న ఆ మనిషి గంజిపెట్టి కొయ్యమాదిరి ఇస్త్రీచేసిన తెల్లటి అంగీ తొడుక్కొన్నాడు. అతని చేతిలో నున్న పెద్ద కాగితపు మూటను అలెక్సీ మంచందగ్గిర, నేలమీద పెట్టాడు. వార్నిషూ కొత్తచర్మం వాసనా, ఆ మూటనుండి గుప్పున కొట్టాయి. అతడా మూటను నెమ్మ దిగా, బహు జాగ్రత్తగా విప్పాడు.

దానిని పొంతం విప్పగానే రెండు, సరికొత్త కృత్రిమ పాదాలు కన బడ్డాయి. అవి తీసుకొనిన కొలతకు, అచ్చంగా పాదాలమాదిరే చేసాడు. వాటికి ఒక జత గోధుమరంగు బూట్సులు తొడిగాడు. వాటిని అలెక్సీ కాళ్ళకి తగిలిస్తే నిజం కాళ్ళు. పాదాలకు బూట్సులతో నున్నట్టు లగుపించాయి, బహుచక్కగా, అణుమాత్రంకూడా హెచ్చుతగ్గులు లేకుండా అవి అతని కాలికి కుదిరాయి.

పడుంపేద చేతులిడి. కండ్లద్దాల పైనుండి అలెక్సీ తొడుగుకొన్న పాదాల నా మనిషిచూసి, "చేతికొక జత కొత్త గ్లోవ్స్ (కాలి మేజోళ్ళవంటివి) తొడుగుకొండే, టింగురంగా అంటూ, పెండ్లికొడుకులాగా నడిచి, చర్చికి పెండ్లి చేసుకోవానికి వెళ్ళవచ్చు. వీటిని వాసిలివెక్ తయారు చేయమన్నాడు. 'జూయవ్! నిజం కాళ్ళుంటె బాగుండేట ట్లొక జతపాదాలు. చేయమన్నా'డాయన. జూయవ్ తనపనివాడి తనమంతా చూపించాడు, రాజాధిరాజులకు తగిన జత" అన్నాడు సగర్వంగా.

వాటిని చూడగానే అలెక్సీ గుండె అధః పాతాళానికి దించుకుపోయింది. గుండె ఆగిపోతుందనుకొన్నాడు. మరు నిమిషం ఈ భయంతీరి, వాటిని తొడుగుకొని ఇతరుల సహాయం లేకుండా నడవాలని ఆశ పుట్టింది. తన మొండికాళ్ళను దుప్పటి క్రిందినుండి జాపి, వాటిని తగిలించ మన్నాడు. వచ్చిన ముసలాడు పూర్వం తానొక గొప్ప జమీందారు కొక కాలును తయారు చేసాడట. గుర్రం పై నుండి పడి కాలు విరిగింది. ఇటువంటి కబుర్లన్నీ చెప్పుతూ కూర్చున్నాడేకాని వాటిని తొడగలా. తన పనివాడి తనానికి తానే ఆనందిస్తూ, వాటిని వెంటనే అలెక్సీకి తొడగడాని కాతనికి మనస్సు వచ్చిందికాదు, తొడిగితే, వచ్చిన పని పూర్తి అవుతుంది. తనకూ వాటికీ సంబంధం తీరిపోతుందన్నట్లా తనకి తోచింది కాబోలు.

వాటిని తన చొక్కా చేతితో మెరుగువచ్చేటట్టు రుద్దాడు. ఎక్కడో మచ్చ కనిపిస్తే దానిని గోటితో గీకి, దానిమీద నోటినుండి వెచ్చని తడిగాలి నూది, మల్లె పూవువంటితన చొక్కాతో శుభ్రంగా తుడిచాడు: వాటిని నేలమీద పెట్టి, వాటి కంతదూరంగా జరిగి నిలబడి వాటిని చూస్తూ మురిసిపోయాడా తాత

"రావయ్యా! తాతా. ఏదీ తొడిగిచూద్దామంటూ", మంచంమీద లేచి కూర్చొనిన అలెక్సీ తొందరించాడు.

అలెక్సీ యొక్క మొండికాళ్ళను రెప్పవాల్చకుండా చూసి, సంతోషపడ్డాడు. ఆ మొండికాళ్లు బాగా కండలుపెరిగి, బలంగా కనిపించాయి. సాధారణంగా పరిశ్రమ లేకపోవటంవల్ల విరిగిన కాళ్ల క్రొవ్వుపట్టి మెత్తగా దూదిలాగా వుంటాయి, కాని బాగా నడిచేమనిషి కాళ్ళలాగా అలెక్సీ కాళ్లు కండలుతేరి వుండటం తాతకు బాగా నచ్చింది.

"రావయ్యా! రావయ్యా! ఏమిటా తొందర? అంతా మాటను చెప్పినట్టే అనుకొన్నావుకాబోలు!" నంటూ తాత సణిగాడు. "వాసిలివెక్, 'జూయవ్'! ఇంతకుముందు నీ వెన్నడూ చేయనంత సొగసుగా చేయి. ఈ లెఫ్టినెంటు పాదాలు లేకుండా విమానం నడిపించాలని ఆశపెట్టుకొన్నాడు;' అన్నాడు, ఇవిగో! జూయవ్ చేసిన పాదాలు. ఈ పాదాలతో నడవటమేకాదు, సైకిల్ త్రొక్కవచ్చు

నడుము పట్టుకొని అందకత్తెలతో నాట్యమాతనమ్మ... నా మాట నమ్మ, బలే మంచి పాదాలు !" అన్నాడు.

అలెక్సీ కుడికాలికిపాదం తొడిగాడు. దానిలో మెత్తటిదూది వుండబట్టి చాలా బాగున్నదిని పించింది. తరువాత దానిని గట్టిగా వాదతోక్కే బిగించాడు. అంత దూరంగా నిలబడి "భేష్" అన్నాడు.

మాంచి బూటు ఇది సరిపోయిందా ? లేక బిగుతుగావున్నదా ? ఎక్కడన్నా కొరుకుతోందా ?.... బాగున్నదా ? మరి ? మాస్కో మొత్తంమీద జూయవ్‌కు సమానమైన పనివాడంటూ మరొకడులేడు."

అదేమాదిరి ఎడమ పాదాన్ని కూడా తొడిగాడు తొడిగాడోలేదో. అలెక్సీ చటుక్కున క్రిందికి దుమికాడు, దభీలున శబ్దమయింది. అలెక్సీ పెద్దపెట్టున అరిచి నేలమీద పడిపోయాడు, తాతయ్య గాభరాపడ్డాడు. ముక్కవాలను మదిటికి జరిపిచూసాడు అలెక్సీ రెండు కాళ్ళూబారజాపి పడుకొనటంచూసి అతని కాళ్ళర్యం వేసింది. చాలా బాధపడుతున్నాడా ? లేకఅనవసరంగా భయపడిపోయాడా ?

క్లాడియా పరుగెత్తుకొచ్చింది. తాతా ఆమెచేరి అలెక్సీని నెమ్మదిగా పైకెత్తి మంచంమీద కూర్చోబెట్టారు. పూర్తిగా దిగాలుపడిపోయాడు అలెక్సీ.

"అబ్బాయీ ! ఎంతపని చేసావు? నిజం పాదాలను కొన్నావా, ఆమాదిరి దుమకడానికి ?.... ఏమాత్రం కూడా దిగులుపడవద్దు. నడవడం నేర్చుకోవాలి. నీవొక పెద్దవైమానికుడువనే మాట మరిచిపో. నడకనేర్చుకొనే శిశువుమాదిరి. మొదట్లో చంకకర్ర లుపయోగించీ, తరువాత గోడలూ మంచాలు పట్టుకొనీ, ఆమీదట చేతికర్రనూతగొనీ నడవటం నేర్చుకోవాలి. ఒక్క దెబ్బన నడిచేద్దా మనుకోవద్దు; క్రమక్రమంగా. మెల్లెక్కి వెళ్ళాలి.... అమాంతంగా వాటితో దుమికావు ! ఇంతచక్కగా మరెవ్వరూ చేయలేరని తెలుసుకో. కాని, ఇవి నీ కాళ్ళుకావుగా ? మన అమ్మా, నాయనా చేసి ఇచ్చినంతమంచి పాదాలను ఇతరులు చేయలేరు." అన్నాడు, తాత ఆపేక్ష వుట్టిపడేటట్టు.

అలెక్సీ కాళ్ళింకా నొప్పి పెడుతున్నాయి. కాని నడక నేర్చుకోవాలనే ఆదుర్దాకొద్దీ, చంకకర్రలు తెమ్మన్నాడు. తేలికయిన, అల్యూమినం చంక కర్రలను తెచ్చియిచ్చారు. వాటిని జాగ్రత్తగా చంకలక్రింద చొప్పించాడు. వాటి నంతట రవంతదూరంగా ముందుకుపెట్టి నేల కానించి నిలబడి చూసాడు. నొప్పి పెట్టలా. చిన్నబిడ్డకు తాను నడవగలనని తెలిసినా. గోడను పట్టుకొని అడుగుతీసి అడుగు పెట్టుతుంది. ఏ అమ్మమ్మ వ్రేలో పట్టుకొని. నెమ్మదిగా కాలుతీసి కాలుపెడుతూ, అడుగడుగుకూ, నిలబడి వెడుతుంది. ఇటువంటి జాగ్రత్త లేకపోతే తానూ పడి పోతానని అలెక్సీకి తెలిసింది. క్లాడియా ఒక ప్రక్కా, తాత ఇంకో ప్రక్కా పట్టు కొని నెమ్మదిగా ఆదుకొన్నారు. ఒక కర్ర నించుక ముందుకు జరిపి నేల కానిం

చాడు. ఆ కాలిమీద బరువుపడి బహూ నొప్పిపెట్టింది. రవంత నిలబడి రెండో కాలిని ముందుకు జరిపాడు. కాలు కదిలినప్పుడల్లా కొత్తచర్మం. కిర్రు చెప్పుల మాదిరి కిర్రు, కిర్రు మన్నది.

"బలే భేష్ .... భేష్" అన్నాడు తాత.

నెమ్మదిగా మరి రెండడుగులు. కాళ్ళు తగని నొప్పిపెట్టాయి. గది గుమ్మం దగ్గరికివెళ్ళి, తిరిగీ తన మంచమును చేరుకొన్నాడు. పెద్ద ఖజానాపెట్టెని భుజాన మోసుకొని మేడమెట్లెక్కిన ట్లనిపించింది. అలెక్సీకి. మంచంమీద. చెమర్చుతూ బోర్లా పడుకొన్నాడు.

"ఎట్లాగున్నాయి? ఈ లోకంలో జూయవ్‌వంటి పనివాడుండటం నీ అదృష్టం" అన్నాడు సగర్వంగా. వాటు ఊడదీసి పాదాల నవతల పెట్టాడు. అలెక్సీకి కాలి మొనలు కందిపోయాయి. రవంత వాచాయికూడా. "వీటితో సాధారణ ఇతర వైమానికుల మాదిరి ఎగరటం మాత్రమే కాదు. నీవు చేయగలది. దేవుడి దగ్గిరికే ఎగిరి వెళ్ళవచ్చు"న్నాడు ముసలాడు.

"నమస్కారాలు. నమస్కారం చాలా అద్భుతంగా నున్నాయి. చూస్తేనే తెలుస్తోంద"న్నాడు అలెక్సీ.

చేతులు నులుముకొంటూ తాత నిలుచున్నాడు. తన్నేదన్నా అలెక్సీ అడుగుతాడనో, లేక తానే అత న్నేదన్నా అడగాలనీ. కాని అడగటానికి ధైర్యం చాలనట్టూ నిలబడ్డాడు. అలెక్సీ వే రెట్టిమాటా మాట్లాడలా.

నిట్టూర్చి తాత, "సరే వెళ్ళవస్తాను. నీ కవి తప్పకుండా బాగా పని చేస్తాయిలే" అంటూ దారి పట్టాడు.

తాత గది గుమ్మం దగ్గిరికి వెడుతోంటే స్ట్రొఖొవ్ "ఏయ్, తాతా! ఇదిగో యిది తీసుకో, రాజాధిరాజులకు తగిన పాదాలు చేసావు. ఏదన్నా యింత త్రాగ" మంటూ రెండు రూబుల్ నోట్లు నిచ్చాడు.

"వందనం....వందనాలు. ఇదొక పర్వదినం నా జీవితంలో" నంటూ తన తెల్లని పైకోటును తొలిగించి, క్రింద షర్టు జేబులో ఆ రూబుల నోట్లను పెట్టాడు. "నమస్కారం; తప్పకుండా ఏదన్నా, దాహానికి పుచ్చుకొంటానులే. ఈ పాదాల సంగతా? నా పనివాడితనమంతా చూపెట్టానంటే నా మాట నమ్ము. వాసిలివెక్, 'జూయవ్! ఇదొక ప్రత్యేకమైన పురిమాయింపుగా భావించాలి. బహు జాగ్రత్తగా చేయాలి. పాడుచేసేవుసుమా!' అన్నాడు. జూయవ్ జీవితంలో పని తలపెట్టటమూ. అది పాడవటమూ అనేది లేదు. వాసిలివెక్ వస్తే ఇవి బాగా నచ్చాయని చెప్పు."

అందరికీ నమస్కారంచేసి, తనలో తానె ఏదో అనుకొంటూ అతను వెళ్ళిపోయాడు. తన మంచం చెంతనువ్న ఆ పాదాలను చూస్తూ అలెక్సీ పడుకొన్నాడు.

వాటి సొగసూ, పనివాడితనమూ అతని కెంతో నచ్చాయి. సైకిలు త్రొక్కవచ్చు, అమ్మాయిలతో నాట్యంచేయవచ్చు విమానం నడిపించవచ్చు. దేవుడిదగ్గిరికే ఎగిరి వెళ్లవచ్చునన్నాడు,తాత. "ఇన్నిపనులూ చేసితీరుతాను, దేవుడు మేలుచేస్తే" అన్నాడు.

ఆమరునాడు వోల్గా కొక జాబు వ్రాసాడు. ఎన్నిదినాలయిందో, ఇటువంటి ఉత్తరం వ్రాసి. తానింకవారంకు యుద్ధభూమికి వెనకాలెక్కడోనున్నాడు. అక్కడి నుండి యుద్ధభూమికి త్వరలో పంపలాయిస్తారు. పురాతన స్నేహితు లెందరో, తానెప్పుడు వస్తాడా అని కనిపెట్టుకొనివున్నారు. కొత్తరకం విమానాలు రాబో తున్నాయి. తానుకూడా ఈ నూతన విమానాలలో ఎక్కి యుద్ధం చేయవానికి వెళ్లే రోజులాసన్నమయి నందుకు తనకెంతో సంతోషంగానున్నది. ఈ మాదిరి జాబు వ్రాసి ఎన్నిరోజులయిందో! ఆమెను గురించి అనుకోని రోజులేదు. యుద్ధం ముగిసాక, తాను కనేకలలన్నీ నిజమవుతాయని తనకు గట్టినమ్మకం కలదు. ఆమె తనమనస్సు మార్చుకొనకపోతే, చిలకా గోరింకల్లాగా కులాసాగా కాలంగడిపే రోజులు రానున్నాయని తానెంతో ఉవ్విళ్లూరుతున్నాడు. ఉత్తరమంతా మరోసారి జాగ్రత్తగా చదివాడు. ఏమనుకొన్నాడో ఏమో ఆఖరివాక్యాలు కొట్టివేసాడు.

"వాతావరణాలయపు టమ్మాయికి," బలేసరదాగా వ్రాసాడు. ఆక్రితం రోజు జరిగిన విషయాలన్నిటినీ పూసగ్రుచ్చినట్లు వర్ణించాడు. ఆ కృత్రిమ పాదాల పటానొక్కటి గీచి వర్ణించాడు. మొట్టమొదట్లో అతనెంత కష్టపడ్డదీ. పనివాడు చెవికోసిన నక్కమాదిరెట్లా వాగినదీ, అన్నీ వ్రాసాడు. సైకిలు త్రొక్కటమూ నాట్యమాడటమూ మాత్రమేకాక, దేవుడి దగ్గిరికే ఎగిరివెళ్ళవచ్చు నీపాదాలతో" అని తాత చెప్పాడని వ్రాసాడు. "కాబట్టి, వైమానిక దళంలో నాకొక స్థానం ఏర్పాటుచేయమనీ, నేను త్వరలో వస్తాననీ దళాధికారికి చెప్పమనీ" వ్రాసాడు, మంచం క్రిందనున్న పాదా లగుపించాయి. వాటిని చూస్తే మంచంక్రింద నెవరో మనిషిపడుకొని, అతడు, తొడుగుకొన్న కొత్తబూట్సు లగుపించుతున్నట్లూ అవి కనుపించాయి, అటూ, ఇటూ పరికించి ఎవ్వరూ చూడకుండా ఆ పాదాలను ఎంతో ఆప్యాయంగా తాకాడు. వెర్రి ఆనందంతో ఉప్పొంగిపోయాడు. ఆ బూట్సు చేతికి తగలటంతోటే ప్రాణం లేచి వచ్చిందాతనికి.

నలభై రెండో నంబరు గదిలోనేకాక, వేరొకచోటకూడా" రాజాధిరాజులకు తగిన కృత్రిమ పాదాలనుగురించి చాలా చర్చజరిగింది. మాస్కో విశ్వవిద్యాలయపు వైద్యకళాశాలలోని మూడో సంవత్సరం విద్యార్థు లీవిషయాన్ని చర్చించారు. అన్యూతా మూడోసంవత్సరం తోడి విద్యార్థిను లందరితో, ఈ పాదాలనుగురించి ఎన్నో విషయాలు చెప్పింది, తన స్నేహితుడీవిషయాలను వ్రాస్తున్నాడంటూ, గ్వోజ్దెవ్ గ్రిగొరీ వుత్తరాలను చదివేది, తోడి విద్యార్థులకు తనకొరకని ప్రత్యేకంగా వ్రాసినభాగాలను మట్టుకు అన్యూతా చదివేదికాదు, రానురాను వుత్తరాలల్లో ఇటువంటి విషయాలనే ఎక్కువెక్కువుగా గ్రిగొరీ వ్రాసాడు.

మూడో సంవత్సరపు విద్యార్థిను లందరికీ గర్జేవ్‌తో ఎక్కడలేని స్నేహమూ ఏర్పడింది. కుపష్కినంటే ఎవ్వరికీ గిట్టలా స్టిఫాన్ ఇవానొవిక్. టాలుస్టాయి నవలలోని కరటయవ్‌మాదిరి మనిషి అన్నారు. అలెక్సీ యొక్క పట్టుదలకూ. ఏకాగ్రతకూ వారచ్చేరు వొందారు. కమిసారుని గురించి గ్రిగోరీ ఎంతో గొప్పగా వ్రాయటంవల్ల అతడు చనిపోవటం విద్యార్థినులందరికే చాలా కష్టమనిపించింది, అతని మరణవార్త విని కంటతడిపెట్టిన బాలికలెందరో!

రోజులు గడిచేకొద్దీ ఆస్పత్రి, విశ్వవిద్యాలయముల మధ్య వుత్తర ప్రత్యుత్త రాలు జోరుగా సాగజొచ్చాయి. సాధారణ టపాకంటె త్వరగా తమ వుత్తరాలు వెళ్ళాలనే ఆశకొద్దీ వేరొక మార్గం కనిపెట్టారు. కమిసారు ఉత్తరాలను గురించి చెప్పిన వాక్యా లొకపర్యాయం, గ్రిగోరీ అన్యూతాకు వ్రాసాడు. "ఉత్తరాలు దూరపు నక్షత్రాలనుండి వచ్చే వెలుతురువంటివి. నక్షత్రం చనిపోయి. రూపు మాసి పోయిన ఎంతకాలానికో తరువాత ఆ వెలుగువచ్చి చేరుతుంది. ఇదేమాదిరి మనిషి చనిపోయాక. అతడు వ్రాసిన వుత్తరాలు వస్తాయట!" తమ వైద్యకశాలలోనూ. వాసిలివెక్ దగ్గరాకూడా పనిచేసే ఒక నర్సుద్వారా అన్యూతా తన జాబులను పంపించేది. ఇందుమూలంగా ఉత్తరం త్వరలో గ్రిగోరి చేతుల కందేది.

నలభై రెండోనంబరు గదిలో ఏది జరిగినా. అది జరిగిన రెండో రోజుకే అది వైద్య కళాశాలలో తెలిసేది. "రాజాధి రాజుల పాదాలను" గురించి చర్చించ టంలో. అలెక్సీ విమానంలో వెళ్ళగలడా లేడా అనే విషయాన్ని విద్యార్థినులందరూ చర్చించారు. రెండు పక్షాలవారూ, వారి అభిప్రాయా లెట్లున్నప్పటికీ, అలెక్సీయెడల ఎంతో సానుభూతిని చూపించారు, యుద్ధ విమానాల నడపటం చాలా కష్టమైన పని కాబట్టి అలెక్సీ ఎన్నటికీ ఎగురజాలడన్నారు కొందరు. మరికొందరు, పదిహేను దినాలపాటు. దేకొంటూ అన్నం నీళ్లూ లేకుండా అడవుల్లో తిరిగి బ్రతికి బయట పడ్డ మనిషికి అసాధ్యమనేది వుండదన్నారు. చారిత్రకంగానూ. తా మెరుగున్నవీ దీనికెన్నో దృష్టాంతా లిచ్చారు.

అన్యూతా తరుచుగా ఇటువంటి విషయాలల్లో కల్పించుకొనేదికాదు, టాంకు వీరుడు గ్రిగోరీని గురించి విన్నప్పు డామె మనస్సు చాలా నొచ్చుకొన్నది. అత డంటే ఆమె మనస్సులో గౌరవభావం ఏర్పడింది, జాలిగొని అతనికి జాబులు వ్రాయటం ప్రారంభించింది. మొదటి రోజుల్లో అతడంటే ఏదో పేరు మాత్రం ఆమెకు తెలిసిందేకాని, రోజులు గడిచేకొద్దీ అతడిమీద అభిమానమూ, అత డంటే ప్రేమా పుట్టుకువచ్చాయి. అతనినుండి వచ్చే జాబులు ఆలస్యమయితే అన్యూతా చాలా నొచ్చుకోటం జరిగింది. వస్తే ఎక్కడలేని సంతోషమూ, రావట మాలస్యమైతే దుఃఖమూ! ఇదంతా ఏమిటి? ఆమెకు సంతోషదిగ్భ్రమలు రెండూ కల్గాయి ప్రేమ అంటే ఇదే కాబోలు! తాను చూడని మనిషిని, అతని కంఠ మైనా విననప్పుడు, కేవలం ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినంత మాత్రాన, ప్రేమించ

డానికి వీలవుతుందా? దరిమిలావచ్చే జాబులలో తనతోటి విద్యార్థులకు చదవటానికి వీలుపడని విషయాలెన్నో వుంటున్నాయి. "ఉత్తరాల ద్వారా తన కామెయెడల ప్రేమ కుదిరిందని" గ్రిగోరీవొకసారి వ్రాసాడు. తన సంగతీ! అంతే కాబోలుననిపించింది. వచ్చాలు గేండ్ల బడిపిల్లల కుర్రతనపు ప్రేమకాదిది. దీనిలో తనకు అందని, గ్రాహ్యంకాని లోతులున్నాయని పించింది. కనిపెట్టుకొని కూర్చునే. ఈ జాబు ఒక్కరోజు రాకపోయినప్పటికీ ఆ దినమంతా అన్నం. నీళ్లూ తాకబుద్ధయ్యేదికాదు.

పై విధంగా అన్యూత. గ్వాజ్దేవులు తమ అన్యోన్య ప్రేమను ఉత్తరాల ద్వారా ఒకరికొకరు తెలుపుకొన్నారు. కాని ఉన్నట్టుండి గ్వాజ్దెవ్ జాబులలో మార్పు కనిపించింది. మునుపటి ధైర్యమూ, చొరవా, తగ్గాయి. ఎందుకనో జంకుతూన్నట్టూ. దేనినిగురించో భయపడుతూన్నట్టూ కనిపించాయి అతని ఉత్తరాలు. ఉత్తరాల ద్వారా ఒకరినొకరు ప్రేమించుకొనటం శ్రేయస్కరం కాదేమోనని ఒక పర్యాయం వ్రాసాడు. మరోసారి తా నెటువంటి మనిషో, కొంచెమైనా తెలియకుండా ఆమె తనపై ప్రేమ చూపరాదన్నాడు. తా నామెకు పంపిన తన ఛాయాపటం పూర్వ మెప్పుడో తీయించుకొన్నది. ఇప్పుడాతని ముఖమునూ, దాని పైనున్న కాల్పులనూ, మచ్చలనూచూస్తే తన వుద్దేశం తప్పక మారుతుం దని వ్రాసాడు. ఆమెను మోసగించరాదు. ఒకసారివచ్చి చూసేటంతవరకూ, మునుపటిమాదిరి వ్రాయవద్దని ప్రార్థించాడు అన్యూతాను.

ఇది చదవటంతోటే ఆమె కెక్కడలేని కోపమూవచ్చి, తన జేబులోనుండి అతని ఫొటోను తీసి చూసింది, అదెంతో ఆకర్షణీయంగా కనిపించింది. యౌవ్వన ముట్టిపడే చక్కని ముఖమూ, పొడుగైన ముక్కూ, చిరునవ్వూ, నూనూగు మీసాలూ! "ఇప్పుడో? ఇప్పు డెట్లున్నావోగదా!" అని రెప్ప వాల్చకుండా దాని వంకే చూసింది. డాక్టరు చదువుతోందేమో. కాలటంవల్ల ఏర్పడేమచ్చలు చాలా వికృతంగా నుంటాయని అన్యూతాకు తెలుసు. ఆస్పత్రిలోనుండే ఒక రోగి అప్పు డామెకు జ్ఞాపకం వచ్చాడు. అతని ముఖంనిండా నీలిరంగు కాలినమచ్చలూ, మొటిమలూ, గోతులుపడిన పెదవులూ, గద్దిదుబ్బుమాదిరి అక్కడక్కడ పెరిగే కను బొమలూ, రెప్ప వెంట్రుకలులేని నిప్పుకణాలవంటి కంటిగ్రుడ్లూ! గ్వాజ్దెవ్‌కూడా ఇదేమాదిరి ఉంటాడు కాబోలు! ఈ ఆలోచన కలగగానే ఆమె శరీరమంతా జలదరించింది. కాని వెంటనే తనను తానే దూషించుకొని "ఉండనీ! ఉంటే మటుకేమి? అతడీ స్థితికి రావడానికి కారణం, దేశంకొరకు పోరాడటం అనేది మరిచిపోరాదు. తన ప్రాణాలను తృణప్రాయంగా చూసుకొని, దేశంలో నలుగురికీ స్వాతంత్ర్యమూ, విద్యా, ఆరోగ్యమూ, చేకూరాలనే గదా గ్రిగొరీ పోరాడింది? ఇత డొక సామాన్యుడు కాడు. తన ఒళ్లు బాగుపడాలనీ, వెంటనే తిరిగీ యుద్ధానికి వెళ్లాలని చెప్పుల్లో కాళ్లుపెట్టుకొని వున్నాడు. ఈ యుద్ధసమయంలో ఈనేమాత్రం

దేశంకొరకు పాటుబడింది? యుద్ధభూమిలో కొలువలు త్రవ్వింది, విమానాల దాడుల సమయంలో వాలంటీరుగా పనిచేసింది. ఇప్పుడీ ఆస్పత్రిలో పనిచేస్తోంది. గ్రిగోరీ చేసినపనులకూ, త్యాగానికీ తాను చేయగలిగిన దానికీ ఎంతో తేడాకలదు. అతనితో సాటికాగలవారు ఏకొద్దిమందో వుంటారు. ఛీ! అటువంటి మనిషిని గురించి కానిపుద్దేశాలు కలగటం సిగ్గుచేటు" అనుకొన్నది. ఆస్పత్రిలోనున్న ఆరోగి భయంకరాకారం, వికృత స్వరూపమును మరిచిపో జూచింది.

ఇంతవరకెన్నడూ రాయనంత పెద్ద వుత్తరం ప్రేమపూరితమైన జాబు నొకటి ఆ దినం వ్రాసింది. దానిని చూసి గ్వ్రాజెవ్ విస్మయం జెందాడు. తాను వ్రాసిన జాబును చదివి, దానికి వ్రాసిన ఈ బదులును చూస్తే అతనికి, అన్యూరామీద ప్రేమకుతోడు, పూజనీయభావంకూడా ఏర్పడింది. ఆమె మనోవ్యథ చెందటమూ, తనకుతానే బుద్ధిచెప్పుకోటమూ ఇతనికేమీ తెలియవు, దాని నెన్నిపర్యాయములు చదివాడో, ఆరోజంతా ఆమెనిగురించి స్త్రిభాషికు కూడా చెప్పాడు. చెప్పిన దంతా సావకాశంగా విని:

"గ్రిగోరీ! తెలివితేట లుపయోగించి నడుచుకో, అందమైన ముఖమూ, చందంలేని హృదయమూ అంటారు, ముఖపు టందంచూసి మురిసిపోరాదు, మొగవాళ్లు కరువైన ఈరోజుల్లో అందచందాలని కూర్చుంటే పెండ్లికావటం కష్టం, నీ వార్డరు అమ్మాయికీ విషయం తెలిసే వుంటుంది" అన్నాడు.

మేజర్ చెప్పిన మాటలు గ్రిగోరీ కంతగా నచ్చలా. రోజులు గడిచాయి. ఆస్పత్రినుండి విడుదలయ్యే రోజు దగ్గిరికి వచ్చేకొలదీ, తెగ ఆదుర్దా కలిగింది. తరుచుగా దూరంనుండి అద్దంలో చూసుకొనేవాడు. మరొకపుడు అద్దానికి దగ్గర నిలబడి, ముఖమును దాని కదికించి, మచ్చలనూ, గోతులనూ చూసుకొని వాటిని తుడిచిపారవేయడానికా అన్నట్లు, వ్రేలితో వాటిమీద రాచేవాడు. ముఖమంతా గంటలతరబడి చేత్తో తోమేవాడు.

క్లావియాతో చెప్పగా ఆమె మునిఖాకి పూసుకోడానికి క్రీమూ, పౌడరూ తెచ్చి యిచ్చింది. కాని అటువంటి వెంతమాత్రంకూడా ప్రయోజనపడవని తెలుసు కొన్నాడు. గ్వ్రాజెవ్ రాత్రిపూట అందరూ నిద్రపోయే సమయం కనిపెట్టి, నెమ్మదిగా స్నానాలగదిలోకి వెళ్ళి ముఖానికి క్రీము పట్టించి, ఎంతోసేపు చర్మమును రుద్దేవాడు. అద్దంలో చూసుకొనేవాడు. దూరంనుండి చూస్తే, విశాల వక్షమూ, సన్నని నడుమూ, కండలుతిరిగిన కాళ్లు, అద్దంలోని రూపం చాలా ఆకర్షణీయంగా కనుపించింది. కాని అద్దందగ్గిరికి వెడితే? ఎర్రటి గోతుల్లాంటి మచ్చలు. గడ్డం మీదా, చెక్కిళ్ళపైనా కనిపించేవి. ముఖంమీది చర్మమంతా పట్టిలాగినట్లు బిగదీసుకు పోయింది. "ఈ ముఖాన్ని చూస్తే, ఆమె ఏమంటుందో?" అని తనలో కానే వితర్కించుకొంటాడు. భయటడి, ఛివాలున వెనుతిరిగి వెళ్ళిపోతుంది. ఒక్కమా

ఏయినా తిరిగి చూడదు. లేకపోతే, ఏదీ మాట్లాడకుండా వెళ్ళిపోతే బాగుండదను కొని. ముఖాపంగా కొంచెసేపు మాట్లాడి తుదకు వెళ్ళిపోతుందికాబోలు ! ఈ ఆలోచన రాగానే ముఖమంతా పాలిపోయి. భయంతో కంపించిపోయింది.

తన కోటు జేబులోనుంచి ఆ విద్యార్థిని ఫోటోను తీసి రెప్ప వాల్చకుండా ఎంతోసేపు చూసేవాడు. గుండ్రని ముఖం పెద్ద నుదురు వెనుకకు ఎగదువ్విన మెత్తటి లేత వెంట్రుకలు గుండ్రంగా చివర కొంచెం పైకెత్తుకొనిన రష్యను ముక్కు చిన్నపిల్లలవంటి అమాయకపు పెదవులు. ఈ చక్కటి గుండ్రని ముఖంలో. కొంచెం వుబ్బెత్తుగా నుండే రెండు కండ్లు. ఆకర్షణీయమైన ఆ రెండు కండ్లూ గోధుమ రంగుగానో. లేక నీలంగానో వుంటాయికాబోలు! పై పెదవిమీద చక్కని పుట్టుమచ్చ.

"చూడు ! ఇదిగో. నా వంకచూడు ! నన్ను చూసి భయపడి పారిపోతావా ? లేకపోతే, నా వికృతరూపంలో కూడా అందమును కనిపెట్టగల వెన్నపూసవంటి హృదయమా. నీది చెప్పు నాకుచెప్పవూ ?" అంటూ ఆ పటంతో మాట్లాడుతాడు పాపం !

ఈ విధంగా గ్రిగోరీకి కాలంగడుపుతోంటే. చంక కర్రలనూతగొని టప్పు టప్పున శబ్దంచేస్తూ, కొత్తబూట్లు కిర్రుకిర్రుమనేటట్లు. అలెక్సీ అటూ ఇటూ పచార్లుచేసేవాడు. ఒకసారి. రెండు. నాలుగు. పది. ఇరువై పర్యాయములు. గది వెలుపలి వసారావొడుగున బోనులోని పులిమాదిరి. తెగతిరిగేవాడు. ప్రొద్దునా. సాయంత్రమూ, ఏదోవొక నిర్ణీతసమయ మప్పుడీవిధంగా నడవటం నేర్చుకొనే వాడు. రానురాను ఎక్కువ కాలం నడిచాడు.

"మనిషంటే, అలెక్సీ ! ఎంతపట్టుదల ? ధైర్యమంటే అలెక్సీ పేరు చెప్పి మరొకడిని పేర్కొనాలి. చంక కర్రలుపయోగించి ఒక్క వారంలో నడక నేర్చుకొన్నాడు ! నిన్న మందు వేయించుకోడానికి, రోజూమాదిరి, మంచంలో పడుకొని వెళ్ళనన్నాడు. తనంతటతానే నడిచివెళ్ళాడు. కండ్లనుండి నీరు కారింది. కాని తలుచుకొన్నంతపనీ చేసాడు. ఎవడో ఆస్పత్రి నవుకరు సహాయంచేద్దామని సమీపించాడు. ఒక్కకేకపెట్టి తాకవద్దని గర్జించాడు. మందులువేసే గదిని చేరినప్పుడాతని ముఖం, పూర్ణచంద్రుడి మాదిరి విప్పారింది. ఎవరెస్టు శిఖరమునెక్కినంత సంతోషం కలిగింది. అలెక్సీకి" అనుకొన్నాడు గ్రిగొరీ.

అద్దం దగ్గిర నిలబడిన గ్రిగొరీకి నడిచివెళ్ళే అలెక్సీ అగుపించాడు." అది నడకా ? కాదు. పరుగుఅనే చెప్పాలి. ఎంత అందమైనముఖమో ఎడమకణతనొక మచ్చవున్నమాట నిజమే, కాని, అదేమీ అందవికారంగాలేదు. ఒక విధంగా ఆ మచ్చ అందాన్నిస్తోంది, నాకూ అటువంటి ముఖముంటే, ఎంత బాగుంటుందో గదా ! పాదాలు లేకపోతే పెద్ద చిక్కేమున్నది ? వాటి నెవరు చూడవచ్చారు

గనుక ? అలెక్సీ నడుస్తాడు. విమానమెక్కి వెళ్ళనూ వెళతాడు. నాకు తెలుసు. ఇటువంటి భ్రాష్టముఖాన్ని దాచిపుంచటానికి ఎవడితరం ? రాత్రంతా త్రాగుమోతు దయ్యాలు ముఖంమీద గులకరాళ్ళను పిండికొట్టి నట్లే ముఖంచూస్తే నాకే రోత పుడుతోంది" అనుకొన్నా డాతడు.

ఇంపై మూడో పర్యాయం వసారా పొడుగునా అలెక్సీ అప్పుడు నడుస్తున్నాడు. తొడలు వాచిపోయాయి, చంకకర్రల వత్తిడివల్ల భుజాలు పీక్కొని తింటున్నాయి. వెడుతోంటే, అడ్డంచెంత నిలబడిన గ్రిగోరీనిచూసి "తమాషా మనిషి ! ఎందుకా ముఖంచూసి అట్లా దిగులుపడుతాడు ? సినిమాలో నటించటానికి వీలు పడదన్నమాట నిజం. కాని, తిరిగీ టాంకుదళంలో చేరటాని కభ్యంతరం వుండదుగా ? పద్దని అడ్డగించ గలవాడెవడు ? కాళ్ళూ, చేతులూ బాగుండి తెలివి తేటలతో పనిచేయ గలిగితే, ముఖ మేవిధంగా వుంటే ఎవడికి కావాలి ? కాళ్ళు, నిజమైన కాళ్ళుంటట మెంత అదృష్టం ! ఈ కృత్రిమ పాదాలుంటే నేమి, లేక పోతేనేమి ? కాలే నిప్పు మాదిరి ఒకటే మంటలు, బాబో" అనుకొన్నాడు.

టప, టప, టప. కిర్రు, కిర్రు; టప, టప, టప, కిర్రు, కిర్రు : అలెక్సీ నడుస్తూనే వున్నాడు, ఇంకా.

ముఖమంతా కందింది, కంఠంనుండి సీరు చెక్కిళ్ళకి దిగజారింది. ఒడలంతా ఒకటే నొప్పులు, ముఖం చెమటతో తడిసింది. ఇరవై తొమ్మిదోమారు నడిచి, ఆ నాటికి నడక నాపాడు, అలెక్సీ.

# 14

జూన్ నెల రెండోవారంలో గ్రిగోరీ గ్వోజ్దెవ్ ఆస్పత్రినుండి వెళ్ళిపోయాడు.

ఇక రెండు రోజులకు వెడతాడనగా, అలెక్సీతో మంచిచెడ్డలన్నీ మాట్లాడాడు. వీరిద్దరూ యుద్ధంచేసి గాయపడి, తిరిగీ యుద్ధంలో చేరదాని కాతురపడుతున్నారు. కాని, ఎందుకనో ధైర్యం చాలకున్నది. ఇద్దరి జీవితాలూ కష్టభూయిష్ఠమయిపోవటమేకాక, ఇద్దరూ స్త్రీప్రేమకు లోనై, దాని నపేక్షిస్తున్నారు. కాని, తమ ముఖాలనుచూసి ఆ స్త్రీలేవిధంగా వర్తిస్తారో, వారు తెలుసుకోలేక తికమక లాడుతున్నారు, వారి కష్టాలూ, వాటిలోనుండే పోలికా వారిద్దరినీ చేరదీశాయి. ఇవన్నీ చర్చించుకొని, ఒకరిఅమ్మాయిల ఫొటోల నింకొకరికి చూపించుకొన్నారు.

ఎప్పుడో తానూ, ఓల్గా వోల్గానది ఒడ్డున పచ్చికమీద పరుగెత్తి, ఆటలాడుకొనేటప్పుడు తానుతీసిన ఫొటో, ఓల్గాది అలెక్సీ చూశాడు. అదెంతో మాసి

పోయింది. పూర్తిగా విప్పిన గౌను తొడుగుకొని, రంగురంగుల పుష్పగుచ్ఛాన్నొకటి చేతిలో పట్టుకొని ఓల్గా కూర్చొన్నది. తెల్లని డైజీ పూలమధ్య ఓల్గా. తానొక మల్లెపూవు మాదిరియున్నది ఫొటోలో. తల కొంచెంగా నొక ప్రక్కకు వాల్చి, ప్రాపంచిక సౌందర్యాన్ని చూసి ముగ్ధురాలైనట్లు, చూస్తూ కూర్చున్నది ఫొటోలో.

ఆ ఫొటోను రెప్పవాల్చకుండా గ్రిగోరీ చూశాడు. తరువాత అటువంటి ముఖంగల స్త్రీ. కష్టంలోనున్న మనిషి నెన్నడూ త్యజించదన్నాడు. ఒకవేళ వద్దంటే - బలాత్కార్! నిజాయతీలేని స్త్రీని కట్టుకొని, ఆజన్మాంతమూ యమబాధ ననుభవించే బదులు, అట్టి స్త్రీ చెంతకు పోకుండా వుండటమే శ్రేయస్కరం. పనికి మాలిన స్త్రీ తోటి బ్రతుకుకంటె దుర్భరం మరొకటిలేదు.

అన్యూతా పటాన్ని చూసి, అలెక్సీ కూడా పై విధంగానే అన్నాడు. ఈ విధంగా మాట్లాడటంవల్ల వారికి కలిగిన లాభ మొక్కటే వొకటి. వారిద్దరి మనస్సుల నుండీ ఏదో భారం చేత్తోతీసిపెట్టినట్టులనిపించింది. ఎంతకాలంగానో వాచి, చీము పట్టి ప్రాణంతీస్తూన్న వ్రణం చితికి, ప్రాణం తేలికను పడినట్టులనిపించింది.

గ్రిగోరీ ఆస్పత్రినుండి వెళ్లేరోజు, అన్యూతా వచ్చి అతనిని ఆస్పత్రిగేటు దగ్గర కలుసు కొంటానని వ్రాసింది. వారిద్దరూ నలభై రెండో నంబరు. కిటకీ చెంతగా నడిచి వెళ్ళాలని ఏర్పాటుచేసుకొన్నారు. గ్రిగోరి అలెక్సీలు. తరువాత అలెక్సీ అన్యూతాను గురించి తన వుద్దేశము గ్రిగోరీకి వ్రాస్తాడట. గ్రిగోరీకూడా తన్నామె ఏ విధంగా ఆహ్వానించిందీ, తన రూపమును చూసి ఏమన్నదీ, ఇంకా ఇతర విషయాలన్నీ వ్రాస్తానన్నాడు. గ్రిగోరీ వృత్తాంతంచూసాకా, అలెక్సీ కూడా ఓల్గాకు తన యదార్థపు స్థితిని గురించి వ్రాస్తాడు, ఆ పనే మంచిదని తనకు తట్టితే. కాని, తన తల్లికి మాత్రం చెప్పరాదు. ఆమె మంచం పట్టింది. కొద్దినెలలుగా.

పై కారణంవల్ల గ్రిగోరీని పంపించివేసే రోజుకొరకు వారిద్దరూ కనిపెట్టు కొన్నారు. సరీగ్గా నిద్రపట్టిందికాదు. రాత్రిళ్లు ఇతరుల కంటబడకుండా గ్రిగోరీ అద్దంముందు నిలబడి ముఖం మచ్చలను మసాజిచేసేవాడు. అలెక్సీ తన చంక కర్రల మొనలకు మెత్తగా బట్టలుచుట్టి, శబ్దంకాకుండా రాత్రులందు వసారాలో నడిచేవాడు.

ప్రొద్దున పదిగంటలకు క్లావ్డియావారి గదిలోకి వచ్చింది. గ్వాజ్దెవ్ కొరకెవరో వచ్చారని, ముసిముసి నవ్వులు నవ్వుతూ చెప్పింది. అత డమాంతంగా మంచంమీద ఎగిరి కూర్చొన్నాడు, ముఖమంతా కందింది. మచ్చలు కొట్టొచ్చినట్లు అగుపించాయి. తడబడే చేతులతో తనవస్తువులను మూట కట్టుకొంటూంటే,

"అందమైన అమ్మాయి. వేళాకోళాలంటే గిట్టవనిపిస్తుంది. ఆ ముఖం చూస్తే" అన్నది క్లావ్డియా.

గ్వాజ్దెవ్ ముఖం విప్పారింది.

"నిజంగానా ? నీకా స్త్రీ నచ్చిందా ? మంచి అమ్మాయి. ఏమంటావు ?" అంటూ వారందరితో పెడతానని అయినా చెప్పకుండా గదిలోనుండి చరచరా నడిచి వెళ్ళాడు.

"తెలివితక్కువ ఘటం. ఇటువంటివాళ్ళే తేలిగ్గా వలలో పడేవాళ్ళు" అన్నాడు మేజర్ స్ట్రిఖొవ్.

కొద్దిదినాల నుండే మేజర్‌లో గొప్ప మార్పు కనిపించింది. ప్రొద్దస్తమానం ఎవరిమీదో వాకరిమీద చీదరించుకొనేవాడు. కిటికీ అంచున చేతులాన్చి, వాటిపై ముఖంవాల్చి గంటలతరబడి చూస్తూ కూర్చుంటాడు. పలకరించినా పలకడు. పూర్వమున్న చలాకీ కనిపించదిప్పుడు. మూతి మూరెడు చేసుకొని కూర్చుంటాడు.

గదిలోని వారందరూ కోపదారి మేజరూ : అలెక్సీ, ఇతర రోగులిద్దరూ తమ గది కిటికీలవెంట నిలబడ్డారు. గ్రిగోరీ, అతని స్నేహితురాలూ నడిచివస్తే చూడాలనే వుబలాటంకొద్దీ. రోజూకంటె నాడించుక ఎక్కువ వేడిగా నున్నది, ఉబ్బెత్తుగా పేర్చినదూదిపాన్పులవంటి మేఘాలూ, మెరుగుదిద్దిన వెండివంటవాటి అంచులూ, ఆకాశమంతటా కనిపిస్తున్నాయి. దూరాన నదిమీద నల్లని మేఘ మొకటి వెడుతూ ఇంతవింత చినుకుల వర్షించింది. ఆ వెలుగులో అవన్నీ ఆణిముత్యాలమాది రగుపించాయి. తారురోడ్డుమీద అచ్చటచ్చట నిలిచిన నీరూ, దానినుండి లేచే ఆవిరీ చూడముచ్చటగా నున్నాయి.

"అదిగో ! వస్తున్నాడ"న్నాడు అలెక్సీ. ఇతరు లెవరన్నా వినిపోతారేమో అన్నట్టు రహస్యంగా.

ఆస్పత్రి సింహద్వారపు పెద్దతలుపులు తెరుచుకొని, ఇద్దరు వస్తున్నారు. బొద్దుగా, ఆకర్షణీయంగానున్న అమ్మాయి, నుదుటినుండి పైకెగదువ్విన తలవెంట్రు కలు తెల్లటి జాకెట్టూ, నలుపురంగు లంగా; ఆమె ననుసరిస్తూ యుక్తవయస్సునం దున్న సైనికు డొకడూ కనిపించాడు, అలెక్సీకే కష్టమనిపించింది. గ్వొజ్దెవ్‌ను గుర్తించటం. ఒకచేత చిన్న పెట్టె పట్టుకొని, రెండో చేతిమీద పెద్దకోటును మడతపెట్టి వ్రేలాడవేసి, కదం తొక్కే గుర్రంమాదిరి నడుస్తున్నాడు గ్వొజ్దెవ్. ఇంతకాలమూ ఆస్పత్రిలోనుండి కాళ్లు బిగుసుకొని పోయాయికాబోలు. కాలు సాచి నడవట మాతని కెక్కడలేని ఆనందాన్ని ఇచ్చింది. ఆ అమ్మాయి చేయి పట్టుకొని వా రిద్దరూ బయటికిరాగానే, పన్నీరు జల్లినట్టు వర్షబిందువులు వారిపై రాలాయి. వా రిద్దరూ నలభై రెండో నంబరు గది కిటికీల క్రిందుగా వెళ్ళడానికి వస్తున్నారు.

అలెక్సీ కెంతో సంతోషమయింది. అంతా సలక్షణంగా జరుగుతోందని ఆనందించాడు. కల్లా, కపటమూ లేని ఆ స్త్రీ ముఖ మాతని నాకర్షించింది. మోస గించడమంటే ఏమిటో ఆ స్త్రీకి తెలియదని చెబుతోందా అంద చందాల ముఖం. కష్టపరిస్థితులలో నున్నవారినుండి పారిపోయే మనిషి కా దీమె.

నెమ్మదిగా నడిచివచ్చి, గది కిటికీలక్రింద నిలబడి పైకి చూసారు వారిద్దరూ. వాటిమీద వెలుతురుపడి వానచినుకులుదోమతెరమాదిరగుపించాయి. గ్రిగోరీ మాదిరే. అన్యూతాకూడా సిగ్గుపడుతూన్నట్టు లగుపించింది. అతనిహస్తములను తాకీ తాకనట్టు పట్టుకొని నవుస్తుంది. ఫొటోలో కనిపించినంతకంటె ఎక్కువ సొగసుగానున్న దనుకొన్నాడు, అలెక్సీ. తనచేతి నాతని హస్తంనుండి, లాగి పారిపోవాలన్నట్టు లామె కొందరప పడుతోందా? ఈ ఉద్దేశం అలెక్సీని వేధించడం మొదలు పెట్టింది.

వా రిద్దరూ కిటికీపంకచూసి, రాని చిరునవ్వును తెప్పించుకొని, నవ్వారు. చేతులూపారు. నెమ్మదిగా నడిచివెళ్ళి గోడమలుపు తిరిగి కనిపించకుండా పోయారు. కిటికీలోనివాడు గదిలోకి వెళ్ళిపోయారు.

"పాపం! గ్రిగోరీ! అతని ఆశలన్నీ కూలిపోయాయ"న్నాడు మేజర్. క్లావ్డియా చెప్పుల శబ్దం వినిపించినప్పుడు మేజర్ ఏమీ జరగనట్టు, కిటికీనుండి చూస్తూ తన మంచంమీద కూర్చున్నాడు.

అలెక్సీ కా రోజంతా పిచ్చెక్కినట్టయింది. ఆరోజు సాయంత్రం, మామూలుమాదిరి నడవటం మానేసాడు. అందరికంటె ముందేవెళ్ళి పడుకొన్నాడు రాత్రి భోజనమయ్యాక. కాని నిద్ర పట్టలేదనీ. చాలా మదన పడుతున్నాడనటానికీ దృష్టాంతంగా రాత్రంతా మంచంమీద ఇటూ, అటూ తెగ పొరిలాడు.

మరునాడు ప్రొద్దున్నే నర్సు గదిలో కాలు పెట్టడంతోనే తన కేమైనా జాబు లున్నాయాఅని అడిగాడు. లేవన్నది. ముఖమూ, చేతులూ కడుగుకొని, ఫలహారంచేసి, నడక మొదలుపెట్టాడు. జరిగిన సాయంత్రం నడవనందుకు సిగ్గుపడి, తన్ను తానే తిట్టుకొని, మరి పది, పన్డ్రెండు పర్యాయము లెక్కువగా నడిచాడు. మునుపటంత త్వరగా అలిసిపోవటం లే దిప్పుడని అతనికి తెలిసింది. తనలోని బలం దినదినాభివృద్ధి చెందుతోందని సంతోషం కలిగింది. వసారా సుమారు యాభై మీటర్లు పొడ వుంటుంది. దీనిని తాను నడిచినన్ని పర్యాయములు నలభై అయిదుతో హెచ్చిస్తే రెండువేల రెండువందల యాభై మీటర్లు! అంటే విమానాధికారుల భోజనాలయంనుండి. విమానాశ్రయమున కున్నంతదూరం! ఆ మార్గమంతా అతని కంటికి కట్టినట్లగుపించింది. శిథిలమైన చర్చిని దాటివెడితే ఇటుకగోడల పాఠశాల. దానికి కిటికీల అద్దాలన్నీ పగిలిపోయాయి. పాఠశాలను దాటి వెడితే, ఫర్ మ్రానుల నరికి కట్టెలుపేర్చి నింపిన మోటారు లారీ లుండే చిన్న అడవీ, సైన్యాధికారి ఇల్లూ. వాతవరణాలయమూ అందులో ఎప్పుడుచూసినా ఏవో కాగితాలూ, దేశ పటాలూ పరిశీలించే వాతావరణాలయపు స్త్రీ!..........

ఛాలా దూరం! ఇంతదూరము తాను నడిచాడన్నమాట!

రోజుకు నలభై ఆరు పర్యాయములు. ప్రొద్దునపూట ఇరవై మూడూ, సాయంత్రం మరో ఇరవై మూడు పర్యాయములు వరండా పొడుగునా నడవడానికి అలెక్సీ నిశ్చయించుకొన్నాడు. ప్రొద్దున్నే లేవగానే మంచి సత్తువగా నుంటుంది కాబట్టి, మరునాడు చంకకర్రల నుపయోగించకుండా నడవడానికి పూనుకొన్నాడు. ఈ విషయమును గురించి ఆలోచిస్తూ, ఏర్పాటు లొనరుస్తూ ఆ దినమంతా కాలం గడిపాడు. అతని నావహించిన దిగులెక్కడికో వెళ్ళిపోయింది. నాటి సాయంత్రం తనకు తెలియకుండానే మూఫ్పైపూర్లు నడిచాడు. ఆస్పత్రి జవా నొకడు. తనకు వచ్చిందంటూ ఉత్తరం తెచ్చాడు. "లెఫ్టినెంట్ అలెక్సీగారికి గుప్తమైన జాబు" అని దానిమీద చిరునామా కనిపించింది. "గుప్తమైన" అనే మాటక్రింద రెండు గీతలు గీశారు ఆ జాబు వ్రాసినవా రెవరో. దానిని చింపిచూస్తే, తిరిగీ "గుప్తమైన జాబు" అని వ్రాసి. మడతపెట్టిన కాగితం కనుపించింది.

కిటికీ కానుకొని, జాబును చదవటం మొదలుపెట్టాడు. అది గ్వాజెప్‌నుండి వచ్చింది. గతరాత్రి రైల్వేస్టేషనునుండి ఇంత పెద్ద జాబును వ్రాయడాని కతని కెక్కడ సావకాశముండిందో! దానిని చదువుతోంటే. అలెక్సీ ముఖం మలమల మాడినట్టు నల్లబడింది. తా ననుకొన్నట్టె, అన్యూతా చాలా అందమైన స్త్రీ. మాస్కో నగరంలో ఇంత గొప్ప సౌందర్యరాశి వే రొకామె వుండదట. తన స్వంత సోదరుని కలుసుకొన్నట్టు లెంతో చనువుగా నున్నది. మునుపటికంటె గొప్పప్రేమ తన కామెపై కలిగిందంటూ గ్రిగోరీ వ్రాశాడు.

"....మనిద్దరమూ అనుకొన్నట్టే, అంతా జరిగింది. అద్వితీయ గుణ సంపన్నురా లనడాని కెట్టి సందేహమూ లేదు. నా ఆకారాన్ని గురించి పల్లెత్తు మాటయినా అనలా. నిందుకుండ తొణకదంటారు. కాని నాకు కళ్ళు లేకపోలేదుగా? నా వికృతమైన నాగలిచాళ్ళమాదిరి మచ్చలుపడిన ముఖంచూసి ఆమె బెదిరిపోయింది. ఉన్నట్టుండి భయపడ్డట్టూ, నన్నుచూసి జాలిపడుతూన్నట్టూ, నాతో మాట్లాడుతూంటే ఎవరన్నా చూసిపోతారేమో అని దిగులుపడుతూన్నట్టూ—నాముఖంకేసి చూసింది. ఆమెకు తెలియకుండా ఇదంతా నేను క్రీగంట గమనించానులే.... నన్ను తన కళాశాలకు తీసుకువెళ్ళింది. వెళ్ళకపోతే బాగుండేదని నాకు ఇప్పు డనిపిస్తుంది. ఆమెతోటి విద్యార్థినులందరూ వచ్చి, గుంపుగూడి కండ్లు వప్పగించి చూస్తూ నిలబడ్డారు....నీకు తెలియదనుకొంటాను. వీరికి మనగదిలోనివారందరినీ గురించిన అన్నివిషయాలూ పూర్తిగా తెలుసు!.... తన మిత్రులవంక "ఈ రూపము నిచ్చటికి తీసుకువచ్చినందుకు నన్ను క్షమించండ"న్నట్టు అన్యూతా చూసింది....కాని గొప్ప విచిత్రమేమిటంటే, తన యథార్థపు టుద్దేశం నా కెక్కడ తెలిసిపోతుందో అని భయపడి, దానిని కప్పిపుచ్చడానికి తన శక్తివంచనలేకుండా ప్రవర్తించింది. ఎంతో చనువుగా నాతో మాట్లాడింది. మాట నిలిపితే నిజమెక్కడ బయటపడుతుందో

అన్నట్టు గుక్కతిప్పకుండా మాట్లాడింది.... తరువాత వాళ్ళింటికి వెళ్ళాము. ఆమె ఒక్కత్తే ఉంటోంది. యుద్ధం రావటంలో ఆమెవారంతా వేరొకచోటికి గ్రామపరిసర భాగాలకు వెళ్ళిపోయారు. అన్యూతాది గొప్ప పేరుప్రతిష్టలు గల కుటుంబం. నన్ను కూర్చోమని చెప్పి ఇంత టీ చేయడానికి నీరుకాచింది. నీటిపాత్ర తళతళా మెరిసే ఆ తగరగిన్నెలో కనిపించే నా ముఖంవంక చూస్తూ నిట్టూర్చింది, ఎన్ని పర్యాయములో. నా కిదంతా ఏంతమాత్రమూ నచ్చిందికాదు. ఎంతకాల మీదొంగాటక మనిపించింది. ధైర్యంచేసుకొని అన్యూతాతో, 'నారూపం నీకు గిట్టిలేదన్నవిషయం నాకు బాగా తెలుస్తోంది. నీవుద్దేశంలో తప్పేదీలేదు, ఇది సహజం. మానవస్వభావం. నేనెటువంటి అపారంకానీ చేసుకొనటంలేదు' అన్నాను. అన్యూతావేశపటం మొదలు పెట్టింది. ఏడ్వవద్దు....ఊరుకో. నీవు మంచిపిల్లవుకాదూ. నిన్ను ప్రేమించి నిన్ను సుఖపెట్టడాని కెందరో కాచుకొని వుంటారు. నీ జీవితం పాడుచేసుకోట మెందుకు?....నా సంగతా? నే నెంత అందంగా నున్నానో నీకేతెలుసు. ఇటువంటి మన్మథాకారం దొరకదనా, నీకు దిగులు?.... నా మాటలాలకించు, నెమ్మదిగా మంచి చెడ్డలాలోచించు....నేను నాయుద్ధ దళానికి వెళ్ళి నా చిరునామాను వ్రాసి పంపిస్తాను. నీవు మనస్సు మార్చుకొనకపోతే, నాకొకమాట వ్రాయి. కొంతసేపు ఆగి తిరిగి, 'నీకు గిట్టని దానిని చేయడానికి ఎన్నడూ నీ మెడను నీవే వంచవద్దు. నేడు బ్రతికి బాగున్నాను, రేపటి సంగతెట్టిదో! అగస్మాత్మరణం— యుద్ధభూమిలోని మనుష్యులబ్రతుకే ఇది' 'వద్దు వద్దు–ఆ విధంగా మాట్లావద్దంటూ' ఒకటే ఏడ్చింది. సంసిద్ధ'మంటూ సైరన్‌కూత కూసిందపుడు. ఆమె వెంటనే పరుగిడి వెళ్ళిపోయింది. సమయం కనిపెట్టి చల్లగా జారుకున్నాను. యుద్ధ కార్యాలయానికి వచ్చాను. వెంటనే నన్ను పనిలో నియమించారు. ఇప్పుడన్ని విషయాలూ చక్కబడ్డాయి. సమస్యలన్నీ తీరిపోయాయి. రైలు టిక్కెట్టు కొన్నాను. త్వరలో రైలు ప్రయాణం. కాని, అలెక్సీ, పూర్వకంటె అన్యూతా మీద నా కెక్కువ మమకారమేర్పడ్డది. ఆమె మాటను మరిచిపోయి, రోజులు గడపటమెట్లాగో నాకు బోధపడకున్నది."

అలెక్సీ కావుత్తరం చదువుతోంటే, తన సంగతీ ఇదేవిధంగా నుండబో తుందనిపిందింది. ఓల్గాకూడా, అన్యూతామాదిరే ఏడుస్తుంది. తనవంక దిగులుతో భయంతో, దుఃఖంతో చూస్తుంది. సానుభూతి చూపించడానికి యత్నించి నెగ్గలేక పోయింది. త్యాగం చేయాలని అనుకొన్నాధైర్యంచాలక, దానివల్ల ఏదేవుడి కేమి మేలు చేసినట్టులనుకొని, చేయలేకపోతుంది.

"ఛీ! వద్దు....వద్దు దేవుడా, వద్దు," అని బిగ్గరగా ఆలెక్సీ పలికాడు,

గదికి నడిచివెళ్ళి, మంచంమీద కూర్చొని ఓల్గాకొక జాబు వ్రాశాడు. కుపంగా, సూటిగా ఉన్నదున్నట్టుగా చిన్న జాబొకట వ్రాశాడు. యథార్థపు పరస్థితు

లనుగురించి వ్రాయడమెందుకు? తన తల్లి మంచంపట్టివున్నా ఈ రోజులలో లేని పోని క్షోభ, ఆమె కెందుకు? తాను బహుజాగ్రత్తగా అన్ని విషయాలూ ఆలోచించగా ఆమెను తన కొరకై కాచుకొని వుండమనటం చాలా తప్పు అని తనకు తెలిసింది. ఈ యుద్ధ మెంతకాలం జరుగుతుందో ఎవరికి తెలుసు? కాలం ఎవరికొరకూ కని పెట్టుకొని కూర్చోదు. యౌవ్వనం ఎల్లకాలమూ వుండదు. యుద్ధంలో నున్నవాడి కొరకు రోజులు లెక్కించుకొంటూ కూర్చోవటం తెలివితక్కువతనం. తానకస్మా త్తుగా చనిపోవచ్చు. పెండ్లికాని వైధవ్యం; ఇంతకు మించిన భాగ్యం తనకు లభిం చదు. లేకపోతే కాలూ చేయీ విరిగి ఇంటికి తాను వస్తేరావచ్చు. కుంటిమొగుడి తోనో, గుడ్డి భర్తతోనో కాపురం వెలగబెట్టాలి. ఎవడి నుద్ధరించడానికి? "నీ యౌవ్వనమును వృధా చేసుకోవద్దు. నీ అందచందాలకు నీరు వదులుకోవద్దు. నన్ను వీలయినంత త్వరగా మరిచిపో. ఈ వుత్తరానికి నీవు బదులు వ్రాయవద్దు. వ్రాయ నక్కరలేదు. నేను అపార్థం చేసుకోను. నీవు చెప్పకుండానే, నీ కష్టాలు నాకు తెలుసు. నన్ను మరిచిపో....నేనూ యత్నిస్తాను....సులభంకాదు....కాని, గత్యంతరం?" అని వ్రాశాడు.

దానిని పట్టుకొన్న చేతులు కాలిపోతున్నట్లాతనికి అనిపించింది. తిరిగివ్రాసిన విషయాలను పరీక్షించకుండా, వరండా చివరనున్న నీలిరంగు తపాలపెట్టెదగ్గిరికి కుంటుకొంటూ వెళ్ళాడు.

తిరిగివచ్చి మంచంమీద కూలబడ్డాడు. ఇకమీద తన కష్టాల నెవరితో చెప్పకోవాలి? తన తల్లికి వ్రాయడానికి వీలులేదు. గ్రిగొరీతోనా? కావచ్చు. కాని అతడెక్కడున్నట్టు? అతడేదళంలో చేరాడో? కేంద్రకార్యాలయానికివ్రాస్తే. ఆయుద్దపు రోజుల్లో తన వుత్తరమును జాగ్రత్తపరిచి గ్రిగొరీకి పంపిస్తారా? పంపినా ఎప్పు డందుతుందో? "వాతావరణాలయపు టమ్మాయికి" వ్రాస్తే? అవును. ఆమె తప్ప మరొకరులేరు. తన కష్ట నిష్టూరాలు చెప్పకోడానికి. వెంటనే వ్రాయటం మొదలు పెట్టాడు, చాలాకాలం తరువాత స్నేహితులు కలుసుకొంటే కట్లుతెగి కారే కన్నీరు మాదిరి. వాక్యాలాతని కలంనుండి దొర్లుకొంటూ వచ్చాయి. ఒక వాక్యం వ్రాస్తూ సగంలో ఆగాడు, ఒక్కనిమిష మాలోచించి. జాబును నలిపి ముద్దచేసి, చింపే సాడు,

"అయినవాడూ కానివాడూ వ్రాయడానికి వీలులేదు. గ్రంధకర్తల బ్రతుకే ఇంత", అన్నాడు ఎత్తిపొడిచినట్టు మేజర్ స్ట్రిఖోవ్.

అలెక్సీ మంచంమీదనున్న గ్వొజ్దెవ్ జాబును అతనినడుగకుండా స్ట్రిఖొవ్ తీసుకొన్నాడు. ఎప్పుడో. దానిని చదువుతూ తనమంచంమీద కూర్చున్నాడు.

"ఇవ్వాళ మంచిరోజల్లేలేదు. గ్వొజ్దెవ్‌కు ఉన్నకొద్దిమతీ పోయినట్టుంది? వృద్ధభాగ్యుడనాల్లో, లేక మందబుద్ధి అనాలో నాకు తెలియట్లంలా. ఎవత్తో ఒక

అమ్మాయి గీర్వాణంగా తానక్కరలేదన్నట్టు నడుచుకొంటే వెర్రివెధవ, ఏడుస్తున్నాడు! చేష్టలకూ భావాలకూ గల భేదం తెలియనివాళ్ళకు పట్టే దుర్గతే ఇది. డస్టొవ్‌స్కీ నవలలు చదివితే బాగుపడతారు ఇట్టివారంతా. ఈ జాబు చదివానని, నీకు కోపమా? తెల్లవారితే బ్రతికి వుంటామో లేదో తెలియని యుద్ధ సన్యాసులం! మనకు రహస్యాలేమి వుంటాయి?" అన్నాడు మేజర్.

అలెక్సీ అతని మాటలు వినిపించుకోలా, తనలో తానే ఏదో ఆలోచనలో మునిగి పోయాడు "రేపు, తపాలామనిషి రాగానే పెట్టెలో వేసిన వుత్తరం తీసుకొంటే బాగుంటుందా?" అని వితర్కించుకొన్నాడు.

ఆ రాత్రి అలెక్సీకి నిద్రపట్టలా, తా నేదో వొక కొత్త విమానాశ్రయంలో నున్నట్టు కలవచ్చింది. నేలపై నంతటా మంచు, కొత్తరకం విమానం – La 5 – కాబోలు నిలబడివున్నది. దానికి సాధారణ విమానాలకున్నట్టు, చక్రాలు లేవు. పక్షికాళ్ళవంటి కాళ్ళున్నాయి. విమానపు టింజనుల మరమ్మతుచేసే, తన మిత్రుడు. యూరా ఎక్కడినుండో వచ్చి. విమానంలో ఇంజనుగదిలో కూర్చొన్నాడు. "అలెక్సీ విమానమెక్కేరోజులు వెళ్ళిపోయాయి" ఇకమీద తానావనికి పూను కోవాలంటూన్నాడు. మిఖేల్ తాత ఇంట్లో తానొక గడ్డిపరుపుమీద పడుకొన్నాడట. తడిసిపోయిన షరాయీ. మడతపెట్టిన షర్టుచేతులూ, మిఖేల్ తాత తన చెంతనిలబడి, ఆవిరి స్నానం చేయిస్తూన్నాడు, తనకు. "పెండ్లి చేసుకోవడానికి ముందు, ఆవిరి స్నానమంత ఆరోగ్యమింకొకటి లేదు "అంటూ నవ్వాడు మిఖేల్, తెల్లవారు జామున ఓల్గాను గురించి కలకన్నాడు, బోర్లపడిన పడవమీద కూర్చుని, కాళ్ళను నీటిలో తడుపుతూ ఓల్గా బహు ఆకర్షణీయంగా కనిపించింది: కండ్లమీద సూర్యుడు పడకుండా చేతినడ్డంపెట్టి, రెండో చేత్తో రమ్మని, నవ్వుతూ ఆహ్వానిస్తోంది. నీటిలో ఈదుకొంటూ ఓల్గా దగ్గిరికి వెళ్ళబోయాడు, కాని, ప్రవాహవేగం వెళ్ళనిచ్చిందికాదు. గట్టుకూ తిరిగి పోనీయక, తనతో ఎక్కడికో ఈడ్చుకొని వెడుతోంది నీరు. కాళ్ళూ చేతులూ నొప్పులెట్టేంతవరకూ, తన బలంకొద్దీ. ఈదాడు, ఆమె చాలా దగ్గిరిగా కనిపించింది. గాలిలో ఎగిరే ఆమె తల వెంట్రుకలూ, పాదాలమీద ముత్యాలమాదిరి నిలబడిన నీటి చుక్కలూ....చేయి జాపితే అందుతుందని తోచింది....

మెలకువ వచ్చింది. ఏదో వెర్రి ఆనందాన్ననుభవిస్తున్నట్లనిపించింది, తిరిగీ అదే కల వస్తుందేమో ననుకొని కండ్లు మూసుకొన్నాడు. తలచుకొంటే, అనుకొన్న కలలు వస్తాయా? ఫరవాలేదు. మేజర్ స్ట్రిఖొవ్ చెప్పినట్టు డస్టొవ్‌స్కీ నవలలు చదివి అంతరార్థాలు గ్రహించటమంతా వెర్రితనమనిపించింది. ఎదురు తిరిగే జీవిత ప్రవాహాని కెదురీత ఈది, శ్రమపడి ఓల్గాను చేరుకోవాలి. ఇంతకు మించిన కార్యమంటూ వేరొకటి లేదు. కాని. తపాలుపెట్టెలో వేసిన జాబు? నడిచి

వెళ్ళి, తపాలపెట్టె చెంత నిలబడి జవాను రాగానే అడిగి తీసుకోవాలనుకొన్నాడు. కాని, ఇంతలోనే మనస్సు మార్చుకొని, "పోతే పోయిందిలే. నిజమైన ప్రేమను, సిసలు ప్రేమనిట్టి ఉత్త రాలేవిధంగానూ బాధించవ"ని తనకు తానే బిగ్గరగా చెప్పుకొన్నాడు. ఓల్గాకు తనపై వాస్తవిక ప్రేమ వున్నదనీ. తన కుంటితనమూ, గ్రుడ్డితనమూ ఆ ప్రేమ నణుమాత్రంకూడా మార్చజాలవనీ గట్టిగా నమ్మి, ఉప్పొంగిపోయాడు,

మరునాడు ప్రొద్దున, చంక కర్రలు తీసిపారేసి నడవటానికి పూనుకొన్నాడు. మంచంనుండి లేచి నిలబడి: కాళ్ళు బారజాపి చేతులు జాపిపడిపోకుండా. ఇటూ అటూ తూలుతూ నిలబడ్డాడు. గోడను పట్టుకొని ఒక్కటే వొక అడుగుపెట్టాడు. కాలి బూట్సులు కిర్రుమన్నాయి. పడిపోతాడనిపించింది. కాని ఎట్లాగో నిలవ తొక్కుకొన్నాడు. నడవట మింత కష్టమైన కార్యమని ఇంతకుముం దెన్నడూ అనుకోలేదు, చిన్నతనంలో కర్రలమీద నటవటం నేర్చుకొన్నాడు, అలెక్సీ. ఏదో వొక గోడ నానుకొని కర్రలపై కెక్కి నిలబడి ఒక ఊపుతో మొదలొక కాలూ, తరువాత మరో కాలూ ముందుకు పెట్టి నాలుగైదడుగులు వేసేటంతలో, శరీర మంతా ఊగిపోయి, కర్రలు రెండూ అంత దూరాన నేలపై పడేవి. అదేసమయంలో తాను నేల కురికేవాడు. కర్రలమీద నడవటం దీనికంటే సులభమనిపించింది. కర్రలనుండి దుముకడానికి వీలున్నదేకాని. నీ కాళ్ళనుండి విడిపోయి దుముకటం యసాధ్యంగదా? మూడో అడుగు పెట్టేలోగా ఒళ్ళుతూలి నేలమీద బోర్లాపడ్డాడు.

తతిమ్మా రోగులంతా కట్లు కట్టించుకోడానికీ, మందులు వేయించుకోడానికీ వెళ్ళిపోయిన సమయం కనిపెట్టి అలెక్సీ నడవటం ప్రారంభించేవాడు. నెమ్మదిగా లేచి, దేక్కొంటూ గోడచెంతకు వెళ్లాడు. దాన్ని పట్టుకొని నిలబడి, క్రిందపడగా దెబ్బతగిలిన తొడనూ, మోచేతినీ చూసుకొన్నాడు. రక్తం కారకపోయినా, మోచేతిదెబ్బ ఎర్రగాకంది, వాచింది. పండ్లు బిగబట్టి, గోడను తాకకుండా ఒక అడుగు పెట్టాడు, సాధారణ పాదాలమాదిరి కృత్రిమపాదాలు సాగి సర్దుబాటు చేసుకోలేవని తెలుసుకొన్నాడు, కాబట్టి ఆ గట్టి పాదాల నుపయోగించాలంటే తన కాళ్ల బహు మెళకువగా, చైతన్యపూరితంగానూ పనిచేయాలి, నిలబడేటపుడు మామూలుగా నిలబడునట్లుకాక, వ్రేళ్ళభాగాలు దూరంగానూ, మడమభాగాలు దగ్గరగానూ పెట్టాలి. నడిచేటప్పుడు మామూలు పాదాలమీద నడిచినట్లుకాక, భూమికి తాకీ తాకనట్టు సాచా లీడుస్తూ నడవాలి, ఈ విధంగా ఎన్నెన్నో విషయాలు అనుభవంమీద గ్రహించగలిగాడు.

చిన్నతనంలో తల్లి చేతిని పట్టుకొని తప్పటడుగు వేస్తూ, క్రిందపడుతూ, లేస్తూ బిడ్డ నడక నేర్చుకొంటుంది, తరువాత నేర్చుకొన్నదంతా దానికి సర్వసాధారణంగా కనిపిస్తుంది, చిన్నప్పు డెంత కష్టపడ్డదీ జ్ఞప్తికే వుండదు, కాని

తనమాదిరి కృత్రిమ కాళ్ళమీద నడవవలసివస్తే ఇంతటుముం దలవాటుపడిన నడక ఏంతమాత్రం ప్రయోజనపడదు. సరిగదా, అదం లగులుఉంది. కొత్తగా అలవాటు చేసుకోవటంతోపాటు పాత అభ్యాసాలను అదుపాజ్ఞల్లోకి తెచ్చుకొనటం జరగాలి. కాలుపోయిన మనిషికి మనోధైర్యమూ, పట్టుదలా వుండట మవసరం. లేకపోతే నడక నేర్చుకొనటం కలలోనివాస్తే.

అలెక్సీ మంచి మనోనిబ్బరం కలవాడు. తన దృక్పథం నెరవేరడానికి కావలసిన ఏకాగ్రతకూడా అతనికి కలదు. ఈ పర్యాయం బహు జాగ్రత్తగా నడవటం మొదలుపెట్టాడు. పాదం ముందుభాగమును ప్రక్కకు త్రిప్పి. పడిమ మీద శరీరం బరువంతా అనించాడు. బూట్సుకాలు కిర్రున మ్రోగింది. తరువాత మడమ పైకెత్తి వ్రేళ్ళమీద నిలబడి రెండో పాదమును ముందుకు పెట్టాడు. టపీలున దానిమడిను నేలను తాకింది. చేతులుజాపి. గోడకానుకోకుండా తూలుతూ మరొక అడుగుపెట్టడానికి జంకుతూ నిలబడ్డాడు. ముఖమంతా ముచ్చె మటలు పోసి ముక్కు చివర అడ్డబాసమాదిరి వ్రేలాడి. లోటికిసలాడి క్రిందపడుతోంది. సరిగ్గా ఇదే సమయానికి వాసిలెవిక్ అక్కడికి వచ్చాడు, ఒక్క నిమిషమాగి అలెక్సీకేసి చూసాడు. పిదప నెమ్మదిగా నడిచివచ్చి, చంకలక్రింద చేతులతో పట్టుకొని.

"భేష్ భేష్ ప్రాకులాడే పాపాయీ సెభాష్ ..కాని నీ వెందుకు ఒంటరిగా నున్నావో నాకు తెలియకున్నది. నర్సుగానీ లేక మరెవరన్నా ఆస్పత్రి మనుష్యులు కానీ నీతో నుండవద్దా ?....అదంతా నీకు గిట్టదు కాబోలు ? పరువుతక్కువా ? ఫరవాలేదులే....ప్రతి విషయంలోనూ మొదటి అడుగే చాలా కష్టమైనదని మరిచి పోవద్దు. మొదటి అడుగు పెట్టావు. ఇక మీద భయపడనక్కరలేదు. జయం నిశ్చయం." అన్నాడు.

కొద్ది దినాల క్రితం వాసిలెవిక్ నొక పెద్ద ఎద్యాలయానికి పెద్దగా నియ మించారు. అతనికి తీరుబడే లేకపోయింది. కాని ప్రతిరోజూ ఒక పర్యాయమైనా ఆస్పత్రికి వచ్చేవాడు, ఏ మాత్రం తీరుబడి అయినా. ఆస్పత్రి విషయాలను గమ నించడానికి ఇరులున్నప్పటికీ దానిమీదనుండే మమకారంకొద్దీ రాకుండా వుండలేక పోయాడు. నలుగురినీచూచి సలహాలిచ్చి వెడితేనేగాని నిద్రపట్టేదికాదు, తన కొడుకు చనిపోయినప్పటినుండీ పెద్దగా అరవటమూ, కోపగించుకొనటమూ మానే శాడు, శాంతంగా నుండుటమూ నెమ్మదిగా మాట్లాడటమూ అలవాటు అయ్యాయి. ఇదంతా వయస్సు ముదరటానికి సూచనలని కొందరు తెలియనివారనేవారు.

"సరి, అలెక్సీ ! మన మిద్దరమూ చేరి యీ పనిని సాధించుదామా ?" అని తనతోవచ్చిన వారితో. "వెళ్ళిపోండి. ఇదేదో సర్కస్సు అనుకొన్నారా, ఆ విధంగా గుంపుకూడటానికి వెళ్ళండ"ని అలెక్సీతో, "చూడు అబ్బాయీ !..

ఒకటి....పరవాలేదు నన్ను పట్టుకో సిగ్గెందుకు ? నేనొక సైన్యాధికారిననేది మరిచి పోయావా ? .... పట్టుకోమని ఆజ్ఞాపిస్తున్నాను ... సెబాస్.... రెండు .... బలే, బలే ఏదీ, కుడికాలు జరుపు....అచ్ఛా....ఎడమకాలు.... మొగధీరుడవురా. నీవు అబ్బాయీ, మొగధీరుడ"వంటూ పురిగొల్పి ప్రోత్సహించాడు.

అమితానందంతో చిన్నపిల్ల వాడిలాగా చేతులు చరిచాడు, వాసిలివెక్. ఒక మనిషిని నడిపించటం ప్రశస్థమైన శాస్త్రపరిశోధనకంటె గొప్ప విషయ మన్నట్టు వర్తించాడు. వాసిలివెక్‌లోనుండే ఉదాత్త గుణమే యిది. ఏ పనికి పూనుకొన్నా, దానితో లయమైపోతాడు. తన జీవితమంతా దానిని సాధించటంలోనే నున్నట్టు నడుచుకొంటాడు. నెమ్మదిగా వరండా పొడుగునా అలెక్సీని నడి పించాడు. అలిసిపోయి అలెక్సీ కుర్చీమీద కూలబడ్డాడు. తానొక కుర్చీ తెచ్చుకొని, అతనిచెంత వాసిలివెక్ కూర్చుని,

"ఏమంటావు ? మనం ఎగురబోతున్నాము కాదూ ! నిస్సందేహంగా ఎగిరి తీరుతాము. ఈ యుద్ధంలో చేతులు విరిగినవారు సైనిక దళాలను నడిపిస్తున్నారు. చావు తప్పి బయటపడ్డవారు. మరఫిరంగులు కాలుస్తున్నారు, విరోధుల తుపాకీ గుండ్లు తమ దళాలపై బడకుండా. వాటికడ్డం నిలబడి ప్రాణాలు వదిలిన ధీరు లున్నారు....ప్రాణమున్న ప్రతి వొక్కడూ పోరాడుతున్నాడు. చనిపోయినవారు వినా, ఎంతటి గొప్పదెబ్బలు తగిలినా, తిరిగీ పోరాడ గలశక్తి ప్రతివాడిలోనూ ఉన్నది." ఈ మాటలంటూంటే గొంతుకేదో అడ్డం పడినట్లనిపించి, సవరించు కొన్నాడు. పెద్ద నిట్టూర్పు. తిరిగీ, "చనిపోయినవారుకూడా పోరాడుతూనే వున్నారు....యశశ్శరీరాలతో పోరాడుతున్నారు....బ్రతికి వున్నవారికి వారి ధైర్య సాహసాలూ, త్యాగమూ ఆదర్శప్రాయంగా కనిపించి వారిని ప్రోత్సహిస్తాయి.... సరేలే....ఇప్పుడదంతా ఎందుకు ?....రా. అబ్బాయీ ! మరొకసారి నడిచిచూద్దాము" అన్నాడు.

రెండో పర్యాయిం వసారా పొడుగునా అలెక్సీ నడిచాడు. గ్వొజెవ్ పడు కొన్న మంచమును చూచి, "టాంకుదళాధికారి ఇక్కడుండేవాడు గదా ? ఏదీ ? ఒళ్లుబాగుపడి వెళ్ళిపోయాడా ?" అని అడిగాడు.

గ్రీగొరీకి ఆరోగ్యం కుదిరిందనీ, ప్రస్తుత మెక్కడో యుద్ధభూమిలో నున్నాడనీ చెప్పాడు. అన్నీ బాగున్నాయి కాని, అతని ముఖం, అందులోనూ దాని క్రింది భాగం కాలిపోయి, బాహు వికృతంగా కనిపిస్తాడు. ఇదొక్కటే అతనికి భరించరాని కష్టమనికూడా అలెక్సీ చెప్పాడు.

"ఓహో ! అప్పుడే నీకు వ్రాసాడన్నమాట ! ఆడవాళ్ళెవరూ తనంటే ఇష్ట పడరని గుండె పగిలి బాధపడుతున్నాడను కొంటాను. ఫరవాలేదు. గడ్డం మీసమూ పెంచమని వ్రాయి. తమాషా కనటంలేదు. నిజంగానే చెబుతున్నాను. కొత్త వక్కిగా కనిపిస్తాడు. ఆడవాళ్ళాతనివెంట పడతారు." అన్నాడు.

అంతట నర్సు ఒకామె వడిగా పరుగిడివచ్చి, వాసిలివెక్‌ను టెలిఫోనులో కమిసారు ఆఫీసునుండి పిలుస్తున్నారని చెప్పింది. పర్చీనుండి లేచాడు, మందు నీళ్ళతో కడిగి, కడిగి పొట్టుాడిపోయే హస్తాలను మోకాళ్ళమీద ఆనించి, ముందుకు వంగి బరువుగా లేచాడు. గత కొద్దివారాలకాలంలో ఎంతో ముసలివాడయిన ట్లుగు పించాడు. పుత్రశోకం మర్ఛ్యకమంటారు. గది గుమ్మందగ్గిరికి వెళ్లి వెనుతిరిగాడు.

"తప్పకుండా వ్రాస్తావుగా ?....ఏమిటాతని పేరు ? అలెక్సే. నీ స్నేహితుడు....గద్దం పెంచుకొనటమనే మందును నేను, ప్రొఫెసర్ వాసిలివెక్‌ను వాడమన్నానని వ్రాయి....ఇది చాలా పురాతనమైన మందు....స్త్రీ వశీకరణ చిహ్నమం దిది" అన్నాడు.

ఆ సాయంకాలం పనివా డొకతను బహు చక్కని చేతికర్ర నొకటి తెచ్చి అలెక్సీ కిచ్చాడు. దానిమీద ఎవరిదో పేరు పొడిఅక్షరా లగుపించాయి.

"ప్రొఫెసర్ వాసిలివెక్ తమకు దీని నిమ్మన్నారు. ఇది వారి స్వంత చేతికర్ర. తమ బహుమతీ అని చెప్పమన్నారు. చేతికర్ర నుపయోగించి నడవమని చెప్పారు" అన్నాడా వచ్చినమనిషి.

నాలుగు గదులలోని మనుష్యులూ, ఆ సాయంత్రం నలభై రెండో నంబరు గదికి వచ్చారు, వాసిలివెక్ పంపిన చేతికర్రను చూడాలని. చాలా బాగున్నదని ఎంతో మెచ్చుకొన్నారు.

# 15

కొంతకాలంగా యుద్ధవార్తలు రావటంలా. ఎక్కడో చిన్న చిన్న పోరులు జరుగుతున్నాయని మాత్రం రేడియోలో చెబుతున్నారు. పెద్ద పెట్టున యుద్ధం త్వరలో చెలరేగనున్నదని అందరికీ అభిప్రాయం కలిగింది. ఆస్పత్రికి వచ్చే రోగుల సంఖ్య పడిపోయింది. నలభై రెండోనంబరు గదిలోని ఖాళీ మంచాలను తీసివేసారు : అలెక్సి, మేజర్ స్ట్రిఖొవ్ మాత్రం మిగిలారీ గదిలో, అలెక్సీమంచం తూర్పుప్రక్కా, మేజర్‌ది నదీతీరం కనిపించే ఎడమప్రక్క మున్న కిటికీచెంతా వేసారు.

వీ రిద్దరూ యుద్ధమంటే ఏమిటో బాగా తెలిసినవారుకాబట్టి చిన్న పోరులు జరగటంలోని యదార్థం వారికి తెలుసు. ఇట్టి చిల్లరకయ్యా లెంతకాల మెక్కువగా జరిగితే అంత కంత పెద్ద యుద్ధం అమాంతంగా విరుచుకువచ్చి పడుతుందన డానికి సందేహంలేదు.

ఒకనాటి యుద్ధ వార్తలలో స్టిఫాన్ ఇవుష్కిన్‌ను గురించి చెప్పబడింది, రేడియోలో. సోవియట్ యుద్ధ వీరాగ్రేసరులలో నొకడైన ఇవుష్కిన్ దక్షిణ యుద్ధ భూమిలో ఇరవై అయిదుగురు జర్మనులను చంపాడట, తానొక్కడే యీ ఇరవై అయిదుగురితో చేరి, రెండు వందలమంది శత్రువులను హతమార్చాడు! గ్వాజ్డెవ్ దగ్గిరనుండి జాబొకటి వచ్చింది. తానెక్కడున్నదీ వ్రాయకపోయి నప్పటికీ! పూర్వపు దళాధికారి ధరించిన దుస్తులాతని కిచ్చారనీ, అవి తనకు బాగా సరిపోయాయనీ వ్రాసాడు. అతని పేరు పల్వెరాట్ మిస్త్రాప్ తానున్నచోట జీవితం బాగున్నది. అక్కడ చాలా బెర్రీ పండ్లు పెరుగుతాయి. సైనికు లందరూ వాటిని తెగ తింటున్నారు. తన పుత్తరం వచ్చి చేరితే. రెండు ముక్కలు అన్యూతాకి వ్రాయమన్నాడు. తాను స్వయంగా ఆమెకు వ్రాసాడు, కాని ఆ జాబామెకుఅందు తుందనే ధైర్యం తనకు లేదని వ్రాసాడు.

ఈ రెండు విషయాలనుండీ, ఎక్కడో ఒకచోట దక్షిణాన యుద్ధం ప్రారం భించబడుతుందని అలెక్సీ గ్రహించాడు. అలెక్సీ వెంటనే అన్యూతాకు వ్రాసాడు. గ్వాజ్డెవ్‌కు కూడా. గడ్డం పెంచుకొనటమును గురించి వ్రాసాడు. కాని, అతడీ విష యమును గమనించే స్థితిలో నుండడని అలెక్సీకి తెలుసు. రాబోయే యుద్ధమును గురించి ఆదుర్దా. ఎప్పుడు ప్రారంభమవుతుందో తెలియక చీకాకూ త్వరగా ప్రారం భిస్తే బాగుండుననే ఆశా, ఆవేశాలు చేతిలో చిక్కుకొన్న సైనికుడికి గడ్డమూ, మీసాల మాటలు వినిపించవు. అసలు అన్యూతాను గురించి ఆలోచించడానికయినా గ్వాజ్డెవ్‌కు వీలుంటుందో, లేదో!

నలభై రెండో నంబరు గదిలో మరొక సంతోషకరమైన వార్త వినబడింది. మేజర్ ఇవానొవిక్ స్ట్రిఖావ్‌కు "యుద్ధవీరుడ"నే బిరుదు నిచ్చారు. ఇంత గొప్ప వార్త వచ్చినప్పటికీ, మేజర్ చాలా రోజులదాకా సంతోషవిహీనంగానే వున్నాడు. తన కాళ్ళను తెగతిట్టిపోశాడు. వాటివల్లనేగదా, తానీ విధంగా మంచాని కంట కరుచుకొని వుండవలసివచ్చింది? వెలుపల యుద్ధసన్నాహాలు జరుగుతూంటే, తానీ విధంగా పడిపోవటం అతని కెంతమాత్రమూ నచ్చలా! ఇదేకాక, మరొక కారణ మున్నదని, తలవనితలంపుగా అలెక్సీకి విదితమయింది. ఈ విషయం పరు లకు తెలియరాదని మేజర్ చాలా జాగ్రత్తపడ్డాడు. కాని....

ఎంతవరకూ తానూ, తన నడకమీదే దృష్టిని నిలిపిన అలెక్సీ మేజరు సంగతి మరిచేపోయాడు. రోజూ మూడుగంటల కాలం నడిచేవాడు. ప్రొద్దు నొక గంటా. మధ్యాహ్నమింకొక గంటకాలమూ. సాయంకాలం మరొక గంట కాలమూ నడిచేవాడు. ఇతర గదులలో నున్నవారికి మొదట్లో ఇతనూ, ఇతని నడకా అంటే ఒళ్లు మండింది. పిలిసంగుదుస్తుల యీ మనిషి తమ గదిగుమ్మాల ముందు గడియారం పెండ్యులంమాదిరి యిటూ, అటూ పచార్లుచేయటం వారికి నచ్చిందికాదు. కాని కొంతకాలానికి దీని కలవాటుపడ్డారు. పిలిచినట్టు ఒక్క

సెకండయినా ఆలస్యంకాకుండా అలెక్సీ వారి గదిగుమ్మాల దగ్గిర కనిపించేవాడు. అతడు రాకపోతే వారి కేదీ తోచేదికాదు. ఒక పర్యాయం అలెక్సీ చలిజ్వరంతో పడిపోయాడు. ప్రతి వొక్క గదినుండీ అతని కేలాగున్నదీ తెలుసుకోడానికి మనుష్యులను పంపించారు.

ప్రొద్దునపూట ఒక గంటకాలం నడిచాక, అలెక్సీ కుర్చీమీద కూర్చొని విమానమును నడిపించడానికి కాళ్ళకి తరిఫీదు నిచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు కండ్లు తిరిగి, చెవులలో గింగురుశబ్దం వినబడి క్రింద పడిపోయేటంత పనీ అయ్యేది. అటువంటపుడు కుళాయిదగ్గిరికి వెళ్ళి, ఇన్ని చన్నీళ్లు ముఖంమీదా, తలమీదా కొట్టి తుడుచుకొని వెళ్లి మంచంమీద బోర్ల పడుకొనేవాడు. తిరిగి నడిచేకాలం రాగానే సిద్ధంగా నుండటానికి కండ్లుమూసుకొని రవంత పడుకొనకపోతే సాధ్యమయ్యేది కాదు.

ఆదినం ప్రొద్దున తల తిరిగేటంతవరకూ కాళ్ళకు విమానం నడిపే కసరత్తు చేశాడు. కండ్లు మసకలుక్రమ్మాయి. లేచివెళ్లి మంచంమీద పడుకొన్నాడు. కొంతసేపయిన పిదప రవంత తెప్పరిల్లి పడుకొనివుండగా యెవరివో మాటలు వినిపించాయి. ఎగతాళిచేస్తూ, నిండుకుండ తొణకదన్నట్టు శాంతగామాట్లాడే క్లావిడియా కంఠమూ, ఉద్రేకంతో బ్రతిమాలే మేజర్ స్ట్రిఖొవ్ మాటలూ వినిపించాయి, వారి మాటల ధోరణిలో అలెక్సీ, ఆతడా గదిలోనున్నాడన్న సంగతి వారికి తెలియలా!

"నా మాటనమ్ము నిజం చెబుతున్నాను! నేను చెప్పేది నీకు అర్థం కావటం లేదా? లేకపోతే అర్థంచేసుకోవద్దనా! నీవొక ఆడదానివా, కాదా అని నాకప్పు డప్పుడు అనుమానం కలుగుతుంది"

"అనుమానమెందుకు? ఆడదాన్నే. నూటికి నూరుపాళ్లూ ఆడదాన్నే, కాని నీమాటలు నాకు తెలియవు. ఈ విషయమై ఖచ్చితంగా, యదార్థంగా నీవు మాట్లాడలేవు. నాకు నీ ఖచ్చితమూవద్దు, నీ యదార్థమూ అక్కరలా."

మేజరుకు చాలా కోపంవచ్చి, పెద్ద గొంతుచేసుకొని తిట్టిపోసినట్టూ, కొట్ట వచ్చినట్టూ?

"నిన్ను ప్రేమిస్తున్నాను, నీ వంటే పడిచస్తున్నాను, నీకు తెలియటంలేదా? నీకు తెలిసీతెలియనట్టు నటిస్తున్నావా? తెలియకపోతే, నీవొక ఆడదానివేకాదు; ఇనుపగుండెల రాతివిగ్రహానివి, ఇప్పుడయినా బోధపడిందా?" అని, కిటికీ అద్దం మీద వ్రేళ్ళతో దరువువేస్తూ, నిరీక్షిస్తూ కూర్చొన్నాడు.

క్లావిడియా, అందరి నర్సులకూ అలవాటయిన, నిశ్శబ్దపునడక నడిచి గది గుమ్మందగ్గిరికి చల్లగాజారింది.

"ఎక్కడికా వెళ్ళటం? నే నడిగినదానికి బదులు?"

"అసలు చెప్పడానికీ, ఇటువంటి విషయాలు మాట్లాడటానికీ ఇది సమయము కాదు. తగిన తావూకాదు. నాకు పనివున్నది. బాతాఖానీకి వ్యవధిలేదు."

"ఉన్నది ఉన్నట్లుగా చెప్పి ఏడవరాదా ? న న్నెందుకీవిధంగా వేధిస్తావు ? చెప్పు నీ వుద్దేశమేమిటో చెప్పవా ?" అని అదుర్దాగా, బ్రతిమాలుకొంటూన్నట్టు అడిగాడు.

గది గుమ్మందగ్గిర నిలబడిన క్లాడియాలో నే దేదో దురూహ్యమయిన సోయిగం అలెక్సీ కగుపించింది. కొద్దిగా వయస్సు ఎక్కువయినప్పటికీ. ఎంతో ఆకర్షణీయంగానూ. సుకుమారంగానూ కనవడే ఈమె తా ననుదినమూ చూసే నర్సు క్లాడియాయేనా అనిపించింది అలెక్సీకి. సగర్వంగా తల నెత్తిపెట్టి నేలమీద ప్రాకే పురుగును చూసినట్టులా మేజరును చూస్తూ. క్లాడియా.

"నీయిష్టప్రకారమేకానీ, బదులు చెబుతాను. నీమీద నాకు ప్రేమ ఇసుమంత యినా లేదు. బహుశా ఈ జన్మ కటువంటి అదృష్టం నాకు కలగదు" అన్నది.

అని వెళ్ళిపోయింది. మేజరు మంచంమీద బోర్లపడి తలగడలో తల దూర్చి పడుకొన్నాడు. గత కొద్ది దినాలుగా మేజరు చీదరగొడ్డుమాదిరి వర్తించ డానికి కారణం అలెక్సీకి తెలిసింది. క్లాడియా తమ గదిలోకి వస్తే చాలు, అత నిలో నేదో ఆదుర్దా, దిగులూ కనిపించేవి. సంతోషంగా నున్నట్టులే వుండి, కోపో ద్దీపితుడుగా మారేవాడు మరుక్షణం.

పాపం ! చాలా కష్టపడుతూవుంటాడుకాబోలు. అలెక్సీకి జాలివేసింది. కాని మేజ రిట్టి కష్టము ననుభవించటం తలంచుకొంటే అతని కొకవిధమైన సంతోషంకూడా కలిగింది. మేజర్ లేచి కూర్చోగానే అతని నించుక ఏడిపించాలని అలెక్సీకి బుద్ధిపుట్టడంలో ఆశ్చర్యమేదీలేదు !

"ఏమయ్యా ! ఒక్క చిటికలో పట్టేస్తానన్నావే. ఏమయింది ?" అన్నాడు.

మేజ రా విధంగా వర్తిస్తాడని తెలిస్తే, అలెక్సీ పై మాదిరి మాట్లాడేవాడు కాడు. స్ట్రిఖొప్. అమాంతంగా మంచంనుండి లేచి అతని దగ్గిరికి వచ్చి, ఎంతో జాలిగా—

"నవ్వుతున్నావా ? అవునులే, నవ్వక ఏమిచేస్తావు ? నవ్వు. నన్నుచూసి బాగా నవ్వు. నా బ్రతుకే నవ్వులపాలయిపోయిందిలే....నన్నిప్పు డేమిచేయ మంటావు, అలెక్సీ ? చెప్పు....ఏ విధంగా నడుచుకోవాలో నా కించుక నేర్పించు తమ్ముడూ ! మా యిద్దరి మాటలూ నీవు విన్నావుగా ? సరే, ఫరవాలేదులే. ఏమి చేయాలో నాకు తెలియటంలా" అన్నాడు.

రెండు చేతులతో తలపట్టుకొని, అలెక్సీ చెంత మంచంమీద కూర్చొన్నాడు, పెద్దగా నిట్టూర్చి.

"ఊసుపోక ఆమెతో సరససల్లాపాలాడాననుకొన్నావు కాబోలు : అ పంతి మాత్రమూ నిజంకాదు. నే నామెను యథార్థంగా ప్రేమిస్తున్నాను. లేకపోతే. ఆ బద్మాష్‌తో నా కేమి పని ?"

యథాప్రకారం ఆ రోజు సాయంకాలం, క్లాడియా రోగుల చూసిపోవటానికి గదిలోకి వచ్చింది. ఏమీ జరగనట్టూ, ఏదీ తెలియనట్టూ బహు ప్రశాంతంగా, అమాయకంగా కనిపించింది. అలెక్సీని చూసి నవ్వినట్టే మేజరునుచూసి నవ్వింది. కాని, మేజరును చూస్తే, ఆమె కేదో భయం వేసింది. కిటికీ చెంత కూర్చుని గోళ్లు గిల్లుకొంటూ, ఆమె ఎవరో తెలియనట్టు చూసాడు. క్లాడియా వెళ్ళిపోయింది. వెళ్ళే ఆమెకేసి చూసిన చూపులో కోపమూ, అసూయా పెనగొని కనిపించాయి.

"సోవియట్ దేవదూత !" అన్నాడు, పరిహాసంగా. "ఏ బుద్ధిమాలిన వెధవో ఆ విధంగా అని వుంటాడు. దేవతట, దేవత ! నర్సుదుస్తులు తొడుగుకొన్న నరమాంస భక్షిణి; యమఘాతకురాలు"

అస్పత్రి ఆఫీసులో పనిచేసే వొకనర్సు. ఎండుమిరపకాయ మాదిరి పొడారిపోయిన సౌందర్యరాసి. అప్పుడా గదిలోకి వచ్చింది.

"అలెక్సీ అంటే నడిచేరోగా ?"అని అడిగింది.

"కాదు, పరుగుత్తే రోగి." అన్నాడు స్ట్రిఖావ్.

"హాస్యాలాడటాని కిక్కడికిరాలేదు అలెక్సీ. లెఫ్టినెంటు అలెక్సీకి ఫోను పిలుపు వచ్చింది." అనిన నర్సునుచూసి :

"యవ్వన స్త్రీ కంఠమా ?" అంటూ, స్ట్రిఖావ్ లేచినిలబడి వచ్చిన నర్సుకేసి కన్నుకొట్టాడు..

"పడుచుదో. ముసలిదో. నాకెట్లాతెలుసు ? ఆమనిషి జాతకం - నేను చూడలా" అంటూ, తెరచాపవిప్పి గాలిపోసుకొంటూ వెళ్లే పడవమాదిరి రివ్వు రివ్వునవెళ్లిపోయింది.

అలెక్సీ అదిరిపడి మంచంనుండి లేచాడు. టక్కుటక్కున చేతికర్రను మోగిస్తూ గబగబానడిచివెళ్ళి, ఆ నర్సునుదాటి ఆఫీసుగదికి దారిపట్టాడు. చాలా పొక నెలరోజులుగా వోల్గానుండి వుత్తరాలేరాలేదు. తాను వ్రాసిన జాబుకు బదులు రెండు ముక్కలయినా వ్రాసినపాపానపోలేదు. ఒకవేళ ఓల్గా తనకు టెలిఫోను చేసిందికాబోలు : ఉహూ, అసంభవం. స్టాలిన్‌గ్రాడ్ ఎక్కడ మాస్కోఎక్కడ? ఇంతదూరంరావటమా ? అందులోనూ ఈ యుద్ధపురోజుల్లోనా ? తానీ అస్పత్రిలో నున్నాడన్న సంగతి ఓల్గాకు తెలియదుగా ? తానెక్కడో, మాస్కోనగరానికి దూరంగానున్న యుద్ధ ప్రదేశంలో నుంటున్నానని మాత్రం వ్రాశాడేకాని ఇక్కడున్నట్టు వ్రాయలా. విచిత్ర విషయాలూ దురూహ్యమైనకార్యాలూ జరుగగలవనె నమ్మకమాతని కాలోజుల్లోనే కుదిరింది. తనకు తెలియకుండానే పరుగెత్తాడు.

కృత్రిమ పాదాలమీద, చేతికర్ర నుపయోగించకుండానే, పరుగిడి వెడుతోంటే కిర్రు కిర్రు, కిర్రు మంటూ బూట్లు యెలుగెత్తి శ్రావ్యగానం చేశాయి........

టెలిఫోను నెత్తి చెవికి పట్టుకోగానే చక్కటి కంఠం వినిపించింది. సింధు వంటి కాని ఇదెవరో క్రొత్తమనిషి : తనపేరు లెఫ్టినెంట్ పెట్రోవిక్ అలెక్సీయేనా అని ప్రశ్నించిందా కంఠం. ఎందుకో అలెక్సీ కీ ప్రశ్న కోపంకలిగించింది; అ దేదో త న్నవమానపరిచిన ట్లనుకొన్నాడు.

"ఔ" నని తుంచినట్టు లన్నాడు.

ఒక్క నిమిషం నిశ్శబ్దం. పిమ్మట త న్ననవసరంగా కష్టపెట్టినందుకు క్షమించమని వినబడింది. ఇప్పు డా కంఠంలో మునుపటి ఔదార్యం కనిపించలా. బలవంతంగా పెకలించుకొనివచ్చినట్టు మాటలు వినిపించాయి :

"మాట్లాడుతున్నది అన్నా గ్రిబోవా. నే నెవరో నీకు తెలియదు. నీ స్నేహితుడు గ్వాజ్దెవ్‌తో నాకు పరిచయమున్నది."

అమాంతంగా రెండు చేతులతో టెలిఫోనును గట్టిగా పట్టుకొని అలెక్సీ బిగ్గరగా దానిలో కీ విధంగా అరిచాడు :

"నీవు అన్యూతావు కాదా ?....అవును. నాకు తెలుసు. అన్యూతావే ! నిన్నుగురించి నా కింతకుముందే తెలుసు. గ్వాజ్దెవ్ ! నా కంతా...."

"ఎక్కడున్నాడు ? ఏమి చేస్తున్నాడు ? అకస్మాత్తుగా నాతో చెప్పకుండానే వెళ్లిపోయాడు. సైరన్ ఊదింది. నేను ప్రథమచికిత్స దళంలో పనిచేస్తున్నాను. కాబట్టి ఉన్నదానినల్లా వున్నట్టు వెళ్ళిపోవలసివచ్చింది, అందుకనే వెళ్లాను, తిరిగి వచ్చి చూస్తే గ్వాజ్దెవ్ గదిలో కనిపించలా....ఎక్కడికివెళ్లిందీ ఒక్క చీటీపైన అయినా వ్రాసి పెట్టకుండా వెళ్ళిపోయాడు....సోదరా. అలెక్సీ ! ని న్నింత చనువుగా పలుకరిస్తూన్నందుకు నన్ను క్షమించు....నిన్ను గురించి నా కన్ని విషయాలూ తెలుసు....నా కేదీ తోచటంలా. పిచ్చిపట్టినట్లున్నది ఎక్కడున్నాడో తెలుసుకోవాలనే ఆదుర్దాతో నీకు టెలిఫోను చేస్తున్నాను....ఎందుకు, ఒక్కమాటయినా చెప్పకుండా వెళ్ళిపోయాడో. నా కెంతమాత్రమూ తెలియకున్నది...."

అలెక్సీకి చెప్ప నలవికానంత సంతోషం కలిగింది. తన మిత్రుడికి రోజులు బాగున్నాయనే నమ్మకం చిక్కింది, అతడీ స్త్రీని తప్పుడర్థం చేసుకొన్నాడు. దేనికీ అంత తొందర పనికిరాదు. సిసలైన స్త్రీలు. ఏ కాలో లేక ఏచెయ్యో పోయిందని తాము ప్రేమించిన మనిషిని వదులుకోరన్నది యదార్థం. ఇదేవిధంగా తన విషయమై దిగులొంది, వెతుక్కొంటూ తనకొరకు రాగల స్త్రీ యొకతె కలదుకాబోలు; ఇన్ని ఆలోచనలూ, విద్యుల్లతవలె అలెక్సీ మనస్సులో మెరిసాయి. మాటలు తడబడుతూ, తిరిగీ. టెలిఫోనులో యీ విధంగా అరిచాడు.

"అన్యూతా! నీ వెట్టి దిగులూ పడవద్దు. అంతా సరీగ్గా ముగిసే రోజులు రానున్నాయి. నిన్ను అర్థంచేసుకోలేకపోవటం; గ్వాజెవ్ దురదృష్టం. బాగున్నాడు. యుద్ధంలో చేరాడు, తిరిగీ. .... చిరునామా తెలుసా? .... తెలియకేమి? .... F. P. O. 42531 — B. ఇప్పు డాతను గడ్డం పెంచుతున్నాడు, నిజం. ఎంత ఒట్టు పడితే అంత ఒట్టు. అన్యూతా!....చాలా అందమైన గడ్డం....చూస్తే నీకే దాని అందం అర్థమవుతుంది."

గడ్డం పెంచుకొనటం అన్యూతా కెంతమాత్రమూ నచ్చలా. అదంతా అనవసరమన్నది. తా నీ విషయం వెంటనే అతనికి వ్రాస్తానన్నాడు, అలెక్సీ. సఖు గురూ గడ్డం పెంచిన తరువాత ఎంతో బాగున్నాడని అన్నారు. కాని, వారందరి మెప్పులతో గ్వాజెవ్‌కు పనిలేదు. తన జాబు చూసిన మరుక్షణమే ఆమె సందే శానుసారం, కాదు ఆజ్ఞను శిరసావహించి గడ్డం గీకించిపారేస్తాడు.

ఇద్దరిమధ్యా ఎంతో స్నేహం కుదిరింది. అలెక్సీ ఆస్పత్రినుండి వెళ్ళిపోయే ముందు తనకు వ్రాయమని చెప్పి, ఒప్పించింది అన్యూతా. అలెక్సీ తన గదికి తిరిగి వెళ్ళడానికి బయలుదేరాడు. టెలిఫోను వచ్చిందని వినగానే, పరుగెత్తుకొని వచ్చా డన్న సంగతి జ్ఞప్తికి వచ్చింది. అదేమాదిరి పరుగెత్తుకొని, తిరిగీ తన గదికి వెళ్ళ జూచాడు. కాని, లాభం లేకపోయింది. పాదం భూమిని తాకినప్పుడల్లా నరాలు. తొడలవరకూ జివ్వున లాగాయి. "ఫరవాలేదు. ఇవ్వాళ కాకపోతే, రేపు; రేపు కాకపోతే, మరొకరోజు పరుగిడి తీస్తాను. ఒకసారి పరుగెత్తటం సాధ్యపడితే అభ్యాసంమీద పరుగుతీయటం వీలవుతుందని నా కిప్పుడు ధైర్యం చిక్కింది" అను కొన్నాడు. పరుగెత్తడానికీ, విమానంలో ఎగిరివెళ్ళడానికీ వీలున్నది. తప్పకుండా తా నీ పనులను సాధించితీరుతాడు. సైన్యదళంలో చేరి పూర్వంమాదిరి విమాన యుద్ధం చేయడమూ, శత్రువిమానాలను బోల్తా కొట్టించటమూ తాను తప్పక సాధి స్తాడు. మొదటి జర్మను విమానమును పడగొట్టగానే, ఓల్గాకు జాబు వ్రాస్తాడట. జరిగిన విషయాలన్నీ ఆమెకు చెబుతాడు. ఏమి జరిగినా జరుగుగాక, వ్రాస్తాడట!



# మూడో భాగం

## 1

ఆది 1942 సంవత్సరం, వేసవికాలం మాస్కోనగరపు సైనికాస్పత్రి సింహద్వారం తలుపులు తెరుచుకొన్నాయి. వైమానికులు ధరించే కోటూ, పంట్లామూ తొడుగుకొని, కోటు మెడపట్టీమీద లెఫ్టినెంట్ చిహ్నంగల పతకంతో వొకమనిషి బయటికివచ్చాడు. చేతిలోనున్నచక్కని, బలమైన చేతికర్రమీద బరువానిస్తూవచ్చే ఆతనితో నొక ధవళవస్త్రధారి. నర్సు కన్పించింది. ఆమె నెత్తికి చుట్టుకొన్న చేరుమాలుమీదనున్న ఎర్రసిలువగుర్తు ఆమె ప్రశాంత వదనమువకొక ఆభరణం మాదిరగుపించింది, ఆస్పత్రి మెట్లమీద వారిద్దరూ నిలబడ్డారు. ఆ లెఫ్టినెంట్, తన జేబులోనుండి నలిగిపోయిన వైమానిక టోపీనితీసి నెత్తినపెట్టుకొన్నాడు. నర్సు చేతినెత్తి సగౌరవంగా ఆమె హస్తమును ముద్దుపెట్టుకొన్నాడు. తత్తరపాటుతో నర్సు లెఫ్టినెంట్ తలను తన రెండు చేతులతో పట్టుకొని. నుదురును చుంబించింది. లెఫ్టినెంట్ తన చేతికర్రనూతచేసుకొని చకచకా తారురోడ్డుమీదనడిచి వెళ్ళాడు. వెనుదిరిగిచూడలా. ఆస్పత్రి భవనమునుదాటి. నదీతీరపు బాటనుపట్టి వెళ్ళిపోయాడు.

ఆస్పత్రి కిటికీలనుండి నీలమూ, పసుపూ ఇత్యాది రంగుల పైజామాలు తొడుగుకొనిన రోగులు చూశారు. చేతి రుమాళ్లు, చేతి కర్రలు, చంక కర్రలు, చేతి కేది అందితే దానినంతా ఆడిస్తూ, "జాగ్రత్తగా వెళ్లు", "జయమగుగాక!" అంటూ ఎలిగెత్తి అరిచారు. వెళ్ళే మనిషి చేయూపాడు, కాని వీలయినంత త్వరలో వెళ్ళిపోవాలనే ఆదుర్దా అతని ముఖంలో స్పష్టంగా కనిపించింది. వెను దిరిగి ఆస్పత్రినీ, కిటికీలలోని ముఖాలనూ చూసేటంత ధైర్యం లేకపోయింది. త్వరత్వరగా చేతికర్ర నూపుతూ వెళ్ళేటప్పుడు కిర్రు, కిర్రుమనే శబ్దం కొద్దిగా వినబడింది, నడిచివెళ్ళే యీ బలశాలికి రెండూ పాదాలూలేవనే విషయం కేవల మాతని నడకనుండి తెలుసుకొనటం దుస్సాధ్యం.

ఆస్పత్రినుండి విడుదలచేసిన వెంటనే అలెక్సీనీ, మేజర్ స్ట్రోఖొవ్‌నూ మాస్కోనగరపు ఆరోగ్యాశ్రమానికి బలం పట్టేటందుకు పంపించారు. వా రిద్దరినీ తీసుకువెళ్ళటాని కొక కారు వచ్చింది. మాస్కోలో చూడవలసిన స్నేహితు

ఉన్నారని మేజర్ స్ట్రిఖొవ్‌కు తన బట్టలూ వగయిరా వస్తువులున్న సంచిని వప్పగించాడు. మిత్రులను కలుసుకొని, ఎలక్ట్రిక్ రైలులోనెక్కి ఆరోగ్యాశ్రమానికి సాయంత్రానికి వస్తానని చెప్పాడు. తన మిత్రులను కలుసుకోడానికి అలెక్సీ నడిచి వెడుతున్నాడు, నదిగట్టుబాట పొడూగునా.

అలెక్సీకి మాస్కోలో చూడవలసిన మిత్రులున్నారన్నది అబద్ధం. తమాషాగా యింతకాలానికి పిదప, నలుగురితో కలిసి, నగరవీధుల్లో తిరగాలనే ఆశ, ఇతరులసహాయం లేకుండా తనంతటతానే జనసమూహంలో భుజాలు రాసుకొంటూ నడవాలనే కోరికకొద్దీ బయలుదేరాడు. మధ్యాహ్నం పన్రెండు గంటలకు రావడానికి వీలవుతుందా అని అన్యూతాకు టెలిఫోను చేశాడు, "ఎక్కడా!" అని అడిగితే "పుష్కిన్ విగ్రహంవెంత" అని ఆ సమయానికి నోటికివచ్చిన మాట నన్నాడు. ఎండలోపడి చల్లని నీటిపై వీచేగాలిని పోసుకొంటూ, నదీతీరాన నడిచివెడుతూన్నాడు. అన్యూతాను దమ్మరినచోటుకు అంబయట యీ విధంగా నడిచి యెంతకాలమయిందో తన కాళ్ళ నుపయోగించి నగరబాటలపై నడవడాని కిదే మొదటిసారి, ఇన్ని నెలల కనంతరం.

దారి పొడూగు నా కనుపించిన స్త్రీ లందరూ అప్సరసలమాది రున్నారు. చెట్ల ఆకులు నిగనిగలారుతూ మరీ పచ్చగా కనుపిస్తున్నాయి. స్వచ్ఛమైన చల్లని గాలి పీలుస్తోంటే ఏదో బ్రాంది సేవించినట్లు బలే నిషాగానున్నది. పూర్వమెప్పుడో పటములలో చూసిన క్రెమ్లిన్ కోట గోడలూ. ఇవాన్ గడియార గోపురమూ, నదిపై నున్న వంతెనా, చేయి జాపుతే చాలు అందుతాయన్నట్లనిపించిందాతనికి. ఆ గాలి పీలుస్తూంటే తన చిన్నతనపు రోజులు జ్ఞాపకానికి వచ్చాయి. గుర్రం కదను త్రొక్కినట్లు గుండె చిందులు త్రొక్కుతోంది. ఎందుకో తన తల్లికి జ్ఞప్తివచ్చింది. ఇప్పటి శల్యావశిష్టమైన ముదుసలిరూపం బదులు వయస్సులో నున్నప్పటి రూపం పొడగరీ గాలిలో నెగిరే ముంగురులను సర్దుకొంటూ నడి చే తన తల్లికంటబడింది. ఒక వేళ పూర్వ మెప్పుడో తన తల్లితో తా నీ మాస్కో నగరానికి వచ్చాడు కాబోలు!

కాని. ఇంతకుముందెన్నడూ అలెక్సీ మాస్కోను చూడలా. పటాలూ పత్రికల్లోని ఫొటోలూ దానిని చూసి వచ్చినవారు చెప్పగా వినటమువల్ల మాత్రమే అతనికి మాస్కోనుగురించి తెలుసు. రాత్రులందు జనులంతా నిద్రించేటప్పుడు టంగు టంగున మ్రోగే మాస్కోనగరపు జే గంట ఎంతో దూరం వినబడుతుంది. మాస్కోనగరంనుండి రేడియో వార్తలూ, పాటలు వినిపిస్తాయి. ఇ.తమట్టుకే అతనికీ నగరమును గురించి తెలిసినదల్లా, కాని ఇప్పుడో? మాస్కోనగరం ప్రత్యక్షంగా కనిపిస్తోంది. దాని తారు రోడ్లపై దూరపుటిండ్లూ, గోపురాలూ ఎండమావుల్లో కనిపిస్తున్నాయి.

వదిగట్టు పొడుగునానున్న రాతిగోడ తాకితే ఎంతోచల్లగానున్నది. దాని కానుకాని పంగిచూస్తే నదీజలంచల్లగా, నీలంగా కనిపించింది. అంచుననున్న రాళ్ళనుమోది, పైకెగిసే నీటిబిందువులలో ఎండపడి సప్తరంగుల ఇంద్రధనస్సులు తాండవిస్తున్నాయి. ఇదంతా కొంతసేపుచూసి మెట్లెక్కి ఎర్రబజారుకు దారి పట్టాడు, దోవపొడుగునా, బాటకిరుప్రక్కలా దట్టంగాపెరిగే నిమ్మచెట్లు పూవులతో నిండిపోయాయి. దాటంటపోయే మోటారుకారుల శబ్దాలూ, ట్రాము బండ్ల గణ గణలూ, పెట్రోలు పొగలచిమ్ముకొంటూ వెళ్ళేలారీలూ, ట్రక్కులూ, నిమ్మపూవు లలో జుమ్మని ఎగురుతూ తీయని తేనెలగ్రోలే తేనెటీగలనూ, భ్రమరములనూ బెదరించి పారద్రోలలేకపోయాయి. తీయని తన్మయత్వంలోనున్న వాటికిట్టి విషయా లెవ్వీ తెలిసాయికావు.

ఇదే. ఇదంతా మాస్కోనగరం! తమ మాస్కో!!

నాలుగు నెలలకుపైగా ఆస్పత్రిలో నుండి ఇప్పుడే బయటికి రావటంవల్ల అలెక్సీకు ఇంతా ఎంతో ఆకర్షణీయంగా కన్పించింది, కాని మాస్కోనగరం పూర్తిగా యుద్ధసన్నాహంమీదనున్నదనే విషయమాతని కప్పుడు తెలిసిందికాదు. ఎప్పుడు వస్తుందో యుద్ధమని వూపిరిబిగపట్టి నగరమంతా కనిపెట్టుకొని కూర్చొ న్నట్లున్నది. నది సమీపంలోనున్న విశాలమైన బాటకడ్డంగా స్తూపులను పడేసివాటి సందుల్లోనూపైనా ఇసుకనింపారు. వంతెనకిటుచివర రెండూ, అటుచివర రెండూ కంకరతోనూ సిమెంటుతోనూ కట్టిన గోపురాల్లో నిప్పునార్పే యంత్రాలున్నాయి. ఎర్ర బజారు రోడ్డు కిరుప్రక్కలానున్న గృహాలకూ, భవనాలకూ, తోట గోడలకూ కొత్తరకం రంగులు పూసారు. గోర్కీ బజారులోని అంగళ్ళ కిటికీతలుపులన్నీ భద్రంగామూసి, మనిషి ఎత్తుకు ఇసుకతోనింపిన సంచులను వాటికడ్డంగా పేర్చారు. ప్రక్కవీధులను పాత రైలుపట్టాల నడ్డంపెట్టి మూసివేశారు. ఇంతకుముం దెన్నడూ మాస్కోను చూడనటువంటి అలెక్సీ కిదంతా కొద్దిగాడవగా కనిపించింది. ఇండ్లన్నిటికీ అవకతవకగా పూసినట్లగుపించే రంగులు మరీ చోద్యంగా కని పించాయి.

అలిసిపోయాడు. కాలిబూట్సులు పూర్వంకంటే ఇప్పు డెక్కువ శబ్దం చేస్తున్నాయి, చేతికర్రమీద బరువుమోపి నడుస్తున్నాడు. నలుదిక్కులా పరికించి చూశాడు. కాని బాంబులుపడి యేర్పడిన గోతులుకానీ, శిథిలమైన యిండ్లుకానీ, తుత్తునియలైన కిటికీలుకానీ యెక్కడా అతనికి కనిపించలా. పడమట నెక్కడో నున్న విమానాశ్రయంలో తా నున్నపుడు ప్రతిరోజూ పగలనక, రాత్రనక జర్మను విమానాలు తూర్పుదిశగా ఎగురుతూవెళ్లేవి. ఒక విమానపటాలం వెళ్ళేలోగా నింకొకటి మేఘమండలంలో కనుపించేది. ఒక్కొకపుడు రాత్రంతా ఎగిరే విమానాల ఘోరు ఎడతెరపిలేకుండా వినబడేది. తా నున్న విమానాశ్రయంలోనివా

రందరూ జర్మనులు మాస్కోమీది కెగిరి వెడుతున్నారనీ, ఆ నగరమంతా భూలోక నరకంమాదిరి మంటలతో, పొగలతో, దిక్కులేని జనుల హాహాకారాలతోనూ నిండిపోయింది కాబోలుననీ దిగులొందేవారు.

కాని తన కట్టి దృశ్యాలేవీ కనుపించటంలేదు. తా నూహించిన మాస్కో, ప్రత్యక్షంగా కనిపించేదానికి పోలికే లేకున్నది. రోడ్లన్నీ సాఫీగానున్నాయి. బారులు తీరి నిలబడిన యిండ్లు యెంతో ముద్దొస్తున్నాయి. ఏవో ఒకటి రెండుమాత్రం తప్ప.

కిటికీల అద్దాలతలుపులు కూడా చెక్కుచెదరకుండా కనుపించాయి. వాటి కంటించిన జిగురు పేపుకూడా ఏవంతయినా వూడిందికాదు. కాని, మాస్కో నగరానికి సామీప్యంలో నెక్కడో నొకచోట యుద్ధం జరుగుతూనే వున్నది. నగరవాసుల ముఖాలలోని అదుర్దాకితోడు ఎక్కడ చూసినా పెద్ద బూట్సులు తొడుగుకొని. భుజాన సైనికసంచీల వ్రేలాడకట్టుకొని, చెమటలు కారుకొంటూ వెళ్ళే సైనికులూ దగ్గరలో యుద్ధం జరుగుతోందనిటానికి నిదర్శనాలు. ఉన్నట్టుండి, కొన్ని సైనిక లారీ లొక ప్రక్కసందునుండి రోడ్డుమీదికి వచ్చి, అలెక్సీని దాటివెళ్ళాయి. వాటి అద్దాలు తుత్తునియలై పోయాయి. చక్రాలకు కప్పిన రేకుటోపీలు సొట్టలుపడీ, మెలి తిరిగీ వికృతంగా కనుపించాయి. వాటిలోని సైనికు లెంతో అలిసిపోయినట్లగు పించారు. దారివెంబడిపోయే మోటారులూ, లారీలూ, ట్రాము బండ్లూ ఈ సైనిక ట్రక్కులకు దారినిచ్చి, అవన్నీ దాటివెళ్ళేదాకా నిలబడ్డాయి. వాటిని చూస్తే, అలెక్సీకి చటుక్కున ఎగిరి తా నొక ట్రక్కులో కూర్చోవాలని ఆశ పుట్టింది. సాయంత్రానికల్లా తానుకూడా యుద్ధభూమిని చేరుకోవచ్చు. అంత అదృష్టమేగనుక కలిగితే, ఎంత బాగుంటుందో అనిపించింది. పూర్వం డెగ్ట్యారెంకోతో చేరి, యుద్ధ భూమిని త్రవ్విన కాలువలలో గడిపిన రోజులు జ్ఞప్తికి వచ్చాయి. ఫర్ వ్రూనుల పేళ్ళ నిర్మించుకొన్న పరుపులూ, ఘాటైన తారువాసనా, వ్రేలిపోయిన బాంబూ, ఫిరంగి గుండ్లల్లో పెట్రోలు నింపి వత్తిపెట్టి వెలిగించుకొన్న గుడ్డి దీపాలూ, తెల్ల వారుఝామున చలికి బిగదీసుకుపోయిన లారీ ఇంజనులు వేడి ఎక్కడానికి బుర్రు బుర్రుమంటూ చేసేశబ్దాలూ. రోజుకు ఇరవైనాలుగు గంటలూ విసుగూవిరామమూ లేకుండా పైను చెట్ల ఆకులలో దూరిపోతూ ఈలలూదేగాలీ: ఇవన్నీ అలెక్సీకి జ్ఞప్తికొచ్చాయి. ఏలాగయినాసరే యుద్ధభూమినిచేరితే! అచ్చటివారితో చేరి తాను కూడా భూమికంట కరుచుకొని యుద్ధభూమిలో పడుకోగలిగితే!! ఆ నేలంతా తడితడిగా, చిత్తడిగానున్నప్పటికీ, లెక్కకుమించినన్ని దోమలు ప్రాణాలు కొరుక్కొని తింటున్నప్పటికీ ఫరవాలేదనిపించింది. యుద్ధభూమిలో నుండే సుఖంకొరకు, వీటినేకాదుగదా, వీటికి పదిరెట్లెక్కువ కష్టాలను కూడా సహించడానికి కాతడు సంసిద్ధంగానున్నాడు.

ఎట్లాగో వొకట్లాపుష్కిన్ విగ్రహమును చేరుకొన్నాడు. దారిలో ఎన్ని పర్యాయములాగాడో! కాళ్లు బహునొప్పిపెట్టాయి. తన యదార్థస్థితి యితరులకు

తెలియరాదని కాబోలు. పాటవోడుగునానున్న అంగళ్ళలోని వస్తువులను చూస్తూన్నట్టు నిలబడి. సేదతీర్చుకొన్నాడు. పుష్కిన్ విగ్రహం చుట్టూనున్న పచ్చని గడ్డిమైదానంలో నొక బల్లమీద కూర్చొని, కాళ్ళుజాపాడు. హమ్మయ్యా ! ! ఎంత హాగున్నది !....కాళ్ళు బహుబాధపెట్టాయి, బూట్సులవారు కాళ్ళ కండల్లోకిలోతుగా, బిగువుగా దించుకుపోయినట్లు. కాళ్ళు ఒక్కటే బాధ కాని, ఇవన్నీ ఒక ఎత్తూ, ఇక్కడికి తనంతటతానే నడిచిరావటమూ, చల్లనిగాలీ, లేక ఎండా వీటివల్లకలిగే తృప్తి వేరొకఎత్తూ అనిపించింది. గాలిమీద తేలుతూవచ్చే నిమ్మచెట్లు వాసనకు ప్రాణం తెప్పరిల్లింది. ట్రాముకారుల గణగణలు ఎంతో వినబుద్ధిగానున్నాయి. పాలిపోయిన ముఖాల పసిబిడ్డలు విగ్రహంచెంతనున్న ఇసుకప్రోవులో ఇండ్లూ వాకిళ్లూ కట్టుతూ కేరింతలుకొట్టుతూ బహుసందడిగా నున్నారు. రవంత దూరాన చుట్టూగట్టి పగ్గాలు బిగించికట్టిన మైదానంలో కొకచోట పెద్ద బెలూను కనిపించింది. సైనిక దుస్తులు ధరించిన యువతు లిద్దరు దీనికి కాపలాకాస్తున్నారు. మాస్కోనగర రక్షణార్థ ముపయోగపడే సైనికాయుధంమాదిరి కనిపించేబదులు ఏ జంతుప్రదర్శన కేంద్రంనుండో తప్పించుకువచ్చి, వెచ్చని యెండలో పడుకొని నిద్రించే వొక కొత్తరకం మృగంమాదిరీ బెలూను కనిపించింది.

కండ్లు రెండూ మూసుకొని తన ముఖమును సూర్యుని కెత్తిపెట్టి తన చర్మంలోనుండే ఒక్కొక్క రంధ్రంద్వారా సూర్యకాంతిని త్రాగుతూన్నట్టు అలెక్సీ కూర్చున్నాడు. ఇసుకలో ఆడుకొనే పిల్లలూ, వారి శబ్దమూ చూస్తే నలభై రెండో నెంబరు గదికివచ్చే పిచ్చుకలగుంపు జ్ఞప్తికి వచ్చింది. హరి ఆటలేమో వారేమో అన్నట్టులున్న ఆ బిడ్డలలో నొకడు ఆటలమధ్య తప్పించుకొని, పరుగిడివచ్చి అలెక్సి కృత్రిమపాదం తగిలి క్రిందపడ్డాడు.

ఏడుపువచ్చింది. ఏడ్చేవాడే. "ఏం నాయనా ! పడ్డావా ?" అనేవా రెవరన్నా వున్నట్టయితే. కాని ఆమాది రెవ్వరూ అడగనందున వచ్చే ఏడుపు నిలిచిపోయింది. అలెక్సీవంక నొక్క నిమిషం తేరిపారజూచాడు. అకస్మాత్తుగా పెద్దపెట్టున ఏడుస్తూ తతిమ్మా పిల్లలదగ్గిరికి పరుగుతీశాడు. వారందరూ ఏదో గుసగుస లాడారు. దూరంనుండే అలెక్సీని తేరిపారజూచారు, భయభ్రాంతులతో. నెమ్మదిగా కొంచెం దగ్గిరికివచ్చి చూశారు.

పరధ్యానంగానున్న అలెక్సీ యిదంతా చాలాసేపటివరకూ గమనించలా. కండ్లుతెరిచి చూస్తే బెదురుగొడ్లమాదిరి చూసే కుర్రకుంకలూ, వా రనే మాటలూ అతనికి తెలిశాయి.

"విటామిన్, ఊరికే దబాయించకురా ! నిజమైన వైమానికుడు లెఫ్టినెంటురా" అన్నాడు బక్కచిక్కిన ఏడేండ్ల అబ్బాయొకడు.

"నే నేమీ దబాయించటంలా, తెలుసా? అబద్ధమాడితే చచ్చిపోయినంత ఒట్టు. అవి కొయ్యవి; నిజమైనవి కావు....నా కంతమాత్రం తెలియదనుకొన్నావా? కొయ్యవే."

అలెక్సీ ప్రాణం చివుక్కుమన్నది. ఇంతవరకూ అనుభవించిన ఆనందమూ, కలిగిన ఆత్మవిశ్వాసమూ ఎక్కడికో వెళ్ళిపోయాయి. రెప్పలెత్తి వాళ్ళని చూసాడు. వారందరూ గాభరాగా రెండడుగులు వెనుకకు పెట్టి, అలెక్సీ పాదాలను చూస్తూ నిలబడ్డారు.

తన మిత్రులందరూ తా నబద్ధమాడుతున్నా నన్నందుకు, విటామినుకు కోపం వచ్చింది. కావాలంటే, తానా మనిషిని అడుగుతానన్నాడు.

నెమ్మదిగా, అడుగులలో నడుగులిడుతూ అలెక్సీ కంతదూరంగా వచ్చి నిల బడ్డాడు, విటామిన్. అవసరమయితే, ఒక్కపెట్టున పరుగుతీయడానికే అన్నట్టు, ఆస్పత్రి కిటికీమీద కూర్చొనే "ఫిరంగి టామీ" పిచ్చుకమాదిరి నిలబడ్డాడు.

"లెఫ్టినెంట్ సోదరా! ఇదిగో ఇది చెప్పు, నీ పాదాలు నిజమయినవా? కొయ్యవా? నీకాళ్ళు విరిగిపోయాయా?" అని అడిగాడు.

ఊరపిచ్చుక మాదిరి రవంతగా వున్న ఆ అబ్బాయి అడిగిన ప్రశ్నను విని అలెక్సీ. కన్నీరు జలజల రాల్చాడు. అబ్బాయి కిది చాలా ఆశ్చర్యం కలి గించింది తానడిగిన ప్రశ్నకు కోపగించుకొని చేతికర్రతో బాదడానికి వచ్చినా అబ్బాయి కాశ్చర్యం వేసేదికాదు. కాని, వైమానికుడు! లెఫ్టినెంట్ ఏడ్చాడు పాపం తానా విధంగా "కాళ్ళులేవా?" అనటం అతనికెంతో కష్టమనిపించింది కాబోలు! లేకపోతే ఇంతటి మనిషి ఏడుస్తాడా? చల్లగా జారి నలుగురినీ కలుసుకొన్నాడు. అప్పుడప్పుడు వెనుతిరిగి చూస్తూ అబ్బాయిలందరూ అక్కడినుండి నిశ్శబ్దంగా ఎక్కడికో వెళ్లిపోయారు.

తన్నెవరో పిలిచారు. చూస్తే అన్యూతా. బహుసులభంగా గుర్తుపట్టాడు, ఫొటోలో కనబడినంత అందంగా లేకపోయినప్పటికీ, బాగానే వున్నదనుకొన్నాడు. చాలా అలిసిపోయినట్టు కనిపించింది. సైనిక దుస్తులూ, పెద్దబూటులూ, వైమా నిక టోపీతో వచ్చింది. లేత ఆకుపచ్చని కండ్లూ, విశాలమైన కండ్లల్లోని అమాయ కత్వమూ, స్నేహభావమూ అతని నెంతో ఆకర్షించాయి. ఇదే మొదటి పర్యాయం చూడటమయినప్పటికీ, చిరకాల పరిచయమున్నట్టు, చిన్నప్పుడిద్దరూ వొకే ఇంట్లో ఆడుకొన్నట్టు, ఎంతో చనువుగా కనిపించిందా ముఖం,

ఒక్క నిమిషమొకరి నొకరుతేరిపార జూచారు. అంతటామె!

"నీవు వేరొకమాదిరి వుంటావని నేననుకొన్నాను" అన్నది.

రాని చిరునవ్వును తెప్పించుకోడానికి యత్నిస్తూ, "ఏమాదిరి వుంటావను కొన్నావు?" అన్నాడు.

"అదేకష్టం. ఎట్లా చెప్పాలో తెలియటంలా, గొప్ప వీరాగ్రేసరులుంటారే. ఎత్తుగా, బలంగా, బలిష్టమైన, దృఢగాత్రులు....నోటిలో నొకపైప్ పెట్టుకొని.... ఆ మాదిరి. గ్రిగొరీ నిన్ను గురించి ఎంతో వ్రాసాడు !"

"నీ గ్రిగొరీ వున్నాడే. వీరాగ్రేసరుడంటే అతడు." అన్యూతా ముఖ మీ మాటలు విని విప్పారటం చూసి, తిరిగీ "నీ గ్రిగొరీ ముందు నేనెంతటివాడిని? వికరమైన మనిషి. సిగ్గులైన మనిషి, గ్రిగొరీ. నీ గ్రిగొరీ అట్టి స్వంతవిషయం నీకు వ్రాసివుండడు. నిజమేగా?"

"అలియోషా! చూడు; నిన్నీవిధంగా పిలవవచ్చుగా! నీకు కోపమా? గ్రిగొరీ తన జాబులలో ఎప్పుడూ ఈ పేరే వ్రాసేవాడు. నా కీ పేరు అలవాటయి పోయింది. నీ కీ మాస్కోలో నెట్టి పనిగానీ లేదుగా?....సరే, నాతో మా యింటికి రా. ఈ రోజుకు నా పని అంతా అయిపోయింది. తిరిగీ రాత్రిదాకా రికామిగా వుంటాను. రా. పెవదాం. మంచి వోడ్కా వున్నది, మా యింట్లో. నీ కిష్టమేగా వోడ్కా?"

అకస్మాత్తుగా మేజర్ స్ట్రిఖొవ్ చెప్పిన మాట లాతనికి జ్ఞప్తికి వచ్చాయి. "అహూహ! అదీ రకం. ఒంటరిగా వుంటుంది! ఇంట్లో మరెవ్వరూ లేరు వోడ్కా తానూ తప్ప అర్థమయిందా. తమ్ముడూ. ఎటువంటి రకం మనిషో?" కాని స్ట్రిఖొవ్ మీద నమ్మకమనేదే లేదు తనకు. అన్యూతాతో వెళ్లాడు. సాయింత్రందాకా వ్యవధి వున్నదికాబట్టి, అదీ ఇదీ మాట్లాడుకొంటూ నడిచివెళ్ళారు. గ్వాజ్దెవ్‌కు యుద్ధ ప్రారంభంలో సంభవించిన కష్టం, అతనిని పిందరూ ఉరితీయబడటాన్ని గురించి చెప్పినప్పుడామె ముఖం కందింది. ఎంత యత్నించినా ఏడవకుండా వుండలేక పోయింది. ఆతని యుద్ధ సాహసాలను గురించి చెప్పినప్పుడామె నేత్రాలు జ్యోతుల్లాగా మెరిసాయి. తన గ్రిగొరీ! ఎంతటి సాహస కార్యాలు చేసాడు. అతన్ని గురించి తెలుసుకోవాలనే ఆశకొద్దీ గ్రుచ్చి గ్రుచ్చి ఎన్నో ప్రశ్నలు వేసింది. ఎందుకీ విధంగా చెప్పకుండా వెళ్ళిపోవాలి? ఒక్కమాట? రెండక్షరా లన్నా వ్రాయడానికి వీలులేకపోయిందా? ఇదేమీ గొప్ప యుద్ధ సంబంధమైన రహస్యం కాదుగా? పోనీ, చెప్పకుండా వెళ్ళాడనే ఒప్పుకొన్నా, వెళ్ళిన తరువా తయినా వ్రాసాడా? ఇదేమంత న్యాయమో; తనకు తెలియదు అన్నది అన్యూతా.

"సరేగాని. మొన్న టెలిఫోనులో మాట్లాడేటప్పుడు గ్వాజ్దెవ్ గడ్డం పెంచుతున్నాడని. మరీమరీ నొక్కిచెప్పావు, జ్ఞాపకమున్నదా? ఎందుకా విధంగా చెప్పావు?"

"ఊరికెనే అన్నాను. ఏదో అకస్మాత్తుగా జ్ఞప్తికివస్తే అన్నాను అంతే" అని తప్పించుకోజూచాడు అలెక్సీ.

"ఎంత చమత్కారం? ఎందుకు చెప్పావో నాకు కారణం చెప్పాలి. చెప్పందే పోనీయను. ఇదికూడా వొక యుద్ధ రహస్యం కాబోలు!!"

"కాదులే ఇందులో రహస్య మేముంటుంది గనుక ? ప్రొఫెసర్ వాసిలెవిక్ ....గడ్డం పెంచుకోమన్నాడు....ఆడవాళ్ళంతా,...కాదు, ఒకస్త్రీకి తానంటే ఇష్టం పుట్టుతుందన్నాడు."

"సరే ! నాకిప్పుడంతా అర్థమయిందిలే !"

ఇంతవరకూ వున్న చురుకుతనమూ, ఖులాసా ఎక్కడికో వెళ్ళిపోయాయి. చూస్తూ వుండగా పదేళ్ళు పైబడ్డట్టు ముఖమంతా పాలిపోయింది. నుదుటిమీదా, కనుకొలుకుల్లోనూ చారలగుపించాయి. ఎంతో దిగాలుపడి, అలిసిపోయినట్లుగుపించింది. దొండపండువంటి నిండు పెదవులూ, పై పెదవిమీద కనిపించీ కనుపించని నూగు చాలూ, ఎడమ చెక్కిలిపైనున్న చిన్న పుట్టుమచ్చా మాత్రం ఇంకా ఇరవై ఏండ్లయినా నిండలేదని సూచించాయి.

పెద్దఇండ్లపంచ రోడ్డుమీద నడిచి వెళ్ళగా, వెళ్ళగా ఎడమచేతి ప్రక్క నొక సందు వచ్చింది. దానిని ప్రవేశించి పదడుగులు వా రిద్దరూ నడిచారో లేదో సందు వెళ్ళి ఒక యింటిముందు ఆగిపోయింది. ఆ యింటి గడపలమీద కిరసనాయిలు మరకలూ, వాసనా; గుమ్మానికడ్డంగా పరుగెత్తిన రెండు పిల్లులూ వీరి నాహ్వానించాయి. తలుపు తెరచుకొని అన్యూతా ప్రవేశించింది. పొడుగు వరండా, దాని కిరుప్రక్కలా గదులూ, వరండా పొడుగునా పాతపెట్టెలూ, సంచులూ యింకా యితర సామానులూ కనిపించాయి. వాటిమధ్యపడి వెడుతుంటే గుమ్మందగ్గిరికి వచ్చిన ముసలామె అన్యూతాను చూచి,

"అన్నాదానిలోవ్నా ! ఇదిగో, నీ కొక వుత్తరం వచ్చిం" దంటూ చేతి కిచ్చింది. ఎవ రా యీ కొత్తమనిషి అన్నట్టు అలెక్సీవంక చూస్తూ నిలబడింది, వా రిద్దరూ అన్యూతా గదిలోకి వెళ్ళేదాకా.

అన్యూతా తండ్రి వొక కళాశాలలో ఆచార్యుడు, ఆ కళాశాలను మాస్కో నగరంనుండి గ్రామప్రాంతానికి మార్చబట్టి ఆయనా, తల్లీ కూడా వెళ్ళారు. ఈ రెండు గదులనూ, అందులోనుండే సామానులనూ అన్యూతాకు వప్పగించారు. పాత కుర్చీలూ, సోఫాలూ, గవాక్షాలకూ, గుమ్మాలకూ కట్టిన తెరలూ, గోడలకు తగిలించిన పటాలూ, చిన్న గ్రహాలూ, పియానోమీదనున్న పూలకూజాలజంటా ; ఇట్టి వెన్నో దుమ్ముపడివుండటం గదిలో ప్రవేశించగానే కంటబడింది.

"ఇదంతా చాలా అసహ్యంగా నున్నదని నాకు తెలుసు. క్షమించాలి. నేను సైనిక ఆస్పత్రివా రిచ్చిన గదిలోనేవుండి, కళాశాలకు వెడతాను. ఎప్పుడో వొకపుడుతప్ప యిచ్చటికి రానేరాను" అంటూ బల్లమీదనున్న చిల్లరవస్తువులను దానిపైనున్న బట్టలో చుట్టి తీసుకుపోయింది లోపలికి. తిరిగివచ్చి, బల్లమీద ఆ బట్టను దులిపి పరిచింది.

"ఎప్పుడైనా ఒకప్పుడు ఇచ్చటికివచ్చినా, ఎంతో అలిసిపోయి రావటంవల్ల, గదిని చక్కబెట్టాలనే నాకు తోచదు. బట్టలన్నా మార్చుకోకుండా మంచంమీద పడుకొని బండనిద్ర పోతాను," అన్నది.

ప్రక్కగదిలో విద్యుత్ పొయ్యిమీద పెట్టిన నీరు పొంగేలోగా, అన్యూతా వల్లని రై రొట్టెముక్కలనూ, ఇంత చక్కెరనూ తెచ్చి బల్లమీదపెట్టింది. పింగాణీ గిన్నెలూ, పళ్ళాలూ తెచ్చిపెట్టి, తేనీటి పాత్రనూ, ఒక సీసానూ తెచ్చింది. సీసా కిరుప్రక్కలా రెండు చిన్నగాజులోటాల నుంచింది.

మఖమల్ దిండ్లున్న మెత్తటి కుర్చీలో అలెక్సీ దించుకుపోయి కూర్చున్నాడు. దానిలోని దూది కుట్లూడిన భాగాలనుండి తొంగిచూస్తోంది. కాని అలెక్సీ ఇదంతా గమనించలా. వెనుకకానుకొని కాళ్ళుజాపుకొని కూర్చొంటే ఎంతోహాయిగానున్న దని పించిందాతనికి.

అతని చెంతనొక చిన్న బల్లమీద కూర్చొనిన అన్యూతా, చిన్నబిడ్డలమాదిరి అతని ముఖంలోకి చూస్తూ, గ్రిగోరీని గురించి చాలా ప్రశ్నలు అడగటం మొదలుపెట్టింది అలెక్సీ తన యింటికి వచ్చిన అతిథిఅనే మాట జ్ఞాపకానికివచ్చి, చటుక్కున తన ప్రశ్నల నాపి, రమ్మంటూ అతనిని బల్లచెంత కాహ్వానించింది,

"ఒకలోటా పుచ్చుకొంటావా ? టాంకు సైనికులూ, వైమానికులూ కూడా వోడ్కాను త్రాగుతారని గ్రిగోరీ చెప్పాడు...."

గాజులోటాలోని నీలిరంగు వోడ్కామీద ఎండపడి బహు ఆకర్షణీయంగా కనిపించి ది. సారాయి వాసనతగలగానే అలెక్సీకి విమానాల పెట్రోలూ, అడవి కంతదూరంలోనున్న విమానాశ్రయమూ జ్ఞప్తికి వచ్చాయి. సైన్యాధికారుల భోజన గృహమూ, "తగుమాత్రం" సేవించినవారి నవ్వులూ, వేళాకోళాలూ కండ్లకు కట్టినట్లగు పించాయి. రెండోలోటా కాళీగా నుండటంకనిపెట్టి.

"నీ గ్లాసు కాళీగానున్నద"న్నాడు.

"నా కలవాటు లేద"న్నదామె,

"గ్రిగోరీ ఆరోగ్యంకొరకు త్రాగితే బాగుంటుంద"న్నాడు, అలెక్సీ.

చిరునవ్వు నవ్వి తన గ్లాసులో శాస్త్రానికి రెండు చుక్కలు పోసింది అన్యూతా, సాలోచితంగా దాని నించుకసేపు చూసి ఆ లోటాతో అలెక్సీ లోటాను తాకింది.

"అతని ఆయురారోగ్యాలకొరకు" అని ఒక్కపెట్టున తన గ్లాసులోని వోడ్కాను త్రాగింది. ప్రాణం ఉక్కిరి బిక్కిరయి, దగ్గు వచ్చింది. ముఖమంతా ఎర్రబడి, ఊపిరి సలిపిందికాదు.

అలెక్సీ వోడ్కాను త్రాగి ఎంతకాలమయిందో ! వెచ్చగా గొంతులో పడిన వోడ్కా కాలుతూ కడుపునుచేరి మంట లెగిసిపోతూ మెదడును తాకింది. ఇంకొక లోటా నింపుకొని "నీకో ?" అన్నట్టు అన్యూతాను చూసాడు.

"ఊహూ; వద్దు చూసావుగా జరిగిందంతా" అన్నది.

"నా శ్రేయస్సుకొరకు కొంచెం త్రాగరాదా? నీవంటివాళ్ళ ఆశీస్సులు లేకపోతే ఈ అలెక్సీ ముందడుగు వేయటం దుర్లభ"మన్నాడు.

తనగ్లాసు నెత్తిపట్టుకొని అలెక్సీ నేత్రాల్లోకి తిన్నగా చూసింది, అన్యూతా. అతని మోచేతిని ప్రేమ పురస్కరంగా తాకి, నెమ్మదిగా అదిమి వోడ్కాను త్రాగింది. తిరిబి దగ్గూ, ఊపిరి సలపక పోవటం తతంగమంతా జరిగింది.

కొంచెంతెప్పరిల్లాక "ఇరవైనాలుగు గంటలూ విరామం లేకుండాపనిచేసాను. నిన్ను చూడటానికీ వచ్చేముందు. వోడ్కా త్రాగటానికిది తరుణంకాదని నాకు తెలుసు కాని అలెక్సీ నీ మేలుకొరకై త్రాగాను...అతడు నిన్ను గురించి ఎన్నెన్ని విషయాలో వ్రాశాడు....నీకు శుభమవుగాక!...శుభమయి తీరుతుంది!!...నాకిది బాగాతెలుసు....నే చెప్పేది నీ కర్థమవుతోందా?" అని పకపక నవ్వింది, "ఇదిగో ఇదేమిటి? సిగ్గుపడవద్దు. కొంచెం రొట్టెతిని చూడు. ఇంకా రొట్టె వున్నదిలే. ఇది నిన్నటి రొట్టె. నేటిదింకా రాలా!" అతనిముందు కా రొట్టె పళ్ళెమును జరిపింది. "తిను. కడుపారా తిను. లేకపోతే తమ్ముడూ తల తిరుగుతుంది. త్రాగుమోతు తమ్ముడి నేమిచేయాలో నాకు తెలియదు బాబూ!" అన్నదామె.

అలెక్సీ ఆ పళ్లాన్నంతదూరంగా నెట్టి, అన్యూతా కళ్ళల్లోకి, ఆకుపచ్చని ఆ నేత్రాల్లోకి చూశాడు. దొండపండువంటి నిండు పెదవులూ, వొంకంగానున్న చిన్న నోరూ చూస్తే అతనికి నోరూరింది.

"నిన్నిప్పుడు ముద్దుపెట్టుకొంటా ననుకో! ఏమి చేస్తావు" అన్నాడు.

భయపడింది. కాని, వెంటనే శాంతించి అలెక్సీవంక "ఏమి టీ మనిషి తత్వం?" అన్నట్టు జాలిగా చూచింది. ఒక్కనిమిషం ముందున్న మనిషేనా, ఈతడని సందేహం కలిగింది. ప్రశస్త వజ్రరాజమనుకొన్నది. చేత్తో తాకగానే మొందుకూ పనికిమాలిన గాజుపెంకుగా మారిన ట్లనిపించింది.

"ఏం చేస్తానా? మెడపట్టి బయటికి గెంటుతాను. తరువాత గ్రిగొరీకి మనుష్యుల నర్థం చేసుకొనటం తన కే మాత్రమూ తెలియదని వ్రాస్తాను" అని రొట్టెముక్కలున్న పళ్ళెము నాతనిముందు పెట్టింది.

"తిను....నామాట విను....మత్తు తిరుగుతుంది" అన్నది.

అలెక్సీ చమత్కారంగా నవ్వాడు.

"నీవు చెప్పినంతపనీ చేస్తే నీవంటి బుద్ధిమంతురా లింకొకతె వుండదు. నీ బుద్ధికుశలతకు నిన్నభినందిస్తున్నాను, నా తరపునా, మొత్తం ఎఱ్ఱసైన్యం తరపునా నీ కివే నా జోహార్లు, మనుష్యుల యథార్థ గుణగణాలను కనిపెట్టటంలో తనకు తానే సాటిఅని గ్యాజెట్టుకు వ్రాస్తా" నంటూ, అలెక్సీ నవ్వాడు.

మధ్యాహ్నం మూడింటిదాకా వారిద్దరూ మాట్లాడుతూ కూర్చున్నారు. అలెక్సీ రైలుకు వెళ్ళటానికి టైమయింది. వెళ్ళకతప్పదన్నట్టు ఆమె త్తని కుర్చీలో నుండి లేచాడు. దాని మీది కొంత ఆతని చొక్కాకు అతుగుకొన్నది. అన్యూతా రైలు స్టేషనుదాకావచ్చి దిగబెట్టింది. బహుచలాకీగా నడిచే అలెక్సీని చూస్తే, అతనికి పాచాలులేవని గ్రిగొరీ వ్రాసిన విషయం నిజంకాదేమో అనిపించింది. తానూ ఇతర వైద్య కళాశాల బాలికలందరూ సైనికాస్పత్రిలో చేసే పనులన్నీటినీ అతనికి చెప్పుతూ నడిచింది, అన్యూతా. చాలా ఎక్కువమంది సైనికులిప్పుడు దక్షిణ భాగం నుండి వస్తున్నారట అంత గొప్ప గాయాలు తగలినప్పటికీ సైనికులెంతో ఓర్పుగానుంటారనీ, పూర్వంకంటే ఇప్పుడు చాలా పనివున్నదనీ చెప్పుతూ. మధ్యలో మాట మార్చి :

"గ్రీషా గడ్డంపెంచుతున్నాడన్న మాటా నిజమేనా ? లేకపోతే తమాషాగా చెప్పినమాటా ?" అన్నది. కొంతసేపయిన తరువాత. "నాకు సమస్తమూ విదిత మయింది, ఇప్పుడిప్పుడే. ఇంతకుముందు నాకీ విషయాలు విశదమయ్యాయికావు. నా తండ్రికి చెప్పేటట్టే నీకూ యదార్థం చెబుతాను. మొదట్లో అముఖమూ, దాని మీద మచ్చలూ చూడలేకపోయాను. చూడలేకపోవటంకాదు, భయంవేసింది. ఉహూ, ఇదికూడా సరియైనమాటకాదు. ఏవిధంగా చెప్పాలో నాకు తెలియకున్నది. కాని, నీవు గ్రహించగలవను కొంటాను. అటువంటి భావం కలగటం తప్పని నాకు తెలియకకాదు. దానిని మార్చుకోడానికి నాకు శక్తిలేకపోయింది. నా సంగతి అట్లా వుంచుదాం. ఆవిధంగా పారిపోయాడెందుకూ ! తానేదో గొప్ప తప్పుచేసి సిగ్గుపడుతూన్నట్టు చిన్నపిల్లవాడిమాదిరి పారిపోవటం తలుచుకొంటే నాకు నవ్వు వస్తుంది. మరీ చిన్నపిల్లవాడి చేష్టలయినా యింతకంటే బాగుంటాయి. నీ వాతనికి వ్రాస్తావనుకొంటాను. నా మనస్సును పుండుచేసాడనీ ! నా కెంతో బాధగా నున్న దనీ వ్రాయ"మన్నది.

స్టేషనునిండా సైనికులు. చాలామంది పైవారి ఆజ్ఞానుసారం ఏదో వాక యుద్ధరంగానికి వెడుతున్నారు. మరికొందరు గోడల కంటించిన నోటీసులను చదువుతూ, ఇతరులు తమ సామాను సంచీలమీద కూర్చొనీ కనిపించారు. వారందరి ముఖాల్లోనూ అలసటా అదుర్దాస్పష్టంగా కనిపిస్తున్నాయి. పూర్వ మీ రైలుస్టేషను నుండి పడమటి యుద్ధభూములకు రైళ్ళు వెళ్లేవి. కాని జర్మనులిప్పు డీ స్టేషనుకు రెండు గంటల ప్రయాణందూరంలో నున్న యుద్ధభూమిని చేరుకొన్నారు. రైలెక్కితే రెండు గంటలలో యుద్ధభూమిని చేరుకొవచ్చు, అరగంట కొకపర్యాయం వచ్చే ఎలక్ట్రిక్ రైలుబండ్లనుండి రక రకాల మనుష్యులు దిగి స్టేషనంతా కిట కిట లాడుతూ కనిపిస్తుంది. మాస్కోనగరానికి చుట్టుప్రక్కల గ్రామాలమండి వచ్చే పని మనుషులూ, పాలూ, పండ్లూ, కుక్కగొడుగులూ, కాయగూరలూ, దిగిన క్షధి

నిమిషాల్లో నగరంలోకి వెడతారు. తిరిగీ. యథాప్రకారం సైనికులతో నిండిన స్టేషను మాత్రం మిగులుతుంది.

స్టేషనులో నున్న పెద్దచావడిలో రష్యా – జర్మను యుద్ధభూములను చూపే బ్రహ్మాండమైన పట మొకటి తగిలించారు. సైనిక దుస్తులు తొడుగుకొన్న నొక స్త్రీ నిచ్చెనపై కెక్కి అప్పుడే వెలువడిన యుద్ధవార్తల పత్రిక నొకటి చేతపట్టుకొని ప్రస్తుతం యుద్ధం సాగుతూన్న ప్రదేశం పొడూగునా రంగు రంగుల గుండు సూదులను గ్రుచ్చుతోంది.

క్రిందివరకూ వచ్చిన సూదులు చటుక్కున కుడిప్రక్కకు తిరగాయి. జర్మనులు దక్షిణాన ముట్టడిస్తున్నారు. ఇజియుమ్ – బార్వెంకోవో వద్ద నందు చేసుకొనిన జర్మనుల 'ఆరో దళం' డాన్ నదీ ప్రాంతానికి సాగిపెడుతోంది. డాన్ నదీతీరాన నొక సూదిని ఆ స్త్రీ గ్రుచ్చింది. ఈ ప్రదేశానికి సమీపంలో వోల్గానదీ. స్టాలిన్‌గ్రాడ్ నగరమూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. దీని కవతిదూరంలో కామిషన్ వున్నది. రష్యాదేశపు గొప్ప వోల్గానదినీ. స్టాలిన్‌గ్రాడ్ నగరాన్నీ జర్మనులు బహు శీఘ్రకాలంలో సమీపిస్తారనడాని కెట్టి సందేహమూ లేదనిపించింది అలెక్సీకి. నిచ్చెనపై నున్న స్త్రీనీ, ఆమె గ్రుచ్చే సూదులనూ చూస్తూ పెద్దగుంపు చేరిందక్కడ. అప్పుడే వచ్చిన సైనికుడొకడు. ముఖానికి పట్టిన చెమటను తుడుచుకొంటూ. "గాడిదకొడుకులు ! త్రోసుకు వస్తున్నారు దేవుడా ! ఎంత దగ్గిరికి వచ్చేసారూ" అన్నాడు.

పొడగరి, వెదురుబద్దమాదిరి సన్నంగానున్న రైల్వేమనిషి వొకాతడిది విన్నాడు. బొద్దుమీసాలూ. నలిగిపోయిన నెత్తిటోపీ, అతడీ సైనికుని చూసి. ముఖం చిట్లించుకొని,

"త్రోసుకు వస్తున్నారా ? ఎవరిది తప్పు ? ఎందుకు రానిస్తున్నావయ్యా ? చెప్పు.... చెప్పవేం ?.... నీవంటి వాళ్ళంతా రానిస్తే రాకుండా. వారి దేశంలోనే కూర్చుంటారు కాబోలు ! మీరూ వొక సైనికులేనా ? చూడు. ఎక్కడికి వచ్చారో ! వోల్గానదీమతల్లిని తాకేటంత దగ్గరకు వచ్చారు." తప్పుచేసిన తన కొమారుని ఖండిస్తూన్నట్టు, భరింపనలవికాని దుఃఖమును దిగమ్రింగుతూన్నట్టు, అదుర్దా పడుతూన్నట్టు లా మాటలు వినిపించాయి.

ఇంత ముఖంచేసుకొని కోటును సర్దుకొంటూ ఏదో అవసరమైన పని వున్నట్టు లా సైనికుడు అక్కడినుండి కుక్కినపేనులాగా వెళ్ళిపోయాడు.

"నీవన్న మాటలు నిజం. చాలా దేశం వాళ్ళకి వప్పగించాము, అప్పుడే. ఛత్" అన్నాడక్కడ నిలబడిన మరొకాయన.

ముసలాతనొకడు. వదూలుకోటూ, ఆ ముఖమూ చూస్తే ఏదో బడిపంతులు మాదిరగుపించాడు. వెళ్ళిపోయిన ఆ సైనికుని చూస్తే జాలివేసింది కాబోలు.

"వాడిని తప్పుపట్టటం దేనికి? ఇందులో అతని తప్పేమున్నది? అతని వంటి వారెందరు చనిపోయారో మనకు తెలియని విషయంకాదు. మిడతలదండు మాదిరి వచ్చి పడుతున్నారు, ఐరోపాఖండం యావత్తూ వెరుచుకుపడట్లు. టాంకు లలో కూర్చొని వీరవిహారం చేస్తున్నారు. మనమందరమూ మాస్కోనగరంలో ఈ విధంగా, మననేదీ బాధించనట్టు మాట్లాడుకోడానికీ, బ్రతికివుండటానికీవాడూ, వాడివంటి వారనేకులే కారణం. వాడిని తిట్టిపోసేబదులు, పాదాలంటి నమస్క రించినా ఋణంతీర్చుకోజాలము. ఒక్క వారంరోజుల్లో ఎన్ని గ్రామాలు జర్మను టాంకుల చక్రాలక్రిందపడి నలిగి రూపుమాశాయో ఆలోచించు; మన సైనికుల త్యాగం విదితమవుతుంది. ఇప్పటికొక సంవత్సరంగా యుద్ధంచేస్తున్నాము, కాని, లాభం? ఎందరు జర్మనులను హతమార్చగలిగాము? ఆ అబ్బాయికి చేతులెత్తి నమస్కరించేబదులు, అపహసించి, అవమాన పరుస్తావా?" అన్నాడు.

"నాకు తెలుసు నాకంతా తెలుసునయ్యా తెలియకకాదు. కాని నా గుండె తట్టుకోలేకున్నది. మన దేశం పాడైపోతోంది. జర్మనులీ పవిత్రభూమిని అపవిత్రం చేస్తున్నారు. సంసారాలు కూలిపోతున్నాయి.........భరించలేదు, నా గుండె," అన్నాడా రైలు పనివాడు.

దేశపటంలోని దక్షిణ భాగమును చూపుతూ "అతడక్కడున్నాడా?" "అతడక్కడున్నాడా?" అన్నది, అన్యూతా.

"ఉన్నాడు. ఆమెకూడా అక్కడే వున్నద"న్నాడు అలెక్సీ.

స్టాలిన్‌గ్రాడ్‌కు రవంతపైగా చిన్న చుక్క. దాని నంటిపెట్టి 'కామిషిన్' అన్న పేరు. ఇదే తన కామిషన్. తాను పుట్టి పెరిగిన తన గ్రామం. బాట కిరు ప్రక్కలా పచ్చని గరిక పెరిగిన మైదానాలు; రెపరెప గాలిలో కొట్టుకొంటూ గాజుపెంకులమాదిరి మెరిసే పోప్లార్‌చెట్ల ఆకులూ; మట్టివాసనా; చిన్నతోటలలో పెరిగే కాయగూరమొక్కలూ; వాటిచుట్టూ కట్టిన వాటిల్‌కొమ్మల దడులూ; ఎండిన భూమిలో అంతటా పరిచినట్లున్న ఆకులమధ్య యెవరో పారబోసినట్లు కనిపించే పుచ్చకాయలూ; గడ్డి మైదానాలనుండి వీచే ఘాటువాసనల గాలీ; ఎండలో తళతళా మెరుస్తూ ప్రవహించే నదీజలమూ; తలవెంట్రుకలు పూర్తిగా నెరసి దేనికొరకో, ఎవరికొరకో ఆదుర్దాగాచూసే ఒక ముదుసలి స్త్రీ; ఆమెచెంత నిలబడి, ధైర్యంగా కాలు నిలదన్నుకొని ధైర్యం చెప్పుతూన్నట్టున్న జవరా లొకామె. ఇవన్నీ వొక చలనచిత్రంమాదిరి అలెక్సీ మనస్సులో జరిగివెళ్లాయి.

"వా రిద్దరూ అక్కడే వున్నా"రని అలెక్సీ అన్నాడు మరొక పర్యాయం.

# 2

ఎలక్ట్రిక్ రైలు మాస్కో నగర స్టేషనునుండి బయలుదేరిపెడుతోంది. కిటికీ కానుకొని కూర్చున్న అలెక్సీప్రక్క గోర్కీతల టోపీ, కండ్లద్దాలూ పెట్టుకొన్న ముసలివా డొకడు కూర్చున్నాడు. అతని చేతిలో కాగితం చుట్టబడిన కొత్తపారా, మట్టి గొడ్డలీ, ఉక్కు నాగలీ వున్నాయి.

ఆ రోజుల్లో అందరి ఆలోచనలూ యుద్ధంతో సంబంధంపడ్డవిగానే వుండేవి. ఇతరవిషయా లెవ్వీగానీ, వారినీ యుద్ధమంతగా బాధించి, కలవరపెట్టలేక పోయాయి. అలెక్సీ ముఖానికి తగిలేటట్టు చేతులూపుతూ గొప్ప రహస్యం చెబుతూ న్నట్టులా తాత:

"నేను సైనికుడిని కాను. ఇంతమాత్రాన నాకీ యుద్ధాన్ని గురించి ఏదీ తెలియదనుకోవద్దు. మనవారి తంత్రమూ, ఆలోచనా నాకు బాగా తెలుసు. జర్మనులు వాల్గానదీ మైదానంలోకి రావాలనీ, దాని మీద నల్దిక్కులా వ్యాపించాలనీ మనవారు కనిపెట్టుకొని కూర్చున్నారు. ఈ మైదానమును చేరేటప్పటికి పడమట నున్న తమ దేశానికి వారు చాలా దూరమైపోతారు. సరుకుల సరఫరా మందగిస్తుంది. అప్పుడు పడమరనుండీ, ఉత్తరంనుండీ వారి మీద పడి, ఒక్కపెట్టున నిర్మూలం చేయవచ్చు. ఇదీ మనవాళ్ళ ఆలోచన. దీనికి మించిన తంత్రం వేరొకటి లేదు. నాకు తెలుసు. మనమొక్క హిట్లరుతోనే పోరుసల్పటంలేదని జ్ఞాపకముంచుకో. ఐరోపాఖండాన్ని యావత్తూ కూడగట్టుకొన్నాడీ హిట్లరు. వారందరూ ఒకప్రక్కా, మనముమాత్ర మింకోప్రక్కా. ఒక్క రష్యా ఆరుదేశాల కెదురు నిలబడి పోరాడవలసివచ్చిన రోజు లివి. శత్రుసైన్యాలు వాల్గా మైదానంలో విరివిగా వ్యాపించినట్లయితే వారిమీద దెబ్బతీయటం చాలా సులభం. ఇది తప్ప వేరొక మార్గం లేదు. మన మిత్రులందరూ ఎందుకనో ఊరకొన్నారు. ఏమంటావు? కారణం?"

"నీకు తెలియని విషయాలను గురించి మాట్లాడబోకు. కావాలనే దేశంపైకి జర్మనులను రానిచ్చేటంత వెర్రితన మింకొకటి లేదు" అన్నాడు అలెక్సీ. జర్మనులు కాలుపెట్టిన గ్రామాల కేగతిపట్టిందీ, బాగా ఎరుగున్న అలెక్సీ కొంచెం చిరాకు పడినట్లు బదులు చెప్పాడు.

ముసలా డింతమాత్రానికే ఊరుకొనేఘటం కాదు. అలెక్సీ చెవిదగ్గిరికి వచ్చి మరింత వాగాడు. పొగాకూ, బార్లీ, కాఫీ వాసన అలెక్సీ భరించలేకపోయాడు.

కిటికీలోనుండి బయటికి ముఖంపెట్టి అలెక్సీ కూర్చున్నాడు. చల్లనిగాలి తగిలి ప్రాణం హాయనిపించింది. దాటిపోయే వాక్కొక స్టేషనునూ, రంగురంగుల

బల్లచెక్కలుకూర్చి నిర్మించబడిన చిల్లర దుకాణపు పెట్టెలనూ, పచ్చని అడవుల్లో నుండి ఏవంతి కనబడే భవనాలనూ, ఎండిపోయిన వాగులనూ, ఆనాటి సాయంత్రపు ఎండబడి, ఎర్రబారి క్రొవ్వత్తుల్లాగా నిలబడిన పైను మ్రానులనూ అడవుల కవతలప్రక్క నీలాతినీలంగా ప్రవహించే వాల్గానదీజలాన్నీ చూస్తూ తాతను తనకు యిష్టంవచ్చినట్టు వాగమన్నట్టు కూర్చున్నాడు.

"....పోనీలే. నీవూ ఒక సైనికుడవేగదా? నీవే చెప్పు. ఇది న్యాయమేమో? ఇప్పటి కొక సంవత్సరకాలంగా మన మొంటరిగా పోరాడుతున్నాము. ఇది నిజమంటావా, కాదా? ఏరీ మనమిత్రు లెక్కడున్నారు? తూర్పున మనమూ, పడమట వారూ హిట్లరును పట్టి వేధిస్తామన్నారుగా? ఎక్కడున్నా రీ స్నేహితులు! చెప్పవేం? చెమటోడ్చి కష్టపడి ఒకడు తన జీవితయాత్ర సాగిస్తూవుంటాడు. ఉన్నట్టుండి కొందరు దోపిడిగాం డ్రాతనిమీద పడతారు. తన కష్టమేమో? తన బ్రతుకేమో? అన్నట్టులున్న యీ మనిషి దిగ్భ్రమచెందుతాడు. చేతికందినదాని నంతా పట్టుకొని తిరగబడతాడు. హోరాహోరీ పోరాడుతాడు. పెద్ద గాయాలు తగిలి, రక్తం కారుతూన్నా, కండ్లుతిరిగి పడిపోయేటంతవరకూ వచ్చినప్పటికీ తన ధైర్యం వదులుకోడు. ఆ బందిపోటుదొంగ లెంతోకాలంగా అతనిమీద పడటానికి ఏర్పాటుచేసుకొన్నా రన్న సంగతి మనవాడికి తెలియదు. కాని బొందిలో ప్రాణం వుండేదాకా పోట్లాడుతానంటాడు. ఇరుగుపొరుగువా రేమిచేస్తారనుకొంటావు? తమ గుమ్మాల్లోనిలబడి "చావవాడు! మక్కెలు విరగగొట్టు" మంటూ హెచ్చరిస్తారు. "ఇదిగో! వీటితో తల పగిలేటట్టు కొట్టు. తిరిగి తలెత్తకుండా చచ్చి పడేటట్టు దెబ్బకుదెబ్బ తీయ" మంటూ రాళ్లూ, కర్రలూ దూరంనుండి విసిరేస్తారు....అంతే....గడపదాటి ఒక్క అడుగయినా ముందుకు పెట్టరు....అర్థమయిందా?....పోరులో తా మెంతమాత్రమూ జోక్యం కలిగించుకోరు!....ఇదీ మన మిత్రులు మనకు చేసే సహాయం....దీని కేమంటావు?...."

అలెక్సీ ముసలాడి ప్రక్కకు తిరిగి చూసాడు. ఆ పెట్టెలో కూర్చున్నవా రనేకు లతని మాటలు విని,

"అత డన్నమాటలు అక్షరాలా యదార్థమైనవి. ఒంటరిగా పోరాడుతున్నామే గాని, ఈ మిత్రులపై నాధారపడికాదు, "కుక్కతోకపట్టి గోదావరి ఈదటం" వంటిది: వారిని నమ్ముకోటం" అన్నారు.

"ఫరవాలేదులే. వాళ్ళకి తగిన బుద్ధిచెప్పి తీరుతారు మన సైనికులు, యుద్ధమంతా అయిపోయిన తరువాత వస్తారులే, మన మిత్రులు" అన్నాడొకాయన.

ఏదో స్టేషనొకటి వచ్చింది, రైలాగింది. కాళ్ళకు కట్లుకట్టుకొన్నవారూ, చంకకర్రలమీద నడిచేవారూ, చేతికర్రల నూతగొన్నవారూ, సైనిక లనేకులు

రై లెక్కడానికి వచ్చారు. వారందరి చేతుల్లోనూ వున్న కాగితపు సంచిలలో, సూర్య కాంతి గింజలో, లేక పుల్లరేగు పండ్లవంటి పండ్లో వున్నాయి. ఎక్కడనో సున్న ఆరోగ్యవరంనుండి ఈ వూరి సంతకువచ్చినట్టున్నారు, వారంతా. ఇంతసేపటిదాకా మాట్లాడిన ముసలాయన చటుక్కునలేచి, అప్పుడే బండిలోకి వస్తున్న యువ సైనికునొకని సమీపించి, చేయిపట్టి లాగుతూ.

"ఇక్కడ కూర్చో. అబ్బాయీ ! ఇక్కడకూర్చో ! రా....నే నెక్కడన్నా నిలవాడుతానులే కొద్దిసేపట్లో దిగేస్తాన"న్నాడు.

తనపారా, గొడ్డలీ వస్తువులున్నమూటను చేతబట్టి, బండీ తలుపు దగ్గిర పోయి నిలబడ్డాడు, ముసలివాడు. పాలమ్మే స్త్రీలు జరిగి. ఆ కుంటి సైనికునికి కూర్చొటానికి తావిచ్చారు. అలెక్సీకి తన వెనుకనుండి ఈ మాటలు వినబడ్డాయి. "సిగ్గులేదు కాబోలు ! కుంటివాడు తన చెంతనిలబడితే, చీమ కుట్టినట్టు కూర్చు న్నాడు. లేచి కూర్చోమని చెప్పాలన్నంత జ్ఞానంలేదు. రేపు ఏ తుపాకిగుండ్లో తగిలి తనకూ ఈగతేపట్టవచ్చునన్న విషయం తెలియదు కాబోలు. చూడబోతే వైమానిక దళోద్యోగస్థుడు ! సిగ్గులేకపోతేసరి" అన్నదొక స్త్రీ.

అలెక్సీ ముఖం కందిపోయింది, చాలా కోపమూ, ఏడుపూ కలిసివచ్చి ముక్కంతా మండిపోయింది.... నిలబడ్డాడు.

"ఇక్కడ కూర్చో." మన్నాడు నిలబడిన సైనికునితో

"ఫరవాలేదు ! మీరు కూర్చోండి. లెఫ్టినెంట్ సోదరా ! రెండే రెండు స్టేషనులు మేమందరమూ దిగిపోతాము."

కోపంవచ్చినట్టూ, సైనికొద్యోగిమాదిరి అధికారయుతంగానూ, "కూర్చోమని చెప్పటంలా ? కూర్చో"మన్నాడు అలెక్సీ.

బండి కొక ప్రక్కగా పోయి, రెండు చేతులనూ చేతికర్రమీద మోపి. చిరునవ్వుతో అలెక్సీ నిలబడ్డాడు. అలెక్సీని తా నపార్థం చేసుకొన్నానని, ఇంతకు ముం దాతనిని తిట్టిపోసిన స్త్రీకి తెలిసిందికాబోలు ! వెంటనే.

"ఏమిమనుష్యులంటా ! ఎవరమ్మా అది ? పెద్ద టోపీ పెట్టుకొన్నామె నిన్నే ! మహారాణీలాగా కూర్చున్నావు. చేతికర్ర పట్టుకునిలబడ్డ ఆ వైమానికాధి కారిని కూర్చోమని చెప్పు రా. నాయనా రా నా స్థలంలో వచ్చి కూర్చో. జరిగం డయ్యా జరగండి. ఆయనకు రావడానికి దారీయండి"అన్నదామె.

ఇదంతా తనకు వినపడనట్టు అలెక్సీ ఊరుకొన్నాడు. ఇంతలో తాము దిగ వలసిన స్టేషను వచ్చింది, నెమ్మదిగా దారి చేసుకొంటూ బండి గుమ్మాన్ని చేర గానే, ముసలాయన.

"ఏమంటావు ? బహూశ మన మిత్రులు యుద్ధానికి దిగుతారుకాబోలు !" నన్నాడు,

"వారు తోడ్పడకపోయినా ఫరవాలేదు! ఈ పనిని మనంతట మనమే సాధించగలం; సాధించితీరుతామం"టూ అలెక్సీ దిగి వెళ్ళాడు.

కూతకూసి, దబాదిబా చక్రాలపై దొర్లుతూ రైలు వెళ్ళిపోయింది. మలుపు తిరిగేటంతవరకూ దానినే చూస్తూ అలెక్సీ నిలబడ్డాడు. ఆతనితోపాటు ఏ పది మందో మాత్రమే స్టేషనులో దిగారు. రైలు పోగా, దుమ్ము వాసనలు గాలిలో తేలిపోయాయి. తీయని వాసనలుకొట్టే గాలి దూరపుమైదానంనుండి వీచింది. సద్దణిగి లోకమంతా ప్రశాంతంగా నున్నట్లనిపించింది అలెక్సీకి. యుద్ధానికి ముం దీవూరూ, దీని పరిసరాలూ పచ్చగా, శాంతంగా నుండేవి. స్టేషనుచెంత పెరిగే పైనువృక్ష శాఖల్లోని గాలిశబ్దం, దూరపు సముద్రఘోషమాదిరి వినిపించింది. రెండు సంవత్స రాల క్రితం. ఇదే రైలులో ఎందరెందరో జను లీ స్టేషనులో దిగేవారు. వేసవికి దోమతెరలవంటి అందమైన గౌనులు తొడుగుకొన్న స్త్రీలూ. గలగల మాట్లాడే పిల్లలూ. పట్టణంనుంచి ఇండ్లకు తిరిగివచ్చే మొగవారూ ఇంటికి కావలసిన ఆహార పదార్థారాలనూ. తీయని సారాయిసీసాలనూ పట్టుకొని దిగేవారు. కాలిబాటలమీదా, రహదారులమీదా నడిచి, సమీపంలోనున్న తమతమ గృహాలకు వెళ్ళేవారు. కాని, నేడో? పారలూ, మట్టిగొడ్డళ్ళూ వంటి వస్తువులతో దిగిన నలుగురూ అడవి మార్గం పట్టి, ఆలోచనా నిమగ్నులైనట్టు తలలు వంచుకొని వెళ్లారు. అలెక్సీ ఒక్కడే, తన చేతికర్ర నూతగొని నిలబడ్డాడు, సృష్టిసౌందర్యాన్ని చూరగొంటూ. చల్లని గాలితో ఊపిరితిత్తుల నింపుకొంటూ, పైనుకొమ్మల సందునుండి ముఖం మీద పడే ఎండలో, సరదాగా నిలబడ్డాడు.

బయలుదేరేముందు స్టేషనునుండి ఆరోగ్య భవనానికి వెళ్ళే మార్గం అలెక్సీకి మాస్కోనగరంలో చెప్పారు. తిన్నగా, ఆ గుర్తుల ప్రకారం వెళ్ళి భవనాన్ని చేరు కొన్నాడు, పది నిమిషాల్లో. అదొక ప్రశాంతమయిన సరస్సు గట్టునకట్టబడింది. రష్యను తిరుగుబాటుకు ముందు కోటీశ్వరు డొకాయన, వేసవికాలంలో నివసించ డానికిచ్చట ఇల్లు కట్టుకోదలచాడు. పనివారిని పిలిచి, రష్యాలో వేరెక్కడ గాన లేనంత విచిత్రంగా, సౌందర్యంగా నుండే భవనమును కట్టమని పురమాయిం చాడు. ఎంత ఖర్చు అయినాసరే ఫరవాలేదు. అద్వితీయంగా నుండేటట్టు నిర్మించా లన్నాడు. బ్రహ్మాండమైన భవనంలేచింది. సన్నగా ఎత్తయి, నగిషీ చెక్కిన కిటికీలూ, గోపురాలూ, మినారులూ, వ్యూహంమాదిరి లెక్కలేనన్ని చిక్కుదార్లూ నిర్మించారు. ఆ చక్కటి ప్రశాంతమయిన ప్రదేశంలో, పచ్చికమైదానాల మధ్య ఈ భవనం ఎంతో అసహజంగా కనిపించేది. దానికీ ఈ వాతావరణానికీ ఎటు వంటి పోలికాలేకపోయింది, ఇప్పుడు దానిచుట్టూ వత్తుగా పొదలు పెరిగాయి. అద్దం మాదిరుండే సరస్సు గట్టున ఆస్పెన్ వృక్షాలూ, వాటి గుబురుటాకులూ ఎంతో కనులపండువుగా కనిపిస్తాయి. అచ్చటచ్చట, ఎరుపూ. గోధుమారంగు

మచ్చలున్న పెద్ద బర్చి వ్రృక్షాలున్నాయి. సరస్సు చుట్టూ మేడమెట్లమాదిరి, అంతస్తులుగా పెరిగిన అడివీ, సరస్సు నీటిలో తల క్రిందులుగా పడేదాని ప్రతి బింబమూ ఎంతో ముద్దొస్తూవుంటాయి.

ఈ ప్రదేశపు సౌందర్యముచే నాకర్షింపబడి లెక్కలేనంత మంది చిత్రకారులీ ప్రదేశానికి పూర్వంవచ్చారు, ఇంటి యజమానివచ్చి వారందరినీ గౌరవించి, సత్కరించే వాడు ఈ ప్రదేశపు చిత్రాలు రష్యాలో అనేకచోట్ల కనిపిస్తాయి. ఎంద రెందరో ఎన్నెన్ని రకాలుగానో దీనిని చిత్రించారు.

యుద్ధం వచ్చాక రష్యను వైమానికదళంవారు దానిని తీసుకొని తమ వైమానికులకొరకు ఆరోగ్యభవనంగా నుపయోగిస్తున్నారు. యుద్ధానికిముం దెందరో వైమానికులూ, సైనికులూ తమ భార్యలతో నీ తావుకు వనభోజనాలకు వచ్చేవారు. ఆస్పత్రినుండి విడుదలచేసిన తరువాత రోగులు కొంతకాల మీ ఆరోగ్యభవనంలో నుంటారు బలంపట్టటంకొరకు. తారురోడ్డుమీదుగా చుట్టుతిరిగి వచ్చేబదులు అలెక్సీ అడ్డదారిని కాలిబాటమీద సరస్సు గట్టుకు వచ్చాడు, కొందరు అక్కడున్న జనులు నిండిన రెండు బస్సుల చుట్టూ నిలబడ్డారు. వెనుకప్రక్కగా వచ్చి అలెక్సీ నిలబడ్డాడు.

వెడతామనీ ! 'శుభమగుగాక' అనీ వా రందరనే మాటలనుబట్టి ఆరోగ్యం కుదిరిన సైనికులీ బస్సుల నెక్కి యుద్ధభూమికి వెడుతున్నారనీ, వారిని సాగనంపటానికి భవనంలోనివారు వచ్చి గుమిగూడారనీ అతనికి తెలిసింది. బస్సులోని సైనికుల ముఖాలను చూస్తే యుద్ధానికి వెడుతూన్నట్టూ, ఏ నిమిషానికి వారు చావువాత బడతారో చెప్పనలవికాని ప్రదేశానికి వెడుతూన్నట్టూ వా రగుపించలేదు; యుద్ధానంతరం ఇండ్లకు వెడుతున్నవారిలాగా సంతోషంతో, ఆదుర్దాగా కనిపించారు. వారిని సాగనంపటానికి వచ్చినవారికి తా మింకా ఇక్కడే పడివుండవలసినందుకు విసుగూ, ఎప్పుడు వెళ్ళడానికి వీలవుతుందా అనే ఆదుర్దా కలిగాయి. ఇటువంటి భావం అలెక్సీకి తెలియనిదికాదు. దక్షిణాన యుద్ధ మారంభించినప్పటినుండీ ఎప్పుడు వెడదామా, ఎప్పుడు తిరిగీ పోరాడుదామా అనే తొందర అలెక్సీకి ఎన్నో పర్యాయములు కలిగింది, స్టాలిన్‌గ్రాడ్ పేరు యుద్ధ వార్తలలో విన్నప్పుడల్లా అలెక్సీకి అమాంతంగా ఎగిరివెళ్ళి జర్మను విమానాలను పదింటిని పడగొట్టాలనే ఆవేశం కలిగేది. ఆస్పత్రిలో యింకొక్కరోజయినా వుండటానికి కాలు నిలిచేదికాదు,

మోటారుబస్సుల చెంత నిలబడి చూసేవారిలో ఆర్మీనియన్ సైనికు డొకడున్నాడు. చారల పైజామా, బట్టతలా, చేతికర్ర పుచ్చుకొని బస్సులదగ్గిర ఇటూ, అటూ తెగతిరుగుతూ పెద్ద గల్లంతు చేస్తున్నాడు. ప్రతి పటాలంలోనూ యితని మాదిరి హాస్యగా డొక డుంటాడు. వారి వారి కష్టాలను మరిపించి, నవ్వించి,

దుర్భరమైన జీవితాలను ఆనందమయంగా చేసే యిట్టి హాస్యగాళ్ళ రుణాన్ని తీర్చుకొనటం దుస్సాధ్యమైనపని,

"ఫెడ్యా : విమానంలో ఎగిరేటప్పుడు నీవా జర్మనులను కలుసుకొంటావు, వారిని చాలా చాలా అడిగానని చెప్పు. నీ వింకా పది దినాలపాటు వెన్నెల స్నానాలు చేస్తే బాగా ఆరోగ్యం కూడుకోగలదు. కాని నిన్నిక్కడ వుండనీయకుండా యిప్పుడే పంపించివేయవలసి వచ్చింది. దీనికంతా కారణం ఆ జర్మనులే. వారికి తగిన బుద్ధిచెప్పు, నాపేరు చెప్పి మరొకసారి బుద్ధిచెప్పు."

గుండ్రనిముఖమూ. నుదుటిపొడుగునా పెద్ద వికృతమైన చారా గల ఫెడ్యా బస్సు కిటికీనుండి తొంగిచూసాడు. "మన వెన్నెలస్నాన సంఘంవారి కీ విధంగా చెప్పు. జర్మనులను చెప్పుదెబ్బకొట్టి మరీ బుద్ధిగరిపిస్తాడని ఫెడ్యా వాగ్దత్తం చేసా"డని చెప్పు,

జనులంతా మాట్లాడుతూ, నవ్వుతూ గల్లంతుగానుండే టప్పుడా బస్సులు రెండూ బయలుదేరాయి, భవనపుగేటును చేరాయి.

"గొప్ప వేట : సురక్షితమైన ప్రయాణ" మంటూ జను లరిచారు.

"ఫెడ్యా : ఫెడ్యా : వీలయినంత త్వరలో నీ తపాలా నంబరును వ్రాసి పంపించు, జినోచ్కా ఆమెతో నీవు ఇక్కడ దిగవిడిచి వెళ్లే నీ హృదయమును రిజిస్టరు పోస్టుద్వారా భద్రంగా పంపిస్తుందిలే...."

బస్సులు మలుపుతిరిగి వెళ్ళిపోయాయి. పైకిలేచిన దుమ్ము అస్తమయ సూర్యకిరణాలు పడి బంగరు ధూళిమాదిరగుపించింది. చారల పైజామాలూ, పెద్ద కోట్లూ ధరించుకొన్నవా రందరూ, ఆ వనప్రదేశంలో తిరగడానికి వెళ్లారు. వైమానికుల టోపీలు తగిలించిన చిలుకకొయ్యలుగల గదిలోకి అలెక్సీ ప్రవేశించాడు. ఆ గదిలో టెన్నీసు బ్యాటులూ, బంతులూ, క్రికెట్టు బ్యాటులూ, సుత్తులూ మొదలైన వెన్నో చిందరవందరగా పడేసివున్నాయి. ఆ కుంటి ఆర్మీనియా సైనికుడు, మన హాస్యగాడు, అలెక్సీని వేరొక గదిలోకి తీసుకువెళ్లాడు. హాస్యగాని గుండ్రని ముఖమూ. పెద్ద నేత్రాలూ, విశాలమైన నుదురూ అలెక్సీ నెంతో ఆకర్షించాయి. వెన్నెల స్నానాల సంఘానికి తా నధిపతినని చెప్పుకొన్నాడు అలెక్సీతో. బలం చేకూరడానికీ, మనశ్శాంతికీ వెన్నెలస్నానానికి మించిన దింకొకటి లేదట. వెన్నెల విహారానికి కావలసిన ఏర్పాటులన్నీ తానే చేస్తాడు. వరుసక్రమంగా ఒకరితరువాత నింకొకరికీ ఏర్పాట్లు చేస్తాడట. నోరు విప్పితే చాలు, ఏదోవొక హాస్యపుమాట అనకుండా ఊరుకోజాలని ఈ మనిషి నేత్రాలలో యేదో అనిర్వచనీయమైన వ్యసనమున్నట్టూ, దానినాతడు కప్పిబుచ్చడానికి ప్రయత్నిస్తూన్నట్టూ అలెక్సీకి అనుమానం కలిగింది. మాట్లాడే ఎదుటిమనిషి ముఖంవంకా, అతని కండ్లల్లోకీ దేనికొరకో వెతుకుతూన్నట్టులే ఆర్మీనియను హాస్యగాడు చూడటం, అలెక్సీ గమనించాడు.

ఏమి టీ,మనిషిని పీడించుకుతింటూన్నది ? ఏ స్వకీయ దుష్పరదుఃఖాన్ని దిగమ్రింగి ఇతరుల జీవితాల-నీ మనిషి నవ్వుల ప్రవ్వులమయం చేస్తున్నాడు ? గదిలోకి వెళ్ళ గానే తెల్లని దుస్తులూ, ఎఱ్ఱటి తలజుత్తూ గల స్త్రీ వొకామె వీరి నాహ్వానించింది. ఆ తలవెంట్రుకలను చూస్తే, ఆమె శిరస్సునుండి అగ్నిశిఖలు లేస్తూన్నట్టు లున్నది.

తాను చదువుతూన్న పుస్తకము నవతలపెట్టి,ఆ స్త్రీ! "అలెక్సీయా?" అంటూ పెద్ద చిట్టాపుస్తకాన్నొకటి తీసింది." ఏమిటీ నీ పేరు ? .. అలెక్సీ. పెట్రొవిక్ ! "అని అతనివంక నిదానించిచూసి," నాకేదీ తెలియదని అనుకోవద్దు నన్నుమోస గించడానికి వీలులేదు. తమ్ముడూ ! ఇదిగో, నీ పేరిక్కడవున్నది. అలెక్సీ లెఫ్టినెంట్-యన్ ఆస్పత్రి, పాదాలుఛేదించ బడ్డాయి....కాని నీవు...."

అలెక్సీ ముఖమెత్తి ఆ స్త్రీని చూసాడు, పాలగచ్చువంటి తెల్లని ముఖమూ. ఎఱ్ఱటి వెంట్రుకలు, దుబ్బుమాదిరి పెరిగిన తలజుత్తు. అలెక్సీ ఆమెను తేరిపార జూడటంవల్ల సిగ్గుపడి ముఖమెఱ్ఱబడింది. ధిక్కారంగా అలెక్సీను చూస్తూంటే, అతడీవిధంగాఅన్నాడు.

"నా పేరు అలెక్సీ....ఇవిగో, కావాలంటే నా కాగితములను పరీక్షించు ..నీ పేరు లియోల్యాకాదా ?"

"లియోల్యా !.... ఎవరుచెప్పారు ? నా పేరు జీనా" అంటూ అతని పాదా లను చూసి," అవికృత్రిమపాదాలా ? లేక మరేమన్నానా ?" అని అడిగింది.

"కృత్రిమ పాదాలే. ఓహో ! నీవు జినోచ్కావన్నమాట ! ఫెడ్యా హృదయాన్ని భద్రపరిచేవనితవుకాదూ ?"

"అప్పుడే మేజర్ బర్నాజ్యాన్ నీకన్ని సంగతులూ చెప్పాడా ? బర్నాజ్యాన్ అంటే నాకు చెడ్డకోపం. అందరినీ ఎగతాళి చేయటమాతని వుద్యోగం. ఫెడ్యాకు నృత్యం నేర్పించాను. అందులో తప్పేమున్నది ?"

"తప్పున్నదని ఎవరన్నారు ? ఇకమీద నాకు నృత్యం నేర్పుతావుగా ? సరేనా ? వెన్నెల స్నానానికి నాపేరును కూడా జాబితాలో బర్నాజ్యాన్ చేరుస్తానన్నాడు."

అలెక్సీవంక, 'ఎమిటి నీవంటున్నదన్నట్టు' చూసి, "నృత్యమా? నీవంటూన్నదేదో నీకు తెలిసినట్టులేదు, పాదాలులేని మనిషి నృత్య మెట్లా చేస్తాడు ? నీకు మతిపోయిం దనుకొంటా. లేకపోతే నీవుకూడా నన్ను పరిహసించటానికే పూను కొన్నావు కాబోలు !"

ఎక్కడినుండో మేజర్ స్ట్రుఖొవ్ ఆ గదిలోకి వచ్చాడు. వచ్చీ రావటంతో అలెక్సీని గాఢాలింగనం చేసుకొని,

"జినోచ్కా ! నేను చెప్పిన ఏర్పాటుచేశావుగా ? లెఫ్టినెంట్ అలెక్సీ నా గదిలోనే వుంటాడుగదా ?"

ఆస్పత్రిలో చాలాకాలం గడిపినవారిమధ్య గొప్పస్నేహ మేర్పడి అన్న దమ్ములలాగా వర్తిస్తారు. ఎన్నో సంవత్సరాల అనంతరం మేజర్‌ను చూసినట్టు అలెక్సీ ఉబ్బితబ్బిబ్బయ్యాడు. మేజర్ స్ట్రిఖొవ్ తన సామానుసంచీ నింతకుముందే వొక గదిలో నేర్పాటు చేసుకొన్నాడు. నలుగురితో అప్పుడే బాగా పరిచయం చేసుకున్నాడు. వచ్చిన యీ ఒక్కరోజులో కొందరితో కలహించటమూ, మరి కొందరితో స్నేహం కలుపుకోవటమూ జరిగాయి.

వీరి గది ఉద్యానవనమున కెదుట నున్నది, అక్కడపెరిగే పైన్‌వృక్షాలూ, మల్బరీపొదలూ చూడ ముచ్చటగా నుంటాయి, ఒకేవొక అష్వృక్ష మున్నది. అరచేతి వ్రేళ్ళమాదిరి దానినుండి కొన్ని ఆకులు విడివిడిగా పెరిగాయి. ఒకే వొక పెద్ద పండ్లగెల, వీరిగదిగోడ కానుకొని పెరిగింది, భోజనంకాగానే అలెక్సీ వెచ్చగా పడుకొనికమ్మటి నిద్రపోయాడు.

ఆ రాత్రంతా విచిత్రమైన కలలువచ్చాయి. వెన్నెల, తెల్లతెల్లగా, నీలంగా నేలపైనంతా కురిసిన మంచు. పచ్చని తెరకట్టినట్టు లరణ్య మాతనిచుట్టూ నిల బడింది, దీనినుండి బయటపడడానికి యత్నించాడు. కాని, పాదాలు మంచులో బిగుసుకొనిపోయాయి. ఎంతలాగినా ఊడివచ్చాయి కావు. తన కేదో గొప్ప ఆపద రానున్నదనే భయం కలిగింది. కాని పాదాలా మంచునుండి రానన్నాయి. ఎంత యత్నించినా వీలులేక అలిసిపోయి మూలుగుతూంటే, అకస్మాత్తుగా తాను విమానాశ్రయములో నున్నట్లుఅగుపించింది. యూరా ఏదో కొత్త విమానం రెక్కలులేని వినూనపుటింజను దగ్గిర కూర్చొన్నాడు. తనవంక చూసి నవ్వి, చేతినూపి, ఆకాశంలోకి లేచాడు. మిఖేల్ తాత చిన్న బాలుడిని తీసు కొన్నట్టుచేతులు జాపి అలెక్సీని దగ్గిరికి తీసుకొని "ఫరవాలేదు. వా డెగిరిపోతే ఎగిరిపోయాడులే. వెళ్ళి హాయిగా ఆవిరిస్నానం చేద్దాము; బాగుంటుంది. ఏమంటావు ?" వెచ్చటినీటిలో బదులు, పసిబిడ్డ నెత్తిపట్టుకొన్నట్టు పట్టుకొని, తాత మంచులో పడుకోబెట్టాడు. అలెక్సీ లేవాలని యత్నించాడు. వీలుకాకుండా మంచు బిగియపట్టుకొన్నది. తీరాచూస్తే, అది మంచుకాదు: బ్రహ్మాండమైన ఎలుగొకటి తనమీద కూర్చొన్నది. దాని వేడివూపిరి ముఖానికి తగులుతోంది. దాని జీబువంటి బొచ్చు తన ఒడలంతా గ్రుచ్చుకుంటోంది. బస్సులనిండా వైమానికులు నవ్వు కొంటూ, హాస్యాలాడుకొంటూ వెళ్ళారు, కాని వొక్కరయినా తనవంక చూడలా, వారి దగ్గిరికి పరుగెత్తాలనీ, అదీ వీలుకాకపోతే చేయెత్తి వారిని రమ్మని సంజ్ఞచేయా లనీ అలెక్సీ అనుకొన్నాడు కాని, ఏమాత్రమూ వీలులేకపోయింది. అరవబోయాడు మాట రాలా, గొంతు బొంగురింది. ఊపిరిసలిపిందికాదు. గుండె నిలిచిపోతుందనే భ్రమపడ్డాడు. తనవంక చూసి నవ్వే జినోచ్కా, ఆ ఎర్ర జుత్తూ, ఆ కోరచూపుల ముఖమూ అతడి కగుపించాయి యీ కష్టసమయంలో.

ఉలిక్కిపడి అలెక్సీ నిద్రలేచాడు. అంతటా నిశ్శబ్దం. మేజర్ స్ట్రిఖొవ్ గుఠకపట్టి నిద్రపోతున్నాడు. వెన్నెలకిరణ మొకటి కిటికీ సందునుండి వచ్చి నేల మీద పడింది. తన కిట్టి పీడకల ఎందుకు వచ్చింది ?

రావటానికి కారణం ? గతించిన దినాల సంఘటన లతనికి జ్ఞప్తికేలేవు. ఆ విషయాలే కలలో యెందుకగుపించాయి ? తీయని వాసనల చల్లనిగాలీ, పిండార బోసినట్టు వెన్నెలా బహు ఆకర్షణీయంగా కనిపించాయి. కిటికీలో నుండి. చేరువ నున్న అడవిలోని గాలి పెద్దశబ్దంచేసి లేచి దూరానికి నడిచివెళ్ళి వినిపించకుండా వెళ్ళిపోయేది, మరొకప్పుడు ఎక్కడోలేచిన గాలి పడివడిగా అడుగులిడుతూ నడిచివచ్చి, పరుగులిడి, చెట్ల కొమ్మల్లో ఈలలూదుకొంటూ సమీపించింది.

ఈ విచిత్రవు టాకర్షణీయమయినగాలి సందేశాలను వింటూ అలెక్సీ మంచం మీద కూర్చున్నాడు. తన మనస్సులోనిదేదో ఒక ఆలోచనను, తన కయిష్టమయిన తలంపును విదలించి పారద్రోలడానికన్నట్టు అలెక్సీ తలను విదలించాడు. మగత పోయి తిరిగీ తెలివివచ్చినట్టునిపించింది. తానింకా ఈ భవనంలో ఇరవై ఎనిమిది రోజులుండాలి. ఈ నాలుగు వారాల జీవితంమీదా అతని భావిభోగభాగ్యాలాధార పడి వున్నాయి. తిరిగీ తానాకాశంలో నెగురుటా, పోరుసల్పుటా, బ్రతికి బాగుండుటా వంటి యావద్విషయాలూ ఈ స్వల్పకాలంలోనే నిశ్చయింపబడతాయి. తన కంతటి అదృష్టమున్నదా ? లేక ఏ బస్సునెక్కినా, "పాపం ! ఇదిగో, ఇక్కడ కూర్చో" మనే ప్రజల సానుభూతి వాక్యాలు వింటూ రోజులు వెళ్ళ బుచ్చాలా ? కాబట్టి ఈ నాలుగు వారాలూ తానొక సిసలైనమనిషిగా మారడానికి వినియోగించాలని అతనికి జ్ఞప్తికి వచ్చింది. తన ప్రయత్నం వృథాపోదన్న నమ్మ కంకూడా అప్పుడతనికి కలిగింది..

మేజర్ స్ట్రిఖొవ్ గుఠకలవింటూ చల్లని వెన్నెలను తిలకిస్తూ అలెక్సీ తన మంచంమీద ఒంటరిగా కూర్చొని బలం చేకూరడానికెట్టి కసరత్తులు చేయాలో ఆలోచించాడు.

ప్రొద్దునా, సాయంత్రమూ కసరత్తూ, నడకా, పరుగెత్తటమూ, పాదాలకు ప్రత్యేక శిక్షణా అవసరం. వీటికితోడు తమాషాగా తాను జినోచ్కాతో అనిన నృత్యంకూడా నేర్చుకొనటం చాలా ముఖ్యమయిన విషయమని తోచింది.

తప్పకుండా నృత్యాన్ని వీలయినంత త్వరలో ప్రారంభించడానికి సంక ల్పించుకొన్నాడు.

అది అగస్టునెల. ఇంకా వెచ్చని యెండ కాస్తోంది. కాని త్వరలో ఆకురాలుకాలం రానున్నదనే సూచనలప్పుడే కనుపిస్తున్నాయి. ఆరోగ్యభవనానికి చెంతగా పొదలమధ్య ప్రవహించే వాగొకటి కలదు. ఆనాటి మధ్యాహ్నం కొందరు

వైమానికులు వానిగట్టున నున్న ఇసుక దిబ్బలమీద పడుకొని ఒళ్ళు కాచు కొంటున్నారు.

వారందరికి మీద ఆ వెచ్చని ఎండ పడటంవల్ల కునుకుపట్టింది. బర్నాజియాన్ కూడా నలుగురితోపాటు పడుకొన్నాడు. ఆతని విరిగినకాలు అతుక్కొన్నదే కాని, అది తిన్నగా అతుగుకొనలా, వేడిఇసుకలో దానిని వూడ్చిపెట్టి బర్నాజియాన్ పడుకొన్నాడు. కాని నిద్రపట్టింది కాదు. అచ్చటనున్న పొదల మరుగున నున్న వీ రితరుల కగుపించరు కాని, వాగున కవతలగట్టున గడ్డిలోనున్న కాలిబాట యిచ్చటివారికి స్పష్టంగా కనిపిస్తుంది. బర్నాజియాన్ యెందుకో తల నెత్తి చూసాడు. అతని కొక విచిత్రమైన దృశ్యం కంటబడింది.

రెండురోజుల క్రితం వచ్చిన కొత్తరోగి పంట్లామూ, బూట్సులూ మాత్రం తొడుగుకొని ఒంటిన చొక్కాలేకుండా ఆ బాటమీదికి వచ్చాడు. తన్నెవరన్నా చూస్తున్నారేమో కనిపెట్టడాని కన్నట్టు ఇటూ, అటూ చూసాడు. మోచేతులను రెంటినీ ప్రక్కల కదిమిపెట్టి పరుగెత్తటం మొదలుపెట్టాడు. దానిని పరుగు అన డానికి వీలులేదు. కుంటుకొంటూన్నట్లు పరుగెత్తి, ఆగి, వడివడిగానడిచి మొత్తం సుమారు రెండువందల గజాలు వెళ్ళి నిలబడ్డాడు. అలిసిపోయి, ఒడలంతా చెమట పోసింది. పందెపుగుర్రం మాదిరా చెమటపట్టిన శరీరం ఎండలో మెరుస్తూ, కండలు తీరి కనుపించింది. బర్నాజీయాన్ తన ప్రక్కనున్నవారిని కొందరిని నిద్రలేపి ఇదంతా చూపించాడు. పైమాదిరి పరుగెత్తడమూ. వడిగా నడవటమూ. పేదదీర్చు కొనటమూ, తిరిగీ పరుగూ, ఈ విధంగా చేయటం వారి కంటబడింది. పరుగెత్తే ఆ మనిషి బాధపడుతూన్నట్టు లాతని ముఖం చూస్తే నలుగురికీ తెలిసింతి.

బర్నాజియాన్ ఇదంతా చూసి, ఊరకుండలేకపోయాడు. బిగ్గరగా.

"ఏయ్ ! అబ్బాయీ !! జ్నమెన్సుకీ సోదరుల నోడించడానికా ఈ తరిఫీదంతా ?" అని అరిచాడు.

ఆ మనిషి, మోటారుకారుకు బ్రేకు వేసినట్టు లొక్కపెట్టున నిలబడ్డాడు. అలసటా, బాధా ఆ ముఖంనుండి ఎచ్చటికో వెళ్ళిపోయాయి. మాటలు వినవచ్చిన దిక్కుతుచూసి, మారుమాట పలుకకుండా అడవిలోకి కనిపించకుండా నడిచి వెళ్లాడు.

"ఎవడీ మనిషి ? సర్కస్సువాడా ? లేకపోతే, కొద్దిగా పిచ్చబట్టినరకమా ?" అన్నాడు బర్నాజియాన్.

అప్పుడే నిద్రలేచాడు స్ట్రిఖొవ్. అతనీవిధంగా చెప్పాడు."అతనికి పాదాలు లేవు. కృత్రిమపాదాల నుపయోగించటం నేర్చుకొంటున్నాడు. తిరిగీ వైమానిక దళంలో చేరడానికి సంకల్పించుకొన్నాడు. దానికే ఈ తరీఫీదంతా"

ఈ మాటలు విని వారందరూ అదిరిపడి చూసారు. ఒక్కపెట్టున మాట్లాడ వొచ్చారు. ఏదో అదొకమాదిరి నడుస్తున్నాడనిమాత్రం తామనుకొనిన ఈ మనిషికి పాదాలు లేవన్న అనుమానం వారెవరికీ కలిగిందికాదు. పాదాలులేని ఈ మనిషి విమానమెక్కి వెడతాడనటం హాస్యాస్పదం. అసంభవం. కలలోనివార్త అన్నారు వారందరూ. ఏవో రెండువ్రేళ్లు పోయాయనో. లేక నరాలు బలం తగ్గిపోయాయనో. లేక చప్పిడిపాద మున్నదనో కారణాలవల్ల ఎందరెందరినో వైమానికదళంనుండి ఇండ్లకు పంపించివేశారని ఎవరికి జ్ఞప్తికున్న దృష్టాంతాలు వారు చెప్పారు: యుద్ధం చేసేవారిలో వైమానికులను పరీక్షించినంత తీవ్రంగా. కఠినంగా వేరెవ్వరినీ పరీక్షించరు. పాదాలులేని మనిషి అన్నిమరలూ, కిటికీలూగల విమానమును నడపటానికి యత్నించటమంత తెలివితక్కువతనం వేరొకటి లేదన్నారు.

ఇట్టి వెర్రిభ్రమకు లోనయిన అలెక్సీమీద జాలి కలిగింది. వారాతనికి సహాయం చేయాలనే వుద్దేశంకొద్దీ ఎవరికితోచినట్లు వారన్నారు,

"మేజర్! నీ మిత్రుడొక మూర్ఖుడన్నా కావాలి. లేదా అద్వితీయ పురుషున్నా అయి వుండాలి. దీనికెట్టి అనుమానమూ లేదు." అన్నాడు బర్నాజియాన్.

తమ భవనంలో పాదాలులేని వాడొకడున్నాడనీ. విమానంలో నెగిర పోరాటానికి యత్నిస్తున్నాడన్న సంగతి అందరికీ తెలిసిపోయింది. రాత్రి భోజనాల సమయంలో అందరూ అలెక్సీను పరీక్షగా చూశారు. కాని ఇదంతా అతనికి తెలియదు, నలుగురితో నవ్వుతూ, నలుగురిమాదిరే తింటూ, హాస్యాలాడుతూ, వడ్డించవచ్చిన స్త్రీలను నవ్విస్తూవుండే ఈ మనిషికి పాదాలు లేవన్న సంగతి జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా వారికేదీ తోచిందికాదు. నలుగురితో చేరి క్రికెట్ ఆడేవాడు. వాలీబాలు ఆటలో కలుసుకొనేవాడు. నడిచేటప్పు డిసుమంత ఎగిరెగిరి నడిచినట్లుందే కాని వేరెట్టి విడ్డూరంకానీ యెవ్వరికీ కనిపించలా. నాలుగురోజులు గడిచేలోగా నలుగురూ యీ విషయము మరిచిపోయారు. నలుగురితోపాటు అలెక్సీ తిరుగ జొచ్చాడు.

వచ్చిన రెండోరోజు మధ్యాహ్నం అలెక్సీ జినోచ్కావుండే ఆఫీసు గదిలోకి వెళ్లాడు. భోజనానికి వడ్డించిన తినుబండము నొకటి ఆమెకొరకు కని భద్రపరిచాడు. దాని నొక ఆకులోచుట్టి చేతబట్టుకొని గదిలోకి వచ్చి రావటంతోనే ఆమె కిచ్చాడు. కుర్చీ నొకటి ఆమె పనిచేస్తూవున్న బల్లదగ్గిరికి లాగి, దానిపై కూర్చొని, తన కిచ్చిన వాగ్దానము నెప్పుడు చెల్లించుతావని అడిగాడు.

తీర్చిదిద్దిన కనుబొమ్మ లెగురవేస్తూ "వాగ్దానమా?" అన్నదా జినోచ్కా.

"నాకు నృత్యం నేర్పిస్తానని చెప్పలా? మరచిపోయావా అప్పుడే?"

"సరే....కాని...."ఆమె కేమనాలో తెలియనట్లు లూరకొన్నది.

"నీవు బహు గొప్పగా నృత్యం నేర్పుతావని నలుగురూ చెప్పారు. కుంటి వారు కూడా యిట్టే నేర్చుకొంటారట, నీవు నేర్పితే నేర్చుకొనేవాడి పాదాలూ, తలా కూడా తిరిగిపోతాయన్నారు, ఫెడ్యా సంగతి జ్ఞాపక మున్నదిగా? ఎప్పుడు మొదలుపెడదామో చెప్పు. కాలయాపాని కిది తరుణంకాదు.

ఈ మనిషంటే ఆమెకు యిష్టంపుట్టింది. పాదాలులేవని తెలిసీ, తనకు నృత్యం నేర్పించమంటాడు. ఎందుకు నేర్పించరాదు? మనిషి బాగున్నాడు, కొంచెం నల్లబారిన ట్లగుపించినా, అందమైన ముఖమూ, నొక్కు నొక్కుల జుత్తూ, మిగేలుమనే నేత్రద్వయమూ, కలుపుగోలుతనమూ, తన కివన్నీ బాగా నచ్చాయి, అతని నేదో వొక విషయం. విషాదకరమైన సంగతి, బాధిస్తున్నట్లు అప్పుడప్పుడా తడగుపించేవాడు. అతని నడకలో ఆమెకెట్టి విచిత్రంగానీ, గోచరించింది కాదు. తనకు నృత్యమంటే ప్రాణంగదా! తన గొప్పతనమును తానేచెప్పు కొంటే బాగుండదు: కాని, తన నృత్యంలో మంచి అనుభవమున్నదనే విషయం అందరూ ఎరుగనున్నదేగా?.... అలెక్సీ?.... మనిషి బాగున్నాడు ... ఆకర్షణీయంగా!

నృత్యం నేర్పడానికి జినోచ్కా ఒప్పుకున్నది. సొకోల్నికీలో పేరుపొందిన బాబ్ గారొబోవ్ దగ్గరతాను నృత్యం నేర్చుకొన్నానని అలెక్సీకు చెప్పింది. ఈ బాబ్ ప్రఖ్యాతనటుడైన పాల్ సుడాకొవుస్కీ శిష్యుడు. పాల్ పేరు విననివారు మాస్కోలో లేరు. సైనికకళాశాలల్లోనూ, విదేశ కమిసారియట్ కేంద్రాల్లోనూ పాల్ నృత్యం నేర్పించాడు. వీరిద్దరునుండీ తాను నేర్చుకొన్న విషయాలన్నిటినీ అలెక్సీకు నేర్పుతాన్నది, కాని పాదాలులేని మనిషికి ఇదెంతవరకూ నీలువడుతుందో చెప్పటం కష్టం. తన దగ్గిర నేర్చుకోవాలంటే కొన్ని నిబంధనలను పాటించాలని చెప్పింది. వినయవిధేయతలు చూపించాలి: కష్టపడి పనిచేయాలి; తన మీద మరులుకొనరాదు. అట్టి భావమేర్పడితే చదువు చట్టుబండలవుతుంది. అన్నిటికంటె ముఖ్యమైన విషయం, తానితరులతో నృత్యం చేసేటప్పుడు అసూయపడరాదు. నలుగురితో నృత్యంచేస్తేనే తన విద్య తుప్పుపట్టకుండా. మెరుగుదిద్దినట్లుంటుంది. ఎప్పుడూ ఒకడితోనే నృత్యంచేస్తే అందులో పసందులేదు,

వీటన్నిటికీ అలెక్సీ సమ్మతించాడు, జినోచ్కా లేచినిలబడి, గుర్రం తన జూలును నెగురవేసినట్లు, తలనెగురవేసి ఒకటి రెండడుగులు చూపింది. పూర్వం మంటనార్పే దళం వారితో చేరి అలెక్సీ కామిషన్ గ్రామంలో "రష్కాకయా" మొదలైన పురాతన నృత్యాలను చేసేవాడు చాలా చురుకయినవాడనీ, బాగా నృత్యం చేస్తాడనీ అందరూ చెప్పుకొనేవారు ఆ రోజుల్లో. కాని సజీవమైన కండరాలూ నరాలూ, గల కాళ్ళకూ-తోలు పటకాలు బిగించికట్టిన యీ కృత్రిమ పాదాలకూ ఎంతో భేదమున్నది. నిర్జీవమైన పాదాలను స్వాధీనంచేసుకొని, తన చెప్పుచేతలలో

నుంచుకొని, లయి తప్పకుండా, సుకుమారంగా నడిపించడాని కెంతో ఏకాగ్రతా, పరిశ్రమా అవసరమని అలెక్సీ త్వరలో గ్రహించాడు.

కాళ్ళు తాను చెప్పినట్లల్లా వినడానికి విశ్వప్రయత్నం చేసాలు. పాల్ సుడాకొవిస్కీ సిద్ధాంతప్రకారం ఒకటి తరువాత వొకటిగా రక రకాల అడుగు లివటమూ నేర్చుకొనేడప్పు డాతని కెంతో కష్టమనిపించింది. కాని ఏ విధంగానయినా యీ కార్యాన్ని సాధించితీరాలనే ఆవేశం అతని కెక్కడలేని బలాన్నీ యిచ్చింది. కొత్తగా నేదయినా ఒకటి నేర్చుకోగానే షంతోషంతో గిర్రున చుట్టేవాడు. లేదా ఒక్కొకపుడు జినోచ్కాను అమాంతంగా అంత ఎత్తున ఎత్తి క్రింద దింపేవాడు. ఇదంతా చూసేవారికి అలెక్సీ ఎంత యమబాధ పడేవాడో రవంతయినా తెలిసేది కాదు. అతనితో చేరి నృత్యంచేస్తే జినోచ్కాకికూడా తెలియలా, అలిసిపోయి చెమట తుడుచుకొనేటప్పుడు కారవి కన్నీటిరికూడా అలెక్సీ తుడుచుకొనేవాడన్న విషయం వారిలో నొక్కరయినా గ్రహించలేకపోయారు.

ఒకనాడు మేజర్ స్ట్రిఖొవ్ తన గదిలోని కిటికీ చెంత నిలబడిన అస్తమయ సౌందర్యాన్ని చూస్తూ పరధ్యాన్నంగా నున్నాడు. అస్తమయ కిరణాలు పైన్ వృక్షాగ్రాలకు పసడిపూతను పూసాయి.

"నేను నృత్యం నేర్చుకొంటున్నా"నన్న మాటలు వినబడి తిరిగి చూసాడు. పూర్తిగా అలిసిపోయి కుంటుకుంటూ అలెక్సీ గదిలోకి వచ్చాడు,

మేజరెట్టి బదులుగానీ చెప్పకపోవటం చూసి, "నేను తప్పక సాధిస్తానీవని" నన్నాడు, తిరిగి మంచం మీద కూలబడి పాదాల నూడదీసి అంతదూరంగా పారవేశాడు. తిమ్మిరెక్కిన మొండికాళ్ళను గోళ్ళతో గీకుతూ వాటికి చైతన్యం కలిగించ డానికి యత్నించాడు.

కిటికీ చెంతనున్న మేజర్ వెనుతిరిగయినా చూడలా. అతని భుజాలదురు తున్నాయి. ఏడ్పు వినిపించింది ఇన్నేళ్ళు వచ్చిన ఈ మేజర్, నిన్న మొన్నటిదాకా అందరితో వేళాకోళాలాడుతూ, ఆడవాళ్ళని అపహాసిస్తూ, ఏడిపిస్తూవున్న స్ట్రిఖోవ్ చాలా మారిపోయాడు. క్లావియామీద వెర్రిప్రేమ ఈతని కేర్పడింది. ఆమెనుగురించి ఆలోచిస్తూ, వచ్చి వెళ్ళేవారిద్వారా పూవులూ, పండ్లూ, చాకొలెట్లులూ, వుత్తరాలూ పంపిస్తూ పద్దెనిమిదేండ్ల పడుచుఅబ్బాయి మాదిరి ప్రేమ పిచ్చిలో పడిపోయాడు. ఎన్నెన్నో పెద్దవుత్తరాలు వ్రాసేవాడామెకు, ఆమె దగ్గిరనుండి బదులువచ్చిన వా డాతనికి పట్టపగ్గాలు లేకపోయేవి.

క్లావియా మొదటి రోజుల్లో ఏదోవొక ముక్తసరిజాబు వ్రాసింది. కాని మేజర్ యొక్క మన స్తత్త్వం బాగా తెలిసాక, నిర్మొహమాటంగా వ్రాసింది. తావిం కొకనిని ప్రేమించి, కోల్పోయి అతని తలుచుకొంటూ రోజులు గడుపుతోంది. తన విషయమై లేనిపోని ఆశలు పెట్టుకొనటంకంటె, మరిచిపోవటం మంచిది. అవీ,

ఇవీ కొని పంపించి అనవసరంగా డబ్బు ఖర్చుపెట్టవద్దనీ, కానితలంపులతో కాలం వృథా పుచ్చవద్దనీ ప్రేమ పుట్టిపడేటట్లు వ్రాసింది. పైపైకి స్నేహభావం కని పించినా తానాతని నంగీకరించదన్న సందేశం కల ఆమె జాబులను చూస్తే మేజరు కెంతో కష్టమనిపించింది.

అలెక్సీ తన మంచంలో పడుకొని, ఒంటినిండా కంబళి కప్పుకొన్నాడు, మేజరుతో మాట్లాడటానికిది సమయం కాదని గ్రహించాడు. స్ట్రిఖొవ్ కిటికీనుండి వెనుదిరిగి గదిలోకి వచ్చి, అలెక్సీను సమీపించాడు. కాని అలెక్సీ తనకదంతా ఏమాత్రం కానీ తెలియనట్టు పడుకొన్నాడు,

"దాని కేమి కావాలి ? నే నెవరో చెప్పు ? నీకు తెలిస్తే చెప్పు, కాలిధూళిని చూసినట్టు చూస్తుంది. పడుచుదనం లేదనా ? అందం తక్కువనా ? కాలి కంటు కొన్న పేడమాదిరి నన్ను చీదరించుకొంటుంది ! మరొక స్త్రీ అయితే....నావంటి వాడు దొరికితేనే....ఎందుకులే....ఏమన్నా ఏం లాభం ?

పెద్ద సోఫాలో కూలబడి, చేతులతో తలను బిగియపట్టుకొని ముందు వెనుకలకు ఊగుతోంటే సోఫా స్ప్రింగులు కిర్రు కిర్రు మన్నాయి.

"అదీ వొక ఆడదేనా ? ప్రేమా పెటాకులూ లేకపోతే పోనీ. మొగవాడను గదా ? ఇందులో యెట్టి చిత్రమున్నదో తెలుసుకోవాలనే ఆశన్నా వుండనక్కర లేదా ? ఆ రాక్షసి....నే నెంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలుసుగా ? ఏమంటావు ? ....అలెక్సీ ! నా ప్రేమ ఎంత గాఢమైనదో నీకు తెలియనిసంగతి కాదు....ఆ మనిషిని నీ వెరుగున్నావుగా ?....ఏ విషయంలో నాకంటె వాడు మెరుగయినవాడో నీవే చెప్పు ? దాని నెవ్విధంగా వశం చేసుకొన్నాడు ? నాకంటె తెలివితేట లెక్కువ కలవాడా ? అందమైనవాడా ? నన్ను మించిన యుద్ధవీరుడా ?"

మైనపు బొమ్మమాదిరి బొద్దుపారిన శరీరమూ, ముఖమూ; దిండుపైనున్న తలను రవంతయినా కదపలేక శవంమాదిరి పడుకొన్న కమిసారు మంచంచెంత తలవంచి మూర్తీభవించిన శోకదేవతమాదిరి నిలబడే ఆ నర్సు క్లావ్డియా అప్పు డాతనికి జ్ఞప్తికివచ్చి అలెక్సీ యీ విధంగా చెప్పాడు :

"మేజర్ స్ట్రిఖొవ్ ! అతడొక సిసలైన మనిషి. బోల్షివిక్. దేవుడి దయవల్ల మనముకూడా ఆతనిమాదిరి కాగలిగితే అంతకంటె ఆశించవలసిన దింకొకటి వుండదు."

# 4

పాదాలులేని వైమానికుడు నృత్యం నేర్చుకుంటున్నాడనే వదంతి. కార్చిచ్చు లాగా ఆరోగ్య భవనమంతటా వ్యాపించింది!

తన పనంతా ముగియగానే జినోచ్కా ఆరోగ్యభవనపు వరండాలోకివచ్చేది. ఆమె కొరకెదురు చూస్తూ అలెక్సీ అక్కడ కనిపెట్టుకొని వుంటాడు. ఏ పూవులో చాకొలెట్టో, లేక తనకు తినడానికిచ్చిన వస్తువులలో ఏ నారింజపండో వొకటి భద్రపరిచి ఆమెకీయడానికి తీసుకువస్తాడు. ఆతని చేయిపట్టుకొని వారిద్దరూ కచేరీ చావడికి వెడతారు. ఇంతకు ముందే అలెక్సి అక్కడవుండే పేకాట బల్లలనూ. పింగ్‌పాంగ్‌కు మేజాను వొకప్రక్క జరిపి గోడకానించి పెట్టేవాడు. జినోచ్కా నాలుగైదు కొత్త అడుగులు చూపేది, గాలిలో తేలిపోతున్నట్టు పాదాలవ్రేళ్ళ మొనలమీద జరిగే జినోచ్కానూ, ఆ పాదాలనూ అలెక్సి రెప్పవాల్చకుండా చూస్తాడు. తరువాత చేతులు చరుస్తూ.

"ఒకటి, రెండూ. మూడు - ఒకటి, రెండూ. మూడు. కుడి ప్రక్క.... ఒకటి, రెండూ, మూడు, ఒకటి, రెండూ,మూడు ఎడమప్రక్క !.... తిరుగు ! బలే భేష్ ! ఒకటి, రెండూ, మూడు - ఒకటి, రెండూ. మూడు....ఇప్పుడు పాము నడక ! రా, మనమిద్దరం కలిసిచేద్దాము"

తన గురువులు, బాబ్‌కానీ, పాల్‌కానీ పాదాలులేని మనిషికి నాట్యం నేర్పించారుకారు, తానిప్పుడీ పనికిపూనుకొనటం చేతనో లేక నల్లనినొక్కులజుత్తూ జ్యోతుల్లాగా మెరిసే, తన్ను వశపర్చుకొనే ఆతని నేత్రద్వయ ప్రభావంవల్లనో జినోచ్కా ఎక్కడాలేని వుత్సాహంతో అలెక్సీకి విద్య నేర్పడానికి పూనుకోగలి గింది. వీలుచిక్కినప్పుడల్లా నేర్పటం మొదలుపెట్టింది.

సాయంకాలం కాగానే జనులందరూ కొలువగట్టు ఇసుకదిబ్బలమీదా వాలీ బాల్ ఆడేచోట్లా యింతకా యితర ఖాళీ స్థలాలకూ వెళ్ళి నాట్యం చేసేవారు. అలెక్సీ కూడా కలుసుకొనేవాడీ నాట్యంలో చాలా బాగా నృత్యం చేయటమేకాక. బహు శ్రద్ధగా. ఒక్క పర్యాయమయినా విలిచిపోకుండా అనుదినమూ వచ్చేవాడు. ఆతని కీ విద్యను నేర్పించే జినోచ్కా కిదంతా ఎంతో సంతోషం కలిగించింది. తా నాతనికి నియమించిన నిబంధనలు చాలా కష్టమయినప్పటికీ అలెక్సి వాటిని తుచ తప్పకుండా పాటిస్తున్నాడు. స్త్రీ పురుషులుజంట నాట్యం చేసేటప్పుడు మన గురు శిష్యు లిద్దరూ కలుసుకొనేవారు. ముఖ మెఱ్ఱబారి. వెర్రి ఆనందం వుట్టిపడే టట్లు జినోచ్కాను చూస్తూ రక రకాల నృత్యాన్నీ అలెక్సీ చేసేవాడు అటువం టప్పు డాతనిక నిజమైన పాదాలు లేవన్న విషయమును జినోచ్కాకూడా నమ్మ

జాలక పోయింది. అంత సహజంగా నుండే దాతని నృత్యం, మధ్య మధ్య అలెక్సీ గదినుండి వెలుపలికి వెళ్ళేవాడని నలుగురికీ తెలుసు కాని అత డటువంటప్పు డేమి చేసేవాడో ఏవరికీ తెలియదు.

గదిలోనుండి నవ్వుముఖంతో, చేతిరుమ్మాలుతో విసరుకొంటూ వెళ్ళిపోయే వాడు. గదిగుమ్మం దాటి మసగచీకటిగా నుండే అడవిని చేరగానే, ముఖంమీది నవ్వు బాధగా మారిపోయేది. తడబడుతూ గడపమెట్లను దిగి అడవిలోకివెళ్ళి. చల్లని గరికమీద బోర్ల పడుకొని బావురుమని ఏడ్చేవాడు. పాదాలకు కట్టినతోలు పటకాలంత బాధపెట్టేవి, కాళ్ళ మొండిమెనలు కాలిపోతూన్నట్టు మంటలెగిసేవి.

తోలుపటకాల నూడదీసి, పాదాల నంతదూరాన పెట్టి రవంతకాలం. నొప్పి పోయేదాకా పడుకొనేవాడు. వెంటనే వాటిని తిరిగీ బిగించుకొని, టకటకా నడిచి గదిలోకివెళ్ళి, ఎవ్వరికంటా బడకుండా ప్రవేశించి వొకచోట నిలబడేవాడు. బ్యాండు వాయిద్యాలూ, ఆవేశమెత్తినట్టు నృత్యం చేస్తూ చెమటపట్టిన మనుష్యులూ బహు గందరగోళంగా నుండేది, గదంతా. అలెక్సీకై వెతుకుతూన్నట్టు జినోబాను నల్దిక్కులా చూసేది. తనపై ఆమె చూపు పడగానే, బహు చలాకీగా, దానిమ్మగింజల వంటి సొంపయిన పల్వరుసరవంత కనిసించేటట్టు నవ్వుతూ ఆమెను చేరుకొనేవాడు వారిద్దరూ కలిసి నృత్యం చేసేవారు తిరిగీ నలుగురిమధ్యా. మధ్యలో తన్నొదిలిపెట్టి వెళ్ళినందుకామె కోపగిస్తే" ఏదోవొక హాస్యంమాటను పలికి నవ్వు తెప్పించేవాడు. అందరిమాదిరే ఈ జంటా తీరుగా నటిస్తూంటే. వీరిలో నొక వ్యక్తికి పాదాలు లేవన్న విషయం ఎవరికిగానీ తట్టదు.

ఈ నృత్యాభ్యాసంవల్ల అలెక్సీకీ, అతని కృత్రిమ పాదాలకూ గొప్ప అన్యోన్య మేర్పడింది, అవి ఆతని శరీరంలోని తదితర భాగాలమాదిరి, అతనితో లయమైపోయాయి.

ఇదంతా అలెక్సీకెంతో సంతోషాన్నిచ్చింది, కాని, ఓల్గా దగ్గిరనుండి వుత్తరాలు రాకపోవటమాతని కేమాత్రంకూడా అర్థమయిందికాదు. గ్వొజ్దెవ్ వ్రాసిన జాబును చదివి వెంటనే తానామెకొక జాబు వ్రాశాడు. ఇప్పటికొక నెలరోజు లయింది, ఇంకా ఒక్క అక్షరమన్నా వ్రాసిందికాదు ఓల్గా. తాను వ్రాసిన ఆనాటి వుత్తరం బుద్ధి తక్కువదనిపించింది. చాలా తొందర పడ్డాననుకొన్నాడు ఎన్నో పర్యాయములు. ప్రతిరోజూ కసరత్తుచేసి, పరుగెత్తాక వుత్తరాలుంచబడే కొయ్య చట్రం దగ్గిరికి వెళ్లేవాడు, తనకేదన్నా జాబున్నదేమోననే ఆశతో. 'అ' అక్షరం గల సొరుగులో. ఇతర సొరుగులలోకంటే ఎక్కువ జాబులుండేవి, తరుచుగా కాని ఎంత వెతికినా అలెక్సీ పేరుండేదికాదు,

ఒకనాడు నృత్యం నేర్చుకొంటూంటే ఆగది కిటికీదగ్గర బర్నాజ్యాన్ తల కనిపించింది. చేతిలో నొకజాబూ, చేతికర్రా వున్నాయి. అతడు పెదవి కదిపేలోగా

అలెక్సీ ఆ వుత్తరాన్ని లాగుకొన్నాడు. గుండ్రటి పెద్దపెద్ద అక్షరాలూ, బడి బాలికల దస్తూరివంటి వ్రాతా ఎవ్వరిదో అతనికిట్టే అర్థమయింది. గదిలోనుండి పరుగెత్తుకొంటూ వెళ్ళినట్టు పడివడిగా వెళ్ళిపోయాడు. బర్నాజ్యాన్, జినోచ్కాలిద్దరూ తెల్లముఖాలు వేసుకొని నిలబడ్డారు.

"జినోచ్కా, వీరందరిదీ ఒకటే మతం," అంటూ బాతాఖానీకి దిగాలనే వుద్దేశంతో బర్నాజ్యాన్ ప్రకటించాడు." అందరూ మోసగాళ్ళు. ఒక్కడినైనా నమ్మవద్దు పాత చెప్పునుచూసి కుక్కపారిపోయినట్టు వారినుండి తొలగిపో. నన్ను నీ శిష్యుడిగా చేసుకో" మంటూ,చేతికర్రను పారవేసి. రొజుతూ రొప్పుతూ కిటికీపైకెక్కి గదిలోకిదిగాడు. ఏదీ అర్థంకాక, శోకమయిన వదనంతో జినోచ్కా

నిలబడినచోటే కదలకుండా నిలబడింది.

ఉత్తరాన్నెవరైనా తన చేతినుండి లాగుకొంటారేమో అన్నట్టు గట్టిగా పట్టుకొని, అలెక్సీ సరస్సు దగ్గిరికి పరుగెత్తి వెళ్లాడు. ఎత్తుగా పెరిగిన రెల్లుగడ్డి మరుగుగా, ఎవరికీ కనబడకుండా నొక బండమీద కూర్చున్నాడు. చేతులు వణికాయి వుత్తరాన్ని చదువుతూంటే. దానిని విప్పే ముందందులో నేముంటుందో అని భయం. ఏమని వ్రాసిందో? కవరు చాలా నలిగి, మాసిపోయింది. ఎక్కడెక్కడో తిరిగి వచ్చింది కాబోలు? కవరు నొకచివర చింపాడు రవంత. ఆ ఉత్తరంలోని ఆఖరు వాక్యమాతని కగుపించింది. "ప్రియతమమైన నీకు నా ముద్దులు. ఓల్గా" పెద్దబరువును దించిపెట్టినట్లనిపించింది. ఏదో ఒక నోటు పుస్తకంలో నుండి చింపిన కాగితాలమీద వ్రాసిందీజాబు. వాటిని తన మోకాళ్ళపైనుంచి, మడతలు లేకుండా సాఫీచేశాడు. కాగితాలమీద బంకమన్నూ, కరిగిన క్రొవ్వొత్తి చుక్కలూ వుండుట మాతనికి అర్థమయిందికాదు. ఎప్పుడూ ఎంతో శుభ్రంగా నుండే తన ఓల్గాకు ఇప్పుడేమి సంభవించింది? జాబును చదివేకొలదీ అతనికి ఆమె యెడల గౌరవ భావముతోడు, దిగులుకూడా కలిగింది. సుమారొక నెలక్రిందట టంపపు యంత్రశాల నుండి వచ్చేసిందట. ఇప్పుడు గడ్డిమైదానాలలో నున్న నొకచోట పనిచేస్తోంది. టాంకుల నడ్డగించటానికి కాలువలు త్రవ్వుతున్నారట, తామంతా. తమందరికీ "పూజనీయమైన నొక నగరం" చుట్టూ కాలువలు త్రవ్వి, అర్థాలు పేర్చుతున్నారు. స్టాలిన్‌గ్రాడ్ అనేమాట నామె వాడకపోయినప్పటికీ, జాబులోని ఆదుర్దానిబట్టీ, పునీతభావమునుబట్టీ ఆమె స్టాలిన్‌గ్రాడ్‌ను వ్రాస్తూన్నదని గురించే అలెక్సీకి తెలిసింది. ఇదే "పూజనీయమైన నగరం" అని ఆమె వ్రాసిన స్థలం.

వేలకొలది వాలంటీరులుచేరి రాత్రనక, పగలనక త్రవ్వుతూ, మట్టినిమోస్తూ కంకరబాటలు వేస్తూ, ఇండ్లు కట్టుతూ ఎంతో సరదాగా కాలం గడుపుతున్నారు. ఇదంతా బాగానేవున్నదికాని, అచ్చటి స్త్రీలందరూ చాలా కష్టపడుతున్నారనీ,

అచ్చటి బ్రతుకు వారి కిసుమంతయినా విశ్రాంతి నిచ్చునట్టు కాదని. దానిని చదివితే అలెక్సీకి బోధపడింది. అచ్చటి తమ అనుదిన జీవితాన్నంతా వర్ణించాక, తానడిగిన ప్రశ్నకు జవాబువ్రాయడాని కారంభించింది. తానిక్కడ "కాలువల్లో" పనిచేసే టప్పుడాతని జాబువచ్చింది. దానిని తలుచుకొంటే ఇప్పుడు కూడా ఆమె కమిత కోపం వస్తుంది. యుద్ధంచేసేవారి జీవితమెంత కష్టమయిందో, వారి నరాలన్నీ ఏవిధంగా గుడ్డపేలికల్లాగా చీలిపోతాయో తనకు తెలుసు. కాబట్టే అతని వుత్తరం వ్రాసినప్పటికీ దానిని మరిచిపోవటానికి వీలున్నది.

"నాచిట్టితండ్రీ! త్యాగం చేయలేని ప్రేమ, అదీ వొక ప్రేమమేనా? అటు వంటి ప్రేమ అంటూలేదు. దానిని ప్రేమ అనటం శుద్ధతప్పు. స్నానంచేసి వొక వారమయింది. తొడుగుకొన్న పంట్లామునూ, బూట్సులనూ విప్పడానికయినా వ్యవధిలేదు. బూట్లు చినిగి వ్రేళ్ళన్నీ కనిపిస్తున్నాయి. ఎండవేడికి నల్లగా కమిలి, ముఖచర్మం పొరలూగిపోతోంది. అడుగుచర్మంమాడి, బిరుసెక్కినట్లున్నది. ఉన్న దానిని ఈ వున్నమాదిరి, అసహ్యంగా, నల్లబడి, చిక్కి శల్యమైన నీచెంతకు వచ్చా ననుకో, నీవు నన్ను తిరస్కరిస్తావా? నేనంటే అసహ్యపడుతావా? ముక్కుపచ్చ లారని పసిబిడ్డమాదిరి వ్రాస్తావెందుకు? నీకేగతి పట్టినాసరే, నీ వేవిధంగానున్నా సరే, నీకొరకు నేను రోజులు లెక్కపెట్టుకొంటూ బ్రతుకుతున్నానన్నది యెన్నటికీ మరిచిపోవద్దు. నిన్నుగురించి నేనెప్పుడూ ఆలోచిస్తూవుంటాను. ఈ రోజులసంగతి వేరు. పూర్తిగా అలిసిపోయి. ఇంటికి వచ్చీ రావటంతోనే పడుకొంటేచాలు బండ నిద్రపట్టి. శవాలమాదిరి పడుకొంటాము. నిన్నుగురించి ఎన్నోపర్యాయములు వ్రాయ టానికి సిగ్గుగానున్నది. ఏవేవో కలలుకంటాను. ఈబొందిలో ప్రాణమున్నంతవరకూ నీకొరకు కనిపెట్టుకొనివుండి నీకొక యింటినీ, వాకిలినీ తయారుచేసిపెట్టి యెదురు చూసే వ్యక్తి వొకర్తె వున్నదన్నసంగతి జ్ఞాపకముంచుకో. నాయం దనుగ్రహించి నా చిట్టిబాబూ! ఈ సంగతి మరచిపోవద్దు యుద్ధభూమిలోనుండే నీ కే నిమిషాని కేది జరుగుతుందో చెప్పజాలనని వ్రాశావు. ఈ కాలువల్లో నుండే నా కేదన్నా విపత్తు జరిగిందనుకో. ఏ కాలో, ఏ కన్నో పోగొట్టుకొని నీ దగ్గిరికి వస్తాను, నన్ను వెళ్ళగొడతావా? నీవే చెప్పు. మన మిద్దరం చిన్నతనంలో చదువుకొనే రోజులలో బీజగణీత ప్రశ్నలను తీర్చేవారము. జ్ఞప్తివున్నదా? తెలియనిదానికి బదులేదో వొక అక్షరము నుపయోగించి లెక్క చేసేవారము. ఇదేమాదిరి నీబదులు నన్ను నీ స్థానంలోనుంచి ఆలోచించిచూడు. ఈ విధంగా ఆలోచిస్తే నాకు వ్రాసిన వుత్తరానికి నీవే తప్పక సిగ్గుపడతావు....తలవంపు లనిపించక మానదు..."

ఈ జాబునుగురించి ఆలోచిస్తూ అలెక్సీ యెంతకాలం కూర్చున్నాడో అతనికే తెలియదు. ఎండవేడికి ఒడలంతా కాలుతోంది. రెల్లుగడ్డి గాలిలో ఊగిన లాడుతూ సరస్సు నీటిలో ప్రతిబింబిస్తోంది. రెల్లుగడ్డిలో గుంపులుగా తూనీగ

రెగురుతున్నాయి, నీటి పాలీడులు చకచాకా నీటిపై పరిగిడుతున్నాయి. పిల్ల కెరటాలు లేచి సరస్సుగట్టును తాకుతూ జల జల శబ్దంచేస్తున్నాయి ఇవన్నీ తెలియని వేరొక లోకంలో అలెక్సీ వున్నాడు.

"ఏమిటిదంతా? దివ్యదృష్టి, పరకాయప్రవేశమూ అంటూ చిన్నతనంలో తన తల్లి ఏవేవో చెప్పేది. ఇటువంటిశక్తి ఏదో వొకటి ఓల్గాలో పుట్టింది కాబోలు! లేకపోతే తాను వ్రాయందే తన యథార్థపుస్థితి నామె యే విధంగా తెలుసుకోగలిగింది?....తిరిగీ ఆమె జాబును చదివాడు. కాదు, అటువంటి దేదీ కాదు. తాను వ్రాసిన విషయాలకే ఆమె బదులు వ్రాసింది, ఎటువంటిజాబు! ఎంతటి ఔదార్యం?" అనుకొన్నాడు.

నిట్టూర్చి లేచి నిలబడ్డాడు. బట్టలను విప్పి ఆ బండమీద పెట్టాడు. ఎరుచుగా నీ జాగాలోనే అతను స్నానం చేస్తాడు, ఎత్తుగా పెరిగినరెల్లు గడ్డి చాటుననున్న ఈ ప్రదేశానికి వేరెవ్వరూ వచ్చేవారు కాదు. తోలుపటకా ఊడదీసి కృత్రిమపాదాలను బట్టలమీదనుంచి, చల్లగా నీటిలోకి జారాడు. కాళ్ళమొనలకు రాళ్ల గుచ్చుకొని నొప్పి పెడతాయని తెలిసీ, కాళ్ల చేతులమీదదిగలా, నొప్పికోర్చుకొని మొండికాళ్ళ మీద దిగి నీటిలో ఈతకొట్టాడు. కొంతదూరంవెళ్ళి, నీటిపై వెల్లకిలా పడుకొని తేలాడు. ఆకాశంలో బంగరు మెరుగుదిద్దిన మేఘాలు, చిన్నచిన్నవి, ఒకదానినొకటి ఢీకొట్టుకొంటూ పరుగులిడి పెడుతున్నాయి. ఏదో పని మించిపోతూన్నట్టు బోర్లా తిరిగి గట్టునకేసి చూశాడు. గట్టుపైనున్న రెల్లుగడ్డీ చెట్లూ అద్దంలో ప్రతిబింబించినట్టు ఎంతో ముచ్చటగా నున్నాయి. పెద్దపెద్ద గుండ్రని ఆకులమధ్య పసుపూ, తెలుపూ పత్రాలున్న తామరపూవులు తేలుతూ, నీటిఅలలకు పైకి క్రిందకీ తొంచవిస్తున్నాయి. ఉన్నట్టుండి గట్టున నున్న బండమీద కూర్చున్న ఓల్గా ప్రతిబింబమాతనికి నీటిలో కనుపించింది. పూర్వం తొడుగుకొనగా తాను చూసిన అదే పూవులగౌను తొడుగుకొన్నది. కాళ్ళను క్రిందికి జాపింది, కాని నీటిని తాకలేకున్నాయి. ఆ కాళ్ళకు పాదాలు లేవు. మొండిమొనల మీ గాళ్ల వ్రేలాడుతున్నాయి. ఈ భయంకర! హృదయవిదారక దృశ్యాన్ని చూడలేక, చూడటానికిష్టపడక చేత్తో నీటిమీద టపీమని కొట్టాడు. ఆమె చెప్పిన పద్ధతి, తానున్న స్థితిలో ఓల్గా వున్నదని అనుకొనటమూ, అప్పుడేవిధంగా తాను వర్తిస్తాడో అనేది ఆలోచించటమూ, ఇదంతా తన కెంతమాత్రమూ వీలుపడదని నిశ్చయించుకొన్నాడు.

# 5

దక్షిణప్రాంతంలోని పరిస్థితులు విషమించాయి. డాన్ నదీప్రాంతంనుండి యుద్ధవార్తలు మునుపటంతగా రావటంలేదు. డాన్ నది కవతలిగట్టునున్న కొన్ని కొసాక్ గ్రామాలపేర్లు ఒకనాటి యుద్ధవార్తలలో పేర్కొనబడ్డాయి. ఓల్గానదికి, స్టాలిన్ గ్రాడ్‌కూ వెళ్ళే మార్గంలోనున్న ఈ గ్రామాలనుగురించి ఎవరికిగానీ ఏమంతగా తెలియదు. కాని ఈ ప్రాంతముతో పరిచయమున్న అలెక్సీకు యదార్థం విదిత మయింది. డాన్ నదిదగ్గర రక్షణార్థ మేర్పర్చిన ఆటంకాల నన్నిటినీ జయించి జర్మనులు స్టాలిన్‌గ్రాడ్‌ను సమీపిస్తున్నారని అతను గుర్తించాడు.

స్టాలిన్‌గ్రాడ్ ! ఈ నగరంపేరింతవరకూ యుద్ధవార్తలలో కనుపించక పోయినా, దానినిగురించి అందరూ చెప్పుకొనటం రివాజయిపోయింది. ఆ 1942 సంవత్సరంలో స్టాలిన్‌గ్రాడ్ పేరు చెప్పినప్పుడల్లా, చాలా ప్రమాదకర స్థితిలో నున్న తమ ఆప్తబంధువులలో నెవరిపేరో చెప్పినట్టులనిపించేది, జనులందరికీ. అలెక్సీకి, నలుగురితోపాటు కలిగిన అదుర్దాకితోడు, తన ఓల్గా, స్టాలిన్‌గ్రాడ్ ప్రాంతపు గడ్డిమైదానంలో ఎక్కడోవున్నదన్నవిషయంమరింతగా బాధించింది. ఏమి చేస్తోందో ? ఎటువంటి కష్టాలు పడుతోందో ? ఎంతటి కష్టాలు పడవలసివున్నదో, ఇంకా ? ప్రతిరోజూ వ్రాసేవాడిరోజుల్లో, ఓల్గాకు. కాని ఎక్కడో మైదానాలలో నున్న తపాలాఫీసుకు వ్రాసే వుత్తరాలు ఆమె కెప్పుడు చేరుతాయో ఎవరికితెలుసు? ఓల్గా నదీతీరాన జరుగుతూన్న యుద్ధ హడావిడిలో తనజాబు లామెకు అందుతా యనడానికి వీలులేదు. ఒకవేళ వచ్చి మీదపడే జర్మను యమఘాతకులనుండి తప్పించుకు పారిపోయే గందరగోళ సమయంలో తన వుత్తరాలు అందుతాయి కాబోలు !

ఆరోగ్య భవనంలో నున్నవారందరూ : చదరంగమూ, వాలీబాలూ, స్కిటిల్సూవంటి ఆటలాడేవారు. ఇతరుల కంటబడకుండా తోటలోని పొదల మదుగున కూర్చొని పేకాటలాడేవారు. ఇటువంటి ఆటలాడకపోతే ప్రొద్దుపుచ్చటం కష్టమనిపించేది. కాని ఇప్పుడిట్టి ఆటపాటలతో అక్కరలేక పోయింది. చెదర గొట్టిన తేనెతుట్టెలోని ఈగలమాదిరి ఎక్కడ కాలూనాలో తెలియక కాలుకాలిన పిల్లిమాదిరీ మనస్థిమితం లేకపోయింది. మొద్దుమాదిరి నిద్రించేవాడుకూడా ప్రతి దినమూ ప్రొద్దున్నే ఆరుగంటలకు ముందే మేల్కొని ఆరుగంటల రేడియో వార్తలను వినడానికి దానిచుట్టూ గుమిగూడేవారు. రష్యను వైమానికుల సాహస కార్యాలను గురించి వినినరోజు, ఇచ్చట వైమానికులందరూ జోరీగల గొడ్లమాదిరి వర్తించేవారు. పనివారిమీదా, నర్సులమీదా కారాలు మిరియాలు నూరేవారు.

తినటానికేదిపెట్టినా అసహ్యించుకొనేవారు. భవనపు నిబంధనలంత ప్రతిబంధకాలు లేవని చీదరించుకొనేవారు. తమ మిత్రులు ప్రాణాలు తెగించి పోరాడుతోంటే, జర్మనుల హతమార్చుతూంటే తామిక్కడ చేసే పనిలేక వేళపట్టున తింటూ, నిద్రిస్తూ వుండటమూ, వెచ్చని ఎండలోనూ, చల్లని వెన్నెలలోనూ షికార్లు కొట్టడమూ, "సృష్టిసౌందర్యము" అంటూ సరస్సు గట్టునశూన్యంలోకి చూస్తూ గంటలతరబడి కూర్చొనటమూ వారి కెంతమాత్రం కూడా గిట్టాయికావు. ఏమి చేయాలో తెలియక, పనివారిమీదా, ప్రతిదానిమీదా విరుచుకుపడేవారు. జబ్బులు కుదిరాక బలం పట్టడానికని యిచ్చటికి వచ్చినవారిలో చాలామందికి కాలు విలిచిందికాదు, పట్టినబలం చాలుననీ, దయచేసి యుద్ధభూమికి వెళ్ళటాని కనుమతినిచ్చి విడుదల చేయవలసిందనీ ఎన్నో పర్యాయము లడగుకొన్నారు.

ఒకరోజు మధ్యాహ్నమపుడు వైమానికశాఖకు చెందిన వుద్యోగస్థులు కొందరు వచ్చారు. మీదంతా మన్నుపడిన ఆ కారునుండి, వైద్యశాఖకు చెందిన వుద్యోగస్తులుదిగారు. వారిలో నొకాయన మంచి లావూ, పొడుగున్న మనిషి కూడా వున్నాడు. ఇతడే వైమానిక వైద్యశాఖకు చెందిన ప్రథమ సర్జన్ మిరొవొల్స్కీ. ఇతడంటే అందరికీ యెంతో ప్రేమా, గౌరవమూ. మధ్యాహ్నం భోజనాలసమయంలో తాము మరునాడు యిచ్చటి సైనికులనూ, వైమానికులనూ పరీక్షిస్తామని చెప్పారు. ఎవరికన్నా వెంటనే వెళ్ళి పోరాడటానికి యిష్టముంటే వారిని పరీక్షించి మంచిదని తోచినట్టయితే యుద్ధభూమికి పంపిస్తామన్నారు. కాబట్టి యీ విధంగా త్వరగా వెళ్ళడాని కాశపడేవారిని సిద్ధంగా నుండమన్నారు.

మరునాడు ప్రొద్దున్నే అలెక్సీ లేచి, రోజూ చేసే కసరత్తులు మానుకొని ఒంటరిగా అడవిలోకి వెళ్ళాడు. ప్రొద్దుటి ఫలహారాలగంట కొట్టేదాకా అక్కడే వున్నాడు. ఏ వొక్కటీ సరీగ్గా తిన్నాడుకాడు. ప్రతి వొక్కటీ బాగా లేదని వడ్డించే స్త్రీమీద కోపగించుకొన్నాడు. తిండి తినకపోతే బలం పట్టదంటూ ఆమె చెప్పబోతే అలెక్సీ కెక్కడలేని కోపమూ వచ్చింది. తన మంచికొరకు చెప్పే మాటలను వినేబదులు, చెప్పినందు కామెపై కోపగించుకొనటం పెద్దమనుష్యులు చేసే పనికాదని స్ట్రిఖొవ్ అన్నాడు. కోపంతో అలెక్సీ ఆ గదినుండి వెళ్ళిపోయాడు. దారిలో యుద్ధసమాచార పత్రికను చదువుతూ జినోచ్కా కనుపించింది. ఆమెను చూడకుండా తనదారిని తాను వెళ్లాడు, "ఓయబ్బో! ఎందుకువచ్చిన గీర్వాణ" మన్నట్లు ఆమె భుజాలెగురవేసి అతని చూడనట్టు నిలబడింది. అతడంత దూరంవెళ్ళాక, తన్నాతడు చూడనన్నా చూడలేదని గ్రహించింది, ఏడుపువచ్చింది. చాలా అవమానం కలిగినట్లనిపించింది. ఉండబట్టలేక అలెక్సీని పిలిచింది.

వెనుతిరిగి, కోపంగా, "ఎందుకు! ఏమికావాలి?" అని ప్రశ్నించాడాతను.

"లెఫ్టినెంట్ సోదరా! నీవెందుకిమాదిరి..." ఆమె ముఖమెర్రబారి, తలజుత్తుతో సమానంగా కందిపోయింది.

అలెక్సీ చటుక్కున ఆగాడు. కోపం, లోకంమీదికోపం, ప్రశాంతత చల్లారింది. అకస్మాత్తుగా ఎముకలన్నీ నీరుకారిపోయినట్టు క్రుంగి, కుదించుకుపోయాడు.

"నా భావిజీవితచర్య యావత్తూ నేడు నిశ్చయింపబడుతుంది. నాకదృష్టం పట్టడానికి నన్నాశీర్వదించు రా. కరస్పర్శనం...."

రోజూకంటె ఎక్కువగా కుంటుకుంటూ తనగదిలోకి వెళ్లి తలుపు బిడాయించుకొన్నాడు.

వచ్చిన వుద్యోగస్తులందరూ కచేరీచావడిలో కూర్చున్నారు. వైమానికులనూ, సైనికులనూ పరీక్షించటానికెన్నో రకాల పరికరాలూ, యంత్రాలు గదిబల్లలమీద పరిచారు. ఊపిరిని కొలిచేవీ, పిడికిలి పట్టును కొలిచేవీ, కండ్లను పరీక్షించే అట్టలా మొదలైనవెన్నోవున్నాయి. భవనంలోని వారందరూ గదివెలుపల గుమిగూడారు. వెంటనే వెళ్లి యుద్ధంలో చేరాలని అనుకొన్నవారందరూ వరుసగా నిలబడ్డారు. వీరిలో చేరకుండా మిగిలిన వారొక పదిమంది అయినాలేరు. జినోచ్కా వచ్చి మనిషికొక కాగితము నిచ్చింది. దానిమీద మనిషి పేరూ, ఇన్ని గంటల ఇన్ని నిమిషాలూ అని వ్రాయబడ్డాయి. సరీగ్గా వారివారి కాగితాలమీద సూచించిన కాలానికి హాజరుగానుండిమనిచెప్పి వారందరినీ అక్కడనుండి పంపించింది. మొదటి నలుగురైదుగురు పరీక్షముగిసి బయటికి వచ్చారు. పెద్ద, దుర్ఘటమైన నిబంధన లేవ్వీలేవనీ, సులభంగా పరీక్షిస్తున్నారనీ నలుగురికీ తెలిసింది. ఓల్గానది ప్రాంతంలో బ్రహ్మాండమైన యుద్ధం జరుగుతోంది. ఎంతమందో జనులు కావలసి వున్నారు. కాబట్టే కష్టమయిన నిబంధన లుండటాని కవకాశము లేకపోయింది. భవనపు సింహాద్వారాని కెదుటనున్న పిట్టగోడమీద కూర్చొని, కాళ్లూపుతూ, వచ్చేవారి నందరినీ అలెక్సీ మాటవరుస కడిగినట్టు,

"ఏమిటి సంగతి? ప్యాసవుతావా?" అని అడిగాడు.

"ప్యాసయ్యా"నంటూ సగర్వంగా తలెత్తి, బెల్టును బిగించి, కోటుమెడను సర్దుకొంటూ, బదులు చెప్పేవారు, వారందరూ.

అలెక్సీకు ముందు బర్నాజ్యాన్ వెళ్ళాడు. తన చేతికర్రను బయటవిడిచి, తన పొట్టికాలు కనిపించకుండా వుండాలని, టక్‌టక్‌గా నడిచి వెళ్ళాడు. వెళ్ళిన వాళ్లా సేపటిదాకా తిరిగి రాలా, లోపలినుండి కోపంగా నెవరో మాట్లాడుతూన్నట్టు వినబడింది, అలెక్సీకి. దభీలున తలుపు తెరుచుకొని పెద్దకోపంతో బర్నాజ్యాన్ బయటపడ్డాడు. అలెక్సీవంక తీవ్రంగా చూసి, కుంటుకుంటూ తోటలోకి వెళ్ళిపోయాడు.

"అధికారులు! .... అధికారులట!....వీరికి వైమానిక విద్య ఏమాత్రం తెలుసు?....ఏదన్నా నాట్యపోటీకి మనుష్యులను తీసుకొంటున్నామనుకొన్నారు కాబోలు?....పొట్టికాలు!....పొట్టికాలట!!....విరేచనాలకి లోపలికి. తీసెక్కించ

దమూ, సూదిమందు లీయటమూ తప్ప వీరందరికీ వేరొక విద్య తెలియదం"టూ అరుచుకొంటూ వెళ్లిపోయాడు.

అలెక్సీ ఇదంతాచూసి గాభరా పడ్డాడు. తన కేగతి పట్టుతుందో అనే భయం వేసింది. లేని ధైర్యం తెచ్చుకొని నవ్వుముఖంతో చకచకా నడిచి గదిలోకివెళ్లాడు. గదిమధ్య కొండంత మనిషి, సర్జన్ మిరొవొల్‌స్కీ విగ్రహంమాదిరి కూర్చున్నాడు. ప్రక్క నొక బల్లచెంత, తెల్లటి దుస్తులూ, తలకు పెట్టుకొనిన తెల్లటి టోపీనుండి తప్పించుకు వెలువడిన ఎర్రటి మంగురులూ అందచందాల బొమ్మమాదిరి జినోచ్కా కూర్చున్నది. ఆ బల్లమీద దొంతరలుగా పేర్చిన చీటీలున్నాయి. అలెక్సీకి అతని పేరుగల చీటీ నందిచ్చింది. అందించేటప్పుడాతని వ్రేళ్ళను స్పృశించి, ప్రేమ పురస్సరంగా చల్లగా అదిమింది.

"అబ్బాయీ! ఏదీ, పై బట్టలు తీసివేయి. చూద్దామ"న్నాడా సర్జన్.

అలెక్సీ చేసిన కసరత్తులూరకపోలేదు. కండలు పట్టిన శరీరం; బిగువైన కండలు. ఇసుక తిన్నెలమీద గాలికేర్పడే అలలమాదిరాతని అవయవాలమీద బహుసొగసుగా కనుపించాయి. మిరొవొల్‌స్కీ చూపులో ఆమోదమూ, ఆనందమూ పుట్టిపడ్డాయి.

"డేవిడ్ విగ్రహాన్ని చెక్కాలంటే నీకంటె మెరుగయిన మనిషి వేరొకడు చిక్కటం దుర్లభ" మన్నా డక్కడున్న నలుగురిలో నొకాయన. తనకు శిల్పకళా, చిత్రకళలంటే కూడా తెలుసునని ఇతరులకు చూపించాడు ఈ విధంగా.

ఆ రకరకాల పరిశీలనలోనూ అలెక్సీ గొప్పగా నెగ్గాడు. పిడికిలిపట్టులో సాధారణంగా నుండే బిగువుకు ఒకటిన్నర రెట్లెక్కువ బిగువును చూపించాడు. ఊపిరి బలమును కొలిచే యంత్రపుముల్లు పరుగెత్తి ఆఖరు సంఖ్యను తాకి, ఇంకా వెళ్ళడానికి తావులేక అక్కడే టకటలాడుతూ నిలబడింది. రక్తతీవ్రత హెచ్చు తగ్గులులేక సరిసమానంగానున్నది. నరాలు; అవి నరాలుకావు; ఉక్కుతీగలు; బలాన్ని కొలిచే యంత్రాన్ని పట్టిలాగాడు, దానిపిడి ఆఖరివరకూ వచ్చి, అతడింకా లాగబట్టి ఊడి అలెక్సీ చేతిలోకి వచ్చేసింది.

"వైమానికుడివాబాబూ?" అని బహు సహృదయంగా సర్జన్ ప్రశ్నించాడు. కుర్చీలో మెత్తగా సర్దుకొని కూర్చొని "లెఫ్టినెంట్ అలెక్సీ వైమానికు"డనే అతనీ పేరుగల అట్టమీద నొకప్రక్క తన ఆమోదమును వ్రాయడానికి కలం చేబట్టి, "వైమానికుడివా?" అన్నాడు మరొక పర్యాయం.

"ఔను."

"యుద్ధవిమానమా?"

"ఔను."

"సరే, వెళ్ళి పోరాదు !" నీవంటివా రెంతో జరూరుగా కావలసివున్నారు. నీ విషయంలో పరీక్షలతో పనేలేదు. ఆ....సరి....ఏ జబ్బుతో పడిపోయావు ?"

అలెక్సీముఖం పాలిపోయింది. కోసినా వొక్క నెత్తురుచుక్కయినా కారేటట్టులేదు. కాళ్ళక్రింది భూమి కూలిపోయిన ట్లనిపించింది. సర్జ నాతని కార్డును పరిశీలించిచూచాడు. ఆశ్చర్యచకితుడై .

"పాదాలు సరికేశారా ?....ఏమిటిదీ ?....శుద్ధ అబద్ధం !....ఇందులో ఏదో పొరబా టున్నది, ఏమంటావు ?....మాట్లాడవేం ?

"లేదు; పొరబాటేదీ లేదు," ఉరికంబా న్నెక్కేవాడిమాదిరి వినిపించీ వినబడనట్టు. పాతాళంనుండి వచ్చేటట్టు లా మాటలు వినబడ్డాయి.

ఆ సంఘం మనుష్యులందరూ యింతలేసి కండ్లు చేసుకొని పహిల్వాను వంటి ఆ మనిషిని తేరిపార జూశారు. ఈ తనిలో అంగవైకల్యమనేది వున్నదంటే వా రెంతమాత్రమూ నమ్మలేకపోయారు,

"పంట్లాముసు పైకెత్తు"మని సర్జన్ చికాకుతో నన్నాడు,

మరింత పాలిపోయి. జాలిగా జినోచ్కాను చూశాడు, తన లాగు మొనలను పైకెత్తి దిగాలుపడి నిలుచున్నాడు. తోలుపాదాలు స్పష్టంగా కనుపించాయి.

"మమ్మందరినీ యెగతాళిచేయడానికి వచ్చావా ? చెప్పు, నీవల్ల ఎంతోకాలం వృథా పోయింది. పాదాలులేని మనిషి పైమానికదళంలో నేల నూడ్చడానికికూడా పనికిరాడని తెలియదా ?" అన్నాడా సర్జను,

"తెలియకేం ? తెలుసు. కాని తప్పకుండా నేను విమాన మెక్కబోతున్నా" నన్నాడు, నెమ్మదిగా. తలపెట్టిన కార్యమును సాధించితీరే మనిషి వీడు. అన్నట్టు లామాటలు సర్జనుకు వినబడ్డాయి.

"పాదాలు లేకుండానా ? నీకు మతి ఏమన్నా పోయిందా ?" అన్నాడు సర్జన్.

"ఔను, పాదాలు లేకుండానే ఎగురబోతాను." ఇప్పుడు మరింత ఆత్మ విశ్వాసంతో పలికాడు, అలెక్సీ తనపెద్దకోటు జేబులోనుండి, మడతపెట్టిన కాగితము నొకటితీసి, విప్పాడు అదేదో వొక పత్రికనుండి చింపినకాగితం. "దీనిని చూడండి. ఒక్కపాదంతో ఈ మనిషి విమానం నడిపాడు. రెండు పాదాలూ లేకుండానే, నేను విమానం నడిపిస్తాను. నడిపించి తీరుతా" నన్నాడు.

సర్జనా కాగితంలోని విషయాలను శ్రద్ధగా చదివాడు. సగౌరవంగా అలెక్సీని చూసి,

"సరేకానీ, నీవెంతో గొప్ప తరిఫీదు పొందందే ఈ కార్యం సాధించడాని కవకాశము వుండదు. ఈ మనిషి పదేండ్లకాలం తరిఫీదునొందాడు. నీ కృత్రిమ

పాదాలను, నిజమైన పాదాలమాదిరి వుపయోగించటం నీవు నేర్చుకోవాలి." ఇప్పుడా సర్జను మాటల్లో సానుభూతి వ్యక్తమయింది.

తలవని తలంపుగా అలెక్సీ కా సమయంలో జినోచ్కా తోడ్పడింది, రెండు చేతులెత్తి నమస్కారంచేసి, ప్రార్థిస్తూన్నట్టు వొకనిమిషం కూర్చున్నదా జినోచ్కా ముఖమెర్రబారింది, చిరుచెమటపోసింది. తడబడుతూ.

"సైనిక ప్రథమసర్జన్ ! సోదరా ! నీవీమనిషి నృత్యాన్నిచూసి తీరాలి ! రెండుపాదాలున్నవారు కూడా ఇంత గొప్పగా, పసందుగా ఆడలేర"న్నది. "ఎంత ఒట్టుపడితే అంత ఒట్టు."

"నృత్యమా ! నీవేమంటున్నావో నీకే తెలియదనుకొంటా..." నంటూ సర్జన్ తన నలుగురి మిత్రులవంకా - వెటకారంగా చూసాడు.

జినోచ్కా మాటలు అలెక్సీ కెక్కడలేని సంతోషాన్ని కలిగించాయి.

"ఔనూ, కాదంటూ తొందరపడి తీర్మానించకండి ఈరాత్రి మా నృత్యాన్ని చూడటానికిరండి. నాసంగతి అప్పుడుగానీ మీకు తెలియద"న్నాడు.

గది గుమ్మందగ్గిరికి వెడుతోంటే, అలెక్సీకి గోడకుతగిలించిన అద్దంలో, ఆ సంఘం మనుష్య లగుపించారు. తలలు దగ్గిరికి చేర్చి వారందరూ గుక్కత్రిప్పకుండా గుసగుస లాడుతున్నారు.

ఆనాటి సాయంత్రం అడవిలో నొక నిర్జన ప్రదేశంలో తిరుగులాడె అలెక్సీని జినోచ్కా కలుసుకొన్నది. అతను వెళ్ళిపోయ్యాక సంఘంవా రాతనిగురించి చాలా కాలం చర్చించారట. సర్జన్, అలెక్సీ చాలా గట్టివాడిలాగా కనిపిస్తాడు. అట్టి ధృఢనిశ్చయమూ, ఆత్మవిశ్వాసమూ కల మనిషి ఒకవేళ ఎగిరినా ఎగురవచ్చు. చెప్పడానికి వీలులేదు. రష్యనుమనిషి చేయజాలనిదంటూ ఈలోకంలో వొకటిలేదు. ఏమంటారు ?" అన్నాడు. వారిలో వొకాయన ఇంతవరకూ ఇట్టి కార్యాన్ని సాధించినవా రొక్కరుకూడా లేరన్నాడు. దానికా సర్జను వైమానిక శాస్త్రంలో ఇంతకు పూర్వం కనివిని ఎరుగని విషయాల నెన్నిటినో మన వైమానికులు సాధిస్తున్నారనీ, అలెక్సీ కిట్టి కార్యాన్ని సాధించలేడని చెప్పటానికి తమ కెవ్వరికీ అర్హతలేదనీ బదులు పలికాడు.

రెండువందలమంది సైనికులూ, వైమానికులూ, టాంకు దళాలవారూ ఈ ఆరోగ్య భవనంనుండి యుద్ధభూమికి వెళ్ళడానికి నిశ్చయింపబడింది. వారందరి గౌరవార్థమూ బ్రహ్మాండపు "వీడ్కోలు విందూ, నృత్యమూ" ఏర్పాటు చేశారు. మాస్కోనగరంనుండి పేరుపొందిన మిలిటరీ బ్యాండువారు వచ్చారు. వారి బ్యాండు ఈ భవనపు గదులన్నిటినీ నింపి మారుమోగుతోంటే మనుష్యులకు నేలమీద కాళ్లు నిలిచాయికావు. నృత్య మారంభించి, మధ్యలో నిలపటమనేదే లేకుండా నాట్యమాడారు, అలసిపోయి చమట దిగజారింది, కాని నాట్యమును

నిలపటం వారివశం కాకపోయింది. నృత్యం చేస్తూన్న వాళ్ళందరిలోనూ. అలెక్సీ. అతని గురువు, జినోచ్కాకు మించిన జంట వేరొకరు కనిపించలా. అద్వితీయ మైన నృత్యమనిపించింది చూసేవారికి,

కిటికీచెంత మంచుగడ్డ నింపిన బీరులోటాను చేతబట్టుకొని కూర్చొన్న సర్జన్ మిరొవాల్‌స్కీ వారిద్దరినీ రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. ఆయనొక సర్జన్? శస్త్రవిద్యలో ఆరితేరినవాడు, దీనికితోడు సైనికాస్పత్రిలో నుండబట్టి ఎన్నిన్ని రకాల శస్త్రచికిత్సలో చేసాడు. నిజమైన పాదాలకు, కృత్రిమపాదాలకుగల తేడా అతనికి స్పష్టంగా తెలుసు.

అలెక్సీ సాటిలేని నైపుణ్యంతో జినోచ్కాతో నాట్యమాడుతూ, వాయించే బ్యాండుకు తగినట్టు అడుగులిడుతోంటే. సర్జనుకేదీ పాలుపోయిందికాదు. ఇందులో ఏదన్నా తంత్రమో' లేక కిటుకో వున్నదా అనే అనుమానం కలిగింది. చుట్టూ తక్కిన వారంతా గుమిగూడారు, అలెక్సీ జినోచ్కాలిద్దరూ వారిమధ్య "బరిన్యా" నృత్యం చేశారు. ఉద్రేకంతో తొడలనూ. చెక్కిళ్ళనూ. తాళానికనుగుణ్యంగా చరుచుతూ, గిర్రున తిరుగుతూ పైకెగురుతూ వెర్రి ఆనందంతో అలెక్సీ ఆడాడు. ఎర్రబారిన ముఖంనిండా చెమటపట్టింది. సర్జను మిరొవాల్‌స్కీ దగ్గిరికి వచ్చి నిలబడ్డాడు. సర్జను సగౌరవంగా లేచి నిలబడి కరస్పర్శన మొనర్చాడు. అలెక్సీ, ఇప్పుడ యినా నన్ను యుద్ధభూమికి పంపించదవా, నీకు పుణ్యముంటుంది. పంపించ" మట్లాతని కండ్లకేసి చూసాడు.

"ఇదిగో, ఇట్లాచూడు : నిన్ను వుద్యోగంలో నియమించడానికి నాకధికారం లేదు. నేను వుద్యోగశాఖవారికి వ్రాస్తాను. తప్పకుండా నానమ్మతిని తెలుపుతాను. నామాట నమ్ము. సరియైన తరిఫీదును పొందితే నీవు ఎగరటానికి ఎటువంటి ఆటం కమూ వుండదని వ్రాస్తాను. సరా ?" అన్నాడా సర్జన్.

మిరొవాల్‌స్కీ ఈ ఆరోగ్య భవనాధికారితో చేరి గదినుండి వెళ్ళి పోయాడు. ఈయనకూడా చాలా పేరుప్రఖ్యాతులు గల సైనిక సర్జన్. వారిద్దరూ అలెక్సీని మెచ్చుకొంటూ, అతని పట్టుదల కాశ్చర్యపడుతూ వెళ్ళిపోయారు, ఆరాత్రి చాలా ప్రొద్దుపోయే దాకా సిగిరెట్లు కాలుస్తూ మాట్లాడుతూ కూర్చున్నారు, సొవియట్ ప్రజలు తామొక కార్యమును తలపెట్టితే తప్పక దానిని సాధించి తీరుతారనీ. వారికిగల పట్టుదలా, కార్యదీక్షా, ఆత్మవిశ్వాసమూ, ఎంతచెప్పుకొనినా, తనివితీరని సద్గుణాలనీ చెప్పుకున్నారు,

గదిలో నింకా బ్యాండు వాయిస్తున్నారు. నృత్యంచేసేవారి నీడలు గదికిటి కీలనుండి వెలువడి పొడుగ్గా వెలుపలినేలమీద పడుతున్నాయి. గదంతా బహు గలభాగా నున్నది. అలెక్సీ తన గదిని ప్రవేశించి, స్నానాల గదిలోకి వెళ్ళి, తొట్టినిండా చన్నీరునింపి దానిలో తన మొండికాళ్ళ నుంచాడు. నొప్పిని

భరించలేక పెదవులను కొరికాడు. రక్తం కారింది. ఆ తెలుపాదాల అడుగులు ఏర్పడిన వాపులనూ, ఎర్రగాకందిన భాగాలనూ చన్నీటిలో తడుపుతూంటే నొప్పిని పట్టుకోలేక స్పృహతప్పి పడిపోతుందన్నంత భయం వేసింది.

ఒక గంట తరువాత మేజరు స్ట్రిఖొవ్ గదిలోకి వచ్చాడు. స్నానంచేసి, బట్టలు మార్చుకొని, మంచంమీద కూర్చుని తల దువ్వుకొంటూన్న అలెక్సీ కనుపించాడు.

"జినోచ్కా నీ కోసకెంతో వెతుకుతోంది. వెళ్ళిపోయే ముందు దానితో షికారుకు వెళ్ళటం నీ విద్యుక్తధర్మం. పాప మా అమ్మాయినిజూస్తే నాకు జాలి వేస్తుంది" అన్నాడు.

"మన మిద్దరమూ వెళదాము, రా. నాతోరా! పవెల్ ఇవానొవిక్. నాతో వస్తే నీ సొమ్మేదీ పోదులే" అన్నాడు అలెక్సీ.

ఇంత కష్టపడి తనకు నృత్యం నేర్పించి దానంతే యెంతో దనువుచూపిన జినోచ్కాతో వొంటరిగా నుండటానికి అలెక్సీ వెనుదీశాడు. ఓల్గాదగ్గిరనుండి మొన్న వచ్చిన జాబును చూశాక జినోచ్కాను కలుసుకోడానికీ, ఆమెతో మాట్లాడ టానికీ కూడా ధైర్యం చాలిందికాదు. కాబట్టే తనతో రమ్మనమని మేజరు నెంతో బ్రతిమాలాడు. వద్దనలేక మేజరు బయలుదేరాడు.

మేడ వరండాలో పుష్పగుచ్ఛము నొకటి పట్టుకొని జినోచ్కా కనిపెట్టు కొని వున్నది. అచ్చటి నేలమీద ఎక్కడచూసినా పుష్పపత్రాలూ, పూ తొడిమలూ. అలెక్సీ అడుగులు వినబడగానే ఎదురు వెళ్ళటానికి బయలుదేరింది. రెండో మనిషి వుండటం చూసిఅక్కడే నిలబడింది. చూస్తూ వుండగా ఆమె ముఖం వాడి పోయింది.

"రా! అడవిలోకి వెళదాం. ఆఖరి వందనాలర్పించి వెళతాన"న్నాడు అలెక్సీ.

చేతులు జోడించుకొని, నిమ్మవృక్షాలు పెరిగిన దారంటా నడిచివెళ్లారు. చల్లని వెన్నెల వెడుతోంటే వెన్నంటి నడిచేవారి నీడలు నల్లగా వెన్నెలలో కను పించాయి. క్రిందరాలిన ఆకులు, వెదజల్లిన తగరపు బిళ్ళలమాదిరీ వెన్నెలపడి మెరిసాయి. ఆ బాట చివరకెళ్ళి, ప్రక్కనున్న వనంలోకి తిరిగారు. మంచుపడి తడిసిన గడ్డిమీద నడుస్తూ, సరస్సుముఖం పట్టారు. దోమతెరవంటి మంచుతెర సరస్సునంతా కప్పింది. వారి నడుమెత్తుకు కప్పిన మంచుపొగలో వెళ్లేవారిని చూస్తే మేఘాలమీద తేలిపోతున్నారనిపించింది. ఆకురాలుకాలపు పండువాసనలతో గాలినిండి వీచింది. సరస్సునుండి లేచిన మంచుపొగలొక పర్యాయం. చల్లగా, వణుకుపుట్టిస్తూ మరో పర్యాయం వెచ్చగానూ వారిని తాకాయి.

జినోచ్కా చేయి తన మోచేతికి రాచుకొంటోంది. ఆమె మరింత దగ్గరగా తనచెంత నడుస్తూ, గట్టిగా తనచేతిని స్పృశిస్తోంది, అదుముతోంది. అలెక్సీ కేదీ

పాలుబోక. "చూడు ! మేఘమండలంలో నడిచే బ్రహ్మరాక్షసుల మాదిరి మన నీడనీ మంచుపొగపై ఎట్లా పడుతున్నాయో ?" అన్నాడు.

"రాక్షసులుకాదు. బుద్ధిహీనులు. ఈ మాదిరి పాదాలు మంచులో తడిస్తే, తెల్లవారితే బయలుదేరటానికి వీలుండదు. ఏ చలిజ్వరమో తప్పకుండా వస్తుంద"న్నాడు, స్ట్రిఖొవ్. అతని మనో వేదన నాతడనుభవిస్తున్నాడు, ఒంటరిగా. కాబట్టే పై విధంగా చీదరించుకున్నాడు.

"చెరుపులోనే మంచీ వుంటుందంటారు. నా సంగతి చూడు. పాదాలు లేక పోబట్టి మీ మాదిరి జలుబు చేస్తుందనే భయం నాకులేద"న్నాడు అలెక్సీ నవ్వుతూ.

"త్వరగా వెడదాం, ఇంకి సరస్సుపైనంతా మంచు కప్పింది. బలే బాగుంటుంది, చూడటాని"కంటూ జినోచ్కా తొందరపెట్టింది.

కన్ను కనిపించని మంచులోపడి వెళ్ళగా. అకస్మాత్తుగా నల్లటి సరస్సు నీటిలో పడబోయారు. తీరాన పాతినకొయ్యకు కట్టిన చిన్న పడవొకటి కనపించింది. ఎక్కడికో ఆ మంచులోపడి వెళ్ళి జినోచ్కా రెండు తెడ్లను తెచ్చింది. జనోబ్కా, మేజరూ వెనుకప్రక్క కూర్చున్నారు. అలెక్సీ తెడ్లను చేబూనాడు. నీటిపై సునాయాసంగా తేలుకుంటూ పడవ వెళ్ళింది. ఒక్కొకపుడు కన్ను కనపించని మంచులోదూరి వెళ్ళింది. మరొకపుడు నల్లటి నీటిమీద వెండి తీగలమాదిరి చలించే వెన్నెల చాలును వెంబడించింది. ఎవరి ఆలోచనలలో వారున్నారు కాబోలు, మాట్లాడకుండా కూర్చున్నారు వారందరూ, తెడ్లనుండి జారిపడే నీటిబిందువులా వెన్నెల వెలుగులో పాదరసం గుండ్లమాదిరి, బరువుగా, జిగేలు మన్నాయి. ఎక్కడో దూరాన, వినపడీ వినపడనట్లు గుడ్లగూబ వొకటి కూసింది. అంతటా నిశ్శబ్దమూ, శాంతీ.

"ఇదే సమయంలో వేరొకచోట బ్రహ్మాండంగా యుద్ధం సాగుతోందని నమ్మటానికే శక్యంకాకున్నది, ఈ ప్రశాంతమైన ప్రదేశంలో నుండబట్టి. సోదరులారా ! నాకు జాబులు వ్రాస్తారుగా ? అలెక్సీ ! నీవుకూడా వ్రాస్తావని అనుకొంటున్నాను; ఆశిస్తున్నాను, వ్రాస్తావా ? పెద్దపెద్ద జాబులను నేనెదురుచూడటం లేదు. బాగున్నానని రెండుముక్కలు మాత్రంచాలు. నా చిరునామా వ్రాసిన కార్డులు కొన్నింటిని యిస్తాను ఈయమంటావా ? "క్షేమం" అని రెండక్షరాలు వ్రాసి తపాలాపెట్టెలో వేస్తే నీకెంతో పుణ్యముంటుంది .... ఏమంటావు ? .... ఒప్పుకొన్నట్టేనా ?" అని బ్రతిమాలుకొన్నట్టు జినోచ్కా అన్నది.

"ఎప్పుడు వెళ్లిపోదామా అని నాకున్నది, పనీపాటూ లేకుండా కూర్చుని కూర్చునీ మతితప్పిపోయింది, పని చేయాలి, పని ప్రధాన" మన్నాడు మేజర్ స్ట్రిఖొవ్.

తిరిగీ ఎవరిమానాన వారూరకొన్నారు. నీటిలో కోసుకు వెళ్లేపడవచాలు వెండిబాట మాదిరి వెలుగొందింది. నీటి గలగల శబ్దమూ, పడవఅంచులను

మోదే అలల అలజడీ తప్ప తదితర శబ్దాలేవిగానీ వినిపించాయిగావు. మంచుచెదిరి లేచిపోయింది. చంద్రకిరణ మొకటి సరస్సు నీటినితాకి దానిపై తేలే తామరాకు లకూ, పూవులకూ మెరుగుదిద్దింది.

ఈ దృశ్యం కంటబడగానే, ఉండబట్టలేని ఆనందంతో జినోచ్కా. "పాట పాడుదా" మన్నది. వెంటనే అష్ చెట్టుపాటను మొదలుపెట్టింది. మొదటిరెండు పాదాలూ నెమ్మదిగా, దుఃఖం పేరుకొనిన కంఠంతో పాడింది. తరువాత స్ట్రిఖొవ్ గాంభీర్య కంఠంతో అందుకొన్నాడు. ఇంతకు పూర్వ మెప్పుడూ మేజర్ పాడగా అలెక్సీ వినలేదు. ఇంతశ్రావ్యంగా, గాంభీర్యముగా పాడగల డన్న సంగతే ఆతనికి తెలియదు. వారిద్దరి కంఠాలూ చేరి బహు శ్రావ్యంగా వినబడ్డాయి. ఆ పాటయందున్న శోకభావానికి పాడేవారిద్దరూ వినే అలెక్సీకూడా వశులైపోయారు. తమ ఆస్పత్రి కిటికీచెంత పెరిగే అష్‌చెట్టు అలెక్సీకి జ్ఞప్తికి వచ్చింది. ఈ పాటను వొంటరిగా కూర్చొని పాడుకొంటూండగా చూసిన వర్యా జ్ఞప్తికి వచ్చింది. ఈ దృశ్యమంతా వున్నట్టులుండి మాయమైపోయింది. సరస్సూ, వెన్నెలా, పడవా, పాడే తన మిత్రులిద్దరూ అదృశ్యమయ్యారు. ఓల్గా ఇప్పుడాతని కగుపించింది. చిన్నతనంలో తాను కామిషన్‌లో నున్నప్పుడు, పూలగౌను తొడుగు కొన్న ఓల్గాకు బదులు ఇప్పుడాతని కంటబడిన రూపం చాలా మారిపోయింది. అలిసిపోయి, నల్లబడి, చెమటబట్టి, కాయలుకాచిన చేతులూ, మాసిపోయిన పంట్లాము తొడుగుకొని, ఎక్కడో కాలువలు త్రవ్వుతూన్న రూపమగుపించింది.

తెడ్డుల నెత్తి పడవలో పెట్టాడు. ముగ్గురూ కలిసి కడపటి రెండు పాదాలూ పాడారు.

# 6

మరునాడు ప్రొద్దున ఆరోగ్య భవనంనుండి బయలుదేరి వెళ్ళటానికి బస్సు లన్నీ సిద్ధంగా నిలబడ్డాయి. బస్సుద్వారంలో నిలబడిన మేజరు స్ట్రిఖొవ్ గొంతెత్తి అష్‌వృక్షంపాట మొదలుపెట్టాడు. ఇతరబస్సు లందున్న వారందరూ ఈ పాట నందుకొన్నారు. వెళ్ళిపోతున్నా మనే మాటలూ, బుర్నాజియాన్ హాస్యాలూ తీరా బస్సులు బయలుదేరే సమయానికి అలెక్సీ కేదో చెప్పే జినోచ్కా మాటలూ; ఇవన్నీ ఆ పాట అడుగున పడిపోయాయి. ఎంతకాలంక్రితమో జనులు పాడుకొనే వారీ పాటను. దీనిని మరిచిపోయి చాలాకాల మయింది. కాని, ఈ యుద్ధం రావటంతో పాతపాటను నూతనోద్రేకంతో పాడుకొనటానికి జనులు మొదలు పెట్టారు. దీనిని పాడట మొక కొత్త రివాజు అయింది.

వెళ్ళిపోయే బస్సులనుండి పాట వినబడింది. పాట ముగిసింది. ఇంత వరకూ బహు హుషారుగా పాడినవా రందరూ అది ముగియటంతోనే నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు. బస్సులు వెడుతూన్నాయి కాని, యేట్టి శబ్దంగానీ చేయకుండా సిపాయిలూ, వైమానికులూ, అందరూ సద్దణగిపోయారు. పట్టణం పొలిమేరలందున్న కార్మికుల గృహాలూ, యంత్రాగారాలూ కనుపించాయి. వీటి నన్నిటినీ దిగవిడిచి బస్సులు వెళ్లాయి.

కోటుగుండీలు పెట్టుకోకుండా స్ట్రిఖొవ్ బస్సుద్వారంలో నిలబడి దాటిపోయే గ్రామాలనూ, పొలాలనూ, తోటలనూ చూస్తున్నాడు. బలే సరదాగా నున్న దాతనికి. ఎప్పుడూ వొకేచోట పట్టున పది దినాలయినా నుండక, ఊరూరా తిరగడాని కలవాటుపడిన మేజరు కీ ప్రయాణం యెంతో రుచించింది. ఏదో వొక వైమానిక దళానికి తాను వెడుతున్నాడు. అదేదళమయినాసరే ఫరవాలేదు. అదే తన యిల్లూ, వాకిలీగా నుండబోతుంది యికమీదట. అలెక్సీ మాట్లాడకుండా ఆలోచనానిమగ్నుడై కూర్చున్నాడు. అతని కష్టాలింకా తీరలేదు. రానున్న ఆటంకాలను తాను జయించగలడా?.... లేకపోతే, ఇన్ని దినాల ఇంతటి శ్రమా బూడిదలో పోసిన పన్నీరవుతుందా?

బస్సు దిగగానే, వుండేందుకు చోటయినా చూచుకోకుండా, అలెక్సీ తిన్నగా సర్జన్ మిరొవొల్‌స్కీ యింటికి వెళ్ళాడు. అపశకునం. ఆయన వూరిలోలేడు. ఏదో జరూరు పనిమీద విమానంలో ఎక్కడికో వెళ్ళాడు. రావడానికి కొద్ది దినాలు పడుతుంది: తన యడల సానుభూతికలిగి, తనకెంతో తోడ్పడుతాడని ఆశించుకొన్న మనిషి గ్రామాంతరం! అచ్చట నున్న అధికారొకడు అర్జీని పెట్టుకోమన్నాడు, విమానదళంవారికి. అక్కడ కూర్చొని, అప్పటికప్పుడే అర్జీ నొకటి వ్రాసి యిచ్చాడు. తన చేతనయిన సహాయం చేస్తానని చెప్పి, రెండు దినాలతరువాత రమ్మన్నాడు. అలెక్సీ బ్రతిమాలాడాడు, వాదించాడు. చివరికి బెదిరించాడుకూడా. కాని ఎంతమాత్రం లాభం లేకపోయింది. ఆ రెండో మనిషి చేతులను తన గుండె మీద వుంచి, "ఇదిగో, చూడు, నిజం చెబుతున్నాను, నామాట నమ్ము, నిబంధనలు, నిబంధనలే – వాటి నీషణ్మాత్రంకూడా నేను మార్చజాలను" అన్నాడు. అలెక్సీ కాతడు చెప్పేది నిజమని తోచింది. విసుగెత్తి వెళ్ళిపోయాడు.

ఆ ఘడియనుండీ అతని బ్రతుకంతా వొక యుద్ధపుటాఫీసునుండి మరొకదానికి తిరగడంతో సరిపోయింది. ఆస్పత్రినుండి వచ్చేటప్పుడు, తొందరలో మాదు దుస్తులను తెచ్చుకొనటం మరిచిపోయాడు. ఆహారపదార్థాలూ, డబ్బూ, బ్యాంకు డ్రాఫ్టులూ ఎవ్విగానీ తీసుకొనిరాకుండానే వచ్చేశాడు. తాను శలవుమీద నుంటున్నాడనే సర్టిఫికేటు కాగితమునైనా తెచ్చుకోలేదు. అచ్చటి వుద్యోగి, అలెక్సీ పనిచేసిన దళాధికారికి టెలిఫోనుచేసి కావలసిన కాగితాలన్నీ తెప్పిస్తానన్నాడు. అతడెంతో మంచివాడనిపించింది. కాని ఆఫీసులోని కాగితాలు బయట

పడటాని కెన్నియుగాలు గడవాలో ఎవరికీ తెలియదు ? ఆ కాగితాలు వచ్చేదాకా, తాను తలదాచుకొనే జాగాలేక, డబ్బూ, దుగ్గాణీ లేకుండా బ్రతకాలి. తినతిండికి కూడా గతిలేకపోతుంది కాబోలు ! వస్తువుల ధరలెంతో పెరిగాయి. రొట్టీ, చక్కెరా, వీటిధరలు మండిపోతున్నాయి మాస్కోనగరంలో.

ఆస్పత్రిలో పని చేస్తూవున్న అన్యూతాకు టెలిఫోను చేశాడు. పని తొంద రలో నున్నది కాబోలు. సావకాశంగా చల్లగా మాట్లాడిందికాదు. వచ్చి తన గృహంలో నుండమన్నది. తనకెంతో పని వుందట ఇంటికి రావటానికే వీలులేదు. తప్పకవచ్చి ఇంట్లో నుండమన్నది.

ఆరోగ్య భవనంనుండి వచ్చేముందు, ఐదు దినాలకు సరిపడ భోజనపదార్థా లను, డబ్బాలలో బిగించినవాటిని, ప్రతివొక్కడికీ యిచ్చారు. ఆ తరువాత సంగతి తరువాత చూసుకోవచ్చు; ఇప్పటికి తినటాని కేదో వొకటున్నదిగా ? అన్యూతా ఇంట్లో వుండటానికి నిశ్చయించుకొని బయలుదేరాడు. కొత్తగా లేచిన పెద్ద పెద్ద ఇండ్లవెనుకనున్న సందులో జొరబడి, తానింతకుముం దెరిగిన అన్యూతా ఇంటిగడపల నెక్కాడు. పూర్వంమాదిరే కిరసనాయిలు వాసనా, ఎగిరే పావుర ములూ, అన్నీ కనుపించాయి. వరండాలో నడిచివెళ్ళి తలుపు కొట్టాడు.

తలుపు తెరుచుకొన్నది. కాని, రెండు ఇనుపగొలుసులు లోనికి పోనీయ కుండా దారికడ్డంగా కనుపించాయి, పూర్వమాతను చూసిన ముసలామె తలుపు సందునుండి తొంగి చూసింది, అనుమానాస్పదంగా అలెక్సీ నఖశిఖపర్యంతమూ పరీక్షిస్తూ తన ఊరూ, పేరూ అడిగింది. ఏపనిమీద వచ్చాడో ? ఎవరిని చూడ టానికో ? అన్నీ అడిగి తెలుసుకొన్న తరువాత, గొలుసు గలగల లాడింది, తలుపులు తెరుచుకొన్నాయి.

"అన్నాడానిలోవ్నా ఇంట్లోలేదు. నిన్నుగురించి టెలిఫోను చేసింది. లోప లికి రా. ఆమె గది చూపిస్తానంటూ" దారితీసింది, వెళ్లేటప్పు డాతని పై మానిక దుస్తులనూ, బట్టలూ వగైరాలున్న సంచిపీ, చూసింది, బహు పరీక్షగా, "స్నానా నికి వేడినీరు కావాలనుకొంటాను. ఆ వంటయింట్లో అనిచ్చాడి కిరసనాయిలు కుంపటివున్నది. ఇన్ని నీళ్లు కాస్తాను...."

అలెక్సీ ఆగదిని ప్రవేశించాడు. సైనికులందరూ ఎట్టి కొత్తచోటుకు వెళ్లి నప్పటికీ ఇట్టే దానికలవాటు పడతారన్నాడు, స్త్రిఖోవ్. అచ్చటి సామానులూ, బీరువాలూ, బట్టలూ, వాటిలో పెట్టిన కిరసనాయిలు వుండల వాసనా, అన్నీ అలెక్సీ కెంతో ఆకర్షణీయంగా కనుపించాయి, ఎన్నో సంవత్సరాల అనంతరం తన స్వంత యింటికి తిరిగి వచ్చినట్లులనిపించింది.

ఆతనెక్కడికి వెడితే అక్కడికంతా, నీడమాదిరి వెన్నంటి వెడుతూ, ఆముసలిది తెగవాగుతోంది. క్యూలో నిలబడితే ఫలానా అంగడిలో తెల్లరొట్టె ధొరికితే దొరకవచ్చు, అదంతా వొక అదృష్టమని చెప్పాలి. రేషనుకార్డున్న

వారే ఈ అంగడికి వెళ్లటానికి వీలున్నది. లేనివారు నల్లటి రైపిండి రొట్టెలతో తృప్తిపడాలి. రెండుదినాలక్రితం తానొక బస్సులో వెడుతోంటే, పెద్ద సైనికోద్యోగి ఒకాయన స్టాలిన్‌గ్రాడ్ దగ్గర జర్మనులమీద మనవారు గొప్పదెబ్బ తీసారని చెప్పాడు. హిట్లరుకు మితిమీరిన కోపంవచ్చి మతి చలించి దట. ఇప్పుడు తనొక పిచ్చివాళ్ల ఆస్పత్రిలో నుంటున్నాడు. నలుగురిలో తిరిగే మనిషి మాయాహిట్లరు. తన ప్రక్కఇంటామె వొకతె ఎట్లాగో రేషనుకార్డు నొకటి సంపాదించింది. ఆమె కీకార్డున కెట్టి అర్హతగ నీలేదు. పింగాణీ పాలకూజాను, వెంటనే తిరిగి ఇచ్చేస్తానని తీసుకొని వారంరోజులయింది. ఇంకా ఇచ్చిన పాపానపోలేదు. అన్నా డానిలోవ్నా తల్లిదండ్రులు చాలా మంచివారు. పాపం, నలుగురితోపాటు మాస్కో విడిచి పోవలసిన గతి వాటికి పట్టింది, ఇక అన్నా సంగతా? చాలా మంచిపిల్ల. గట్టిగానయినా మాట్లాడదు. కొందరిలాగా ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళి ఎవరె వరితోనో తిరిగేరకంకాదు, ఇంటికెన్నడూ పరాయి మొగవాడిని తీసుకురాలేదింత వరకూ అని చెప్పి, చివరికి :

"సోవియట్ వీరుడు, గొప్ప టాంకు దళాధికారట, ఆమె స్నేహితుడు. ఆ మనిషి నీవేనా?" అన్నది.

"కాదు. నేనొక సాధారణ వైమానికుడ"నని తనలోతానే నవ్వుకొన్నాడు. ముసలమ్మ చూపులో, ఆశ్చర్యమూ, విసుగుదలా, అపనమ్మకమూ, కోపమూ, అనుమానమూ ఒక్కసారి కనుపించాయి.

దభీలుమని తలుపు మూసింది, చెడ్డకోపంతో. వరండాలోకి వెడుతూ, "నీకు వేడినీరు కావాలంటే, అక్కడొక ఆవిరికుంపటి వున్నది. దానిమీద కాచుకో" మంటూ వెళ్ళిపోయింది.

గదంతా ఎక్కడచూసినా ఒకటే దుమ్ము. కిటికీలోనూ, అచ్చటచ్చ టుంచిన కూజాలలోని పూవులన్నీ వాడిపోయాయి. వాటిలో పోసిననీరు చాలా రోజుల క్రితమే ఆవిరయిపోయింది. బల్లమీద బూజుపట్టిన రొట్టెతునకలూ, పొయ్యి మీద అట్లాగే వుంచిన వేడినీటిగిన్నే, అన్యూతా ఇచ్చటికి వచ్చి చాలా రోజులయిం దని స్పష్టంగా సూచిస్తున్నాయి. పియానోమీదపడిన దుమ్ముకు. దానిరంగు పూర్తిగా మూసుకుపోయింది. కిటికీ అంచున పడినదుమ్ము, దట్టంగా పేరుకోబట్టి దాని అడు గుననున్న పురుగొకటి పెకలించుకొని బయట పడటానికి నానా అవస్థలూ పడు తోంది.

అలెక్సీ కిటికీతలుపులు తెరిచాడు. వాటినుండి కాయగూరలు పెరిగే తోట వొకటి కనుపించింది. ఒక్కపెట్టున గాలిలోనికి ప్రవేశించి గదిలోనున్న దుమ్మంతా పైకి లేచింది. గదంతా పొగమంచుమాదిరా దుమ్ము అలముకొన్నది అకస్మాత్తుగా అలెక్సీకొక చక్కని ఆలోచన తట్టింది. గదంతా దుమ్ముదులిపి, ఊడ్చి చక్కబెట్టా లనీ, వీలుచేసుకొని అన్యూతా ఒకవేళ సాయంకాలం వస్తే, బలే తమాషాగా

వుంటుందనీ అనుకొన్నాడు. ముసలమ్మను బ్రతిమాలి వొక బొక్కెనా నేల తుడిచే బ్రష్షూ, ఒక పాతబట్టా తెచ్చుకొన్నాడు. ఒక గంటన్నరకాలం వంచిన నడుము యెత్తకుండా "ఆడవారి పనులంటూ" అపహసించే కార్యంలో నిమగ్నుడై పోయాడు.

తానీ గదికి వచ్చేటపుడు దారిలో నొక వంతెనదగ్గిర పెద్ద ఆస్టర్ పూవుల నమ్మే కొందరు బాలిక లగుపించారు. అప్పటికివెళ్ళి యిన్నిపూవులు కొనితెచ్చి పియానోమీదా, కిటికీలోనూ గల కూజాలలో చక్కగా అమర్చి మెత్తటి సోఫాలో కాళ్ళుజాపి పడుకొన్నాడు. ఎంతో హాయిగా వండుకొని తానుతెచ్చిన పదార్థాలను ప్రక్కగదిలో ముసలమ్మ వండుతూంటే వచ్చే కమ్మటివాసన నాఘ్రాణిస్తూ మైమరచాడు.

అన్యూతా చాలా అలిసిపోయి వచ్చింది. వచ్చీ రావటంతో మంచంమీద వెళ్ళి పడుకొన్నది. ఇంత శ్రమపడి శుభ్రపరచి అలంకరించినగది ఆమె కంట బడిందికాదు. తరువాత నిద్రలేచి ఇంత వేడి టీ త్రాగాకగాని దానినంతా చూచింది కాదు. అలెక్సీ మోచేతిని ఆప్యాయంగా నొక్కి, చిరునవ్వుతో.

"ఇదంతా నీవే చేశావా? గ్రిగొరీకి నీవంటే ఎంతో అభిమాన ముండటంలో ఆశ్చర్యంలేదు....ఎంత బాగున్నది! గ్రిగొరీ దగ్గిరనుండి వుత్తర మేదన్నా వచ్చిందా? ఇంకా యెక్కడో యుద్ధభూమిలోనే వున్నాడు. మొన్న నాకొక జాబు వచ్చింది. రెండే రెండు ముక్కలు వ్రాశాడు. స్టాలిన్‌గ్రాడ్ దగ్గి రెక్కడో వున్నాడు. నీ కీ తమాషా తెలుసా? గడ్డం పెంచుతున్నాడట! గడ్డాలూ, మీసాలూ పెంచే రోజులా యివి? అతడుండేచోటు చాలా ప్రమాదకరమైన దనుకొంటాను నీ వేమంటావు, అలెక్సీ? అపాయమేనా? చెప్పు. స్టాలిన్‌గ్రాడ్‌ను గురించి నలుగురూ చెప్పుకొనేమాటలు వింటే నాకు ఒకటే భయంగానున్నది" అన్నది.

"అక్కడ యుద్ధం జరుగుతోందన్నమాట వాస్తవం".

ఓల్గానదీ తీరాన జరిగే యీ గొప్ప యుద్ధంలో పాల్గొంటూన్న గ్రిగొరీనీ, ఇతరులనూ తలుచుకొంటే అలెక్సీకి తనమీద తనకే అసహ్యంపుట్టింది.

ఆ సాయంత్రమంతా, అవీ, ఇవీ మాట్లాడుకొంటూ కాలం గడిపారు. తరువాత డబ్బా మాంసం నుపయోగించి ముసలామె తయారుచేసిన భోజనమును ముగించారు. రెండో గదినిండా చిల్లరసామానులుపేర్చి తలుపులు తాళ్ళంవేయబట్టి, ఇద్దరూ వొకేగదిలో పడుకోవలసి వచ్చింది. అన్యూతా మంచంమీదా, అలెక్సీ సోఫాలోనూ పడుకొన్నారు. తలవాల్చారోలేదో, ఇట్టే నిద్రపట్టింది.

అలెక్సీ లేచి కూర్చున్నాడు. కిటికీలోనుండి సూర్యకిరణాలు అన్యూతా పడుకొనిన మంచంమీద పడుతున్నాయి. ఆమె మంచంమీదలేదు. ఎప్పుడో వెళ్ళి పోయింది. మంచం దిండుకొక చీటీ గ్రుచ్చింది, అన్యూతా."ఆస్పత్రికి వెళ్ళిపోవాలి. ఇంకా కొంచెం ముందుగా నిద్రలేస్తే బాగుండేది. బల్లమీద టీ తయారుచేసి పెట్టాను.

అలమారులో రొట్టెవున్నది. చక్కెరలేదు. తిరిగీ శనివారం వరకూ రావటానికి వీలుండదు — అ." అని వ్రాసిపెట్టిందా కాగితంమీద.

అలెక్సీ ఈ రోజులలో ఇంటినుండి బయటికి తరుచుగా వెళ్ళలా. ఇంట్లోనే వుండి, ఏదోవొక పని కల్పించుకొన్నాడు. ముసలామె యొక్క ప్రిమస్ ఆవిరి స్టవ్‌నూ. కిరసనాయిలు స్టవ్‌నూ, విద్యుత్ మీటలనూ బాగుచేసాడు. పాతబడిన కాఫీపొడి యంత్రమును మరమ్మతుచేసి యిచ్చాడు. ముసలామెకూ ఆమె మొగుడికీ ఇతనితో మంచిస్నేహ మేర్పడింది.ముసలామె మొగుడికి గృహనిర్మాణ సంఘంలో ఒక వుద్యోగం. అతడు వైమానిక అగ్ని నివారణ దళంలోచేరి తరుచుగా పని చేస్తాడు. ఇందువల్ల అప్పుడపుడు రోజులతరబడి ఇంటికేరాడు. అలెక్సీతో పరిచయ మేర్పడటంవల్ల టాంకు దళంవారి మాదిరే, వైమానికులుకూడా చాలా మంచివారనే వుద్దేశం కలిగింది. కాలమంతా ఆకాశమార్గాన గడిపినా, ఇల్లూ, వాకిలీ, పెళ్ళామూ బిడ్డలూ అంటే అపేక్షకల వారేననికూడా తీర్మానించుకున్నారు.

తన వుద్యోగవిషయమై వైమాని కాఫీసువారిని చూడవలసినరోజు వచ్చింది. క్రితం రాత్రిఅంతా సోఫాపై పడుకొని. కన్ను మూసాడుకాడు. తెల్లవారితే తన భావి జీవిత విధానం యావత్తూ నిశ్చయింప బడుతుంది.

తెల్లవారుజామునే లేచి, క్షౌరం చేసుకొని, స్నానం చేసాడు. చెప్పబడిన సమయానికి సరిగ్గా ఆఫీసులో హాజరయ్యాడు. ఆఫీసుగదిలోకి వెళ్లగానే మేనేజరు కనుపించాడు. చూడటంతోనే అతనిమీద అయిష్టం కలిగింది. అలెక్సీ వచ్చి నిల బడిన సంగతే తెలియనట్టు వంచిన తల ఎత్తలా. బల్లమీది కాగితాలను చదివాడు, కొన్నిటిమీద సంతకాలు పెట్టాడు, ఎవరెవరితోనో టెలిఫోనులో మాట్లాడాడు. ప్రక్కన కూర్చొనిన గుమాస్తాతో కాగితాలన్నిటినీ, నంబరు ప్రకారం ఏవిధంగా ఏర్పాటుచేయాలో, ఎట్లా సర్దిపెట్టాలో చెప్పి పెద్దవుపన్యాసం దంచాడు. తరువాత లేచి వెళ్ళిపోయాడు, ఎక్కడికో. చాలా సేపయ్యాకగానీ తిరిగి రాలా. అలెక్సీ కా మనిషి అంటే చెడ్డరోత పుట్టింది. అతని కోలముఖమూ, పొడుగు ముక్కూ నున్నగా క్షౌరంచేసిన చెంపలూ, నిర్లక్ష్యాన్ని వ్యక్తపరిచే పెదవులూ, చిన్ననుదురూ దానిపైన వొక్క వెంట్రుకయినా మొలవక, కోడిగ్రుడ్డువంటి తలా ; తెగ అసహ్య మనిపించింది. ఆ మేజరు తిరిగివచ్చి కుర్చీలో కుదిమట్టంగా కూర్చొని, పాతతేదీ కాగితాన్ని చింపి, అటుమీదటే అలెక్సీ వంక కన్నెత్తి చూసాడు.

"నన్ను చూడాలని వచ్చావా, లెఫ్టినెంట్ సోదరా ?" అన్నాడు. ఆ ప్రశ్నలో తనంటి మనిషి వేరొకడులేడన్న అహంభావం అలెక్సీకి కనబడింది.

అలెక్సీ తాను వచ్చిన పనిని చెప్పాడు. గుమాస్తా నాతని కాగితాలను తెమ్మని పంపించి, కాళ్ళు బారజాపి కూర్చొని, పళ్ళుకుట్టుకోటం మొదలుపెట్టాడు. కాని, ఇతరుల కది కనబడరాదని కాబోలు చేతిని మరుగుపెట్టాడు. కాగితాలు వచ్చాక అలెక్సీని గురించి వ్రాసిన విషయాలను చదువుకొనటం మొదలుపెట్టాడు.

ఉన్నట్టుండి అచ్చటనున్న కుర్చీని చూపి అలెక్సీని కూర్చో మన్నాడు. పాదాలు లేవనే మాటయు, ఒకసారి, అప్పుడే కనిపించాయి కాబోలు. అంతా పూర్తిగా చదివాక.

"బాగున్నది. నన్నేమి చేయమంటావు ?" అని అడిగాడు.

"యుద్ధ వైమానికదళంలో నాకు వుద్యోగం కావాలి."

కుర్చీలో, వెనుకకు జరిగి కూర్చొని అలెక్సీని చూశాడు. ఆతడింకా నిలబడే వున్నాడు తానే వొక కుర్చీని బల్లదగ్గిరికిలాగి, దానిలో కూర్చోమన్నాడు.

"నీవు విమానమును నడిపించలేవుగా ?" అన్నాడు.

"నడిపించగలను. నడిపిస్తాను. వైమానికతరిఫీదు కళాశాలకు నన్ను పంపించండి. వారిని నన్ను పరీక్షించి చూడమనండి" అన్నాడు. తనమాట కెవ్వరూ అడ్డం చెప్పరాదన్నట్టూ, తన శక్తిసామర్థ్యాలను గురించి తనకు పూర్తిగా తెలుసునన్నట్టూ బిగ్గరగానూ, నిర్మొ ఖమాటంగానూ మాట్లాడే అలెక్సీ మాటలు వినబడి, ఆ గదిలో పనిచేస్తూన్నవారు, ఎవరీమనిషి ? అన్నట్టు చూశారు.

తనకెదుట నిలబడిన మనిషి అద్వితీయమైన ఆత్మవిశ్వాసం కలవాడయినా కావాలి. లేదా, పిచ్చివాడన్నా అయి వుంటాడని మేజర్ అనుకొన్నాడు. అలెక్సీ ముఖంలో కనుపించే ఆవేశమూ, ఒంతనిప్పుల్లాంటి కండ్లూ చూసి, వీలయినంత శాంతంగా, మేజరు :

"ఇదిగో, ఇట్లా చూడు. నే చెప్పేమాటలు ఆలకించు. పాదాలు లేకుండా విమానమును నడపటం ఎట్లా వీలవుతుందో చెప్పు ? వీలవుతుందని నీవన్నప్పటికీ. నీమాటలు నమ్మేదెవరు ? ఎవరు విమానము నిస్తారు. నీచేతికి ? అర్థంలేనిమాటలు. ఇంతకుముందెవ్వరూ ఇట్టిపనికి పూనుకోలేదు."

"ఇంతకుముందు చేయలేకంటున్నారా ? అయితే కావచ్చు. నేను చేయబోతున్నాను" తన జేబులో నున్న పుస్తకం తెరిచి అందులో దాచిపెట్టిన కాగితమును తీశాడు. దానిని మేజరు బల్లమీద పరిచి చదవమన్నాడు, ఇతర బల్లలదగ్గిర పనిచేసేవా రందరూ తమ తమ పనుయి మానుకొని అలెక్సీని చూస్తూ కూర్చున్నారు. ఏదో పనివున్నదనే మిషమీద వొకాయన మేజరు బల్లచెంతకు వచ్చి, చొప్పదంటు ప్రశ్న నేదో వొకటి వేసి. ఆ కాగితంలో నే మున్నదోనని చూసి వెళ్లాడు, మేజరు దాని నంతా చదివాక :

"ఇదంతా బాగున్నది. కాని దీనితో నా కెట్టి సంబంధమూ లేదు. ఇదేదో పత్రికలో ప్రచురించిన విషయం, వైమానికుల నెన్నుకొనటంలో గమనించవలసిన విషయాలూ, నిబంధనలూ చాలా కఠోరమైనవని నీకు తెలుసు. రెండు పాదాలు కాదు. రెండు వ్రేళ్లమాత్రమే లేకపోయినా విమానం నడపడానికి వొప్పుకోవు నిబంధనలు. ఈ కాగితమునుతీసి భద్రపరుచుకో, ఇట్లా అంటున్నానని వేరే విధంగా అనుకోకు. నీ మనోనిశ్చయమూ, ఆవేశమూ చాలా మెచ్చుకోతగిన...."

అలెక్సీ కోపోద్దీపితు డై పోయాడు. బల్లపైనున్న సిరాబుడ్డి నెత్తి ఆ మనిషి బట్టతలమీద పగిలేటట్టు కొట్టాలనిపించింది. తడబడే మాటలతో :

"దీనినిగురించి ఏమంటావు ?" అంటూ సర్జన్ మిరొవాల్‌స్కీ యిచ్చిన యోగ్యతాపత్రము నతకి చూపించాడు. విమాన వైద్యశాఖ పేపుగల కాగితంమీద వ్రాసిన ఈ పత్రంమీద వైమానశాఖాధికారు లందరూ గౌరవించే మనిషి సర్జన్ మిరొవాల్‌స్కీ సంతకమున్నది. ఇది చూడటంతోటే మేజరుతత్వం మారింది. దానిని చదివాక స్నేహపురస్కారంగా మాట్లాడొడగాడు. తన యెదుట నిలబడిన మనిషి పిచ్చివాడుకాడు. ఏకాగ్రతా, దృఢమైన మనస్సూ, అద్వితీయమైన వుత్సాహమూ గల దిట్టరి. సర్జనంతటి మనిషే ఇతను తాను తలపెట్టిన కార్యమును సాధించి తీరుతాడనే నమ్మకం తనకు కలదనివ్రాసాడు. కాని, మేనేజర్,

"నీకెంతో సహాయం చేయాలని వున్నది. కాని ఇది నాకు మించినకార్యం, వైద్యశాఖాధికారి తనకు తోచినట్టు వ్రాయవచ్చు. కాని, మేము పాటించవలసిన నిబంధనలు మా చేతులకు సంకెళ్ళవంటివి. వాటికి వ్యతిరేకించి వర్తిస్తే. ఏదన్నా ప్రమాదం జరిగిందనుకో. దానికి జవాబుదారీ సర్జన్ మిరొవాల్‌స్కీ వుంటాడా ?" అన్నాడు.

అలెక్సీ హృదయంలో కోపాగ్ని వేయిశిఖలతో ప్రజ్వరిల్లింది. ఎదుట కూర్చున్నమనిషిని చూస్తే చెడ్డరోత పుట్టింది. బాగా తినిబలిసి, ఎందుకూ కొరగాని ఆత్మవిశ్వాసమూ, తియ్యగా మాట్లాడుతూ గొయ్యి త్రవ్వే ఆ ముఖము చూస్తే ఒళ్లుమండింది. అట్టముక్కమాదిరి బిగుతుగా ఇస్త్రీచేసిన కోటూ. కోతికి మాదిరి వెంట్రుకలు పెరిగిన చేతులూ, అంటకత్తిరించిన అందవికారమైన చేతిగోళ్లూ ఒకటేమిటి, అన్నివిధాలా అతనంటే రోతపుట్టింది. అలెక్సీకి, ఇతని కేవిధంగా నచ్చచెప్పాలి ? ఎంతచెప్పినా గ్రహించే శక్తి వున్నట్టు కనుపించదు, వైమానిక దళాఫీసులో నున్నంత మాత్రాన అంతా తనకే తెలుసుననుకొంటున్నాడు, విమాన యుద్ధమంటే ఏమిటో తెలుసా, ఈ మనిషికి ? తన జీవితంలో ఒక్కపర్యాయమైనా తుపాకీ ప్రేలుడు శబ్దంవిన్నాడో, లేదో ? కోపాన్నీ, అసహ్యతనూ దిగ మ్రింగి నెమ్మదిగా :

"ఐతే నన్నేమి చేయమంటావు ? అన్నాడు, అలెక్సీ.

భుజాలెగురవేసి, "నీవు పట్టుబట్టితే నేను కాదనలేను, కావాలంటే వైమానిక యుద్ధ కేంద్ర సంఘంవారిని వెళ్లి చూడటానికి ఏర్పాటుచేస్తాను. కాని, ముందుగానే చెబుతున్నాను, ఎంతమాత్రమూ ప్రయోజనముండదు" అని చప్పరించాడు.

"మీరూ, మీ ఆఫీసులూ !....సరే, వెడతా"నని నిలుచోలేక కుర్చీలో కూలబడ్డాడు.

ఆనాటినుండీ అలెక్సీ ఆఫీసునుండి ఆఫీసుకి, పాదాలు అరిగేటట్టు తిరగటం ప్రారంభమయింది. ఒక్కొక్క వుద్యోగస్థుడికీ తన గొడవంతా చెప్పుకొనటమూ,

వారదంతా విన్నాకయెంతో సానుభూతిచూపడమూ, తుదకు తమకు వ్యక్తిగతంగా వీలయినంతగా తోడ్పడాలని వున్నప్పటికీ యుద్ధనిబంధనలను మీరడాని కెట్టి హక్కూ లేదనీ. ఆ నిబంధనలను పాటించకపోతే దేశానికీ, వ్యక్తికీ కూడా ముప్పు వాటిల్లుతుందనీ చావుకబురు చల్లగా చెప్పారు. ఒక గదినుండి మరో గదికీ, ఒక ఆఫీసునుండి మరొకదానికీ ఈ విధంగా పాడించేపాడరా పాచిపండ్ల దాసరీ అన్నట్టు. చెప్పిందే చెబుతూ ఎంతగా తిరిగాడో ఆ దేవుడికే తెలియాలి.

ఇంతకుపూర్వం ఎవ రేమాత్రం త న్నవమానించినా సహించేవాడుకాడు. అట్టి అలెక్సీ అవమానానికీ, అపనమ్మకానికీ, ఎందుకూ కొరగాని సానుభూతికీ, తిరస్కారానికీ అలవాటుపడ్డాడు. తన కోపాన్ని దిగమ్రింగటం నేర్చుకొన్నాడు. దీనంగా ప్రతిమాలినట్టు మాట్లాడటం అలవడింది. ఒక్కరోజులో ముగ్గుర్నీ నలుగురినీ చూసి వారందరూ తనకెట్టి సహాయంగానీ చేయలేకపోయినప్పటికీ నిరుత్సాహ పడ్డాడుకాడు; నిరాశచెందలా పత్రికలో నుండి కత్తిరించిన కాగితమూ, సర్జను తన కిచ్చిన యోగ్యతాపత్రమూ మాసిపోయాయి. మడతలుపెట్టిన చోట చినిగాయి, వాటికి కాగితమంటించి, ముక్కలు ముక్కలుగా పడిపోకుండా నిల బెట్టుకొన్నాడు.

పై విధంగా రోజులు గడిచాయి. ఆరోగ్యభవనం వారిచ్చిన ఆహారపదార్థా లన్నీ వుపయోగించేసాడు. ఇంతవరకూ ఎటువంటి యేర్పాటుకానీ, అతని ఖర్చు లకు డబ్బు యివ్వటమును గురించి పై అధికారులు చేయనందువల్ల తిండికి బహు తిప్పలు పడవలసి వచ్చింది. అలెక్సీ తన గదిలో ఎటువంటివంటా చేసుకొనక పోవటంచూసిన ముసలావిడా, ఆమె మొగుడూ, జాలిపడి, తమ యింటికి భోజ నానికి రమ్మని పిలవటం మొదలుపెట్టారు, వారి బ్రతుకే ఎంతో కనాకష్టంగా నున్నవుడు తానుకూడా వారిమీద ఆధారపడటం అలెక్సీ కెంతో కష్టమని తోచింది. ఇంటిచెంతనున్న చిన్న కూరగాయల తోటలో పండే ఒక్కొక ఉల్లిపాయనూ, కారట్టు దుంపనూ బంగారంమాదిరి చూసుకొని, కనిపెట్టుకు తింటున్నారని అలెక్సీ గ్రహించాడు. తనవల్ల వారికి కష్టం కలగరాదని వైమానికోద్యోగుల భోజన శాలలో తింటున్నానని అబద్ధమాడాడు. దీనివల్ల ఆకలితో రోజులు గడపవలసి వచ్చింది.

అది శనివారం. అన్యూతా సెలవుమీద ఇంటికి వచ్చేరోజు. ప్రతిరోజూ సాయంకాలమపుడు, ఆనాటి తన ప్రయత్నాలను గురించీ. అవన్నీ తిరిగి ఏవిధంగా విఫలమైనదీ ఆమెకు టెలిఫోను చేసాడు. వేరొకమార్గం గోచరించక, ఇంతవరకూ భద్రపరిచిన వెండిసిగిరెట్టు పెట్టెను అమ్మజూపాడు, తనతండ్రి వివాహసమయంలో స్నేహితు లాశీర్వదిస్తూ దీనిని అతనికిచ్చారు. దానిమూతపైన నల్లటి పింగాణీ పొదిగిన మూడు పరుగులెత్తే గుర్రాలు చిత్రింపబడ్డాయి. తాను యుద్ధభూమికిబయలు దేరేటప్పు డాతనితల్లి ఈ సిగిరెట్టుపెట్టెను సంచిలో పెట్టి ఇచ్చింది. దీని నెల్లప్పుడూ

తనజేబులో నుంచుకొనేవాడు. విమానంలో ఎగిరేటప్పుడిది తన్నపాయాలనుండి రక్షిస్తుందనీ, తండ్రి జ్ఞాపకార్థ మిదెప్పుడూ తనచెంత నుంచుకోమనీ అతని తల్లి మరీ మరీ చెప్పింది. కాని. గత్యంతరంలేక దాని నమ్మివేశాడు. వచ్చిన డబ్బుతో ఇంత మాంసమూ, రొట్టి, బంగాళాదుంపలూ, మార్జరీనువంటి వెన్నపదార్థమూ, కొన్ని పార్సిలీఆకులూ కొన్నాడు, వీటిని చేతబట్టుకొని 'ఇంటికి' బయలుదేరాడు.

వాటి నన్నిటినీ బల్లమీద పరిచినతరువాత ముసలమ్మను పిలిచాడు. "అక్కడ వారు పెట్టే భోజనం నాకేమీ బాగాలేదు, ఇకమీదట కావలసిన వస్తువులను కొనుక్కొని స్వయంపాకం ప్రారంభించడానికి నిశ్చయించాన"ని చెప్పాడు.

ఆ మధ్యాహ్నం అన్యూతా వచ్చింది. రాజాధిరాజులకు పెట్టే పదార్థాలుకూడా ఇంత రుచిగా నుండవనిపించిందామెకు. ఉర్లగడ్డలూ. మాంసము వేసిన పులుసు చేశాడు. దానిలో పచ్చని పార్సిలీఆకులూ, తొడిమలూ తేలుతున్నాయి.ఉల్లిపాయలు, మాంసం, వేపుడుకూర. క్రాన్‌బెర్రీపండ్ల జామ్, బంగాళాదుంపలను కొన్నింటిని నీటిలో వుడకబెట్టి. చితిపి, ముసలామె ఈ జామ్‌ను తయారుచేసింది. జామ్ ఒక విధమైన మురబ్బా అన్యూతా అలిసి, పాలిపోయి ఇంటికివచ్చింది. కాళ్లూ, చేతులూ. ముఖమూ కడుగుకోడానికికూడా ఓపిక లేకపోయింది. ఎట్లాగో కడుగుకొని రెండు మెతుకులు తిన్నది. ఇంతలోకే నిద్ర తోసుకువచ్చి ప్రక్కనున్న సోఫాలో ఒరిగి నిద్రపోయింది. జామును తాకనేలేదు. జాము గట్టిపడడానికి కొళాయి అడుగున పెట్టిన జాముపాత్ర పెట్టినట్టే వుండిపోయింది.

నిద్రలేచి చూస్తే చీకటి పడబోతోంది. గదిలోని సామానులన్నీ చక్కగా సర్దబడివున్నాయి. నడుమనున్న మేజాచెంత, దాని పైనున్న దీపంవెలుతురులో, కుర్చీలో కూర్చున్న అలెక్సీ అగుపించాడు. తలను రెండు చేతులతో పట్టి, చితికి పోయేటట్టు అదుముకున్నాడు. అతని ముఖం కనిపించపోయినప్పటికీ ఆ కూర్చున్న తీరునుబట్టి ఆతడెంతో అధైర్యపడినట్టూ, దిగులొందినట్టూ ఆమెకు తోచింది. ఇంతటి మనిషి, ఇంత బలశాలి ఈ విధంగా బేలపడిపోవటం తలుచుకొంటే ఆమె కెంతో జాలివేసింది. ఏడుపు వచ్చింది. చడీ, చప్పుడూ చేయకుండా వెనుకప్రక్కగా వెళ్ళి ఆతని తలను తన వక్షానికి, బిడ్డతలను అదుముకొన్నట్లు, హత్తుకొని, కారు మేఘంవంటి నల్లటి జుత్తులో వ్రేళ్లు చొప్పించి ఎంతో సున్నితంగా దువ్వింది. తల ఎత్తి చూడకుండానే ఆ చేతినిపట్టుకొని. ముద్దు పెట్టుకున్నాడు. నవ్వుతూ లేచి నిల బడి ఆమెను చూస్తూ.

"క్రాన్‌బెర్రీజామ్ తాకనన్నా తాకలేదు. బలేమంచిదానివే, బిగవటానికి కొళాయిక్రింద పెట్టి, నీకిద్దామని కనిపెట్టుకొని నేనుంటే, పోయిపడుకొని నిద్ర పోయావు! ఎంత పేరుపొందిన వంటమనిషికయినా, తానుచేసినది ఇతరులు తినక పోతే ఎంత చిన్నతనమనిపిస్తుందో, నీకు తెలియనిసంగతా?"

ఇద్దరూ కుర్చీలను బల్లదగ్గిరికి లాగుకొని, చెరొక పళ్లెము జామూ తిన్నారు.

ఈ "ఒకటోరకం" ముచ్చటా పుల్లిగా, వెగటుగా నున్నప్పటికీ దానిని గురించి పల్లెత్తుమాటయినా అనలా. ఎన్నెన్నో విషయాలు చర్చించారు. కాని, ఏదో ఒట్టుపెట్టుకొన్నట్టు రెండు విషయాలను గురించిమాత్రం వాటిపేరన్నా ఎత్తలా. ఈ రెండువిషయాలూ గ్రిగోరీ పోటీ, అలెక్సీ రెండోదీ. తరువాత ఎవ రెవరి స్థానాల్లో వారు పడుకోటానికి సిద్ధమయ్యారు, అలెక్సీ పాదాల శబ్దం ఆగిపోయాక, అన్యూతా గదిలోని దీపమార్పి, బట్టలు మార్చుకొని తన మంచంలో పడుకొన్నది. అంతటా నిశ్శబ్దమూ, చీకటీ. కాని అలెక్సీ పడుకొన్న సోఫా అదపా తడపా కిర్రు కిర్రుమనటం వినబడుతోంది. నిద్రపట్టక అటూ ఇటూ పొత్తిగిలుతున్నాడని అన్యూతా గ్రహించింది చివరికి.

"నిద్రపట్టటంలేదా, అలెక్సీ?" అన్నది.

"లేదు."

"ఆలోచిస్తున్నావా?"

"ఔను. నీవో?"

"నేనూ అదేపని చేస్తున్నాను."

తిరిగి నిశ్శబ్దం. వీథిలో మలుపుతిరిగిన ట్రాముబండి క్రీచుమన్నది. దాని చక్రంనుండి లేచిన విద్యుత్ వెలుగొక్క నిమిష మాగదిలో మెరిసింది. ఒకరి నొకరా వెలుగులో చూసుకొన్నారు. ఇద్దరూ నిద్రపట్టక గుడ్లగూబల్లాగా కండ్లు తెరుచుకొని పడుకొన్నారు.

అలెక్సీ తన ప్రయత్నాలూ, అ వేవిధంగా విఫలమైనదీ వచ్చినతరువాత ఆమెతో ఇసుమంతయినా చెప్పాడుకాదు. కాని, అతడెంతో దిగులొందిపోయాడనే విషయమును యిట్టే కనిపెట్టేసింది. అతనిమీద యెంతో జాలికలిగింది. ఓదార్చాలని మనస్సు తహతహలాడింది. కాని అలెక్సీవంటి ఆత్మవిశ్వాసంకల మనిషి ఇతరు లేమాత్రం సానుభూతిచూపినా "అయ్యో! పాప" మంటూ మాట్లాడినా చాలా సిగ్గుపడిపోతాడు. తన్నవమానపరిచిన ట్లనుకొంటాడు. ఇదంతా తెలిసి అన్యూతా బలవంతాన నోరు విప్పిందికాదు.

అలెక్సీ వెల్లకిలా జోడించిన చేతులమీద తల నానించి పడుకొనిచూస్తూ తనకంత దూరంలో పడుకొనిన యువతి, తన స్నేహితుని అదృష్టంకొద్దీ అతనికి ప్రేయసిగా నుండబోయే అన్యూతానుగురించి ఆలోచిస్తున్నాడు, తలుచుకొంటే తా నిప్పు డామె ననుభవించి కామతృష్ణను తీర్చుకోడానికి వీలున్నది. నాలు గడుగులు నడిచివెడితేచాలు తా నామెను పొంది అనుభవించడాని కింతకంటే మంచి అవకాశం చిక్కదు, నలుగురు స్త్రీలలో అన్యూతాకూడా ఒక్కర్తె! అంతకంటే ఆమెయం దెట్టి విశిష్టతగానీ లేదు, కాని. ఆమె విషయంలో అలెక్సీకి తన స్వంత

చెల్లెలనే భావం యేర్పడ్డది. వేరొకవిధంగా తా నామెను తిలకించట మాతనికి చేతనయిందికాదు. తన మనస్సులోని యిప్పటి వుద్దేశాలను మేజర్ స్ట్రిఖొవ్‌తో చెబితే, "పోరా, వెర్రిఘటమా!" అని తప్పక అపహసిస్తాడు కాబోలు! లేకపోతే ఒకవేళ ఇప్పు డాతని వుద్దేశాలు మారివుండవచ్చు. ఎవరు చెప్పగలరు?.... అన్యూతా ఎంత మంచి స్త్రీ! పాపం, ఎంత అలిసిపోయిందోగదా! తన పనంటే ఎంత యిష్టం! ఎంత పట్టుదల!

"అలెక్సీ!" అన్యూతా వినిపించీ, వినపడనట్టు పిలిచింది.

అతను పడుకొనిన సోఫానుండి. గురక అస్పష్టంగా వినిపించింది. అలెక్సీ నిద్రపోతున్నాడు. అన్యూతా నెమ్మదిగా అతనిచెంతకు నడిచివెళ్ళి, తలగడను సర్ది. కప్పుకొనిన కంబళీని ఒంటినిండా కప్పింది, చిన్నబిడ్డకు కప్పేటట్టు.

# 7

వచ్చి కలుసుకోమని వైమానికదళపు టాఫీసునుండి అలెక్సీకి కబురు వచ్చింది. సైనికదళ సర్జన్ వెళ్ళినపని ముగించుకొని తిరిగివచ్చాడు. రాగానే అలెక్సీ నాయన గుర్తించి, లేచి నిలబడి రమ్మనమన్నాడు, ఎంతో సగౌరవంగా.

"నిన్ను దళంలో చేర్చుకోమని అన్నారా? అవును, ఇది అంత తేలికయిన పనికాదు. నిబంధనల నతిక్రమిస్తేనేకాని నిన్ను చేర్చుకోడానికి వీలులేదు ఇదంత సులభంకాద"న్నాడు సానుభూతితో.

అలెక్సీని తిరిగి పరీక్షించి, ప్రశ్నించటం మానుకొని సర్జన్ అతని కాగితం మీద, ఎర్రసిరాతో ఈవిధంగా వ్రాసాడు. "ఈమనిషిని విమాన కళాశాలకు తరిఫీదుకు పంపించవచ్చునని నా నమ్మకం. ఇతను తలపెట్టిన కార్యమును సాధించ గలడని నాకు పూర్తివిశ్వాసమున్నది" ఈకాగితం చేతపట్టుకొని పై ఆఫీసుకు అలెక్సీ వెళ్ళాడు. అచ్చటి జనరలును చూడనిచ్చారుకారు. అలెక్సీకు ఒళ్లు మండి పోయింది; నలుగురినీ తిట్టి పారేయాలని అనుకొన్నాడు. జనరల్ క్రింద పనిచేసే పెద్దగుమాస్తా, కాప్టెనొకాయన, చటుక్కున ఇది గ్రహించి, వచ్చి కూర్చోమని కుర్చీని తన బల్లదగ్గిరికి లాగాడు. నల్లని పొట్టిమీసంగల ఈ కాప్టెను తన్నీవిధంగా వచ్చి కూర్చోమనటంవల్ల అలెక్సీ కోపం చల్లారింది. అతనిచెంత కూర్చుండి తన కథను యావత్తూ పూసగ్రుచ్చినట్లాతనికి వినిపించాడు. మధ్యమధ్య టెలిఫోనులో మాట్లాడటమూ, పదేపదే జనరలున్నగదికి వెళ్ళటమూ జరిగినప్పటికీ, తిరిగిరాగానే, కుర్చీలోకూర్చుని, అలెక్సీ చెప్పేదానినంతా ఎంతో శ్రద్ధతో విన్నాడు. అతనికీ అలెక్సీమీద జాలిపుట్టింది.

"ఊ, తరువాత ?" అంటూ అలెక్సీనడిగి, "నిజంగా జరిగిందా ? విచిత్రం : గొప్ప విచిత్ర" మంటూ అలెక్సీని మెచ్చుకుంటూ, చిన్నపిల్లవాడిమాదిరి ఆదుర్దాగా అతను చెప్పేదంతా విన్నాడు.

అలెక్సీ తాను ఆఫీసునుండి ఆఫీసుకు, పాదాలు అరిగిపోయేటట్టు తిరగటమును గురించి చెప్పినపుడు:

"రాక్షసముండాకొడుకులు ! నీ వంటివాడినావిధంగా కష్టపెట్టటం పెద్ద పాపం ! నీ వొక విచిత్ర...ఆ మరి....ఎట్లాచెప్పాలో నాకు తెలియకున్నది.... అద్వితీయమైన మనిషివి !....నీకు నీవేసాటి ..కాని వారు మాత్రం ఏమిచేయగలరు? పాదాలు లేనివారు విమానాలెగురవేయరుగా ?"

"ఎందు కెగురవేయరు ?...ఇదిగో దీనినిచూడు...." వార్తాపత్రిక నాతనికి చూపాడు, సర్జన్ వ్రాసియిచ్చిన కాగితమునుకూడా అతనికి చదవటానికిచ్చాడు.

"నాకీ వొక్కటే వొక్క విషయం బోధపడకున్నది, ఎన్ని విధాల ఆలో చించినా, పాదాలులేని నీవు విమానదళంలో చేరడానికి వీలున్నదా ? నీ ఆవేశమునూ, పట్టుదలనూ చూస్తే, నీవంటి వారిలోకంలో ఏ కొద్దిమందో మాత్రం వుంటారని చెప్పవచ్చు. పాదాలు లేనివాడు నృత్యం చేసినట్టు లంటారు ," అన్నాడు.

వేరెవరన్నా ఈవిధంగా మాట్లాడితే అలెక్సీకు పట్టరానంతకోపం వచ్చి వుండేది. నానామాటలు అని అతనితో పెద్ద యుద్ధం జరిగేది. కాని ఈ మనిషి సంగతి వేరు.

"నృత్యమా ? పాదాలు లేనివాడు నృత్యం చేయజాలడని గదా, సామెత?" అంటూ, ఆ ఆఫీసుగదిలో. ఆ బల్లలూ, కుర్చీలమధ్యగల ఖాళీజాగాలో నాట్యం ప్రారంభించాడు.

ఆ కాప్టెను రెప్ప వాల్చకుండా రెండుమూడు నిమిషాలపాటు అలెక్సీను చూశాడు, తరువాత అలెక్సీ కాగితాలన్నిటినీ చేబట్టి, ప్రక్కనున్న జనరల్ గదిలోకి తొందరగా నడిచివెళ్ళాడు.

వెళ్లిన చాలాసేపటిదాకా తిరిగి వచ్చాడుకాడు. లోపలినుండి . మాటలు విని పించాయి. అలెక్సీ గుండె దడదడా కొట్టుకొన్నది. కాళ్ళూ చేతులూ వణికాయి.

కాప్టెన్ ఆగదిలోనుండి నవ్వుతూ బయటికి వచ్చాడు.

"నీవు విమానదళంలో చేరడానికాయన సమ్మతించలా. కాని, ఈవిధంగా వ్రాసి యిచ్చాడు. "ఈ మనిషిని A. S. B (ఎ. యస్. బి) శాఖలో చేర్చుకొని, జీతమూ తక్కిన సదుపాయాలన్నీ పూర్వంమాదిరే ఏర్పాటు చేయవలెను అర్థ మయిందా ? జీతభత్యాల్లో తగ్గింపులేదు...."

సంతోషిస్తాడనుకొన్న మనిషి కోపోద్దీపితుడవటం చూసి, కాప్టెన్ ఆశ్చర్య పడ్డాడు.

"ఎ. యస్. ఎ! నా బొందిలో ప్రాణముండగా దానిలోచేరను! ఇంతమాత్రం నీవు గ్రహించుకోలేకున్నావా? జీతభత్యాలకొరకు నే నీ వుద్యోగంలో చేరుతున్నానని అనుకోవద్దు. నేను విమానం నడపాలి! తిరిగి విమానయుద్ధం చేయాలి!....ఇంత మాత్రం మీరెవ్వరూ ఎందుకు తెలుసుకోలేరో నాకు బోధపడకున్నది. ఇదేమంత గొప్ప సమస్య, అర్థం కాకపోవటానికి?...."

అలెక్సీని చూస్తే ఆ కాప్టెను కేదీ అర్థమయింది కాదు, మరొకడయితే ఎగిరిగంతేసేవాడు ..కాని. ఈ మనిషి ధోరణేవేరు! పిచ్చివాడేమో అనిపించింది! పిచ్చివాడో, లేక మంచివాడో, అదంతా తెలియదుకాని, ఇతనంటే కాప్టెను కేదో అనిర్వచనీయమైన ఆకర్షణ కలిగింది. తనచేతనయినంత సహాయమూ చేయాలని అనిపించింది. ఏదో ఆలోచన తట్టిందికాబోలు, చిరునవ్వుతో అలెక్సీని తన దగ్గిరికి రమ్మని పిలిచాడు. జనరల్ వున్నగదిని చూస్తూ:

"జనరల్ తనకు వీలయినంత సహాయమూ చేసాడు. ఇంతకంటె రవంత కూడా ఎక్కువగా నీకు తోడ్పడటాని కతనికి వీలులేదు. నాకీవిషయం బాగా తెలుసు. నామాటనమ్ము, ఒకవేళ విమానదళంలో నీకు వుద్యోగమీయవలసిందని ఆయనవ్రాస్తే, దళాధికారులు జనరలుకు మతిపోయిందనుకొంటారు. ఒక్కటే ఒక్క మార్గమున్నది. తిన్నగా క్రేంద అధికారిదగ్గిరికి వెళ్లు, వీరూ వారంటూ ఇక్కడా అక్కడా తిరుగవద్దు. అతడొక్కడే తలుచుకొంటే నిన్ను విమాన దళంలోకి పంపించగలవాడు. ఇతరులెవ్వరికీ సాధ్యపడదీకార్యం." అన్నాడు.

ఈ కాప్టెన్, అలెక్సీ వెళ్ళి కేంద్రాధికారిని చూడటాని కనుమతి టిక్కెట్టును సంపాదించి యిచ్చాడు. అరగంట గడిచింది. మెత్తటి తివాచీ పరిచిన వరండాలో కేంద్రాధికారి గదిగుమ్మంముందు, అలెక్సీ పచార్లుచేస్తున్నాడు. ఈ ఆలోచన తనకే ఎందుకు కలగలేదో: ఇక్కడా అక్కడా తిరిగి ఎంతకాలయాపనమయింది? తిన్నగా ఈయన దగ్గిరికి మొదట్లోనే రావలసినది. సరి, ఇప్పుడీ ఆలోచనతో బాధపడిలాభం ....? ఈ దెబ్బతో తేలిపోతుంది, అటో. ఇటో తన సంగతి. ఈ కేంద్రాధికారి పూర్వం ప్రఖ్యాతవైమానికుడని పేరుపొందాడు. అతనికి తన సమస్య తప్పక అర్థమవుతుంది. వైమానికు డొకడిని, ఎ. యస్, బిలో చేరమని ఆయన ఎన్నటికీ అనడు. ఎ. యస్, బీకీ, తనవంటి వైమానికునికీ ఎట్టిపొందూ కుదరదని ఆయన తప్పక గ్రహిస్తాడు...ఈ విధంగా ఆలోచిస్తూ, కాలుకాలిన పిల్లిమాదిరి పచారుచేస్తున్నాడు.

చాలామంది జనరలులూ, కర్నలులూ అక్కడవున్న కుర్చీలమీద కూర్చు న్నారు, గుసగుసలాడేవారు కొందరూ, ఏది జరగనున్నదో అనే ఆదుర్దా నణచు కోడానికి సిగిరెట్టుపై సిగరెట్టును పీల్చి పారేసేవారు కొందరూ, వీరిమధ్య గడియారం పెండ్యూలం మాదిరి ఇటు అటూ తిరిగే అలెక్సీ. ఇదీ అచ్చటి వాతావరణం. చూడవచ్చిన వారందరూ వెళ్ళిపోయారు. అలెక్సీ వంతువచ్చింది. అచ్చట వొక

బల్ల దగ్గర మేజరొకతను. చూస్తే ఏ పాతికేళ్ళోకూడా లేనట్టున్న యువకుడు. కూర్చున్నాడు. అలెక్సీని చూసి,

"లెఫ్టినెంట్ సోదరా! క్రేందాధికారినే చూడాలా? లేకపోతే...."

"ఆయననే చూడాలి. స్వంత విషయమొకటి, చాలా ముఖ్యమైనది. ఆయనకు చెప్పుకోవలసివున్నది."

"నాతో నీ విషయమేమిటో చెప్పడాని కభ్యంతరము వుండదనుకొంటాను. రా, వచ్చి కుర్చీమీద కూర్చో. సిగిరెట్టు కాలుస్తావా?" అని తన సిగిరెట్టుడబ్బా నాతని కందించాడు.

అలెక్సీకి సిగిరెట్టు అలవాటులేదు. కానీ వొక సిగిరెట్టును తీసుకొని, నలిపి, బల్లమీద పడేసాడు. మునుపు కాప్టెన్‌తో చెప్పినట్టు, గబగబా తన చరిత్రనంతా చెప్పుకున్నాడు. ఎదుటి మనిషి బహుశ్రద్ధగా, దాని నంతా విన్నాడు. వార్తాపత్రికనూ సర్జను యిచ్చిన కాగితమునూ చదివాడు. ఎదుటి మనిషి తన యెడల చాలా అభి మానం చూపిస్తున్నాడనీ, తన కెంతో గొప్పగా ఆదుకొంటాడనీ అనుకొని, అలెక్సీ వెంటనే తన నృత్య కౌశల్యమును చూపించదలిచాడు. సరీగ్గా అదేసమయానికి తలుపు తెరుచుకొని, పొడగరి, నల్లటినొక్కుల క్రాపునంట దువ్విన మనిషి వొకాయన ప్రవేశించాడు. తానింతకు పూర్వం చూసిన వార్తాపత్రికల ఫొటోలు జ్ఞప్తికి వచ్చాయి. ఈయనెవ్వరో ఇట్టె తెలిసింది. తన కోటుగుండీలు పెట్టుకొంటూ వెనకాలవచ్చే జనరలుతో ఏదో చెబుతూ గదిలోకివచ్చాడా మనిషి. ఎంతో చీకాకుగా, ఏదోవొక విషయమును గురించి ఏదీ పాలుబోనట్టు లాయనకను పించాడు. ఎదుట నిలబడిన అలెక్సీని చూసాడేకాదు.

మేజరుతో"నేను క్రెమ్లిన్‌కు వెడుతున్నాను" అని చెప్పి తన చేతి గడియారి మును చూశాడు. "స్టాలిన్‌గ్రాడుకు వెళ్ళటానికి ఆరుగంటలకు విమానం సిద్ధంగా వుండాలని టెలిఫోను చేయి" అని నిలబడకుండా వెళ్ళిపోయాడు.

మేజరు వెంటనే విమానానికి టెలిఫోనుచేశాడు, తరువాత అలెక్సీసంగతి జ్ఞప్తికి వచ్చింది. ఎంతో జాలిగా అలెక్సీతో,

"నీ రోజులు బాగాలేవు, పాపం! మేము వెంటనే వెళ్ళిపోవలసివున్నది. మరొకపర్యాయం రావాలి. ఈ ఊరిలో నుండడానికి నీకు జాగా వున్నదా?"

ఒక్క నిమిషానికిముందు అద్వితీయమైన వుత్సాహమూ, మనోనిశ్చయమూ వుట్టిపడిన అలెక్సీముఖం నల్లగా కమిలిపోయింది. నిరాశ నిబిడీకృతమైన అతని ముఖమునుచూచి, సంతాపంతో,

"ఫరవాలేదు. ఇప్పు డంతగా మించిపోయిన దేదీ లేదు. ఆయనకూడా ఇటువంటి వుత్తరమునే యిస్తాడు. నాకు తెలుసు" నంటూ ఆఫీసు కాగితంమీద నేదో వ్రాసి, కవరులోపెట్టి అలెక్సీకి యిచ్చాడు, కరస్పర్శచేసి.

"జయమగుగాక ! మనఃపూర్వకంగా అంటున్నా, నీ మాట" అన్నాడు అలెక్సీతో.

ఆ జాబులో సీ విధంగానున్నది : "లెఫ్టినెంట్ అలెక్సీ నేడు కమాండరును కలుసుకొన్నాడు. ఆతని నెంతో ఆదరించి అన్నివిధాలా సదుపాయాలు చేయవలసి సింది. వీలయినంత త్వరలో వైమానికదళంలో చేరడానికి శక్తివంచనలేకుండా దోహదం చేయవలెను"

ఒక గంట తరువాత అలెక్సీ తిరిగి తాను పూర్వం జనరలుగారి ఆఫీసులో హాజరయ్యాడు. అయన అలెక్సీ తెచ్చిన పత్రమును చదివి, "ఓహో ! అప్పుడే అక్కడికి వెళ్లావా ? పిడుగువంటి మనిషివి నీవు. నిన్ను ఎ. యస్. బి. లో చేరమన్నందుకు నామీద అంతయెత్తు కెగిరిపడ్డావు. నాకు జ్ఞప్తికున్నదిలే. ఆహా-హా-హా" అని నవ్వాడు. "అసాధ్యుడివిలాగున్నావు. విమానమే నీ ప్రాణ మన్నట్టు వర్తిస్తున్నావు. ఎ. యస్. బి. లో చేరడానికి యిష్టంలేదు కాదూ ?.... నాపైన కోపగించుకొన్నావు. ఊ ? .... నన్నేమి చేయమంటావో, చెప్పు ? నాట్యగాడివని విమాన మెక్కడానికి అనుమతిస్తే, క్రిందపడి మెడ విరుగగొట్టు కొంటావనుకో, నాగతి ? తల తీసేస్తారు తెలియదు కాబోలు నీకీ సంగతి ! నీ పెట్టెట్టి పనులు సాధించగలిగేదీ, లేనిదీ, ఎవడు చెప్పగలడు ? ఈ యుద్ధంలో మన యువకులు ఇంతకంటె అతిశయకృత్యా లొనర్చారు. లోకమంతా ఆశ్చర్య పడింది...."

నీలంపెనిసిలుతో"ఈతనినివైమానికతరిఫీదు కళాశాలకుపంపించవలసింది"ని తెలిసీతెలియని అక్షరాలు గీకాడాకాగితంమీద. అదిరదిరి పడే హస్తంతో అలెక్సీ ఆ కాగితమును స్వీకరించి బయటపడ్డాడు. మేడమెట్లు దిగుతూ చదివాడు. ఆఖరు మెట్టుపై నిలబడి చదివాడు. వరండా చివరనున్న బల్లదగ్గర నిలబడి చదివాడు. ఆఫీసు గేటుదగ్గిర నిలబడీ, బస్సులో వెడుతూ, బస్సుదిగి రోడ్డుప్రక్క నిలబడీ, వానజల్లు పడుతున్నా సరకుచేయక ఆ కాగితముపైనున్న నీలిపెన్సిలు వ్రాతను చదివాడు. ఆ రెండుముక్కలలో నిమిడియున్న సందేశముయొక్క విలువ, విశిష్టత అలెక్సీకు తెలిసినంతగా. ఈ లోకంలో వేరొకరికి తెలియదు.

అలెక్సీ తన చేతిగడియారము నమ్మాడు. దాని నాతనికి వొక దళాధికారి పూర్వం బహుమతిగా నిచ్చాడు. ఆ డబ్బు పెట్టి బజారులో రకరకాల తినుబండా లనూ, ద్రాక్షారసమునూ కొని అన్యూతాకు, ఏదో వొకవిధంగా వీలుచేసుకొని రమ్మని టెలిఫోను చేశాడు. ఆ యింటియందున్న ముసలిదంపతు లిద్దరినీ ఆహ్వా నించాడు. గొప్పవిందు నేర్పాటు చేశాడు. ఇన్నాళ్ళకీనాడు తన కోరిక ఈడేరేరోజు వచ్చిందనే మహదానందంతో.

# 8

మాస్కో నగరానికి సమీపమందున్న వొక విమానాశ్రయంలో వైమానికుల తరిఫీదుచేసే కళాశాల కలదు. ప్రతిదినమూ ఇచ్చటెంలో హడావుడిగా వుంటుంది.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం చెలరేగేకొలదీ వైమానిక దళానికి చెప్పనలవి కాసంత పనిపట్టింది. ఆ నగరపుటాకాశం అర్ధరాత్రులందుకూడా పట్టపగలు మాదిరి ప్రకాశించింది. క్రిందమండే మంటలూ, పగిలేబాంబులనుండి కారుమేఘాల వంటి పొగలూ, ఆకాశంలో జర్మను విమానాలకూ రష్యనువాటికీ ఘోరయుద్ధాలు జరిగాయి. ఇరుపక్షాలవారూ ఎంతో నష్టపడ్డారు. స్టాలిన్‌గ్రాడ్‌నుండి ప్రొద్దస్తమా సమూ ఒకటేవార్త వచ్చేది! వైమానికులు, ఇంకా ఎందరెందరో వైమానికులు కావాలని....వైమానిక కళాశాలలో ఇంతకుపూర్వం సైనిక విమానాలను నడపని వారికీ, ఆస్పత్రులనుండి ఒళ్లు బాగుచేసుకొని వచ్చిన వైమానికులకూ తరిఫీదు నీయట వల్ల ఎప్పుడూ తీరుబడేవుండేదికాదు. మిఠాయి దుకాణంలో ఈగలు ముసిరినట్టు ఆ విమానాశ్రయంపై జుమ్మని ఎగిరే విమానాలకు లెక్కలేదు. ఈ మాదిరి రాత్రనక. పగలనక విమానాలు కనుపించాయి, విమానాశ్రయంమీద ఎప్పుడుచూసినా ఏదో వొక విమానందిగేది, లేదా వేరొకటి ఎగిరివెళ్లేది.

ఆశ్రయాధికారిని చూడటానికి అలెక్సీ వెళ్లాడు. పొట్టిమనిషి, స్థూలకాయుడు నిద్రలేక ఎర్రబారిన కండ్లూ. ఆ మనిషి అలెక్సీని కోరగా చూశాడు. ఆ చూపులో "ఏ ఘనకార్యంమీద వచ్చావు. నీ వొక్కడవే తక్కువయినట్టు?" అని అతడంటు న్నాడని అలెక్సీకి తట్టింది. కోపంగా అతని చేతిలోని కాగితాలను లాగుకొన్నాడు.

క్షౌరం చేసుకోడానికే తీరుబడికానందున గడ్డిదుబ్బుమాదిరి పెరిగినగడ్డమూ, జోరీగలగొడ్డుమాదిరి చీదరింపులూగల ఈ మనిషి "పాదాలులేవు, వచ్చిన దారినే వెళ్లమంటాడని" అలెక్సీ భయపడ్డాడు. ఒకేసారి రెండు టెలిఫోనులు మ్రోగాయి. ఒకదానిని భుజంమీదపెట్టి క్రిందపడకుండాఅదిమిపుంచివింటూ, రెండోదానిలోనికేదో బదులు చెబుతూ, అలెక్సీ ఇచ్చిన కాగితాలను పరీక్షించాడు. ఆపనితొందరలో అసలువిషయ మేదో తెలుసుకోవాలనిచూస్తే, నీలిరంగు పెన్సిలుతో వ్రాసినమాట లగుపించాయి, "లెఫ్టినెంట్ నొమవ్, మూడో శిక్షణదళం, ఈతనిపేరు వ్రాసుకో" మని ఆ కాగితంమీదవ్రాసి టెలిఫోనులను రెంటినీ క్రింద దింపాడు. తరువాత అలెక్సీతో,

"కొత్తదుస్తులు తీసుకోడానికి అధికారపత్రం తెచ్చుకొన్నావా? భత్యం కాగితాలూ? తెచ్చుకోలేదా? నీ కెక్కడినుండి తిండి తెచ్చిపెట్టమంటావు? వెంటనే వెళ్లి కాగితాలుతెచ్చుకో! అవి లేకపోతే నేను చేయతగ్గదేదీ లే"దన్నాడు.

"అట్లాగే, కర్నల్. వెంటనే తెచ్చుకొంటాను!" టన్‌చన్‌గా నిలబడి మిలిటరీసలాము పెట్టి, "వెళ్ళవచ్చా?" అని అడిగాడు.

"ఊఁ, వెళ్లు!" అని చేయూపాడు. ఉన్నట్టుండి పెద్ద గొంతుచేసుకొని, "నిలు! ఏమిటిది?" అంటూ వాసిలెవిక్ అతనికిచ్చిన చేతికర్రను చూస్తూ అడిగాడు. అలెక్సీ దానిని పొరబాటున ఆ గదిలోనే దిగవిడిచాడు, "శుంఠవెధవలా గున్నావే? దూరంగా విసిరిపారవేయి. ఇదేదో దొమ్మరాట అనుకొన్నావా? సైనికస్థానమని తెలియదూ? షికారుకు వెళ్ళినట్టు చేతికర్రలూ, బెత్తాలూ, కొరడాలూనా!.........కొద్దిరోజులుపోతే మెడనిండా తాయత్తులు కట్టుకొంటావు. అదృష్టంకొరకని విమానంలో నల్లపిల్లులను పెంచుతావు. ఇట్టి చాదస్తాలన్నీ యిక్కడ కూడవు. ఆ ఛండాలపు చేతికర్ర తిరిగీ నా కంటబడరాదు. తెలివి తక్కువ నాగమ్మా. ఫో!"

"అట్లాగే, కర్నల్."

తనకష్టా లింతటితో తీరలేదని అలెక్సీకి తెలుసు, భత్యంకొరకు అర్జీ పెట్టుకొన్నాడు. పాత కాగితాలు పోగొట్టుకోవడానికి కారణాలు లెఫ్టినెంటుకు నచ్చచెప్పే టప్పటికి అతనికి తలప్రాణం తోకకు వచ్చింది. లెక్కకు మించి నంతమంది వస్తూ, వెడుతూ వుండటంవల్ల వైమానిక కళాశాలలో తగినంత భోజనవసతు లుండేవికావు. మధ్యాహ్నభోజనం ముగిసిందో, లేదో రాత్రి భోజన మెప్పుడు పెడతారా అని గంటలు లెక్కించుకొంటారు. ఇక్కడి మనుష్యులు. సీటి ఆవిరిగొట్టాలు అక్క డక్కడ రంధ్రాలుపడ్డాయి. రాత్రిళ్ళు, చలి భరింప రానంత మిక్కుటంగా నుండేది. తొడుగుకొన్న తోలుకోటూ, కప్పుకొనిన కంబళీ, ఆ చలిని అడ్డంగించలేక, అలెక్సీ రాత్రులందెంతో కష్టపడ్డాడు. కాని ఇవన్నీ ఒకఎత్తూ, తిరిగీ తాను వైమానికదళ కళాశాలలోనుండే అదృష్టంకలగటం ఒక ఎత్తూ అనిపించిందాతనికి. గట్టునపడి వూపిరాడక గిలగిలా తన్నుకొనే చేపమీద పెద్ద కెరటం విరుచుకుపడి తిరిగీ దానిని సముద్రంలో చేరిస్తే ఎంత ఆనందిస్తుందో, అంతగానూ, అంతకంటే ఎక్కువగానూ, ఇక్కడకు వచ్చి చేరుకో గలిగినందులకు అలెక్సీ ఆనందించాడు, ఇట్టి కష్టాలనుభవించే కొలదీ, తన గమ్యస్థానమును చేరేరోజులు దగ్గిరపడ్డాయని వుప్పొంగిపోయాడు.

సీటిలోనున్న చేపమాదిరి, అలెక్సీ ఆ వాతావరణంలో హాయిగా కాలం గడిపాడు. పొరలూడిపోతూ రంగుపోయిన తోలు కోటులూ, కుక్క చర్మపు వైమానిక బూట్సులూ తొడుగుకొని, ఎండకు నల్లగా మాడివ ముఖాలుగల వైమానికులూ, తీవయిన ఘాటువాననకొట్టే వైమానిక పెట్రోలూ: విమానాలు బయలు దేరే ముందు వాటి ఇంజనులు వేడెక్కడానికి బుర్రు, బుర్రు మంటూ శబ్దాలూ, ఎగిరే విమానముల జుమ్మను శబ్దమూ; అలిసిపోయి ఏ నిమిషాన కెక్కడ పడి పోతారో అన్నట్టు, ఇంజనుల కిలుము మరకల దుస్తులు తొడుగుకొనిన మరమ్మతు

పనివారూ; పెద్ద గొంతుకలు చేసుకు అరిచే రాగిముఖాల అధికారులూ; వాతావరణాలయంలో పనిచేసే స్త్రీలూ; ఎప్పుడుచూసినా కందినట్లుగుపించే వారి చెక్కిళ్ళూ: దొంతర్లు దొంతర్లుగా యంత్రాగారపు పొగ గొట్టమునుండి లేచే నీలి నలుపు రంగుల పొగా; విసుగూ విరామమూ లేకుండా ట్రింగు - ట్రింగున మ్రోగే టెలిఫోను గంటలూ; భోజనాలప్పుడు రెండువాలకరువు; రంగురంగుల పెన్సిళ్లవయోగించి పైమానికులు వ్రాసి గోడల కంటించిన వార్తాపత్రికలూ. ఆకాశ మండలములో ఎగిరి వెళ్లేటప్పుడు ఫలానా మనిషి ఫలానా అమ్మాయినిగురించి కలలు కన్నాడంటూ గీచిన జంట చిత్రాలూ; విమానాలు వరుసగెత్తిన చాళ్ళనుండి పైకిలేచే వసుపువచ్చని దుమ్మూ; వైమానికుల ప్రత్యేక పరిభాషలో విరివిగా వాడబడే ఘాటయిన మాటలూ, పాటలూ-ఇవన్నీ, అలెక్సీకి గతించిన రోజులను జ్ఞప్తికి తెచ్చాయి. ఈ వాతావరణంలో పాలూ నీళ్ళమాదిరి కలిసిపోయాడు. దానితో సంపూర్తిగా లయమొందాడు.

ఈ నూతన వాతావరణంలో త్వరగా అలెక్సీ కోలుకొన్నాడు. వైమానికు లందరికీ స్వాభావికంగా వుండే ధైర్య సాహసాలూ, అపాయమంటే నిర్లక్ష్యమూ ఇతనిలో తిరిగి వికసింపజొచ్చాయి. క్రింది వుద్యోగస్థులను కలుసుకొన్నప్పుడూ, పై అధికారులను సంధించినప్పుడూ. కాలూ చెయ్యీ బాగున్న తక్కిన వైమానికుల మాదిరే, అలెక్సీకూడా బహు చురుకుగా. చలాకీగా వర్తించాడు. కొత్తదుస్తుల నిచ్చారు. ఎ. యస్. బిలో పనిచేసే నొకతనికి వీటినిచ్చి, తనకు సరిపోయేటట్టు "మార్పించుకొన్నాడు." ఈమనిషి యుద్ధశాఖలో చేరడానికిపూర్వం దర్జీపనివాడుగా నుండేవాడు. కాబట్టే, తీరుబడి వున్నప్పుడల్లా తన మిత్రులు తెచ్చియిచ్చిన వైమానిక దుస్తులను వారికి సరిపడేటట్టు మార్చి యిచ్చేవాడు.

మొదటిరోజే మూడోశిక్షణ దళాధికారి, లెఫ్టినెంట్ నౌమవ్‌ను చూడటానికి వెళ్ళాడు. పెద్దతలా. పొడుగుచేతులూగల పొట్టిమనిషి, ఈ నౌమవ్ విమానాశ్రయం మీద పరుగులిడుతూ పైకిచూస్తూ బహు ఆదుర్దాగా కనుపించాడు. చిన్న విమాన మొకటి ఆకాశంలో కనుపించింది. దానిని నడిపిస్తూన్న వైమాకునిమీద కోప పడుతున్నాడు.

"పాత ట్రంకుపెట్టె!....విమానమా ఇది?....యుద్ధశాఖలో పని చేసానని చెప్పాడు! నన్నే మోసగించాలను కొన్నాడు, వెధవ."

అలెక్సీ ఆతనిని సమీపించాడు, సగౌరవంగా వైమానిక సలామొనర్చి, తన్ను తానే పరిచయ పరుచుకోడానికి నిలబడ్డాడు. ఆ రెండో మనిషి బదులు సలాముగా చేయినూపి, పైకి చూపిస్తూ గొంతెత్తి అరిచాడు.

"అదిగో! ఆ విమానం కనిపిస్తోందా!....చూడు...'డెస్ట్రాయియర్' విమానం దానికి సాటియైన విమానమంటూ మరొకటిలేదు. క్రిందికి పడిపోతోంది. రెక్కలు విరిగినట్టూ, తోకతెగిన గాలిపటం మాదిరీ!" అన్నాడు.

ఈ మనిషిమీద ఎంతో అభిమాన మేర్పడ్డది, అలెక్సీకి. తమ పనిఅంటే పడి చచ్చే వైమానికులలోకమీ మనిషి. ఇటువంటి వారితో తెలివితేటలూ, నేర్పరితనమూ కల వైమానికులకు బహు తేలికగా మైత్రి కుదురుతుంది. పైనున్న వైమానికుడే విధంగా, ఎట్టి విషయాల్లో పొరబడుతున్నాడో అలెక్సీ, తనలోతానే అనుకొంటూ నట్టు చెప్పాడు. ప్రక్కనున్న లెఫ్టినెంటుసౌమవ్ ఎగాదిగా అలెక్సీని చూసి,

"నా శాఖలో చేరడానికి వచ్చావా? నీ పేరు? ఇంతకుముందెటువంటి విమానముపయోగించావు? యుద్ధంలోచేరి పోరాడావా? ఎంతకాలం క్రిందట?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

తాను చెప్పిదంతా సౌమవ్ విన్నాడో లేదో అలెక్సీకి తెలియదు. ఆ మనిషి సూర్యుని కడ్డంగా చేతినెత్తిపెట్టి, పైకి చూస్తూ, పిడికిలి బిగించి. అరుస్తున్నాడు, తిరిగీ.

"చక్రాలు విరిగిన పాత డొక్కు!....పనికిమాలిన పిల్లలాడుకొనే బొమ్మల బండీ!....చూడు, చూడు, ఎంత లక్షణంగా ఎగురుతోందో! బోనులోపడ్డ ఎలుక మాదిరి విలవిలలాడుతోంది" అన్నాడు.

అలెక్సీని మర్నాడు ప్రొద్దునే రమ్మన్నాడు. రాగానే పరీక్షించి చూస్తానన్నాడు.

"సరే వెళ్ళి కొంత విశ్రమించు. చాలా అలిసిపోయివుంటావు. భోజనం చేశావా? ఇక్కడవుండే గలభాలో సమయానికి భోజనం దొరుకుతుందనటానికి వీలులేదు....ఎందుకూ పనికిమాలిన దౌర్భాగ్యుడు! క్రిందికి దిగిరా, నీ పనిపట్టిస్తాను. "డెస్ట్రాయియర్" విమానమంటే ఏమిటో తెలియ చెప్పుతాను!" అన్నాడు.

అలెక్సీ విశ్రాంతి తీసుకోడానికి తన గదికి వెళ్ళలేదు. '9 ఎ' నంబరు గదిలోకంటె విమానాశ్రయంలో ఎక్కువ వెచ్చగానున్నందున ఇక్కడే వుండటం మేలని తోచిందాతనికి. తన పాత తోలు బెల్టును రెండుగా చీల్చి, రంధ్రాలు పొడిపించి, రెండు తోలుపటకాలు చేయించుకొన్నాడు. వీటితో తన పాదాలను విమానపు కాలిదిమ్మలకు బిగించటానికి నిశ్చయించుకొన్నాడు. ఇదంతా చేసి యిచ్చిన చెప్పులు కుట్టేవాడికి తన కొక వారానికి సరిపడా ఇచ్చిన పొగాకును పూర్తిగా ఇచ్చేసాడు. అలెక్సీకి తోలు పటకాలు జరూరుగా కావాలని తెలియగానే ఆ మనిషి పొగాకుతోడు అర్ధలీటరు వోడ్కానుకూడా తెచ్చి పెట్టమన్నాడు. 'ఒకటోనంబరు' పటకాలను తయారుచేసి ఇస్తానన్నాడు. విమానాలన్నీ క్రిందికి దిగేదాకా అక్కడే నిలబడిచూసాడు. అక్కడ విమానాశ్రయంలో నిలబడి ఈ విషయాలన్నీ తిలకిస్తూ ఆ గాలి పీలుస్తూ, ఇంజనుల శబ్దం వింటూ, రాకెట్టు విమానాలనుండివచ్చే ధమ ధమలనాలకిస్తూ, ఇంజను పొగవాసనలను ఆఘ్రాణిస్తూ ఈ లోకాన్నే మరచిపోయాడు. ఉప్పొంగిపోయాడు. తెల్లవారితే తానెక్కే విమానం ఒకవేళ పైకి

లేవదేమొ ? పెళంతప్పి తనతోకూడా నేలనుకూలుతుందేమొ అనే అటువంటి సందేహాలాపనికి కలిగాయికావు—

మర్నాడు ప్రొద్దున్నే అలెక్సీ విమానాశ్రయానికి వచ్చాడు. వైమానికు లెవ్వరూ అప్పటికింకా రాలేదు. దూరానగల విమానాశ్రయ టెంకనులను వేదిచేస్తూన్నాయి. వాటిని కాచే అంచు మంటలు ఆ మసక చీకటిని చీల్చుకు వెళ్ళే సమునైన ఖడ్గాల మాదిరగుపించాయి. విమానపు ప్రొపెల్లర్లను త్రిప్పి అవి చుట్టటం మొదలిడగానే విషసర్పాన్ని చూసి పారిపోయినట్లు రొక్కగంతువేసి పారిపోతున్నారు. పనిచేసే మనుష్యులు విమానాశ్రయంనుండి ఇట్టిమాటలు వినబడుతున్నాయి.

"బయలుదేరటానికి సిద్ధంగానున్నాను"

"ఇది కేంద్రాలయం."

"ఇది నేను ఎగరటానికి సిద్దంగానున్న విమానం"

ఎవ్వరో అలెక్సీని చూసి ఏపని లేకుండా ప్రొద్దున్నే విమానాల దగ్గర వచ్చి నిలబడినందుకు చివాట్లుపెట్టారు. పకపకా నవ్వి ఎందుకనో లేనట తెలియకుండానే, "కేంద్రాలయ విమానం; కేంద్రాలయ విమానం" అంటూ బదులు పలికాడు. ఇంతలో నొక విమానం బయలుదేరింది. చక్రాలమీద దొర్లుకొంటూ మధ్య. మధ్య రివంత గంతులేస్తూ, చలించే రెక్కలతో ఈ ప్రక్కకూ వారుగుతూ బయలుదేరే చోటికి వెడుతోంది. నౌమవ్ ఎక్కడినుండో ప్రత్యక్ష మయ్యాడు. చిన్న సిగిరెట్టుముక్కనుండి దమ్ము పీలుస్తూంటే. పొగాకు మరకలు పట్టిన వ్రేళ్ళనుండి పొగను పీలుస్తున్నట్లనిపించింది. సిగరెట్టుపీక మరీ చిన్నదయి పోయింది.

అలెక్సీ సలాముచేశాడు. నౌమవ్ అతనికి సలాముచేస్తూ, "ఓహో ? వచ్చావా ?....మంచిది. ముందు వచ్చినవాడికి మొదటి పీట వేయమన్నారు. అదిగో ఆ తొమ్మిదో నంబరు విమానపు వెనకాలనున్న ఇంజనుగదిలో ఎక్కి కూర్చో. ఒక్క చిటికలోవస్తాను. నీ కెంత మాత్రం తెలుసో పరీక్షిద్దాము."

పారేసేముందు మరి రెండుదమ్ములు లాగి సిగిరెట్టు పీకెని మరీ పారేశాడు. అలెక్సీ చకచకా విమానం దగ్గిరికి నడిచివెళ్లాడు. నౌమవ్ వచ్చేలోగా తన పాదాలను పటకాతో కాలిదిమ్మలకు బిగించడానికి యత్నించాడు. చూస్తే మంచివాడి మాదిరి వున్నాడు. కాని ఏ సమయాని కెట్లా వర్తిస్తాడో చెప్పటం కష్టం. అకస్మాత్తుగా తలతిక్కపట్టి, విమానం తాకవద్దంటాడేమొ ? విమానమును చేత్తోపట్టుకుని, జారుడుగానుండే రెక్కపైకి ఎక్కి, ఒక కాలు అవతల ప్రక్క పెట్టడానికి యత్నించాడు. "ఎన్నో రోజులుగా అలవాటులేకపోబట్టి, ఎక్కడ ఏ మాత్రం పొరబడితే ఏమవుతుందోననే భయంవల్లా కాళ్లూ చేతులూ వణికాయి. కాలు నెత్తి అవతల ప్రక్క పెట్టలేకపోయాడు. ఇదంతా చూస్తూ నిలబడిన మరమ్మతు చేసే వాడొకడు "గాడిదకొడుకు, తప్పత్రాగాడ"ని అన్నాడు.

ఏంతో శ్రమపడి ఇంజను గదిలో నొకకాలు చేర్చి, రెండో కాలును లోప లికి చేర్చాడు. అలిసిపోయి బరువుగా అక్కడున్న బల్లమీద కూలబడ్డాడు. తాను తెచ్చుకొనిన కొయ్యపటకాలతో పాదాలను, ఇంజను నడిపే కాలిదిమ్మలకు బిగిం చాడు. ఆ పటకాలను చాలా చక్కగా తయారుచేశాడు. చెప్పులు కుట్టేవాడు. కాబట్టే, అవి కాలిదిమ్మలను బహుచక్కగా బిగియపట్టుకొన్నాయి. నౌమవ్ విమానం దగ్గిరకి వచ్చాడు, అలెక్సీ కూర్చున్న ఇంజను రెండో గదిలోనికి తలను దొప్పించి,

"తాగి రాలేదుగదా, కొంపతీసి? ఏదీ, నీ నోరు వాసనచూడనీ" అన్నాడు.

బ్రాందీ వాసన తగిలిందికాదు. మరమ్మతు చేసేవాడివంక తిరిగి, అబద్ధాలు చెబితే తల పగులకొట్టుతానన్నట్టు పిడికిలి చూపాడు.

"బయలుదేరుదామా?" నౌమవ్.

"నేను సిద్ధంగా వున్నాను" అలెక్సీ.

"సరే" అన్నాడు నౌమవ్.

ఇంజను నాలుగైదు పర్యాయములు దగ్గింది; బుసలుకొట్టింది. తరువాత చుక్ చుక్ చుక్ మంటూ ధ్వనించింది. అలెక్సీకి సంతోషం మిన్నుముట్టింది. పెట్రోలు వాయువును ఇంజనుకెక్కించి, బయలుదేరాడు. మొదటిగదిలో కూర్చున్న నౌమవ్ టెలిఫోనుద్వారా,

"జాగ్రత్త. అంబోతుమాదిరి రంకెవేసి ఎగబడవద్ద"న్నాడు.

నౌమవ్ ఇంజను కెక్కించిన పెట్రోలు ఆవిరిని కొద్దిగా తగ్గించాడు. విమానం కదిలింది. ముందుకు చక్రాలమీద దొర్లుకొంటూ, రవంత గంతులువేస్తూ పరుగు తీసింది. నౌమవ్ విమానం పైకి లేవటానికి మీట నదిమాడు. చిన్న 'తూనీగ' అనీ, 'అడవి కాపలాదారుడనీ' 'కాబేజి లేక ముట్టకోసు' అనీ, రకరకాల పేర్లు పెట్టి నలుగురూ ఎగతాళిచేసే ఈచిన్న విమానం, పాతరకము దయినప్పటికీ, కొత్తగా ఎగరటం నేర్చుకొనే ప్రతివొక్క వైమానికుడూ దీనిమీద ఎగరటం నేర్చుకొం టాడు. పరిహాసం చేసినప్పటికీ పాతది బంగారమన్నట్టు దీనినెంతో ఆదరిస్తారు. వైమానికులందరూ. విమానం మెల్లమెల్లన పైకిలేచి మేఘాల నందుకోబోయింది.

తన కుడిచేతి ప్రక్కనున్న అద్దంలో నౌమవ్‌కు అలెక్సీముఖం కనిపిస్తోంది. చాలా రోజుల తరువాత. తిరిగీ ఎగిరే మనుష్యుల నెందరిముఖాలనో నౌమవ్ ఈ అద్దంలో చూశాడు. ఆరితేరిన వైమానికులు నిర్లక్ష్యభావంతో చిరునవ్వు నవ్వుతారు. ఆస్పత్రినుండి ఆస్పత్రికి తిరిగి, మరల విమానమును నడిపేఅదృష్టం కలిగినందుకు పట్టరాని సంతోషంతో జిగేలుమనే నేత్రాలుకలవారినీ చూశాడు. పెద్ద గాయాలుపడి ఎన్నో నెలలఅనంతరం ఎగిరే మనుష్యులు బాధ నోర్చుకొంటూ, పాలిపోయిన ముఖాలతో రక్తం వచ్చేటట్టు పెదవుల కరుచుకొనటమూ తిలకించాడు. పరికొత్త

మనుష్యులు మొండిధైర్యంతో మంటలోపడే మిడతలమాదిరి విమానమును ముందు కురికించటంకూడా వీక్షించాడు. ఇన్ని ముఖాలుచూసిన నౌమవ్‌కు అద్దంలో కను పించే అలెక్సీ ముఖంలో ఏదో వొక ప్రత్యేకవిశిష్టత గోచరించింది. చక్కని కను ముక్కుతీరుగల ఈ మనిషికి విమానమును గురించి తెలియనిదంటూ వుండదని అతనికి తోచింది.

ఎండకు నల్లబడిన అతని ముఖం కందింది. పెదవులు పాలిపోయాయి. భయంవల్లకాదు, మరేదో ఒక కారణముండాలి దీనికంతా అనిపించింది అద్దంలో చూసే నౌమవ్‌కు. ఎవ్వరీ మనిషి ? ఇతనికెట్టి కష్టం కలిగిందో. పూర్వం ? విమాన మరమ్మత్తుకు మనిషి ఇతనిని చూసి తప్పత్రాగాడనటానికి కారణం ? విమానం పైకిలేచి మేఘాల్లో కెగిరిపోయే టప్పుడాతని పెద్ద నేత్రాలమంచి నీరు కారి, గాలికి తుడిచి పెట్టుకుపోవటం తాను చూసాడు. నొప్పా ? సంతోషమా ? ఈ ఏడ్పుకు కారణం ?

“కొద్దిగా మతి చాంచల్యం కాబోలు ? ఎందుకయినా మంచిది. కనిపెట్టి వుంటాను. ఏ ఘడియ కేవిధంగా మారుతాడో...” అని తనలో తాననుకున్నాడు. నౌమవ్. అద్దంలో కనుపించే ఆ ముఖమును చూస్తే తనకే మతిభ్రమణం కలు గుతూన్నట్టూ, గొంతుకేదో, మ్రింగుడు పడకుండా, అడ్డు తగులుతూన్నట్టూ అనిపించింది. ఎదుటనున్న ఆయుధాలూ, మరలూ మసగగా కనుపించాయి.

“విమానమును నీకు వప్పగిస్తున్నా”నని టెలిఫోనులో అలెక్సీకి చెప్పాడు. కాని, దాని నావిధంగా వప్పగించలా. తన పట్టును రవంత సడలించి, పాదాలనూ చేతులనూ ఆయుధములపైనుంచి కూర్చున్నాడు. ఏదన్నా ప్రమాదం జరిగేటట్లు తోచినట్టయితే, సర్దుకోడానికి వీలుంటుంది. గొప్ప అనుభవశాలి నడిపినట్టు బహు చమత్కారంగా, సునాయాసంగా విమాన మెగురుతోంది. “పుట్టుకతోనే వైమాని కుడు” అంటూ కొందరుంటారని, ఆ కళాశాలాధికారి, కమాండర్-ఇన్‌చీఫ్ అనడం కద్దు. ఇదేదో వొకవిధంగా పూర్వజన్మ సుకృతంవంటిదంటాడు. తన రోజుల్లో ఈ కమాండర్ అద్వితీయ కౌశల్యంగల వైమానికుడని పేరుపొందాడు.

నౌమవ్ కీ మనిషిని గురించి మంచి నమ్మక మేర్పడ్డది. 'నియమక్రమంగా' విమాన మెగిరింది. క్రింద దిగేటప్పుడు మాత్రం ఒక పర్యాయం కుడి ప్రక్కకూ, మరోసారి ఎడమప్రక్కకూ రవంత పోవటమో. లేక పైకీ. క్రిందికీ ఎగరటమో మాత్రం వింతగా తోచాయి. ఇన్ని నెలల తరువాత ఎగరటంవల్ల తన శక్తి సామర్థ్యాలను తానే ఈ విధంగా పరిశీలిస్తున్నాడు కాబోలునని నౌమవ్‌కు తోచింది. మరునాడు అలెక్సీని ఒంటరిగా ఎగరటానికి వదిలిపెట్టి, రెండు మూడు దినాలయ్యాక U. T. – 2 నంబరు యుద్ధవిమానము అతని చేతికి వప్పగించి ఏలా వర్తిస్తాడో చూడటానికి తీర్మానించుకొన్నాడు. ఈ U. T. – 2 నిజమైన యుద్ధవిమానం కాదు, పైచెక్కలతో నిర్మించబడిన నమూనా విమానం.

అమితమైన చలి, విమానం రెక్కలపైనున్న ఉష్ణమానిని - 120° సెంటిగ్రేడు చూపుతోంది. మంచువలె చల్లనయిన గాలి వైమానికుని తోలుకోటులో దూరింది. నౌమవ్ తన పాదాలు మొద్దుబారుతున్నాయనిపించింది. ఆ చలికి, ఇక విమానం క్రిందికి దిగటం శ్రేయస్కరమని తోచింది.

"క్రిందికి దిగటానికి సిద్ధంగానుండ"మని టెలిఫోనులో ఎన్ని పర్యాయములు చెప్పినా, ప్రతి పర్యాయమూ అలెక్సీ ముఖం, "అప్పుడేవద్దు. రవంత పైకెగురనీ, నీకు పుణ్యముంటుందన్నట్లు" అగుపించిందా అద్దంలో, అది బ్రతిమాలటం కాదు. ఆ కండ్లను చూస్తే తన్నాజ్ఞాపిస్తున్నాడు కాబోలు ననిపించిందాతనికి. పది నిమిషాలు మాత్రమెగరడానికి బదులు అరగంట కాలం విమానంలో అంతరిక్షాన, మేఘాలతో దాగుడు మూతలాడాడు.

విమానం నుండి క్రిందికి దిగగానే నౌమవ్ చలికి బిగదీసుకొనిన పాదాలతో టపీ టపీ మని నేలను తన్ని, అరచేతులను రాచుకున్నాడు. రెండో మనిషి వెంటనే తన చోటునుండి దిగలా. ఏమిటేమిటో చేస్తూన్నట్టు లాతనికి తోచింది. విమానంనుండి దిగడానికీ ఇష్టంలేనివాడిమాదిరి, నెమ్మదిగా దిగి బయటపడ్డాడు. క్రిందికి దిగాక, సంతోషంతో విప్పారిన ముఖారవిందంతో విమానం చెంత కూర్చున్నాడు. ముఖమంతా కందిపోయింది.

"చలిగా నున్నదికాదూ ?" అన్నాడు నౌమవ్. "ఈ వైమానిక తోలుచెప్పులలో చొరబడిన చలికి నా పాదాలే కొయ్యబారాయి. నీవో, సాధారణ బూట్సులు ! నీ పాదాలు మొద్దుబారలేదా ?" అని ప్రశ్నించాడు.

"నాకు పాదాలు లేవ"ని నవ్వుముఖంతో బదులు పలికాడు.

"ఏమిటి !" నౌమవ్ కండ్లురెండూ వప్పగించి, నోరు తెరుచుకొని ఎదుటివాడిని చూశాడు.

"నాకు పాదాలులేవు." ప్రతివొక్క అక్షరమునూ స్పష్టంగా వుచ్చరించాడు,

"నీకు పాదాలు లేవా ? నీవు చెప్పేది నా కర్థం కావటంలా. పాదాల్లో ఏదో దోషమున్నదనా, నీ అర్థం !"

"కాదు. నాకు పాదాలే లేవు. కృత్రిమ పాదాలు."

నౌమవ్ కొయ్యబారిపోయాడు. తాను, ఎదుటివాడుచెప్పే మాటలను తిన్నగా వింటున్నాడా, లేదా అనే అనుమానం కలిగింది. పాదాలు లేవా ? ఇంతకు ముందే గదా విమానం నడిపించాడు....నడిపించటమేమిటి ? అతని చేతిలో కీలుబొమ్మ ఆడినట్టు లాడింది !....

"ఏదీ, చూపించు !" తీరా పాదాలు లేవనేదే నిజమవుతుంది కాబోలు నన్న భయమూ కంఠంలో వ్యక్తమయింది.

ఈ విధంగా ప్రశ్నించాడని అతనిమీద కోపం రాలా, ఎదుటిమనిషి కి యదార్థం తెలిస్తే, ఏమంటాడో అనే భయంకూడా కలిగింది కాదు. గారడీవాడు ఖాళీ బుట్టనుండి ప్రేక్షకులకు కుందేలును తీసి చూపించినట్టు, తన పంట్లామును పైకిలాగి పాదాలను చూపించాడు.

అల్యూమినియమూ, తోలుతో చేసిన కృత్రిమ పాదాలగుపించాయి. నౌమవ్, విమాన మరమ్మతు మనుష్యులూ, పైకెగరటానికి వచ్చినవారూ, ఆ పాదాలను చూస్తూ రాతివిగ్రహాలమాదిరి నిలబడ్డారు.

తా నర్సంలో చూసిన విషయాలన్నీ ఇప్పుడు నౌమవ్‌కు బోధపడ్డాయి. అతని ఆదుర్దా, ముఖంలో వ్యక్తమయిన బాధా, కారినకన్నీరూ, ఇంకా చివంత కాలం ఎగరాలనే ఆశా : నౌమవ్ వీటికన్నిటికీ కారణమీపాదాలేవని గ్రహించాడు. ఎదుటిమనిషిని గురించి ఏమనాలో, అతని నెవ్విధంగా మెచ్చుకోవాలో తెలిసిందికాదు. ఒక్క గంతువేసి అతనిచేతిని పట్టుకొని, గట్టిగా అనుమతూ :

"సోదరా ! ఎట్లా వీలయింది ? నీకు తెలియదు. నీకు బొత్తిగా తెలియనే తెలియదు. నీ వెట్టి మనిషివో నీకే తెలియదు. తమ్ముడూ" అన్నాడు.

ఆ దెబ్బతో అలెక్సీ భావిజీవితపుసమస్య తీరిపోయింది. వారిద్దరిమధ్యా గొప్ప స్నేహమంకురించి, దినదినాభివృద్ధి చెందింది. సాయంకాలం విమానాశ్రయం మీద సంచరిస్తూ అలెక్సీ పొందవలసిన తరిఫీదును గురించి ఆలోచించారు. అలెక్సీ తన తరిఫీదు విషయంలో చాలా మెలకువగా నుండాలి. ఏ పొరబాటువల్లో ఏ చిన్న ప్రమాదం సంభవించినప్పటికీ, పాదాలు లేనివాడని, అతనిని త్రోసిపుచ్చుతారు, నిర్దాక్షిణ్యంగా. కాబట్టి తగిన తరిఫీదును పొందుట మవసరం. అప్పుడే వాల్గానదీతీర నగరపుటా కాశయుద్ధంలో పాల్గొనే అదృష్టమాతనికి కలుగుతుంది. అచ్చటి పైమానికులంతరూ హేమాహేమీలు. తానూ ఒకటోనంబరు పైమానికుడని తిరిగీ పేరు సంపాదించటానికి పూనుకొన్నాడు, అలెక్సీ.

# 9

అలెక్సీ పైమానిక కళాశాలలో ఐదునెలలున్నాడు. విమానాశ్రయమంతా మంచుమయం అవటంవల్ల విమానాలు పరుగెత్తడానికి పట్టాలేర్పాటు చేసారు. ఆకురాలు కాలమప్పుడగుపించే ఘనందయిన రకరకాల రంగులకు మారుగా, పైకెగిరినప్పుడు రెండే రెండు రంగులు కనిపించాయి : తెలుపూ, నలుపూ. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం రష్యనులకు జయమొనగూర్చింది. జర్మనుల ఆరోదళం సర్వనాశనమయింది, పాలస్ పట్టుబడ్డాడు. ఇవన్నీ జరిగి కొంత

కాలమయింది. దక్షిణాన ఇంతవరకూ ఆత్మరక్షణార్థం జరిగిన పోరుతీరుమారింది, శత్రువిజయానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. జనరల్ రౌట్ మిస్ట్రొవ్ టాంకు దళం జర్మను సైన్యంలో చొరబడి వారిని, వెనుకనుండి వేధించుకుతింటోంది. యిటువంటి యుద్ధసన్నాహాలు జరిగేరోజులలో ఆకాశంలో ఘోరమైన విమాన యుద్ధాలు జరిగేటప్పుడు చిన్నచిన్న విమానములలో ఎగరటం అలెక్సీ కెంత మాత్రమూ గిట్టిందికాదు. పూర్వం గంటలతరబడి ఆస్పత్రి వరండాలో పచారులు చెయడంకంటె, కాళ్ల వాచిపోయేటట్టు నృత్యం చేయడంకంటె ఇప్పుడీ కళాశాలలో తరిఫీదుపొందుతూ కూర్చొనటం ఎక్కువ కష్టమని తోచిందాతనికి.

ఆస్పత్రిలో నున్న రోజులలో తానేవిధంగానయినాసరే యుద్ధవిమానంలో ఎగిరితీరాలని శపథం చేసుకొన్నాడు. ఇంతవరకూ నెగ్గుకుంటూ వచ్చి, తీరా ఇప్పుడు విరమించటం కలలోనివార్త. ఓపిక పట్టాలి. ఒకరోజు ఆస్పత్రినుండి నర్సు క్లాడియా పంపించిన పెద్దకవరు వొకటి అలెక్సీకి తపాలా జవానిచ్చాడు. అందులో కొన్ని పుత్తరాలున్నాయి. క్లాడియాకూడా తానొకజాబువ్రాసి వాటితో జత గూర్చి పంపించింది. తానెట్లున్నదీ, ఎంతవరకూ తన మనోరధ మీదేరిందీ, ఇంకా ఎన్ని దినాలలో సంపూర్ణవిజయం చేజిక్కే దానిని గురించీ వ్రాయమన్నదామె.

"నా వుద్దేశం నెరవేరిందా ? ఎంతవరకూ ?" అని తన్ను తానే ప్రశ్నించు కొన్నాడు. వచ్చిన వుత్తరాలన్నీటినీ విడిచేసాడు, కొన్ని తన తల్లి వ్రాసినవీ, ఒకటి ఓల్గా దగ్గిరినుండీ, మరొకటి గ్రిగొరీ వ్రాసినదీ వున్నాయి. ఇంకా వొక జాబాతని కెంతో ఆశ్చర్యం కలిగించింది. అందులోని దస్తూరీ వాతావరణాలయపు టమ్మాయిది." కాని జాబువెలుపల "కుకుష్కిన్ నుండి" అని వున్నది. దీనిని మొదట చదివాడు.

కుకుష్కిన్ తిరిగీ విమానం నుండి క్రింద పడిపోయాడు." తన విమానానికి దెబ్బతగిలి, నిప్పంటుకొన్నది. ఎట్టాగో కాలే విమానంనుండి బయట పడి నప్పటికీ చేతి ఎముక తొలగటంవల్ల తిరిగీ ఆస్పత్రిలో నుంటున్నాడు. ఈ డాక్టర్ల చేతులలోపడి నలిగిపోతున్నా" డట, తిరిగీ కొద్దిరోజులలో విమాన దాడిలో పాల్గొంటాడనే గట్టినమ్మక మాతనికి కలదు. తన స్నేహితురాలు వీరాగాత్రిలోవాని అలెక్సీ మరిచిపోలేదని తాను అనుకొంటున్నాడనీ, ఈ అమ్మాయి నందరూ ఇప్పటికీ "వాతవరణాల యసార్జెంట్" అంటారనీ వ్రాసాడు. ఈమె చాల్లా మంచిది. ఆమె చేతనే ఈ వుత్తరం వ్రాయిస్తున్నాడు. తనకీ కష్ట సమయంలో ఇటువంటి స్త్రీ స్నేహం కుదరటం తన అదృష్టం యీ పై మాటలు వ్రాసి, "ఇవన్నీ కుకుష్కిన్ యొక్క ముఖ ప్రీతి మాటలని" స్వకీయవాక్యము నొకటి ఇరికించింది, ఇక్కడ. అలెక్సీ నెవ్వరూ మరిచిపోలేదు. వారి భోజనాలగది నలంకరించే వీరాగ్రేసరుల ఫోటోలలో అలెక్సీ పటంకూడా వున్నదట. పాత స్నేహితులందరూ తప్పకుండా తిరిగీ అలెక్సీ వైమానిక దుస్తులతో విమానం దిగి

అక్కడికి వస్తాడని పలుమారు చెప్పుకొంటారు. అక్కడనున్న తన పాత వైమానిక దళమును గౌరవించి, పతకము నొకటి యిచ్చారన్నది అలెక్సీకి బాగా తెలుసు. ఇంత ముఖ్యమైన విషయమును గురించి పల్లెత్తుమాటయినా వ్రాసాడు కాదు. కుకుష్కినూ, ఆతనికి వుత్తరాలు వ్రాసిపెడతానని ముందుకు వచ్చిన ఈ అమ్మాయీ పై విషయమును మరిచిపోవటానికి కారణం? బహుశా. వారొకరి కొక రెదురుగా కూర్చుంటే. లోకాన్ని మరిచిపోతారుకాబోలు ననుకొని అలెక్సీ నవ్వుకొన్నాడు.

తరువాత తన తల్లి వ్రాసిన జాబును చింపిచూశాడు. తల్లులు తమ బిడ్డలకు వ్రాసే జాబు: ప్రేమా, వారి మంచిచెడ్డలను గురించిన ఆదుర్దా, సలహాలతోనూ నిండి వుండిందది. ఊరి సంగతులన్నీ వ్రాసిందా తల్లి: ఇంకా ఎక్కువ చలిగా నుంటోందా? కావలసినంత భోజనం పెడుతున్నారా? చలికాలానికి ఉన్నిచొక్కాల నిచ్చారా? ఒక జత వున్ని గ్లవ్‌లను కుట్టిపంపించమంటావా? అని ఎన్నెన్నో ప్రశ్న లడిగింది. తాను ఐదు జతల గ్లవ్‌లను కుట్టి, ఎర్రసైన్యానికి పంపించిందట. ప్రతిదాని బొటనవ్రేలిలోపలా "దీనిని నీవు చిరకాల ముపయోగించునట్లు దీవిస్తున్నానని" కాగితంమీద వ్రాసిపెట్టింది. బహుశ, తాను పంపిన జత నొకటి తనకు వచ్చి చేరింది కాబోలు! తమ యింటియందున్న నాలుగైదు సీమకుందేళ్ళనుండి తీసిన మెత్తటి ఉన్నినుండి వాటి నల్లింది. అవి చాలా మృదువుగానూ, వెచ్చగానూ వుంటాయనడానికి సందేహంలేదు. ఇప్పుడు తమ గృహంలో నొక మొగ కుందేలూ, ఆడు దొకటీ, ఏడు పిల్లలూ వున్నాయి. ఇటువంటి విషయా లెన్నో వ్రాసి, ఉత్తరం చివరిలో అసలుముఖ్యమైన విషయమును తెలిపింది. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం మనవారికి జయప్రదంగా ముగిసింది. లెక్కకు మించినంతమంది జర్మనులు మృతినొందారు. వారి సైన్యాధికారులలో ముఖ్యమైన వా దొకాతనిని ఖైదు పట్టారట. జర్మనులను తరిమేశాక, ఓల్గా ఐదుదినాలు సెలవుమీద ఇంటికి వచ్చింది. ఓల్గా వుండే యింటిమీద బాంబు పడి, అది భూమట్టమైపోయింది. తనతో, తమ గృహంలోనే ఆ ఐదు దినాలూ గడిపింది. ఇప్పుడొక సైనికదళంలో లెఫ్టినెంటుగా ఓల్గాను నియమించారు. ఆమె భుజానికి దెబ్బ తగిలిందట. కాని, ఇప్పుడది పూర్తిగా బాగయింది. ఆమె సాహసానికి మెచ్చుకొని ఓల్గాను సైనికాధికారులు "గౌరవించార"ని వ్రాసిందేకాని, ఏరీతిగా గౌరవించారో తెలిపిందికాదు. ఇంటియందున్న నాలుగు రోజులూ వొకచే నిద్రపోయిందనీ, మెలకువగా నున్నప్పుడెప్పుడూ తనమాట తప్ప మరొకటి మాట్లాడలేదనీ వ్రాసింది. వారిద్దరూ పేకముక్కలతో తమ తమ అదృష్టాలను లెక్కించుకొన్నారట" ప్రతివొక్క పర్యాయమూ కళావరు రాజుముక్కమీద, ఆరకు రాణీముక్క వచ్చేది. తన తల్లి చమత్కారంగా వ్రాసిన ఈ వాక్యం యొక్క అంతరార్థం అలెక్సీకి బోధపడింది! ఇక తనమాటా? ఆ ఆరకు రాణీకిమించిన స్త్రీ మరొకతె ఈ లోకంలో న్నుదని. ఆ రాజుగోమత

తనకు కోడలయితే అంతకు మించిన భాగ్యం వేరొకటుంటూ వుండదని వ్రాసిందా పిచ్చితల్లి.

అలెక్సీ తనతల్లి అమాయకత్వానికి నవ్వుకొని, "అరకురాణీ" వుత్తరమును చదవటానికి మొదలుపెట్టాడు. అదేమంత పెద్ద జాబుకాదు. కాలువలు త్రవ్వటం పూర్తిచేశాక, తమలో కొందరిని సైనికశాఖకు చెందిన వొక దళంలో చేర్చారట. ఇప్పుడామె లెఫ్టినెంటుగా నుంటోంది. తన దళంవారందరూ చేరి, పైనుండి శత్రు విమానాలు బాంబులవర్షం కురిపిస్తూన్నా లెక్కచేయక కుర్గాన్‌చుట్టూ, జర్మను సైన్యం రాకుండా అడ్డాలు నిలబెట్టారట. దీనిఫలితంగా కుర్గాన్‌వారి చేతుల్లో పడింది కాదు. ట్రాక్టర్లు తయారుచేసే కర్మాగారంచుట్టూకూడా తన దళంవారిట్టి అపుదలనే నిర్మించారట. సైనికశాఖవారు దీనికి చాలా మెచ్చుకొని తన దళానికి "ఎర్రపతాక" మిచ్చి గౌరవించారు. డబ్బా మాంసంనుండి పాలవరకూ ప్రతివొక్కటీ వోల్గానది కావలిగట్టునుండి రావాలి. చాలా కష్టంగా నుంటోంది, బ్రతుకు. నగరంలో పడి పోకుండా నిలబడిన భవనమంటూ లేదట. నేలమీదపడిన బాంబులుచేసిన గుంతలను లెక్కపెట్టటం కష్టం. చంద్రుడి ఫొటోగ్రాఫులో మాదిరి. భూమి గోతులతో నిండి పోయింది.

తానూ ఇంకా మరికొందరూ ఆస్పత్రినుండి విడుదల అయినవెంటనే, వారి నందరినీ కారులో స్టాలిన్‌గ్రాడ్‌ను చూడటానికి తీసుకొని వెళ్ళారు. నగరమంతటా జర్మను శవాలగుపించాయి. పూడ్చిపెట్టడానికి కుప్పలు కుప్పలుగా వాటిని పేర్చారు. ఇవిగాక రోడ్డుపొడుగునా ఎన్నోశవా లున్నాయి. "నీ స్నేహితుడు, టాంకుదళాధికారి—అతనిపేరు మరిచిపోయాను—వచ్చి ఈ దృశ్యం చూస్తే బాగుండేది. అతని వూరును నేలమట్టంచేసి, అతని వారయిదుగురినీ వురితీసారు, జర్మనులు, ఇదంతా ఫొటోలుతీసి, అతనివంటి వ్యక్తులనందరికీ సినిమాల్లో చూపించి తీరాలి. జర్మనులమీద పగనెంత గొప్పగా మనం సాధించిందీ. లోకానికంతా తెలియాలి." తరువాత చిన్న దస్తూరిలో ఈవిధంగా వ్రాసింది. అలెక్సీవంటి వీరాగ్రేసరుని పొంద టానికి అర్హత తనకిప్పుడు. ఈస్టాలిన్ గ్రాడ్ యొద్ధంతో సిద్ధించిందట వెళ్ళే రైలులో, అదేదో వొక స్టేషనులో ఆగినప్పుడీ జాబును ఆదరాబాదరా గీకిపారేసిం దట. తామెచ్చటికి వెడుతున్నారో తన కింతవరకూ తెలియదు, కాబట్టి తన తపాలా నెంబరు వ్రాసే అవకాశంలేదు. ఇందువల్ల అలెక్సీ తిరిగి ఆమెదగ్గిరినుండి వుత్తరం వచ్చేవరకూ బదులు వ్రాయడానికి వీలులేకపోయింది. నల్దిక్కులా చెలరేగే యుద్ధమును లెక్కచేయకుండా బలహీనురాలూ, అబలా అయిన తాను సాధించిన సాహసకార్యాలవల్ల "వీరవనిత" అనే బిరుదున కర్హతను సంపాదించు కొన్నదని వ్రాయాలని యెంతో తహతహపడ్డాడు. ఉత్తరమును ఇటూ, అటూ త్రిప్పి చూశాడు. "వ్రాసినవారి చిరునామా" ఈ విధంగా కనుపించింది: "రక్షణ దళ జూనియరు లెఫ్టినెంటు, ఓల్గా...."

వీలుచిక్కినప్పుడల్లా అలెక్సీ ఈ జాబును చదివేవాడు. అటువంటప్పుడాతని రక్తం వెడెక్కి అపారమైన ఆ చలిని భరించడానికి వీలుకలిగేది. విమానాశ్రయం లోనూ, తాను నివసించే "9-ఎ" నంబరు గదిలోనూ ఎప్పుడూ ఒకటె చలిపెట్టేది.

లెఫ్టినెంట్ నౌమవ్, అలెక్సీతుది పరీక్ష కొక రోజును నియమించాడు. "ఉట్యోనోక్" విమానము నాత డుపయోగించడానికి నిశ్చయింపబడింది. నౌమవ్‌కు బదులు, కళాశాలాధికారి స్వయంగా వస్తాడనీ, పరీక్షిస్తాడనీ అలెక్సీకి తెలపారు. ప్రప్రథమంలో తా నిచ్చటికి వచ్చినప్పుడీ యధికారి చీదరించుకొని తన మాట విన కుండానే వెళ్లిపోయాడు. ఇది జ్ఞప్తికి వచ్చి అలెక్సీ కీ మనిషి అంటె భయం వేసింది.

క్రింద నిలబడినవా రందరూ రెప్ప వాల్చకుండా తన విమానమును చూస్తు న్నారనీ. ఎంత స్వల్పమైన తప్పు చేసినా గొప్ప ముప్పు వాటిల్లుతుందనీ అలెక్సీ గ్రహించబట్టి అద్వితీయ కౌశల్యం చూపించాడా రోజు. ఆ చిన్న విమాన మాతని చేతుల్లో కీ-బొమ్మగా మారిపోయింది. పల్టీలు కొట్టించాడు. ప్రక్కకు వొరిగాడు. మీదపడేటట్టు క్రిందికి చర్రున దిగి, ఉన్నట్టుండి తుర్రున పై కెగిరాడు. యిదంతా చూస్తూ నిలబడిన కళాశాలాధికారి ముఖం విప్పారింది. నౌమవ్, "బలే", "సెబాష్", "భేష్" అంటూ గొంతెత్తి ఎన్నో పర్యాయము లాటవి వచ్యలు మెచ్చు కొన్నాడు. విమానం దిగివచ్చే అలెక్సీకి సంతోష పూరితమైన అధికారి ముఖం అంత దూరానికే స్పష్టంగా కనుపించబట్టి "ఫరవాలేదు" అనిపించింది.

"నలుగురిమాదిరి వాడవనుకొన్నాను. అసామాన్యుడవని ఇప్పుడు తెలిసింది ఇదంతా స్వయంకృషివల్ల వచ్చేదికాదు. ఈశ్వరకటాక్షం. "పుట్టుకతోనే వైమా నికుడ"నేవారే కొద్దిమందో వుంటారు....ఇదిగో నేను చెప్పేమాటను జాగ్రత్తగా విను. నీవంటివారీ కళాశాలలో ఇతరులకు తరిఫీదు నీయటానికి కావాలి. ఇక్కడే వుండరాదా ?అని అడిగాడు.

అలెక్సీ యెంతమాత్రం కూడా దానికి ఒప్పుకోనన్నాడు.

"శుద్ధ తెలివిహీనుడివి. ఎవడయినా యుద్ధం చేయడానికి వీలవుతుంది. ఇక్కడవుంటే పదిమందికి యుద్ధంచేయటం నేర్పించడానికి వీలవుతుంది".

అలెక్సీ చేతిలోనున్న కర్ర అతనికి కనుపించింది. ఒళ్లు మండిపోయింది. "తిరిగీ చేతికర్రా ?" అని బిగ్గరగా అరిచాడు. ఏదీ, నా చేతికియి, చేతికర్రా, బెత్తమూనూ ! షికారుకు బయలుదేరా వనుకొన్నావు కాబోలు ! నగర వీదులలో నడుస్తున్నావా ? చేతికర్ర !.... ఆజ్ఞా తిరస్కారానికి, నీకు నలభై యెనిమిది గంటలు శిక్ష విధిస్తున్నాను. ఒంటరిగా గార్డు గదిలో నుండాలి.... మొనగాడు!.... చేతికర్రలూ, బెత్తాలూ, కొరడాలూనూ !.... ఇవ్వాళ చేతికర్రా, రెండు రోజులు పోతే వ్రేళ్ళకు గోరింటాకూ ! ఇంజనుకు పసుపూ పారాణీ !.... నలభై ఎనిమిది గంటలు ! విన్నావా ?"

అలెక్సీ చేతినుండి ఆ కఱ్ఱను లాగుకొని అటూ ఇటూ చూసాడు. ఏదన్నా కనబడితే దానికి మోది ఆ కఱ్ఱను విరిచిపారేయాలని.

సౌమవ్ సవినయంగా చేతులు నులుముకొంటూ, "లెఫ్టినెంట్ కర్నల్ సోదరా ! ఈ మనిషికి పాదాలు లేవన్న సంగతి తమకు విన్నవించుకొంటున్నాను" అన్నాడు.

ఆ యధికారికి మరింత కోపం వచ్చింది. ముఖం కందింది. ఆంబోతు మాదిరి బుసలుకొడుతూ.

నాతో హాస్యా లాడబోకు జాగ్రత్త. ఏమిటా అర్థంలేని వాగుడు ?" అని అలెక్సీని చూసి, "నిజమేనా ?" అని ప్రశ్నించాడు,

ఔనని తల వూపాడు, ఏనిమిషాన యెక్కడ విరిగిపోతుందోననే భయంతో తన చేతికఱ్ఱవంక చూస్తూ దిగులొందాడు. వాసిలెవిక్ తనకిచ్చిన ఈ చేతికఱ్ఱను ప్రాణప్రదంగా కాపాడుకొన్నాడు. ఇన్ని రోజులూ.

అంతటాయన అక్కడవున్న నలుగురినీ చూడకుండా ముఖమొక ప్రక్కకు త్రిప్పి :

"అట్లాగా ?....నీవనేది నిజమయితే ..." ఈ చేతికఱ్ఱ....ఏవీ ! పాదాలు చూపించు...." అన్నాడు.

ఒకటోనంబరు యోగ్యతా పత్రమును అలెక్సీకా యధికారి ప్రసాదించి, కళాశాలనుండి వెళ్ళవచ్చునని చెప్పాడు. వైమానిక కళఅంటే ఏమిటో సాము లాగ్రంగా తెలిసిన ఆ యధికారి అలెక్సీ నైపుణ్యాన్ని మెచ్చుకున్నాడు. "నేర్పరి. అనుభవజ్ఞుడు. ధృఢ విశ్వాసమూ, కార్యదీక్ష కలవాడీ అలెక్సీ. వైమానికశాఖలో అలెక్సీ చేయజాలని పని అంటూలేదు." అని వ్రాసియిచ్చాడు.

# 10

ఆ చలికాలమంతా, వసంతకాలంలో ఒక నెలకుపైగా వేరొక సంస్థలో అలెక్సీ కాలం గడిపాడు. ఇచ్చట బహు చక్కని విమానాశ్రయమూ, అన్ని సదుపాయాలూ గల వసతిగృహమూ, ఆటపాటల కేర్పాటులూ వున్నాయి. దీనికి చెందిన నాటకశాలలో మాస్కో నగరంనుండి పేరుపొందిన నాటకసంఘాలవారు వచ్చి నాటకాలాడుతారు. ఇచ్చటకూడా, ఆ రోజుల్లో మితిమీరిన జనముండేవారు. యుద్ధసమయంకదా ఏ విధంగానుంటే ఏమని నిబంధనల విషయంలో ఏమరు పడటానికి వీలుండేదికాదు. తొడుగుకొన్న దుస్తుల్లో ఎట్టి లోపమున్నప్పటికీ, లేక బూట్లకు, ముఖం చూసుకొనేటట్లు మెరుగు పెట్టకపోయినా ; ఏగుండీయో కోటుకు

లేకపోయినా, వెంటనే అప్పటికప్పుడె, సలుగురిముందూ ముఖం వాచేటట్లు చీవాట్లుపెట్టి రెండు గంటలు కఠిన కవాతుశిక్షను విధించేవాడు.

ఎల్ - ఎ 5 అనబడే కొత్తరకం రష్యను విమానమొకటి తయారుచేశారు. అలెక్సీ, అతని శాఖకు చెందినవారూ దీని నుపయోగించటం నేర్చుకొంటు న్నారు. కేవలం విమానమును నడపించటం మాత్రమే కాక దాని ఇంజనును గురించిన సకల విషయాలూ వారు నేర్చుకొంటున్నారు. అప్పటివారికి చెప్పే పాఠాలను వినటంవల్ల గత కొద్దినెలల కాలంలో రష్యనులు. విమాన నిర్మాణంలో ఎన్నెన్నో గొప్ప మార్పులు చేశారని అలెక్సీకి విదితమయింది. యుద్ధం మొదలు పెట్టిన రోజుల్లో కొత్తగా కనిపెట్టబడిన విషయాలు యిప్పటికప్పుడె పాతబడి పోయాయి. వేగంగా ఎగరటానికి పేరొందిన "స్వాలో" విమానాలనూ, ఎత్తున కెగరటంలో ప్రఖ్యాతిజెందిన "మిడ్జెట్" విమానాలనూ యిప్పు డుపయోగించటం మానుకొన్నారు. నూతనరకపు విమానాలను, బహుస్వల్పకాలంలో రష్యనులు తయారుచేయటం నేర్చుకొన్నారు, సరికొత్తరకాలు, "యా-క్" విమానములూ, ఎల్-ఎ-5 విమానాలు విరివిగా వాడుతున్నారు. "115" అనబడే విమానంలో ఇద్దరే కూర్చోవచ్చు. ఇవి నేలదారున ఎగిరేటప్పుడు జనులమీద బాంబులనూ, తూటాలనూ గురిపెట్టి విసిరేవి. వీటికే రష్యనులు 'ఎగిరే టాంకు'లనీ పేరు పెట్టారు. జర్మను ఏ విమానాల వాతబడి యెందరో ప్రాణాలు కోల్పోయారు. వీటికి జర్మనులు "మృత్యువ"ని పేరుపెట్టారు. ఈ కొత్త విమానాల నుపయోగించే వారికి వాటి ఇంజనులగురించీ, వాటిని ఎగుర వేయటంమాత్రమూ తెలిస్తే చాలదు. అద్వితీయమైన ధైర్యమూ, ఎంతటి ఘోరయుద్ధం జరుగుతున్నా చటుక్కున తా మెచట నున్నదీ లెక్కించి తెలుసుకొనటమూ. జరుగుతూన్న విమానయుద్ధమును ఏకాంతంగా అవలోకింపుచేసుకొని, ఏ సమయంలో యెచ్చట తాకితే శ్రేయస్కరమో నిర్ణయించుకొని విమానాశ్రయంనుండి ఆజ్ఞలకొరకు యెదురుచూడకుండా తామే తగినరీతిని వర్తించగల శక్తికూడా కావలసివున్నవి.

ఈ విషయాల నన్నిటినిగురించీ తెలుసుకొనటం చాలా సరదాగానున్నది. కాని, ఘోరాతిఘోరమైన యుద్ధాలు సాగుతూన్న ప్రదేశంలో నుండే బదులు సురక్షితంగా యీ భవనంలో బల్లలమీద కూర్చొని పాఠాలు నేర్చుకొనటం అలెక్సీ కనుమాత్రమూ నచ్చిందికాదు. అమాంతంగా యెగిరివెళ్ళి యుద్ధంలో దుమకా లనిపించింది. ఎంతటి శారీరకబాధనయినా సహించడానికి వీలున్నదనిపిం చింది. కాని ఎట్టిపనీ చేయకుండా సోమరిపోతు జీవితమును గడపట మాతనికి దుర్భరమనిపించింది. తరుచుగా యేది చేయటానికీతోచక ఇక్కడా. అక్కడా వెర్రిపట్టినవాడిమాదిరి దిగాలుపడి తనలో తాను క్రుంగుకుపోయి తిరిగాడు అలెక్సీ.

అదృష్టవశాన మేజర్ స్ట్రిఖొవ్ కూడా అలెక్సీ వచ్చిచేరిన పదిదినాల తరువాత ఇచ్చటికి వచ్చాడు. వారిద్దరిమధ్యా గల పూర్వస్నేహం ఇప్పుడు మరింత గాఢంగా

పెరిగింది. వచ్చీ రావడంతోనే. మేజరు ఇచ్చటి వాతావరణానికి అలవాటుపడిన వాడిలాగా నడుచుకొనటం మొదలుపెట్టాడు. అన్ని నిబంధనలూ పాటిస్తూ, నలుగురితో కలిసిమెలిసి వుండేవాడు. అలెక్సీ పడే మనోవ్యధకు కారణమును మేజరు బహు సులభంగా గ్రహించాడు. ఒకనాటి రాత్రి వారిద్దరూ వారి వారి గదులకు పడుకోడానికి వెళ్ళబోయేటప్పుడు, మేజరు అలెక్సీ పొట్టలో వ్రేలుపెట్టి పొడచి,

"ఊరికే దిగాలుపడి ఏడిస్తే ప్రయోజనం ? మనిద్దరికీ యుద్ధంచేసే అవకాశాలింకా ఎన్నో వున్నాయి. మనస్సుతీరా యుద్ధం చేయవచ్చు. బెర్లిను నగరానికింకా ఎంతో దూరమున్నది. ఎన్ని మైళ్ళో వెడితేనేగాని బెర్లిను నగరం తగలదు. అది మన ఒష్యనుల వశమయ్యేలోగా యుద్ధంలో చేరే అవకాశం మనకు తప్పక కలుగుతుంది. చేతినిండా యుద్ధం" అన్నాడు.

రెండు నెలలక్రితం చూసిన మేజరుకీ ఇప్పటి స్ట్రిఖొవ్‌కూ ఎంతో భేధం కనిపించింది. బాగా చిక్కిపోయాడు. సాధువయ్యాడు. ముక్కుత్రాడు కట్టిన ఆబోతుమాదిరి" మచ్చికపడ్డాడు.

ఒలికాలం రెండు నెలలు గడిచింది. అలెక్సీ, మేజరు స్ట్రిఖొవ్ వుండే దళం వారు కొత్త విమానంలో ఎగరటం ప్రారంభించారు. అలెక్సీకి ఎల్ ఏ - 5 విమానంతో బాగా పరిచయమేర్పడింది. పొట్టి రెక్కలు గల ఆ చిన్న విమానమును చూసినప్పుడల్లా అతనిక ఎగిరే చేపలు జ్ఞాపకానికి వచ్చేవి. తీరికగా నున్నప్పుడల్లా విమానాశ్రయంలో నిలబడి ఒవంత దూరంమాత్రమే నేలమీద పరుగెత్తి వెంటనే పైకిలేచే ఎల్ ఎ - 5 విమానములను చూస్తూ కాలం గడిపేవాడు. అవి మేఘమండలంలో మలుపు తిరిగినప్పుడల్లా వాటి క్రింద భాగం తళుక్కున నీలిరంగుతో మెరసేది, నేలపై నున్న విమానమును సమీపించి.

దాని ప్రక్కలనూ, రెక్కలను యెంతో అప్యాయంగా చేత్తో తాకేవాడు, అదేదో ఒక పందెపు గుర్రమన్నవిధంగా. అలెక్సీ అతని శాఖకు చెందిన వారందరినీ వరుసగా విమానాశ్రయంలో నిలబెట్టారు యెగిరి వెళ్ళడానికి. వారందరికీ యెప్పుడెగురుదామా అని వుండబట్టి నేను ముందంటే. నేను ముందంటూ, చిన్నపిల్లల మాదిరి పంతులు వేసుకోటం మొదలు పెట్టారు. అచ్చటి అధికారి మొట్టమొదటగా మేజర్ స్ట్రిఖొవును ఒమ్మన్నాడు. నలుగురినీ చూచి "చూశారా ?" అన్నట్టు నవ్వాడు. బహు చలాకిగా యీల వేసుకొంటూ వెళ్ళి, పారాషూట్ గొడుగుత్రాళ్ళను నడుముకు బిగించుకొని, విమానంలో యెక్కి కూర్చున్నాడు.

గర్జించి, లంఘించి విమానం కదిలింది. నేలమీద పరుగిడుతూ పిండివంటి మంచు మేఘమును లేవనెత్తింది. ఆమేఘంలో సూర్యకిరణాలుపడి ఇంద్రధనస్సులు ఒకదాని నొకటి తరుముకొంటూ ఆటలాడుకొన్నాయి. విమానం పైకిలేచి, చూస్తూ వుండగా యెంతో యెత్తుకు వెళ్ళింది. ఎండపడి దానిరెక్కలు జిగేలు మన్నాయి.

విమానాశ్రయంమీద మలుపు తిరిగి అనేక పర్యాయములు ప్రక్కలకు వొరిగాడు స్ట్రికోవ్. ప్రక్కవాటుగా వొర్లి విమానం వర్తిస్తు కొన్సాగింది. ఇంకా యేన్నో చిత్ర విచిత్రాలుగా వానిని నడిపించాడు. ఆకాశంలోని కెగిరి, అదృశ్యమై, శిలాశాల భవనం కప్పును తాకేటంత క్రిందికి దభీమని దిగాడు. క్రిందనున్నా నిలబడినవారి నెత్తిటోపీలు దాని గాలికి యెగిరిపోయేటంత వేగంగా క్రిందికి యెగిరి, తిరిగి మేఘాలచాటున పోయాడు. తరువాత నెమ్మదిగా క్రిందికి దిగివచ్చి మూడు చక్రాలూ భూమికానేటట్లు నేల వ్రాలాడు. చిన్న పిల్లవాడిమాదిరి ఒక్క గంతువేసి క్రిందికురికి, వెర్రి ఆనందం పుట్టినట్ల నవ్వుతూ వారి దగ్గరికి పరుగెత్తుకొంటూ వచ్చాడు.

"ఇది విమానంకాదు ఫిడేలు. రష్యాగొప్పా అద్భుతమైన ఫిడేలు"అన్నాడు. అంత అభూయిష్యంగా యెగరకూడదని అచ్చటి అధికారి స్ట్రికోవ్‌మీద కోపగించు కొన్నాడు. దానిని వినిపించుకోనట్లు "యీ ఫిడేలుమీద యేపాటపడితే ఆ పాటను వాయించవచ్చు. అలెక్సీ! మనము బ్రతికి వాగుపడే రోజులు వచ్చాయంటూ" అతని కౌగలించుకొన్నాడు.

తరువాత అలెక్సీ వంతువచ్చింది. విమానంలోని కెక్కి పాదాలను తోలు పట్టాలతో దిమ్మలకు బిగించి, రివ్వున పైకి లేచాడు. త్వరలో ఈ విమానం సాధారణమైనది కాదనీ, బహు జాగ్రత్తగా నుండటమవసరమనీ గ్రహించగలిగాడు. పాదాలు లేనివాడు మరింత జాగ్రత్తగా నుండటమవసరం. పైకి లేచినట్టే అతనికి తెలిసిందికాదు; అంత సుతిమెత్తంగా లేచింది. విమానం సంపూర్ణ వివేకం గలిగినట్లు వర్తించింది. తాకీతాకనట్టు స్పృశించితే చాలు వెంటనే బదులు పలికింది. ఏవంతగా వ్రేలు కదిపితే క్రొత్త స్వరంపలికే ఫిడేలు మాదిరీవిమానం బహు మెళుకువగా వర్తించింది. ఎంత చక్కగా చేసినప్పటికీ, ఎంత సదుపాయంగా నున్నప్పటికీ, కృత్రిమ పాదాలు కృత్రిమ పాదాలే, అవెన్నటికీ నిజమైన పాదాలకు సమం కాజాలవన్న కొంత ఈ విమానమును నడపటంవల్ల అలెక్సీకి వ్యక్తమయింది.

విమానం బహు నున్నితంగా ప్రక్కకు తిరిగింది. నడిపించే చక్రమునెంత తేలికగా తాకినప్పటికీ, వెంటనే విమానము సందేశమును గ్రహించి బదులు పలికింది. ఇటువంటప్పుడు నిజమైన పాదాలుమాదిరి, కృత్రిమపాదాలు వెనువెంటనే పని చేయలేకున్నాయని అలెక్సీ గ్రహించాడు. నాడీమండలంద్వారా అంగాంగానికీ గల అన్యోన్యమైత్రీ, దాని ఫలితంగా సంభవించే స్వాభావికక్రియా ప్రతిక్రియలూ కృత్రిమ పాదాల నుపయోగించటంవల్ల జరగటం తేలికయినపని కాదు. రవంత ఆలస్యంగా పాదాలు వర్తించటం మూలంగా తనకూ, విమానానికీ కూడా గొప్ప ప్రమాదం జరిగే అవకాశాలున్నాయి. చచ్చిపోతాననే భయమాతనికి లేదు. కాని, ఏదన్నా పొరబాటు జరిగితే, తాను కట్టిన మేడలన్నీ గాలిమేడలుగా మారిపోతాయి.

తన ఆశలన్నీ అపోహలై పోతాయి. వైమానిక జీవితాని కిక ఈ జన్మకు నీళ్ళు వదులుకోవాలి. రెట్టింపు జాగ్రతతో మెలిగాడు, కాని, ఇంతవరకూ వున్న ఉత్సాహం ఎక్కడికో వెళ్ళిపోయింది. నిరుత్సాహపడ్డాడు. విమానము క్రిందికి దింపాడు. పాదాలు చురుకుగా వర్తించనందున విమానం సాఫీగా నేల మీద పరుగిడే బదులు గంతులువేస్తూ వెళ్ళింది.

దిగాలుపడి, తలవంచుకొని విమానంనుండి దిగివచ్చాడు. అచ్చటివా రంద రికీ ఏమనాలో తెలిసిందికాదు. కాని అసలే దిగులొందినవాడిని మరింత బేజారగు నట్లు చేయరాదనికాబోలు, అలెక్సీని మెచ్చుకొన్నారు. ఇది అలెక్సీని మరింత నిరుత్సాహపరిచింది. తనమీద జాలిపడట మాతని కెంతో తలవంపులయింది. వారిని కన్నెత్తిఅయినా చూడకుండా తలవంచుకొని, కాళ్ళీడ్చుకొంటూ కళాశాల భవనానికి వెళ్ళిపోయాడు. ఇంతకు పూర్వం విమానయుద్ధంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించిన తా నిప్పు డీవిధంగా అవమానపాలవటం భరించలేకపోయాడు. ఆనాడు తా నెక్కిన విమానం పైన్ వృక్షాగ్రాలను తాకి బ్రద్దలై క్రిందపడిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఆ సమయంలోకూడా తా నింత ఎక్కువగా దిగాలుపడలేదని అలెక్సీకి తోచింది. మధ్యాహ్నం భోజనం చేయలా. రాత్రిపూటకూడా తిండితిన్నాడు కాదు. పగటిపూట వైమానిక దుస్తులు తొడుగుకొని పడుకోవటం అచ్చటి చట్ట విరుద్ధమైన పని. ఇది తెలిసీ అలెక్సీ బూట్లు తొడుగుకొని అంతే పాదా లూడదీయ కుండానే, చేతులమీద తలను మోపి వెల్లకిలా తన మంచంమీద పడుకొన్నాడు. కళాశాలలో పనిచేసేవారూ, ఇద్దరు ముగ్గురు వుపాధ్యాయులూ కూడా ఇదంతా చూశారు. కాని, అతడి మనోవ్యధ వారికి తెలియనిది కాదు; కాబట్టి, చూడనట్టు లూరకొన్నారు. స్ట్రిఖొవ్ వచ్చి చూసాడు. ఎంతో చనువుగా, ఆప్యాయంగా పలకరించాడు. కాని అలెక్సీ తనమానాన తాను పడుకొనే వున్నాడు. గత్యంతరం లేక తనలో తానే ఏదో అనుకొంటూ స్ట్రిఖొవ్ వెళ్ళిపోయాడు.

స్ట్రిఖొవ్ వెళ్లిపోయిన వెంటనే ఆ కళాశాల రాజకీయ శాఖాధికారి, లెఫ్టి నెంట్ కర్నల్ కపుస్టిన్ వచ్చాడు. పొట్టివాడూ, చూడటానికి తొడుగుకొన్న సైనికదుస్తులకూ, తనకూ ఎట్టి సంబంధమూ లేనట్టు కనుపించేవాడు. మొద్దుబారిన కండ్లద్దాలుపెట్టుకొని అంతర్జాతీయ విషయాలనుగురించి ఈతడిచ్చే వుపన్యాసాలను వినటానికి అచ్చటివా రందరూ గుమిగూడేవారు. రష్యను సోవియట్ ప్రజలలో తానూ వొకడుగానుండే అదృష్టం కలిగిందిగదా అని ఉపన్యాసంవిన్న ప్రతి వొక్కడికీ కలిగేది. సైన్య శాఖాధికారులలో వొకడని ఈతని నెవ్వరూ మెచ్చు కొనేవారు కారు. ఏదో అదృష్టంకొద్దీ విమానశాఖలో ప్రవేశించినప్పటికీ, కపుస్టిన్‌కు విమానాల గురించి తెలిసినది బహు స్వల్పం. అలెక్సీని చూడకుండా గదంతా కలయజూచి, రెండు మూడు పర్యాయములు గాలి నెగబీల్చి.

"ఈ గదిలో సిగరెట్టును త్రాగుతున్న దెవరు? సిగరెట్టు త్రాగటానికి వేరేగది వున్నదని తెలియదా? లెఫ్టినెంట్ సోదరా! ఏమిటి దీనికర్థం" అంటూ గర్జించాడు.

పడుకొనే, నిర్లక్ష్యంగా "నేను సిగరెట్టు త్రాగ"నని అలెక్సీ చెప్పాడు.

"పడుకొన్నా వెందుకు? నీకు నిబంధనలు తెలియవా? నీ పై అధికారులు వస్తే లేచి నిలబడాలని తెలియదూ? లే. నిలబడు!"

సైన్యాధికారులు లాజ్ఞాపించినట్టు లాజ్ఞాపించినప్పటికీ, కపుస్టిన్ కంఠంలో అధికారానికిబదులు మైత్రి కనుపించింది. నెమ్మదిగా లేచి నిలబడి సలాముపెట్టాడు అలెక్సీ.

"అది సరీ, లెఫ్టినెంట్ సోదరా! మన మిద్దరమూ సాంప్రదాయాన్ని మంచిపెద్ద లాలోచిద్దా" మని ప్రోత్సాహకరంగా అన్నాడు.

"సంప్రదింపులా? దేనినిగురించి?"

"నిన్ను గురించే. రా, బయటికి వెళ్లి అక్కడ మాట్లాడుకొందాము. నేను సిగరెట్టు కాలుస్తాను. ఇక్కడ కాల్చరాదు".

వరండాలోకి వారిద్దరూ వెళ్ళారు. అచ్చటి విద్యుద్దీపానికి నీలిరంగు బల్బు తొడిగారు. రాత్రులందు దీపాలను ఆర్పివేసే నిబంధన యింకా అమలులోనున్నది. వారిద్దరూ కిటికీచెంత నిలబడ్డారు. కపుస్టిన్ తన పైపును పీల్చినప్పుడల్లా దాని వెలతురులో అతని ముఖం, ఆ వెడల్పు నుదురూ, మొద్దువారిన ఆ కండ్లద్దాలూ, తమాషాగా కనుపించాయి.

"నీ వుపాధ్యాయుడిని ముఖంవాచేటట్టు చీవాట్లు పెట్టబోతున్నాను" అన్నాడు కపుస్టిన్.

"ఎందుకు?"

"తన పై అధికారుల అనుమతిని పొందకుండా నిన్ను యెగిరి వెళ్ళమని చెప్పినందుకు.... యెందుకట్లా తేరిపారచూస్తున్నావు? స్వయంగా నేనే యీ విషయాలను గురించి నీతో యింతకు పూర్వమే మాట్లాడనందుకు నాకూ చీవాట్లు తప్పవు, పెట్టగలవా రెవరన్నా వుంటే. నాకెప్పుడూ తీరుబడేవుండదు. మాట్లాడాలనే అనుకొన్నాను. కానీ.... పోనీలే యిప్పుడా సంగతులన్నీ యెందుకు? నీవంటివాడికి యెగరటమంత తేలికయిన పనికాదు. కాబట్టే నీ ఉపాధ్యాయుడిని తిట్టాలని అంటూన్నది".

అలెక్సీ మాట్లాడకుండా వింటున్నాడు. ఈ యెదుటి మనిషిని అర్థం చేసుకోడానికి యత్నిస్తున్నాడు. సర్వసాధారణంగా వైమానిక కళాశాలలోనివారు యెగిరి వెడుతూవుంటారు. ప్రతిఒక్క పర్యాయమూ అనుమతి పొందటమనేది కష్టమైన పని. తన్నావిధంగా అడగలేదనీ, ఇది తన్నవమానించటమూ అనే అహంభావం

కొద్దీ కోపంవచ్చిందా యితనికి? తన అనుమతి లేనిదే యెట్టివాడూ, యెంత స్వల్పమైన లోటు వున్నప్పటికీ యెగురరాదనే నిబంధన పేరిట తన అధికారం చలాయించడానికి ఉవ్విళ్ళూరుతున్నాడా? సందు చిక్కితేచాలు తన అధికారం చూపెట్టాలని కనిపెట్టుకొని కూర్చున్నాడా? ఏమి కావా లీమనిషికి? ఏ చెట్టు కొమ్మకో వురిపోసుకొని చచ్చిపోవటానికి సిద్ధంగానుండే ఈ సమయంలో. ఎందుకీ మనిషి, ఏదో పెద్ద పని వున్నట్టు వచ్చి. తన ప్రాణాలు కొరుక్కు తింటున్నాడు?

కాలుసాచి ఒక్క తన్నుతన్ని బయటికి గెంటుదామనిపించింది, అలెక్సీకి, ఇన్ని నెలల తరబడి చెప్పరాని కష్టాలనుభవించి ఓపికపట్టటం నేర్చుకోబట్టి తమాయించుకున్నాడు బహుశ కపుస్టిన్ మంచివాడేకాబోలు.తొందరపడటమెందుకు? ఈతని చూస్తే చనిపోయిన కమిసారు జ్ఞప్తికివచ్చాడు పైప్ వెలుగులో కనుపించే కపుస్టిన్‌యొక్క గుండ్రటి ముఖమూ, చప్పిడిముక్కూ. తెలివితేటలు వుట్టిపడే కండ్లూ చూస్తూ అలెక్సీ ఆతడు చెప్పేమాట లాలకిస్తున్నాడు.

"ఇదిగో, అలెక్సీ. నిన్నూరక పొగుడుతున్నానని అనుకోవద్దు. పాదాలు లేకుండా విమానం నడపగలిగిన మనిషివి నీ వొక్కడవే. ఈ లోకంలో మరెవ్వరూ ఇంతటి కష్టమైన కార్యమును సాధించలేదు." పైప్ మొనను మరత్రిప్పి వూడదీసి. దానిద్వారా విద్యుద్దీపాన్ని చూసాడు. నీవు తిరిగీ యుద్ధానికి వెళ్ళటమును గురించి నేను చెప్పటంలేదు. అదెంతో శ్లాఘింపదగిన విషయమని ఒప్పుకొంటాను. కాని దానిలో ఎట్టి ప్రత్యేకవిశిష్టతా, గౌరవమూ లేదని నా అభిప్రాయం: ఇట్టి సమయంలో ప్రతివాడూ మనకు జయం చేకూరడానికి తన శక్తివంచనలేకుండా కృషి చేయాలి....దీనిదుంప తెగా, ఏమయింది దీనికి?"

తిరిగీ పైప్ మొనను శుభ్రంచేయటం మొదలుపెట్టి, ఆ పనిలో నిమగ్నుడై పోయాడు. ఈ మనిషిని గురించి అలెక్సీ కెంతమాత్రమూ బోధపడిందికాదు. ఏవుద్దేశంతో ఇక్కడికి వచ్చాడు? చావుకబురు చల్లగా చెప్పినట్లు చివరికేది చెప్పుతాడో? అని భయపడ్డాడు. పైప్‌ను శుభ్రపరుస్తూ తన మానాన తాను మాట్లాడాడు, ఎదుటి మనిషి ఏమనుకొంటాడో అనే ఆలోచనే లేకుండా.

"ఇది లెఫ్టినెంట్ అలెక్సీకి సంబంధించిన వ్యక్తిగతమైన విషయ మనటానికి వీలులేదు ఇంతకుముం దెన్నడూ అంగ-హీనుడైన మనిషి, ఈ విధంగా విమానమును నడిపివుండలా. కాళ్ళూ చేతులూ అన్నీ వున్నవాడికీ నీకూ భేదమే లేనట్టు నడిపావు....నీవు కేవల మొక పౌరుడవుకాదు....నీవొక పరిశోధన....నీ వొక పరిచ్ఛేదకసంస్థ....అబ్బా! ఇప్పటికి బాగుపడింది! ఏదో అడ్డుపడి వుండాలి.... కాబట్టి, నలుగురుమాదిరే నిన్నూ చూడటం న్యాయంకాదు. నిన్నావిధంగా చూడటానికి ఎవరికీగానీ, ఎట్టి హక్కుగానీ లేదు. వింటున్నావా? ఎట్టి హక్కూ లేదు. నీవొక గొప్ప పరిశోధనను ప్రారంభించావు. వీలయినన్నివిధాలా మేము నీకు

సహాయం చేయాలి. అంటే, ఏవిధంగా దోహదం చేయాలనేది తెలుసుకోవద్దా ? అదేదో నీవే చెప్పు. నీకు చేయూత నీయడానికి మమ్మేమి చేయమంటావు ?"

పైప్‌లో పొగాకునింపి వెలిగించాడు, కప్‌స్టిన్. పమ్ము పీల్చినప్పుడల్లా ఆ చీకటిలో ఏదో మిణుగురు పురుగులాటి రా వెలుతురు కనబడింది.

వాళ్ళ వుపాధ్యాయుడికి చెప్పి, ఇతరులకంటె ఎక్కువ పర్యాయములు ఎగుర టానికి తనకు ఏర్పాటు చేయమంటానన్నాడు. ఎప్పుడెప్పు డెగిరేదీ, తేదీవారీగా పట్టీ నొకటి అలెక్సీనే తయారు చేయమన్నాడు.

"ఎంతో కృతజ్ఞుడను. కాని, ఎంతో పెట్రోలు ఖర్చవుతుందేమో" అలెక్సీ అంటే, పెట్రోలును కనిపెట్టుకొని వాడుకోవలసినమాట నిజమే. కాని, అలెక్సీ పూనుకొన్న కార్యం సానుకూలమవటాని కెంత పెట్రోలు కావలసినా అంతా ఖర్చుపెట్టటానికి విమానశాఖవా రిష్టంటరపెట్టరు కప్‌స్టిన్ చెప్పాడు. పైపు ఆరిపోయింది, బూటు మడిమకు దానిని తట్టి బూడిదను రాలగొట్టాడు.

మరునాడే అలెక్సీ తన కొత్త పట్టీని అమలులోకి తెచ్చాడు, మునుపటికంటే ఎక్కువ కార్యదీక్షతోనూ, ఉత్సాహంతోనూ పనిలోకి దిగాడు. పూర్వం నడవ టానికీ, పరుగెత్తటానికీ, నృత్యం చేయడానికీ ఎంత కష్టపడ్డాడో దానికి పదిరెట్లు ఎక్కువ శ్రద్ధ చూపెట్టాడు. ఎగరటమనే పనిని ప్రత్యేక భాగాలుగా విడదీశాడు. వానిలో యిమిడివున్న ప్రతి వొక్క అంశమునూ తెలుసుకొన్నాడు. పూర్వం అనుభవంమీద నేర్చుకొన్న విషయాలన్నిటినీ యిప్పుడు మానసికపరీక్ష నొనర్చి ఫలానా ఫలానా భాగాలుగా విడదీసి గ్రహించాడు. ఆ యా పను లొనర్చుటమును వరుసక్రమంగా నేర్చుకొని. పాదాలుంచే వాటిలో కలిగే మార్పులనూ, అవి చెప్పే సందేశాలను తన మొండికాళ్ళ మొనలతో గ్రహించడానికి నేర్చుకొన్నాడు.

ఇదంతా చాలా కష్టమైన పనిగా తోచింది. మొదట్లో తానొక్క అడు గయినా ముందుకు పెడుతూన్నట్టు లగుపించింది కాదు. కాని ఒక్కొక్క పర్యాయమూ పై కెగిరి వెళ్ళినప్పుడల్లా విమానం తనతో రీసమైపోతోందనే భావం కలుగ జొచ్చింది. పూర్వంకంటే యిప్పు డెక్కువగా తన స్వాధీనంలో నుండజొచ్చింది విమానం.

ఒకరోజు, కప్‌స్టిన్, అలెక్సీని కలుసుకొన్నప్పుడు "ఏమండీ ! ఏమిటి విశేషాలు ? అంతా సలక్షణంగా సాగుతోందిగా ?" అని ప్రశ్నించాడు.

ఏదో కొద్దిగా ఫలిస్తోందని అలెక్సీ బదులుచెప్పాడు. పొగరుమోతుగుర్రం నెక్కిన అమాయకుడిలాగా తా నున్నట్టు పూర్వ మీతనికి తోచింది, యీ విమాన మెక్కితే. కాని ఇప్పు డిదంతా మారిపోయింది. తనమీద నమ్మకం కలిగింది. ఇందుమూలంగా విమానం అత డేది చెప్పితే అదంతా చేయనారంభించింది, అనుభవజ్ఞుడైన రౌతు తన వీపుమీద కూర్చున్నప్పుడు స్వారిచేసే గుర్రమేవిధంగా అతనితో సహకరిస్తుందో, అదే మాదిరి ఈ విమానం, అలెక్సీతో సహకరించింది.

# 11

తన చిన్నతనంలో జరిగిన సంఘటన వొకటి అలెక్సీకి జ్ఞాపకానికి వచ్చింది అది చలికాలం. ఓల్గానది పిల్లకాలువ వొకటి, వారి యింటిప్రక్క నున్నది. మంచ పేరుకుపోయింది. దానిమీద కొయ్యలుకట్టుకొని నడవటానికి అలెక్సీ ఆశపడ్డాడు ఆస్కీ కొయ్యలను కొనిపెట్టే శక్తి అతని తల్లికి లేకపోయింది. ఆ వూరి కమ్మ వాడి బట్టలను అలెక్సీ తల్లి వుతికియిచ్చేది. ఆ విశ్వాసంకొద్దీ, కొయ్యదిమ్మలూ చెక్కలూ, ఇనుప కట్టులూ, వుపయోగించి అలెక్సీ కొక జత ఆస్కీలను చే యిచ్చాడా కమ్మరి.

త్రాళ్ళతో తన స్కీలను పాదాలను బిగించికట్టి అలెక్సీ కాలువను చేరాడు కామిషిన్ గ్రామపు బాలబాలికలందరూ దానిమీద స్కీలతో తయారయ్యారు. పె గందరగోళంగా అరుస్తూ, నవ్వుతూ వారొకరినొకరు తరుముకొంటూ, సూటిగ పారుతూ, మలుపులు తిరుగుతూ, గుండ్రంగా గిర్రున తిరుగుతూ బలేసరదాగ కనిపించారు. వారిని చూస్తే తానూ వాటిమాదిరి నడవవచ్చు ననుకొని అలెక్సీ మంచుమీద నిలబడి వొక్క అడుగు ముందుకు పెట్టాడోలేదో, దభీలున వెల్లకిల పడ్డాడు.

ఎవరన్నా చూసారేమో అని, అటూ ఇటూ చూసి. లేచినిలుచున్నాడు వెనుకకు తిరిగి పడిపోకుండా వుండాలని ఇప్పుడు రవంత ముందుకువంగి తిరి పాదం జరిపాడు. ఈ పర్యాయం ముక్కు చితికేటట్టు బోర్లపడ్డాడు. తిరిగీ లే నిలబడ్డాడు. కాళ్ళు వణికిపోతున్నాయి. తతిమ్మా పిల్లలందరూ ఎట్లా నడుస్తున్నార తెలుసుకోడానికి నిలబడి నిదానించి చూసాడు. ముందుకూ వంగకూడదు, వెనుకకు వాలరాదు, నిటారుగా నిలబడటం మంచిది. అదేమాదిరి నిలబడి ప్రక్కవాటుగ నాలుగైదు అడుగులిడేడోలేదో, ప్రక్కకు పడిపోయాడు. ఈ విధంగా ప లేవటాలతో ప్రొద్దుకుంకింది. సాయంత్రం ఒడలంతా మంచుపడి తడిసి కాళ్లు చేతులూ వణుకుతూ యింటికివచ్చిన కొడుకుని చూసి తల్లి యెంతో వ్యసనపడింది

మరునాడు ప్రొద్దు పొడవగానే అలెక్సీ తన స్కీలతో కాలువగట్టు ప్రత్యక్షమయ్యాడు. నిన్నటికంటె నేడు తక్కువ పర్యాయములు క్రిందపడ్డాడు కొద్దిగా నడవటం వీలయింది. పది పండ్రెండు మీటర్ల దూరం ఒక్కతూరయిన పడకుండా వెళ్ళగలిగాడు. ప్రొద్దుగుంకేదాకా కాలువగట్టున నుండినా యేదో రవం అభివృద్ధి మాత్రం కనుపించింది.

ఆరోజు యిప్పటికీ జ్ఞప్తికున్నది అలెక్సీకి. పొడిమంచు గాలి కెగిరివచ కాలవమీదా, తనమీదా వర్షిస్తోంది. తనకు తెలియకుండానే యేదో వొక కొ

విధంగా ఒక్కొక్క అడుగు వేశాడు. అంతే! జరుగుతూ, పరుగిడుతూ సాగిపోజొచ్చాడు. తనకే ఆశ్చర్యం కలిగింది. తానింత సునాయాసంగా వెళ్ళగలగటం! ఒక్కమారైనా పడకుండా ఎంతమాత్రమో వెళ్ళాడు. మలుపులు తిరిగాడు. ఇన్ని రోజులూ తాను క్రిందపడి లేచినప్పుడల్లా నేర్చుకొన్న విషయాలూ, నేర్పరితనమూ ఒక్కపెట్టున అకస్మాత్తుగా సమన్వయమొంది, సరికొత్త శక్తి నాతనికి ప్రసాదించాయి. పాదాలూ, కాళ్ళూ, చేతులూ ఒకటేమిటి శరీరపు కండరాలన్నీ ఒకదాని నొకటి సంప్రదించుకొన్నట్టు, ఏకాంతంగా పనిచేయట మాతని కలవడింది. విస్ఫురానందంతో మెలికెస్తూ అరుస్తూ విరగబడి నవ్వుతూ ఆ రోజంతా మంచుపై తేలిపోయాడు.

విమానం విషయంలో కూడా యిప్పుడిటువంటి పనే జరిగింది. ఇన్ని దినాలుగా తానొనర్చిన యత్నాలూ, గ్రహించిన విషయాలూ ఒకదానితో నొకటి కూడబలుక్కొంటున్నట్లాతనికి తోచింది. కాని యేదన్నా వాటికి కొత్త విధంగా ఎగరటానికి యత్నించినప్పుడు, యింకా తన పాదాలు వెనుకంజ వేస్తూనే వున్నాయి. తిరిగి తిరిగీ పాత ఒరవడిని దిద్దుకొని. కొత్తపాఠాలు నేర్చుకొన్నాడు రోజుకు రోజూ.

ఒకరోజు మార్చి నెలలో ప్రొద్దున్నే అలెక్సి విమానాశ్రయానికి వచ్చాడు. మంచుకరిగి వదులవటంవల్ల యెగిరివెళ్ళే విమానాల చక్రాలు మంచులో చాళ్ళు కోసాయి. అలెక్సి తన విమానంలో పైకి లేచాడు.

బాగా పైకి వెళ్ళాక వాటి ప్రక్కనుంచి గాలి బహు బలంగా వీచటం మొదలిడింది. తిన్నగా పోనీయకుండా విమానము నది వొకప్రక్కకు త్రోసి వేస్తోంది. దానిని ముక్కుకు సూటిగా నడిపించటానికి అలెక్సీ యత్నించాడు. చటుక్కున, సునాయాసంగా విమానం సూటిగా ఎగిరివెళ్ళటం మొదలుపెట్టింది. తనకు తెలియకుండానే యీ పని జరిగింది. తానింతవరకూ నేర్చుకొన్న వివిధ విషయాలూ సమన్వయమొంది యీ విమానంలోనుండే కిటుకును గ్రహించటాని కతనికి తోడ్పడ్డాయి. అలెక్సీతో ఆ విమానం లయమైపోయినట్టూ. అతని శరీరపు అవయవాలలో నొకటిమాదిరిగా పనిచేసింది! తన చిన్నతనంలో మంచుమీద నడవటం సాధించిన ఆ దినం ఇప్పు డాతని మనస్సులో మెరుపు మెరిసింది. విమానం తనతో నెట్టి ప్రమేయంగా నిలేకుండా స్ఫూర్తిగా వెడుతున్నట్టు ఆతనికి తోచింది. అతని త్రోలు పాదాలు కూడా చైతన్యపూరితంగా మారిపోయాయి. తక్కిన అవయవాలతో కలిసి పని చేశాయి. పూర్వంమాదిరి వెనుకపడటం మానుకొన్నాయి.

అలెక్సి, ఆవిమానమూ కలిసి, 'అలెక్సీ విమాన'మనబడే నూతన వ్యక్తిత్వ సృష్టి జరిగింది. ఇది విదితంకాగానే అలెక్సీ సంతోషంతో వుప్పొంగి సర్కసు పనులు చేయటానికి పూనుకొన్నాడు. ఎన్నో పర్యాయములు చక్రవ ప్రక్కకు

తిరిగాడు. తీగ చుట్టలుచుట్టి వస్తైగిరాడు. చక్రం తిరిగినట్టు గిర్రున చుట్టాడు క్రిందనున్న విమానాశ్రయమూ, వైమానిక కళాశాలా, వాతావరణాలయ పు గోపురమూ అన్నీ గిర్రు గిర్రున తిరిగిపోయాయి. చటుక్కున విమానమును నిలబెట్టి మహాశీ పర్యాయం పైకెగిరి తీగచుట్టలు చుట్టాడు. ఏల్ ఎ-5 విమాన రహస్యం పూర్తిగా అలెక్సీకి తెలిసిపోయింది. అనుభవజ్ఞుని చేతిలో నిది సజీవమైనట్టు వర్తిస్తుందేకాని. ఏదో మేకులూ, రేకులూ బిగించిన యంత్రంమాదిరికాదు. దాని నుపయోగించటం నేర్చుకొన్న మనిషి దానిచేత చేయించజాలని పనిఅంటూ వొకటి లేదు. మనిషికి చెప్పినట్టు దానికిచెప్పి పనులు చేయించవచ్చు. అలెక్సీ కా ఘడియలో కలిగిన ఆత్మ విశ్వాసాని కంతులేకపోయింది.

వెకిలిగా నవ్వుతూ త్రాగినవాడిమాదిరి తూలుతూ అలెక్సీ విమానం దిగి వచ్చాడు. తనమీద కారాలు, మిరియాలు నూరుతూ పెద్ద గొంతుచేసుకొని అరిచే విమానోపాధ్యాయు నాతడు చూడలా ! పరకుచేయలా ! ! ఏదన్నా శిక్ష విధిస్తాడా ? విధించనీ. ఇప్పు డిదంతా అతనికొక లెఖ్ఖ. జమా క్రింద కనపించలా. తానిప్పు డొక వైమానికు డయ్యాడు; ఒకటో నెంబరు వైమానికుడు. తన కొరకని ఖర్చుపెట్టిన పెట్రోలు వృథాకాలేదు. త్వరగా యుద్ధానికిపంపిస్తే ఆ ఋణమును యిట్టే తీర్చివేయగలడు.

గదికి వెళ్ళగానే గ్రిగోరీనుండి వచ్చిన జాబాతనికంట బడింది. అదంతా ఎన్నో మడతలుపడి నూనె మట్టి మరకలు పడింది, ఎన్నిరోజు లేమనిషి జేబులో నున్నదో యింతగా నలిగిపోవటానికి ! తన చిరునామాను వ్రాసి అన్యూతా గ్వాజ్‌దేవ్ జాబు నింకొక పరిశుభ్రమైన కవరులోపెట్టి పంపించింది.

తన కొక వింతయిన ప్రమాదం నమ్మశక్యంకాని కారణాలవల్ల కలిగిందని గ్రిగోరీ వ్రాశాడు. తలకొక గాయం — దేనివల్లనో తెలుసా ? జర్మను విమానపు రెక్క తగలటంవల ! ఇప్పు డాస్పత్రిలో నుంటున్నాడు. బహుశా రెండు, మూడు రోజుల్లో విడుదలచేస్తారు. ఈ ప్రమాదానికి కారణ మిది : స్టాలిన్‌గ్రాడ్ యుద్ధంలో ఓడిపోయిన జర్మనుసైన్యం వెనుతిరిగి పారిపోతోంది. గ్వాజ్దెవ్ పనిచేస్తున్న టాంకుదళం ఈ జర్మను సైన్యమును తాకింది. మధ్య సందుచేసుకొని. ఆ సందు గుండా టాంకులన్నీ జొరబడ్డాయి. కొంతదూర మా గడ్డిమైదానంలో వెళ్ళి, వెను దిరిగాయి. జర్మను సైన్యాని కెదురుతిరిగి అటకాయించాయి. ఈ టాంకుదళాని కాధిపత్యం తనదేనట.

అది చూసితీరవలసిన దృశ్యం ! టాంకుదళం దారిలో జర్మనులు నిర్మించుకొన్న గోడలనూ, దడులనూ, రైలు స్టేషనులనూ ధ్వంసంచేశాయి. దారి కడ్డం వచ్చిన సైనికులపైకి లంఘించి తమ గొలుసుకాళ్ళక్రింద వారిని నలిపి చంపాయి. తమ టాంకులు, బాంబులూ, మరఫిరంగుల తూటాలూ వడగండ్లుపడ్డట్టు వారిమీద

కుప్పించారు. తప్పించుకొనిన కొద్దిమందీ కాళ్ళకు బుద్ధిచెప్పారు. జర్మనులు భద్రపరిచిన మందుగుండుసామాను ప్రోవులనూ, దారిలోనున్న వంతెనలనూ, రైలు పట్టాలను కాల్చిపారేశారు. ఇందుమూలముగా జర్మనులు తప్పించుకు వెళ్ళడానికి వీలులేకపోయింది. జర్మనులు దాచుకొనిన పెట్రోలునూ, ఆహార సామగ్రినీ తాము తీసుకొని పెద్ద అట్టహాసం చేశారు. ఈ రష్యా టాంకులు ఏ నిమిషాని కే వక్కకు తిరిగి తమమీద కురుకుతాయో తెలియక, జర్మనులకున్న కొద్దీ మతిపోయింది.

"జర్మనులు గాభరా పడిపోవటం చూస్తే మాకు తెగనవ్వు వచ్చింది: నీవు నమ్ముతావో నమ్మవో నాకు తెలియదు. కాని వాస్తవం. మూడంతే మూడు టాంకులూ. ఒక్కటే వొకపిరంగి మోటారుతో మేమెన్నో గ్రామాలను పట్టుకొన్నాము ఎంత ఆహారసామగ్రినో పశపర్చుకొన్నాము. యుద్ధసమయంలో భయానికి సమమైన ఆయుధం మరొక్కటిలేదు. శతృవు భయపడేటట్లు చేయగలిగితే. ఉండే మనుష్యులలో సగంకంటె తక్కువమందితో వారిని ఓడించవచ్చు: చలిమంట మండుతూవుండాలంటే అదపాదడపా కట్టెలు చేర్చినట్లు, ఈ భయాన్ని మండిస్తూనే వుండాలి. ఎప్పుడెక్కడ దెబ్బ పడుతుందో అనే స్థితిలో శత్రువు నుంచాలి. ఇక్కడా, అక్కడా అప్పుడప్పు డకస్మాత్తుగా వారిపై బడితేచాలు, దారీతెన్నూ తెలియక తన్నుకులాడుతారు. వెన్నపూసలో దూరినట్టు జర్మను సైన్యదళంలో దూసుకుపోయాయి మా టాంకులు. లోపల ప్రవేశిస్తేనేగాని జర్మనులంత దబాయింపు కోరులు వే రెవ్వరూ వుండరని తెలియదు. పుల్లాకు ఎగిరెగిరిపడ్డట్టు వుత్తుత్తి ఆర్భాటరాయుళ్లు జర్మనులని ఇట్టే విదితమయింది."

"ఇక నా కీ దెబ్బ ఎట్లా తగిలిందో విను, చెస్తాను. మన సైన్యాధికారి మన టాంకుదళంవారిని పిలిచి, మన విమానమొకటి రహస్య విషయమును తనకు తెలిపింవన్నాడు. జర్మను సైన్యానికి వెనుక నొకచోట మూడువందల విమానాలు నిల బెట్టిన స్థలమొకటి వున్నదట. వాటికి కావలసిన పెట్రోలుకూడా అక్కడే భద్రపరిచారట. ఇక ఆహారపదార్థాల విషయం: చెప్పనలవికానంత చేకూర్చారట ఆ ప్రదేశంలో, తన గడ్డమును గోక్కుంటూ సైన్యాధికారి, 'గ్వాజైవ్ ఈ రాత్రి నీవచ్చటికి వెళ్ళాలి. జర్మనువాడిమాదిరి వేషం ధరించి, గుప్పుచప్పుడు కాకుండావెళ్లి, అకస్మాత్తుగా వారిపై మీరు నలుగురూ పడాలి. ఎడా పెడా కాల్చి, చిందరవందరచేసి, ఒక్క వాకొడుకయినా తప్పించుకుపోకుండా చూచుకోవాలి, అని అన్నాడు. నా టాంకుదళానికి తోడు మరొక దళమునుకూడా నా చేతికిచ్చి, మిగిలినవా రందరూ రష్టోవ్‌కు దారిపట్టారు,'

"కోళ్ళగూట్లో నక్క దూరినట్టు లావిమానాశ్రయాన్ని ప్రవేశించాము. దారి కడ్డంగా నిలబడిన జర్మను కావలా మనుష్యులను దాటివెళ్ళాము. ఒక్కడయినా మమ్మనుమానించాడుకాదు. దట్టంగా పడే మంచులో మే మెవరో వారికి స్పష్టంగా

కనుపించలా. మా యింజనుల హోరుమాత్రం వినబడింది. మేమంతరమూ వాళ్ళ మనుష్యులమె ననుకొన్నారు. లోపల ప్రవేశించామో లేదో. వారిమీద విరుచుకు పడ్డాము. విమానాలన్నీ వరుసలుతీరి నిలబడ్డాయి. విమాన కవచాలను ఛేదించే గుండ్లు ప్రేలిస్తే. దెబ్బకు అవి విమానాల వంతున పడిపోయాయి. ఇదంతా చూచి కొంతమంది తమ విమానములను బయటకు దేసి తీయటానికి వెళ్ళారు. అవి చాలా పెద్ద రకం విమానాలు. వాటి కెదురుగావెళ్లి వాటి యింజనులను విరుగకొట్టడం దుస్సాధ్యం. కాబట్టి మా టాంకులో వెనుకప్రక్కనుండి వాటినిమోది తోకలు విరుగగొట్టటానికి ప్రారంభించాము. ఎంత పెద్ద విమానమయినా తోకలేనిదే యెగురలేదుగా ? ఏమి జరుగుతోందో చూడాలని నేను కూర్చున్న టాంకునుండి తల బయటికిపెట్టి తొంగి చూచాను. సరిగ్గా అదే సమయానికి నాటాంకు వొక విమానమును ఢీకొట్టింది. దాని రెక్కలు విరిగి. ముక్కలై పైకెగిరాయి. ఈముక్కల్లో వొకటి నా తలకు తగిలింది. నెత్తిపై ఉక్కుటోపీ వుంటబట్టి ప్రాణందప్పి బయట పడ్డాను. లేకపోతే యీపాటికి వుత్తరం నీకు వచ్చేదేకాదు. ఏమంత గొప్ప దెబ్బ కాదులే. రెండుమూడు రోజుల్లో విడుదలచేస్తారు. తిరిగీ మనవారిని చేరుకొంటాను. దీనికంటే గొప్ప చిక్కయిన సంగతి వొకటి వున్నది. ఆస్పత్రిలో చేర్చగానే, ఆ వెధవలు నా గడ్డాన్ని గీకిపారేశారు. ఎన్ని నెలలో కష్టపడి పెంచాను. బాగా బొద్దుగా, వెడల్పుగా పెరిగింది. ఇప్పు డేదనుకొని యేమిలాభం. తిరిగీ మరొక గడ్డం పెంచుతా ననుకో. అదేమంత కష్టమైనపనికాదు. ఈ పాడుముఖాన్ని కప్పి వుచ్చుట మెంత ఆగత్యమో నాకు తెలుసు. కాని తానువ్రాసే ప్రతివాక్య జాబు లోనూ, అన్యూతా, పాడు గడ్డం. రోత, అదెందుకు పెంచుతున్నావని వ్రాస్తుంది. నాకేదీ పాలుబోకున్నది."

చాలా పెద్ద వుత్తరం. ఆస్పత్రిలో నుండే రోజులలో ఏదీ తోచక వ్రాశాడు కాబోలు. ఉత్తరం చివరిలో వేరొకవిషయం వ్రాశాడు. స్టాలిన్‌గ్రాడ్ చెంత తానూ, తన మిత్రులూ నేలమీదదిగి పోరాడుతూంటే వారి టాంకు లగుపించకుండా పోయాయి. కొత్త టాంకులకు వేచియున్నారు. కుర్గాన్ ప్రాంతంలో తా మున్నప్పుడు, పాత స్నేహితుడు స్టిఫాన్ ఇవానొవిక్ ఎదురయ్యాడట. అతడొక సైనిక కళాశాలలో చేరి తరిఫీదు నొందాడు. వైమానిక రక్షణ ఫిరంగిదళంలో ఇప్పు డీ స్టిఫాన్ సార్జెంటు మేజరుగా వుంటున్నాడు. జన్మతః ఇవానొవిక్ వేటగాడు. ఆ గుణ మాతని రక్తంలో వూరిపోయింది. ఇప్పటికీ వేటగాడిమాదిరే మాట్లాడుతాడు పూర్వం కుందేళ్ళనూ, ఉడుతలనూ వేటాడితే, ఇప్పుడు జర్మనులను పసిబిడ్డ పట్టుతున్నానంటాడు. ఎంతో ఓపికా, కార్యదీక్షః ఖైటికితోడు గురిచూసి సూటిగ దెబ్బ కొట్టగలశక్తి; ఇప్పటికీ ఇతనిలో బాగా పని చేస్తున్నాయి. ఇవానొవిక్ ఏదో [illegible]నాటి వైమనీసా నొకటి సంపాదించాడు. వారిద్దరూ దానిని సేవిస్తూ,

పాతస్నేహితులను గురించీ, గడిచిన రోజులను గురించీ ముచ్చట్లు చెప్పుకున్నారు. ఇవానొవిక్కుకు అలెక్సీ బాగా జ్ఞాపకమున్నాడట. ఎంతో అభిమానమనీ. యుద్ధానంతరం తామిద్దరినీ తన ఫాక్టరీకి రమ్మని ఆహ్వానించాడు. ముఖ్యంగా సైబీరియా మైదానపు వుపరితలమూ, ఇతర విస్తృతమైన ప్రదేశాలూ చూడవచ్చునన్నాడు.

ఈ వుత్తరం చదివాక అలెక్సీ కెంతో మనస్థిమితమేర్పడింది. కాని ఒక్కటే వొక విషయం.

అతనికి కష్టంగా తోచింది. తనతో సహా రెండో నంబరు ఆస్పత్రి గదిలో నున్నవారందరూ అప్పుడే యుద్ధంలో చేరిపోయారు. గ్వొజ్దేవ్ ఎక్కడున్నాడో ఇప్పుడు? ఇవానొవిక్ ఏ ప్రదేశంలో పోరాడుతున్నాడో? బాగున్నాననే అనుకొన్నాడు ఇంకా ఎచ్చటెచ్చటికి వారి నీ యుద్ధం తీసుకుపోతుందో ఎవరు చెప్ప గలరు? అసలు ఇప్పుడు బ్రతికివున్నారా? ఓల్గా సంగతి?

పూర్వం ఆస్పత్రిలో వుండే దినాలలో. కమిసారు వరొబియోవ్ వొకపర్యాయం చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. సైనికులనుండి వచ్చే జాబులు నక్షత్రాల వెలుగు వంటివట. సుదూరమైనంత దూరంలోనుండే నక్షత్రాల వెలుగు వచ్చి మనలను చేరుకోవాని కెంతోకాలం పడుతుంది. ఆ వెలుతురు మన కంటిని తాకే లోగా ఆ నక్షత్రం హరించి నశించిపోయినా పోవచ్చు. మనం చూసి ఆనందించేది లేని నక్షత్రపు కాంతి అని మనకు తెలియదు. సైనికుడి జాబును నీవు చదివే టప్పుడా మనిషి ఇంకా బ్రతికే వున్నాడో లేదో చెప్పటం దుస్సాధ్య మన్నాడు కమిసారు!!

# నాలుగో భాగం

## 1

అది 1943 సంవత్సరం వేసవికాలం. ఎండ బాగా కాస్తోంది. చాలాకాలంగా నుపయోగించని పొలాలన్నీ ఎర్రటిదుబ్బుతో నిండాయి. అనేక లారీలూ, ట్రక్కులూ వెళ్ళగా ఏర్పడిన బాటమీద పొలాలమధ్య పాతబడిన మోటారు ట్రక్కొకటి వెడుతోంది. దుమ్ము పేరుకున్న దాని చక్కాలమీద తెల్లటి రంగులో "తపాలా శాఖ—యుద్ధభూమి" అని వ్రాయబడివుంది. దానినుండి లేచిన ఎర్రమట్టి మేఘం కన్ను కనిపించనంత దట్టంగా గాలిలో తేలి చెదిరిపోయింది.

యుద్ధభూమిలో నున్నవారికి జాబులనూ, వార్తాపత్రికలనూ, సచిత్ర వారమాస పత్రికలనూ ఈ ట్రక్కు తీసుకు వెడుతోంది. వైమానిక దుస్తులూ, టోపీలూ, ఫీలి

రంగు భుజనాదాలూ వగైరా ధరించిన వారిద్దరా ట్రక్కులో, దానితోపాటు పైకెగిరి పడుతూ ప్రక్కలకు వొరుగుతూ ముందుప్రక్కన కూర్చున్నారు. వారిద్దరిలో చిన్నవాడు వైమానిక సార్జెంటు మేజరు, అంగసౌష్ఠవమూ, చక్కని కనుముక్కు తీరూ కలవాడు. ఆ పసిమిరంగూ, బహు సుకుమారమైన అతని ముఖం చూడ ముచ్చటగా నున్నది. పంధొమ్మిదేండ్లుంటే వుండవచ్చు. వయస్సులో చిన్నవాడయినా, ఎంతో అనుభవం కలవాడిమాదిరి. చాలాకాలంగా యుద్ధభూమికీ, సైనిక జీవితానికీ అలవాటుపడినవాడు మాదిరి వర్తిస్తున్నాడు. పండ్ల సందునుండి వుమ్మడమూ, బొంగురు కంఠంతో సిపాయి భాషలో బిగ్గరగా మాట్లాడమూ, తన సిగిరెట్టులను తానే చుట్టుకొనడమూ, ఈ జీవితమంతా తనకు తెలియనిది కాదన్నట్లు నిర్లక్ష్యంగా కూర్చొనటమూ, అంతా ఏదోవొక నాటక మాడుతూన్నట్టున్నది, ఇదంతా మేకపోతు గాంభీర్యం. ఇదే మొదటి పర్యాయంగా యుద్ధానికి వెడుతున్నాడు. తన మనస్సులోని భయమును కప్పిపుచ్చడానికే ఈ మాదిరి వర్తిస్తున్నాడని పించింది చూసేవారికి. వెడుతూంటే దారిపొడుగునా కనపడ్డవన్నీ అతని కెంతో ఆశ్చర్యం కలిగించాయి. దెబ్బతిని ప్రక్కకొరిగిపడిపోయిన ఫిరంగీ, శిధిలమైన జర్మనుటాంకుచుట్టూ మనిషిఎత్తుకు పెరిగిన మొక్కలూ, పైనుండిపడిన బాంబు దెబ్బకు దాని కవచంలో నేర్పడిన పెద్దరంధ్రమూ ; బాంబులు త్రవ్విన గోతులలో వత్తుగా పెరిగిన గడ్డీ, దుబ్బూ; భూమినుండి త్రవ్వితీసి బాటకొకప్రక్క పేర్చిపెట్టిన రహస్యబాంబులూ ; జర్మను సైనికులను పాతిపెట్టినచోట లెక్కకుమించి కనుపించే బిర్చికొమ్మల శిలువలూ – ఇట్టివాటిని అనుభవశాలియైన సైనికుడు కన్నెత్తిఅయినా చూడడు. కాని ఈ యువవైమానికుని కిట్టివన్నీ బహువిచిత్రంగా కనుపించాయి. వాటినుండి ముఖము నింకొక ప్రక్కకు త్రిప్పలేకపోయాడు, అవన్నీ తనకేదో చెబుతున్నాయి ; కాని ఆ సందేశమేదో అతనికి బోధపడకున్నది.

రెండోమనిషి వొక సీనియర్ లెఫ్టినెంటు. ముఖం చూడగానే ఇతడెక్కువ అనుభవశాలి అనీ, నిండుకుండ తొణకదనే రకమనీ తెలుస్తుంది. ఏ పాతికేండ్లకంటే ఎక్కువ వుండవన్నట్లగుపిస్తాడు. కాని ఎండా, గాలులకు మాడినముఖమూ, కనుకొలుకులలోనూ, నుదుటిమీదా కనబడే చారలనూ, ఆలోచనాపూరితమై, అందనిలోతు లున్నట్లగుపించే కండ్లనూ చూస్తే, మరొక పదేండ్లన్నా అతని వయస్సుకు చేర్చాలనే అభిప్రాయం కలుగుతుంది. దారంటా కనబడే దృశ్యాల నతడు చూసినా, చూడనట్లే వర్తించాడు. బాంబులూ, ఫిరంగులూ బ్రద్దలై విరిగి, వికృతాకారాలతో పడివున్న ఆ మారణయంత్రాలుగానీ, అగ్ని భగవానునికే ఆహూతియై నిర్మానుష్యంగానున్న గ్రామాలుకానీ అతనికి విచిత్రం గొలిపాయికావు. ఒక రష్యను విమానం శిధిలమైన దగుపించింది. వంకర్లు తిరిగిన అల్యూమినియం రెక్కలూ, అంతదూరాని కెగిరిపడిన దాని యంజనూ, విరిగిపోయిన తోకా, దాని

పైన స్పష్టంగా కనుపించే మిత్ర వత్రమూ, కొన్ని అంకెలూ, ఏవేవిచూచి. వారిద్దరిలో చిన్నవాడు చకితుడై, ముఖమంతా ముద్రబడి, ఎవంత వణికిపోయాడు.

వార్తాపత్రికలూ, పుస్తకాలనూ ఒక బల్ల మాదిరి పేర్చి, వట్లటి చేతికర్ర పిడి మీద నిద్రమానించి, తనముకు పట్టుకొన్నాడు పెద్ద వైమానికోద్యోగి. చేతికర్ర మీద సేవో బంగారపుటక్షరా లున్నాయి – అతనిపేరు కాబోలు. అప్పుడప్పుడు దదరి పడిలేచి ఇటూ అటూచూచి. ఏవంత నవ్వి దూసుకుపోయేది చెప్పనిగాలిని. అందులో మేదో తెలియని వాసనవున్నట్లు ఊపిరితిత్తులనిండా పింపుకొనేవాడు. దట్టంగా పెరిగిన మెట్రిపొదమధ్య. కనుచూపు మేరవరకూ చాలాదూరాన రెండు నల్లటిచుక్కలు లాతని కగుపించాయి. అవి రెండూ నిర్మల నీలాకాశంమీద కదులుతున్నట్లు అగుపించగా వాటిని పరీక్షగా చూశాడు. రెండు విమానాలు తీరుబడిగా ఒకదానివెంట నింకోటి వెడుతున్నాయి. అతని నిద్రమత్తు యావత్తూ ఎక్కడికో వెళ్ళిపోయింది. కండ్లు మిగేలు మన్నాయి. ముక్కుపుటా లదిరిదిరి పడ్డాయి. ట్రక్కు నడిపేవాడిని ముందున్న చక్రంమీద కొట్టి పిలిచాడు.

"డాక్కోవాలె, రోడ్డును తప్పించి మారుదారి తీయ"మన్నాడు.

ట్రక్కులో నిలబడి నల్దిక్కులా పరికించి చూశాడు. ఒకప్రక్క దట్టంగా పిలాన్ డైనా, కోట్టిపుట్ మొక్కలు పెరుగుతూన్న ట్లగుపించింది. అక్కడొక ఎండిపోయిన కొండవాగు ప్రవహిస్తూ వుంటుందని గ్రహించాడు. ఎన్ని పర్యాయములిట్టి పరిస్థితు లాతని జీవితంలో కలిగాయో మనకు తెలియదు. కాని అనుభవానికిమించిన జ్ఞానం లేదంటారుగా? డ్రైవరు నవ్వుటికి తమ ట్రక్కును నడిపించమన్నాడు.

తన మిత్రు డీవిధంగా లేనిపోని గాభరాపడుతూన్నందుకు రెండో వైమానికుడికి నవ్వు వచ్చింది. నిర్మానుష్యమైన ఈ మైదానంలో దుమ్మెగరబోస్తూవెళ్ళే తమ ట్రక్కునా దూరపు విమానాలు చూడనన్నా చూడలేవు. తమమానాన తా మెగురుతున్నాయి. ఎక్కడో. ఎందుకీ మనిషి కింత గాభరా? డ్రైవరు వెంటనే ట్రక్కును చెప్పిన దిక్కుకు త్రిప్పాడు. వెళ్ళివెళ్ళి ట్రక్కు ఆగింది. సీనియర్ లెఫ్టినెంటు క్రిందికి దిగాడు. ఇతరుల కగుపించకుండా పత్తుగాపెరిగిన గడ్డిలో దాగుకొని, తా మింతకుముందు వచ్చిన బాటను పరీక్షిస్తూ కూర్చున్నాడు.

"దేనికీ లేనిపోని ఆర్భాట...." మంటూ చిన్న వైమానికుడు హేళనగా అనగలిగాడో లేదో, పెద్దాతను నేలకంట కరుచుకొని.

"పడుకో!"మని వొక్క అరిచాడు.

మరునిమిషం పైనుండి విమానశబ్దం వినబడింది. ఎగిరివెళ్ళేరెండు విమానాల నీడ వారిపై బడింది. గాలినంతా అదరగొట్టే శబ్దమొకటి వారికి వినబడింది. చిన్న వైమానికు డీ విషయాలనన్నిటినీ ఏదో వొక చిత్రమును చూసినట్టు చూస్తున్నాడు.

ఇవేవో సాధారణ విమానాలు, తమవే అయివుంటాయనుకొన్నాడు. అటుప్రక్కకు ఎందుకో తనకు తెలియకుండానే తల త్రిప్పాడు. తలక్రిందులుగా పడిపోయిన ట్రక్కు వొకటి, ఎంతోకాలంక్రితం దెబ్బతిన్నది, నిప్పంటుకొని మండుతోంది.

"ఇదా, సంగతి! బాంబులను పడేస్తున్నారు. ట్రక్కులన్నిటినీ నేలమట్టం చేయాలని వచ్చారి"ని అన్నాడు మన తపాలా ట్రక్కుడ్రైవరు.

"గొప్ప వేటగాండ్ర మనుకొంటున్నారు. చచ్చినపామును బాదే మొగాళ్లు!" అన్నాడు పెద్ద వైమానికుడు. డ్రైవరును చూసి "తమ్ముడూ! మన మిక్కడ మరి కొంత సేపు వుండాలి. వాళ్ళు తప్పకుండా తిరిగివస్తారు. చూడు. నీ ట్రక్కును ఎవంత వెనుకకు జరిపి, అదిగో ఆ బర్చ్‌మ్రాను కనిపిస్తోందిచూడు, దానిక్రిందికి చేర్చు" అన్నాడు.

ఎగిరే అజర్మను వైమానికులు తమ వుద్దేశము లాతనికి తెలియజెప్పినట్టు ఏ పైమాటలు నాతడు పలికాడు. తమ ట్రక్కులో, డ్రైవరుప్రక్కనే కూర్చొని వచ్చిన వొక తపాలా స్త్రీకూడా వారితో పాటు నేలకానుకొని పడుకొన్నది. ముఖ మంతా పాలిపోయి, ఏది చేయటానికీ, ఏమాట మాట్లాడటానికీ తోచక, దూ పింజలవంటి మేఘాలతో నిండిన ఆకాశమునుచూస్తూవుండటం గమనించి జాలిపడ్డాడు సీనియర్ మేజర్. కాని ఇదంతా ఏదోవొక సర్వసాధారణమైన విషయ మన్నట్టు.

"వెడదాము, రాండి. ఇంక కాలయాపన యెందుకు, ఓరెవోసికొని చావవల సినదా దెన్నటికీ నీటిలో మునిగి చనిపోద"న్నాడు; చిన్న వైమానిక సార్జెంటు.

సీనియరు లెఫ్టినెంటొక గడ్డిపోచను చప్పరిస్తూ, కొంచెమెగతాళిగ సార్జెంటుతో—

"అబ్బాయీ! ఇది కొంచెమాలకించు: ఆ చొప్పదంటు సామెతను త్వరిగ మరచిపో లేకపోతే ముప్పువాటిల్లవచ్చు. మరొక విషయం. యుద్ధభూమిలో నున్న పుడు పై అధికారి ఏ దాజ్ఞాపిస్తే దానినంతా చేయాలి. "పడుకో"మంటే. పడుకొ తీరాలి. ఊఁ?"

అక్కడ పెరుగుతూవున్న సోరెల్ మొక్క నొకదానిని తుంచి, గోళ్లతో దాని పై పెచ్చు నూడదీసి, లోపలనుండే తీయనిజెండును. సీనియరు లెఫ్టినెంట నమలటం ప్రారంభించాడు. తిరిగి విమానాల శబ్దం! అవే రెండువిమానాలు ఎగి వచ్చాయి, చాలాక్రిందుగా రోడ్డుమీద వెడుతోంటే వాటి కడుగుభాగాన పూసిన పసుపురంగూ, రెక్కలకు చిత్రించిన నలుపూ తెలుపూ స్వస్తి గుర్తులూ, ఒకదాని ఇంజను భాగంమీద చిత్రించిన ఇస్పేటు ఆసుబొమ్మా బహు విశదంగా కన్పించాయి. సీనియర్ ఉద్యోగి మరికొన్ని మొక్కల నూడబెరి తిని, తన చేతి గడియారమును చూశాడు.

"ఇకమీద వెళ్ళవచ్చు, ఫరవాలేదు. రండి డ్రైవర్ తమ్ముడూ ! ఇంజనుకు పూర్తిగా పెట్రోలు నెక్కించి, చేతనయినంతవడిగా వెళ్ళ"మన్నాడు.

ట్రక్కు హారను మ్రోగింది. అక్కడనున్న స్ట్రాబెర్రీ పండ్ల గుత్తులను కోసి చేతబట్టుకొని తపాలా స్త్రీ వచ్చింది. వాటిని సీనియర్ ఉద్యోగి కిచ్చింది.

"అప్పుడే పండ జూపాయి ! ...వేసవికాలం వచ్చినట్లే మనకు తెలిసింది కాదు. అప్పటికిగాని ఈ పండ్లు తయారుకావంటూ" ఏదో పూవును గ్రుచ్చుకొన్నట్లు లా పండ్లను తన కోటుకు తగిలించుకొన్నాడాయన.

వెళ్ళే ట్రక్కులో వెనుకప్రక్క కూర్చొనిన వైమానికులిద్దరూ దానితోపాటు ఎగురుతూ, క్రిందికి పడుతూ, ప్రక్కల తూగుతూ వెడుతున్నారు. కొంతదూరం వెళ్ళాక సార్జెంటు, "ఆ విమానాలు తిరిగిరావనీ. నిశ్చయంగా వెళ్ళవచ్చుననీ నీ కెట్లా తెలిసింద"ని సీనియర్ ఉద్యోగిని ప్రశ్నించాడు.

"ఓ ! అదా చాలా సులభంగా తెలుసుకోవచ్చు. అవి రెండూ యమ్. ఇ. 109" విమానాలు. వాటిలోని పెట్రోలు ముప్పావుగంటకు సరిపడినంతే వుంటుంది. అంతకంటే ఎక్కువ పట్టదు. పెట్రోలును నింపుకోడానికి వెళ్ళాయి." అన్నాడు.

పై మాటలను వినేవారికి "ఇంతటి స్వల్పవిషయములను కూడా గ్రహించ గలరా రుంటారా ? " అని అతడనుకొన్నాడని తోచక మానదు. సార్జెంటు కాతడు చెప్పిన మాటల్లో నమ్మకంలేనట్లు, ఆకాశమును పరీక్షిస్తూ కూర్చున్నాడు. అతని కంటే ముందుగా తాను వచ్చే విమానమును కనిపెట్టాలని అనుకొన్నాడు. కాని, లాభం లేకపోయింది. విమానాలు కంటబడ్డాయికావు. తీయని వాసనల వేడిగాలి మైదానంమీద వీస్తోంది. గడ్డిలో మిడత లెగిరెగిరిపడుతూ చిరతలు కొట్టినట్లు శబ్దం చేస్తున్నాయి. లార్కు పిట్టల పాట అతి శ్రావ్యంగా వినిపించాయి. పిటికి వశుడై పోయి సార్జెంటు విమానాల సంగతే మరచిపోయాడు. శ్రావ్యమైన కంఠ మెత్తి ఆ రోజులలో యుద్ధభూమిలో నలుగురూ పాడుకొనేపాట నొకటి మొదలు పెట్టాడు. యువ సైనికుడొకడు వొంటరిగా యుద్ధభూమి యందున్న కాలువలో పడుకొని, ఊరిలో దిగవిడిచివచ్చిన తన స్నేహితురాలి నుద్దేశించి విరహతాపోప శాంతికి పాడుకొనే హృదయ విదారకమైన పాట. మెంతో సొగసైన దాపాట.

" నీకు ఆష్ వృక్షం పాట తెలుసా ? " అని అడిగాడు రెండోమనిషి.

తెలుసునని తలవూపి ఆ పాటను మొదలుపెట్టాడు. సీనియర్ లెఫ్టినెంట్ ముఖ మాపాటను వినటంతోటే దుఃఖమయ మయింది.

" నీవు సరిగ్గా పాడటంలేదు. ఏదోవొక హాస్యపు పాటను పాడినట్లు పాడుతున్నావు. ఉద్వేగం లేనిదే పాటను పాడటానికి వీలులేదు." అంటూ శాంతంగా బహు సుకుమారంగా తానే పాడటాని కారంభించాడు.

డ్రైవరు బ్రేకువేసి ట్రక్కు నాపాడు. తపాలా స్త్రీ క్రిందికిదిగి వెనకప్రక్క భాగంలోకి వచ్చి.

"నీ పాట వినిపించింది, కలిసి పాడాలని వచ్చా" నన్నది.

ముగ్గురూ కలిసి పాడుతోంటే యెగిరెగిరి పడుతూ ట్రక్కు నడిచింది. పొదలలోని మిడతలు, చిరతలు మ్రోగినట్లరిచాయి.

సార్జెంటు పరవశుడై పోయాడు. తన సంచీలోనుండి సంగీత వాయిద్యపు పెట్టెను తీసి దానిమీద పాటను వాయించాడు. మధ్య, మధ్య, సంగీతపు పెట్టెను చేతిలో పట్టుకొని దానితో తాళంవేస్తూ, పాటను నడిపించాడు. నిర్మానుష్యమైన ఈ ఒంటరిబాటమీద వెడుతూ వీరు పాడినపాట అచ్చటి గడ్డిదుబ్బులలో చొరబడి దిగంతములా వ్యాపించింది. ఎండుముఖంపట్టి వాడిపోయే దుబ్బులమాదిరి పురాతన మైన ఈ పాట, నేడు తీపివాసనలుకొట్టే గడ్డి పూవులమాదిరి తీయగానూ, స్వచ్ఛ మైనలార్కు పిట్టలపాట మాదిరి స్వచ్ఛందంగానూ, ఆద్యంతములు లేక వ్యాపించే ఆకాశం మాదిరి అంతటా మార్మ్రోగింది.

పాట పాడుతూ ఇతర విషయాలను మరచిపోయి, దానిలో లయమై పోబట్టి, అకస్మాత్తుగా డ్రైవరు బ్రేకునొక్కి ట్రక్కును నిలబెట్టగనే అదిరిపడి చూశారు. ఆ బాటప్రక్క నొక మూడుటన్నుల లారీ బోల్తాపడిపోయింది. సీనియర్ లెఫ్టినెంట్ మేజరు ట్రక్కునుండి క్రిందికొక గంతువేసి, ఆ పడిపోయిన లారీని సమీపించాడు. దాని క్రిందినుండి వొక క్వార్టర్ మాష్టర్ కాప్టెను శరీరమును ట్రక్కు డ్రైవరు బయటికిలాగాడు. ఒళ్ళంతా రక్తం. ముఖమంతా కోసుకుపోయి రక్తం కారింది. లారీ అద్దము పగలటంవల్ల ఈ విధంగా ముఖమంతా కోసుకొని పోయిందన్నాడు డ్రైవరు. ఆ ముఖం తెల్లగా బూడిదరంగుగా నుండటం చూసి మన సీనియర్ లెఫ్టినెంట్ అతని కనురెప్పనెత్తి చూశాడు.

"చనిపోయాడు," అంటూ తలనున్న టోపీ నెత్తి చంకలో పెట్టుకొని "ఇంకా ఎవరన్నా వున్నారేమో చూడ"మన్నాడు డ్రైవరుతో.

"దీని డ్రైవరు కనుపిస్తున్నాడం"టూ అతని శరీరమును బయటికి లాగ బోయాడు.

భయకంపితుడై నిలబడిన చిన్నసార్జెంటును చూసి, లెఫ్టినెంట్ ఈవిధంగా కోపపడ్డాడు. "ఎందుకట్లా నిలబడతావు? రా. వచ్చి వీలయిన సహాయంచేయి. ఇంతకుముం దెన్నడూ నెత్తురు చూడలా? అలవాటు చేసుకో. త్వరగా కావలసినంత దీనికి పేయిరెట్లెక్కువ రక్తమును చూడబోతున్నావు" అన్నాడు.

ఆ డ్రైవరు చనిపోలేదు. గొప్పబాధతో మూలుగుతున్నాడు. కండ్లు మూత పడ్డాయి. ఒంటిమీద ఎక్కడా గాయాలులేవు. ఆ విమానాలు పడవేసిన బాంబు దెబ్బకు లారీ ప్రక్కకు వొరిగేటప్పుడు, బండిని నడిపించే చక్రమాతని గుండెల్లో

గ్రుచ్చుకొని. బలంగా దెబ్బతీసి వుంటుంది. ఆ మనిషిని తమ ట్రక్కులోని కెక్కించమన్నాడు లెఫ్టినెంట్. తరువాత ఇంతవరకొక్క పర్యాయమైనా వుపయోగించని పెద్దకోటు తనదాని నొకటి లెఫ్టినెంట్ తన సంచిలోనుండి బయటికి తీశాడు. దీనిని ట్రక్కులో పరిచి, దెబ్బతిన్న మనిషిని దానిపై పడుకోబెట్టి అతని చెంతనే కూర్చుని తన తొడమీద అతనితలను ఎంతో జాలిగా పెట్టుకొన్నాడు.

"వీలయినంత వేగంగా నీకు చేతనయినంత వడిగా వెళ్ళ"మన్నాడు డ్రైవరుతో.

మరీ కదిలిపోకుండా తన తొడమీదనున్న తలనూ, ఆ మనిషినీ అదుకొంటూ కూర్చుంటే, ఏది తలుచుకొన్నాడో ఏమో, తనలోతానే నవ్వుకొన్నాడు, సీనియర్ లెఫ్టినెంట్. సాయంసమయానికి ట్రక్కు వొక చిన్నగ్రామమును చేరుకొన్నది. ఇదొక చిన్న విమానదళ కేంద్రం. అచ్చటనున్న బెర్రివృక్షశాఖలనుండీ, ఆపిల్ చెట్ల కొమ్మలనుండీ, దడులకుపాతిన కర్రలనుండీ లాగి, బిగించికట్టిన తీగలనేకమున్నాయి. ఇండ్లప్రక్కనున్న పూరిగుడిసెలలో సాధారణంగా ఆ గ్రామప్రజలు తమ బండ్లనూ, పొలందున్నే పనిముట్లనూ వుంచుకొంటారు. ఇప్పుడు వాటిలో దెబ్బలుతగిలి, వంకరలు తిరిగిన జీపుకార్లూ, ఇంకా ఇతర మోటారుబండ్లూ వున్నాయి: కిటికీలలోనుండి కొన్ని యిండ్లల్లోనున్న వైమానికులు, పొడుగునెత్తిటోపీలూ, జబ్బలకు కట్టుకొనిన నీలిరంగు నాడాలూవారూ కనిపించారు కొన్ని ఇండ్లనుండి టైపుచేసే యంత్రాల శబ్దం వినిపించింది. అచ్చటి తీగలన్నీవచ్చి చేరిన వొక ఇంటినుండి తంతివార్తలనంపే యంత్రం టకటకలాడుతోంది. పెద్ద రహదారులకూ, చిన్న కాలిబాటలకూకూడా దూరంగా నుండబట్టి ఈ గ్రామమింకా, జర్మనుల వాతబడకుండా తప్పించుకో గలిగింది. జర్మనులు రాకపూర్వమీ ప్రదేశమంతా ఎంత ప్రశాంతంగా నుండేవోగదా అనితోచింది సీనియర్ లెఫ్టినెంటుకు. దట్టంగా నీటి మొక్కలు పెరిగిన చిన్న చెరువునిండా నీరున్నది. తీరాన పెరిగే ఎల్లోవృక్షాల శాఖలు క్రిందికి వ్రాలి నీటిని చుంబిస్తున్నాయి. దట్టంగా పెరిగిన నీటిమొక్కలమధ్యా, అచ్చటచ్చట గుబురుగా పెరిగిన దుబ్బులనానుకొనీ తెల్లటి ఎర్రముక్కుగల బాతులు రెండు జలక్రీడలాడుతూ, బహుపసందుగా కనుపించాయి.

ఎర్రసిలువ గుర్తుగల జెండా ఎగిరే ఇంట్లోకి దెబ్బతగిలిన లారీ డ్రైవరుని తీసుకువెళ్ళారు. తరువాత ట్రక్కు గ్రామంలోనికి వెళ్ళి అచ్చటనున్న బడి ఎదుట నిలచింది అనేక తీగలు ఇంటిలోనున్న వొక కిటికీని చొరబడి లోపలికి వెళ్ళాయి. తుపాకి చేతబట్టిన సిపాయొకడు దీనిని కాపలా కాస్తుండటమునుచూస్తే ఇది యిచ్చటి అధికారులుకూడి సంప్రతించే ఆఫీసు గృహమని గ్రహించవచ్చు.

కిటికీ చెంతకూర్చుని ఆ కాపలా జవానేదో వొక పత్రికలలోని చిత్రాలను చూస్తున్నాడు. మన సీనియర్ లెఫ్టినెం టాతనితో—

"దీని కమాండరును నే నగత్యంగా చూడా" లన్నాడు.

ఈ యింటిని సమీపించగానే లెఫ్టినెంటు తనకోటును సరిచేసుకొని, గుండీలు పెట్టి దాని మెడపట్టీనీ, నడుము పటకానూ వ్రేళ్ళతో సర్ది చక్కగా అమర్చాడు. దీనినిచూసి రెండో మనిషి. సార్జెంటు కూడా తన దుస్తు లన్నింటినీ చక్కదిద్దుకొన్నాడు. తరచుగా ముభావంగా నున్నట్లగుపించే యీ మనిషిమీద సార్జెంటుకెంతో గౌరవభావం కుదిరింది. అన్ని విషయాల్లోనూ అతని ననుకరించటానికి యత్నించాడు.

" కర్నలిప్పుడెంతో పనిమీద నున్నాడని " కాపలావా డన్నాడు.

"చాలా అవసరమైన విషయమై నే నాయనను వెంటనే చూడవలెనని చెప్పు, వైమానిక కేంద్రాలయంనుండి ముఖ్యమయిన సందేశము నొకటి తెచ్చాననిచెప్పు".

" తొందరపడితే లాభంలేదు. వేగు చూడవెళ్లిన మన విమానాలు పంపిన వార్తలను వింటూన్నాడు. ఎవరయినాసరే లోనికి రానీయకూడదని వారి ఆజ్ఞ. అదిగో! వెళ్ళి రవంత సేపాతోటలో కూర్చో " మన్నాడు.

పైమాటలు చెప్పి తన వార్తాపత్రికను చదవట మారంభించాడు. వేరే మార్గంలేనందున వచ్చిన మనుష్యులు తోటలోకివెళ్లి వొక బల్లమీద కూర్చున్నారు. చుట్టూ యిటుకలు పాతి, పాదులు కట్టినచోట పూలమొక్కలకు బదులు వత్తుగా పెరిగిన పిచ్చి మొక్క లగపించాయి. యుద్ధం రావటానికి ముందు ఆ వూరి బడిపంతులు వేసవికాలం మధ్యాహ్న సమయంలో యీ తోటలోనున్న చెట్లనీడలో విశ్రమించేవాడు కాబోలు. ఇప్పుడీ తోటంతా పాడుపడిపోయింది. గదిలోపలినుండి యిద్దరి కంఠాలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. వారిలో నొకమనిషి చాలా ఆదుర్దా పడుతూన్నట్టు గుక్క త్రిప్పుకోకుండా యేమిటేమిటో చెప్పుతున్నాడు. అతదేదో వొక దేశపటమును చూపిస్తూ ఈ విధంగా చెబుతున్నాడు :

" ఇదిగో, ఈరోడ్డుమీదా, గొరాఖావోకు వెళ్ళే ఆ బాట పొడుగునా లెక్కలేనన్ని ట్రక్కులూ, లారీలూ బారులుతీరి వెడుతున్నాయి. అన్నీ ముక్కుకుసూటిగా యుద్ధభూమికి వెడుతున్నాయి. ఇదిగో యిక్కడొక చర్చివున్నది. దానిచెంతనున్న పెద్ద పల్లపుమైదానంలో ట్రక్కులూ, టాంకులూ.... పెద్దదళమును సమకూరుస్తున్నారని నాకు తోచింది".

"ఎందుకట్లా తోచింది?" అని రెండోవ్యక్తి అడిగాడు.

"ఎక్కడికి వెళ్ళినా మామీద ఫిరంగులను ప్రేల్చారు. ఎట్లాగో తప్పించుకోగలిగాము. నిన్న యీ ప్రదేశంలో అక్కడక్కడ చిన్న గుడారాలూ, వాటినుండిలేచే పొగా కనుపించాయి. అచ్చట వారేదో వంటలు చేస్తున్నారనుకొని పొయ్యి బాగా మండటానికి వాళ్ళమీద నాలుగుబాంబులు విసిరాము. వేటి సంగతివేరు;

ఆకాశంలో యెగరటానికే వీలులేదు. తెగకాల్చి పారేస్తున్నారు. యుద్ధభూమికి వెళుతున్నారని తోచింది".

"జడ్ భాగంలోని పరిస్థితులు ?"

"అక్కడా కొంత అట్టహాసంగానే కనిపించింది. కాని యింత ఆర్భాటంలేదు. ఇదిగో యీ అడవిదగ్గర బారులుతీరిన టాంకు దళమొకటి సాగి వెళుతోంది. సుమారు నూరు టాంకులుంటాయి. పట్టపగలు యెవరన్నా చూసిపోతారేమో అనే భయమన్నా లేకుండా ఐదు కిలోమీటర్ల పొడవుగా ఆ టాంకుదళం వెళుతోంది. ఒకవేళ యిదంతా మనలను మోసగించడానికే చేస్తున్నారేమో నాకు తెలియదు... ఇక్కడా, ఇక్కడ ఈప్రదేశంలోనూ ఫిరంగిదళా లగుపించాయి. లెక్కలేనన్ని మందుగుండుసామాను ప్రోవులున్నాయి. ఇతరులకు తెలియకుండా వుండాలని వాటిమీద పెద్దకట్టెలనూ, కొమ్మలనూ పేర్చారు.... చాలా పెద్దప్రోవులు".

"ఇంతేనా ?"

"ఇంతే. కర్నల్ సోదరా దీనినంతా వ్రాసి యివ్వమంటారా ?"

"వ్రాయటమా ? ఇప్పుడట్టి వ్రాతకోతలకు వ్యవధిలేదు. వెంటనే బయలుదేరి సైనిక కేంద్రాఫీసుకు వెళ్లు. ఈమాటల్లోని అర్థం తెలుగా ? ఓయ్ ! ఎవ రక్కడ ? నా జీపును సిద్ధంచేయమని చెప్పు."

ఈ కమాండరు తన ఆఫీసు నౌక పెద్దగదిలో ఏర్పర్చుకొన్నాడు. ఇచ్చట, గదిమధ్యలో ఒక పెద్దబల్లతప్ప వేరే విశేషించి సామాను లేవీ లేవు. ఆ బల్లమీద యుద్ధభూమికి వెళ్లే టెలిఫోనులూ, విమానశాఖవా రుపయోగించే దేశపటాల కట్ట వొకటీ ఎర్రపెన్సిలుమాత్ర మున్నాయి. ఆ కర్నల్ పొట్టిమనిషి; చాలా చురుకైన వాడు. చేతులను వెనుక పెట్టుకొని, తలవంచి, బోనులోని పులిమాదిరి ఇటూ అటూ తిరుగుతున్నాడు. ఎదుట నిటారుగా నిలబడిన వైమానికులను గమనించకుండా, అకస్మాత్తుగా వారి ముందర నిలబడి, "ఏమి కావాలన్నట్టు" చూశాడు.

"సీనియర్ లెఫ్టినెంట్ అలెక్సీ, నేను తమ దళంలో చేరి పనిచేయడానికి వచ్చానని" సైనికసలాము పెట్టాడు. వారిలో పెద్దవాడు.

రెండోమనిషి డాంబికంగా కొయ్యబారి నిలబడి సలాముకొట్టి, "సార్జెంట్ మేజర్ అలెగ్జాండర్ పెట్రోవ్" అని తన పేరు చెప్పుకొన్నాడు.

"రెజిమెంటల్ కమాండర్, కర్నల్ ఇవానోవ్" అని, చీదరగా తన పేరు చెప్పి, "ఏమిటిసంగతి ?" అన్నాడు.

దేశపటాలను దాచే అల్యూమినియపు గొట్టంనుండి అలెక్సీ వొక జాబును తీసి అతని కిచ్చాడు. దాని నాతడు చదివి, ఎదుటివారి నిద్దరినీ చూసి,

"భేష్ ! మీరు సరియైన సమయానికే వచ్చారు. ఇద్దరంటే ఇద్దరినే ఎందుకు పంపించారు ? అంటూ అలెక్సీని చూసి, ఏదో జ్ఞాపకానికి వచ్చినట్లు, "ఇదిగో !

చూడు. నీవు అలెక్సీవేగా? విమానదళాధికారి నిన్ను గురించి టెలిఫోను చేశాడు. నీ విషయంలో కొంచెం...."

"ఇప్పుడదంతా అనవసరం, కర్నల్ సోదరా! పనిలో చేరడానికి నన్ను పంపించ"మని అతని మాట కడ్డంవచ్చాడు.

ఆ కర్నల్ రవంత దిగాలుపడ్డట్టుచూసి, నవ్వుతూ కరస్పర్శన మొనర్చి, "అబ్బా! ఎవరక్కడ? ఇదిగో వీరిద్దరినీ పెద్దగుమాస్తా దగ్గరికి తీసుకుపో. భోజనానికీ, వుండటానికీ అన్ని ఏర్పాట్లూ చేయమన్నానని చెప్పు. కాప్టెన్ ఛెస్లోవ్ దళంలో వీరిద్దరిపేర్లనూ ఎక్కించమను."

సార్జెంటు పెట్రొవు కీ కమాండరంటే సరిపడలా. చకచకా పనిచేయడమూ, ఏ విషయమునైనా చటుక్కున గ్రహించడమూ, ఏదన్నా వొక తీర్మానానికివచ్చి దానిని నెరవేర్చడమూ వంటి శక్తులుగల ఈ కమాండరువంటి మనుష్యులంటే అలెక్సీ కెంతో ఇష్టం. తాము తోటలో కూర్చున్నప్పుడు వైమానికుడు చెప్పిన ఆ విషయాలు అలెక్సీ మనస్సులో బాగా నాటుకున్నాయి. అనుభవశాలికాబట్టి అలెక్సీ విషయాలను గ్రహించాడు. సైనిక కేంద్రంనుండి తాము నడిచి వచ్చేటప్పుడు బాటలన్నీ కిక్కిరిసి వున్నాయి. రాత్రులందు దీపాలన్నీ ఆర్పివేయాలనీ, వ్యతిరేకించివెళ్ళే మోటారు కారుల చక్రాలను తుపాకితో కాలుస్తామనీ రాత్రి కాపలా సైనికులన్నారు. బిర్చి చెట్లు పెరిగిన అడవిలో టాంకులూ, ట్రక్కులూ ఫిరంగి లారీలూ ఎన్నోవున్నాయి. నిర్మానుష్యమైన బాటపై వెళ్ళే ట్రక్కులనుకూడా జర్మనులు కాల్చివేస్తున్నారు. వీటన్నిటినీ చూసిన అలెక్సీకి ఇంతవరకూవున్న పరిస్థితులు మారిపోయే రోజులు వచ్చాయనీ, కొత్త దెబ్బను తీయడానికి జర్మనులు సంసిద్ధమవుతున్నారనీ తెలిసింది. తమ జర్మను సైన్యాధికారులకిదంతా తెలుసు, వారికి తగిన బుద్ధి చెప్పడానికీ, తిరిగీ పైకి లేవకుండా చావుతన్నులు తన్నడానికీ రష్యనులు తగిన సన్నాహాలన్నీ చేశారన్నదికూడా అలెక్సీ యెరుగున్న విషయమే.

## 2

మరికొంత తిండి తినాలని కూర్చున్న పెట్రోవును, అలెక్సీ వదిలిపెట్టి రమ్మని ఆజ్ఞాపించాడు. విమానాశ్రయానికి వెళ్ళే కప్టెల ట్రక్కులో వారిద్దరూ కూర్చొన్నారు. అక్కడికి వెళ్ళి అచ్చటి దళపు కమాండరు, కాప్టెన్ ఛెస్లోవును సంధించారు. వారెవరో తెలుసుకొన్నాక, వారిద్దరితో కలిసి అంతదూరంలో మరుగున దాచబడిన రెండు ఎల్ ఎ — 5 విమానముల దగ్గరికి వెళ్ళాడు. ఒక దానిమీద "అనీ, మరొకదానిమీద 12 అనీ అంకెలున్నాయి. కొత్తగావచ్చే వారందరూ ఈ

విమానముల నెగురవేయటం నేర్చుకోవాలి. ఆ సాయంత్రమంతా అచ్చటి బర్చి అడవిలో గడిపారు. విమానాలు శబ్దిస్తూన్నప్పటికీ. తమకు వాటితో ఎట్టి జోక్యమూ లేనట్టు, పక్షి లా అడవిలో కూతలుకూస్తూ, వినోదంగా కొమ్మ కొమ్మ కెగురు తున్నాయి. అచ్చటి విమానాలను పరీక్షిస్తూ, మరమ్మతు మనుష్యులతో విమానముల గురించి చర్చిస్తూ. అచ్చటి దైనందిన జీవితమెట్లుంటుందో అడిగి తెలుసుకొంటూ కాలం గడిపారు.

ప్రొద్దుక్రుంకి, చీకటిపడిన సంగతికూడా వారికి తెలిసిందికాదు. లభిని ట్రక్కులో ఎక్కి ఇంటికి చేరుకొనేటప్పటికి రాత్రి భోజనాలయిపోయాయి. చేట కొట్టాడని వారు విచారపడాలా. వారిలో తినడానికి తెచ్చుకొనిన తినుబండాలింకా కొద్దిగా వారి సంచులలో నుండబట్టి వాటిని భుజించారు. ఆ రాత్రి పడుకొనటం చాలా కష్టమయిపోయింది. ఎక్కడో నిర్మానుష్యమైన ఈ ప్రదేశంలో కొత్తగా నేర్పర్చిన ఈ గ్రామంలో లెక్కకు మించినందరున్నారు. రెండు వైమానిక దళాల వారుండబట్టి స్థలం చాలిందికాదు. ఎచ్చటికి వెళ్ళినా అక్కడంతా జనులు: కాలు పెట్టడానికికూడా సందులేకపోయింది. లోపలికి రానిచ్చారుకారు. ఈ ఇండ్లను రబ్బరుతో తయారుచేస్తే బహు బాగుంటుందని అలెక్సీ అన్నాడు నవ్వుతూ, ఇప్పుడున్నవారికి మూడు రెట్లెక్కువమందిని లోపలికి త్రోసి మూయడానికి వీలుంటుందట! ఎక్కడా రవంతయినా సందు దొరకలా. చివరికి, ఏదయితే అదే కానీయని, వారితో వచ్చిన అధికారొకాయన వొక ఇంట్లోకి వారిద్దరినీ త్రోసి, "ఈ రాత్రి కిక్కడ ఏదో వొక విధంగా గడుపుకోండి. తెల్లవారితే మీకు తగిన వసతినేర్పాటు చేస్తా"నన్నాడు.

ఆ యింట్లో తొమ్మిదిమంది వున్నారు, నిద్రపోవటానికి సిద్ధంగా పడుకొని. పొగచూరే కిరసనాయలుదీపం పెట్టుకొన్నారు; ప్రేలిన బాంబుడిప్పల్లో నూనెపోసి వెలిగించే ఈ దీపాలకు, మొదటి సంగ్రామపురోజులలో "కట్యూషా"లని పేరు పెట్టారు. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధానంతరం, "స్టాలిన్‌గ్రాడ్‌కీ"లని పేరు మార్చారు కొందరు పరుపులమీద పడుకొంటే, ఇతరులు గడ్డిపాన్పులమీద బట్టలు పరుచు కొని పడుకొన్నారు. ఈ తొమ్మండుగురేకాక, ఆయింటి యజమానురాలు ముస లామె, ఆమె కూతురు, వయస్సువచ్చిన అమ్మాయికూడా ఆ యింట్లో నున్నారు, స్థలం చాలనందున వారిద్దరూ వొక పెద్ద వెడల్పయిన అలమారుమీద పడుకొన్నారు.

పడుకున్నవాళ్ళని త్రొక్కకుండా లోపలికి ఎట్లా వెళ్ళాలో తెలియక వైమా నికులిద్దరూ గదిగుమ్మంలో నిలబడ్డారు. అలమారుమీద పడుకొనిన ముసలమ్మ కోపంతో—

"స్థలంలేదు. చీమదూరేటంతకూడా సందులేదు. చూస్తే తెలియటంలా? ఇంటికప్పుతప్ప, పడుకోటానికి వేరే జాగాలేద"న్నది.

పెట్రోవ్ యీమాటలువిని, వచ్చినదారినే వెడదామనుకొన్నాడు. కాని అలెక్సీ బహుజాగ్రత్తగా పడుకొనివవాళ్ళని త్రొక్కకుండా పాదాలెత్తి పెడుతూ లోపలికి వెడుతూ—

"కూర్చొని ఏపంత తిండి తినడానికి స్థలందొరికితే అదే పదివేలు. అమ్మా, ఈరోజంతా మేము భోజనం చేయలేదు. కొద్దిగాగా, రెండు గిన్నెలూమాత్రం యిస్తే సరిపోతుంది. భోజనంచేసి మా మా నాన మేము వెళ్ళిపోతాము. ఈ రాత్రి బహుపుక్కపెడుతోంది; వెళ్ళితోటలో ఆరుబయట పడుకొంటాము తల్లీ" అన్నాడు.

పడుకొనిన ముసలమ్మవెనుక అలమారుమీద మనిషి కదిలిన శబ్దం. రెండు చిన్నపాదాలూ, సున్నితమైనమీగాళ్ళూ, కప్పుకొనిన దుప్పటినుండి తొంగిచూశాయి. ఆమనిషెవ్వరో క్రిందికిదిగి. వ్రేళ్ళమీదనడుస్తూ పడుకొన్న మనుష్యులను తప్పించుకొని వెనుకప్రక్కనున్న తలుపును తెరుచుకొని లోనికి వెళ్ళింది. కొన్ని పింగాణీ పళ్ళాలూ, వ్రేళ్ళకు తగిలించుకొని రెండూ రెండురంగుల గిన్నెలతో తిరిగివచ్చింది. దూరంనుండిచూస్తే పెట్రోవ్‌కామె చిన్నపిల్లమాదిరి కనబడింది. దగ్గరికివచ్చాక దీపకాంతిలో ఆమె వయస్సువచ్చిన జవరాలనీ. చూడ ముచ్చటగా నున్నదనీ పెట్రోవుకు తోచింది. గోధుమరంగు జాకెట్టూ, గోనెపట్టావంటిదేదో వొకబట్టతో కుట్టిన లంగా, మీద కప్పుకొనిన చినుగుల శాలువా ఆమె సహజ సౌందర్యమును మరుగుపరచలేకున్నాయి.

"మరీనా! మరీనా! లంజముండా యిట్లా రా" అని ముసలామె అరిచింది.

ముసలమ్మ అరుపుల కా స్త్రీ జంకిందికాదు. వార్తాపత్రిక నొకటి బల్లమీద పరిచి పళ్ళాలూ, గిన్నెలూ దానిమీద చక్కగా, కుదురుగాపెట్టింది. వాటి నేర్పరుస్తూ కనుకొలకులనుండి తూపులవంటి చూపులను పెట్రోవ్‌మీది కిసిరింది.

"రండి. కూర్చొని తినండి. ఏ రొట్టో కోసియిమ్మంటే కోసిపెడతాము. పొయ్యివెలిగించి కాచడానికి మాత్రం వీలులేదు. దీపాలార్పటం విషయంలో ఏమాత్రం పొరబాటు జరిగినా చంపిపారేస్తారు" అన్నది.

"ఓసి, పీ దుంపతెగా! మరీనా! ఇక్కడికిరా....రమ్మంటే పచ్చిచావవేమే?" అని గొంతెత్తి అరిచింది ముసలమ్మ, తిరిగి.

"ఆమె మాటలను లెక్కచేయకండి. కొద్దిగా మతిచాంచల్యం, జర్మను సైనికులే దీనికంతకూ కారణం. రాత్రిళ్లు సిపాయి కంటబడితేచాలు నన్నేమి చేస్తారో అని తెగ గాభరా పడుతుంది. రాత్రిపూటమాత్ర మీ విధంగా వర్తిస్తుంది. తెల్లవారితే నలుగురి మాదిరే" అన్నది మరీనా.

అలెక్సీ తన సంచినుండి వొక మాంసపు సమోసానూ, మాంసం డబ్బా నొకటీ, రెండు హెర్రింగు పుప్పు చేపలనూ; సైనిక రొట్టెనూ బయటికితీశాడు. ఆ ఎండు చేపలమీది పుప్పు ఆ గ్రుడ్డి వెలుగులో తళతళలాడింది. పెట్రోవ్

వంచిలో తనవంత మాంసమూ, రెండు మూడు రొట్టెముక్కలూ మాత్రమున్నాయి. అనుభవం తక్కువ మనిషికి ముందు జాగ్రత్తంటే ఏమిటో తెలియదుగా ? మరీనా వీటినన్నిటినీ చక్కని ముక్కలుగా కోసి వారి పళ్లాల్లో అమర్చింది. పొడవైన కనురెప్పల సందునుండి వంచిన తల నెత్తకుండా పెత్రోవ్‌ను చూస్తూ తన పనిని సాగించింది మరీనా. చాలీచాలని ధైర్యం తెచ్చుకొని పెత్రోవ్ ఆమెనప్పుడప్పుడు చూశాడు. వారిద్దరి చూపులూ కలుసుకొన్నప్పుడు సిగ్గుపడి ముఖాలు త్రిప్పుకొన్నారు. ఏది చెప్పదలచుకున్నా అలెక్సీని మధ్యవర్తిగా పెట్టుకొని అతనికి చెప్పేవారు. ఇదంతా అలెక్సీకి విచిత్రంగా కనిపించింది. కాని ఇదంతా యౌవ్వన రక్తపుటుడుకు ప్రభావమని అతనికి తెలియదా ? తెలుసు ; కాబట్టే అకస్మాత్తుగా పదేళ్ళు తనపైబడ్డట్టు లాతనికి తోచింది. వారితో పోల్చుకొంటే తన జీవితంలో ఇకమీద నిట్టిరోజులురావని తోచింది.

"చూడు మరీనుష్కా, మీ యింట్లో దోసకాయలులే వనుకొంటాను. ఊఁ !" అన్నాడు అలెక్సీ.

"లేకనేం ? ఉన్నాయంటూ" రెప్పగొట్టే పోకిరీనవ్వొకటి విసిరింది.

"ఉడకబెట్టినవి, రెండు బంగాళాదుంపలు ?"

"అట్లాగే - నీవడిగావు కాబట్టి"

పడుకొన్నవారిని తాకకుండా గాలిలో తేలిపోతూన్నట్టు లోపలికివెళ్ళిందామె.

"సీనియర్ లెఫ్టినెంట్ సోదరా ! ముక్కూ, మొఖమెరుగని ఆమెతో ఇంత ఘౌరవగా యెట్లా మాట్లాడగలవో నాకు తెలియకున్నది. దోసకాయలూ.... ఇంకా...." అన్నాడు పెత్రోవ్.

అలెక్సీ నవ్వుతూ, "ద్వాపరయుగం మనిషిలాగున్నావే ! మనమున్నది యుద్ధభూమి. జ్ఞప్తికున్నదా ?....ఏయ్ ముసలమ్మా ! ఎందుకట్లా సణుక్కొంటూ పడుకొంటావు. దిగి రా, మాతో రెండుముద్దలు తిను, రా" అన్నాడు అలెక్సీ.

గొణుక్కొంటూ అలమారునుండి దిగివచ్చిందా అవ్వ. బల్లను సమీపించిందోలేదో, మాంసపుసమోసా సమాంతంగా నెత్తి నములటం మొదలుపెట్టింది. పాడుయుద్ధం ! ఇట్టివి తిని ఎంతకాలమయిందో ! ఇటువంటి సమోసాలంటే ఆమెకెంతో యిష్టమట !

పడుకొన్నవారి గురకలూ, పలవరింతలూ వారికి వినపడలా, నలుగురూ బల్లపై నున్న పిండారగిస్తూంటే. అలెక్సీ ముసలామెతో హాస్యాలాడి, మరీనామ తెగ నవ్వించాడు. ఇచ్చటి వాతావరణ మాతనికెంతో నచ్చింది. ఎంతకాలం తరువాతో తన స్వంత గృహానికి వచ్చినట్టనిపించింది.

ఈ గ్రామంలో కొంతకాలంక్రితం జర్మనీ వారి సైన్యమొకటి వుండేదట. కాబట్టే ఇతర గ్రామాలమాదిరిదీ మట్టిపాలు కాకుండా ఇంకా నిలబడివున్నది.

రష్యను సైన్యాలు ఎదురుదెబ్బ తీయటంతో, జర్మనులు ఆదరాబాదరాగా పారిపోయారు. దీన్ని కాల్చి భస్మంచేయడానికి వాడికి వ్యవధిలేకపోయింది. ముసలమ్మ పెద్ద కూతురును జర్మను సైనికులు పట్టుకొని మానభంగం చేశారట. ఆ అప్రతిష్టను భరించలేక, పాపం, చెరువులోపడి చచ్చిపోయిందా అమ్మాయి. అప్పటినుండే ఈ అవ్వకు మతి చాంచల్యం కలిగింది. జర్మనులున్న ఎనిమిది నెలలూ, మరీనా వారి కంటబడిందికాదు. ఇంటి వెనుకనున్న దంపుడుగదిలో దాక్కొన్నది. ఆ గది ద్వారాని కడ్డంగా కట్టెలూ, గడ్డీ పేర్చిబెట్టి దానిలో, జర్మనుల కంటబడకుండా తప్పించుకోగలిగింది. రాత్రిళ్లు ఇంటి చూరులో చేసిన చిన్న రంధ్రంద్వారా తల్లి అన్నంతెచ్చి చేతి కందిచ్చింది. ఆ ఎనిమిది నెలలూ సూర్యుడంటే ఏమిటో ఆ అమ్మాయి చూసిన పాపానపోలేదు. తన తల్లీ అలెక్సీ మాట్లాడుకొంటూంటే, మరీనా పెత్రోవును చూస్తూ, సిగ్గుపడుతూ కాలం గడిపింది.

భోజనం ముగిసింది. మరీనా తినగా మిగిలినవాటిని భద్రంగా అలెక్సీ సంచిలో పెట్టి, సైనికుని జీవితమొకనాడున్నట్టు మరొకరోజు వుండదన్నది. తరువాత తనతల్లి చెవిలో నేదో చెప్పి, వారిద్దరినీ చూసి, "మిమ్మిద్దరినీ ఇచ్చట దిగబెట్టి వెళ్ళిపోయా డావచ్చినమనిషి. కాబట్టి యిక్కడే వుండండి. అలమారుమీద మీరిద్దరూ పడుకోండి. అమ్మా, నేనూ లోపల చక్కాలమీద పడుకొంటాము. ఎంతదూరంనుండి వచ్చారో పాపం ! కొద్దిగా నడుమువాల్చటంమంచిది. తెల్లవారాక మీకూ చోటుచేయడానికి యత్నిస్తామ"న్నది మరీనా.

తిరిగి నిశ్శబ్దంగా గదివెనుకకు వెళ్ళి యింత గడ్డితెచ్చి అలమారుమీద పరుపువేసింది. పాతబట్టలతో దిండ్లనమర్చింది. ఇంత పని చేసినా రవంతయినా శబ్దము చేయకపోబట్టి నిద్రించేవారి కివంతా యెంతమాత్రమూ తెలిసిందికాదు.

మోకీళ్లు విరిగేటట్టు కాళ్ళుజాపి, వెల్లికిలా గడ్డిపాన్పుపై పడుకొని, "మంచిపిల్ల ! ఏమంటావు" అన్నాడు అలెక్సీ ప్రక్కనే పడుకొనిన పెత్రోవ్‌తో.

"ఫరవాలేద"న్నాడా రసిక శిరోమణి !"

"ఊరికే బుకాయిస్తావెందుకు ? నీవంక యెట్టాచూసిందో ! ...."

"నావంకా ? చూడనేలేదే, ఎంతసేపూ నీతో మాట్లాడడానికే దానికి సరిపోయింది"

రవంత సేపయిందోలేదో పెత్రోవ్ నిద్రపోయాడు. అలెక్సీకి నిద్ర పట్టవన్నది కళ్లు తెరుచుకొని పడుకొంటే, ఏదో వెదుకుతూన్నట్టు ఆ గదిలోకి మరీనా పలుమారు రావటమూ, తాము పడుకొన్న అలమారువంక చూడటమూ అతని కగుపించింది. దీపం కొడిబారింది కాబోలు దానిని సరిచేసి, అలమారువంక మరొకపర్యాయంచూసి నెమ్మదిగా తలుపు దగ్గిరికి వెళ్లింది. అందచందాల ఈ మరీనా యీవిధంగా చీకినగుడ్డలు కట్టుకొనటం తలుచుకొంటే అలెక్సీకి కడుపు

చెరువయింది. తెల్లవారితే తాను విమానమెక్కి యుద్ధభూమికి వెళ్ళాలి. పెత్రోవ్ కూడా తనతోనే వెళ్ళడానికేర్పాటు చేశారు.... ఏమవుతుందో తెలియదు.... మంచి వాడులాగానే కనిపిస్తున్నాడు, పెత్రోవ్....చూసీచూడగానే మరీనా వాడిమీద మరులు కొన్నది !.... సరిలే, ఎందుకొచ్చిన ఆలోచనలివన్నీ ?....కునుకు పట్టించుకొనటం మంచిది.... ఇవీ అలెక్సీకు కలిగిన ఆలోచనలు.

ప్రక్కకు వొత్తిగిలి పడుకొన్న అలెక్సీకి త్వరలోనే నిద్రపట్టింది.

ఏదో వొక గొప్పప్రమాదం సంభవించినట్లనిపించి, అలెక్సీ అదిరిపడి నిద్ర లేచాడు. అదెట్టి ప్రమాదమో తెలియలేదు కాని, మొత్తంమీద ఏదో విపత్తు సంభ వించినట్లాతనికి తోచింది. చటుక్కున రివాల్వరును చేతబట్టుకొని నిలబడ్డాడు. తానెక్కడవున్నదికూడా అతనికా సమయంలో తెలిసిందికాదు. ఒకటేపొగ : వెల్లుల్లివాసనలపొగ అంతటా కప్పివేసింది. ఆ పొగమేఘం గాలికి కొట్టుకుపోయింది తల పైకెత్తిచూస్తే ప్రశాంతంగా ప్రకాశించే నక్షత్రాలగుపించాయి, పట్టపగలు కనుపించినట్లన్ని వస్తువులూ బహుస్పష్టంగా కనిపించాయి. ఆ యింటి దూలాలన్నీ టపీ చిందరవందరగా ఇక్కడా అక్కడా నేలమీద విసిరిపడేశారు, ఎవ్వరో. ఇంటికప్పొకప్రక్క క్రిందికి దిగజారింది. ఏదో వొకటి, అంతదూరాన కాలుతోంది. మూలుగులూ, విమానపుటింజనుల హోరూ, జుయ్యిమంటూ క్రిందపడే బాంబుల శబ్దాలూ వినిపించాయి.

దారీతెన్నూ తెలియక, మోకరించి కూర్చొని "ఇదంతా ఏమిటి ?" అన్నట్టు చూసే పెత్రోవ్‌ను "పడుకో"మన్నాడు, అలెక్సీ.

అలమారు కంటకరుచుకొని వారిద్దరూ పడుకొన్నారో లేదో, బాంబునుండి ఎగిరివచ్చిన తునకవొకటి ఆయింటి పొగగొట్టమును తాకింది. రాళ్ళూ, ఎర్రటి దుమ్మూ దానినుండి జలజల రాలాయి, వారిమీద.

ఎక్కడికో వొకక్కడికి నడిచివెళ్ళాలనీ, ఉన్నచోటేవుండరాదనీ రాత్రిళ్ళు విమానదాడి జరిగేటప్పుడు ప్రతివాడికీ ఆదుర్దా పుట్టుతుంది. ఇట్టి ఆదుర్దాకే అలెక్సీ కూడా లోనయ్యాడు. కాని ఆ వుద్దేశము నణగద్రొక్కి, "పడుకో" యని మరొక పర్యాయం గద్దించాడు. ఆ చీకటిలో పడే బాంబు లగుపించాయికావు. విమానములు క్రిందికి విసిరే కాగడాల వెలుగులో చిన్న గులకరాళ్ళ మాదిరగుపించి క్రిందికి రానురాను బ్రహ్మరాక్షసుల మాదిరి పెరిగి, భూమిని తాకినంతనే ప్రేలి, అగ్ని జ్వాలల వెళ్ళగ్రక్కి భయంకొలుపుతున్నాయా బాంబులు, భూమి రెండుగా చీలు తున్నట్టూ రి-రి-రి-క్రిక్, రి-రి-రి-క్రిక్ అని ఏవో ప్రేలుతూన్నట్టూఅలెక్సీకి తోచింది.

వారు పడుకొన్న అలమారీ శబ్దాలకు కంపించింది. కాళ్ళూ, చేతులూ, ముఖమూ, వక్షమూ దానికంట కరచిపెట్టి, పరాయివాటి కంటికనుపించకుండా వుండడానికి వారు తెగ తికమకలు పడుతున్నారు. విమానాలు వెళ్ళిపోయాయి

గాబోలు వాటి శబ్దం దూరంగావెళ్ళి నిలిచిపోయింది. వీరున్న యింటికెదురుగా వాటకవతలప్రక్క కాలిపోతూవున్న ఇండ్లనుండి లేచిన మంటలు వీరి కంటబడ్డాయి.

బట్టలకూ, చెప్పులకూ అతుకున్న గడ్డినీ, మట్టినీ దులుపుకొంటూ, "జన్మనులు నిద్రపోవద్దు, మెళకువగానుండమని హెచ్చరించివెళ్ళారు. ఏమంటా" వని లేనినవ్వు తెచ్చుకున్నాడు అలెక్సీ.

పెట్రోవ్ క్రింది దవుడ గజగజలాడుతోంది. ఒకటే ఎక్కిళ్ళు మొదలు పెట్టాయి. ఆపుకోలేకపోయాడు. "నిద్రపోతున్నవాళ్ళ "సంగతి? ... మరీనా?" అన్నాడు, పెట్రోవ్.

అలెక్సీతన దగ్గరనున్న టార్చిలైటును చేబట్టి వారిద్దరూ దూలాల క్రిందా, క్రిందకూలిన రాళ్లూ, ఓప్పలూ, పెంకుల క్రిందా ఎంతో వెతికారు. ఒక్క రయినా వారికంటపడలా. విమానాలు వస్తున్నాయనే హెచ్చరికను సైనికులందరూ విన్నారట.వారందరూ గబగబా లేచివెళ్ళి, నేలలో తవ్వినకాలువలను చేరుకున్నారు. ఇదంతా తరువాత వారికి తెలిసింది. కాని, ముసలమ్మా, మరీనా ఎక్కడా కని పించారుకారు ఎంత వెతికినా. ఏమయినట్లు? బిగ్గరగా పేర్లుపెట్టి పిలిచారు. ఊహూఁ! లాభం లేకపోయింది. ఎక్కడికి వెళ్ళినట్లు? తప్పించుకుపోగలిగారో, లేదో, పాపం?

సైనిక పని మనుష్యులు వచ్చారు. కాలుతున్న ఇండ్ల నార్పి, కాలిపోయిన వాటిని, క్రిందికిత్రోసి పడగొట్టి చనిపోయినవారి శవాలను బయటికి తెచ్చారు; కొందరు జవానులు వైమానికులను, పేర్లుబెట్టి పిలుస్తూ అన్ని వీధుల్లోకీ వెళ్ళారు. వెంటనే ఇచ్చటినుండి గుడారమెత్తి, మరొకచోటికి వెళ్ళటానికి తీర్మానించబడింది. తెల్లవారుజామునే ఎగిరి వెళ్ళటానికి వైమానికులందరినీ సిద్ధంగా నుండమన్నారు. వారందరినీ వొక్కచోట చేర్చి లెక్కచూడగా చాలామంది చనిపోలేదని తేలింది. ఏ కొద్దిమందికో దెబ్బలు తగిలాయి. ఇద్దరు వైమానిక మరమ్మతు మనుష్యులూ, పది పండ్రెండుగురు రాత్రి కాపలావారూ, చెప్పినచోటినుండి కదలకుండా వుండటం వల్ల మృత్యువాత బడ్డారు. ఆ గ్రామ ప్రజల సంగతే వారికి విశదంగా తెలిసింది కాదు. ఒకవేళ తప్పించుకుపోయారా? చనిపోయారా? ఎంతమంది? ఆ చీకటిలో ఎక్కడకని వారిని వెతకడానికి వెళ్ళటం?

తెల్లవారబోతూంటే అలెక్సీ, పెట్రోవ్ లిద్దరూ విమానాశ్రయానికి బయలు దేరారు. గతరాత్రి తాము పడుకొనిన ఇంటిని మరొకపర్యాయం చూడకుండా వెళ్ళ టానికి వారి మనస్సు వొప్పిందికాదు. దూలాలూ, వాసాల మధ్యనుండి తీసిన దేనినో కర్ర నిచ్చెనమీద పడుకోబెట్టి ఇద్దరు పనివారు మోసుకొని వస్తున్నారు. దానిమీద రక్తసిక్తమైన బట్ట కప్పారు.

భయపడుతూ పారిపోయి, రాని మాటలు పెకలించి "ఏమిటిది?" అన్నాడు అలెక్సీ.

వారిద్దరిలో పెద్ద మీసాలున్న మనిషిని చూస్తే అలెక్సీకి స్టిఫాన్ ఇవానొక్ జ్ఞప్తికి వచ్చాడు. ఆ మనిషి ఈ విధంగా చెప్పాడు.

"ఒక ముసలిదీ, పడుచుదీ ఇద్దరగుపించారు. అలమారు బల్లలమీద వీరిద్దరూ కనుపించారు. పైనుండి పడినరాళ్ళు గాయపర్చాయి. చనిపోయారు, ఇద్దరూ. చిన్నమ్మాయి చాలా అందకత్తెలా గున్నది. వక్షానికి తాకిన రాతిదెబ్బకు ప్రాణాలు కోల్పోయింది. ఎంతో అందమైన అమ్మాయి పాపం!"

ఆ రాత్రి జర్మనులు ద్విగుణీకృతోత్సాహంతోనూ,పట్టుదలతోనూ పెద్దదాడిని లేవనెత్తారు. సోవియట్‌వారు నిర్మించుకొనిన గోడలనూ, యితర ఆటంకాలనూ నేలమట్టం చేయాలనే వుద్దేశంతోనూ, యీదెబ్బతో యుద్ధం అటో, యిటో తేలిపోవాలనీ, జర్మనులు బయలుదేరారు. కర్స్క్ ప్రాంతంలో జర్మను లీయుద్ధమును మొదలుపెట్టటం కాలిదితీసి నెత్తికి రుద్దుకొన్నట్టు పరిణమించింది.

# 3

విమానాశ్రయమంతటా యెక్కడ యేదివున్నదీ కానరాని మసగ వెలుతురు యెగరటానికి సిద్ధంగా నుండేటందుకు విమానపు టింజనులను వేడెక్కిస్తున్నారు. నేలమీద దేశపటమును పరిచి, కాప్టెన్ చెస్‌లూవ్ కొత్త విమానాశ్రయ మెచ్చట నున్నదీ, దానిని చేరుకోవడానికి మార్గమునూ వైమానికులకు తెలియజెప్పుతున్నాడు.

"కండ్లు తెరుచుకొని మరీ యెగరండి. విమానాశ్రయం యుద్ధభూమి కంట కరుచుకొని వున్న"దన్నాడు.

జర్మనుల యుద్ధభూమి కానుకొని వున్నట్టు లీ విమానాశ్రయం ఆ పటంలో గుర్తించబడివున్నది. ఇచ్చటినుండి చిన్నగా ముందు కెగిరి వెళ్ళాలి, దానిని చేరుకోడానికి. ఇన్ని దినాలతరువాత తామే యీ యుద్ధాన్ని జర్మనులు తిరిగి ప్రారంభించబట్టి యికమీద వెనుతిరిగి వెళ్ళటమనే ఆలోచనలకు తావేలేదు, ఎగిరి ముందుకు సాగిపోవటానికి రష్యను వైమానికులు తహతహలాడారు, నేను ముందంటే నేనంటూ.

దూరాన సూర్యుడు తొంగిచూశాడు అరుణోదయకాంతు లాకాశమార్గాన వ్యాపింపజొచ్చాయి. పైకిలేచిన మంచుమేఘాలు దొంతర్లు దొంతర్లుగా దొర్లుతుంటూ తేల్తుతున్నాయి. రష్యనుల రెండో వైమానికదళం పైకి లేచింది. ముందువెళ్ళే

కమాండ రెక్కన విమానము ననుసరిస్తూ విమానములన్నీ యెగిరి వెడుతున్నాయి. దక్షిణ ముఖంగా యుద్ధక్షేత్రానికి.

అలెక్సీ, పెట్రోవ్ లిద్దరూ వొకే విమానంలో కూర్చున్నారు. అలెక్సీ విమానం నడిపిస్తున్నాడు. అతని నేర్పరితనమూ, దర్జాను చూసి పెట్రోవెంతో తనలో తానే మెచ్చుకొన్నాడు. వెనుకగదిలో కూర్చొన్న పెట్రోవ్‌ను పరీక్షించాలని అలెక్సీ విమానమును చటుక్కున ప్రక్కలకు త్రిప్పాడు. అద్దంలో కనిపించే ఆతని ముఖమును పరీక్షగా చూశాడు. ధైర్యసాహసా లున్నాయి. కండ్లరెంటినీ వుపయోగించటంతెలుసు. సునాయాసంగా ఎగురగలడు. ఇంకా కొంచెం అనుభవం కలిగితే బాగా పనికివస్తాడు పెట్రోవని అలెక్సీకి తోచింది.

వీరు వెళ్ళే విమానాశ్రయ మొక రష్యను కాలిదళమునకు వెనుకప్రక్కనున్నదీ. ఈ సంగతి జర్మనులకు తెలియదు. తెలిస్తే ఫిరంగులను ప్రేల్చి, మారణ మోర్టారు యంత్రాలతో బాంబులను వాటిమీదికి విసిరి హతమార్చగలరు. అకస్మాత్తుగా తయారవటంవల్ల ఈ విమానాశ్రయమున్న సంగతి వారికి తెలియదు. ఇన్ని దినాలుగా సమకూర్చిన మందుగుండు సామానులను, ఎదుటనున్న రష్యనుసైన్యం మీద వాడటానికి జర్మనులు పూనుకొన్నారు. రష్యనులు నిర్మించుకొనిన కోటల మీదా, గోడలమీదా మంటలు లేచాయి. వర్షం కురిసినట్టు వచ్చిపడే బాంబులనుండీ, ఫిరంగులనుండీ లేచిన నల్లటిపొగ కన్ను కనుపించనంత దట్టంగా నల్దిక్కులా అలముకుంటోంది. సూర్యు డుదయించాడు. కాని ఇప్పటంతా వొకటే, చీకట్లు క్రమ్ముకొన్నట్లున్నది. బుయ్యిమనే హోరూ, భయంకరగర్జన ధ్వనులూ, నల్లటి మేఘాలవంటి పొగలూ; కళావిహీనమై, వాడిపోయిన పెద్ద బంతిపూవువంటి సూర్యు డాకాశంలో విస్మృతిజెంది నిలబడ్డాడు.

ఇంతకుపూర్వం రష్యను విమానాలు జర్మనులున్న దేశంమీదికి ఎగిరి వెళ్ళటం చాలా లాభదాయక మయింది. వా రెచ్చటెచ్చట తమ సైన్యాలను నిలబెట్టినదీ ఏయే ప్రదేశాల్లో మందుగుండు సామాగ్రిని భద్రపరచినదీ, ఎచ్చటెచ్చట దెబ్బతీయటానికి యత్నించేదీ మనవారు తెలుసుకోగలిగారు. ఈ విషయాలన్నిటినీ వైమానికుల చేతికిచ్చిన పటాలలో విశదంగా చూపెట్టారు. నిద్రపోయే మనిషి వీపులో మొదలంటా దిగగ్రుచ్చిన బాకుమాదిరి ఏమరుపాటు చెందిన రష్యను సైన్యంలో తేలికగా చొరబడి వెళ్ళటానికి వీలవుతుందని జర్మను లనుకొన్నారు. రష్యనులు నిద్రపోతున్నట్టు నటిస్తున్నారనే విషయం వారికి తెలిసిందికాదు. కొన్నివందల కిలోమీటర్లు పొడుగునా ప్రేలే ఫిరంగుశబ్దమూ, వాటినుండి లేచే పొగలూ జర్మనులు దాగుకొనిన యుద్ధకోటలన్నీ అదిరిపోయేటట్టూ, దారీ తెన్నూ కనబడకుండేటట్టూ చేశాయి. గురిపెట్టి రష్యను సైన్యాలనూ, స్థలములనూ కాల్చటానికి వారికి వీలు చిక్కిందికాదు. రష్యనుల కిట్టి

ఆత్మరక్షణాలు లేకపోబట్టి వారు గురిపెట్టి కొట్టగలిగారు. ఇంతకుపూర్వమే జర్మను సైన్యాలూ, వారి యుద్ధభూమి యావత్తూ ఎక్కడెక్కడ ఏవిధంగా ఏర్పాటు చేశారో వారికి తెలుసు కాబట్టి వారి మందుగుండు సామానులున్న ప్రోవులనూ, టాంకులు నిలబడిన ప్రదేశాలనూ, బారులుతీర్చి నిలబడిన పదాతి దళాలనూ వంతెనలూ, కేంద్రస్థానాలూ అన్నింటినీ గురిపెట్టి కాల్చివేయటం రష్యనులకు సాధ్యమయింది.

ఇరుపక్షాలవారూ వేలకొలది ఫిరంగులను రకరకాలవాటి నుపయోగించారు. యుద్ధమెంతో తీవ్రంగా చెలరేగింది. కాప్టెన్ చెస్లొవ్ విమానదళం వచ్చి దిగేటప్పుడప్పుడు చెవులు చిల్లులు పడేటట్టు వొకటే శబ్దం వినబడింది. భూమియావత్తూ గజగజలాడింది. ఏదో పెద్ద రైలొకటి అంతూపంతూ లేకుండా గడగడ శబ్దం చేస్తూ వంతెనమీద వెడుతూన్నట్టులా శబ్దం ఏకధారగా వినబడింది. పైకిలేచే పొగలు ఆకాశం కనుపించనంత దట్టంగా క్రమ్ముకొన్నాయి. వీరు దిగిన విమానాశ్రయం మీదుగా ఎన్నెన్నో విమానా లెగిరివెళ్ళాయి. తెరలుతెరలుగావచ్చే ఈ విమానములు లెక్కలేనన్ని బాంబులను వర్షిస్తూ వెళ్ళాయి. ఫిరంగుల ప్రేలుడుతోడి బాంబుల శబ్దం! చెవిగూబలదిరి ఆజన్మాంతం చెవుడు వస్తుందేమో అనిపించింది.

మన వైమానిక దళమును సిద్ధంగా నుండమన్నారు. వైమానికులందరూ తమ తమ విమానములలోనికెక్కి కూర్చొని, ఇంజనులకు ఆవిరి నెక్కించారు. తాళాధువ్వవంటి రాకెట్టును పై కెప్పుడు పంపిస్తారా అని కండ్లు రెండూ ఆకాశానికి వప్పగించి చూస్తూ కూర్చున్నారు. సమృద్ధిగా పెరిగే కుక్కగొడుగుల ఘాటువాసనలగాలి తగులుతోంది. ఇచ్చటి శబ్దాలకూ, పొగలకూ బెదిరి రెప్పగొట్టబడిన దోమలు వైమానికుల చేతులమీదా, ముఖంమీదా వ్రాలి పీక్కుతింటున్నాయి.

ముఖానికి తొడుగుకొన్న కవచమునెత్తి అలెక్సీ దోమల పారద్రోలుతున్నాడు. చల్లని ప్రాతఃకాలపు పిల్లవాయువుల పీల్చుతూ, వెనుక నానుకొని తాపీగా కూర్చున్నాడు. పెట్రొవ్ అడపాతడపా తనవిమానంలో లేచినిలబడి యుద్ధమే విధంగా సాగుతున్నదీ చూశాడు. తమపై ఆకాశమార్గాన ఎగిరివెళ్ళే జర్మను విమానాలను ఢీకొనాలనే ఆతుర్దా నాతడు ఆపుకోలేకున్నాడు. పైకిలేచి ఏదోవొక జర్మను విమానమును సమీపించి దానిపై తన మరఫిరంగిని నుపయోగించా లనిపించిందాతనికి. నత్త గుల్లలో దాగుకొనిన నత్తమాదిరి, ఆ విమానంలో కూర్చున్నవాడు తన ఫిరంగి గుండ్లు తగిలి గిజగిజ లాడిపోతాడు. వీడివంటివాడే. ఎవడో పాపిష్టి వెధవవొకడు మరీనామీద బాంబు విసరివుంటాడు. ఆమెపేరుచెప్పి ఏ పదిమందినో తెగటార్చటం తన విధ్యుక్తధర్మమనుకొన్నాడు. తనవంక జాలిగాచూస్తూవున్నట్టు లాతనికి భ్రమపుట్టింది.

అడుర్దాపడుతూ కూర్చున్న పెట్రోవ్‌ను అలెక్సీ ఓరగంట చూశాడు. అతనికీ తనకూ వయస్సులో అట్టే తేడాలేదు. అతనికి వంధొమ్మిదయితే, తనకు యిరవై మూడేండ్లు. ఈ నాలుగైదేండ్ల తేడావల్ల మనిషిలో యెంతటి గొప్పమార్పు లన్నా కలగవచ్చుగదా అనుకొన్నాడు. పెట్రోవ్‌తో పోల్చుకుంటే తా నెంతో పెద్దవాడననీ, చాలా అనుభవశాలిననీ అతనికి తోచింది. ఇంతేకాదు; తన కెన్నేళ్ళో పైబడినట్టూ, శక్తియావత్తూ వుడిగిపోయినట్టూ అలెక్సీ భ్రమపడ్డాడు. తమ విమానానికి సామీప్యంలోవెళ్ళే మరొక రష్యను విమానమునుచూచి బిగ్గరగా నవ్వుతూ, చేతులు నులముకొంటూ ఏదేదో బిగ్గరగా అరుస్తున్నాడు పెట్రోవ్. అలెక్సీ కాళ్ళుజాపి తన కుర్చీలో దిగజారి కూర్చున్నాడు. తనకు పాదాలు లేవు. తనతోపాటు యెగురుతూన్నవారిలో యింతటి గొప్పచిక్కులో పడినవా డొక్కడయినా లేడు. కాని అలెక్సీ తన మనోధైర్యమును పోగొట్టుకోలేదు. పాదాలు లేకపోయినప్పటికీ తా నణుమాత్రంకూడా యితరులకు తీసిపోడనే ధైర్య మాతనికి కలిగింది.

సర్వసిద్ధంగా నుండటంతప్ప ఆరోజు పైకెగిరివెళ్ళే అదృష్టం వారికి లేక పోయింది. ఎందుకనో వారిని యెగిరి వెళ్ళమని ఆజ్ఞాపించారుకారు. బహుశా యింత త్వరగా ఈ విమానదళమొకటి వున్నదనే సంగతి జర్మనులకు తెలియరాదని అను కొన్నారు కాబోలు.

పూర్వ మీప్రదేశంలో జర్మనులున్నపుడు నేలలో కాలువలూ, గుంతలూ త్రవ్వారు. మన వైమానికుల నా గోతులలో పడుకోమన్నారు ఆ రాత్రి. చలి నాపుదల చేయటానికి బల్లచెక్కల మీద అట్టలనూ, కాగితాలనూ జర్మనులు అతికించారు. వాటి గోడలమీద పూర్వం జర్మను సైనికులంటించిన సినీమా నక్షత్రాల బొమ్మలూ అందకత్తెల ఛాయాపటాలూ, జర్మను నగర దృశ్యాలూ యింకా అట్లాగేవున్నాయి.

ఫిరంగుల యుద్ధం ఎడతెరపిలేకుండా సాగింది, నేలంతా వణికింది, పొడి ఇసుక ఆ రాత్రంతా గోడలకంటించిన కాగితాలమీద దిగజారింది. లెక్కకు మించిన చీమలబారు లా కాగితాలమీద నడచినట్లు ఇసుకరేణువులు రాత్రంతా పడుతూనే వున్నాయి.

అలెక్సీ, పెట్రోవ్ లిద్దరూ అరుబయట రబ్బరు బట్టలు పరుచుకొని నిద్రించా లనుకొన్నారు. తొడుగుకొనిన దుస్తులతోనే పడుకోమని ఆజ్ఞాపించబట్టి, పాదాలకు కట్టిన తోలుపటకాలను రవ్వంతసడలించి, వెల్లికలా పడుకొన్నాడు, అలెక్సీ, ఆకాశమంతా అదిరిపడేటట్టు శబ్దాలను వింటూ, మందేమంటల కాంతిని తిలకిస్తూ పడుకొన్నాడు. పడుకొన్నరవంత సేపట్లో పెట్రోవ్ నిద్రపోయాడు. నిద్రలో మాట్లాడాడు, పండ్లు కొరికాడు, పెదవులను చప్పరించాడు, చిన్నపిల్లాడి

మాదిరి ఇటూ, అటూ దొర్లాడు. చలిపెట్టకుండా వుండటాని కాతనికి తన పెద్ద కోటును అలెక్సీ కప్పాడు. అలెక్సీకి నిద్రరాలేదు. లేచనిలబడి రకరకాల కసరత్తులు చేశాడు ఒళ్లు వేడెక్కాలని. నడిచివెళ్ళి అంతదూరంలోనున్న చెట్టుమోడుమీద కూర్చున్నాడు.

ఫిరంగియుద్ధం నిలిచిపోయింది. ఎప్పుడో వొకప్పు డెక్కడో వొకచోట ఏదో వొక ఫిరంగిమాత్రం మ్రోగింది. విమానాశ్రయాని కంత దూరంలో కొన్ని ఫిరంగిగుండ్లు పడి బ్రద్దలయ్యాయి. వీటినంతా అలెక్సీ నరకు చేయకుండా తన మూనాన తాను కూర్చున్నాడు. తదేకదృష్టితో పోరుజరిగే ప్రదేశమును చూస్తున్నాడు. అంత చిమ్మచీకటిలోనూ యుద్ధం సాగుతోంది, బహు తీవ్రంగా ఆ మండే మంటలకు ఆకాశమంతా ఎర్రబారింది. ఆ మంటల కాంతిలో ప్రాణా లర్పించి పోరాడే మనుష్యుల నీడలు నేలమీద తోలుబొమ్మలాడినట్టు లాడుతున్నాయి. నీలి రంగు కాగడాలను జర్మనులు విసరితే, మన వారు పసుపురంగు వాటి నుపయోగిస్తున్నారు. ఉన్నట్టులుండి చీకటిని చెదరగొట్టే బ్రహ్మాండమైన అగ్నిజ్వాల ఎక్కడో వొకచోట లేవటమూ, దాని వెన్నంటి గుండె లదరగొట్టే శబ్దం వినపడటమూ, ఇవన్నీ చూస్తూ, ఆలకిస్తూ అలెక్సీ కూర్చున్నాడా చెట్టు మోడుమీద.

రాత్రిళ్లు పైనుండి విమానాలఘోష వినవచ్చింది. వాటినుండి రంగురంగుల మంటలు మండే తూటాలు యుద్ధభూమిమీద వర్షించాయి. విమాన విచ్ఛేదక ఫిరంగులనుండి పైకెగిరిన గుండ్లు ఎర్రగా నెత్తురు చుక్కలమాదిరి రగుపించాయి. నేలంతా అదిరిపడింది. మూలిగింది. ఆక్రందనం చేసింది. చెట్ల చిటారుకొమ్మల్లో నెగిరే మినుగురులు ఈయుద్ధంతో తమకెట్టి జోక్యమూలేనట్టు ఆకులమధ్య దాగుడుమూతలాడాయి. అడవిలో దూరాన ఎక్కడో గుడ్లగూబ వొకటి కూసింది. ఇదొక అపశకునమనుకొన్నాడు అలెక్సీ. ఎవరికి? పగలంతా భయపడి ఎక్కడో దాగుకొనిన నైటింగేలు పక్షి – చక్రవాకం వంటిది. రవంత ధైర్యం తెచ్చుకొని గొంతు సవరించుకొన్నది. తంబూర తీగల శృతిచేసినట్టు కంఠం సాఫీచేసుకొని, పిదప కంఠమెత్తి, తన్నుతాను మరిచిపోయి పాటతో లయమొంది విజృంభించింది. తక్కిన పక్షులీపాటనందుకొన్నాయి. మారణయుద్ధంతో మార్మోగే ఈ యుద్ధభూమి నీ పక్షుల గానం అంతరిక్షంనుండి అమృతవర్షం మాదిరి కురిసింది. ఆ గానం విని కుర్స్కప్రదేశపు నైటింగేలు పక్షులు జగత్ప్రసిద్ధి నొందటంలో ఆశ్చర్యంలేదని, అలెక్సీ అనుకొన్నాడు.

తెల్లవారితే అలెక్సీ యుద్ధానికి వెళ్ళవలసి వుంటుందేమో, అతనికింకా తెలియదు. ఆ విధంగా వెళ్ళటం మృత్యువుతో చెలగాడటమనిమాత్ర మాతనికితెలుసు. కాని ఆతని కా గొడవేలేదు. దిగంతములా మార్మోగే చక్రవాకముల గానమున కాతడు వశుడైపోయాడు.

పూర్వమొకప్పుడుతమ కామిషిన్ గ్రామంలో జరిగినసంఘటనజ్ఞప్తికివచ్చింది. తానూ తన చకోరము ఓల్గా ఇద్దరూ చేరి వొక నాడీ పక్షులపాటను విని ముగ్ధులై పోయారు. ఆ పాటకు వశులై, ఎలుగెత్తి వారిద్దరూ, రెండు చకోరపక్షులమాదిరి పాడారు!

తూర్పుతెల్లవార వొచ్చింది. చకోర పక్షులపాట సన్నగిలిపోయింది. ఫిరంగు లార్భాటంచేస్తూ మేల్కొన్నాయి. పైకిలేచిన సూర్యుడు, పొగలు క్రమ్మిన ఆకాశంలో పాలిపోయినట్లగుపించాడు.

# 4

కుర్క్సు ప్రాంతంలోని యుద్ధం జోరుగా సాగింది. జర్మనులు తమ టాంకు దళాల నుపయోగించి కుర్క్సు దగ్గిరనున్న రష్యను సైనికులను దక్షిణంనుండీ, వుత్తరంనుండీ ముట్టడించాలనీ, ఈ విధంగా వారి నడకత్తెరలోపెట్టి నొక్కి హతి మార్చి కుర్క్సు ప్రాంతంలో నొక "జర్మను స్టాలిన్‌గ్రాడు" నేర్పాటు చేయాలనీ అనుకొన్నారు. కాని వారి ఆశలు తీరడానికి వకాశంలేకపోయింది. రష్యను లద్వితీయ ధైర్యసాహసాలు చూపి వారికెదురై నిలబడ్డారు. జర్మను టాంకులు మన సైన్యంలోనికి చొరబడలేక పోయాయి. ఒకవేళ రష్యను సైన్యములో చొర బడ గలిగినా, తమ వారిలో ననేకులు మృతినొందాలనీ, ఎంతో నష్టము ననుభ వించాలని జర్మనులకు తెలిసింది. ఇంత నష్టమయ్యాక ఉత్తర, దక్షిణాలనుండి చేయడానికి వారికి శక్తి సామర్థ్యాలు చాలవు. ఇవంతా జర్మనులు గ్రహించారు. కాని ప్రారంభించిన ఈ కుర్క్సు యుద్ధము నాపడానికి వారికి వీలుపడిందికాదు. హిట్లరీయుద్ధము నెట్లాగయినా జయించి తీరాలని శపథంచేసి కూర్చున్నాడు. రాజకీ యంగా తన భావిజీవితమంతా యీ యుద్ధంమీద ఆధారపడివుంటుందని అతడనుకొని. పెద్దపెట్టున యుద్ధము సాగాలని ఆజ్ఞాపించాడు. కట్టతెగి మీదికి వచ్చినప్పుడే వరదనీటి ప్రవాహంమాది రీ యుద్ధం సాగివెళ్ళేకొద్దీ దారిలో తన కడ్డంతగిలినవాటి నన్నిటినీ శుభ్రంగా తుడిచిపెట్టుకొంటూ వెళ్ళింది. దాని నాపడానికీ, అడ్డగించడానికీ జర్మనులకు సాధ్యపడిందికాదు. జర్మను లేకొద్ది కిలోమీటర్ల దూరమో ముందుకు సాగివెళ్ళేలోగా వందలకొలది టాంకులూ, వేలాది ట్రక్కులూ, సైనికులూ నాశన మయ్యారు. జర్మనుసైనిక దళానికి కలిగిన యీ నష్టాలవల్ల దాని జీవరక్తం వరదలై పారి అది పాలిపోయి నిర్వీర్యం కాజొచ్చింది. కాని, కొరివితో తల గోక్కొన్నట్లువున్న యీ యుద్ధము నాపుచేయడానికి జర్మనులకు చేతనయింది

కాదు. విధిలేక యింకా ఎక్కువగా యుద్ధపరికరాలనూ, సైనికులనూ ఈ మారణ హోమానికి ఆహుతిచేశారు.

ముంచుకువచ్చే జర్మనుల నీ ప్రదేశంలో రష్యనుల నద్వితీయ పరాక్ర మంతో ప్రతిఘటించారు. వారి నడగించడానికి మాత్రం కావలసిన సైన్యము నుపయోగించి, తతిమ్మాదానినంతా సమయానుకూలంగా వాడటానికి సంసిద్ధపరిచి వుంచారు. ఇక్కడికివచ్చిన రష్యను టాంకులూ, విమానాలూ ఇందువల్లనే యుద్ధంలో పాల్గొనక యెప్పటికప్పుడు సిద్ధంగా నుండవలసివచ్చింది. జర్మను సైనికులందరూ యుద్ధంలో చేరటంచూచి, కొద్దికాలంలో వారి ఆర్భాటమంతా చల్లారుతుందని తెలిసి, రష్యనులు తమ వైమానికులతో ఇప్పుడప్పుడే తమకెట్టిపనీ వుండదని చెప్పారు. రాత్రిళ్లు నిద్రపోయేటప్పుడు వైమానిక దుస్తులు తొడుగుకో నక్కరలేదనీ, మామూలు బట్టలుకట్టుకోవచ్చుననీ ఆజ్ఞాపించారు. అలెక్సీ, పెట్రోవు లిద్దరూచేరి తమకుఇచ్చిన గదిని తమ ఇష్టానుసారం అలంకరించారు. జర్మను లతికించిన సినీమా నక్షత్రాల బొమ్మలనూ, జర్మను నగర దృశ్యాలనూ తీసిపారే వేశారు. బల్ల చెక్కలకు అంటించిన అట్టలనూ, కాగితాలనూ తీసివైచి బర్చి కొమ్మలూ, ఆకులతో అలంకరించారు ఇందుమూలంగా ఇసుక క్రిందికి జారిపడే టప్పుడు చేసే శబ్దం వినిపించిపోయింది.

ఒకనాటి ప్రొద్దున అలెక్సీ, పెట్రోవ్ లిద్దరూ భూమి కడుగుననున్న తమ గదిలో పడుకొన్నారు. దాని మట్టిగోడలలో చిన్న అరలు రెండు త్రవ్వి వాటిలో మంచాలమీద పడుకొన్నట్టు పడుకోటాని కేర్పాటు చేసుకొన్నారు, వారు పడుకొనిన చోటునుండి చూస్తే వెలుపలనేలమీదవాలిన పైన్ ఆపిల్ మీద ఎండపడుతోంది. ఉన్నట్టుండి పైనుండి అడుగులు వినబడ్డాయి. "తపాలామనిషి" అనేమాట విని పించి. వారిద్దరూ అదిరిపడిలేచి కూర్చున్నారు.

అలెక్సీ తన పాదాలను బిగించుకొంటూ సిద్ధమవుతున్నాడు. పెట్రోవొక్క గంతువేసి పరుగిడి వెళ్ళాడు. తపాలా వాడిచ్చిన రెండు వుత్తరాలనూ చేతబట్టు కొనివచ్చి అలెక్సీకిచ్చాడు. ఒకటి అతని తల్లి దగ్గర నుండీ, మరొకటి ఓల్గా వ్రాసినదీ. వాటిని చింపిచూడా లనుకొన్నాడోలేదో, ఇంతలో వెలుపలనుండి గంట వినబడింది. విమానాశయంలోనుండే ఈ గంట మ్రోగటం, వైమానికు లందరూ వెంటనే తమ తమ విమానాల దగ్గరకు హాజరుకావాలని సూచిస్తుంది.

జాబులను తన కోటుజేబులో పెట్టుకొని వాటి సంగతే మరచిపోయాడు. పెట్రోవుతానూ బయలుదేరి అడవిగుండా వెళ్లే కాలిబాట మీద విమానాశ్రయము నకు వెళ్లారు. పాదాలులేని అలెక్సీ, పెట్రోవ్‌తో సమంగా, చేతికర్రనూతచేసు కొంటూ చకచకా నడిచాడు. పరుగెత్తాడు. వెళ్ళిచూస్తే తన విమానపు టింజనుకు కప్పినబట్టను తీసి వారి రాక కెదురుచూస్తూ నిలబడిన మ శ్లోక డగుపించాడు. ఇతడు విమానాశ్రయపు మరమ్మతు శాఖకు చెందిన మనుష్యులలో నొకడు,

"6" నంబరు విమానం బయలుదేరడానికి సిద్ధంగామన్నది. దానిలో వారి దళాధికారి కాప్టెన్ చెస్‌లోవ్ కూర్చున్నాడు. మైదానంమీదికి దానిని తెచ్చి నిల బెట్టి తన కుడిచేతిని "తయార్" అని తెలపడానికి పైకెత్తాడు. తతిమ్మా విమానపు టింజనులన్నీ బుర్రుబుర్రుమని బుసలుకొట్టాయి. వాటినుండి లేచినగాలికి నేలపై నున్నగడ్డి నేలకానుకుపోయి సాష్టాంగ నమస్కారం చేసింది. దూరపు బర్చి శాఖలు విరిగి ఎగిరిపోయేటట్టు కదిలాయి. ఊగిపోయాయి.

అలెక్సీని సమీపించిన వైమానికుడొకడు తమ టాంకులు బయలుదేరి వెడు తున్నాయని చెప్పాడు. దాడివెడలే తమ టాంకులమీద ఎగురుతూ వాటిని శత్రు వారినుండి రక్షించటమే తాము, వైమానికులు చేయవలసిన కార్యమని అలెక్సీ గ్రహించాడు. టాంకులను కాపాడుతూ ఎంతసేపని ఎగరటానికి వీలవుతుంది? తప్పకుండా శత్రువిమానములు ఆ మార్గాన రాకమానవు. ముఖాముఖి వొకడు వొకరిని చూచుకొనటం సంభవిస్తుంది. ఇంతకాలంగా తాను వేచియున్నతరుణం, పరీక్షా సమయం త్వరలో రానున్నది! ఇతరులకు తానెంతమాత్రంకూడా తీసిపోనని నల్గురికీ చూపించి తీరుతాడు. తన మనోరథ మీడేరుతుందని వుప్పొంగాడు.

అలెక్సీకి ఏదో బెడ్డగాబరాగా నున్నది. తాను చనిపోతాననే భయమెంత మాత్రమూలేదు. ఎంతటివాడికయినా ఇటువంటపుడు, ఎటుపోయి ఎటువస్తుందో అనే భయం కలుగకమానదు. కాని ఇట్టి భయ మాతనికి కలిగిందికాదు. తమ విమానపు ఫిరంగులను, బయలుదేరేముందు పనివారు పరీక్షించారో, లేదో! ఈ విషయ మాతనిని కలవరబెట్టుతోంది. ఇంతవరకూ తనకిచ్చిన కొత్తటోపీని తా నుపయోగించలేదు. రేడియో వార్తలను వినటానికి దాని కిరుప్రక్కలా బిగించిన చెవి బిళ్ళలు ఎట్లా పనిచేస్తాయో? విరోధి ఎదురైతే పెట్రోవేమిచేస్తాడో! భయపడి వెనుకంజవేస్తాడా? లేకపోతే మొండిధైర్యంతో వెళ్ళి తన మెడను నురిత్రాటిలో దూరుస్తాడా? వాసిలెవిక్ తనకు బహూమతిగానిచ్చిన ఈ చేతికర్రను ఏమయినాసరే తన ప్రాణతుల్యంగా కాపాడుకోవాలి. తాను చదివే పుస్తకమునుగానీ, సగంవరకూ చదివి, రసవంతమైన ఘట్టంలో నిలిపివేసిన గొప్ప అపరాధపరిశోధక నవలనుకానీ యెవరైనా తీసుకొన్నప్పటికీ దాని నాతడు సహించగలడు. కాని చేతికర్ర అంటే తన ప్రాణప్రదంగా, అంతకంటే యెక్కువగానే చూసుకొంటున్నాడు. ఈ గొడవలో పెట్రోవుతో వెడుతున్నానని చెప్పటమే మరిచిపోయాడు. ఇది జ్ఞప్తికిరాగానే విమానంనుండి అతనికి చేయిసూపాడు. పెట్రో విది చూడలా. కండ్లు రెండూ వప్పగించి కమాండరునూ, ఆత డెత్తిపెట్టిన చేతినీ చూస్తున్నాడు. అతడు ధరించిన తోలుటోపీ క్రింది ముఖం, కందగడ్డమాదిరి ఎర్రపడింది. కమాండరు తన చేతిని క్రిందికి దింపాడు. ఇంజనులు హోరుమన్నాయి.

మొదటి మూడు విమానాలు ముందుకురికాయి. బిగ్గరగా వాటి ఇంజనులు నగ్గాయి. పైకి లేచాయి. వెంటనే మరిమూడు లేచాయి. వాటి ననుసరించి

మరొక మూడు. అలెక్సీ, అతనితోనున్న విమానాలూ కూడా పైకెగిరి వరుసగా వెడుతున్నాయి. క్రిందనున్న భూమి నిమిషనిమిషానికీ దిగజారిపోతోంది, బహు వేగంగా. తనకుముందు వెడుతూన్న విమానము నంటబట్టి అలెక్సీ యెగురు తున్నాడు. తన వెనుక మూడోది వస్తోంది.

యుద్ధభూమి కనబడింది. బాంబులూ, ఫిరంగిగుండ్లూ పడి గోతులుపడిన నేల. వేసవికాలంలో దుమ్ము పేరుకొనిన నేలమీదపడిన వానచినుకుల మాదిరి రగు పించింది త్రవ్విన కాలువలన్నింటినీ నేలమట్టంగా దున్నేశారు. పూర్వం బ్రహ్మాండంగా ప్రజ్వరిల్లిన మంటలన్నీ చల్లారి. కాలినకట్టెలూ, రాళ్ళూ మిగిలాయి. లోయపొడుగునా పైకిలేచే మంట లగుపించాయి. యుద్ధభూమిలో యెడతెరిపిలేక జరిగే పోరునుండి పైకి లేస్తున్నాయి ఈ మంటలు. అంత యెత్తునుండి చూస్తే క్రింద జరిగే విషయాలన్నీ తమాషాగా ఏదో పిల్లలాడుకొనే బొమ్మలాటమాదిరి కనుపించాయి ! క్రింద ఘోరసంగ్రామం జరుగుతోందనీ, ఎక్కడ చూచినా మంటలూ, పొగలూ, గర్జనధ్వనులతో భూమి మారుమ్రోగి గజగజలాడిపోతోం దనీ, వీరవిహారంచేస్తూ మృత్యుదేవత తాను తెచ్చుకొనిన సంచులనిండా విగత జీవుల నింపుకుంటోందనీ, పైనున్న వైమానికులు తెలుసుకోడానికి వీలులేక పోయింది.

మన విమానాలు యుద్ధభూమిపై కెగిరి విరోధులున్న ప్రదేశమును దాటి రవంత దూరం లోపలికివెళ్ళి, తిరిగే వెనుతిరిగి వచ్చాయి. వారి నెవ్వరుగానీ అడ్డ గించిన పాపానపోలేదు. ఒక్క ఫిరంగిగుండయినా ఆకాశంలోని కెగిరివచ్చింది కాదు. క్రింద నేలమీద నానాఅగచాట్లూ పడుతూవున్న మనుష్యులకు పైన ఎగు రుతూన్న ఈ తొమ్మిది విమానములనూ చూడటానికే తీరుబడిలేకున్నది. చూసినా, చూడనట్లూరకొన్నారు. తమ టాంకుదళ మెక్కడున్నది ? ఏమయినట్టు ? కని పించదేమి ?.... అదిగో, అక్కడగుపిస్తున్నాయి. మన టాంకులు ! అడవిలో నుండి ఒకదాని ననుసరించి ఇంకొకటిగా నడిచివస్తున్నాయి. ఆ యెత్తునుండి అవన్నీ నేలను ప్రాకే పేడపురుగుల మాదిరి కనుపించాయి. ఎన్నో టాంకులువచ్చి చేరు కొన్నాయి ఇంకా వస్తూనేవున్నాయి. అంతులేని హనుమంతుడితోక మాదిరి, వాటిలో మొదటనున్నది బహువేగంగా అచ్చటనున్న గుట్టపై కెగబ్రాకి, ఫిరంగి గుండ్లుపడి గోతులుపడ్డ భూమిని చేరుకొన్నది. టాంకులనుండి ఎర్రటి నిప్పు కణాలులేచి దూరాన పడుతున్నాయి. అలెక్సీ మాదిరే అంత ఎత్తునుండిచూసి నట్టయితే ముసలమ్మ కాదుగదా, చంటిబిడ్డ అయినాసరే ఈ టాంకులను చూసి భయపడదు చితికిపోయిన జర్మను సైన్యం మీదికి దాడివెడలిన ఈ వందల కొలది టాంకులను చూస్తూ కూర్చున్న అలెక్సీ చెవులలో రేడియో ద్వారా వినబడే రక రకాల శబ్దాలనన్నిటినీ మించి, స్పష్టంగా ఈ మాటలు వినబడ్డాయి.

"తయార్ ! నేను చిరుతపులి, మూడు. నేను, చిరుతపులి, మూడు కుడి ప్రక్క జంకరు విమానాలు, జంకర్లు, జంకర్లు" అది కాప్టెన్ చెస్‌లోవ్ గొంతు.

ముక్కుకు సూటిగా ఆకాశంలో నొకచార అలెక్సీకి కనుపించింది. అదే కమాండరు చెస్‌లోవ్ విమానం. ఆ విమానంకుడీ ఎడమలకు వూగిసలాడుతూ ఎగిరింది. వైమానిక సంజ్ఞలలోని దొకటి. నేనేది చేస్తే అదంతా నీవు చేయి" అని దీని కర్థం.

ఈ ఆజ్ఞను అలెక్సీ తన వెనుకవచ్చే విమానమునకు తెలిపాడు. వెనుతిరిగి చూస్తే తన్నంటిపెట్టుకొని వస్తున్నాడు పెత్రోవ్. చాలా సంతోషించి.

"అంటకరచుకొని యెగురు"మన్నాడు బిగ్గరగా.

"నేను చేస్తున్నపనే అది" అని వినబడింది.

తిరిగి రేడియో సందేశం. "నేను, చిరుతపులి, మూడు ! చిరుతపులి, మూడు !!....నా వెంబడే రా !"

శత్రువు దగ్గరికి వస్తూన్నాడు. వారి విమానాలకు క్రింద, కొంతదూరంలో "జంకర్-87" జర్మను విమానాలు బాతులెగిరి నట్లెగురుతున్నాయి. ఈ విమానాల కస్మాత్తుగా శత్రువుమీదపడి బాంబు ప్రేలినట్టు ప్రేలుతాయని జగద్విఖ్యాతి కెక్కాయి. పోలెండ్, ఫ్రాన్సు, హాలెండు, డెన్మార్కు, బెల్జియం, యుగోస్లావియా యుద్ధాల్లో వీటివల్ల కలిగిన నష్టమూ, ఇవివొనర్చిన ఘోరకార్యాలనూ ఆ రోజుల్లో భూలోకపు వార్తాపత్రికలన్నీ పెద్ద పెద్ద అక్షరాలతో ప్రచురించాయి. కాని, రష్యన్ శాస్త్రజ్ఞులూ, ఇంజనీర్లూ చేసిన పరిశోధనల ఫలితంగా యిప్పుడవెందుకూ పనికిరాకపోయాయి. జంకరు విమానంలో నుండే కిటుకూ, వాటి లోపాలూ రష్యనులు గ్రహించారు. ఏ కుందేలునో లేక ఏ గుంటనక్కనో వేటాడినట్టు, బహుతేలికగా వాటిని తరిమి పడగొట్టడం నేర్చుకొన్నారు.

కాప్టెన్ చెస్‌లోవ్ తిన్నగా శత్రువుమీదికి వెళ్ళేబదులు చుట్టు తిరిగివెళ్ళాడు. "శత్రువు కళ్ళల్లో, సూర్యుడు పడేటట్టు చేస్తే అతని కండ్లు మసగలు క్రమ్ముతాయనీ, అప్పు డాతనికి యెదురువెళ్ళి మీదపడవచ్చుననీ కాప్టెను తంత్రం పన్నాడు. ఇదంతా అనుభవశాలి కాబట్టి అలెక్సీకిట్టే విదితమయింది. "పనికిమాలిన ఈ జంకర్లను పడగొట్టడాని కింత ఆర్భాటమనవసరమని, ఫరవాలేదు, ఉవంత అలస్య మవట తప్ప ఇందువల్ల కలిగే నష్టమేదీలేదను" కొని అలెక్సీ తనలోతానే సంతోషపడ్డాడు. వెనుకవాటుగా చూశాడు, పెత్రోవ్ తన్నంటి పెట్టుకొనే వస్తున్నాడు.

జర్మను విమానాలను సమీపించారు. అవన్నీ ఒకదాని కొకటి, కంటికగుపించని త్రాళ్లు కట్టుకొని ఎగురుతూన్నట్టు ఆకాశమార్గాన ఎగిరి సమీపిస్తూన్నాయి. ఎండపడి వాటి రెక్కలు తళతళలాడాయి.

తమ కమాండరుయొక్క మరొక ఆజ్ఞ అలెక్సీకి వినబడింది "....చిరుత పులి, మూడు, మీదపడండి !"

నేలను ప్రాకే కోడిపిల్ల మీదికిదిగే డేగమాదిరి, చెస్‌లోవ్ అతనితోనున్న మరిద్దరు వైమానికులూ జర్మను విమానాల రెక్కలపై దిగారు: తుపాకి గుండ్లు జంకరు విమానాల ప్రక్కలలో బిల్లుపోట్లు పొడిచాయి. రెండు జంకర్లు ఆ రష్యను విమానధాటికి తాళలేక వరుసతప్పి ప్రక్కకుపోగానే, ఆ సందుగుండా చెస్‌లోవ్, అతని స్నేహితులిద్దరూ దూసుకుపోయారు. వెంటనే జంకర్లు తిరిగి బార్లుతీరి ఎగరటం ప్రారంభించారు.

అలెక్సీ తనమిత్రులిద్దరికీ "మీద పడమ"ని రేడియోలో చెప్పజూచాడు. కాని మాటలు తడబడ్డాయి. ఎంతసేపూ "మీద.... మీద...." అనటంతప్ప పైమాట పెకలించుకు వచ్చిందికాదు. ఎదుటవెళ్లే జర్మను విమానాలమీది కాతని విమానం వ్రాలబోతోంది. చెస్‌లోవ్ కొట్టినదెబ్బకు విమానం క్రిందపడటంతోటే దానిచోటు నింకొకటి ఆక్రమించింది. అలెక్సీ యీజంకరును గురిచూసి రెండు బొటనవ్రేళ్లతో ఫిరంగుల నెక్కుపెట్టి దానిపైకి లంఘించాడు. నేమియూ తీగెవంటి పొగలాతని కంటబడ్డాయి. జర్మను లాతనిమీదికి తుపాకులను ప్రేలుస్తున్నారు : తప్పిపోయింది మరొకగుండు. మునుపటికంటే దగ్గరకొచ్చి గురితప్పి వెళ్ళింది. ఎటువంటి అపాయంగానీ జరిగిందికాదు. పెట్రోవ్ సంగతి? అతనుకూడా సురక్షితంగా నున్నాడు, వారికందకుండా ఎడమ ప్రక్కనున్నవాడల్లా తప్పించుకొని కుడి ప్రక్కకు వచ్చాడు. తెలివైనవాడనడానికి సందేహంలేదు : జంకరు విమాన మొకటి పెద్దదిగా పెరుగుతూ దగ్గిరికివస్తోంది. బొటనవ్రేళ్ళు ఫిరంగి మీటను నొక్కడానికి తొందరపడ్డాయి. కాని. ఇంకాస్తవంత దగ్గిరికి రానీయటం మంచిదని తోచింది....——

అలెక్సీ అకస్మాత్తుగా తానెగిరే విమానంతో లయమైపోయాడు. తానొకటీ, విమాన మింకొకటీ అనే భావం నశించింది. డబడబా కొట్టుకొనే ఇంజనాతని గుండెల్లో శబ్దించింది. దాని పెట్రోల్ వాయువాతనిశ్వాస కనుగుణ్యంగా ఉచ్ఛ్వాస. నిశ్వాశాలొనర్చింది, ఎగిరేదాని రెక్కలాతని భుజగూళ్ళకు గిలిగింతలుపెట్టాయి. తన కృత్రిమ పాదాలు జీవం పోసుకొని, చైతన్యంతో నిండిపోయి, ఇంజను వడుకుతో సమంగా వడుగువెత్తాయని అలెక్సీకి తోచింది. జర్మను విమాన మాతని దాటివెళ్ళింది. అలెక్సీ వెన్నంటి వెళ్లి దాని నందుకొన్నాడు తిన్నగా దానిపై కెగిరి చేతి బొటనవ్రేళ్ళను రెంటినీ బలంగా అదిమాడు. తుపాకిగుండ్లు ప్రేలట మాతనికి వినబడిందికాదు. వాటినుండి లేచిన పొగకూడా అతని కగుపించలా. కాని తప్ప కుండా జంకరు దెబ్బతిన్నదని గ్రహించాడు. తిరిగీ దాని జోలికి పోకుండా తిన్నగా వెళ్ళాడు. జర్మను విమానం త్వరలో క్రిందపడుతుందనీ, ఇకమీద తన జోలికి రాదనీ అలెక్సీ గ్రహించాడు. ఎదుటనున్న అద్దంలో చూశాడు. తన వెనుక నేమి జరుగుతోందో తెలుసుకోవాలనీ, తాను పేల్చిన తుపాకిగుండ్లకు, మరొక విమానంకూడా క్రిందికి పడిపోవట మాతనికి కనుపించింది. బహుశా, తనేను

తెలియకుండానే, రెండువిమానములను పడగొట్టాడు కాబోలు! తిరిగి పరీక్షగా చూశాడుకాదు. ఆ రెండోవిమానమును పెట్రోవ్ పడగొట్టాడు. తనవెంట ఎగు రుతూ, తన మాదిరే పెట్రోవ్ కూడా వేరొక జంకరును పడగొట్టాడు. మంచి శకునం! మంచి బోణీ! పెట్రోవ్ అన్నివిధాలా తనకంటే ఎక్కువ అదృష్ట వంతుడని అలెక్సీకి చాలా సంతోషం కలిగింది.

తమతో పైకిలేచిన రష్యనువిమానములు. మరిమూడు జర్మను విమానము లను చెదరగొట్టి. సందుచేసుకొని. దూరి అవలిప్రక్కకు వెళ్లాయి. జర్మను విమాన ములు తిరిగి అన్నీ చేరుకొనేలోగా, కాప్టెన్ చెస్‌లోవ్ అతనితోనున్న వారిద్దరూ వాటిని వెన్నంటి. దూర దూరంగా తరిమారు. అవన్నీ తమ సైన్యమున్న భాగానికి పైగా ఎగిరాయి. ఈ తరుణం కనిపెట్టి రష్యను విమానాలు జంకర్ల మీద తుపాకు లను ప్రేల్చి వేధించుతూ వెంటబడ్డాయి. ఆ జంకర్లను నడిపేవారంతా అనుభవ శాలురని తోచదు. గాభరాపడ్డారు. తమ విమానములలోనున్న బాంబు లెక్కడ దెబ్బతగిలి పగులుతాయో అని భయమొంది, వాటిని క్రిందపడవేశారు. అవన్నీ వెళ్ళి తిన్నగా తమ సైనికులమీదా, వారున్న ప్రదేశంలోనూ పడ్డాయి. చెస్‌లోవ్ పన్నిన పన్నుగడే యిది. అది ఫలించటం చూసి ఆత డెంతో సంతోషపడ్డాడు.

పోగా మిగిలిన జర్మన్ జంకర్లు ఒకటిగా చేరుకొని, రష్యను టాంకులున్న తావు కెగిరివెళ్ళడం రష్యనులు కనిపెట్టారు. మిగిలిన మూడు రష్యను విమానాలూ జర్మన్‌లనడ్డగించాయి. కాని అంతగా లాభంలేకపోయింది. రష్యను విమానమొకటి దెబ్బతిని క్రిందపడిపోయింది. జర్మను విమానాలు మన టాంకులుండే ప్రదేశ మును చేరుకోబోతున్నాయి. ఇది కనిపెట్టి చెస్‌లోవ్ వాటిని క్రిందనుండి తాకి కాల్చివేయడానికి నిశ్చయించాడు. రష్యను ఎల్ ఎ - 5 విమానములు తలక్రిందు లుగా తిరిగి క్రిందికి దిగాయి. చెస్‌లోవ్ విమానమంతట తల పైకెత్తి లేచి పైన ఎగురుతూన్న జంకర్ల మీదికి వెళ్ళింది. జర్మను విమానముల అడుగు భాగాలు చెస్‌లోవ్‌కూ. అతనితోనున్న మరి రెండు విమానాలకూ స్పష్టంగా కనుపించాయి. గురిపెట్టి కాల్చారు. రెండు జంకర్లు విడివడి క్రిందికి జారాయి. వాటిలో నొకటి మధ్యకు రెండు తునకలయిందికాబోలు, విరిగిపోయిన దాని తోక అలెక్సీ ఎగిరే విమానమును సమీపించి క్రిందపడింది.

అలెక్సీ పెట్రోవ్‌కు "వెన్నంటి రమ్మని" సంజ్ఞ చేశాడు. క్రిందికిదిగి, పల్టీకొట్టి తిన్నగా పైన కనుపించే జంకర్ల మీదికి అలెక్సీ వేస్తున్నాడు. ముందుకు పడకుండా వెనుక కానుకొని కుర్చీలో కూర్చున్నాడు. నెత్తురు మెదడుకు దిగింది. నోటిలోనూ, ముక్కుల్లోనూ రక్తం పూరుతూన్నట్లనిపించింది. కళ్ళల్లోకిదిగిన రక్తంవల్ల చూసేదంతా యెర్రగానున్నట్లాతనికి తోచింది. తనకు పైన ఎగురు తూన్న జంకరు విమానపు టడుగుభాగం స్పష్టంగా కనుపించింది. దాని చక్రాలూ, ఘాటీ కంటుకొని గట్టిపడిన విమానాశ్రయపు మట్టీ కూడా గోచరించాయి.

బొటనవ్రేళ్ళతో ఫిరంగి మీటను నొక్కాడు. తా నెక్కడ కొట్టిందీ - పెట్రోలుదాచిన టాంకునా ? ఇంజనునా ? లేక బాంబులు దాచిపెట్టిన భాగమునా ? అనేది అతనికి తెలియదు. ఎక్కడ తగిలిందో తెలియదు కాని, అది పగిలి, గుప్పున పొగలు లేచాయి, తిరిగీ ఆ జంక రాతనికి కనుపించలా.

ఆ ప్రేలుడు బలానికి పుట్టిన వాయు వొక్క-పెట్టున అలెక్సీ విమానమును తాకి ప్రక్కకొరిగి పడేటట్టుచేసింది. మండే అ పెద్ద అగ్నిజ్వాల కంతదూరంలో ఎగిరి, తిరిగీ తన విమానమును నిటారుగా త్రిప్పాడు. ఆకాశంలోనున్న పెద్ద తెల్లటి నబ్బు నురుగువంటి మేఘంపైన నిర్మలాకాశంలో పెట్రోవూ, ఆతని విమానమూ గోచరించాయి. చూపుమేరలో నున్న చుక్కలమాదిరి వెళ్ళిపోతూన్న జంకరు విమానము లగుపించాయి. అవన్నీ అన్నిదార్లుపట్టి వెడుతున్నాయి. అలెక్సీ తన చేతిగడియారమును చూశాడు. దాదాపొక అరగంటకాలం పోరు జరగటంవల్ల తన పెట్రోలు చాలావరకు కాలిపోయివుంటుం దనిపించింది. కాని గడియారం మూడున్నర నిమిషాలను మాత్రమే చూపింది. ఇంత కొద్దిసేపట్లో యిన్నిపనులూ జరిగాయన్న దాతడు నమ్మలేకపోయాడు.

తనప్రక్కకు వచ్చి తనతో జంటగా పెట్రో వెగురుతున్నాడు. ఆతని చూసి అలెక్సీ—

"బ్రతికేవున్నావా ?" అన్నాడు.

"మరీ ?....బ్రతికేవున్నా....క్రింద....క్రిందకి చూడ"మనే మాట లాతని చెవి బిళ్ళల్లో వినిపించాయి.

ఒక కొండలోయలో పెట్రోలును దాచిపెట్టిన టాంకులు ఇక్కడా అక్కడా కాలి మంటలు లేస్తున్నాయి. పొగలు గ్రక్కుతున్నాయి. అలెక్సీ యీ కాలిపోయే టాంకులనూ, జర్మనువారి జంకరులను యింతివరకూ చూడలేదు. నేలమీద పేడపురుగులమాదిరి నడుస్తూవచ్చే తమవారి టాంకుల నాతడు వీక్షిస్తున్నాడు. చెరొకప్రక్కనుండీ వరుసగా అడవిలోనుండి యింకా టాంకులు వస్తున్నాయి. శత్రుసైన్యము నిరుప్రక్కలనుండీ అడక త్తెరలో పెట్టి నొక్కినట్టు నొక్కి, అదిమి చితుకకొట్టాలని వస్తున్నాయి. తుపాకులను పేలుస్తూ, ఫిరంగులనుండి గుండ్లను విసురుకొంటూ శత్రువులు నిర్మించిన అడ్డంకులన్నిటినీ పడగొట్టి, చక్రాలక్రింద నలిపి ధ్వంసంచేసి ఈ టాంకులు శత్రుసైన్యాలను సమీపిస్తున్నాయి. దూరంనుండి వీటిపైబడే జర్మను ఫిరంగిగుండ్లవల్ల వాటికి చీమకుట్టినంతయినా నొప్పి కలిగింది కాదు.

శత్రువులకు వెనుకప్రక్కా, కుడి ఎడమల్లోనూ యీ విధంగా టాంకులు వచ్చి చేరుకొనటంలో నుండే రహస్యమంతా అలెక్సీకి తెలుసు.

తాను ప్రత్యక్షంగా నేడు చూస్తూవున్న విషయాలనే మరునాడు వివిధ వార్తా పత్రికలూ ప్రచురించాయి. భూలోకమందలి దేశదేశాల ప్రజలూ యీ విషయాలను

చదివి విస్మయమొందారు. కున్స్కి ప్రాంతంలో వొకచోట రష్యన్లు ఫిరంగులతో రెండుగంటలు పోసపలిపి శత్రుసైన్యములో గండికొట్టారు. వెంటనే రష్యను సైన్యాలు యావచ్ఛక్తి గండిగుండా ప్రవేశించాయి. రష్యను పటాలములు పైచేయి సంపాదించాయి.

కాప్టెన్ చెస్‌లోవ్ విమానదళంలోని తొమ్మిది విమానములలో రెండు తిరిగి రాజాలకపోయాయి. జర్మను జంకర్లు తొమ్మిది కాలి క్రిందపడ్డాయి. రెంటికి తొమ్మిది విమానాలు ! విమానయుద్ధంలో ఇదెంతో చెప్పుకోతగిన గొప్ప విషయం. చాలా మెచ్చుకోదగినవిషయం. కాని తమలో ఇద్దరు మరణించటంవల్ల వారందరికీ కలిగినసంతోషం ఇట్టే చల్లారిపోయింది. విజయవంతంగా తిరిగివచ్చే వైమానికులు సాధారణంగా ఎంతో ఆర్భాటం చేస్తారు. నవ్వులూ, వేళాకోళాలూ, డాంబికాలూ, జరిగిన విషయాలను చెప్పినదానినే తిరిగి చెప్పటమూ, పట్టపగ్గాలు లేకపోవ టమూ అందరూ ఎరిగున్నవే. కాని మిగతా ఏడుగురూ, వంచిన తలలతో విమానమునుండి దిగి, దళాధికారికి జరిగినదంతా జరిగినట్లు నివేదించి, ఒకరి నొకరు పలకరించుకోకుండా ఎవరిదారిని వారు వెళ్ళారు.

ఈ దళానికి అలెక్సీ కొత్తవాడు. ఆ చనిపోయిన మనుష్యులిద్దరూ ఎవరో అతనికి తెలియదు. కాని నలుగురితోపాటు అలెక్సీ కూడా దుఃఖమనుభవించాడు. ఇన్ని దినాలుగా కసరత్తులుచేసీ నడిచీ, పరుగులు తీసీ అన్నివిధాలా దేనికొరకైతే తరిఫీదు నొందాడో, ఆ పని నేడాతడు నిర్వర్తించ గలిగాడు. తిరిగీ వైమానిక దళంలో చేరి, యుద్ధంలో పాల్గొనాలనే తన ఆశయం నెరవేరింది. ఆశతీరింది. ఇదెంతో సుదినం. అలెక్సీ జీవితంలో ఎంతకాలం మీ శుభదినాని కాతడు కనిపెట్టు కొని కూర్చున్నాడో, ఎన్ని రాత్రు ళీవిషయమును గురించి ఆస్పత్రిలో నున్న రోజు లలో కలలుకన్నాడో, పలవరించాడో, నృత్యమునూ, పరిగెత్తటమునూ సాధిస్తూ ఎంతకాలం చెప్పరాని కష్టమనుభవించాడో, ఆ దేవుడికే తెలియాలి ! ఆ శుభదినం మంగళకరమైన ఘడియలు వచ్చాయి. పడిపోయిన జర్మను విమానములలో రెండింటిని తాను పడగొట్టాడు. తనతో చేదోడువాదోడుగా నుండి పెట్రోవె తో సహకరించాడు. ఇది తలుచుకొంటే అతని కెంతో ఆనందంకలిగింది. ఈ విషయా లన్నీ దళాధికారికి సవిస్తరంగా చెప్పి నెమ్మదిగా నడిచివెళ్ళి, ఒంటరిగా నొక బర్చి వృక్షంక్రింద చతికిలబడ్డాడు. పాపం ! ఆ చనిపోయిన రష్యనులిద్దరూ ఎవరోగదా ? ఏ తల్లిబిడ్డలో ? ఏ పసికందుల తండ్రులో ! ఏ నూతన వధూమణి నింట దిగవిడిచి వచ్చారో, చూస్తూ వుండగా తిరిగీ వచ్చేస్తానని చెప్పి, నమ్మించి, వోదార్చి.

కొత్తవాడు అనుభవం తక్కువవాడు, చిన్నవాడు, పెట్రోవొక్కడే విమానాశ్రయమంతా తెగతిరుగున్నాడు. నెత్తిన టోపీనయినా పెట్టుకోకుండా, ఎదురుగాలి కెగిరే క్రాపుతో పరుగిడుతూ, కనబడినవాడినల్లా చేయిపట్టి నిలిపి జరిగిన దానినంతా చెప్పుకుపోతున్నాడు.

"....చాలా దగ్గరగా...చేతికందేటంత దూరంలో కనుపించాడు...సీనియర్ లెఫ్టినెంటొక దెబ్బతీసాడు....నడుము విరిగిపడిపోయింది. నేనుండబట్టలేక పోయాను. గురిచూసి దగ్గరగా నెగిరి టఫీమని..." ఈ ధోరణిలో చెప్పాడు.

తరువాత అలెక్సీ వున్నతావునుచేరి, కాళ్ళు రెండూ చాపి వెల్లకిలా మెత్తని గడ్డిమీద అతని పాదాలచెంత పడుకొన్నాడు. కాని ఏ రెండు నిమిషాలో మాత్ర మీ విధంగా తాపీగా నుండగలిగాడు. వెంటనే లేచి కూర్చుని.

"అద్భుతం! చాలా అద్భుతంగా నీ వీ దినం పోరాడావు... ఎంతగొప్పగా పోరాడావో నీకు తెలియకపోవచ్చు. నా కళ్ళను నేనే నమ్మలేకపోయను....అ రెండో జంకరు నెట్టా పడగొట్టానో నీకు తెలుసా?.. చెప్తాను. ఊ..మ... నీ వెన్నంటే వచ్చాను వాడి విమానం చేయిచాపితే అందేటంత దగ్గరికి వచ్చింది... ఇప్పుడు నీవూ నేనూ వున్నట్టు..."

"ఒక్క నిమిషమాగు, తమ్ముడూ," అంటూ అలెక్సీకి అడ్డుతగిలాడు "ఆ వుత్తరాలు! ఎక్కడ పెట్టానో జ్ఞాపకంలేదు."

ఎగిరి వెళ్ళటానికిముందా వుత్తరాలు వచ్చాయి. చదవటాని కవకాశం లేకపోయింది. ఎక్కడున్నాయి? జేబులో చూసాడు. కనిపించలా! తొడుక్కొన్న తోలుకోటు జేబులో చేతులుపెట్టాడు. అబ్బా! బ్రతికానురా అనుకొన్నాడు. రెండు వుత్తరాలూ దానిలోనున్నాయి. పెట్రోవు చెప్పేమాటలను వినిపించుకోకుండా, ఓల్గా వ్రాసిన జాబు నొక చివర జాగ్రత్తగా చించాడు.

రాకెట్టొకటి పైకిలేచింది. పాముమెలికలు తిరుగుతూ దానిమంట పైకెగసింది. విమానాశ్రయమును మూడు నాలుగు పర్యాయములు చుట్టి ఆరిపోయింది. దాని పామువంటి పొగచాలు నెమ్మదిగా గాలిలొ తేలిపోయి, అదృశ్యమయింది. ఉత్తరాలను చదవటానికి వీలులేకపోయింది. తిరిగీ జేబులోపెట్టాడు. ఆ వుత్తరంలో ఏదో వొకటి చేతికి గట్టిగా తగిలింది. ఎగిరివెడుతూ, అప్పుడప్పుడు జేబును తడవి చూసుకొన్నాడు. ఉత్తర మింకా దానిలోనే వున్నదో, లేక పడిపోయిందోనవే భయంకొద్దీ.

శత్రుసైన్యంలో దారి చేసుకొని రష్యను టాంకులు చొరబడిన ఆరోజునుండి యుద్ధం బహు చకచకా నడవజొచ్చింది. రక్షక విమానదళంలో ఇప్పు డలెక్సీ పనిచేస్తున్నాడు. ఈ దళానికి చేతినిండా పని చేకూరింది. రష్యను విమానాలు తెరలు తెరలుగా లేచి నేలమీద వెళ్ళే తమ టాంకుల నాకాశమార్గాన వెంబడించి వెళ్ళాయి. ఒక దళం విమానాశ్రయంలో దిగటమే ఆలస్యమన్నట్టు వేరొక దళం పైకి లేచి వెళ్ళింది. క్రిందికి దిగిన విమానములకు పెట్రోలు నెక్కించటానికి పెట్రోలుట్రక్కులు విమానాశ్రయమంతటా తెగతిరుగుతున్నాయి నీరు ప్రవహించే నట్టులా పెట్రోలు నిరర్గళంగా విమానపు టింజనులలోనికెక్కింది. వాతపడి వెళ్ళిపోక

ఎండపొడ తగిలి పైకిలేచే సీటిఅవిరిమాదిరి విమానము లన్నిటినీ పెట్రోలు ఆవిరి క్రమ్ముకొన్నది వైమానికులు భోజనాలకయినా క్రిందికి దిగిరాలేదు. అల్యూమినియం కార్టియర్లలో, వాటికితిండి తెచ్చిపెట్టారు. తిండితినాలనే బుద్ధివుంటేగదా తినడానికి వీలవుతుంది ? తెచ్చిన ఆభోజనం గొంతు దిగిందికాదు.

కాప్టెన్ చెస్‌లోవ్ వైమానికదళం క్రిందికి దిగివచ్చింది. అడవిలోకి పరుగిడివెళ్ళి అ విమానాలన్నీ అక్కడ నిలిచాయి. వాటికి పెట్రోలు నెక్కిస్తున్నారు. అలసిపోయి; కాళ్ళు జాపుకొని తన ఇంజను గదిలో కూర్చున్న అలెక్సీ జాగుచేయ వద్దని పెట్రోల్ నెక్కించేవారిని తొందరపెట్టాడు. యుద్ధంలో చొరబడి తనశక్తి సామర్థ్యాలను తనకు తానే పరీక్షించి అవి ఏమాత్రం తుప్పుపట్టాయో తెలుసుకోడాని కాతురపడ్డాడు. జేబు తడివి చూశాడు. ఉత్తరాలందులో సురక్షితంగానే వున్నాయి. కాని చదవడానికి మనస్సు పుట్టిందికాదు.

సాయంత్రం ప్రొద్దుగ్రుంకాకగానీ విమానదళంవారి పని ముగిసిందికాదు. ప్రొద్దస్తమానమూ ఒకటేపని, ఎవరి గమలకు వారిని వెళ్ళమని ఆజ్ఞాపించారు. సాధారణంగా అడ్డదారిని త్వరగా వెళ్ళే అలెక్సీ యీ రోజు అడవిచెంతనున్న గడ్డి మైదానంపైకి కాలు సాగించాడు. ఒంటరిగా రవంతకాలమైనా గడపా లనిపించింది. చెదిరిన ఆలోచనలను క్రమపర్చాలి. అవన్నీ యీ పని చేస్తూ విరామ మెరుగని అవయవాలకు విశ్రాంతి కొంత కావాలని అనుకొని యీ దారిని వెళ్లాడు. ఇది చుట్టు దారి అని అతనికి తెలుసు.

ఇక్కడంతా ఎంతో ప్రశాంతంగా నున్నది. తియ్యనిగాలీ, నిర్మలాకాశమూ, దాని చల్లదనమూ ఎంతో బాగున్నాయి. దూరానమ్రోగే ఫిరంగుల శబ్దం దూరపు టురుములమాదిరీ, దానితో తన కెట్టి సంబంధమూలేనట్టు వినబడింది. పూర్వ మీ పొలాలలో రైధాన్యం పండేది. ఇప్పుడట్టి పంటలు పండి ఎంతకాలమయిందో! సాధారణంగా పొలంలో ఏమూలనో, లేక పూర్తిగా కలుపుతీయని ఏ పొలంగట్టు చెంతనో, అదీకాకపోతే ఏ రాళ్లప్రోవుమీదో, బహుకొద్దిగా పెరిగే పిచ్చి మొక్కలిప్పు డా ప్రదేశమును తమ వశం చేసుకొన్నాయి. నిరర్గళంగా సంతానోత్పత్తి చేసుకొని, నడు మెత్తుకు పెరిగి, కాలూనటానికయినా సందుచిక్కక గిజిబిజిగా నున్నాయి. ఎన్నితరాలవా రెంతకాలం కష్టపడి పనిచేసి యీ భూమిని మచ్చిక చేశారో ఎవరు చెప్పగలడు ? సముద్రంలో కాకిరెట్టమాది రెక్కడో వొకక్కడ పాలిపోయిన రై మొలకలు, చూడటానికి గడ్డిపోచలమాది రగుపించాయి. ఈ పిచ్చిమొక్కల మహాసముద్రంలో భూసారమునంతా యీ మొక్కలు పీల్చిపారేశాయి. సూర్యరశ్మిని కడుపారా గ్రోలాయి. విర్రవీగి పెరిగి రై మొక్కలకు బ్రతుకు తెరువులేకుండా చేశాయి. దౌర్బల్యంగా పుట్టి బలహీనంగా పెరిగి; పెరిగే లోగా క్షీణించి రెండు మూడు వెర్రిపూలను పుష్పించాయి. వాటినుండి కంకులు తయారుకాగలవనే ఆశ లేదు.

ఇదంతా చూస్తే అలెక్సీకి జర్మనులూ, వారి పన్నాగాలూ ఇట్టివంటివేకదా! అని తోచింది. ఆ ఫాసిస్టు రాక్షసులు మన పొలాల్లో వేలూనడానికి చూస్తున్నారు; మన మట్టియందున్న సారమునంతా జుర్రుకోవాలని కనిపెట్టుకున్నారు. మన సిరీ సంపత్తుల నపహరించడానికి ఎత్తులు వేస్తున్నారు; పన్నాగాలు పన్నుతున్నారు: తమంతటివారు లేరని విర్రవీగేవీరు మన వారిని వశపర్చుకొని, నిరంకుశాధికారం చలాయించా లనుకొంటున్నారు. కాయకష్టంపడి ఫల ప్రాప్తి నాశించని మన అమాయక గ్రామీణజనులను వారి పొలాలనుండి తరిమివేయాలనీ, వారికున్న యావదాస్తినీ హరించాలనీ, బలత్కారంగా వారిని తమ పాదాలక్రింద, ఈ పిచ్చి మొక్కలు, రై ధాన్యము నణగద్రొక్కినట్టే, అణగద్రొక్కి, వారి మానవత్వమును పోగొట్టి, ఈరై మొక్కలమాదిరే వికృత రూపుల, విగతజీవుల చేయాలనీ జర్మను లనుకొంటున్నారు. చిన్న పిల్లవాడిమాదిరి, పట్టరానంత వెర్రికోపంతో, తన చేతికర్రనిటూ, అటూ బలంకొద్దీ వూపుతూ, ఆ పిచ్చిమొక్కల తలలను విరుగగొట్టుతూ నడిచివెళ్ళాడు. అలిసిపోయి చెమటలు పోశాయి. కాని ఇంకా సాగిపోయాడు. ఆ మొక్కలు తలలువిరిగి పడిపోయేకొద్దీ తానేదో క్రూరరాక్షసిని హతమారుస్తున్నట్లూ, తన దేశము నాక్రమించుకోడానికి వచ్చిన విరోధి ప్రాణ మును నిలువునా తీస్తున్నట్లూ ఆతనికి తోచింది అనిర్వచనీయమైన ఆనందమాతని హృదయంలో పుట్టింగింది.

జీప్‌కారొకటి అకస్మాత్తుగా బ్రేకువేసి ఆతని వెనుకనున్న రోడ్డుమీద ఆగిన శబ్దం. తమ దళాధికారి తానింకా ఇంటికిరాలేదని కనిపెట్టి వెతుకుతూవచ్చాడని అలెక్సీ గ్రహించాడు. తా నీమాదిరి, చిన్నపిల్లవాడిలాగ వర్తిస్తూన్నందుకు సిగ్గు పడి తా నాకారు రావటం చూడనివాడిమాదిర, చేతికర్రతో నేలను త్రవ్వడానికి మొదలుపెటాడు. కర్నల్, జీప్‌నుండి దిగుతూ.

"వాటిని నరికేస్తున్నావా? మంచిపని...ఇట్లాచూడు; నీ కొరకని ఎక్క డెక్కడో వెతికాను. అందరూ, మన వైమానిక యోధుడెక్కడనీ అడుగు తున్నారు ..ఇక్కడున్నాడు, పిచ్చి మొక్కల తెగటారుస్తూ" అన్నాడు.

ఈ కర్నల్‌కు మోటారులో వెళ్ళటమంటే మాంచి సరదా. పనంతా దీరాక ఏదో వొక కారెక్కి ఎక్కడికో వొకక్కడికి వెడతాడు. తన దళంవారి నందరినీ వెంటబెట్టుకొని విమానాల్లోవెళ్ళి వారిచేత రకరకాల పనులను ఆకాశమార్గాన చేయించి, క్రిందికి దిగివచ్చాక సాయంకాలం తీరుబడివున్నప్పుడల్లా విమాన మరమ్మతు వారితో కలిసి ఇంజనుల నిప్పటమూ, తుడవటమూ, నూనె పోయటమూ, తిరిగి బిగించడమూ వంటి పనులుచేస్తూ కాలం గడుపుతాడు. సాధారణంగా పిలిరంగు దుస్తులను, వారు ధరించేటట్టివే తొడుగుకొంటాడు. నెత్తినున్న వైమానికటోపీకి తోడు ఆతని ముఖంలో తాండవించే సహజగాంభీర్యంవల్ల నతుగురిమాదిరివాడుకాడని చూసేవాళ్ళకు తెలియకమానదు.

ఏమనాలో తెలియక చేతికర్రతో మట్టిని పెకలిస్తూ అలెక్సీ నిలబడ్డాడు. తన రెండు చేతులనూ అతని భుజాలమీదపెట్టి ఎదురుగా నిలబడి కర్నల్——

"ఏదీ, నన్ను బాగా చూడనీ! బాగున్నది! చాలా బాగున్నది!! విచిత్రమేదీ కనిపించటంలా! మునుపు నేను పొరబడ్డాను. నీవు కొత్తగా వచ్చినప్పుడు వొక్కమాటయినా నేను నమ్మలేదు. విమాన కేంద్రాలయమువా రేమిటేమిటో చెప్పారులే నిన్నుగురించి. యుద్ధంలోచేరి బ్రతికి బయటపడతావని నిజం చెప్పవద్దూ, నేనిసుమంతయినా అనుకోలేదు. నీవో – అంతపనీ చేశావు! అంతకంటే గొప్పగానే వర్తించావు. ఎక్కడినుండివచ్చింది నీ కీ సాహసం?....ఇదీ నా ప్రశ్న.... ఇదంతా ఆ తల్లి రష్యా పెట్టిన భిక్షం!....అభివందనాలు. మా అందరితరపునా. వ్యక్తిగతంగా నీ వంటే నా కెంతో పూజనీయభావం ...ఊఁ?.. .నేను మోల్ప టౌనుకు వెడుతున్నాను. రా, ఎక్కు" అన్నాడు.

ఆ జీపుకారు వాయువేగంతో రోడ్డుమీద పరుగిడింది. మలుపు తిరిగేటప్పుడు అలెక్సీకి అదెక్కడ పల్టీకొట్టుతుందో అనిపించింది. దారీతెన్నూ లేని ఆ ప్రదేశంలో చెట్లావరించి ముందేదివస్తోందో తెలియనీయని బాటమీద వెడుతూ, బహు చమత్కారంగా జీపును నడిపిస్తూ యేదో మాటలసందున అలెక్సీతో ఇదిగో, ఇట్లా చూడు. బహుశా నీకేదన్నా కావలసివుంటుం దనుకొంటాను. ఒకవేళ ఏవన్నా చిక్కుల్లో పడ్డావేమో అని నా కనుమానం. ఎటువంటి ఇబ్బంది అయినా సరే, నేను చేయదగిన దేదన్నావుంటే చెప్పు. మేమందరమూ నీకు ఋణగ్రస్తులం. చెప్పి చేయించుకోగల అర్హతను సంపాదించుకొన్నా వ"న్నాడు.

"కర్నల్ సోదరా! నాకేదీ అక్కరలేదు. నేనూ నలుగురివంటివాడినే. నాకు పాదాలు లేవనే సంగతిని మరిచిపోతే చాలు, అదే పదివేలు" అన్నాడు.

"అవునవును, నీవన్నది నూటికి నూరుపాళ్లూ నిజమైన విషయం. ఏదీ? నీ యిల్లెక్కడున్నది? ఇదేనా?" అని కర్నలు అలెక్సీ దిగడానికి కారును నిలబెట్టాడు. అతడు దిగాడో లేదో వెంటనే రయ్యిమంటూ బర్చి, ఓక్ వృక్షాలు పెరిగిన ఆ అడవిలో కనుపించకుండా వెళ్ళిపోయింది.

అలెక్సీ తన గదిలోకి దిగి వెళ్ళే బదులు, మెత్తగా రాలిన పైన్ ఆకులమీద పడుకొని జేబునుండి ఓల్గా వ్రాసిన జాబును తీశాడు. దానినుండి చిన్నఫొటో వొకటి క్రిందరాలింది తడబడే చేతులతో దానిని పైకెత్తాడు.

తెలిసిన ముఖమే, కాని గుర్తుపట్టడం కష్టమన్నట్టు అంతగొప్పగా మారిపోయింది. సైనికదుస్తుల్లోనున్న ఓల్గా, కోటు, కత్తి దోపిన తోలుపటకా, ఎర్రపతాకచిహ్నామూ, రక్షక సైనిక చిహ్నమూ – అన్నీ తీరుదిద్దినట్టు ముద్దొస్తూవున్నాయి! ఎవరో వొక యౌవ్వన సైనికుడిమాదిరున్నదే కాని ఆడపిల్ల అని తెలుసుకోడాని కెట్టి ఆస్కారం కనుపించిండలేదు. ముఖంలో బడలికా, కండ్లల్లో

దేనికొరకో ఎదురుచూస్తున్నట్లూ ఏదో వొక ఆవేదనకు పాలుపడుతూన్నట్లే చూపు అలెక్సీ కగుపించాయి.

రెప్పవాల్చకుండా ఆమె కళ్ళల్లోకి చూశాడు. సాయంసమయంలో, ఒంటరిగా నెక్కడో వున్నప్పుడు, దూరాన వినబడే పాట, నీకెంతో రుచించే పాట హీన స్వరంతో వినబడి నీలో తీయని తలంపుల పుట్టించినట్లు, అలెక్సీకా ఫొటోనుచూస్తే మనస్సు పరిపరివిధాల పోయింది. పూర్వం పూలగౌను తొడుగుకొని డెయిజీపూవు లనుకోస్తూ ఓల్గా తీయించుకొన్న ఫొటోను తన జేబులోనుండితీసి చూశాడు. ఎందు కనో, తా నెఱిగిన చిన్నతనపుటోల్గాకంటే, ఈ కొత్త ఓల్గా ఇంతవరకూ తాను చూడని సైనికోద్యోగి, ఈ ఓల్గా అతనికి బాగానచ్చింది. ఈ ఫొటోకువెనుక ప్రక్క "మరిచిపోవద్దన్న" మాట లున్నాయి.

అదేమంత పెద్ద ఉత్తరంకాదు. కాని చదవముచ్చట కలిగిందాతనికి. తా నిప్పుడు వొక పారిశ్రామిక దళాని కధికారిగా నున్నదట. యుద్ధానికిచెందిన పను లను చేసేబదులు, శిధిలమైన స్టాలిన్‌గ్రాడ్ నగరమును బాగుచేయడానికీ, దాని పునరుద్ధరణకు పాటుబడుతున్నారు వారందరూ. ఆ వుత్తరంలో తా నెట్లున్నదీ వ్రాసేబదులు, స్టాలిన్‌గ్రాడ్‌నుగురించి వార్తలతో దానిని నింపివేసింది. పడి పోయిన కట్టడాలను తిరిగీ నిర్మిస్తున్నారు. దేశపు పలుభాగాలనుండి యువకులూ, స్త్రీలూ, బాలికలూ ఎందరోవచ్చి ఈ పనిలోచేరారు. వారందరికీ వుండటానికిండ్లు లేకపోయినప్పటికీ వా రెంతమాత్రంకూడా కంటపడటంలేదు. ఇండ్ల అటకగదు లలోనూ, నేలను త్రవ్విన సైనిక కాలువలలోనూ, బాంబుల ప్రమాదంనుండి కాపాడుకోడానికి త్రవ్విన గోతులలోనూ రైలుబండ్లూ, తాత్కాలికంగా నిర్మించిన కొయ్యచెక్కల గదులలోనూ సర్దుకొంటున్నారు.కష్టపడి పనిచేసినవా రందరికీ నూతన స్టాలిన్‌గ్రాడ్ నగరంలో నివసించడానికి ఇండ్లనిస్తారని పలుగురూ చెప్పు కొంటున్నారు. ఇదేగనుక నిజమైతే యుద్ధానంతరం తా నుండటానికొక యిల్లు సిద్ధంగానుంటుందనీ, ఈ సంగతిని మరచిపోవద్దనీ వ్రాసింది.

చూస్తూవుండగా సూర్యు డస్తమించాడు; చీకటిపడింది. తన టార్చిదీప కాంతిలో ఆఖరి వాక్యాలు చదివాడు. దాని వెలుతు రా ఫొటోగ్రాపుమీద పడింది. అందున్న సైనిక యువకుడు తనకేసి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. "పాపం, నీవుకూడా కష్టాలనుభవిస్తున్నావు!.....ఈ యుద్ధంరావటంవల్ల నీవంటివారికి కూడా ఎన్నో కష్టాలు కలుగుతున్నాయి. కాని ఇవన్నీ నీవు తట్టుకోగలిగావు నాకొరకు వేచియున్నావా? ఉండు. రవంతకాలం వోపికపట్టు. నేను తప్పకుండా వస్తాను. నీవు నన్నెంతగా ప్రేమిస్తున్నావో నాకు బాగా తెలుసు. ఈ ధైర్యమేగనుక లేక పోతే నే నెన్నడో పడిపోయేవాడిని" యీవిధంగాచెప్పా డా ఫొటోలోని మనిషికి. స్టాలిన్‌గ్రాడ్ రక్షణదళంలో పనిచేస్తూవున్న తన ఓల్గాకు, గడచిన ఒకటిన్నర సంవత్సరకాలమూ నిజంచెప్పనందుకూ, తనయథార్థస్థితి నామెనుండి మరుగుపరచి

నందుకూ అలెక్సీకెంతో సిగ్గుకలిగింది. వెంటనే దిగివెళ్లి, తన గదిలో కూర్చుని జరిగిన సంగతు లన్నిటినీ మర్మంలేకుండా తెలుపుతూ ఆమెకొక జాబు వ్రాయాలని అనుకొన్నాడు. అన్నీ విన్నాక, ఆమె యేవిధంగా నిశ్చయించినాసరే దానితో తాను సంపూర్ణంగా ఏకీభవిస్తాడు, ఆలస్య మమృతం విషమంటారు. వెంటనే వ్రాయటం మంచిది, ఉన్నదున్నట్టుగా తెలియటం ఆమెకూ మంచిది; తనకూ మంచిది.

ఆ దినం తాను యుద్ధంలో తిరిగీ పాల్గొనటంవల్ల, ఓల్గాకు వృత్తరంవ్రాసే అర్హతతని కిప్పుడు కలిగిందని అనుకున్నాడు. తన ఆశలన్నీ నెరవేరకపోయినా; లేక, నలుగురిమాదిరే తానుకూడా ఏదోవొక విమానంలో ఎగిరివెళ్లినాకూడా ఆమెకు వ్రాయడాని కతనికి ధైర్యం చాలకపోయెడిది. కాని ఇప్పటి సంగతికాదు. తన శక్తి సామర్థ్యాలను నలుగురూ చూశారు, గుర్తించారు. తాను పడగొట్టిన రెండు జంకరు విమానాలూ క్రిందనున్న పొదలో కాలిపోవటం నలుగురూ చూశారు. వారి దళాధికారి ఈ విషయమును ఆనాటి యుద్ధసమాచారముల పుస్తకంలో వ్రాసిపెట్టాడు. ఈ యుదంతం సైనిక కేంద్రకార్యాలయానికీ, మాస్కో నగరానికీ అప్పుడే టెలిఫోను చేయబడింది. లిఖితరూపంగా కూడా ఈ విషయ మప్పటివారికి పంపించబడింది. ఇందులో అబద్ధమేదీలేదు.

తీరా వ్రాయడానికి కూర్చుంటే, చేయి కదిలిందికాదు. తన మనోభీష్టం తీరిందన్నమాట నిజమేకాని, రష్యను యుద్ధవిమానం తన చేతిలోనున్న మనిషి పడగొట్ట గలిగిందల్లా కేవలమొక జంకరే అయితే అందులో ఏమంత ఘనత వున్నది? గొప్పవేటకాడనని చెప్పుకొనేమనిషి, తన శక్తిసామర్థ్యాలను రుజువు చేయడానికి ఏ కుందేలు పిల్లనో కాల్చి తెచ్చినట్లున్నది తన ప్రతాపం.

అడవిలో కన్ను చీల్చుకొన్నా కానరాని చీకటి. యుద్ధం నడిచి దక్షిణ ముఖంగా వెళ్ళింది ఎక్కడో జరిగే యుద్ధపుమంటలకాంతి ఇంతదూరం రాలేక పోయింది. దాని శబ్దా లింతదూరం వినిపించలేకపోయాయి. అరణ్యవాతావరణానికి సహజమైన చల్లదనమూ, తీయని వాసనలూ, తన ప్రియురాలి నాకర్షించడానికి తన కాళ్ళ పిడేలును వాయించే మొగమిడతల పాటలూ, చేరువనున్న నీటిగుంతలో తెరిపిలేకుండా అరిచే కప్పల బెకబెకలూ, వాటికై నిలబడి వొంటికాలి జపంచేసే కొంగల కూతా, చక్రవాకుల మృదుమధుర గానమూ: అన్నీ ప్రత్యక్షమయ్యాయి.

మంచుకు తడిసిన ఆ చల్లని గడ్డిలో అలెక్సీఇంకా అదేవిధంగా కూర్చున్నాడు. పిండారబోసినట్టి వెన్నెలా, చంద్రుని కడ్డంగా పరుగిడే మేఘాల నీడలూ అతనిమీద పడుతున్నాయి. తిరిగీ ఫొటోను బయటికి తీసి తన మోకాళ్ళమీద పెట్టుకొని తదేకదృష్టితో చూశాడు. శరీరం మాత్ర మక్కడున్నదికాని. మనస్సు స్టాలిన్‌గ్రాడ్ నగరంలో వెతుకు

తోంది. ఆకాశంలో దక్షిణముఖంగా ఎగిరివెళ్ళే విమానాల పీడలా గడ్డిమీద పరుగులెత్తాయి. వాటినుండి వెలువడిన శబ్దం చకోరపక్షుల గానంతో మిశ్రితమై పీనుల కింపుగా వినిపించింది. పెద్దగా నిట్టూర్చి, ఫొటోను తన కోటుజేబులో దాచేశాడు. లేచి నిలబడి తన్నావహించిన వెన్నెలమత్తు చెదిరిపోడానికాఅన్నట్టు ఒళ్ళంతా విరుచుకొని విదలించాడు. గదిలోకి దిగుతోంటే ఎండిన చితుకులు కొన్ని పాదాలక్రింద నలిగి పుటుక్కున విరిగాయి. తన మిత్రుడు పెట్రోవ్ వెల్లికిలా పడుకొని గాఢనిద్రాపరవశుడై గురకపట్టుతున్నాడు.

# 5

రష్యను టాంకులు చొరబడినచోటికి జర్మను లొక పెద్ద విమానదళమును పంపించారన్న సంగతి రెండురోజుల క్రితం మన యుద్ధ ప్రధానశాఖవారికి తెలిసింది. వెంటనే తెల్లవారకముందే వైమానికులను నిద్రలేపారు. కుర్స్క ప్రాంతంలో రష్యను టాంకులు తమ సైన్యంలో సందుచేసుకొని చొరబడటంవల్ల చాలా గొప్ప ప్రమాదం సంభవింపవచ్చునని జర్మనులు తెలుసుకొని వారి పటాలంలోనున్న ప్రఖ్యాత వైమానికవీరుల చేర్చి 'రిక్తోఫెన్' విమానదళమును సంసిద్ధపరిచారు. ఈ వైమానికదళం స్టాలిన్‌గ్రాడ్ యుద్ధంలో గొప్ప దెబ్బతిన్నది. కాని మిగిలిన వారినందరినీ చేర్చి జర్మనీలో నొక రహస్యప్రదేశంలో శరిఫీదునిచ్చి మరొక రిక్తోఫెన్ దళమును లేవనెత్తారు. తమ శత్రు వన్నివిధాలా పెద్ద యుద్ధానికి సంసిద్ధపడి వున్నాడనీ, చాలా బలం చేకూర్చుకోడానికితోడు సరికొత్తరకం విమానాలను - ఫాక్‌వుల్ఫ్ - 190 - తయారుచేసుకొని, గొప్పవైమానిక యోధులకు వానిని వప్పగించాడనీ ముందుగానే హెచ్చరించారు. మెళకువగా నుండమన్నారు. గత రాత్రి లోనికి చొరబడిన రష్యను టాంకులకు తగిన రక్షణమూ, చేయూతమూ పైనుండి యీయమని చెప్పారు తమ వైమానికులకు.

రిక్తోఫెన్ ! ఇది జగద్విఖ్యాతిగాంచిన జర్మను వైమానికదళం. "హెర్మన్ గొరింగ్ యొక్క గారాబుబిడ్డ" అని దీనికిపేరు. తమ సైన్యాలు మరీ కష్టాల పాలయినప్పుడల్లా ఈ రిక్తోఫెన్ దళమును పంపించటం జర్మనులకలవాటు. ఈ దళంలో, పూర్వం స్పెయిన్ దేశంపైకి దండెత్తివెళ్లిన యోధు లనేకులున్నారు. వారి నెదిరించడం పాముతో చెలగాటంవంటి దంటారు.

భోజనాలగదిలో వైమానికులందరూ ఆదరాబాదరా భుజిస్తున్నారు. కిటికీ నుండి వెలుపలతోటలోనికి గదిలోనున్న పెట్రోవ్ చూశాడు. పూవులనుకోస్తున్న

రాయా కనుపించింది. ప్రేలినబాంబు డొక్కులను నిగనిగారుద్ది, వాటిలో నీళునింపి పూవులనమర్చడాని కేర్పాటు చేశారు. పెట్రో వివిధంగా మాట్లాడుతూ తిండి తింటున్నాడు. మన మీదికేవో, రిక్టోపెనులట, పంపించారంటున్నారు. పంపించనీ ఇక్కడ వాటికి భయపడేవా డెవడూలేడు. రానీ 'రిక్టోపెనులట!' ప్రత్తిపీసుగలుగా పొనర్చి పంపించి వేస్తాము!

కాఫీని త్రాగుతూ తన ప్రక్కనున్న అలెక్సీని పురిగొల్పడాని కీ విధంగా పెట్రోవ్ పలికాడనుకోవద్దు పూవులను కోస్తూ, అప్పుడప్పుడు తనమీదికి తూపుల వంటి చూపులను విసిరే రాయాకు వినబడాలని అన్నాడు. పెట్రోవునూ తోటలోనుండి అతన్ని చూసే రాయానూ, తిలకించి అలెక్సీ తనలో తాను నవ్వుకొన్నాడు. ఇటు వంటి సమయంలో హాస్యాలాడటమూ, చిలిపితనంగా మాట్లాడటమూ అలెక్సీకి గిట్టిందికాదు.

“ఆ మాటను సరిగ్గా నుచ్చరించటం నేర్చుకో. 'రిక్టోపెన్' రిక్టోపెనులు కాదు. ఆ మాట కర్థమేమిటనుకొన్నావు? ఓరి వైమానికుడా క్రిందనున్న గద్దె ముబ్బులోపడి కాలిపోకుండా వుండాలంటే, కండ్లు తెరచుకొని సంచరించు. నీ దళంవారినుండి విడివడిపోకు. ఇది ఆ మాట తెలిపే విషయం. ఇదంతా నేను ఎగతాళికంటున్నాననుకోవద్దు. అబ్బాయీ! రిక్టోపెన్‌లు క్రూరమైన అడవిమృగాల వంటివి. నీకు తెలిసేలోపలే అవి నిన్ను కొరికి నెత్తురును త్రాగేస్తాయి” అన్నాడు అలెక్సీ.

ఇంకా ప్రొద్దుపొడవకముందే కాప్టెన్ చెసలోవ్ యాజమాన్యం క్రింద కొన్ని రష్యను విమానము లెగిరివెళ్ళాయి. అవింకా ఆకాశంలోనే వున్నాయి. మరొక పంద్రెండు విమానాలు పైకెగరటానికి వచ్చి క్రింద సిద్ధంగా నిలబడ్డాయి. కమాండర్ చెసలోవ్ తరువాత అంతటి గొప్పవాడులేడనీ, సోవియట్ రాష్ట్రి వైమానికయోధుడనీ పేరుపొందిన మేజర్ ఫెటోటవ్‌ను వీటికి పెద్దగా నియమించారు. విమానాలు సిద్ధంగా నిలబడ్డాయి వైమానికు లింజను గదులలో. ఎప్పుడు చెబితే అప్పుడే ఎగిరి వెళ్ళటానికి తయారుగా నున్నారు. వినబడీ వినిపించనట్లు శబ్దం చేస్తూ పనిచేసేవాటి ఇంజనులనుండి బలమైన గాలి వీస్తోంది పెద్ద తుఫానుకు ముందు అడవిలోని చెట్లనూ, కొమ్మలనూ వూపి విరిచిపారేసేగాలిమాదిరీ గాలి అచ్చటి చెట్లన్నిటిన పట్టి వూపి పెద్ద ఆర్భాటం చేస్తోంది.

తన విమానములో కూర్చొన్న అలెక్సీ పైకెగిరి వెళ్ళిన తమ విమానములను చూశాడు. అవి బహు వేగంగా క్రిందికి దిగిజారిపోతున్నాయనీ, నేలకు పడిపో తున్నాయనీ అతనికి తోచింది. క్రిందికిదిగే ఆ విమానములను ఒక్కటొకటిగా లెక్కపెట్టాడు. రెండు విమానాలు మాత్రం ఎంతకూ దిగివచ్చాయికావు. అలెక్సీ గుండె దడదడా కొట్టుకొన్నది. అవికూడా కొంతసేపటికి దిగివచ్చాయి. వెళ్ళిన

పన్నీ సురక్షితంగా యింటికి తిరిగి వచ్చాయి. "హమ్మయ్యా" అని పెద్దగా నిట్టూర్చాడు.

దిగివచ్చి నవి అడవిప్రాంతానికి సాగిపోజొచ్చాయి. ఫెడోటవ్ విమానం ఒకటో నెంబరుది. అకస్మాత్తుగా పైకి లేచింది. తరువాత వెంట వెంటనే రెండు రెండుగా తతిమ్మా విమానాలు ఎగిరివెళ్లాయి. అవన్నీ అడవికి వెనుక ఆకాశంలో బారులుతీరి నిలబడ్డాక ఫెటోటవ్ తన్ననుసరించి రమ్మని సంజ్ఞచేసి బయలు దేరాడు. రెండురోజుల క్రితం రష్యను టాంకులు జర్మను సైన్యములో జొరబడిన మార్గము ననుసరించి ఎగురుతూ వెళ్లాయి. క్రిందనున్న భూమి అలెక్సీకి చాలా స్పష్టంగా కనిపించింది. చకచకా అది క్రిందికి జారిపోతోంది. రెండురోజుల క్రితం తానెంతో ఎత్తుగా ఎగరటంవల్ల యుద్ధభూమి యావత్తూ ఏదో చిన్నబిడ్డ లాడుకొనే బొమ్మలాటమాదిరి తోచింది. కాని, నే డట్టిభావ మాతనికి కలగలేదు. యుద్ధభూమిలోనుండే ఘోరదృశ్యాలన్నీ స్పష్టంగా కనుపించాయి. పొలాలూ, తోటలూ, వనాలూ చిందరవందరగా పరుగులెత్తాయి. స్ఫోటకం మచ్చలమాదిరి బాంబులు త్రవ్విన గుంతలూ, మెచ్చటచూచినా నిగడీసుకుపోయిన శవాలూ, వదిలేసిన ఫిరంగులూ, కొన్ని తావులలో విరిగిపడిన టాంకులూ, చెల్లాచెదరై వంకరలు తిరిగి పడివున్న ఇనుప పట్టాలూ, రేకులూ, సంపూర్తిగా నేలమట్టమైపోయిన చిన్న అడవి వాకటి; ఇవన్నీ సినీమాచిత్రంమాదిరి క్రింద పరుగులిడాయి. ఈ చిత్రానికి 'సమాప్తి' అనేదే లేదు కాబోలు!

వీటి నన్నిటినీ చూడగా ఇక్కడెంతో గొప్పయుద్ధం జరిగినదని స్పష్ట మయింది. శత్రుసైన్యం చాలా నష్టపడి వుంటుంది. రష్యను లిచ్చట సాటిలేని విజయము నొందారని కూడా అలెక్సీ గ్రహించాడు.

ఆ దారిని దక్షిణభాగాలకు సాగివెళ్లిన టాంకుచక్రాలు త్రవ్విన బాటలు అలెక్సీకి స్పష్టంగా కనిపించాయి. లెక్కకు మించినన్ని బాటలు దేశమంతటా వ్యాపించి ముందున్న జర్మను సైన్యమును తరుముకొంటూ వెంటబడిన టాంకు పదచిహ్నాలు, ఎక్కడ చూచినా అవే కనుపించాయి, ఎక్కడో దూరంలో వెడు తూన్న ఈ టాంకుల ననుసరించి, ఫిరంగులున్న మోటారులూ, పెట్రోలును తీసుకువెళ్ళే బ్రహ్మాండమైన ట్రక్కులూ, ట్రాక్టరు యంత్రాలకు బిగించి తీసుకు పోబడే మరమ్మతు కర్మాగారాలూ, లోపలేమున్నదీ కనపించకుండా మూయ బడిన రాక్షసులవంటి మోటారు ట్రక్కులూ సాగివెడుతున్నాయి, విమానాలు బాగా పైకెగిరాయి. పైన నుడిచినవన్నీ ఆ యెత్తునుండి చూస్తే, చిగురింతకాలం అడవిబాటల పొడుగునా ప్రాకే చీమలబారు మారుమాదిరి కనుపించాయి.

పైకిలేచే దుమ్ము మేఘాలలోకి చొరబడిన విమానాలు తిన్నగా వీటిపై నెగురుతూ వీటినిదాటి ముందుకు వెళ్లాయి. ఈ టాంకుదళమును యావత్తూ

ముందుకు నడిపించుకొంటూ వెళ్లే వైమానికాధికారులు జీపుకారులలో సూర్యుని వెదు తున్నారు. ఇంతవరకూ జర్మను విమాన మొక్కటయినా మనవారి కంటబడలేదు, దూరాన పైకి గుప్పుగుప్పున లేచే పొగలగుపించాయి. అప్పుడే యుద్ధం జరుగుతోంది. మొదటగా నొకటీ, తరువాత రెండూ, మూడూ అనేకం నల్లని చుక్కలు దూరపు టాకాశంలో అలెక్సీ కగుపించాయి. జర్మనులు ; వారుకూడా భూమికానిపెట్టుకొని ఎగురుతున్నారు. దూరాన పొలాల్లోబడివచ్చే మన టాంకుల మీద గురిపెట్టి కాల్చడానికి చూస్తున్నారు. అలెక్సీ వెనుతిరిగి చూశాడు. తన్నంటి పెట్టుకొని పెట్రోవెగిరి వస్తున్నాడు.

అలెక్సీ చెవులు నిగిడించివిన్నాడు. దూరంనుండి ఈ మాటలు వినవచ్చాయి.

"నేను – సముద్రడేగ, రెండు – ఫెడొటావ్ సముద్రడేగ – రెండు ఫెడొటావ్ – తయార్ – నన్ననుసరించు."

వైమానికుల నరాలన్నీ బహు చైతన్యపూరితంగానూ, మెళకువగానూ వుంటాయి, ఇటువంటి సమయంలో. కాబట్టి తమ అధికారి చెప్పదలచుకొన్నది, చెవులలో సగం వినబడేలోగా, వైమానికులద్దానిని పూర్తిగా గ్రహించగలుగుతారు. ఒకటే శబ్దమూ, సందడీ, ఫెడొటావ్ ఆజ్ఞాపించేలోగా విమానాలన్ని జంటలుగా నేర్పడి, ఒకదానికొకటి అంటకరచుకొని ఎగురుతూ, జర్మను విమానాలను అడ్డగించడానికి బయలుదేరాయి. చూపూ, వినికిడీ ఆలోచనాశక్తి ఇవన్నీ తీవ్రాతితీవ్రంగానూ, చురుకుగానూ పనిచేస్తున్నాయని తోచింది అలెక్సీకి. ఎదుటనున్న జర్మను విమానాలు నిమిషనిమిషానికే పెద్దవిగా కనుపిస్తున్నాయి. అవి తమ దగ్గిరికి వచ్చేస్తున్నాయి. చెవిబిళ్ళలలో ఫెడొటావ్ ఆజ్ఞకు బదులు, రికరకాల శబ్దాలూ, హోరుమనే ధ్వనీ వినిపించాయి. తా నెదురుచూసిన ఫెడొటావ్‌కు కంఠానికి బదులు ఏవో పరాయివాడి కంఠం చెవులలో మ్రోగింది. జర్మను భాషాపదాలవి ;

"అక్‌తుంగ్ ; అక్‌తుంగ్ ;; లా – ఫ్యూన్ఫ్ అక్‌తుంగ్ ;;

నేలపైనున్న జర్మను వేగులవారు తమ విమానాలకు "ప్రమాదం, జాగ్రత్త" అని హెచ్చరిస్తున్నారు.

గతరాత్రి రేడియో వార్తలను పంపటానికీ, వినటానికీ కావలసిన యంత్రాలను వీరికిచ్చి యుద్ధం జరుగనున్న ప్రదేశమం దచ్చటచ్చట తమ వేగులవారిని జర్మనులు ఆకాశ గొడుగులనుండి (పారషూట్ గొడుగులు) క్రిందికి దింపారు. దూరదర్శినియంత్రాల నుపయోగించి తమ కగుపించిన విషయాల నన్నిటినీ ఎప్పటి కప్పుడే మనుష్యులు తమవారికి రేడియో వార్తలను పంపుతున్నారు.

తరువాత మరొక కంఠం. కోపంగా, బిగదీసుకుపోయిన జర్మను కంఠం అరుస్తోంది :

"నెర్ వెట్టర్ ; లింక్సు ; ఖా–ఫ్యూన్ఫ్–లింక్సు–ఖా–ఫ్యూన్ఫ్ ;"

చీకాకూ, కోపాలు మాత్రమేకాక ఆ మాటలలో భయమూ, గాబరాకూడా అలెక్సీకి గోచరించాయి.

ఏయ్, రిక్టోఫెన్! నీకంటే "మా లవోచ్కిన్‌లు వేయి మడుంగులు మేలైనవని నీకు తెలుసు. అందుకే నీకే భయమంతా" అని తనలో తానను కొన్నాడు అలెక్సీ. తన దగ్గరికి వస్తూవున్న జర్మను విమానమును చూస్తూంటే అలెక్సీ శరీరంలోని రక్తం వుడికిపోయి. రక్తనాడులగుండా పరువులెత్తింది. కండరాలన్నీ వజ్రపు తునకలమాదిరి బిగువెక్కి గట్టిపడ్డాయి; నరాలు ఉక్కుతీగల మాదిరి మారాయి. శరీరం గగుర్పాటు చెందింది. నెత్తిపైనున్న జుత్తు నిక్క పొడుచు కొన్నది.

ఆ జర్మను విమానమును పరీక్షగా చూశాడు. అవన్నీ యుద్ధవిమానాలు; ఎగిరివెళ్ళి శత్రువుమీది కురికే రకం. అన్నీ బలమైన ఫోక్-వుల్ఫ్-190 విమానాలు. బలానికీ, చురుకుతనానికీ వాటికి పెట్టిందిపేరు.

ఫెడొటావ్ విమానాలకు రెండు రెట్లెక్కువగా నున్నాయి ఆ జర్మను విమానాలు. మనవారి ఒక్కొక్క విమానానికీ, జర్మనులవి రెండేసి వున్నాయి. అవన్నీ జంటలు జంటలుగా ఎగిరివస్తున్నాయి. అన్నీ అన్నినిచ్చెనమెట్లమాదిరగుపించాయి ఆకాశంలో. ఈవిధంగా ఎగిరిరావటం రిక్టోఫెన్ విమానముల ప్రత్యేక సాంప్రదాయం. మనవారందరూ, జర్మను విమానములకంటే ఎత్తుగా ఎగురుతూ వుండబట్టి. ఫెడొటావ్ తన విమానదళంతో ఒక్కపెట్టున వాటిమీదికి దిగాడు. తానే విమానమును పడగొట్టాలో, అలెక్సీ అప్పుడే నిశ్చయం చేసుకొని దాని నొకకంట కనిపెడుతూ, తన మిత్రులందరితో నేకీభవించి వెడుతున్నాడు. కాని ఫెడొటావ్ విమానాలు వాటిని తాకేలోగా ఎచ్చటినుండో అకస్మాత్తుగా పైకెగిరి వచ్చిన "యాక్" విమానములు జర్మను విమానములపై బడ్డాయి. అవన్నీ చిందర వందరగా చెల్లాచెదరయి ఆకాశమంతా అగమ్యగోచరంగా కనుపించింది. రెండేసీ, నాలుగేసీ విమానాలొక గుంపుగా అవన్నీ చీలిపోయి, ఒకదానివొకటి ఎదుర్కొని పోరు నారంభించాయి. జర్మను విమానములు మనవాటిని వెనుకనుండీ, ప్రక్కల నుండీ తాకి పడగొట్టాలనీ, తమ తూటాలను ప్రేల్చి కాల్చివేయాలనీ యత్నించాయి. సినీమా చిత్రంలో మధ్యనున్న బల్లచుట్టూ ఒకరి నొకరు పట్టుకోటానికి పరుగులిడే ప్రేమికులమాదిరవి వొకదానినొకటి తరుముకొన్నాయి. కాని ఇచ్చట నున్నది ప్రేమకాదు, పగ. క్రిందినుండి చూసేవారి కిదంతా విచిత్రంగా కనబడింది. ఆకాశంలో చుట్టుతూవున రంగులరాట్నానికి కట్టిన గుర్రాలూ కుర్చీలమాదిరి విమానాలగుపించాయి.

తన చెవులలో వినబడే రకరకాల శబ్దాలూ, గందరగోళమునుండీ వైమానికుడు అసలు సందేశమేమిటో సులభంగా గ్రహించగలడు. ఇదేమాదిరి పెద్ద

గలభాగానున్న ఈ వినువీధి దృశ్యపు టంతరార్థం అనుభవజ్ఞులైన వైమానికులకు బహుసులభంగా తెలియగలదు, పోరాడేవారి చెవులకు వినబడనివార్తలేనేలేవు ఆ యుద్ధసమయంలో, మీదపడేవారు బండబూతులు తిట్టుతూ ముందుకు లంఘించారు. దెబ్బతిన్నవాడి అంగలార్పు; గెలిచినవాడి వెర్రికేకా, వెటకారపు నవ్వూ. దెబ్బలుతగిలినవారి మూలుగులు, విమానమ్ము నొక్కిపెట్టుప చటాలున ప్రక్కకు త్రిప్పేటపుడు వైమానికుడు పండ్లుకొరికిన పటపటలు: నిమిషనిమిషానికీ హీనమైపోతూ గురకతోకూడి వినబడే ఉచ్ఛ్వాస నిశ్వాసలు. ఎవరిపోకాని యుద్ధపు నిషాతో కైపెక్కి పరాయిభాషలో ఎవడో పాడేపాటా; ఊపిరి సలుపక కొస వూపిరితో హృదయవిదారకంగా ఎవరో "అమ్మా ! అమ్మా" అంటూ పిలిచే పిలుపూ తన ఫిరంగిమీటను పదేపదే అదుముతూ. "ఇదిగో. ఈ దెబ్బచూడు. మరొకటి, ఇంకావొకటి" అంటూ ఎవరో అనే మాటలూ. ఇన్నీ వినిపించాయి.

అలెక్సీ గుర్తుపెట్టుకొన్న విమానం తప్పించుకొని వెళ్ళింది. ఇప్పు డా స్థానంలో దిండికల్ పొగచుట్టమాదిరివుండేదొక విమానం నిలిచింది. దీనితోక కంటి పెట్టుకొని మనవారిదొక ఫోక్కె విమానం ఎగురుతూ తన రెక్కలందున్న తుపాకులనుండి తూటాల వర్షం కురిపిస్తోంది.అవి దానితోకను విరుగగొట్టేటంత బలంగా పడుతున్నాయి. అలెక్సీ తారాచువ్వమాదిరి పైకెగిరాడు. పైనుండి తన విమానంమీద ఏదోవొక నీడపడింది. ఆ నీడపడేసే దానిమీదికి తన ఫిరంగులనుండి అగ్నివర్షం కురిపించాడు. ఫోక్కెవిమానం సంగ తాతనికి తెలిసిందికాదు, అది తిరిగీ కనిపించాలా. శత్రువిమానం, దెబ్బతినిన తోకతో నొంటరిగా ఎగురు తోంది. ఈ గందరగోళంలో తన మిత్రుని మాటేమరిచిపోయాడు. తల త్రిప్పి అద్దంలో చూశాడు. ఎక్కడికీ వెళ్ళిపోలేదు, తన్నంటిపెట్టుకొని పెత్రోవ్ వస్తు న్నాడు !

"జాగ్రత్త ! వెనకబడవద్దు," అన్నాడు. పండ్లు బిగబట్టి అలెక్సీ.

అతని చెవులలో రకరకాల ధ్వనులు మ్రోగుతున్నాయి. చిటపటధ్వనులూ, పాటలూ, పరాయిభాషల్లో ఆక్రందనాలూ, ఆర్భాటాలూ, పండ్లు కొరికేవారిపటపట ధ్వనులూ, దీర్ఘ ఉచ్ఛ్వాసనిశ్వాసాలూ, కఫమడ్డు తగిలినట్లు గొంతు సవరణలూ, దగ్గులూ. ఈ ధ్వనులను వింటే ఇదంతా వొక విమానపుయుద్ధం మాదిరి తోచే బదులు ఎవరో గర్వశత్రువు లిద్దరు, ఒకరిపీకల నొకరు పట్టుకొని కసితీరా నొక్కుకొంటున్నారని తోచింది.

మరొక విమానమును తాకాలనే వుద్దేశంతో అలెక్సీ ఆకాశంలోకిచూశాడు. కాళ్లూ చేతులూ చల్లబడ్డాయి చలిజ్వరం వచ్చినట్లు వణుకుపుట్టింది. గగుర్పాటు కలిగింది. తానున్న ప్రదేశానికి క్రిందిభాగాన ఫోక్కె విమానమొకటి La – 5 విమానమును తాకి పోరాడుతూంది. ఆ సోవియట్ విమానపు నంబరేదో చూడ

టానికి కవకాశంలేదు. పంచుకనో అది పెట్రోవెక్కిన విమానమని అలెక్సీ కభిప్రాయంకలిగింది : ఆ La – 5 విమానం మీది కసంఖ్యాకమైన తూటాలను ఫోక్కె విసురుతోంది. ఏమాత్ర మాలశించినా, పెట్రోవ్ ప్రాణం దక్కదని తెలుసుకొన్నాడు. ఆ విమానాలు రెండూ ఒకదాని నొకటి అంటచుట్టుకొని పోరాడు తూండటంవల్ల వాటిని విడదీయడం చాలా కష్టమైన పని. ఆలస్యాని కిది తరుణం కాదు. పెట్రోవ్ చావుబ్రతుకులు తనమీద ఆధారపడి వున్నాయి, అలెక్సీ తన విమానమును తలక్రిందులుగా త్రిప్పి, ఇంజనుకు నిండుగా పెట్రోలు వాయువు నెక్కిం చాడు విమాన మెుక్కపెట్టున లంఘించి. జారుడు నక్షత్రంమాదిరి ఘడియ ఘడియకూ, వేగంగా క్రిందికిపడింది. పెద్దపెట్టున, పొట్టిరెక్కల ఫోక్కె విమానం మీదికి, పెద్ద రాతిబండమాదిరి, కాదు, కాదు బ్రహ్మాండమైన ఫిరంగి గుండుమాదిరి పడింది. లెక్కకు మించినన్ని తుపాకిగుండ్లు ఫోక్కెపై వడగండ్లు మాదిరి కురిశాయి. అకస్మాత్తుగా క్రిందికి పడటమూ, రెండో విమానమును మోద టమూ వల్ల అలెక్సీ తల దిమ్మెక్కింది. స్పృహ తప్పుతుందేమో ననేభయం వేసి క్రిందికి దిగిపోతున్నాడు, రక్తం క్రమ్ముకొనిన అతనికండ్లను, పొగల గ్రక్కుతూ, మంటలెగుస్తూ క్రిందికి, రెక్కలువిరిగిన పక్షిమాదిరి పడిపొయే ఫోక్కె కనుపించింది. పెట్రోవ్? ఎక్కడున్నాడు? ఎక్కడా కనుపించాడు కాదూ ఏమయినట్టు? విమానం విరిగిపడిపోయిందా? దానినుండి తప్పించుకో గలిగాడా? ఏదీ అలెక్సీకు తెలిసిందికాదు.

ఎటుచూచినా వొక్క విమానమైనా కనిపించింది కాదు. అంత రిక్షంనుండి ఆశరీరవాక్కు మాదిరీమాట తనచెవులబడ్డాయి.

"నేను – సముద్రవేగ – రెండునేను – సముద్రవేగ – రెండు, పెదొటాప్, నన్ను వెన్నంటిరా – అంటిపెట్టుకొనిరా, ఇంటికి! నేను సముద్రవేగ – రెండు...

తన విమానాలన్నిటినీ పెడొటాప్ ఇంటికి తీసుకుపోవడానికి నిశ్చయించి నట్లున్నది.

ఫోక్కె పడిపోయింది. క్రిందికిపడే తన విమానమును అలెక్సీ నిలబెట్టాడు. తిన్నగాపైకెత్తి సూటిగాఎగరటం ప్రారంభమయింది. తాపీగా కుర్చీ కానుకొని ఎగురుతూ తా నెక్కడున్నదీ తెలుసుకోడానికి దిక్సూచియంత్రమును చూశాడు. ఇంకాఎంత పెట్రోలున్నదో చూడబోతే, గాబరా పుట్టింది. చాలా భాగం కాలిపో యింది. క్రిందికి దిగటానికి మిగిలిన పెట్రోలు చాలదనేభయంవేసింది. ఈ దురదృష్టం చాలదనికాబోలు, తన వెనుకనున్న నల్లటిమేఘం చాటునుండి ఫోక్కె – వుల్ఫ్ – 190 విమానమొకటి మీదవచ్చి పడుతోంది. ఆలోచనాసాలోచనలకూ వ్యవధిలేదు, తప్పించుకోటానికీ వ్యవధిలేకపోయింది.

ఎదురుతిరిగాడు. ఆ విమానాలు రెండూ ఒకదానికొకటి బహువేగంగా సమీపిస్తున్నాయి.

# 6

ఆకాశంలో జరిగే ఈ విమాన యుద్ధపు ఘోష, కేవలమూ విమానముల నడిపేవారికి మాత్రం వినబడిందని అనుకోవద్దు. విమానాశ్రయంలో, కర్నల్ ఇవానొవ్ నెలకొల్పిన బలీయమైన రేడియోలో కూడా అది ఎంతో స్పష్టంగా వినిపించింది. వైమానిక యోధుడైన ఇవానొవ్‌కు వినబడే ఈ ధ్వనులనుండి, బ్రహ్మాండమైన యుద్ధం అంతరిక్షంలో సాగుతోందని ఇట్టే విదిత మయింది. జర్మనులు పట్టుబట్టి పోరాడుతున్నారు. ఒక పట్టాన వెళ్ళిపోయేటట్లు తోచదు. ఫెదొటావ్ దళంలోని విమానాలకంటె ఎక్కువగా జర్మను విమానాలున్నాయి. ఇది సమవుజ్జీల మధ్య జరిగేయుద్ధం కాదు. ఈ సంగతి తెలియగానే, అడవిలో నుండి చాలా మంది మైదానంలోకి వచ్చారు. తమ విమానాలెప్పుడు తిరిగివస్తాయో అనే ఆదుర్దాతో, దక్షిణాకాశాము‌ను తిలకిస్తూ నిలబడ్డారు.

తెల్లవస్త్రధారులైన వైద్యులూ, శస్త్రచికిత్సా నిపుణులూ భోజనాలగదినుండి తినేతిండితింటూనే ఆదరాబాదరా బైటికివచ్చారు. పొదలమరుగునుండి ఎర్రశిలువ లారీలు వచ్చి నిలబడ్డాయి. ఆజ్ఞాపించట మాలస్యంగా సాగిపోటానికి వాటి ఇంజనులు బుసలుకొట్టుతున్నాయి.

చెట్ల శిఖరాలపైన కనుపించిన రెండువిమానాలు అలవాటుప్రకారం విమానాశ్రయంమీద నాలుగైదుమార్లు తిరిగి క్రిందికి దిగేబదులు, నేరుగా నేలను వ్రాలి నడిచాయి. 1 నంబరు విమానంలో సోవియట్ సంయుక్త రాష్ట్రి వైమానిక యోధశిఖామణి ఫెదొటోవ్వూ, రెండో దానిలో అతనితో వెళ్లిన వైమానికుడూ వున్నారు. వారుదిగారో లేదో రెండో జంట క్రిందికి దిగింది. తిరిగివచ్చే ఈ విమానాల హోరుతో అచ్చటి అడవంతా మార్మ్రోగింది.

"ఏడూ, ఎనిమిదీ, తొమ్మిదీ, పది" క్రింద నిలబడినవారీవిధంగా లెక్కపెట్టారు.

దిగిన పదివిమానాలూ తమతమ స్థానాలకు వెళ్ళి నిలిచాయి. వాటి ఇంజనులను నిలిపేసారు. మిగతా రెండు విమానాలు ?

కళ్లు వప్పగించి చూస్తూ జనాలు నిలబడ్డారు. నిమిషాలు గడిచేకొలదీ వారి ఆదుర్దా మిన్ను ముట్టింది.

""అలెక్సీ, పెత్రొవూ" అన్నారెవరో, అస్పష్టంగా, ఆ మాటలనడానికి జంకుతూన్నట్లు.

అకస్మాత్తుగా ఒక స్త్రీకంఠం, వెర్రి ఆనందంతో నిండిన కంఠం వినబడింది.

"ఇదిగో వొక విమానం!

విమానపు టింజను మ్రోత చెవులబడింది. బర్చిచెట్లు శిఖరాలను రాచు కొంటూ విమానం రావటం చూసారు "నంబరు 12" అంతదూరానికే కను సించింది జనులందరికీ. దానికి దెబ్బలు తగిలినట్టున్నది. తోక విరిగిపోయింది; ఎడమరెక్క చివరిభాగం విరిగివ్రేలాడుతోంది. క్రిందికి దిగి, కాలు విరిగిన పక్షిమాదిరి కుంటి నడకనడిచింది. పైకెగిరి క్రిందపడింది. రెండడుగులులేచి తిరిగీ ఎగిరిపడింది. ఈ విధంగా నడకసాగించి విమానాశ్రయం చివరివరకూ వెళ్ళి, తోకను పైకెత్తిపెట్టి ఆగిపోయింది. వైద్య చికిత్సలారీలూ, శస్త్రచికిత్సకు లెక్కన జీపుకారులూ, అచ్చట వేచియున్నవారందరూ దాని దగ్గిరికి పరుగుతీసారు. విమానం నుండి మనిషి దిగిరాలేదు.

విమానంలోకి తొంగిచూశారు. కారినరక్తం మడుగుకట్టింది. పెట్రోవు స్పృహతప్పి కుర్చీలోకూలబడ్డాడు. ముఖంమీదపడిన వెంట్రుకలూ, వక్షానికానుకొని క్రిందికిపడిన తలా! వైద్యులూ, నర్సులూచేరి అతనిశరీరానికి కట్టినపటకాలనూ, కట్లనూవిప్పారు. ఏ తుపాకిగుండోతగిలి రంధ్రంపడిన ఆకాశగొడుగు త్రాళ్ళనతని నడుమునుండి తొలిగించి, లేవనెత్తి నేలపైనపడుకోబెట్టారు. కాలికీ చేతికీ గొప్ప దెబ్బలుతగిలాయి. బట్టలు చాలాభాగం రక్తంతో తడిసిపోయాయి.

అతనికి వెంటనే అవసరమైన ప్రథమచికిత్సనొనర్చి మడతమంచంమీద పడుకోబెట్టారు. దానినిఎత్తి లారీలోకి ఎక్కించేటప్పుడు పెట్రోవు కళ్లు తెరిచాడు. ఏదోచెప్పాడు. అదేమిటో ఎవరికీ వినిపించలా, అర్థంకాలేదు. కర్నలాతని ముఖం చెంతకు వెళ్ళగానే,

"అలెక్సీ ఏక్కడున్నాడు?" అని పెట్రోవ్ అడిగాడు.

"ఇంకా తిరిగిరాలేదు"

తిరిగీ మడతమంచమును పైకెత్తబోతే వద్దన్నట్టు తలను ఇటూ అటూ వూపి, పైకిలేవబోయాడు.

"ఆగండి నన్నుతీసుకువెళ్లవద్దు. నేనిక్కడనుండి వెళ్లను. అలెక్సీ వచ్చేవరకూ, ఇక్కడేవుంటాను. నా ప్రాణంకాపాడు.!"

ఏమయినాసరే అచ్చటినుండి వెళ్లనంటూ, తనకు కట్టినకట్లన్నిటినీ తీసిపారే యటానికి యత్నించాడు. కర్నల్కు కోపంవచ్చింది. పళ్లుబిగబట్టి, పెట్రోవును చూడకుండా ముఖ మటుప్రక్కకు త్రిప్పి—

"సరే, వదిలిపెట్టండి! అతని తాకవద్దు. చచ్చిపోతాడనే భయంలేదు. అలెక్సీ ఇంకొక నిమిషంలో తిరిగివస్తాడనుకొంటాను. అతనిదగ్గిర అంతకంటే పెట్రోలులేదు" అన్నాడు.

కర్నలు తన గడియారపు ఎర్రరంగుగల పెకండ్లముల్లును చూస్తూ నిలబడ్డాడు. నలుగురూ అడవిలోనుండే వృక్షాగ్రాలను చూస్తూ నిలబడ్డారు. ఆలెక్సీ వచ్చే విమానం అటుప్రక్కనుండే రావాలి. గడియారంముల్లు పరుగిడుతోంది. చెవులొగ్గివిన్నారు. కాని దూరంనుండి తుపాకులూ, ఫిరంగుల ప్రేలుడూ, అడవిలో నెక్కడో చెట్లబోదెలను తొలిచే వడ్రంగిపిట్ట ముక్కుదెబ్బలూ తప్ప వేరేదీ వినబడిందికాదు.

# 7

లావొచ్కిన్-5, ఫోక్కె-వుల్ఫ్-191-ఈ రెండూకూడా చాలా వేగంగా వెళ్ళే విమానాలు. అవి రెండూ బహు వేగ గా ఒకదాని నొకటి సమీపిస్తున్నాయి.

అలెక్సీ రిక్టోపెన్ విమానమును నడిపే ఆ జర్మను యోధుడూ ఢీకొట్టుకొన్నారు. విమానములు తలకు తల ఢీకొట్టుకొనటమనేది ఒక నిమిషంలో ముగిసిపోతుంది. కాని ఆ కనురెప్పపాటుకాలంలో వైమానికు డనుభ ంచే అనుభవమంత ఘోరమైన దింకొకటి వుండదు. నేలమీద ఒక రోజంతా పోరాడే సైనికుడనుభవించే యావత్తు అనుభవమునూ, ఆ కొక్క చిటికకాలంలోనూ వైమానికుడు పొందుతాడు.

ఒకదానికెదురుగా నింకొకటి, రెండు విమానాలు వాయువేగంతో ఎగిరి వస్తున్నాయనీ, వాటి యందొకదానిలో నీవున్నావనీ ఊహించుకోడానికి యత్నించు. చూస్తూ వుండగా నీ విరోధి ఎక్కివచ్చే విమానం పెద్దది పెద్దదిగా పెరుగుతూ, విశ్వరూపందాల్చినట్లు కనిపిస్తుంది. దాని రెక్కలూ, ముందుభాగాన తిరిగే ప్రొపెల్లరు చేతులూ, నలుపుచుక్కల మాదిరికనిపించే ఫిరంగుల నోళ్ళూ, భూతద్దంతోమాదిరి పెద్దవిగా, స్పష్టంగా కనిపిస్తాయి. మరునిమిషం విమానాలు మోదుకొని తుత్తునియలై పోతాయి. క్రింద పడిన విమాన భాగములనుండి వైమానికుని శరీరమును, ఏ కొంతయినా మిగిలినట్టయితే, లేవనెత్తటం సులభమైన పని కాదు. వైమానికుని మనోనిబ్బరానికీ, నైతికబలానికీ అది అగ్నిపరీక్ష సమయం. నరాలబలం చాలనివారు ప్రాణాలుకోల్పోతారు, జయమొందాలి, ఇప్పుడప్పుడే చనిపోరాదని అనుకొన్నామనిషి విమానపు మరపిడులను తనకు తెలియకుండానే ముందుకులాగి, తనపైకి పెనుభూతంమాదిరి వచ్చిపడే విమానమును తప్పించుకొని, పైకెగురుతాడు. మరునిమిషమాతని విమానం ఏ రెక్కో పూర్తిగా విరిగి, ఎగిరి పోయో, లేక దాని అడుగుభాగం సగానికిపైగా విరిగి ప్రేలాడుతూనో క్రిందికి

పల్టీలుకొడుతూ పడుతుంది, వైమానికుడితోసహా. అటువంటప్పుడాతని కాపాడ గలదే వొక్కటీ వుండదు. అనుభవజ్ఞులైన వారికిదంతా స్పష్టంగా తెలిసిననంగతే కాబట్టి దీనికంతకూ తెగించి ఎగబడాలంటే. ఆ వైమానికుని ధైర్యసాహసాల ద్వితీయంగా నుండాలని చెప్పకతీరదు.

తన కెదురై వచ్చేమనిషి. సాధారణమైన వైమానికుడు కాడని అలెక్సీకి తెలుసు. అవసరావసరంగా తరిఫీదుచేసి అనుభవం తక్కువయినా యుద్ధంలోకి దింపిన ముక్కుపచ్చలారనివాడు కాదీమనిషి, రిక్తోఫెన్ దళంలోని ప్రముఖ వైమానికులలో నొక్కడీ వ్యక్తి. ఆ విమానంమీద, దానిదెబ్బను తట్టుకోలేక పడిపోయిన విమానముల పేర్లన్నీ లిఖించారు, వెనుతిరిగే ఘటం కాదీమనిషి. భయపడడు, ఎంతకైనా తెగిస్తాడు,

"వచ్చిపడుతోంది ! రిక్తోఫెన్ !!" అన్నాడు పంళ్లు బిగపట్టి. అలెక్సీ, ఆదుర్దాలో పెదని కరుచుకున్నాడు ; రక్తంకారింది. కండరాలన్నీ ఉక్కుముక్కల మాదిరి గట్టిపడ్డాయి. ఎదుటినున్న అద్దంలో రిక్తోఫెనును చూశాడు, తీరా దగ్గరికి వచ్చాక తన కళ్ళెక్కడ మూసుకొంటాయో అనే భయం ! మూసుకోకుండా నుండటాని కాతనికి గల మనోబలాన్ని యావత్తూ వినియోగింటాడు.

ముందు గుండ్రంగా తిరిగే ప్రొపెల్లరు చేతులొక సన్నని దోమతెర అల్లినట్లగుంచాయి. ఎదుటి విమానమునకు ముందున్న ప్లాస్టిక్ తెరవెనుక కూర్చున్న వైమానికుడగుపించాడు. అతని రెండు కళ్ళూ రెండు కొరువుల్లాగా. ద్వేషముష్టి పడుతూ తనకేసి చూస్తున్నాయి. ఇదంతా యదార్థంగా జరగలా ; కేవల మాతడా విధంగాఊహించాడు కాని నిజమేనని భ్రమపడ్డాడు, "ఇవే ఆఖరుఘడియలు - అఖరుఘడియ" లనుకొంటూ శరీర కండరాలన్నింటినీ బిగబట్టాడు. పెనుగాలి మాదిరా విమానం తన మీదికెగిరి వస్తోంది. వాడు ప్రక్కకు జరగడు. నిశ్చయంగా జరగడు. ఇవే తన తుదిఘడియలు.

చచ్చిపోవటానికి సర్వసిద్ధమయ్యాడు, అలెక్సీ. చేతి కందేటంత దగ్గరికి జర్మను విమానం వచ్చింది....ఆ మనిషికి ధైర్యం చాలిందికాదు, గాబరాపడ్డాడు. అకస్మాత్తుగా పైకిలేచాడు ఆ జర్మను విమానపు అడుగుభాగం సూర్యకాంతికి తళుక్కున మెరిసింది, అలెక్సీ నెత్తిని తాకేటంత దగ్గరిగా. అలెక్సీ తన విమానపు మూడు ఫిరంగులనూ వొక్క పెట్టున ప్రేల్చాడు. వాటినుండి తూటా లెగిరి వెళ్ళి జర్మను విమానమును బలంకొద్దీ కొట్టాయి. అలెక్సీ తిన్నగా తన విమానమును మరికొంతదూరం పోనిచ్చి గుండ్రంగాచుట్టి పైకిలేచాడు. తాను తలక్రిందులుగా నున్నప్పు డాకాశంలో రెక్కలువిరిగిన పక్షిమాదిరి తన్నుకులాడే విమానం గోచరించింది.

"ఓల్గా !" అంటూ పెద్ద కేకపెట్టాడు అలెక్సీ. తీగచుట్టలమాదిరి చుట్టుతూ, క్రిందికిపడే జర్మను విమానమును వెంబాడించాడు. అది క్రిందనున్న పొలాన్నితాకి బ్రద్దలై నల్లటి పొగస్తంభమును లేవనెత్తింది.

అతని నరాలూ, కండరాలూ వొక్కపెట్టున బిగువు సడలాయి. ఎక్కడలేని అలసటా కలిగిందాతనికి. పెట్రోలు యింక ఎంతవున్నదీ చూశాడు. అఖరైపోయింది. మిగిలిన ఏ పదిచుక్కలనో ఇంజను నాకేస్తోందన్నట్టు లా పెట్రోలు కొలతను చూపే ముల్లుసున్నా అంకెదగ్గిర గజగజలాడింది.

ఏ రెండుమూడు నిమిషాలకో సరిపడ పెట్రోలుమాత్ర మున్నది. విమానాశ్రయమును చేరుకోటానికి కనీసం పది నిమిషాలన్నా కావాలి. "వెర్రివెంగళాయి మాదిరా పోక్కవిమానము నంటిపెట్టుకొని క్రిందికి దిగకపోతే ఎంతబాగుండేది ?" అని ఇప్పుడాతనికి తోచింది. అ పెట్రోలుతో విమానాశ్రయమును చేరుకోడానికీ వీలుండేది.

విపత్తు లెక్కవయ్యేకొలదీ ధైర్యమూ శాంతమూగల మనుష్యుల మనస్సు బహు మెలకువగా పనిచేస్తుంది ; చురుకుగా ఆలోచిస్తుంది వెంటనే పైకి లేవాలి. చుట్టుకొంటూ లేస్తే లాభంలేదు. ఏటవంపునా, విమానాశ్రయంమీదికి వెళ్ళేటట్టు ఎగరాలి. ఇదీ అలెక్సీ నిశ్చయించుకొన్న విషయం.

విమానపు ముక్కు నేటవంపుగా నెత్తిపెట్టి ముందుకు సాగాడు. భూమి దూరమైపోతోంది, మంచుకప్పినట్టులంతా అస్పష్టంగా కనిపిస్తోంది ముందున్న ఆకాశం. ఆలోచనలు సాగాయి మనసులో, తనదగ్గిరున్న పెట్రోలు చాలదన్న విషయము అక్షరాలానిజమని తెలుసు. కాబట్టి ఎక్కడో వొకచోట క్రిందికి పడిపోవాలి. ఆ ప్రదేశమంతా తానెరుగున్నదే కాబట్టి, ఎక్కడ పడటమా అని ఆలోచించాడు. అడవులూ, నిలువెత్తుకు పెరిగిన పొదలూ, చిత్తడినేలా; ఎగుడుదిగుడు భూమీ, దున్నిన భూమీ, బాంబులుచేసిన గుంతలూ, అడ్డంగా పరిచిన యిండ్ల ఇనుప తీగెలూతప్ప, గోచపాతంత సాఫీ ప్రదేశ మాతనికెక్కడా గోచరించిందికాదు.

"ఉహూ ! క్రిందిపడటానికి వీలులేదు. పడితే చావుతప్పదు." అనుకొన్నాడు.

పోనీ, విమానంనుండి దుమికేస్తే ? ఔను; ఇది మంచి ఆలోచన ! వెంటనే తలుపుతెరచి, విమానమును ప్రక్కవాటుగా త్రిప్పి పిడిని ఒక్కలాగులాగాలి. — అంతే ! విమానం సంగతి ఇంత సొగసైన విమానం ! తన ప్రాణపదమైన ఈ విమానం కేగతిపడుతుంది ? ఈ వొక్కరోజులో మృత్యువునుండి మూడు పర్యాయము లీ విమానం కాపాడింది. తనకు ప్రాణభిక్షపెట్టిన దీనివి వదలివేయాలా, తుత్తునియిలు చేయాలా ? పెంటప్రోవుగా తనచేతులారా చేయటం న్యాయమా ? ఎందుకీ విధంగా పాడుచేసావాని తన్నెవరుగానీ ప్రశ్నించనైనా ప్రశ్నించరు. తనకీ

విషయం తెలియనిదికాదు. ఇటువంటి విపత్సమయంలో విమానమును త్యజించ నున్నదే వైమానిక నిబంధన. సర్వాంగసుందరాంగా, నిండుప్రాణంతోనున్నదీ విమానం. ఇదొక యంత్రంకాదు; సజీవమైన వ్యక్తి. తనవంటిదే ఒక ప్రాణి. నమ్మించి మోసంచేయటానికి చేతులు రానన్నాయి. విమానంలేకుండా, వట్టి చేతులతో వెళ్ళాడనుకో ; పనీపాటలేకుండా, నలుగురూ తమ విమానములను లాలించి పాలించుకొంటుంటే, తాను మాత్రం. పెర్రివాడిలాగా విమానాశ్రయంలో తిరుగుతూ. మరొక విమానము నిచ్చేవరకూ, రోజులుగడపాలి, ముసలమ్మలూ, పసికందులూ కూడా తమకుపీలయినన్ని విధాలా యుద్ధ విజయానికి తోడ్పడే ఈ రోజులలో, తానొక్కడు మాత్రం, కాలుకాలిన పిల్లిమాదిరి, ఖాళీగా తిరగాలి.

ఈ విధంగా చేయమని ఎవరో తనతో చెప్పినట్లూ, వారిని వారిస్తూన్నట్లూ, అలెక్సీ "ఎన్నటికీ వీలుపడద"ని బిగ్గరగా అన్నాడు.

ఇంజను ఆగిపోయేవరకూ ఎగిరితే ? తరువాత ? తరువాత సంగతి తరువాత చూసుకొందాములే.

నిలువకుండా ఎగిరివెళ్ళాడు. మూడువేల కిలోమీటర్ల ఎత్తునా. తరువాత నాలుగువేల ఎత్తునా ఎగిరాడు. కాలు మోపడాని కెక్కడైనా జాగా కనిపిస్తుందేమో నని జాగ్రత్తగా నేలనంతా పరికించాడు. విమానాశ్రయానికి వెనుకనున్న అడవి స్పష్టంగా కనిపిస్తోంది అప్పటికి సుమారు పదునైదు కిలోమీటర్ల దూరముంటుం దనుకొన్నాడు. పెట్రోలును చూపే ముల్లు చప్పబడి సున్నా కంటకరుచుకొని పోయింది. కాని, తమాషా, ఇంజ నింకా పనిచేస్తూనే వున్నది ! దాని నేది నడిపి స్తోందో, అతనికి తెలిసిందికాదు. పైకి. పైపైకి వెడుతోంది. సెభాస్ !

ఇంతవరకూ వినవచ్చిన ఇంజను శబ్దంలో అకస్మాత్తుగా నేదో మారుడుశబ్దం అలెక్సీకి వినబడింది. అనుభవజ్ఞుడైన వైమానికుడొక్కడే దీనిని గ్రహించగలడు; ఇతరులకు వీలుపడదు. క్రింద అడవి కనిపిస్తోంది. సుమారు ఏడెనిమిది కిలో మీటర్ల దూరంలో. నాలుగైదు కిలోమీటర్లు వెడల్పుగా నున్నది. ఇదేమంత పెద్ద అడవికాదు. కాని ఇంజనులో కలిసిన ఈ మార్పాతని కలవరపెట్టింది. ఊపిరిని పీల్చడానికి కష్టపడే మనిషిమాదిరా ఇంజను శ్వాసకు ఇబ్బంది పడుతూండట మాతనికి, స్వయంగా తానే అట్టి కష్టానికి లోనయినట్లులనిపించింది. ఉన్నట్టుండి దానినుండి "ఛక్. ఛక్. ఛక్" మనే శబ్దం పుట్టింది. విమానం అదిరదిరిపడుతూ నడవలేక నడవలేక నడుస్తోంది.

"ఫరవాలేదు. తిరిగీ పనిచేస్తోంది ! మామూలు యింజనుమాదిరే కొట్టు తోంది ఫరవాలేదు, రక్షించావు దేవుడా ! ఇదిగో అడవి". సూర్యకాంతిలో బర్చిచెట్ల శిఖరాగ్రాలు మెరిసిపోతూ వూగిసలాడుతున్నాయి. అలలు అలలుగా చలిస్తున్నాయి, ఇచ్చటెచ్చటా క్రిందికి దిగడానికి వీలులేదు, వెళ్ళి విమానాశ్రయం మీదే దిగాలి. ఆలసించరాదు; వెళ్ళాలి, త్వరగా విమానాశ్రయమును చేరుకోవాలి.

ఛక్ ! ఛక్ ! ఛక్ !

తిరిగీ ఇంజను మూలగటానికి మొదలుపెట్టింది. అడవిమీదనున్న అలెక్సీకి దానిమధ్య తిన్నగావెళ్ళే ఇసుక కాలిబాటనుచూస్తే తమ దళాధికారి తలా, తిన్నని పాపిడీ జ్ఞాపకానికి వచ్చాయి. అదిగో ! సుమారు మూడు కిలోమీటర్ల దూరంలో విమానాశ్రయం కనిపిస్తోంది.

ఛక్ ! ఛక్ ! ఛక్ ! అకస్మాత్తుగా నిశ్శబ్దం ! గాలికి కొట్టుకొనే విమానపు తీగెలు గలగలాడాయి. ఇవే కడపటి ఘడియలా ? వెన్నుపాముపొడుగునా చలీ, వణుకుడూ పుట్టాయి. దుమికేద్దామా ? ఉహుం తప్పు, తప్పు. ఇంకా కొద్దిగా వెళ్ళగలిగితే ? విమానమును క్రిందికి ఏటవాలుగా త్రిప్పి గాలిమీద తేలుతూ దిగటానికి యత్నించాడు. నెమ్మదిగా దిగాలి. లేకపోతే విమానం తోకతెగిన గాలిపటంమాదిరి గిరిగీ, తలు కొట్టుతుంది.

ఏమిటీ నిశ్శబ్దం ? ఎంత గాఢమైన నిశ్శబ్దం ! చల్లారిపోయేడి ఇంజను చల్లబడే శబ్దంకూడా వినిపించింది. కణతలలో కొట్టుకొనే నాడీధ్వనీ, వడివడిగా క్రిందకు పడటంవల్ల చెవులలోని గింగురు శబ్దమూ, విపరీతంగా వినబడ్డాయి. క్రిందనున్న నేల లేచి పరుగు పరుగున తన దగ్గరికి వస్తోంది, విమానంలోనున్న ఏ పెద్ద అయస్కాంతమో. దానిని లాగుతున్నట్టు !

ఆఖరవనున్న అడవీ, దాని కావలనున్న విమానాశ్రయమూ కంటబడ్డాయి. ఇప్పటికే చాలా ఆలస్యమయిందా ? చుట్టుతూ, చుట్టుతూన్న ప్రొపెల్లర్ మధ్యలో ఆగిపోయింది ! అది ఆ విధంగా నిలిచిపోవటం చూస్తే అలెక్సీ గుండెల్లో రాయి పడింది. చేతి కందేటంత దగ్గిరికి అడవి వచ్చింది. మరునిమిషం తన ప్రాణం పోతుంది కాబోలు ! ఇదంతా బాహుశః ఆమెకు తెలియదు. పద్దెనిమిది నెలల కాలం తా నేవిధంగా కష్టపడ్డదీ, కృషి చేసినదీ. ఆఖరికి తన అభీష్ట మే విధంగా నెరవేరినదీ ఆమెకు తెలియనే తెలియవు కాబోలు ! సినల్లైన మనిషి పీడనిపించు కొని, తుట్టతుదకు ఎందుకూ కొరగాకుండా. ఇట్టి హాస్యాస్పదమైన, అవమాన కరమైన పరిస్థితులలో తన ప్రాణం పోయిందన్న విషయ మామె కి ఒన్మకు తెలిపే అవకాశాలే వుండవు కాబోలు ! చెప్పేవాడెంటూ వొకరుండాలిగదా. తెలియటానికి ?

ఉహూం ! క్రిందికి దుమికితే వచ్చిన నష్టమేమున్నది ? ఆ తరుణం మించి పోయింది. వృక్షశాఖలను రాచుకొంటూ క్రిందికి పడిపోతున్నాడు. ముందెన్నడో ఇట్టి అనుభవమే తనకు కలిగిందని తోచింది. ఎప్పుడు ? ఎప్పుడేమిటి ? రెండేండ్ల క్రితం. చిరుగురింతకాలమం దాక రోజున. తన విమానం పడిపోయినపుడు ! అప్పుడూ ఇదేమాదిరి అకుపచ్చని చెట్లశాఖల్లోకి తాను పడిపోయాడు. ఆఖరి యత్నం; బ్రతుకటానికి చేతిలోనున్న పిడిని పట్టిలాగాగు. ..

# 8

ఎక్కువగా నెత్తురు కారిపోయి బలహీనం చెందటంవల్ల అలెక్సీ చెవులలో గింగురు శబ్దం వినిపించింది. విమానాశ్రయమూ తానెరుగున్న వారి ముఖాలూ. బంగారు పూతపూసిన మేఘాలూ, అకస్మాత్తుగా ఇవన్నీ ఊగిసలాడి, గిర్రున చుట్టి అంతర్ధానమయ్యాయి. కాలు కదిపాడు. ప్రాణం పోయేటంత నొప్పి. దానిని తట్టుకోలేక తెలివివచ్చింది.

"అతడింకా రాలేదా?" అని అడిగాడు.

"ఇంకా రాలేదు. మాట్లాడవద్దు" అని జవాబు.

ఆరోజు జర్మను విమానం తన పైకి వచ్చిపడినప్పుడు అంతరిక్షంనుండి రెక్కలు కట్టుకొని దిగిన దైవసమానుడు అలెక్సీ తనకు ప్రాణభిక్ష పెట్టినవైమానిక వీరాగ్రేసరుడింకా రాలేదా? బాంబులు త్రవ్విన గుంతలూ, టాంకులు చేసిన కాలువలవంటి చక్రాల గర్తులూగల యుద్ధభూమిలో నెక్కడో. ఎముకలన్నీ విరిగి మాంసపుముద్దయి పడిపోయి వున్నాడా? ఇకమీద, ఈ జన్మకి ఈ పెట్రోవ్ కాతని చూసే అదృష్టంలేదు కాబోలు. దయా, పట్టుదలా, సహనమూ సమ్మిళితమై తొంగిచూసే అతని కండ్లు కాంతిహీనమైన గాజు గుండ్లుగా మారి, చూడలేవు కాబోలు ఇంతేనా అంత ధైర్యానికీ, సాహసానికీ, త్యాగానికీ ఈ జీవితంలో అతనికి దొరికిన కానుక? ఘోరం!! దుర్భరం!!!

దళాధికారి, కమాండరు తన చొక్కా చేతిని క్రిందికిదించాడు. చేతి గడియారంతో పని తీరిపోయింది. రెండు చేతులతో తలకంటపెట్టి దువ్విన జుత్తును సర్దుతూ, "నేడింతకంటే వేరే ఆశ లేద"న్నాడు.

"ఎటువంటి ఆశాలేదంటారా?" అని అడిగారెవరో.

"ఒకవేళ పెట్రోలు పూర్తిగా ఖర్చయివుంటుంది. బహుశ ఎక్కడో వొక చోట దుమికేసాడు కాబోలు. లేదా క్రిందపడ్డాడేమో?....ఈ పెట్రోవ్‌ను తీసుకు వెళ్ళండి" అన్నాడు కమాండర్.

కమాండరొక పాటను ఈలవేస్తూ వెళ్ళాడు. అదెంతో అపస్వరంగా మున్నది. పెట్రోవు గొంతుకలో వెలగకాయంత దేదో, కాలిపోతూ అడ్డంపడి నట్టాతనికి తోచింది. ఎవరో డగ్గికశబ్దం విమానాశ్రయంలో నిశ్శబ్దంగా అలెక్సీ కొరకు కనిపెట్టుకొని నిలబడిన జనులు తలలు త్రిప్పి చూసారు. మంచంలో పడుకొన్న పెట్రోవు, వైమానికయువకుడు, చిన్న పిల్లవాడిమాదిరి ఏడుస్తున్నాడు. చూడలేకపోయారు....

తీసుకుపోండి. మీకుకాదూ చెబుతోంది? లేనిపోని గొడవంతా"....
అంటూ కమాండరు అరిచాడు. ఆ కంఠంలోనున్న గద్గదికను మరుగుచేయాలను
కొన్నాడు. అమాదిరిగాఅరిచి. కళ్లుచిట్లించుకొంటూ, చేతిరుమాలాతో ముక్కు
వద్దుకొంటూ చకచకానడిచివెళ్ళాడు అప్పటినుండి'

మిగతావారందరూ ఎవరిదారిని వారు వెళ్ళటానికి రెండడుగులుపెట్టారో,
లేదో, విమానం! చెట్లశిఖరాలను తన చక్రాలతో తాకుతూ, రవంతయినా శబ్దం
లేకుండా వస్తోంది. మాయా విమానంమాది రా జనులు చేయినెత్తితే అందేటంత దగ్గ
రగా ఎగిరి, నేలమీద తన మూడుచక్రాలపైనా వ్రాలింది. దభీలున నేలను తాకిన
శబ్దము. తామెదురుచూస్తూ నిలుచున్న విమానం 11 నంబరుది వచ్చిదిగింది.

"అతడే! అతడిదే ఈ విమానం" అన్నారెవరో. ఇంతవరకూ కొయ్య
బారి నిలబడిన ఆ జనులకు చైతన్యం కలిగింది, మనుష్యుల్లోపడ్డాడు.

ఆ విమానం పరుగిడి విమానాశ్రయం చివరిదాకాపోయి. తెల్లని ప్రకాండం
గల వొక లేతబర్చిచెట్టు కెదురుగా నిలిచింది.

విమానం చెంతకు అప్పటి వారంవరూ పరుగెత్తారు, ఏదో అనిర్వచనీయమైన
భయమునకు లోనై, విమానంనుండి మనిషెవ్వడూ దిగి రాలా. అందరికీ ముందుగా
దళపు కమాండరు పరుగిడి వెళ్ళి విమానపు రెక్కపై కెక్కి, ఇంజను గది
మూతను లేవనెత్తాడు. నెత్తిన టోపీ లేదు. లోపల అలెక్సీ కూర్చున్నాడు, ముఖం
కాగితంమాదిరి పాలిపోయింది. అకుపచ్చరంగెక్కిన పెదవులపై చిరునవ్వు,
కొరుకుడుపడిన పెదవినుండి కారిన రక్తం. రెండు చారలుగా గడ్డమునుండి,
కంఠంపొడూగునా పారింది.

"బ్రతికేవున్నావా? దెబ్బ తగిలిందా?"

ఎంతో బలహీనంగా చూసి. ఎంతో కష్టంమీద నవ్వు తెప్పించుకొని, అలెక్సీ,
"బాగున్నాను. భయపడిపోయాను....ఆరు కిలోమీటర్ల దూరం, ఒక్క చుక్క
యినా లేకుండా ఎగిరివచ్చాను."

వైమానికు లాతనిచుట్టూ మూగి, బిగ్గరగా మాట్లాడారు. అభినందించారు.
కరస్పర్శనం చేసారు.

"ఏమి టీ గలభా అంతా?. ఆ రెక్క విరిగిపోతుంది. ఎంతమందిని
మోయగలదు? తప్పుకాదూ? నన్ను దిగనిస్తారా?" అంటూ చిరునవ్వు నొకటి
విసిరాడు అలెక్సీ.

తనచుట్టూ గుమిగూడిన తలలూ, మనుష్యులూ, పెద్ద గలభాగా, నున్న
దంతా. షూరి కాళ్ళదగ్గిరనుండి, నేలపైనుండి, హీనంగా "అలియోషా! అలియోషా!"
అన్న మాటలు వినిపించాయి.

అలెక్సీ కకస్మాత్తుగా బలం వచ్చిందికాబోలు. పైకి లేచి నిలబడి, చేతుల మీద తన బలమంతా మోపుతూ, తన కృత్రిమపాదాల నా ఇంజను గది వెలుపలికి పెట్టి, క్రిందికి దుమికాడు. కాళ్ళను జాపేటప్పు డవి ఎవరిముఖానికో తగిలాయి.

పెట్రోవ్ పడుకొనిన తలగడదిండుకూ, అతని ముఖానికీ తేడా తెలిసింది కాదు. అంత విపరీతంగా రక్తవిహీనమయిందా ముఖం. లోతుకు దించుకుపోయిన కళ్ళనుండి కన్నీరు చెక్కిళ్ళకు దిగజారి, దిండు తడిసింది.

"బ్రతికున్నావా ! ఓరి !....బ్రతికావు, అంతేచాలు" నంటూ అలెక్సీ అతని చెంత మోకరించి, బాధపడుతూన్నప్పటికీ, తనకేసి సంతోషంగా చూస్తూవున్న పెట్రోవ్ తలను రెండుచేతులతోనూ పట్టుకొని,

"బ్రతికేవున్నావుగా ?" అన్నాడు, తిరిగీ.

"కృతజ్ఞుడను, అల్యోషా. నాకు ప్రాణభిక్ష పెట్టావు. నీ ఋణం తీర్చు కోవటం....నీ వున్నావే...అల్యోషా...నీవు..."

"మీ కందరికీ ఏవంతయినా బుద్ధివున్నట్టు లేదు. జరగండి, అక్కడనుండి. వాడిని తీసుకువెళ్ళండి. కోతులాడుతున్నాయా ? కొంపమునిగిపోతున్నాయా ? నిలబడిచూడటానికి" అంటూ గర్జించాడు.

ఆ దళాధికారి, కమాండ దిగువే నిలబడివున్నాడు. పొట్టిగా, బలంగా, నిగనిగా మెరిసే బూట్లూ, నీలిరంగు కోటూ తొడుగుకొని, అధికారం ముట్టిపడే టట్లున్నాడు.

"సీనియర్ లెఫ్టినెంట్ అలెక్సీ ! నీవీ నాటి విషయాలను పూర్తిగా వ్రాసి యీయవలసింది. ఎవరన్నా శత్రువులను పడగొట్టావా ?" అన్నాడు, అధికార కంఠంతో.

"పడగొట్టాను. రెండు ఫోక్కేవుల్ఫు విమానాలు."

"ఎట్టి పరిస్థితులలో ?"

"ఒకటి పెట్రోవును వేధిస్తూంటే, క్రిందినుండి పైకిలేచి కొట్టాను. రెండో దానితో తలకు తల ఢీ కొట్టించాను. మన యుద్ధభూమికి సుమారు మూడు కిలో మీటర్ల దూరంలో."

"నాకు తెలుసు. అచ్చటినుండి ఇంతకుముందే వార్తవచ్చింది .... నా అభి వందనాలు"

"నే నొక సామాన్య వైమానికుడిని. మీ రీవిధంగా అనటం ....

అలెక్సీ మాటల కడ్డుతగిలి కర్నలు అధికారరూపంగా కాక దయవుగా,

"ఫరవాలేదు, చాలా సంతోషం. నీవు రేపటినుండీ అధికారం వహించాలి ....మూడో దళాధికారి తిరిగిరాలేదు.

వారిద్దరూ నడిచేవెళ్ళారు. ఆ నాటికి విమానాలతో పని ముగిసింది. తక్కిన వైమానికులందరూ వారివెనకాలే వెళ్లారు. అచ్చటనున్న పచ్చని గరికదిబ్బను

సమీపించేలోగా జవానొకడు పరుగెత్తుకొంటూ వచ్చాడు. సలామొకటి పెట్టి చాలా సంతోషంతో ఏదో చెప్పాలని నోరువిప్పాడు. కర్నల్ లాతనికి చటుక్కున అడ్డుతగిలి :

"నెత్తిన టోపీ ఏమయింది ? నీ వేవరనుకొన్నావు ? బడినుండి యింటికి వెళ్ళే బడిపిల్లాడ వనుకొన్నావా ?" అంటూ గదమాయించాడు.

పరిగెత్తిరావటంవల్ల అయాసపడుతూ నిటారుగా, సవినయంగా నిలుచుని.

"కర్నల్ సోదరా ! ముందు నన్ను చెప్పనీయం డ"న్నాడు.

"ఏమిటి, సంగతి ?"

"మన "యాక్" విమానాల దళాధిపతి వెంటనే మీతో టెలిఫోనులో మాట్లాడాలన్నాడు",

"ఎందుకు ? ఏమి కావాలి ?"....అని నిలవకుండా కర్నల్ భూమి అడుగున మన్న టెలిఫోనుగదికి వెళ్లాడు.

"నిన్ను గురించే...." అంటూ ఆ వచ్చినమనిషి అలెక్సీతోనని, ఇంకా ఏదో చెప్పాలనుకొన్నాడు, ఇంతలోకే క్రిందిగదినుండి కర్నల్ కంఠం వినబడింది.

"అలెక్సీని రమ్మని చెప్పు."

అలెక్సీ లోనికివెళ్ళి కదలక, మెదలక రాతి విగ్రహంమాదిరి నిలుచున్నాడు. టెలిఫోను గొట్టమును చేతితోమూసి కోపంతో :

"నాకెందుకు లేనిపోనివన్నీ చెప్పావు ? మన 11 వ నంబరు విమానము నెవ రుపయోగించారని టెలిఫోనులో కమాండరు అడిగాడు. సీనియర్ లెఫ్టినెంట్ అలెక్సీ అని బదులుచెప్పాను. ఈ రోజాతడెన్ని విమానాలు పడేసాడన్నాడు ? అని అడిగితే, 'రెండ'న్నాను. ఆయనేమన్నాడో తెలుసా : "మరొకటి చేర్చుకో. నాతోకను పట్టుకొని వ్రేలాడి వేధించే ఫొక్కె - వుల్ఫ నొకదానిని పడేసాడు. అది క్రిందికి పడిపోవటం కండ్లారాచూసాను' అన్నాడు." కర్నలు తన ముఖం చిట్లించుకొన్నాడా ? నిజంగానే కోప్పడుతున్నాడా, లేక వేళాకాళానికనే మాటలా ? అలెక్సీకి తెలియలా. "నిజమేనా ? ఇదిగో కావాలంటే నీవే ఆయనతో మాట్లాడు.... హలో ! అక్కడేవున్నారా ? సీనియర్ లెఫ్టినెంట్ అలెక్సీ ఇక్కడున్నాడు. స్వయంగా మీతో మాట్లాడుతాడు. ఫోను నతనికి యిస్తున్నాను."

కొత్తకంఠం వినబడింది.

"నీకెంతో కృతజ్ఞుడను, సీనియర్ లెఫ్టినెంట్ అలెక్సీ. అద్వితీయమైన దెబ్బ. అది. అభినందించక తప్పదు. నన్ను కాపాడావు. దానిని వెన్నంటిదిగాను, అది నేలనుతాకి తుత్తునియలై కాలి భస్మమయింది....నీకు త్రాగటమలవాటేనా?... తప్పకుండా ఇక్కడికి రావాలి. నీ కొరకు లీటరు వోడ్కా బాకీపడ్డాను. నమస్కారాలు. కలుసుకొన్నపుడు కరస్పర్శ చేస్తాను, తనివితీరా. సెలవా ?"

అలెక్సీ టెలిఫోనును క్రింద పెట్టాడు. నిలుచోడానికి కూడా శక్తిలేనట్టున్నది. వీలయినంత త్వరలో తన 'ఎలుక రంధ్రంలోకి' దిగి దాని గోడలో త్రవ్వుకొనిన 'మంచం'లో పడుకొని, పాదాల నూడబెరికి అంతదూరంగా పారేసి, కాళ్లుజాపి పడుకోవాలనిపించింది. రెండుఘడియ లచ్చట నిలబడి గదిగుమ్మందగ్గిరికి వెళ్ల బోయాడు.

"ఎక్కడికావెళ్లటం ?" దళాధికారి, సమాండర్ ఎడ్డంవచ్చాడు. అతనిచేతిని తన చిన్నహస్తంతో పట్టుకొని గట్టిగానొక్కి, "ఏమనాలో నాకుతెయకున్నది. ఊఁ ? బలేవాడివి! నీవంటివారు నాదంళంలో నుండటం నా అదృష్టం...ఎంతో గర్వపడవలసిన విషయం...ఇంకా, మరి....ఏవింధగా చెప్పమంటావు?.... మే మందరమూ నీకురుణగ్రస్తులం...చూడు. నీ స్నేహితుడున్నాడే, పెట్రోవ్... వాడుమంచివాడేగా?....కాదని ఎవరనగలరు ?....ఇంకాతక్కిన వైమానికులు న్నారుగా? మీవంటి మనుష్యులుంటే రష్యాకు విజయం చేకూరకుండా చేయడానికి, ఆ దేవుడికికూడా సాధ్యపడదు."

తిరిగి అలెక్సీ చేతిని గట్టిగా అదిమాడు. చేయి నొప్పిపెట్టింది.

రాత్రి చీకటిపడ్డాకగాని అలెక్సీ తనగదిని చేరుకోలేకపోయాడు. పడుకుంటే నిద్రపట్టలా తలగడదిండును తిరుగవేసి పడుకొన్నాడు ఒకటినుంచి వేయివరకూ లెక్కపెట్టి. తిరిగివెనుకకు లెక్కించాడు, తానెరుగున్న వారిపేర్లన్నింటినీ, వరుసగా ఆ తో మొదలు పెట్టేవాటినీ. ఇ తోనూ ఊ తోనూ ఈ విధంగా చెప్పుకొంటూ పడు కొన్నాడు. ఇంకా నిద్రరానన్నది. కళ్లురెండూ తెరుచుకొని ఆ కిరసనాయలు దీపవు గ్రుడ్డివెలుగులో ఇంటికప్పును చూస్తూ పడుకొన్నాడు. దాని ముండామోయా ఎంత యత్నించినా నిద్రరానని కూర్చున్నది. ఎప్పుడు కండ్లుమూసినా తా నెరిగినవారూ జరిగిన సంఘటనలూ కనిపించాయి! నెరిసినతలా. మునుపటికంటె మరింత పెద్ద వాడయినట్టున్నమిఖేల్ తాత తనవంకచూశాడు: ఆంద్రీడెగ్త్యారెంకో, పొడుగుపాటి కనురెప్పలున్నకండ్లుపప్పగించిచూశాడు; ఎవరిమీదోకోపపడుతున్న వాసిలీవాసిలివిక్.

తెల్లని తలగడ దిండుమీద మైనపుబొమ్మ మాదిరి పడుకొనిన కమిసారు వొరొబియావ్ తన పంక ఎగతాళిగా, నవ్వుతూ, నవ్విస్తూ, అంతా తన కర్థమైనట్టు చూచాడు. గాలిలో నెగిరే అగ్నిజ్వాలలవంటి తలజుత్తున్న జినోచ్కా కనుపించింది. నొమవ్ నవ్వు ముఖమూ, ఇంకా ఎందరెందరివో ముఖాలగుపించాయి. ఎంద రున్నారు, తా నంటే ఆదరణ గలవారు? ఇదంతా తలుచుకుంటే కడుపునిండి నట్టు లనిపించింది. ఈ ముఖాలతోచేరి ఓల్గాముఖంకూడా కనుపించింది. సన్నగిలి, అలిసిపోయి, ఎవరో వొక అబ్బాయి మాదిరి షర్టూ, పంట్లామూ తొడుగుకొని తన కేసి జాలిగా చూసింది. సాక్షాత్తూ తనముందామె నిలుచున్నదనే భ్రమపుట్టింది. ఇంతకుముం దెన్నడో ఆ కండ్లలో నే డగుపించినంత ఎక్కువ మమకారం తాను చూడలేదనుకున్నాడు. అదంతా నిజమేననుకొని, అదిరిపడి లేచికూర్చున్నాడు.

నిద్రపోవడాని కెంతసేపు యత్నించినా లాభంలేకపోయింది. రాననే నిద్ర నాహ్వానించట మెందుకనుకొని. దీపపువత్తిని రవ్వంత ఎగద్రోసి, నోటుపుస్తకం నుండి కాగితా న్నొకటి చింపాడు. పెన్సిలును సూదిమొనగా చెక్కి జాబు వ్రాయ టానికి ప్రారంభించాడు. మనస్సులోపుట్టే ఆలోచనల వేగంతో చేయి సరితూగ లేక పోయింది. కాబట్టే అక్షరాలంత వొంకరంగా కుదిరాయికావు.

"ప్రాణప్రదమైన. నా, ఓల్గా! నేడు ముగ్గురు జర్మనులను పడగొట్టాను. ఇదంత ముఖ్యమైన విషయం కాదు. ఎందుకంటే నా మిత్రులలో కొంద రీవిధంగా ప్రతిరోజూ ఇద్దరు ముగ్గురు వంతున జర్మనులను యమపురికి పంపిస్తున్నారు. కాబట్టి ఇందులో నా గొప్పతనమేదీలేదు. నాకు నా ప్రాణంకంటే నీ వంటే ఎక్కువ తీపి. ఇది నీకుతెలుసో, తెలియదో అబ్బా. ఎంతదూరంలోనుంటున్నావు? ఇప్పుడే, నీవు ఇక్కడికివస్తే ఎంత బాగుంటుంది! నేడు ఇన్ని దినాల అనంతరం ఈ రోజు పద్దెనిమిదినెలల క్రిందట సంభవించిన యుదంతమును నీతో చెప్పడానికి నిశ్చ యించుకొన్నాను. ఇంతవరకూ చెప్పనందుకు నన్ను క్షమించు. ఏమంటావు? ఈ దీనుని క్షమిస్తావుగా? ఈ విషయము నింతకుముందే నీకు చెప్పగల అర్హత నాకు లేకపోయిందంటే నామాట నమ్ము, నేడే నా కీ యోగ్యత కలిగింది...."

అలెక్సీ ఆలోచనానిమగ్నుడై వుత్తరంవ్రాస్తూ కూర్చున్నాడు. బల్లకూర్పు వెనుక ఎలుకలు పరుగెత్తటమూ. సందులనుండి ఇసుక రాలటమూతప్ప వేరెట్టి శబ్దాలుగానీ వినిపించాయికావు. బిర్చిచెట్లనుండి వచ్చే ఘాటువాసన, గడ్డిపూవుల తీపివాసనతో మిళితమై లోనికి వీచింది. దూరాన ఎక్కడో చక్రవాకపక్షి ఎలుగెత్తి పాడ నారంభించింది. ఇంకా దూరంనుండి బహుశా వైమానికోద్యోగుల భోజనాల గది కవతలనుండి కావచ్చు అక్షెట్టుపాట నెవరో పాడుతున్నారు. గాలిపై తేలుతూవచ్చిన ఈ పాట అలెక్సీ వీనులసోకి, ఆతనిని కలచివైచింది. తన వొంటరి తనాన్ని తీర్చగలవ్యక్తి ఎక్కడున్నదో, ఏమిచేస్తోందో? ఈ ఎడబాటు తీరి పోయెడి దినాలు వస్తాయా? తమ కోరికలు ఫలించేరోజులు. తాము కనిన కలలు నిజమయ్యేకాలం రానున్నదా?

చాలాదూరానికి సాగివెళ్లిన యుద్ధమూ, దాని ఫిరంగుల శబ్దమూ అస్పష్టంగా వినిపించాయి. చల్లని పిల్లగాలికి చలించే ఆకులశబ్దమూ, చకోరపక్షుల గానమూ వింటూ తా నెంతకాలం కూర్చున్నదీ అలెక్సీకే తెలియదు.

# తుది పలుకు

చాలా రోజులుగా జరుగుతూన్న ఓరియోల్ యుద్ధం జయప్రదంగా ముగిసే సూచనలగుపించాయి. ఉత్తరమందున్న క్రస్నాగ్రోస్కీ గ్రామ ప్రాంతపు కొండల నుండి చూస్తే పట్టణమంతా కాలిపోతున్నట్టు వున్నదంటూ సైనికవార్తలు వచ్చాయి. క్రియాన్స్కీ ప్రాంతమందున్న సైనిక కార్యాలయానికి, అచ్చటి పోరాడే వైమానిక రక్షకదళంవారు, గత తొమ్మిది దినాలలోనూ నలభై ఏడు జర్మను విమానములను కూలద్రోసారని వార్తవచ్చింది. తమవి ఐదు విమానములు మాత్రం పడిపోయాయి: ముగ్గురు వైమానికులు నష్టపడ్డారు. ఇద్దరు వైమానికులు క్రిందికి దుమికి తప్పించుకొని నడిచివచ్చారు. గొప్ప గొప్ప విజయాలు చేకూరే ఆరోజుల్లో కూడా ఇంతటి అఖండ విజయం మనవారికికలగటం మనకే ఆశ్చర్యం వేసింది. ఆ వైమానిక యోధులనూ, వారి దళమునూచూచి. వారితో మాట్లాడి 'ప్రవాదా' పత్రికకొక వ్యాసమును వ్రాయటానికి విమానమెక్కి బయలుదేరాను:

ఈ విమానాశ్రయ మొక గ్రామం చెంతనున్నది. అచ్చటి పొలములలో కొన్నింటిని, చెట్లునరికీ, గుట్టలూ, పొదలూ భూమట్టంచేసీ, చదునుపరిచారు. అచ్చటనున్న అడవికానుకొని నిలబడిన విమానాలు తల్లి పిట్టపంచను నిలబడిన కోడిపిల్లల మాదిరగుపించాయి. ఆ యుద్ధపు దినాలలో, అవసరాపసరంగా తయారు చేసినవిట్టి విమానాశ్రయా లనేకమున్నాయి. దీనిలో నెట్టి ప్రత్యేకతగానీ కనిపించలా.

మే మచ్చటికి చేరుకొనేటప్పటికి ప్రొద్దుకుంకే సమయమయింది, ఓరియోల్ ప్రాంతంలోని యుద్ధం బహుతీవ్రంగా సాగేరోజులవి. జర్మను విమానాలు బహు ఘోరంగా పోరు సలుపడానికి పూనుకోబట్టి మనవారికా రోజంతా చేతినిండా పని కలిగింది. ప్రొద్దుననుండీ యిప్పటికప్పుడే ఆరు పర్యాయములు దాడివెడలి తిరిగి వచ్చారు, మేమువెళ్లే సమయానికి ఏడోపర్యాయం వెళ్ళినవా రందరూ తిరిగి వస్తూన్నారు. అచ్చటి దళాధికారిని కలుసుకొన్నాను, సంగతులు తెలుసుకోవాలనే వుద్దేశంతో. ప్రొద్దున ఆరుగంటలనుండీ ఇంతవరకూ విమానాశ్రయంమీదే వున్నాడట. ఒక్క నిమిషమయినా తీరుబడిలేదు. స్వయంగా తానే మూడు పర్యాయములు పైకెగిరి వెళ్ళాడు. నిలుచోటానికికూడా వోపికే లేదన్నాడు, ఇక తక్కిన

పైమానాధికారులసంగతి యిట్టిదే. నిలబడి మాతో మంచీ, చెడ్డా మాట్లాడేస్థితిలో వొక్కడైనాలేడు. తెల్లవారితేకాని నేను వచ్చినవని నెరవేరదని తెలిసింది. తిరిగి వెళ్ళటానికి చాలా ప్రొద్దుపోయింది. అస్తమయశోభతో ఆకాశమంతా కనుల పండువగా కనిపించింది.

ఆఖరివిమానం దిగింది. దాని ఇంజనులింకా పనిచేస్తూవున్నాయి. తిన్నగా అడవివగ్గిరి వది నడిచివెళ్ళింది. అచ్చటి పనివారు దానిని గిర్రునత్రిప్పి మరునా వెగిరివెళ్ళటానికి సిద్ధంగా నిలబెట్టారు. తమ తమ విమానములు సురక్షితంగా నిలబడిన తరువాత అలిసిపోయి, పాలిపోయినముఖాలతో వైమానికులు క్రిందికి దిగివచ్చారు.

అన్నిటికంటే ఆఖరికిదిగిన విమానం మూడోదళపు కమాండరిది. అది నిలిచినతోడనే ఇంజనుగది పైకప్పును తొలిగించారు. నల్లటి సొగసైన ఎబొనీ చేతికర్ర. దానిమీద బంగారు అక్షరాలుకల దొకటి. ఎగిరివచ్చి క్రిందపడంది. విశాల వక్షమూ. పెద్ద నుదురూ. నల్లటి కాకిరెక్కలవంటి తలజుత్తూ, తిన్నని పాపిడీగల వ్యక్తి వొకడు విమానం రెక్కను చేత్తో బలంగాపట్టుకొని రెండు కాళ్లనూ ఇంజనుగదినుండి వెలుపలికి సాచాడు. రెండో చేత్తో విమానపు ప్రక్కనదిమి, ఒక్కపెట్టున క్రిందికిదుమికాడు. ప్రక్కనున్నవారిలో ఎవరో ఈ విమానదళంలో ఇతనికిమించిన యోధుడులేడన్నారు. వెంటనే అతన్ని కలుసుకుని మాట్లాడాలని తీర్మానించుకొన్నాను. సమీపించిన నన్ను తేరిపార జూచాడు. అట్టి నేత్రద్వయమును ముందెన్నడూ నేను చూడలేదనటం అతిశయోక్తికాదు. ఆ వొక్క చూపులో అలసటా, అద్వితీయాను భవజ్ఞానమూ, పసిబిడ్డ కళ్లలో విచితమయ్యే అమాయకత్వమూ, న్యూనతా గోచరించాయి. రవ్వంత నవ్వి - ఇదికావాలని తెప్పించుకొనిన కృత్రిమనవ్వు కాదనినా కిట్టేతెలిసింది——

“చచ్చిపోయేటంతగా అలిసిపోయాను. ఏపంతయినా వోపికలేదు. కాళ్లు తూలుతున్నాయి. తల తిరుగుతోంది,.... ఏదన్నాతిన్నావా, ఇక్కడికివచ్చాక ? లేదా ? సరే. నాతోభోజనాలగదికిరా. ఇద్దరం కలిసిభోజనంచేద్దాము. పడద్రోసిన శత్రువిమాన మొకటింటికీ రెండువందల గ్రాములచొప్పున చక్కని వోడ్కాను మాకు త్రాగటాని కిస్తారు. ఈ రాత్రి నా వంతుకు ఆరువందల గ్రాములురానున్నది. ఇది మనకు సరిపోతుందిలే వస్తావుగా ? తింటూ మాట్లాడుకోవచ్చు. త్వరగారా. వెళ్ళిపోవాలని చెప్పులలో కాళ్ళు పెట్టుకొని కూర్చున్నావు. రా. వెడదాం,” అన్నాడామనిషి.

వెంటనే సమ్మతించాను. చనువుగా, మనసువిప్పి మాట్లాడే ఈతడంటే నాకెంతో ముచ్చటయింది. కాలిబాటంటే, అడవిదారిని వెళ్లాము. అతడు చరచకా నడుస్తూ దారిలో నచ్చటచ్చట కనిపించిన బిల్బెర్రీ పండ్లునూ, వార్టొర్ బెర్రీ పండ్లనూకోసి నోట్లో వేసుకొన్నాడు. పాదాలు బరువుగా పడటాన్నిబట్టి చాలా

అలిసిపోయాడని గ్రహించాను. కాని చేతికర్రమీద బరువును మోపకుండా, చకచకా నడిచాడు. ముంజేతికి దానిని తగిలించుకొని, ఎప్పుడో ఒకప్పుడు కంటి కగుపించిన ఏకుక్క గొడుగునో దానితో నొకదెబ్బతీసాడు. దారిలో మాకొక ఎత్తయిన గుట్టతగిలింది. దాని అంచున కెగబ్రాకట మాతనికి కష్టమయింది. అప్పుడుకూడా తన చేతికర్ర నుపయోగించలా, అక్కడా అక్కడా పెరిగేచిన్న మొక్కలను పట్టుకొని, ఊతగొని పై కెగబ్రాకాడు.

భోజనాల గదిని చేరటంతోటే ఆతని అలసటంతా మటుమాయమై పోయింది. అస్తమయ సౌందర్యమును చూస్తూ ఒకకిటికీచెంత కూర్చున్నాడు. ఎఱ్ఱటిరంగు క్రమ్మిన ఆకాశమును చూసి మరునాడు బలంగా గాలి వీస్తుందంటారని చెప్పాడు. ఒక పెద్దలోటాడు నీరుత్రాగిన తరువాత ఆతని ప్రాణం చల్లబడింది. బల్లదగ్గిరికి వడ్డించడానికొక అందమైన అమ్మాయి రావటంచూసి చిరునవ్వునవ్వి ఆమెతో హాస్యాలాడాడు. ఆమె స్నేహితుడొక వైమానికుడు ఆస్పత్రిలోనున్నాడు. ఎప్పుడూ అతనిమీదే ధ్యానమంతా పెట్టుకొనడంవల్ల కలగాపులగంగా తమ కందరికీ వడ్డిస్తుందని ఎగతాళిచేసాడు. చాలా ఆకలివేసింది కాబోలు పెట్టినదంతా ఎంతో ఆప్యాయంగా తిని, ఎముక నొకదానిని తనివితీర కొరికి చప్పరించాడు. ప్రక్క బల్లచెంత కూర్చొన్న మిత్రులతో పిచ్చాపాటీలాడి, మాస్కోలోని విశేషా లేమిటని నన్నడిగాడు. కొత్త పుస్తకాలూ, నాటకాలూ, నృత్యాలను గురించి నన్నడిగి, తా నింతవరకూ మాస్కో నగరంలో నొక్క నాటకశాలకయినా వెళ్ళలేదని విచారపడ్డాడు. బిల్బెర్రీ పండ్ల మురబ్బాను తింటూ, దీనికి వైమానికులు "కారు మేఘ మ"ని పేరుపెట్టారని చెప్పాడు. తరువాత :

"ఈ రాత్రికి బస నేర్పాటుచేసుకొన్నావా ?" అని అడిగి, "లేదా, మరేము మించిపోలేదు. నాతోవచ్చి మా భూగర్భగృహంలో పడుకో"మని ఆహ్వానించాడు. రవంత ఆగి, ముఖం చిట్లించుకొని "నా గదిలోనుండే రెండో మనిషి నేడు తిరిగి రాలేదు...పడుకోటాని కొక ఖాళీజాగా వున్నది. ఉతికిన దుప్పట్లు రెండుమూడు కూడా వున్నాయి. రా, వెడదామం"టూ లేచాడు.

కొత్తవారిని చూస్తే మాట్లాడటమూ, అనేక ప్రశ్నలడిగి ఎన్నెన్నో విషయములను తెలుసుకొనటమంటే ఆతనికి ఇష్టమని నాకు తోచింది. సరే, అతనితో వెడితే నేను వచ్చినపని సానుకూలమవుతుందిగదా అనుకొని ఆతనివెంట వెళ్ళాను. ఇద్దరమూ ఆతని గదిని సమీపించి లోపలికిదిగి వెళ్ళాము.

అందున్న "స్టాలిడ్ గ్రాడ్కా" దీపపువత్తిని పై కెగద్రోసాడు. ఆ వెలుతురులో గది బాగా విశాలంగా నున్నట్లూ, చాలా కాలంగా ఇందులో మనుష్యులు నివసించినట్టూ నాకు తోచింది. గది గోడలలో చెరొకప్రక్కా పడుకోటానికి త్రవ్విన పొడుగూ, వెడల్పాగల రెండు అలమారులున్నాయి. క్రిందనొక కంబళిని

పరచి మెత్తని గడ్డ పైన పరిచారు. పచ్చని ఆకులున్న చిన్న బర్చికొమ్మలు రెండు మూడు తావులలో అలంకరించబడ్డాయి. వాటి తీయిని, ఘాటువాసన కొరకప్పు డప్పుడీ కొమ్మలను తెచ్చి పెట్టుకొంటామని చెప్పాడాయన. ప్రతి వొక్క మంచం దగ్గిరా, గది గోడలో అలమా రొకటి త్రవ్వారు. వాటిలో వార్తాపత్రికల కాగితాలను పరిచి, పుస్తకాలనూ, పండ్లు తోముకోడానికీ, తల దువ్వుకోడానికీ, షౌరం చేసుకో కావలసిన వస్తువుల నేర్పాటు చేసుకొన్నారు. ఒక మంచానికి తల చెంతగా రెండు ఫొటోలున్నాయి. క్రిందపడిన విరోధుల విమానాలాలనుండే సేకరించిన వస్తువుల నుపయోగించి రకరకాల వస్తువులను తయారు చేస్తారు, తీరిక వున్నప్పుడల్లా వైమానికులందరూ. అట్టివి రెండు చట్రాలల్లో ఫొటోలు అమర్చబడ్డాయి. బల్లమీద నున్న వొక డబ్బానిండా సువాసనగల రాస్ప్బెర్రీ పండ్లు, వాటిపైన బర్డాక్ ఆకొకటి కప్పబడింది. ఇవన్నీ కాక, నేలమీద సూదులవంటి పైన్ఆకులు పరచ బడ్డాయి. ఆ గదంతా వీటి వాసనలన్నీ చేరి బహు మధురంగానూ ఘాటుగానూ వాసన వేస్తోంది. దూరంనుండి మిడతల శబ్దం వినవచ్చింది. కాళ్ళు జాపుకొని చల్లగా పడుకోవాలనీ, తెల్లవారాక మాట్లాడుకోవచ్చుననీ నే ననుకొన్నాను.

ఆ వైమానికుడు బయటికివెళ్ళి పండ్లుతోముకొని, ముఖంకడుకొన్నాడు. ముఖముమీదా, నెత్తిపైనాపోసీ కడుగుకొన్న నీటిబిందువులతో. చేతులు తుడుచు కొంటూ లోపలికివచ్చాడు. దీపపు వత్తిని దిగద్రోసి బట్టలు మార్చుకొన్నాడు. ఏదో దభీలుమని పడినశబ్దం, అదేమిటోనని చూసాను. నా కండ్లను నేనే నమ్మజాలక పోయాను. అతని పాదాలు రెండూ అంతదూరాన నేలమీదకనిపించాయి ! పాదాలు లేని వైమానికుడు ! యుద్ధంలోవిమానంనడిపి నలుగురిలో పేరు సంపాదించు కొన్నాడు ! ఆ ఒక్కరోజులో ఏడుపర్యాయములు ఎగిరివెళ్లాడు ! మూడు శత్రు విమానములను నేలకు దిగద్రోసాడు ! ఏదోవొక కట్టుకథ మాదిరున్నదిదంతా ! !

కాని, నా కండ్లు కగుపించేదానిని నమ్మకుండా వుండటానికి వీలులేక పోయింది. రెండుపాదాలు, కృత్రిమపాదాలు, వైమానిక బూట్సులుతొడిగినవి నేలమీద కనుపిస్తోంటే కాదనటానికి వీలులేదుగా ! అతని మంచంక్రిందనున్న ఆపాదాల జంటనుచూస్తే ఏమనిషో దానిక్రిందపడుకొని వున్నట్టులవి అగుపించాయి. నేనీవిధంగా ఆశ్చర్యపడుట మాతడుచూసి, నవ్వుముఖంతో :

"వాటినింతకుముందే కనిపెట్టావని నేననుకొన్నాను" అన్నాడు.

"కలలోనయినా...."

"నీవావిధంగా అనటం నాకెంత సంతోషంగానున్నదో నీకు తెలియదు. నీ.కింతవరకూ ఈ సంగతి నెవ్వరూచెప్పలేదా ? ఇక్కడ కూడా, లోకంలో ఇతర ప్రదేశాలలోమాదిరే, వాగుడుగాండ్రున్నారు. కొత్తమనిషి, అందులోనూ 'ప్రవదా' పత్రికా విలేఖరి వొకడు వచ్చాడని తెలిస్తే, వెంటనే 'పాదాలులేని వైమానికుని' గురించి చెప్పకుండా వుండలేరు."

"ఇది నమ్మశక్యంకాని సంగతి. ఏమంటావు? యుద్ధవిమానం మెక్కి-పోరాడటానికీ, పాదాలు లేకపోవటానికీ పొత్తు కుదరనంటుంది! వైమానిక చరిత్రలో యింతకుపూర్వ మిట్టిచోద్యం జరగలేదు. ఎవ్వరూ కనీ, వినీ ఎరుగరు. ఇది నలుగురికీ తప్పకుండా తెలియజెప్పదగిన విషయం".

ఆ వైమానికుడు చటుక్కున ఈలవేసి,

"వైమానికచరిత్రా! దానికింతవరకూ తెలియని వనేక విషయాలను మన సోవియట్ వైమానికులు తెలియజెప్పుతున్నారు. ఇందులో సంతోషపడటాని కేమున్నదో నాకు తెలియకున్నది. నిజంపాదాలతో యెగరటంలోనుండే పసందు వీటిలో లేదంటే నామాటను నమ్ము. కాని గత్యంతరం లేనప్పు డిదేగతి. ఇంత కంటే దీనిలో విచిత్రమేదీ లేదు....ముందెవ్వరుగానీ యీ విధంగా చేయలేదన్నది నిజంకాదు."

అప్పుడనున్న పుస్తక మొకదానినుండి ఏదో వొక వార్తాపత్రికనుండి చింపిన కాగితమునుతీసి నాచేతి కిచ్చాడు. అది బాగా నలిగి, చినిగిపోయినందున విడివిడిగా పడిపోకుండా దాని కొక వుల్లిపొరకాగితము నంటించాడు. ఒక పాదంలేని వైమానికు డొకతను విమానమును నడిపాడన్న యుదంత మందు ప్రకటింపబడింది.

"అతని దొక పాదముమాత్రమే పోయింది. ఇంతేకాదు, యుద్ధవిమానము నాతడు నడిపించలేదు. పురాతనమైన 'ఫార్మన్' విమానమది" అని నేనంటే అతను సగర్వంగా,

"నేను సోవియట్ వైమానికుడి నన్న విషయం మరిచిపోరాదు. ఇట్లా అంటున్నందుకు నే నేదో డబ్బా వాయిస్తున్నానని అనుకోవద్దు. ఈ మాటలు నే నన్నవికావు. చాలా మంచివాడు, సిసలైన మనిషి వొకాయన అనినమాటలివి" అన్నాడు. 'సిసలైన' అనే పదమును నొక్కి వక్కాణించాడు. "ఆ వ్యక్తి చనిపోయాడు."

పై మాట లనేటప్పు డాతని ముఖమెంతో మారిపోయింది. పెళాలమైన అతని నుదుటిమీద విషాదచ్ఛాయ లగుపించాయి. కండ్లు మిరుమిట్లుగొలిపి, ముఖ మంతా వింత తేజస్సుతో వెలిగింది. పదేండ్లు తక్కువ చిన్నవాడిమాదిరి కను పించాడు. ఇంతవరకు ఏ నలభయ్యేండ్లో వుంటాయని నే ననుకొన్న ఈ మనిషికి పాతికేండ్లయినా నిండలేదని వినగానే నా కెంతో ఆశ్చర్యం కలిగింది.

"ఇదంతా ఎప్పుడు, ఎక్కడ జరిగిందని నలుగురూ నన్నడిగితే, నాకు తల నొప్పి పెడుతుంది... కాని, ఆ విషయాలన్నీ నా కిపుడు జ్ఞప్తికి వస్తున్నాయి... నీతో నా కింతవరకూ ఎట్టి పరిచయంగానీ లేదు. రేపు నీవు వెళ్ళిపోతే తిరిగి కలుసుకొంటామని చెప్పటానికే వీలులేదు... వినాలనివుంటే, ఈ పాదాల కథను చెబుతా"నన్నాడు.

తన మంచంలో నిండుగా కంబళి కప్పుకొని కూర్చుని, జరిగిన విషయము లన్నిటినీ పెద్ద కథమాదిరి చెప్పాడు. తనకు తానే జరిగిన విషయాలను గురించి చెప్పుకొంటూన్నట్లు, నే నక్కడ నున్నాననే విషయమునే మరిచిపోయి, గతాను భవాలను జ్ఞప్తికి తెచ్చుకొంటూ కథను సాగించాడు. పూసగ్రుచ్చినట్లూ, బహు చమ త్కారంగానూ, ఆవేశపూరితంగానూ చెప్పే ఆ కథను వింటూంటే, తాను వర్ణించే ప్రతివాక్క సంఘటననూ తిరిగి ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడని నాకు తోచింది. అపూర్వమైన జీవితగాథ నొకటి నేను వినబోతున్నాననీ, ఇటువంటి సందర్భం తిరిగి నాకు చిక్కదనీ అనుకొని, అతని బల్ల మీదనున్న "మూడో వైమానిక దళం - దైనందిన యుద్ధజాబితా" అనే పుస్తకమును తీసుకొని వ్రాసుకోడానికి మొదలు పెట్టాను.

వెలుపల చాలా నిశ్శబ్దంగా నున్నది. గదిలోని దీపం చిటపటలాడుతూ వెలుగుతోంది. దాని కాంతి కాకర్షింపబడివచ్చి చుట్టూ తిరిగి, రెక్కలుమాడి చని పోయిన శలభము లనేకం దానిక్రింద కుప్పగా పేరుకుపోయాయి. దూరంనుండి ఎవరో వాయిస్తూవున్న తంతీ వాయిద్యగానం హీనంగా వినబడింది. అదీ నిలిచి పోయింది. చెట్లల్లో వీచే గాలీ, ఒంటరిపాటుగా కూర్చున్న గుడ్లగూబ కూతా, కప్పల బెకబెకలూ, మిడతల శబ్దాలూ తప్ప, వేరెట్టిదీ వినబడిందికాదు. తాపీగా తన జీవితగాధను ఎదుటి మనిషి చెప్పుతూ పోయాడు.

ఇటువంటి విషయా లొక మనిషి జీవితంలో జరుగుతాయనీ, జరుగగలవనీ నే నెన్నడూ అనుకోలేదు. వీలయినంతవరకూ విన్నదంతా వ్రాయటానికి శక్తి వంచన లేకుండా యత్నించాను. ఆ పుస్తకము పూర్తి అయింది. మరొక పుస్తక మును తీసుకొన్నాను. అప్పుడే తెల్లవారిందన్న సంగతే నాకు తెలిసిందికాదు. కాలం పరుగెత్తుతుంటూ వెళ్ళింది; రిక్తోఫెన్ దళానికి చెందిన మూడు విమానాలను పడగొట్టటం వరకూ చెప్పి, తన జీవిత గాధను ముగించాడు. తెల్లతెల్లవారే సమ యానికి, నలుగురి మాదిరి తానూ వొక వైమానికుడనని అనిపించుకోడానికి తన కిప్పుడే అర్హత కలిగిందన్నాడు, ఎంతో సవినయంగానూ, నమ్రతతోనూ.

"మాట్లాడుతోంటే నా కేదీ తెలిసిందికాదు. అప్పుడే తెల్లవారబోతోంది. తెల్లవారటంతోటే, ఇంతకాఫీ త్రాగి తిరిగీ పైకెగిరి వెళ్ళాలి" అంటూ నిలిపి వేశాడు. "నీకు విసుగుపుట్టించానేమో? క్షమించు. వెళ్ళి కొంత కన్నుమూస్తా నం"టూ లేచాడు.

"వెదుదుపుకానిలే. ఓల్గా సంగతి? ఆమె నీకేమని బదులు వ్రాసింది?" అని అడిగాను కాని ఇది నే నాతని నడుగవలసిన ప్రశ్న కాదని వెంటనే నాకు తెలిసింది. "క్షమించు. బహుశ నిన్నామాదిరి అడగటం తప్పేమో? నాకు తెలియదు నీకు ఇష్టం లేకపోతే బదులు చెప్పనక్కరలేదు...."

ఆ వైమానికుడు నవ్వి, "తప్పేమున్నది ? మేమిద్దరమూ దాదాపు వొకే రకం మనుష్యులం. రవంత పిచ్చివాళ్ళం. నన్ను గురించిన విషయాలన్నీ ఆమెకు వెంట వెంటనే తెలిసాయి నేను వ్రాయలేమకాని, నా స్నేహితుడు, దెగ్త్యారెంకో, నేను క్రింద పడటమూ, పాదాలను ఛేదించడమూ, అన్నీ వ్రాసాడట. నా కిదంతా చాలా కాలం వరకూ తెలిసిందేకాదు. నేనే స్వయంగా తన కీవిషయాలను గురించి వ్రాయనందున, నా నిజస్థితి నామెకు తెలుపడానికి నేను జంకుతున్నానని గ్రహించింది. తన కీ విషయాలెవ్వీ తెలియనట్టే నటించింది. ఒకరి నొకరం మోసగించుకొంటూ చాలా రోజులు గడిపాము. మే మెందు కీ విధంగా వర్తించామో, ఆ దేవుడికే తెలియాలి !.... ఓల్గా ఫొటో వొకటి నా దగ్గర వున్నది, చూపించనా ? "అంటూ లేచి దీపాన్ని పెద్దది చేశాడు, తన తలమాటున గోడకు తగిలించిన రెండు ఫొటోలూ కనబడేటట్టు దీపమునెత్తి పట్టుకొన్నాడు. ఒకటి చాలాకాలం క్రితంతీసిన పటంకాబోలు, అస్పష్టంగా కనిపించింది. నవ్వుతూన్న బాలికొకతె, పూవులగౌను తొడుగుకొని వొకపడిపోయిన స్తంభముమీద కూర్చున్న చిత్రమది. రెండోది, అదే అమ్మాయిది మరొక చిత్రం. జూనియర్ లెఫ్టినెంటు దుస్తులూ, తెలివైన ముఖమూ, రవంత చిక్కినట్టూవున్నది. ఆ దుస్తులు తొడుగుకొనటంవల్ల, చక్కని కనుముక్కుతీరుగల ఎవరో పడుచు కుర్రవాడిమాది రగుపించింది. అలిసిపోయిన ఆ కండ్లూ, వాటిలో వ్యక్తమయ్యే సహజసోయగమూ ఇదొక బాలికచిత్రమనే విషయమును చెప్పక చెబుతున్నాయి!"

"బాగున్నదా ?"

"చాలా బాగున్న ద"న్నాను : ఇందులో విసుమంతయినా అతిశయోక్తిలేదు. నిజంగానే చాలా బాగున్నది.

"నావుద్దేశం కూడా అదే" నంటూ నవ్వాడు.

"మరి, స్ట్రిఖొవ్ సంగతి? ఎక్కడున్నాడు ?"

"నాకు తెలియదు. గడిచిన చలికాలంలో వొకజాబు వ్రాసాడు, ఎక్కడో ల్యూకేదగ్గిరనున్నట్టు. తరువాత తిరిగీ వుత్తరంరాలేదు"

"ఆమనిషి ?....టాంకుదళాధికారి ? పేరుమరిచి పోయాను".

"గ్రీషాగ్వొజెవ్. ఇప్పుడాతడొక మేజరుగా నుంటున్నాడు. ప్రొఖొరోవ్కా యుద్ధంలో పాల్గొన్నాడు. తరువాత కుర్స్క్ యుద్ధసమయంలో జర్మను సైన్యంలో చొరబడిన మన టాంకుదళపు యోధులలో నితడొకడు. నేనుకూడా అప్పుడదే ప్రదేశంలో నున్నప్పటికీ మేమొకరినొకరం కలుసుకోలేకపోయాము. ఇప్పుడేదో వొకటాంకుదళాని కధికారిగానుంటున్నాడు. చాలా రోజులుగా వుత్తరాలు రాలేదు. ఎందుకనో నాకు తెలియకున్నది. కాని, ఫరవాలేదు. ఇద్దరమూ బ్రతికేవున్నాము కాబట్టి, తప్పకుండా త్వరలో కలుసుకొంటాము....నాకిది బాగా

తెలుసు. ..సరే, ఇప్పటికీమాటలు చాలించాలి....వెళ్లి తలవ్రాల్చి. రవంత నిద్ర పోవటం మంచిది !"

దీప మార్పివేసాడు. గదంతా చీకటి క్రమ్ముకొన్నది. వెలుపల తెల్లవారుతూన్నప్పటికీ.

"దీనినంతా, అంటే నిన్నుగురించి 'ప్రవదా'లో వ్రాయాలని నా కున్న ద"న్నాను.

"అట్లాగే చేయమ"న్నాడు, తనకు ఏది సంబంధంలేనట్టు. కొంతసేపయిన తరువాత నిద్రమత్తుగా "వ్రాయకపోవటమే మంచిదనిపిస్తోంది. ఆ గోబెల్సు దీనినంతా విచిత్రంగా మార్చి లోకానికి చాటుతాడు. పాదాలులేనివారిని కూడా బలాత్కారంగా యుద్ధంలోకి దింపుతున్నారు రష్యనులంటూ అల్లరిచేస్తాడు. ఈ ఫాసిస్టుగాడిద కెంతటికైనా తెగించగలదు" అన్నాడు.

మరునిమిషమే గురకపట్టి నిద్రపోయాడు. నాకు నిద్ర రానన్నది. అతను చెప్పిన యీ కథ; కాదు కాదు. వాస్తవిక జీవితగాథను గురించి ఏమనిచెప్పాలో నాకు తెలిసిందికాదు. అంత నిర్మలమైనదీ, అమాయకత్వంతో కూడుకొన్నదీ ఈ చొక్క జీవితమేగాని, మరొకటి అటువంటి దుండదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇదంతా ఏదో చొక కట్టుకథమాదిరి వున్నది. కాని ఇది నూటికి నూరుపాళ్ళు నిజమైన దనడానికి తార్కాణంగా కథానాయకుడు నాచెంత పడుకొని నిద్రిస్తున్నాడు. మంచంక్రింద నున్న అతని కృత్రిమపాదాలు చల్లబడి వాటిపై మంచుబిందువులు పేరుకొంటున్నాయి.

తిరిగి నే నీ అలెక్సేని కలుసుకోలేదు. యుద్ధసమాచారములను సేకరించటానికి నే నెన్నో తావులకు వెళ్లాను. ఎక్కడికి వెళ్ళినా ఆనాడు వ్రాసిపెట్టుకొనిన రెండు నోటుపుస్తకాలూ ఎప్పుడూ నాతోనే వుండేవి. యుద్ధంజరిగే ఆ రోజుల్లోనూ, తిరిగీ యుద్ధం ముగిసినపిదపా, యిరోపాలోని దేశదేశాలూ తిరిగేటప్పుడూ ఈ కథను వ్రాయాలని యత్నించాను. కాని, నేను వ్రాసినది నా కెంతమాత్రం కూడా నచ్చిందికాదు. అలెక్సే జీవితగాథలో నున్న సౌందర్యమూ, నిండుతనమూ, అమాయకత్వమూ, మానుషత్వమూ నా కధలో, నా వ్రాతలో వెలితిబడ్డాయని నాకు సంతృప్తి కలిగిందికాదు.

న్యూరెంబర్గు నగరంలో అంతర్జాతీయ సైనిక సమావేశం జరిగింది. దానికి నేనూ వెళ్ళాను. హెర్మన్ గొయరింగ్‌ను ప్రతివాది తరపున ప్రశ్నించటం చాలా భాగం పూర్తిఅయింది. "రెండో నంబరు జర్మనీవాడని" విర్రవీగిన గొయరింగ్ తున సోవియట్ ప్రతివాదుల చేతుల్లోపడి నలిగిపోయాడు. "అద్వితీయమైన నాజీ సైన్య"మంటూ దిగంతములా చాటిన జర్మను సైన్యం రూపుమాసిపోయిందనీ, ఫాసిజమూ — దాని సిద్ధాంతాలూ ఛితికిపోయాయనీ పండ్లు పటపట కొరుకుతూ, తల

వంచి గొయరింగ్ తుదకు వొప్పుకోవలసి వచ్చింది. జర్మనీ పతనానికి రష్యను సైన్యాలే కారణమని ఆత డంగీకరించినప్పు డాతని కండ్లు నిప్పులను రాల్చాయి; గొంతునుండి మాట పెకలించుకొని రాలేకపోయింది చివరికి జర్మనులకూ, తేతులారా తెచ్చిపెట్టిన యీ షోభకూ ఎటువంటి సంబంధమూ లేనట్లు, ఎలుగెత్తి పైకి చూస్తూ "అంతా దైవచిత్తం" అన్నాడు :

"మోసగించి రష్యామీద పడటం మూలంగా ఓటమికి బదులు, జర్మనీ దేశ వినాశనానికి దారితీశావన్నది అంగీకరిస్తావా ? మీరు చేసిన ఈ పాపకార్యానికి పరిహారమంటూ లేదని వొప్పుకొంటావా ?" అని ప్రశస్త సోవియట్ న్యాయవాది రోమన్ ర్యూడెంకో ఎత్తిపొడిచాడు.

తల క్రిందికి దించి, ముఖం చిట్లించుకొని గొయరింగ్ నెమ్మదిగా వొక్కొక్క మాటా తూచితూచి ఈ విధంగా పలికాడు : "అదొక పాపకార్యం కాదు; గొప్ప పొరబాటు. మేము తగినంత జాగ్రత్త తీసుకొనకపోవటమే మేము చేసిన పొరబాటు. యుద్ధాన్ని గురించిన విషయాలన్నీ మాకు పూర్తిగా తెలుసునని అనుకొన్నాము. కాని, యుద్ధం సాగేకొలదీ మా అభిప్రాయం సరియైనదికాదని విదితమైంది. మా కంతకు పూర్వం తెలియనివీ, మే మూహించుకోనట్టివీ కొన్ని విషయాలు బయల్పడ్డాయి. వీటన్నిటిలోనూ ముఖ్యమైన విషయం రష్యను ప్రజలు, వారి స్వభావంకానీ, గుణగణాలుగానీ మా కేమాత్రమూ తెలిసాయికావు. వారి నింతకుపూర్వ మెవ్విధంగా గ్రహించుకోలేకపోయామో, ఇప్పుడు కూడా రష్యాదేశపు ప్రజల తత్వం మాకిసుమంతయినా బోధపడకున్నది. ఎందరెందరో పేరుపొందిని వేగులవారిని పంపించాము. కాని వారిలో నొక్కరికయినా రష్యనుల నైతిక బలమును గురించిగానీ వారెంతవరకూ సంసిద్ధులైయున్నదీ తెలిసిందికాదు. వారికి ఎన్ని ఫిరంగులున్నాయో ఎన్ని విమానాలూ, టాంకులూవున్నాయో అనే విషయాలను గురించి నేనీమాట అనటంలేదు. అట్టి విషయాలన్నీ మాకు ఇట్టే తెలిసాయి. ఇదేమాదిరి రష్యనుల యంత్రాగారాలను గురించిన సంగతులన్నీ మాకు తెలిసాయి. మాకు తెలియనిదల్లా రష్యను ప్రజాస్వభావం, రష్యను జాతియొక్క యథార్థతను తెలుసుకోవాలని యత్నించి విఫలతనొందిన వారెందరోవున్నారు, మాకూ అగతేపట్టింది. నెపోలియను వారిని గ్రహించుకోలేక పోయినట్టే, మేమూ గ్రహించుకోలేకపోయాము. అతనికి జరిగిన పరాభవమే మాకూ జరిగింది."

గొయరింగ్ "రష్యను ప్రజాతత్వమును" "గ్రహించటం" తమకు సాధ్యపడలేదని "చెంపలు వేసుకొనటమూ", "అంతుచిక్కని రష్యను యుద్ధ సంసిద్ధతను" గురించి చెప్పటమూ వినిన మాకందరికీ చెప్పనలవికానంత సంతోషం కలిగింది. ఆతడన్నట్టు ఇంతవరకూ రష్యను ప్రజానీకం యొక్క శక్తిసామర్థ్యాలూ, నేర్పరితనమూ, ధైర్యసాహసాలూ, త్యాగశీలతమా గ్రహించగలిగివారు ఏకొద్దిమందో వున్నారన్నమాట అక్షరాలానిజం. జర్మనులంతే "దేవతాస్వరూపులైనే

వెర్రిసిద్ధాంతమును లేవనెత్తిన పెద్దలకు, సామ్యవాదతత్వము నుగ్గుపాలతో పుచ్చుకొనిన రష్యను జనుల మనోబలమూ, ఆత్మవిశ్వాసమూ అర్థము కాకపోవటంలో ఆశ్చర్యమేదీ లేదు. నాకప్పు డకస్మాత్తుగా అలెక్సీ జ్ఞప్తికివచ్చాడు. ఆతనిరూపం. సాక్షాత్తూ అతడేవచ్చి నాయెదుట నిలుచున్నట్టు నాకగుపించింది. ఫాసిస్టులకు పుట్టిన ఇల్లయిన ఆ న్యూరెంబర్గు నగరంలో, ఆ నలుగురి మధ్యా కూర్చున్న నాకు, సాటిలేని అలెక్సీ జీవితగాధను లోకాని కంతకూ తెలియ జెప్పాలనే ఆవేశం కలిగింది. కీసెల్ సైన్యాలను హతమార్చి, గొయరింగ్ విమానదళమును రూపుమాపి, రొయడర్ నౌకలను సముద్రపు టడుగు తములకు పంపించిన లక్షలాది రష్యను జనులలో నొకడయిన ఈ అలెక్సీ చరిత్రను ఎంత చెప్పినా తనివితీరదని నాకు దృఢాభిప్రాయం కలిగింది. బందిపోటు దొంగల గురువైన హిట్లరు తిరిగీ పైకిరాకుండా చావు దెబ్బలుకొట్టిన లక్షలాది రష్యను జనుల యదార్థస్వరూపమును వ్యక్తపరిచిన అలెక్సీ యొక్క జీవితగాధను, నలుగురూ, తరతరాలుగా పాడుకోవాలని నా కెంతో మనస్సు పుట్టింది.

పసుపుపచ్చ అట్టగల నోటు పుస్తకాలు రెండూ నా దగ్గిరే వున్నాయి. వాటిలో నొక దానిపై "మూడో వైమానిక దళం – దైనందిన యుద్ధ జాబితా" అని అలెక్సీ వ్రాసిపెట్టిన వాక్యమున్నది, న్యూరెంబర్గునుండి ఇంటికిరాగానే, అలెక్సీ చెప్పగా విని వ్రాసుకొనిన విషయాలన్నిటినీ మరొకసారి చదివాను. ఉన్న దున్నట్లుగా వ్రాయడానికి మరొక పర్యాయం మొదలు పెట్టాను.

గత నాలుగు సంవత్సరాల కాలంలో అప్పుడాతడు చెప్పిన కొన్ని విషయాలను మరిచిపోవటం సంభవించింది. ఇంతేకాదు. అలెక్సీ చెప్పేటప్పుడాతని వాక్సుధామృతమును గ్రోలుతూ, మైమరచి అన్ని విషయాలనూ వ్రాసుకోలేక పోయాను. స్వాభావికంగా తన్ను గురించి తానే చెప్పుకోడానికి వెనుదీసే అలెక్సీ నా కెన్నో విషయాలను చెప్పలేదని నాకు బాగా తెలుసు. ఇది తీరనిలోటు. దానిని తీర్చగల శక్తి నావంటివాడికి లేదు. తన స్నేహితులను గురించి బహు విపులంగా చిత్రించిన విషయాలెన్నో నా కిపుడు జ్ఞప్తికిలేవు. కావాలనే అతని పేరునూ, అతనితోపాటు కష్టసుఖాలనుభవించి, నిరంతర కీర్తిని సంపాదించిన అలెక్సీ స్నేహితుల పేర్లనూ మార్చి వ్రాశాను. దీనికి వారు నన్ను క్షమిస్తారని, ఆశిస్తు న్నాను. క్షమించాలని ప్రార్థిస్తున్నాను,

ఈ పుస్తకానికి, "జీవన సమరం" అని పేరు పెట్టాను. అలెక్సీ ఒక సిసలైన సోవియట్ మనిషి, అలెక్సీ వంటి సోవియట్ వ్యక్తులను హెర్మన్ గొయరింగ్ అర్థం చేసుకోకుండానే చనిపోయాడు. ఎప్పటి లోక చరిత్ర నప్పుడే మరిచిపోయే మేధావంతులకు పట్టెడి గతియే గొయరింగుకూ సంప్రాప్తించింది. ఒకప్పటి నెపోలియనూ, ఇప్పుడు హిట్లరూ త్రొక్కిన తప్పుడుదారినే

త్రోక్కాలనే వెర్రినాగమ్మ లింకా వున్నారు. ఇట్టివారికి కలిగే జీవితానుభవమంతా బూడిదలోపోసిన పన్నీరువంటిది.

ఈ "జీవన సమరం" వ్రాయడానికి సత్యమును తెలియచెప్పాలన్నదే కారణం. ఈ పుస్తకమంతా వ్రాశాక అచ్చు కొట్టించేముందు కథానాయకునికి చూపించాలని ఎంతో అనుకొన్నాను. కాని యుద్ధ గందరగోళంలో అత నెక్కడున్నదీ తెలిసిందికాదు. నాతోపాటు అతని నెరుగొన్న వైమానికులకుగానీ, యుద్ధ కార్యాలయంవారికిగానీ అలెక్సీనిగురించి చెప్పడానికేదీ లేకపోయింది. ఎక్కడున్నదీ వారెరుగమన్నారు.

ఈ కథంతా వొక వారపత్రికలో భాగాలుగా ప్రచురింపబడుతోంది. ఎప్పటి కథ నప్పుడు రేడియోలో చదివి వినిపిస్తున్నారు. ఒకనాటిప్రొద్దున నా టెలిఫోను రింగ్ రింగ్న మ్రోగింది. దాని నెత్తి పట్టుకోగానే,

"నిన్నొకపర్యాయం కలుసుకోవాలి" అన్న మాటలు వినబడ్డాయి.

"ఎవరా మాట్లాడుతున్నది?"

"రక్షకసైన్య మేజర్ అలెక్సీ!"

ఆనాటి మధ్యాహ్నం అలెక్సీ నా గదిలోకి వచ్చాడు. ఎలుగుబంటి నడిచినట్టు రవంత ప్రక్కలకూగుతూ చకచకా నవ్వుకొంటూ వచ్చాడు. ఈ నాలుగు సంవత్సరాల్లో అతనిలో నెట్టి మార్పులుగానీ కలగలేదని చూడగానే విదితమయింది.

"నే నేదో వొక పుస్తకం చదువుతూ కూర్చున్నాను. ఎవరో రేడియోను త్రిప్పారు. అదేం చెబుతోందో నేను వినిపించుకోలేదు. ఉన్నట్టుండి మా అమ్మ "ఒరేయ్, అబ్బాయీ! విన్నావా? నిన్నుగురించేరా చెబుతోంది!" అన్నది. విన్నాను. నన్నుగురించే! నాకేదీ అర్థమయింది కాదు. ఎవరువ్రాశా రీ సంగతులన్నీ? నే నెవరికీ చెప్పిన జ్ఞాపకంలేదని అనుకొన్నాను. అకస్మాత్తుగా ఆనాడు నీవు రావటమూ, భూగర్భపుగదిలో కూర్చొని, రాత్రిమొదలుపెట్టి తెలతెల్లవారేదాకా నీతో మాట్లాటమూ నాకు జ్ఞప్తికి వచ్చింది. కాని, ఇప్పటికప్పుడే నాలుగుసంవత్సరాలు గడిచాయి. అప్పటి విషయాలు నీకింకా జ్ఞాపక ముంటాయని నేననుకోలేదు. నేనే అనేక విషయాలను మరిచిపోయాను. రేడియోలో ఆనాటి కథ ముగిసిపోయింది. గ్రంథకర్తపేరు చెప్పారు. వచ్చి నిన్ను కలుసుకోటానికి నిశ్చయించుకొన్నాను" అంటూ గ్రుక్కత్రిప్పకుండా చెప్పాడు అలెక్సీ.

ఇద్దరు పైనికు లెంతో కాలంతరువాత కలుసు కొంటే ఎంత చెప్పు. కొన్న ప్పటికీ తీరని సంగతు లనేక ముంటాయి. మేమిద్దరమూ జరిగిన యుద్ధాలను గురించీ, మా కిద్దరికీ తెలిసిన సైన్యాధిపతులను గురించీ మాట్లాడుకొన్నాము. మాతోపాటు పోరుసల్పి, కాలగతినొందినవారు పాపం! మనకు చేకూరిన విజయమును తిలకించి, నలుగురితోపాటు సంతోషపడలేకపోయారుగదా అని ఎంతో విచార

పడ్డాము. ఎప్పటిమాదిరే, అలెక్సీ స్వవిషయాలను గురించి బహు ముక్తసరిగా మాట్లాడాడు. నే నాతని వీడి వెళ్ళిపోయిన పిదప తిరిగీ అనేక పర్యాయములు శత్రువిమానములు పడగొట్టాడన్న సంగతి నాకు తరువాత తెలిసింది. తన రక్షక దళం 1943 – '45 సంవత్సరపు యుద్ధాలలో చేరి పోరాడిందని చెప్పాడు. ఓరియోల్ ప్రాంతంలో మరిమూడు విమానములనూ, బాల్టిక్ సముద్రపకిసర యుద్ధంలో ఇంకో రెండింటినీ పడగొట్టాడు. తన పాదాలను పాడుచేసినందుకు జర్మనులమీద పది మడుంగు లధికంగా పగసాధించాడు. "సోవియట్ సామ్రాజ్య యోధుడ"నే బిరుదు నాతని కిచ్చారు.

స్వవిషయాలను గురించి అలెక్సీ కొన్ని సంగతులు చెప్పాడు. అవన్నీ సలక్షణంగా ముగిశాయని చెప్పటాని కెంతో సంతోషంగా నున్నది. యుద్ధానంతరం తన చిరకాల స్నేహితురాలైన, ఓల్గాను వివాహమాడాడు. పుట్టిన కొడుకుకు విక్టర్ అనే పేరుపెట్టారు. అలెక్సీ తల్లి కామిషిన్‌నుండి వచ్చి, కొడుకూ కోడలుతో నుంటోంది. మనుమడు: చిన్న అలెక్సీ నాడిస్తూ, అల్లారుముద్దుగా పెంచుతూ, భూలోక స్వర్గమను భవిస్తోంది.

ఈ కథానాయకుని పేరీరోజులలో అనేక వార్తాపత్రికలలో కనిపిస్తుంది. సోవియట్ భూమిపై కాలుపెట్టి దాని నపవిత్ర మొనర్చిన శత్రువుతో సాటిలేని ధైర్యంతోనూ, త్యాగబుద్ధితోనూ పోరాడి, రష్యను వైమానికదళ ధృవతారగా పేరు ప్రతిష్టలు గడించిన ఈ మహనీయు డిపుడు లోక శాంతి కొరకు కంకణం కట్టుకొని కృషిచేస్తున్నాడు. బుడాపెస్టు, ప్రాగ్, పారిస్, లండన్, బర్లిన్, వార్సానగర శాంతికాముక ప్రజలీ వ్యక్తి నెన్నోపర్యాయములు, పెద్ద సభలలోనూ, సమావేశాలలోనూ చూశారు. ఈ సోవియట్ వీరాగ్రేసరుని గురించి మన రష్యా దేశంలోనేకాక, ఇతర దేశాలలో కూడా చాలా మందికి తెలుసు. యుద్ధభూమిలో నిలబడి పోరాడి యుద్ధమంత అమానుషకృత్య మింకొకటి లేదని స్వానుభవ ఫలితంగా చెప్పే ఈయన మాటలూ, అంతర్జాతీయమైత్రికీ; లోకశాంతికీ పురి గొల్పుతూ ఈ యుద్ధవీరుడు చేసే ప్రచారమూ రాణించటానికి అలెక్సీ యొక్క దైవికతుల్యమైన, సర్వతోముఖ వికసితమానుషత్వమే కారణం.

పూర్వం దేశం మీదికి దండెత్తివచ్చిన శత్రువును పారద్రోలి, మాతృదేశపు స్వాతంత్ర్య జీవితము అవిచ్ఛిన్నంగా సాగటాని కెంత పాటుపడ్డాడో, అంతగొప్ప గానూ, అంతతీవ్రంగానూ అలెక్సీ యిపుడు శాంతి స్థాపనకూ, సర్వమానవ కళ్యాణానికీ కృషిచేస్తున్నాడు.

ఇంతటితో నేను చెప్పేకథ అయిపోయింది. తరువాత ఘట్టమును ఖిర్మించు కొంటూ తన జీవితమును గడుపుతున్నాడు, అలెక్సీ – నిసలైన సోవియట్ మానవుడు.

*మాస్కో, నవంబరు 28, 1950.*